# డా. బాబాసాహెబ్ అంబేద్కర్
# రచనలు - ప్రసంగాలు
## సంపుటం. 9

మొదటి భాగం

## కాంగ్రెస్, గాంధీ అంటరాని వారికి ఏం చేశారు?

రెండో భాగం

## అస్పృశ్యుల విముక్తి - గాంధి






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురణలు

**1994**



డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.ఎస్.సి., బార్–ఎట్–లా, జె.పి., ఎల్.ఎల్.డి., డి. లిట్

ననం : 14 ఏప్రిల్, 1891 పరినిర్వాణం : 6

# డా. బాబాసాహెబ్ అంబేద్కర్
# రచనలు - ప్రసంగాలు

## సంపుటం - 9



*ప్రధాన సంపాదకులు*

ఆచార్య పేర్వారం జగన్నాథం

ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం

*సంపాదకులు*

ఆచార్య కొలకలూరి ఇనాక్

డా. ఆర్. చంద్రశేఖర రెడ్డి

డా. పి. శ్రీనివాస రెడ్డి

ఆచార్య హెచ్. ఎస్. బ్రహ్మానంద

*అనువాదం*

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

*సారథ్యం*

తెలుగు విశ్వవిద్యాలయం

*కన్వీనర్*

ప్రొఫెసర్ జయధీర్ తిరుమలరావు

*ప్రచురణ*

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

1994

DR. BABA SAHEB AMBEDKAR
RACHANALU - PRASANGALU Vol - IX

Volumes in English Compiled : Vasant Moon



*First Print*
October 1993
*Second Edition:*
*OCTOBER, 1994*

*Copies :*
*Popular edition: 4000*
Library Edition. Rs. 80/-
Popular Edition. Rs. 50/-

General Editor
**Prof. PERVARAM JAGANNADHAM**

*Editors*
**Prof. K. ENOCH**
**Dr. P. SRINIVAS REDDY**
**Dr. R. CHANDRA SEKHAR REDDY**
**Prof. H. S. BRAHMANANDA**

*Convenor*
**Prof. JAYADHIR THIRUMAL RAO**

*Copies can be had from*
*Registrar*
**Publications Division,**
**Telugu University,**
**Lalitha Kala Kshetram, Public Gardens,**
**Hyderabad - 500 004**

*Cover Design*
**K.C. Reddy**

*Printed at*
పవన్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
లాలాగూడా, హైదరాబాద్

ఆచార్య పేర్వారం జగన్నాథం,
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం,
పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 4.

# రెండవ ముద్రణ పీఠిక

నవభారత రాజ్యాంగ నిర్మాత బాబాసాహెబ్ డా॥ భీంరావు అంబేద్కర్ ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురించే కార్యక్రమానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయాన్ని సారధ్య సంఘంగా నియమిస్తూ, అందుకోసం 18 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఈ ప్రణాళికను ప్రోత్సహించి నిధులు మంజూరుచేసిన అప్పటి ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి గారికి, అంబేద్కర్ సంపుటాలను విజయవంతంగా తెలుగు వారికి అందజేయడంలో సహకరిస్తున్న ప్రస్తుత ముఖ్యమంత్రి మాన్యులు శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారికి ఈ సందర్భంగా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. డా॥ అంబేద్కర్ భావజాలాన్ని, ఆయన ఆలోచనా సరళిని నేటి యువతరానికి తెలియజేసే దృష్టితో ఈ గ్రంథాలను సంక్షేమ శాఖ హాస్టళ్లకు సరఫరా చెయ్యాలని ఆంధ్ర ప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖ మమ్మల్ని కోరింది. అందుకోసం ఈ సంపుటాలను ప్రత్యేకంగా పునర్ముద్రిస్తున్నాం. ఈ కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించుటకు సహకరిస్తున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికీ, సాంఘిక సంక్షేమ శాఖాధిపతులకూ, పాఠకులకూ, ఆయా సంపుటాల సంపాదక వర్గానికీ మరోసారి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

(పేర్వారం జగన్నాథం)

హైదరాబాదు
ది. 14.10.1994
విజయదశమి.

# ముందుమాట

భారత రాజ్యాంగ నిర్మాతగా, దళితవర్గాల నాయకుడిగా, రాజనీతి కోవిదుడుగా, న్యాయశాస్త్ర పారంగతుడుగా, ప్రజాభిమానాన్ని చూరకొన్న మనిషి డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్. కులవ్యవస్థలో కూరుకుపోయిన వారికి డా. అంబేద్కర్ ఒక ఆశాజ్యోతి. ఒక చైతన్య కేతనం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వాల మేలుకలయికగా ఉండే సమాజం అంబేద్కర్ లక్ష్యం.

మహర్ కులంలో జన్మించిన అంబేద్కర్ విద్యార్థి దశ నుండే సమాజంచేత దుర్భరమైన అవమానాలను ఎదుర్కొన్నారు. దాంతో చిన్నతనంలోనే ఆయన సంఘ సంస్కరణ, పీడిత జనోద్ధరణే పరమ లక్ష్యంగా ఎన్నుకొన్నారు. ఆయన ఏ వృత్తి చేపట్టినా ఆ లక్ష్యానికి దూరం కాలేదు. ఆ లక్ష్యసాధన కోసం కార్యక్రమాలను కొనసాగించారు. ఆ క్రమంలోనే రచనలు చేయడం ప్రసంగాలు చేయడం ద్వారా ప్రచారం చేయడం, వంటి ప్రధాన మార్గాలను ఎంచుకున్నారు.

బలహీన వర్గాలలో చైతన్యాన్ని రగిలించి వారికి నాయకత్వం వహించి డా.అంబేద్కర్ తన రాజకీయ మహా ప్రస్థానానికి శ్రీకారం చుట్టారు. బొంబాయి రాష్ట్ర శాసనసభ సభ్యత్వం, రాజనీతి శాస్త్రంలో విశేష పరిజ్ఞానం డా. అంబేద్కర్ కృషికి ఎంతగానో దోహదం చేసినాయి.

డా. అంబేద్కర్ అహర్నిశలు ప్రతి దశలోనూ దళితుల అభ్యున్నతి కోసం కృషి చేశారు. రాజ్యాంగంలో దళితుల కోసం ఏర్పాటయిన ప్రత్యేక హక్కులు, వసతుల కోసం నిర్విరామంగా కృషి చేసిన విషయం లోకవిదితమే.

దళిత జనాభ్యున్నతి కోసం ఆయన సాగించిన అవిశ్రాంత పోరాటానికి వెన్నుదున్నుగా భారత చరిత్ర, శ్రుతి స్మృతి పురాణాది ప్రాచీన వాఙ్మయాన్ని,

అందుకు సంబంధించిన ఆధార గ్రంథాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. తాను చేపట్టిన మహత్తర సంస్కరణోద్యమాన్ని శక్తిమంతంగా నడిపించినారు.

డా. అంబేద్కర్ ఏ రంగంలో కృషి చేసినా రచనా వ్యాసంగాన్ని విడనాడలేదు. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, దార్మికాది విషయాలపై అసాధారణ ప్రతిభతో ఆయన రాసిన రచనలు, చేసిన ప్రసంగాలు అంబేద్కర్ జ్ఞాన సంపదకు మణిహారాలు.

అమూల్యమైన అంబేద్కర్ రచనలు ప్రసంగాలను సేకరించేందుకు - 1976 లో మహారాష్ట్ర ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఫలితంగా డా. అంబేద్కర్ గ్రంథావళిని మహారాష్ట్ర ప్రభుత్వం 1979 లో డా. బాబా సాహెబ్ అంబేద్కర్ జన్మదినోత్సవ దినాన ఆంగ్లంలో వెలువరించి భారతావనికి అందించింది.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం డా. అంబేద్కర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదింపచేయాలని నిర్ణయించింది. ఈ విషయంలో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి మాన్యశ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గారి ఆసక్తి, ఉత్సాహం అనువాద కార్యక్రమానికి ప్రేరకాలయినాయి. వారు నిధులను కూడా సమకూర్చినారు.

అనంతరకాలంలో ముఖ్యమంత్రి మాన్య శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారు డా. అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమానికి మరింత చేయూత అందించినారు. అందుకు రాష్ట్ర ప్రభుత్వానికి ధన్యవాదాలు తెలుపుతున్నాం.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఈ అనువాద కార్యక్రమ నిర్వహణకు సారధ్య సంస్థగా తెలుగు విశ్వవిద్యాలయాన్ని నియమించింది. తెలుగు శాఖలు ఉన్న కొన్ని విశ్వవిద్యాలయాలు, ఇతర ముఖ్య సంస్థలు ఈ అనువాద కార్యక్రమంలో భాగస్వాములను చేసి తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ ఉపాధ్యక్షులు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డి గారు ఈ ప్రణాళికకు రూపకల్పన చేశారు. వారి నేతృత్వంలో అనువాద కార్యక్రమానికి ఆరంభం జరిగింది.

పైన పేర్కొన్న వివిధ సంస్థలు డా. అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని బాధ్యతాయుతంగా స్వీకరించినాయి. అంతే కాదు ఆయా సంస్థలకి చెందిన వ్యక్తులే సంపాదక బాధ్యతలు నిర్వహించినారు. వివిధ రచయితలు, పండితులు చేసిన

అనువాదాల్లో సంపాదకులు ఎంత ప్రయత్నించినప్పటికీ కొంత భిన్నత అనువాద శైలీ బేధాలు చోటు చేసుకోక తప్పు లేదు.

డా. అంబేద్కర్ రచనలు ప్రసంగాల అనువాద కార్యక్రమానికి తగిన సలహాలు, సూచనలు ఇచ్చేందుకు ఒక పరిశీలనా సంఘం ఏర్పాటయింది. పార్లమెంటు మాజీ సభ్యులు కోట పున్నయ్య, ప్రముఖ విద్యావేత్త డా. టి.వి. నారాయణ, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ మాజీ కార్యదర్శి జె. వీరాస్వామి సభ్యులుగా ఉన్నారు. పరిశీలనా సంఘ సభ్యులు చేసిన సూచనలననుసరించి, వారి మార్గ దర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని సారధ్య సంఘంగా తెలుగు విశ్వవిద్యాలయం అనువాద కార్యక్రమాన్ని ముందుకు నడిపిస్తున్నది. ఈ సందర్భంగా వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

డా. అంబేద్కర్ రచనలు ప్రసంగాలు సంపుటాలను అనువదించే బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయం వెంటనే వివిధ విశ్వవిద్యాలయాలకు, కొన్ని సంస్థలకూ అప్పగించింది. ఈ సందర్భంలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు ఏర్పాటు చేసిన సమావేశాలకు తెలుగు విశ్వవిద్యాలయం తరఫున రిజిస్ట్రార్ డా. తాళ్ల వెంకటరెడ్డి మా ప్రచురణల కార్యక్రమాన్ని క్రమబద్ధం చేశారు.

డా. అంబేద్కర్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని తెలుగు విశ్వవిద్యాలయం అనువదించి, ముద్రింప చేసిన ఏడవ సంపుటం తిరుపతిలో 14-4-1993 ఆవిష్కృతమైంది.

ప్రస్తుత సంపుటం డా. అంబేద్కర్ గ్రంథావళిలో తొమ్మిదవది. దీని అనువాదాన్ని కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం వారు నిర్వహించినారు. ఈ గ్రంథంలో కాంగ్రెస్ అస్పృశ్యుల్ని గుర్తించుట, కాంగ్రెస్ తన పథకాన్ని విడిచిపెట్టింది, కాంగ్రెస్ అధికారాన్ని వదులుకోవడానికి తిరస్కరించింది, చేతులెత్తేసిన కాంగ్రెస్, పరువు పోయి వేసిన వెనుకంజ, రాజకీయ దయాధర్మం, దయతో అస్పృశ్యుల్ని మట్టుపెట్టడానికి కాంగ్రెస్ పథకం, కాంగ్రెస్ అందరికీ ప్రతినిధి అవుతుందా? విదేశీయునికి వినతి, బానిసల్ని సృష్టించే నిరంకుశత్వానికి స్వేచ్ఛ ఇవ్వవద్దు, అంటరాని వారు ఏమంటున్నారు, గాంధీ తత్త్వం, అస్పృశ్యుల విముక్తి, తదితరమైన కీలకాంశాలను డా.అంబేద్కర్ విశ్లేషణాత్మకంగా చర్చించినారు.

ఈ తొమ్మిదో సంపుటం అనువాదాన్ని కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ప్రముఖ రచయితలకు, అనువాదకులకు అప్పగించింది. అనువాదకులు శ్రీయుతులు మంచిరాజు శ్యామలరావు, ఆర్. చంద్రశేఖర్‌రెడ్డి, సి. ధర్మారావు, మంచిరాజు వెంకట కృష్ణారావు మరియు హెచ్.ఎస్.బ్రహ్మానంద గార్లకు ధన్యవాదాలు.

దీక్షతో, దక్షతతో త్వరితగతిని అనువాదం చేసిన రచయితలకూ. అనువాదానికి మెరుగులు దిద్దిన సంపాదకులు ఆచార్య కె.ఇనాక్, ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద, డా. వి.యల్. శ్రీనివాసరెడ్డి మరియు ఆర్.చంద్రశేఖర్‌రెడ్డి గార్లకు నా అభినందనలు తెలియజేస్తున్నాను.

డా. అంబేద్కర్ రచనల అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించి ఉత్సాహంతో ముందుకు నడిపిస్తున్న సాంఘిక సంక్షేమ శాఖాధికారులకు, ఉన్నత విద్యా శాఖాధికారులకు కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని సకాలంలో అందంగా ముద్రించిన ఉషా లేజర్ గ్రాఫిక్స్, హైదరాబాదు వారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటం అందరి హృదయాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

**ఆచార్య పేర్వారం జగన్నాథం**
ఉపాధ్యక్షులు, తెలుగు విశ్వవిద్యాలయం
మరియు
ప్రధాన సంపాదకులు

# తొలిమాట

భారత రాజ్యాంగ ప్రధాన నిర్మాత డా|| అంబేద్కర్ ఒక రాజ్యాంగవేత్తగా, పార్లమెంటు వ్యవహర్తగా మాత్రమే ప్రపంచానికి పరిచితుడు కాదు. ఆయన ఒక గొప్ప పండితుడిగా, కార్యశీలి అయిన సంస్కర్తగా విశ్వవిఖ్యాతి గాంచాడు. దళితుల నాయకుడిగా ఆయన హిందూ సమాజంలోని దమన రీతులకు వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలు చేశాడు. ఆయన తన జీవితకాలమంతా స్వాతంత్ర్యం, సమానత్వం, న్యాయం, విశ్వమానవ సౌభ్రాత్రతల మీద ఆధారపడిన ఒక కొత్త సామజిక వ్యవస్థను ఏర్పాటు చేయటానికే కృషి చేశాడు.

వెనుకబడిన వర్గాల సమస్యల పరిష్కారానిక ఆయన చూపిన విప్లవాత్మకమైన, మానవీయమైన మార్గానికి భారతీయ సమాజం ఆయనకు ఎంతో ఋణపడి ఉంది.

డా|| అంబేద్కర్ జీవితకాలమంతా శ్రమించిన వెనుకబడిన వర్గల వారి సంక్షేమం కోసం మహారాష్ట్ర ప్రభుత్వం నిబద్ధమై ఉన్నది. డా|| అంబేద్కర్ వంటి మహాపురుషుల ఆలోచనలు, బోధనలు కొత్త తరానికి ఎప్పుడూ వెలుగును అందిస్తూనే ఉంటాయి. డా|| అంబేద్కర్ రచనలను పూర్తిగా ప్రచురించాలనే పథకంలో భాగంగా ఆయన అముద్రిత రచనలను మూడు భాగాలను వరుసగా తీసుకు వస్తున్నందుకు మా ప్రభుత్వం ఎంతో గర్వపడుతున్నది, ఆనందిస్తున్నది.

ఎస్.బి చవాన్
మహారాష్ట్ర ముఖ్యమంత్రి

# ముందుమాట

డా॥ అంబేద్కర్ రచనలలో ఇప్పటి వరకూ ముద్రితం కాని ఈ సంపుటాలకు ముందు మాట రాయవలసిందిగా నన్ను అడగటం, నాకెంతో గౌరవాన్ని ఇచ్చినట్టుగా భావిస్తున్నాను.

భారతీయ సమాజ శాస్త్ర కోవిదులలో డా॥ అంబేద్కర్ అత్యుత్తమ స్థానాన్ని అలంకరిస్తారు. ఆయన రచనల ద్వారా ప్రస్ఫుటమయ్యే ఆయన పాండితీ ప్రకర్ష, మన సాంఘిక మతపరమైన సమస్యలకు ఒక హేతుబద్ధమైన మార్గాన్ని సూచించే కాంతిరేఖలా ఉపకరిస్తుంది.

డా॥ అంబేద్కర్ సంపూర్ణ రచనలను సంపుటాలుగా వెలువరించే పని మహారాష్ట్ర ప్రభుత్వం చేపట్టింది. ఈ పని నిమిత్తమై పునర్నిర్మితమైన సంఘం ఆయన అముద్రిత రచనలను మూడు సంపుటాలుగా వెలువరించింది. భారతీయ సామాజిక, రాజకీయ పరిణామ అధ్యయనపరులు వీటికోసం ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నారు.

భారతీయ సమాజంలోని తాత్త్విక సమస్యలనూ, సాంఘిక సమస్యలనూ, చర్చించిన ఈ సంపుటాలు, హేతువాద ప్రాతిపదికపైన జాతీయ సమస్యలకు పరిష్కారాన్ని కనుగొనటానికి ఆత్రుత పడుతున్న నవయువతరానికీ, మేధావులకూ చాలా ఆసక్తిదాయకమవుతాయి.

ఈ సంపుటాలను త్వరితగతిలో తీసుకురావటానికి చూపిన ఆసక్తికి, అంకిత భావానికి, శ్రద్ధకు సంపాదకవర్గాన్ని అభినందించాలి.

ఆచార్య రామ్ మేఘే

విద్యాశాఖామంత్రి, మహారాష్ట్ర

# అంకితం

(11) ఇంకా నోమి ఇలా అంది "వెనక్కి వెళ్ళండి, అమ్మాయిలూ నాతో ఎందుకు వస్తున్నారు?"........ (12) ........... మీదారిలో మీరు వెళ్ళండి...... (13) అపుడు వాళ్ళు గొంతు పెగిల్చారు. మళ్ళీ ఏడ్చారు. ఆ తర్వాత తన అత్తగారిని ముద్దుపెట్టుకుంది. కాని రూత్ ఆమెను పెనవేసుకుంది. (14) ఆమె ఇలా అన్నది: `చూడండి!........ మీ వదినె మళ్ళీ తన వారి దగ్గరికి వెళ్ళిపోయింది : తన దైవాల దగ్గరకు వెళ్ళిపోయింది.

మీరు మీ వదినె వెంబడి రండి........ (15) రుత్ ఇలా అన్నది : వారిని వదిలి పెట్టకుండా నన్ను ప్రభోదించండి లేదా మిమ్మల్ని అనుసరించి వచ్చేలా చేయండి ఎందుకంటె మీరెక్కడికి వెళ్తే నేను అక్కడికి వెళ్తాను. మీరు ఎక్కడ నిలిస్తే నేను అక్కడ నిలుస్తాను. మీ మనుష్యులే నామనుష్యులు. మరి మీ దేవుడే నా దేవుడు కూడా. (16) మీరు మరణించిన చోట నేను మరణిస్తాను. అక్కడే సమాధి అవుతాను.ప్రభువున్నట్లే అనుగ్రహించుగాక! అంతేకాకుండా మనల్ని ఒక మృత్యువే వేరు చేయుగాక !

మనమిద్దరం కలిసి బైబిల్ చదువుతున్నపుడు పై సందర్భం చదవగానే నువ్వు ఆ వాక్యాలు మాధుర్యం చేత ఎంత ప్రభావితమయ్యే దానివో నాకు తెలుసు. నువ్వు మరలా చదవటానికి సంతోష పడినా, ఈ సమయంలో ఆ విషయాన్ని ఎందుకు గుర్తుకు తెస్తున్నానని నీకనిపిస్తుందని నాకు తెలుసు. రూత్ చెప్పిన `మీ మనుష్యులే నామనుష్యులు. మీ దేవుడే నా దేవుడు' అన్న వాక్యం దగ్గర మనం చర్చలో ఎలా వేరుపడిపోయామో నీకు గుర్తుందో లేదో ! నాకు మాత్రం బాగా గుర్తుంది. మన ఇద్దరి మధ్యా వచ్చిన అభిప్రాయ భేదమూ గుర్తుంది. నేను ఈ వాక్యాల్లో నిజమైన భార్య భావాలకు అభివ్యక్తి ఉందని, అదే ఈ వాక్యాల ప్రాధాన్యమని అన్నావు. నేను ఈ వాక్యాలకు సమాజపరమైన విలువ ఉందన్నాను. ప్రొఫెసర్ స్మిత్ చెప్పిందే వీటికి సరైన వ్యాఖ్యానమన్నాను. ఆధునిక సమాజాన్ని ప్రాచీన సమాజాని కన్నా భిన్నంగా గుర్తించడానికి ఈ వాక్యాలు సహకరిస్తాయి. రూత్ చెప్పిన మీ మనుష్యులే నా మనుష్యులు, మీదైవమే నా దైవము అన్న వాక్యం ప్రాచీన సమాజంలోని ఒక ప్రధాన లక్షణాన్ని నిర్వచిస్తోంది. ఆ సంఘంలో మనిషితో పాటు దేవుడు కూడ ఉన్నాడు. ఆధునిక సమాజంలో మనుష్యులు మాత్రమే ఉన్నారు. ( ఇక్కడ మనుష్యులంటే ఆడవారు కూడా సుమండీ! దయచేసి గుర్తుంచుకోండి) అపుడు నా దృష్టి నీకు నచ్చలేదు. కాని ఈ విషయం మీద ఒక గ్రంథం రాయమని మాత్రం అడిగావు. అలాగే చేస్తానన్నాను. ప్రాగ్ (తూర్పు) దేశీయునిగా నేనున్న సమాజం ఇంకా ప్రాచీనమైందే.......... అక్కడ దేవుడే మనిషి కన్నా చాలా ముఖ్యం. ఈ దశలో ఒకటి గుర్తుకు వస్తోంది.......... అలాంటి గ్రంథాన్ని రాయగల్గితే దాన్ని నీకే అంకితం ఇస్తానని నీతో చెప్పాను. ప్రొఫెసర్ స్మిత్ వ్యాఖ్యానం నాకు కొత్త దారిని ప్రత్యక్షం చేసింది. నా ధ్యేయాన్ని కొనసాగించగలనన్న నమ్మకం నాకు ఏర్పడింది. ఈ అంశాన్ని ఒక గ్రంథంగా రాయటం అనేది చాలా కష్ట సాధ్యమైన విషయం. నీకు తెలిసినట్టే నేను రాజకాయ సుడి గుండంలోకి లాగబడ్డాను. దానితో సాహిత్యపరిశ్రమకు క్షణం తీరిక లేదు. దీని నుంచి ఎప్పుడు బయటపడతానో నాకు తెలియటంలేదు. మరీ యుద్ధం ప్రారంభమైనప్పటి నుంచీ ఈ పనిలో విఫలుణ్ని అవుతానేమో నన్న భావన నన్ను వేటాడుతూనేవుంది. అలాగే నువ్వు యుద్ధంలో ఏదుర్ఘటనలోనైనా చనిపోతావేమో, ఈ గ్రంథాన్ని ఎన్నడైనా రాసినా, తీసుకోనడానికి నువ్వుండవేమో నన్న భయంకూడా అంతే గాఢంగా ఉండేది. కాని ఊహించనిది జరిగింది. నువ్వు మరణ క్లేశం నుంచి తప్పించుకొన్నావు. అంకితం కోరుతూ ఈ గ్రంథం ఉంది. ఈ రెండు సంఘటనల శుభ సంయోగంలో ఎన్నటికో తెలీని తేదీకి వాయిదా వేయటంకన్నా, నా మాటల్ని దక్కించుకొని, పూర్తి చేసిన ఈ గ్రంథాన్ని అంకితం చేస్తే బాగుంటుందని ఆలోచించాను. విషయం అదేకాక పోవచ్చుకాని అంత నిరుపయోగమైన ప్రత్యామ్నాయమేమీకాదు. నీవు అంగీకరిస్తావా !

ఎఫ్. కి — బి.ఆర్.ఎ.

( నీ సన్నిధిలోనే ఆనంద సమగ్రత )

# కాంగ్రెస్, గాంధీలు అంటరాని వారికి ఏం చేశారు?

రచయిత :

బి.ఆర్. అంబేద్కర్

" మాకు యజమానులుగా ఉండాలన్నది మీ అభిమతం కావచ్చు కాని, మీ బానిసలుగా ఉండాలని మా కెందుకుంటుంది?

- ధ్యూసి డెడిజ్

# విషయ సూచిక

## I



## II

## అనుబంధాలు

# ప్రస్తావన

"1892లో ఇంగ్లాండులో పార్లమెంటుకి కొత్తగా ఎన్నికలు జరిగాయి. వాటిలో లార్డు శాలిస్‌బరి నాయకుడుగావున్న కన్సర్వేటివ్‌లు ఓడిపోయి గ్లాడ్‌స్టన్ నాయకత్వంలోని లిబరల్సు గెలిచారు. ఈ ఎన్నిక ప్రత్యేకత ఏమిటంటే తనపార్టీ ఓడిపోయినప్పటికీ లార్డు శాలిస్‌బరి పార్లమెంటరీ రివాజులకు వ్యతిరేకంగా తన పదవిని లిబరల్ పార్టీ నాయకుడికి అప్పగించడానికి నిరాకరించాడు. పార్లమెంటు సమావేశమైనప్పుడు లార్డు శాలిస్‌బరి ప్రభుత్వం ఇచ్చిన శాసనసభా కార్యక్రమం వివరాలతో ఎప్పటిలాగే రాణి తన సింహాసనం నుంచి ఉపన్యాసమిచ్చింది. మామూలుగానే ప్రభుత్వం తరఫున కూడా హర్ మెజెస్టీని (రాణిని) ఉద్దేశించి ప్రసంగం చేశారు. లార్డు శాలిస్‌బరి ప్రభుత్వం చట్ట విరుద్ధమైనది. పార్లమెంటులో మెజారిటీ ఉన్న పార్టీ మాత్రమే ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యాలన్న బ్రిటిష్ రాజ్యాంగం మూలసూత్రానికే ఇది సవాలు. లిబరల్సు ఈ సవాలును స్వీకరించి ప్రభుత్వ ప్రసంగంలో మార్పుల్ని ప్రతిపాదించారు. మెజారిటీ లేకపోయినా లార్డు శాలిస్‌బరి ప్రభుత్వం అధికారంలో కొనసాగడాన్ని ఈ ప్రతిపాదనలో ఖండించారు. ఎమెండ్‌మెంటును ప్రతిపాదించే పనిని లార్డు (అప్పటి మినిస్టర్ ఏస్క్విత్‌కు అప్పగించారు. ఎమెండ్‌మెంటును సమర్థిస్తూ ఏస్క్విత్ చేసిన ప్రసంగంలో అప్పటికి బాగా ప్రచారంలోకి వచ్చిన "Causa finita est : Roma locuta est" - "రోమ్ మాట్లాడింది ఇక తగువు అంతం కావాలి" అన్న మాటల్ని ఉటంకించారు. ఈ మాటల్ని మొదట సెంట్ ఆగస్టీన్ వేరే సందర్భంలో ఉపయోగించాడు. ఇక మతపరమైన వివాదంలో ఈ మాటల్ని వాడాడు. అప్పట్నించీ పోప్ సార్వభౌమత్వానికి పునాదిగా ఈ మాటలు ఉపయోగించాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అన్న మూలసూత్రానికి రాజకీయ ప్రాతిపదికా ఏస్క్విత్ ఈ మాటల్ని ఉపయోగించాడు. ఈనాడు ప్రజాప్రభుత్వాల ఏర్పాటుకు దీన్ని మూలసూత్రంగా అంగీకరించారు. అంటే రాజకీయ మెజారిటీకి పాలించే హక్కు ఉంది. దీని తక్షణ ప్రభావం శాలిస్‌బరి ప్రభుత్వం మీద పడింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అమలులో ఉన్న ప్రతిచోటా ఎన్నికల్లో ఓడిపోయిన ప్రతిపార్టీకీ వ్యతిరేకంగా ఈ సూత్రమే పనిచెయ్యాలి.

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టం 1935 క్రింద 1935 లో జరిగిన భారతదేశంలోని రాష్ట్రాల శాసనసభల ఎన్నికల ఫలితాలు ప్రకటించినప్పుడు నాకు ఈ సూత్రం గుర్తొచ్చింది. కాంగ్రెస్ వారు "Causa finita est: India locuta est". (భారతదేశం మాట్లాడింది. దీనితో వివాదం అంతం కావాలి) అని అనలేదుకాని ఎన్నికలలో కాంగ్రెసుతో పోటీచేసిన పార్టీలకు సంబంధించినంతవరకు ఎన్నికల ఫలితాలు ఈ విషయాన్నే వాటి

చెప్పినట్లనిపించింది. పూర్తిగా ఐదేళ్లపాటు రౌండ్‌టేబుల్ సమావేశంలోనూ, జాయింట్ పార్లమెంటరీ కమిటీలోనూ కాంగ్రెసుకు వ్యతిరేకంగా అంటరాని వారికి నాయకత్వం వహించిన నేను, ఎన్నికల ఫలితాలు నన్ను కదిలించలేదని అనలేను. నాకు తగిలిన ప్రశ్న ఏమిటంటే అంటరానివారు కాంగ్రెసు పక్షాన చేరిపోయారా? నాకు మాత్రం ఇది అనూహ్యమైంది. ఎందుకంటే అంటరానివారు మొత్తం అందరూ కాంగ్రెస్ అందించే బంగారానికి ఆశపడి ద్రోహులుగా తమ పాత్ర నిర్వహించడానికి తయారైన కొద్దిమంది కాంగ్రెసు ఏజంట్లు మినహా అంటరానివారికి రాజకీయ రక్షణలను కల్పించడానికి సంబంధించి ప్రతి డిమాండునూ అంగుళం, అంగుళం, ఆఖరిక్షణం వరకూ గాంధీ కాంగ్రెసూ వ్యతిరేకించారన్న విషయాన్ని మరచిపోయి కాంగ్రెసు పక్షాన చేరిపోయారంటే నేను నమ్మలేక పోయాను. అంచేత 1937లో జరిగిన ఎన్నికల ఫలితాన్ని అధ్యయనం చెయ్యాలని నిశ్చయించుకున్నాను.

అంటరానివారి దృష్ట్యా ఈ అధ్యయనం చాలా అవసరమని నాకు నమ్మకం కుదిరింది. కానీ ఆ పని మాత్రం నత్తనడక నడిచింది. మూడు కారణాలవల్ల అలా జరిగింది. మొదటిది : అతిముఖ్యమైన, వాయిదా వెయ్యడానికి వీల్లేని కొన్ని సారస్వత ప్రణాళికలకు ప్రాధాన్యత నివ్వాల్సి వచ్చినందున ఈ అధ్యయనాన్ని కొంతకాలం పక్కన పెట్టాల్సి వచ్చింది. రెండవది : 1937ఎన్నికలు పూర్తి అవగానే తయారుచేసి సమర్పించిన పార్లమెంటు నివేదిక (Blue Book) ఎన్నికలకు సంబంధించిన అంకెల విషయంలో ప్రాథమిక ఆధారం. ఇది నా అధ్యయనానికి అసంతృప్తికరంగానూ అసంపూర్ణంగానూ ఉంది. షెడ్యూల్డు కులాల వోటర్లు ఎలా వోటు వేశారో, ఆ కులాల అభ్యర్థులకు ఎన్ని వోట్లు వచ్చాయో విడివిడిగా అంకెలు దాంట్లో లేవు. హిందూ వోటర్లు, షెడ్యూల్డు కులాల వోటర్ల మధ్య ఏ విధమైన తేడాలు చూపకుండా, వివిధ నియోజకవర్గాల్లో వోటర్లు ఎలా వోటు వేశారో తెలిపే అంకెల వివరాల్ని మాత్రం ఇచ్చారు. షెడ్యూల్డు కులాల వోటర్లు ఎన్ని వోట్లు వేశారు, ఆ కులాల అభ్యర్థికి ఎన్నివోట్లు పడ్డాయో తెలిపే వివరాలను విడివిడిగా ఇవ్వాలని కోరుతూ వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు రాయాల్సి వచ్చింది. దీనివల్ల తప్పనిసరిగా పనికి అంతరాయం కలిగింది. మూడవది : నివేదిక అనుబంధంలో ఇచ్చిన పట్టికలను చూస్తే ఈ ఎన్నికల ఫలితాల పరిశీలన ఎంతో శ్రమతో కూడినదని తెలుస్తుంది.

ఆ విధంగా ఈ పనిలో తాత్సారం జరిగింది. ఈ ఆలస్యానికి నేను ఎంతో విచారిస్తున్నాను. ఈ మధ్యకాలంలో కాంగ్రెసు అంటరానివారికి తానే ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చేసిన వాదానికి ఈ ఎన్నికల ఫలితాలు బలం చేకూర్చినట్లు కాంగ్రెస్ ప్రచారం చేసుకుంది. షెడ్యూల్డు కులాలకు కేటాయించిన 151 సీట్లలో నేను ఏర్పాటు చేసిన ఇండిపెండెంటు లేబర్ పార్టీకి 12 సీట్లే వచ్చాయని, మిగతావి కాంగ్రెసు వశం

చేసుకున్నదని ఈ ప్రచారంలో ప్రధానాంశం. కొంతమందికి ఈ తప్పుడు ప్రచారం తలకెక్కినట్లుంది. ఆఖరికి ఎచ్.ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్ లాంటి వ్యక్తి కూడా "సబ్జెక్ట్ ఇండియా" అన్న తన పుస్తకంలో అసలు విషయం తెలుసుకోడానికి ఏ ప్రయత్నం చేయకుండా ఈ అసంబద్ధమైన కాంగ్రెసు వాదాన్ని నిజమని స్వీకరించి ప్రచురించారు. ఈ పుస్తకంలో విశ్లేషించిన ఈ ఎన్నికల ఫలితాలను బట్టి కాంగ్రెసుది ఎంత తప్పుడు ప్రచారమో అర్థమవుతుంది. ఎందుకంటే ఎన్నికల ఫలితాలను కాంగ్రెసు వక్రీకరించింది. నిజానికి అంటరానివారికి కాంగ్రెసు ప్రాతినిధ్యం వహిస్తుందన్న వాదం 1937 ఎన్నికలతో పూర్తిగా అబద్ధమని తేలిపోయింది. ఈ ఫలితాలు కాంగ్రెసు వాదాన్ని సమర్థించవు సరికదా : 1) 151 సీట్లలోను కాంగ్రెస్‌కి 73 మాత్రమే వచ్చాయి. 2) దాదాపు ప్రతి నియోజకవర్గంలోనూ అంటరానివారు వారి స్వంత అభ్యర్థుల్ని నిలబెట్టి కాంగ్రెస్‌ను వ్యతిరేకించారు. 3) కాంగ్రెస్ నెగ్గిన 73 సీట్లలోను అత్యధిక భాగం హిందువుల వోట్లతోనే. అందుచేత పెద్యూల్డు కులాలకి కాంగ్రెసు ఏవిధంగానూ ప్రాతినిధ్యం వహించడం లేదు. 4) కాంగ్రెసు నెగ్గిన 151 సీట్లలో ఆ పార్టీ నిజంగా నెగ్గినవి అంటే అత్యధికంగా పెద్యూల్డు కులాల వోట్లతో నెగ్గినవి 38 మాత్రమే. ఇక ఇండిపెండెంట్ లేబర్ పార్టీ విషయానికొస్తే అది 1937 ఎన్నికలకు కొద్ది నెలల పూర్వం మాత్రమే ఏర్పాటయింది. అది కేవలం బొంబాయి ప్రాంతం (Province)లో పనిచేసింది. ఇతర ప్రాంతాలలో ఈ పార్టీ శాఖలను ఏర్పాటు చేసే వ్యవధి లేదు. బొంబాయి ప్రాంతంలో మాత్రమే ఇండిపెండెంట్ లేబర్ పార్టీ అభ్యర్థిత్వంలో పోటీ జరిగింది. అక్కడ ఇండిపెండెంట్ లేబర్ పార్టీ ఓడిపోలేదు సరిగదా ఆశ్చర్యకరమైన విజయాన్ని సాధించింది. బొంబాయిలో పెద్యూల్డు కులాలకి కేటాయించిన 15 సీట్లలో 13 సీట్లను గెల్చుకుని 2 సాధారణ (General) సీట్లను అదనంగా గెలుచుకుంది. పెద్యూల్డు కులాలకి కేటాయించిన అన్ని సీట్లనూ కాంగ్రెస్ గెలుచుకుందని, ఇండిపెండెంట్ లేబర్ పార్టీ విఫలమైందని అన్న కథ ఒక క్రూరమైన అబద్ధమని ఏ విధమైన అనుమానమూ లేకుండా ఇంతకాలనికైనా నేను నిరూపించగలిగినందుకు ఆనందంగా ఉంది. ఈ విషయంలో శ్రద్ధ ఉన్న వారికి నిజం తెలుసుకోగోరే వారికి ఈ పుస్తకం ఆసక్తికరంగానూ వాస్తవం బోధించేదిగానూ ఉంటుందని నమ్ముతున్నాను.

ఈ ముందుమాట ముగించే ముందు అనేక విధాలుగా నాకు సాయంచేసిన వారందరికీ నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. నా సర్క్యులర్‌కు సమాధానంగా నేను కోరిన అదనపు వివరాల్ని అంకెల్ని నాకందించడానికి శ్రమతీసుకున్న ప్రాంతీయ ప్రభుత్వాలన్నిటికీ నా కృతజ్ఞతలు. ఎంతో శ్రమించి పట్టికలను తయారు చెయ్యడంలో సహాయపడిన యు.పి. కాంగ్రెసు ప్రభుత్వానికి, ఒకప్పటి పార్లమెంటరీ సెక్రటరీ అయిన శ్రీ కరణ్‌సింగ్ కాణేకి కూడా నాధన్యవాదాలు.

పై ముందుమాట చదివి, విషయ సూచికతోదాన్ని పోల్చిచూస్తే ముందుమాటలో చెప్పిన వాటి పరిధుల్ని దాటి ఈ పుస్తకంలో అనేక విషయాలు చర్చించినట్లు అవగతమౌతుంది. ఆసక్తిగలవారు పైన చెప్పిన ముందుమాటకి విషయసూచికీగల సంబంధాన్ని తెలుసుకోవాలనుకోవచ్చు. ఈ పుస్తకం మొదటి రూపానికి ఇప్పుడు తయారైన ఆఖరి రూపానికి చాలా తేడా వుంది అని తెలుసుకున్నప్పుడు మనకి సమాధానం దొరుకుతుంది. ఈ పుస్తకంలోని IV, V, VI, VII, IX అధ్యాయాలలోనూ అనుబంధాలలోని గణాంక వివరాలలోనూ ఎంతో విపులంగా చర్చించిన విషయాల్ని దీని మొదటి రూపంలో ఎంతో సంక్షిప్తంగా మాత్రమే చర్చించాము. పైన చెప్పిన ముందుమాట ఈ పుస్తకం మొదటి రూపానికి చెందినది. అందుకే ఆ ముందు మాటని 'ఇన్వర్టెడ్ కామా'లలో ఉంచాను. ఒరిజినల్ కంటే ఈ పుస్తకం ఎందుకింత మార్పు చెందిందని ఆసక్తి పరులు తెలుసుకోవాలను కోవచ్చు. దీనికి సమాధానం చాలా సులువుగా దొరుకుతుంది. నాతో కలిసి పనిచేసే ఒక స్నేహితుడు ఈ పుస్తకం అసలు రూపంలో ఉన్నప్పుడు ప్రూఫులు చూశారు. ఈ పుస్తకం ఆయనకి చాలా అసంతృప్తి కలిగించింది. అంటరానివారికి కాంగ్రెసు ప్రాతినిధ్యం వహిస్తుందన్న వాదనను ఎండగట్టడానికి ఎన్నికల ఫలితాల విశ్లేషణ మాత్రమే చాలదు అని గట్టిగా చెప్పాడాయన. ఇంకా చాలా చెయ్యాలి. నిజాన్ని వక్రీకరించి, కాంగ్రెసు, గాంధీ అంటరాని వారి జీవితాన్ని మెరుగుపరచడానికి పనిచేస్తున్నారన్న వాదాన్ని ఎండగట్టి ఈ వాదాన్ని నమ్ముతున్న అంటరానివారికీ, విదేశీయులకి సరియైన సమాచారం అందించాలి. ఇప్పటికే ఈ పుస్తకం ప్రూఫులదశకి వచ్చేసిందన్న కష్టంకాక నా సమయం ఇతర విషయాలమీద కేంద్రీకరించాల్సిన అవసరం దృష్ట్యా అంతపని నేను చెయ్యడం అసాధ్యం అనిపించింది. అయినా ఆయన ఒప్పుకోలేదు. అంచేత ఆయన చెప్పిందానికి నేను అంగీకరించాల్సి వచ్చింది. అచ్చులో 75 పేజీలయ్యే పుస్తకాన్ని పూర్తిగా మార్చేసి బాగా పెంచాల్సిన అవసరం ఏర్పడింది. ప్రస్తుతం ఉన్న పుస్తకం పూర్తిగా రూపాంతరం చెందింది. అంటరానివారి సమస్య విషయంలో 1917 నుంచి కాంగ్రెసూ, గాంధీ చేసిన అన్ని పనుల్నీ ఈ పుస్తకం తెలియజేస్తుంది. కాంగ్రెసు గురించి చాలా రాశారు. గాంధీ గురించి ఇంకా ఎక్కువ రాశారు. కాని అంటరానివారి విషయంలో వారి చేష్టల్ని ఎవరూ చెప్పలేదు. గాంధీకి స్వరాజ్య సాధకుడుగా అహింసావాదిగా పేరు ప్రతిష్ఠలున్నాయి. కాని వీటికంటేకూడా అంటరానివారి రక్షకుడుగా ఆయనకున్న ప్రతిష్ఠ అంటేనే గాంధీకి ఎక్కువ మక్కువ అని అందరికీ తెలుసు. రౌండుటేబుల్ సమావేశంలో తానొక్కడే అంటరానివారిని ఉద్ధరిస్తున్నట్లు ప్రకటించుకున్నాడు. ఈ గౌరవాన్ని ఇంకెవరితోనూ పంచుకోడానికి ఆయన సిద్ధపడలేదు. అంటరానివారిని ఉద్ధరించడంలో ఆయనొకడే ఛాంపియన్ కాదు. కాంగ్రెస్ కూడా ఛాంపియనే అంటాడాయన. అంటరానివారిపట్ల జరిగిన అన్యాయాన్ని తొలగించడానికి కాంగ్రెసు పూర్తిగా

నడుంకట్టిందంటాడాయన. అంచేత అంటరానివారికి రాజకీయ రక్షణలు కల్పించడం అనవసరమూ, హానికరమూ అని ఆయన వాదం. అందుచేత గాంధీ, కాంగ్రెసూ చేసిన ఈ వాదాలు విశ్లేషించడానికి ఇంత వరకూ ఏ ప్రయత్నమూ జరగకపోవడం చాలా విచారకరం.

ఈ విశ్లేషణ ఈ రకం వాటిలో మొట్టమొదటిది. అయినా గాంధీని గుడ్డివాటంగా అనుసరించే హిందువులకి ఇదినచ్చదు. నిజానికి ఇది వారి కోపాన్ని రగులుస్తుంది. "గాంధీని గురించి జాగ్రత్తగా ఉండండి" అన్న ఈ అధ్యయనం నిర్ణయం దృష్ట్యా అంతకంటే వేరు ఎలా అవుతుంది? సూక్ష్మంగా పరిశీలిస్తే దీనివల్ల హిందువులు కోపగించుకోవాల్సిన అవసరం లేదు. గాంధీని గురించి ఈ విధంగా ఆలోచించేవారు అంటరానివారొక్కరేకాదు. ముస్లింలు, సిక్కులు, భారతీయ క్రైస్తవులూకూడా గాంధీని గురించి ఇదే అభిప్రాయంతో ఉన్నారు. గాంధీ తాను ముస్లింలకీ, సిక్కులకీ, పెద్యూల్డు కులాల వారికీ స్నేహితుణ్ణని చెప్పుకుంటున్నా ఏ సమాజమూ (Community) ఆయన్ని నమ్మదు. ఎందుకు? ఈ అపనమ్మకానికి కారణమేమిటి? ఈ విషయంలో హిందువులు బాగా ఆలోచించాలి. ఈనాడు గాంధీ వంటి ఒక నాయకుడు కొన్ని వర్గాల దృష్టిలో ఇంత అపనమ్మకానికి గురికావడమంత విషాదం మరొకటి వుండదని నా దృఢ నమ్మకం. అయితే ఈ విధంగా మాత్రం హిందువులు ఆలోచించరని నాకు తెలుసు. ఎప్పటిలా నా పుస్తకాన్ని నిరసించి నన్ను దూషిస్తారు. కాని ఒక నానుడి చెప్పినట్లు : "కుక్కలు మొరుగుతున్నా ఏనుగు నడుస్తూనే వుంటుంది" అలానే నా ప్రత్యర్థులు ఏమన్నా నా విధి నేను నిర్వర్తించాలి. ఎందుకంటే వోల్తేర్ చెప్పినట్లు: "సమకాలీన చరిత్ర రాసే ప్రతివారూ తాము చెప్పిన ప్రతి విషయానికీ, చెప్పని ప్రతిదానికీ దూషణకు గురికావడానికి తయారుగా వుండాలి : న్యాయాన్నీ స్వేచ్ఛనీ ప్రేమించి, దేన్నీ ఆశించక, దేనికీ భయపడక కేవలం సారస్వత వ్యాసంగానికే పరిమితమైన వ్యక్తి ఇలాంటి చిన్నచిన్న అవాంతరాలవల్ల నిరుత్సాహపడకూడదు."

ఈ పుస్తకం చాలా పెద్దదైంది. అతి విశదీకరణ, చెప్పిందే చెప్పడం అనే దోషాలు దీంట్లో ఉన్నాయి. ఈ విషయం నాకు తెలుసు. కానీ నేనీ పుస్తకాన్ని ప్రత్యేకంగా అంటరానివారికోసం, విదేశీయులకోసం రాశాను. ఈ రెండు వర్గాల వారికీ కూడా యదార్థాన్ని గురించి అవగాహన ఉందనుకోను. నా దృష్టిలోని ఈ ప్రత్యేకమైన చదవరుల కోసం నేను నిజాన్ని చెప్పడమేకాకుండా వాటిని విశ్లేషించాల్సిన అవసరం కూడా ఉంది. ఈ సందర్భంలో నేను కళాత్మక విలువనుగాని, బాగా చదువుకుని విజ్ఞానవంతులైన చదువరుల ప్రత్యేకమైన అభిరుచుల్ని గాని లెక్క చెయ్యను.

రాజకీయ రక్షణల కోసం అంటరానివారి ఉద్యమానికి సంబంధించిన అన్ని వివరాలనూ ఈ పుస్తకంలో పొందుపరచే ఉద్దేశ్యంతో, గణాంక సంబంధమైనవేకాక అనేక ఇతర అనుబంధాల్ని కూడా దీనిలో చేర్చాను. ఈ ఉద్యమానికి సంబంధించిన అనేక అధికార, అనధికార పత్రాలు (Documents) వీటిలో ఉన్నాయి. అంటరానివారి సమస్యపై ఆసక్తి ఉన్న వారు ఇందులో అందుబాటులో ఉన్న సమాచారం పట్ల ఆనందం వ్యక్తం చేస్తారు. సాధారణ పాఠకుడు ఈ అనుబంధాల్లో కావల్సినదానికంటే చాలా ఎక్కువ సమాచారం ఉందని వాపోవచ్చు. తిరిగి నేను చెప్పేదేమిటంటే సాధారణ పాఠకుడికి సులువుగా దొరికే సమాచారం అంటరానివారికి అందకపోవచ్చు. సాధారణ పాఠకుడి అవసరాలకంటే అంటరానివారి అవసరాలు ముఖ్యం.

ఒక చివరి మాట. ఈ పుస్తకంలో అంటరానివారి గురించి చెప్పాల్సినప్పుడల్లా గిరిజనులు, బానిస వర్గాలు (Servile Classes) వంటి మాటల్ని ఎంతో తేలికగా ఉపయోగించాను. ముఖ్యంగా భారత దేశంలోని పరిస్థితులు తెలియని వారికి ఇది అయోమయాన్ని సృష్టించే అవకాశముందని నాకు తెలుసు. ఒకే మాటని వాడగల్గడం నాకెంతో ఆనందాన్ని కలిగించేది. ఈ విషయంలో దోషం పూర్తిగా నాదికాదు. ఈ పేర్లన్నీ అధికారికంగానూ అనధికారికంగానూ అంటరానివారికి అనేక సార్లు వాడారు. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టంలో "షెడ్యూల్డు కులాలు" అన్న మాట వాడారు. కాని అది 1935 తర్వాత వాడుకలోకి వచ్చింది. అంతకు పూర్వం గాంధీ 'హరిజనులు' అనీ ప్రభుత్వం 'అణగిన వర్గాలు' Depressed Classes అనీ వాడారు. అటువంటి నిలకడలేని పరిస్థితిలో ఒకే మాటను వాడడం సాధ్యంకాదు. ఒక్కమాట ఒకప్పుడు సరియైనదై మరొకప్పుడు సరియైనది కాకపోవచ్చును. ఈ మాటలన్నీ ఒకే వర్గానికి చెందుతాయని తెలుసుకుంటే పాఠకుడు ఈ అయోమయాన్ని అధిగమించవచ్చు.

'ఇండెక్సు' తయారు చేసిన ప్రొఫెసర్ మనోహర్ చిట్నిస్‌కూ ప్రూఫులు దిద్దడానికి సాయపడిన శ్రీ ఎస్. సి. జోషీకి నా కృతజ్ఞతలు.

24 జూన్ 1945
22, పృథ్వీరాజ్‌రోడ్,
న్యూఢిల్లీ.

బి.ఆర్.అంబేద్కర్

## అధ్యాయం I

# ఒక వింత సంఘటన

# కాంగ్రెస్ అస్పృశ్యుల్ని గుర్తించింది

### I

కలకత్తాలో 1917లో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు వార్షిక సమావేశంలో ఒక వింత సంఘటన జరిగింది. ఆ సమావేశంలో కాంగ్రెసు ఈ తీర్మానాన్ని ఆమోదించింది:-

"ఈ దేశంలో దళిత వర్గాలు అనాచారంగా వస్తున్న ఆచారం వల్ల అనేక కష్టనష్టాలకు గురి అవుతున్నాయి. ఇవి పూర్తిగా విసుగెత్తించి అణగదొక్కేస్తాయి. వీటివల్ల ఆ వర్గాలకు ఎంతో ఇబ్బంది, కష్టమూ కలుగుతున్నాయి. అందుచేత ఈ కాంగ్రెసు ఇబ్బందులను తొలగించాల్సిన అవసరాన్నీ, న్యాయాన్నీ, ధర్మాన్నీ గుర్తించాలని భారత ప్రజల్ని కోరుతోంది."

ఈ సమావేశానికి శ్రీమతి ఏనీ బెసెంట్ అధ్యక్షత వహించింది. ఈ తీర్మానాన్ని మద్రాసుకు చెందిన శ్రీ జి. ఎ. నటేశన్ ప్రతిపాదించారు. బొంబాయికి చెందిన శ్రీ భూలాభాయ్ దేశాయ్, మలబారుకి చెందిన శ్రీ రామఅయ్యర్, ఢిల్లీకి చెందిన శ్రీ అసఫ్ అలీ ఈ తీర్మానాన్ని బలపరిచారు. ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ నటేశన్ ఇలా అన్నారు.

"సోదర సోదరీమణులారా - ఇతర సభలలో ఈ సమస్యపై ఎన్నోఏళ్ళుగా ఎంతో చర్చజరుగుతోంది. కానీ ఈ కాంగ్రెసు సమావేశం ప్రత్యేకత దృష్ట్యా, భారత దేశ

స్వరాజ్యానికి సంబంధించిన ఒక ప్రణాళిక తయారుచేసి, ఆ స్వరాజ్యాన్ని నడిపే పనికి సిద్ధంగా ఉండడం అవసరమని విషయనిర్ణయ సభ (Subjects Committee) అభిప్రాయపడింది. ఎంతో చికాకు పరిచి అణచివేసే దురాచారాన్ని తొలగించాలని ఈ ప్రతిపాదన మిమ్మల్ని కోరుతోందని మీరు గమనిస్తారు. మీ మతపరమైన భావాలకు హానికలిగించుకోమని కోరడం లేదు. ఏ మతసంప్రదాయంలో మంచి అన్న దేన్నీ వొదులుకోమనడం లేదు. కాని ఈ వర్గాలను స్కూళ్ళలో చేరకుండా పెట్టే అసంబద్ధమైన అడ్డంకుల్ని తొలగించాలని మిమ్మల్ని, నన్ను, ఇతరత్రాఉన్న అందరినీ కోరడానికి కాంగ్రెసుకు హక్కుఉంది. దేశంలోని కొన్ని ప్రాంతాల్లో ఉమ్మడిబావుల్ని కూడా ఈ ప్రజలు వాడకుండా నిషేధిస్తున్నారు. మానవులందరూ కలిసి ఈ రకమైన అడ్డంకుల్ని అదృశ్యమయ్యేలా చూడాలని కోరే హక్కు కూడా కాంగ్రెసుకు ఉంది. మనమందరం ఉన్నతస్థాయికి చేరే ప్రయత్నంలోనూ, ఈ నికృష్టమైన అడ్డంకుల్ని తొలగించడంలోనూ మనం భారతజనావళినే ఉచ్ఛదశకు తీసుకుపోతున్నాం; బాధ్యతాయుతమైన స్వరాజ్యం మనకి లభించినప్పుడు, అన్ని వర్గాల, తరగతుల భారతీయులూ, అన్నిహక్కుల్నీ, సామాజిక పరమైన హక్కులతో సహా అనుభవిస్తున్నామని చెప్పుకోగలుగుతాం. భారత ప్రజ తమ నిజమైన, అత్యుత్తమమైన సంప్రదాయానుసారం వర్ధిల్లడానికి అందరికి అన్ని పాఠశాలల్లోను, సంస్థలలోనూ ఉచిత ప్రవేశం లభిస్తుందని కూడా చెప్పుకోగలుగుతాం."

ఈ తీర్మానాన్ని సమర్థిస్తూ శ్రీ భూలాభాయ్ దేశాయ్ ఇలా అన్నారు:-

"కొందరు మన సోదరుల్ని అవస్థపెట్టే ఈ దురాచారాలు మనం బోధించే సమానత్వానికీ, మానవ సహోదరత్వానికి పెద్దదెబ్బ. ఎంతో ఉన్నత స్థాయి తీర్మానాన్ని మనం ఈ రోజు ఉదయం ఆమోదించాం. అయితే మన సోదరుల్నే ఉద్ధరించలేక పోతే బ్రిటిష్ ప్రజాస్వామ్యాన్ని గానీ, ఏ ఇతర శక్తుల్నిగాని మనం ఏముఖం పెట్టుకుని మన హక్కులకోసం అడగగలం? మీలోనే కొందరు ఎంతో అన్యాయమైన సామాజిక దుర్గతికిలోనై ఉంటే వారిని ఆ పరిస్థితినుంచి తప్పించే శక్తి ఉండికూడా మీరేం చెయ్యలేకపోయారు?!" అని వారు మన్ని ప్రశ్నిస్తారు. ఈ విషయంలో మనకు మనమేమి సహాయం చేసుకోగలం?. స్వయం సహాయం ద్వారానే, ఏ ఇతర శక్తుల సహాయం అర్థించకుండానే మనమీ పని చేయగలం. అందుచేత అత్యవసరమైన ఈ తీర్మానాన్ని మీ ముందుంచడానికి ఈ కాంగ్రెసు అనుమతించి ఒక గొప్ప ముందడుగు వేసింది. మనలో ఉన్న ఈ రుగ్మత హిందూత్వాన్నే కించపరచడం. కాబట్టి అవసరం దృష్ట్యా, న్యాయం దృష్ట్యా, రుజువర్తన దృష్ట్యా మీరందరూ అపురూపంగా భావించే సత్యం కోసం, ఈ తీర్మానం మీపై ఉంచిన బాధ్యతను ఎలా విస్మరించగలుగుతారు? ముఖ్యంగా న్యాయం చెయ్యడం మీ చేతుల్లోనే ఉన్నప్పుడు? దీంట్లో విఫలమైతే ఏ న్యాయంకోసం, ఏ ముఖం పెట్టుకొని స్వరాజ్యాన్ని డిమాండు చేస్తారు?"

శ్రీ రామ అయ్యర్ ఇలా అన్నారు:—

"క్రింది వర్గాలను బంధించిన సంకెళ్ళను పగలగొట్టేందుకు కావలసిన సామాజిక స్వాతంత్ర్యం కోసం ఈ తీర్మానం పిలుపునిస్తోంది. వారు జాతికి పాదాలవంటి వారు. మీరూ నేను స్వయం పరిపాలన (Home Rule) అనే కొండ ఎక్కాలంటే మన పాదాల్ని బంధించిన సంకెళ్ళను విచ్ఛిన్నం చెయ్యాలి. అప్పుడే, అప్పుడే మనకి స్వయంపరిపాలన లభిస్తుంది. మీరు సామాజికంగా నిరంకుశులుగా ఉండి రాజకీయంగా ప్రజాస్వామ్యవాదులుగా ఉండలేరు. ఒక మానవుడు, ఒక సామాజిక బానిస రాజకీయంగా స్వతంత్రుడుగా ఉండలేడు. మనమంతా సమైక్యభారతాన్ని దర్శించడానికి ఇక్కడికి వచ్చాం. ఒక రాజకీయంగానే కాదు అన్ని విధాలా సమైక్యమైన భారతాన్ని దర్శించడానికి. అందుచేత మనలో బ్రాహ్మణులైనవారం, ఉన్నత కులాలకు చెందిన అందరం మన గ్రామాలకు వెళ్ళి కింది కులాల వారిని మనలోని సామాజిక అధికారులతో (Social bureaucrats) పోరాడుతున్నవారిని - బంధించిన సంకెళ్లను విచ్ఛిన్నం చేద్దాం."

శ్రీ అసఫ్ అలీ ఇలా అన్నారు:-

"దళిత వర్గాల సమస్య అన్నిటికన్నా ముఖ్యమైనది. వారిని చూసి అర్థం పర్థం లేని నిరంకుశ చర్యల్ని తీసుకునే అధికార వర్గాలు సిగ్గుతో తలవంచుకోవాలి. కాని ఇప్పుడు (తతిమా) భారతీయుల్ని దళిత వర్గాలు, అంటరానివారు సిగ్గుపడేలా చేస్తున్నాయి. దురదృష్టవంతులయిన ఈ బాధితులు అనేక కోట్లమంది ఉన్నారు. నికృష్టమైన ఏహ్యమైన అనేక వృత్తుల్ని మారుమాట్లాడకుండా వేలాదిసంవత్సరాలుగా నిర్వహిస్తూనే ఉన్నారు. క్రూరమైన అన్యాయమైన దురాచారాలు వారిపై చల్లిన మాలిన్యాన్నుంచి, వారు దిగబడిపోయిన అగాధాల్లోంచి ఎప్పటికీ బయటపడలేకపోయారు. ఇతరులకు అది ఆశలవసంతమైనా సమృద్ధి గ్రీష్మమైనా వారికి ఎప్పుడూ నల్లని నిరాశ, కరుడుగట్టిన శీతాకాలం మాత్రమే. మానవహక్కుల పరిరక్షణకోసం లేదా వాటిని అందుకోవడం కోసం గొంతెత్తి అరుస్తూ తాపత్రయపడేవారు వారి క్రింద ఉన్న వారి న్యాయమైన హక్కుల గురించి కూడా ఏమాత్రం పట్టించుకోకపోవడం ఒక క్రూరమైన దురదృష్టంగా అనిపిస్తుంది. ఇతరులు ఏ హక్కుల పరిరక్షణకోసం ఏ అన్యాయాల బారినుండి తప్పించుకోడానికి యుద్ధభూమిలో రక్తాన్ని సైతం చిందిస్తారో, ఒక నోరులేని వర్గం అవే అన్యాయాల వల్ల పాట్లు పడుతుంటే వారి బాధలకు వారిని వదిలేయడం ఏన్యాయం? క్రూరమైన దురాచారం వల్ల బాధపడే ఈ అంటరానివారు కూడా ఈ భూమి బిడ్డలు; వారు కూడా మానవులు. తమకు తాము అధికులమని ఎవరైతే ప్రకటించుకున్నారో వారిలో ప్రవహించే ఎర్రని రక్తమే ఈ అంటరానివారి రక్తనాళాలలోనూ ప్రవహిస్తోంది. ప్రాపంచిక స్థితిగతులలో సంపన్నులైన వారు ఏ సదుపాయాల్ని అనుభవిస్తున్నారో అవే సదుపాయాలు దళిత వర్గాల వారికి కూడా ఉండాలి. మానవుని జన్మహక్కు వారికి కాకుండా చేయలేం. అసలు దళిత వర్గాలంటూ

ఉండటం భారతీయులకు మాయని మచ్చ. ఈ మచ్చని తొలగించుకోడానికే వారి ప్రార్థనలన్నీ."

కాంగ్రెసు ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టి అంతఅనర్గళంగా దాన్ని సమర్థిస్తే దాన్ని ఒక వింత సంఘటనగా పేర్కొనడమేమిటని చాలా మంది ఆశ్చర్యపోవచ్చు. కాని దీని పూర్వరంగం తెలిసిన వారు నేనలా పేర్కొనడం అసంబద్ధం కాదని ఒప్పుకుంటారు. చాలా కారణాల వల్ల అది వింతే.

మొదటి విషయం, ఆ సమావేశానికి అధ్యక్షత వహించినది కీర్తిశేషులు శ్రీమతి ఎనీ బెసెంట్. ఆమె ప్రజాజీవితంలో అందరికీ తెలిసిన వ్యక్తి. ఆమె నెరపిన అనేక కార్యాలవల్ల భవిష్యత్తులో భారతదేశపు చరిత్రకారుడు ఆమెను గుర్తుపెట్టుకుంటాడు. ఆమె థియోసాఫికల్ సొసైటీ వ్యవస్థాపకురాలు. అడయారులో దాని స్థావరం. రిజిస్ట్రారుగా ఉద్యోగ విరమణ చేసిన ఒక బ్రాహ్మణుని కొడుకైన కృష్ణమూర్తిని పెంచిందని అందరికీ తెలుసు. అతనిని భవిష్య వక్తగా ఆమె పెద్దచేసింది. హోం రూల్ లీగ్ వ్యవస్థాపకురాలుగా కూడా ఆమె అందరికీ తెలుసు. ఇంకా చాలా విషయాలలో ఆమెకు గౌరవ ప్రదమైన స్థానాన్నివ్వాలని ఆమె స్నేహితులు అనవచ్చు. కానీ ఆమె ఎప్పుడూ అంటరానివారి స్నేహితురాలని నాకు తెలియదు. నాకు తెలిసినంతవరకూ అంటరానివారంటే విరోధభావమే ఉండేది. అంటరాని వారి పిల్లల్ని మామూలు పాఠశాలలో ప్రవేశం కల్పించాలా లేదా అన్న విషయంపై ఆమె ఒక వ్యాసంలో తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. ఫిబ్రవరి 1909 'ఇండియన్ రెవ్యూ'లో 'దళిత వర్గాల ఉద్ధరణ' అన్న అంశంపై రాస్తూ ఆమె ఇలా అన్నారు :-

"ప్రతి దేశంలోనూ సమాజమనే పిరమిడ్‌కి ఆధారంగా ఒక పెద్ద వర్గముంటుంది. ఆ వర్గం ప్రజలు తెలివిలేక, హీనమైన జీవితాన్ని కొనసాగిస్తూ ఉంటారు. వారి భాషలో అలవాట్లలో మాలిన్యం ఉంటుంది. సమాజానికి కావలసిన అనేక విధులను వారు నిర్వర్తిస్తారు. సమాజపు అవసరాలను తీరుస్తున్న వారిని ఆ సమాజమే ఏహ్యాభావంతో చూసి నిరాదరిస్తుంది. ఇంగ్లాండులో ఈ వర్గాన్ని 'మునిగిన పదోవంతు' (Submersed tenth) అని పిలుస్తారు. మొత్తం జనాభాలో ఈ వర్గం పదపవంతు ఉంటుంది. ఈ వర్గం ఎప్పుడూ ఆకలి అంచున నివసిస్తుంది. ఏ మాత్రం వడిదుడుకులు వచ్చినా ఆ అంచుదాటిపడి అవస్థలపాలవుతుంది. అది నిరంతరం పోషక పదార్థాలు అందక బాధపడుతుంది. తద్వారా వచ్చే జబ్బులన్నీ ఈ వర్గాన్ని ఆవహిస్తాయి. తక్కువ రకపు నరాల వ్యవస్థ ఉన్న ప్రతిప్రాణి లాగే దీనికి కూడా బహు సంతానం ఉంటుంది. కానీ ఆపిల్లలు అంగవైకల్యంతో సరియైన పోషణ లేక తొందరగా మరణిస్తారు. వీరికంటె కొంచెం నయం ఇంకో వర్గం, కేవలం కాయకష్టం చేసేవారు. వారు బండచాకిరీ చేస్తారు. పాకీ పని వారుగా, ఊడ్చేవారుగా, కాజువల్ డాక్ పనివారుగా, తోపుడు బళ్ళమీద పళ్ళు

కాయగూరలు అమ్ముకునే వారుగా పని చేస్తారు. సమాజంలో ఎందుకూ కొరగాకుండా ఉన్న తాగుబోతులు, పనికిమాలిన వాళ్ళు వీధులవెంట తిరిగే వాళ్ళు మొరటు మొద్దులూ, నేరస్థులూ క్రమంగా ఈ వర్గంలోకి చేరిపోతారు. మొదటి వర్గం వారు నమ్మకస్థులూ, కష్టపడి పనిచేస్తారు. ఇక రెండో వర్గాన్ని ఎప్పుడూ అణచిపెట్టి ఉంచాలి. వారు తిండి సంపాదించుకోడానికి సరిపడా కాయకష్టం చేసేలా చెయ్యాలి. భారతదేశంలో ఈ వర్గం జనాభాలో ఆరోవంతు ఉంటుంది. ఈ వర్గాన్ని మౌళికంగా 'దళితవర్గాలు' అని పిలుస్తారు. ఈ వర్గం ఈ దేశంలోని ఆటవిక జాతులనుంచి ఏర్పడింది. ఈ దేశంపై దండెత్తి వచ్చిన ఆర్యులు వీరిని జయించి బానిసలుగా చేశారు. వీరు తాగుబోతులు. ఆహారవిషయంలో గాని, దేహం విషయంలోగానీ వసతిగురించిగాని పరిశుభ్రత అంటే పట్టించుకోరు. కాని పెళ్ళి విషయంలో ఒకింత నియమాన్ని పాటిస్తారు. చిన్న పిల్లల్ని దయగా చూస్తారు. అతిగా హింసించడం గానీ దౌర్జన్యంకాని, నేరప్రవృత్తిగానీ చాలా తక్కువ. వంశ పారంపర్యంగా దొంగతనం చేసే నేర ప్రవృత్తిగల సమాజాలు దూరంగా వేరేగా నివసిస్తారు. వారు, దళితులలో ఎక్కువభాగం అయిన పాకీ పనివారు, ఊడ్చేవారు, గొడ్లని కాచేవారు ఇంకా ఇతర చిన్న చిన్న వృత్తులను చేపట్టేవారితో కలసిమెలసి తిరగరు. దళితులు సౌమ్యులు. చెప్పినట్టు వింటారు. సర్వసాధారణంగా కష్టపడిపనిచేస్తారు. చాలా అణిగిమణిగి ఉంటారు. తిండికి లోటు లేనప్పుడు ఉషారుగా ఉంటారు. చురుకైన వారు. కానీ సాధారణంగా మితమైన తెలివితేటలు గలవారు. సత్యం, ఇతర నాగరికమైన విలువల గురించి ఏమీ పట్టించుకోరు - వారు అలాకాక ఇంకెలా ఉండగలుగుతారు?— కానీ వారు ప్రేమ గలవారు. కొంచెం దయచూపితేకూడా కృతజ్ఞులుగా ఉంటారు. కానీ వారికి ప్రకృతి సిద్ధమైన మతం ఉంది. నిజానికి నిరాడంబరమైన, ఉపయోగకరమైన, కానీ విధేయతగల నాగరిక జీవనానికి తార్కాణం...

తాము గురిఅవుతున్న అనాగరిక ప్రవర్తన గురించి బాధపడే వారు వారికేం చేయగలుగుతారు? తమ పట్ల ఇతరులు గౌరవంగా మెలగాలని కోరుకునే భారతీయులు తాము ఇతరులపట్ల కూడా గౌరవంగా మెలగాలని బయటివారు అనుకోరా?

ఇతరత్రా అన్ని చోట్లలాగానే అణగారిన వర్గాన్ని పైకి తీసుకురావాలంటే విద్య ఒకటే మార్గం. వారిపట్ల కరుణ చూపి వారికి లాభం చేకూర్చాలనే వర్గానికి ముందుగా ఒక అడ్డంకి ఎదురవుతుంది. ఉన్నత వర్గాలవారి పిల్లలు చదువుకునే స్కూళ్ళలోనే వారిని చేర్చాలనుకుంటే అలా అనుకునే వారు పరిస్థితుల్ని పూర్తిగా అవగతం చేసుకోలేదన్నమాట. దీన్ని వ్యతిరేకించే వారు సోదర భావం చూపడం లేదనికూడా అనుకోవచ్చు. సోదర భావం చూపడం అంటే క్రిందికి దిగజారడం అన్న ప్రశ్న ఉదయిస్తుంది. కుటుంబంలో పెద్దపిల్లల్ని చంటి పిల్లల్ని ఒకే విధంగా చూస్తారా అనేది కూడా ఆలోచించాలి. అది శాస్త్రవిరుద్ధమైన, ప్రకృతి విరుద్ధమైన ఆవేశమే అవుతుంది. అది కేవలం సోదర భావం

బదులు సమానత్వాన్ని ప్రవేశపెట్టడమే అవుతుంది. ఒక కృత్రిమ సమానత్వాన్ని సృష్టించడానికి తరతరాలుగా తాము అభ్యసించిన విద్య వల్ల ప్రభావితులై అలవరచుకొన్న సంస్కృతిని, నాగరికతను వదలిపెట్టాలనడమే అవుతుంది. అది వర్తమానాన్ని బాగుచేయడానికి ఉపకరించదు సరికదా భవిష్యత్తును ఉద్ధరించడానికి గొడ్డలిపెట్టుఅవుతుంది. ముందుగా దళిత వర్గాల పిల్లలకి శుభ్రతను, ఉత్తమ ప్రవర్తననూ, విద్య, మతం, నీతికి సంబంధించిన ఓనమాలను నేర్పాలి. తరతరాలుగా త్రాగుడు, ఎంతో వాసనతో కూడిన ఆహారానికి అలవాటుపడ్డవారి పిల్లల శరీరాలు ఎప్పుడు కంపుకొడుతూ అసహ్యంగా ఉంటాయి; తరతరాలుగా శుచిగలభోజనం చేసి ఉత్తమ వ్యక్తిగత నియమాలు పాటించే వారి పిల్లల సరసన కూర్చోడానికి అర్హత ఉండేటట్లు చేయాలంటే ఈ పిల్లలకు కూడా కొన్ని తరాలు మంచి భోజనం ఇచ్చి మంచి అలవాట్లు నేర్పాలి. దళిత వర్గాలను కూడా పైవారి శారీక పరిశుభ్రత స్థాయికి తీసుకెళ్లాలి. అంతేగాని శుభ్రంగా ఉన్న వారిని మురికి వారి స్థాయికి దిగజార్చడం కాదు. ఇది చేసే వరకు అతి సామీప్యత పనికి రాదు. దీనికి ఈ పిల్లల్ని కాని వారి తల్లిదండ్రులని కాని మేము నిందించడం లేదు. ఒక ఖచ్చితమైన నిజాన్ని మాత్రమే చెప్తున్నాం. రోజూ స్కూలులో ఈ పిల్లలకు ఇవ్వాల్సిన మొదటి పాఠం స్నానం గురించి, మంచిదుస్తుల్ని వేసుకోవడం గురించి, రెండవది శుభ్రమైన పౌష్టికాహారం గురించి. పొద్దున్నే స్నానం చేసి శుభ్రంగా భోజనం చేసి స్కూలుకు రావలసిన పిల్లలకు ఈ రెండు ప్రాథమిక అవసరాలను స్కూలులో ఏర్పాటు చేయలేం.

"ఈ పిల్లల అంటురోగాలు వారి ఉపాధ్యాయులు ఎదుర్కొనే ఇంకో ఇబ్బంది. ఉదాహరణకు అశ్రద్ధ వల్ల కలిగే కంటి జబ్బు మామూలుగా వచ్చే అంటువ్యాధి. మద్రాసులోని పంచమపాఠశాలల్లో ఈ జబ్బు గురించి ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు. కళ్ళను రోజూ శుభ్రం చేసి వ్యాధి రాకుండా నివారిస్తారు. తమ పిల్లల పట్ల ఎంతో శ్రద్ధ వహించే తల్లిదండ్రులు వారి పిల్లల్ని చూస్తూ చూస్తూ ఈ అంటు వ్యాధికి గురిచెయ్యగలరా?"

"ఈ దురదృష్ట శిశువుల అలవాట్లు, పోకడలను, జాగ్రత్తగా పెంచి పోషిస్తున్న పిల్లలు అనుసరించడం కూడా మంచిదికాదు. ఉదాహరణకి మంచిప్రవర్తన ఎంతో కాలం జాగ్రత్తగా పెంచి పోషిస్తేనేగాని అలవడదు. దానికి చాలా సంయమనం కావాలి. ఇతరుల విలు, సుఖం గురించిన ఆలోచన ఉండాలి. మర్యాద మన్నన మొదటి నుంచి అలవాటు చేసుకున్న తల్లిదండ్రులనుంచి, ఉపాధ్యాయులనుంచి పిల్లలు తమ పోకడలు గ్రహిస్తారు. ఇంకా సరిఅయిన చెప్పుచేతల వల్ల దండనవల్లా కూడా నేర్చుకుంటారు. స్కూల్లో అలాటి శిక్షణలేని విద్యార్థులతో కలిస్తే వారి వల్ల పిల్లలు కూడా అనేక అలవాట్లకు లోనవుతారు. ఎంతో కాలం మంచి అలవాట్లు ఉంటే తప్ప, సరిగా చెయ్యాల్సిన పని అస్తవ్యస్తంగాను, జాగ్రత్తగా చెయ్యాల్సింది అజాగ్రత్తగా చెయ్యడమూ మామూలయిపోతుంది. మర్యాద మన్నన పెంపకం భాగంగా వున్న పిల్లలలో అవి లేకుండా చేసెయ్యాలా? దీనివల్ల ఎవరికి

ఒరిగేదేమీ ఉండదు సరిగదా మొత్తంజాతి అంతా దిగజారిపోతుంది. పొందికగల మాట, సరళమైన గొంతు, ఆహ్లాదకరమైన పోకడలు, ఇవి అన్నీ ఎంతో పాతదైన సంస్కృతి వల్ల కలిగే విలువైన ఫలితాలు. వీటిని పోగొట్టుకోవడం నిజమైన సోదరభావం కాదు...

ఇంగ్లాండులో అన్ని వర్గాల పిల్లలకి ఒకే చోట విద్య గరపడం సరియైన పద్ధతిగా ఎప్పుడూ భావించలేదు. అసమానుల మధ్య సంబంధ్ధమైన సమానత్వంకోసం ప్రయత్నించడం వారు ఒప్పుకోరు. ఈటన్, హారోలు ఉన్నత వర్గాల పాఠశాలలని అందరికీ తెలుసు. రగ్బీ, విన్‌చెస్టర్‌కూడా గొప్పవారి పిల్లల (gentlemen's sons) పాఠశాలలు. అయితే ఇవి ఈటన్, హారోల కంటే ఒక వాసి తక్కువ. ముఖ్యంగా గ్రామీణ మధ్యతరగతి పిల్లల కోసం అనేక పాఠశాలలు ఉన్నాయి. చేతి వృత్తులవారి, కాయకష్టం చేసుకొనే వారి పిల్లల కోసం బోర్డు పాఠశాలలున్నాయి. వీటి అన్నింటి కిందా అలగా జనాల కోసం ప్రత్యేకంగా 'రాగ్డు' (ragged schools) పాఠశాలలున్నాయి. వాటి పేరుని బట్టి అవి ఎటువంటి విద్యార్థుల్ని చేర్చుకుంటాయో తెలుస్తుంది. అనేక ఉదార సంస్థలు వీటికి ధనసహాయం అందజేస్తాయి. ఈ స్కూలు పిల్లల్ని ఈటన్, హారోలలో చేర్చుకోవాలని ఎవరేనా అంటే, వారితో ఎవరూ వాదనకు దిగరు, నవ్వేస్తారు. ఇక్కడ సోదరత్వం పేరుతో అటువంటి ప్రతిపాదన ఎవరేనా చేస్తే, ఆ ప్రతిపాదనలోని అసంబద్ధతను ఎత్తిచూపడానికి సిగ్గుపడతారు. ఈ దళితులపైన జరిపిన క్రూరమైన తప్పిదాలకు ఈ ప్రతిపాదన ఒక **విశృంఖలమైన** ప్రతిస్పందన మాత్రమే అనీ, వారి మేల్కొన్న ఆత్మల ఆక్రోశం అనీ **గుర్తించరు**. వారి ఆత్మవిచారాన్ని సరైన ఆలోచనతో నడపడానికి తగినంత కాలవ్యవధి **కూడా** లేదు. ప్రభుత్వ పాఠశాలలు సమాజిక వైవిధ్యాన్ని పట్టించుకోలేవని ఒక్కోసారి వినవస్తుంది. అలాంటి వారు వారి ఆలోచనల్లో ముఖ్యంగా 'విదేశీ' తత్వాన్ని చూపిస్తున్నారు. వారి దేశపు పిల్లల గురించి అలా ఆలోచించరు. కాని భారతీయుల పిల్లల గురించి ఇష్టమొచ్చినట్లు మాట్లాడతారు. వారు పరిశుభ్రమైన వారైనా, అశుభ్రమైన వారైనా అందరినీ ఒకేలా చూస్తారు. సంస్కృతి గల వర్గాల పిల్లల్ని మాత్రమే పాఠశాలలో చేర్చుకుంటే వారిలో ఉన్న వాసిలోని తరతమబేధాల్ని గుర్తించవచ్చు. ఇంగ్లీషువారు వారిపిల్లల్ని సంరక్షించుకున్నట్లే భారతీయులు కూడా వారిపిల్లల్ని మొరటు అలవాట్ల నుంచి సంరక్షించుకోవాలి."

* * * * *

ఈ తీర్మానాన్ని ఆమోదించడాన్ని ఒక వింత సంఘటనగా అభివర్ణించడం సరియైనదేననడానికి రెండో కారణం ఏమిటంటే, కాంగ్రెసు ప్రకటిత విధానానికి ఇది పూర్తిగా విరుద్ధం. ఈ రోజుల్లో 'కాంగ్రెసు నిర్మాణకార్యక్రమం' గురించి ప్రతివీధిలోంచి, అన్ని వేళలా డబ్బా కొట్టుకొంటోంది. సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాల్లో

చురుగ్గా పాల్గొని ఇప్పుడే కొంచెం విశ్రమిస్తోంది. ఈ తరుణంలో ఇలా అంటే ఈనాటి కాంగ్రెసు వారినీ వారి స్నేహితుల్నీ ఆశ్చర్యపరచవచ్చు. సాంవత్సరిక సమావేశాల్లో కాంగ్రెసు అధ్యక్షులు చేసిన ప్రసంగాల్లోని ఈ క్రింద ఉదహరించిన భాగాలు చూస్తే కాంగ్రెసు సాధించదలచుకున్న ఆశయాల్లో సామాజిక సంస్కరణ సమస్యలకు ఏమీ స్థానం లేదని అర్థమౌతుంది.

కలకత్తాలో 1886లో జరిగిన రెండవ భారత జాతీయ సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ దాదాభాయ్ నౌరోజీతో ప్రారంభిద్దాం. తన అధ్యక్షోపన్యాసంలో సాంఘిక సంస్కరణ పట్ల కాంగ్రెసు అభిప్రాయం గురించి మాట్లాడుతూ ఇలా అన్నారు:-

"సాంఘిక సంస్కరణ సమస్యలను కాంగ్రెసు చేపట్టాలని అభిప్రాయం వ్యక్తమైంది. (సభలో హుషారుగా అవును, అవును అని కేకలు) ఈ విషయంలో మన వైఫల్యం గురించి మనల్ని నిందిస్తున్నారు. జాతీయ కాంగ్రెసు సభ్యుల్లో నాకంటే ఎక్కువ ఎవరూ ఈ సమస్య ప్రాముఖ్యాన్ని గుర్తించరు; కాని సోదరులారా, ప్రతివిషయానికీ, సరియైన సమయం, సరియైన పరిస్థితులు, సరియైన పార్టీలు, సరియైన స్థలాలు ఉంటాయి (హర్షం); ఒక రాజకీయ సంస్థగా, రాజకీయ ఆశయాలను మన పాలకులకు నివేదించడానికి మనం ఇక్కడ సమావేశమయ్యాం అంతే గాని సాంఘిక సంస్కరణలను చర్చించడానికి కాదు. వీటిని పట్టించుకోనందుకు మమ్మల్ని మీరు నిందిస్తే, కామన్సు సభను (House of Commons) అది దూరపు సమస్యలైన గణితం, వేదాంతం గురించి చర్చించనందుకు నిందించాలి. పైగా ఇక్కడ హిందువుల్లో ప్రతి కులానికి చెందిన వారు ఉన్నారు. వారి ఆచారాలు, కట్టుబాట్లు ఎంతో తేడాగా ఉంటాయి. మహమ్మదీయులు, రకరకాల క్రిస్టియన్లు, పార్సీలు, సిక్కు, బ్రహ్మసమాజం వారు ఇలా అనేక మంది ఉన్నారు - నిజానికి భారత దేశంలో ఎన్ని వర్గాలున్నాయో అన్నీ ఇక్కడ కూడా ఉన్నాయి (పెద్దగా హర్షం) - ప్రతి వర్గంలోనూ అవసరమైన సంస్కరణల గురించి ఈ అన్ని వర్గాలూ కలిసి ఎలా చర్చిస్తాయి?... ప్రత్యేక వర్గంలో ఏ సంస్కరణలు కావాలన్నది ఆ వర్గం మాత్రమే సరిగ్గా చర్చించగలుగుతుంది. ఒక భారతీయ కాంగ్రెస్ అన్నది దేశం మొత్తానికి సంబంధించిన సమస్యల్ని మాత్రమే చర్చించాలి. సాంఘిక సమస్యలకి సంబంధించిన సర్దుబాట్లు ఆయా వర్గాల కాంగ్రెస్‌లకు వదిలివెయ్యాలి."

1887లో జరిగిన మూడవ వార్షిక సమావేశంలో అధ్యక్షుడు శ్రీ బద్రుద్దీన్ త్యాబ్జీ తిరిగి ఈ విషయాన్ని గురించి మాట్లాడారు. శ్రీ త్యాబ్జీ ఇలా అన్నారు:—

"... ఈ కాంగ్రెసు సాంఘిక సంస్కరణలు చర్చించలేదని కొందరు వాపోయారు. మనసారా వాపోయారు. ఈ సమావేశం చర్చల సరళికి నిరసనగా దీన్ని పేర్కొన్నారు... ఈ నిరసన నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఎందుకంటే ఇక్కడ ఒక వర్గం ఒక కులం

మతం కాక భారతదేశపు అన్ని వర్గాల ప్రతినిధులూ ఉన్నారు. కేవలం ఒక ప్రాంతం వారు కాదు దేశం నలుమూలల నుంచీ అనేక మంది కాంగ్రెసుకు హాజరయ్యారు. సాంఘిక సమస్యైనా దేశంలోని ఒక ప్రాంతానికి ఒక వర్గానికి మాత్రమే సంబంధించిందై ఉంటుంది. అందుచేత సోదరులారా (Gentlemen), నాకేమనిపిస్తుందంటే మా ముసల్మానులకు తీర్చవలసిన మా సాంఘిక సమస్యలున్నాయి. అలాగే ఇక్కడున్న హిందూ, పార్శీ మిత్రులకు కూడా. అయినప్పటికీ ఈ సమస్యల్ని ఆ ప్రత్యేక వర్గాల, కులాల, మతాల నాయకులు మాత్రమే చేపట్టడం ఉత్తమం. (హర్షం) అంతుచేత జెంటిల్‌మన్, మన ముందున్న సక్రమమైన, తెలివైన మార్గమేమిటంటే మొత్తం భారత దేశం ఎదుర్కొనే సమస్యలకు మాత్రమే మన చర్చల్ని పరిమితం చెయ్యాలి. ఒక ప్రత్యేక ప్రాంతానికి గాని, ఒక ప్రత్యేక వర్గానికి గాని చెందిన సమస్యల జోలికి పోకూడదు."

మూడోసారి ఈ సమస్య చర్చకి వచ్చింది 1892లో. అది కాంగ్రెసు ఎనిమిదవ సమావేశం (Session), శ్రీ డబ్ల్యు.సి. బెనర్జీ అధ్యక్షోపన్యాసంలో తన భావాలని ఇలా వెల్లబుచ్చారు:

"మన విమర్శకులు కొంత మంది మన వ్యవహారాలు మనకంటే వారికే ఎక్కువ తెలుసునని చెప్పడంలో తలమునకలై ఉన్నారు. మనం రాజకీయ వ్యవహారాల జోలికి పోకుండా, కేవలం సాంఘిక విషయాల్నే పట్టించుకుని మన దేశంలోని సాంఘిక వ్యవస్థని బాగుచెయ్యాలని వారి అభిప్రాయం. సాంఘిక వ్యవహారాల్ని బహిరంగంగా చర్చించడంలో నమ్మకంలేని వాళ్ళలో నేనొకణ్ణి. ఒక సాంఘిక వ్యవస్థ బాగోగులను ఆ సమాజానికి, వర్గానికి చెందిన వ్యక్తులకు మాత్రమే వదిలెయ్యాలని నేననుకుంటున్నాను. సాంఘిక వ్యవహారాలను బహిరంగంగా చర్చించేటప్పుడు కొంత మంది ఎంతరెచ్చిపోతారో మనకి తెలుసు. వైస్‌రీగల్ చట్ట సభలో (Viceregal Legislative Council) ఒప్పుదలవయస్సు బిల్లు (Age of Consent Bill) ను ప్రవేశపెట్టినప్పుడు జరిగిన వ్యవహారం దీనికి తార్కాణం. ఆ బిల్లు విషయంలో జరిగిన చర్చల్లోని మంచి చెడుల గురించి నేను ఒక్క మాట కూడా అనదలచుకోలేదు. సాంఘిక విషయాల్ని బహిరంగంగా శత్రుభావంతో, అమిత్రభావంతో చర్చించినప్పుడు ప్రజల మనస్సులు ఏ విధంగా తల్లడిల్లుతాయో చెప్పడానికి మాత్రమే దీన్ని ఉదహరించాను...సాంఘిక సంస్కరణ మనందరికి ఒకే రకంగా గోచరించదన్న విషయం మీ దృష్టికి తెస్తున్నాను. మన కూతుళ్ళు కూడా కొడుకుల్లాగే విశ్వవిద్యాలయాలకు వెళ్ళి ఉత్తమ వృత్తుల్ని చేపట్టాలని మనలో కొంత మందిమి కోరుకుంటాం. కొంచెం పిరికి వాళ్ళు వారి పిల్లలకి బాల్యంలోనే వివాహాలు చెయ్యకూడదని, బాల వితంతువులు జీవిత మంతా వితంతువుగానే ఉండిపోకూడదనీ అనుకుని ఈ మాత్రం చెయ్యగలిగితే చాలని సంతృప్తి పడతారు. ఇంకా పిరికి వాళ్ళు సాంఘిక సమస్యలు వాటంతట అవే సమసిపోతాయిలే అనుకుంటారు... కాంగ్రెసు ఒక రాజకీయ సంస్థగా మొదలైంది. అది

రాజకీయ వ్యవహారాలు, కేవలం రాజకీయ వ్యవహారాలపై మాత్రమే దృష్టిని కేంద్రీకరించి రాజకీయ సంస్థగానే వ్యవహరిస్తుందని నేను మనసారా నమ్ముతున్నాను. మనం సాంఘిక విషయాల్ని మన పనిలో భాగంగా చేసుకోలేదని విమర్శించే భారతీయులుగానీ విదేశీయులుగాని 'ఏజ్ ఆఫ్ కన్సెంట్ బిల్లు' విషయంలో మాదిరిగానే మనం వాటిలో తలమునకలై ఘోరంగా అంతమొందాలని రహస్యంగా వాంఛిస్తున్నట్లుంది. వాళ్ళు మన బాగుకోరేవారు కాదు. కాంగ్రెసు సాంఘిక విషయాల్ని చర్చించడానికి మాత్రమే తగుననే విమర్శకులు తారసపడితే వారి నుంచి ఎంత దూరంగా తొలగిపోతే అంత మంచిది..."

"మన సాంఘిక వ్యవస్థని బాగు చేసే దాకా రాజకీయ సంస్కరణలకి మనం తగమనే వారిపట్ల నాకు సహనం లేదు. ఈ రెండింటికి ఏ సంబంధముందో నాకు అర్థంకావడం లేదు. ఉదాహరణకి సంవత్సరాలుగా మనం కావాలంటున్న ఒక రాజకీయ సంస్కరణను తీసుకుందాం. అదేమిటంటే ఒకే ఉద్యోగి అధికార విధినిర్వహణ (Executive functions), న్యాయ విధినిర్వహణ (Judicial functions), చెయ్యకూడదనేది. కేవలం రాజకీయ పరమైన ఈ సంస్కరణకి సాంఘిక సంస్కరణకి ఏం సంబంధం? అలాగే మనం కావాలంటున్న పెర్మనెంటు సెటిల్మెంటు, అడవులకు సంబంధించిన చట్టం మొదలైనవి తీసుకోండి. వీటికి సాంఘిక సంస్కరణకి ఏమైనా సంబంధం ఉందా అని మిమ్మల్ని అడుగుతున్నాను. మన వితంతువులు మళ్ళీ పెళ్ళి కాకుండా ఉండిపోయినందు వల్లా, మన అమ్మాయిలకి, ఇతరదేశాల్లో కంటే, చిన్నప్పుడే పెళ్ళి చేసేస్తున్నందువల్లా మనం ఆ రాజకీయ సంస్కరణలకి తగమా? మన భార్యలూ కూతుళ్లూ స్నేహితుల ఇళ్ళకి చూడ్డానికి వెళ్ళి మనతోపాటు ఊరేగరనా? మన కుమార్తెలను ఆక్సఫర్డ్‌కు కేంబ్రిడ్జికి పంపించమనా?" (హర్షం)"

పూనాలో 1895లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో ఆఖరి సారిగా ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది. శ్రీ సురేంద్రనాథ్ బెనర్జీ అధ్యక్షుడు. దీనిపై శ్రీ బెనర్జీ ఇలా అన్నారు:—

"మనమధ్య విభేదాలు రావడం మంచిది కాదు. ఇప్పటికే మనది హిందూ కాంగ్రెసు అని వాళ్ళంటున్నారు. మన మధ్య మహమ్మదీయ ప్రజలుండడం వల్ల అసలు వివాదం నిలవదనుకోండి. మనది ఫలానా సాంఘిక పక్షానికి చెందిన పార్టీ అనిపించుకోకూడదు. ఇది హిందువుల, మహమ్మదీయుల, క్రిస్టియన్ల, పార్శీల, శిక్కుల అంటే సమైక్య భారతదేశానికి చెందిన కాంగ్రెసు. దీంట్లో వారి సాంఘిక ఆచారాలను సంస్కరించుకోవచ్చు. సంస్కరించుకోకపోవచ్చు. ఇక్కడ మనం ఒక ఉమ్మడి వేదికపై ఉన్నాం. ఇక్కడమనం మన సాంఘిక కులపరమైన తేడాలను మరచిపోవాలనుకున్నాం. మనం ఒకే సార్వభౌమత్వానికి లోబడి ఒకే ప్రభుత్వ ఏలుబడిలోను ఒకే రాజకీయ సంస్థల ఆధ్వర్యంలో ఉన్నందున మనందరికి ఉమ్మడి హక్కులు, ఉమ్మడి ఇబ్బందులు ఉన్నాయి.

మన హక్కులను రక్షించుకొని, వాటిని పెంపొందించుకోడానికి మనకున్న ఇబ్బందుల్ని తీర్చుకోడానికే ఈ కాంగ్రెసును ఏర్పాటు చేసుకున్నాం. ఒక డాక్టర్ల సంస్థ ఉందనుకోండి తమ శాస్త్రానికి సంబంధించిన సిద్ధాంతాలు, విలువల గురించి పరిపూర్ణమైన ఏకాభిప్రాయం ఉండికూడా, తమ కుమార్తెలకు ఏ వయస్సులో పెళ్ళి చేయాలి, వితంతువులకు మళ్ళీ పెళ్ళిచేయాలా అక్కరలేదా అనేవిషయాలపై వివాదం తలెత్తి ఆ సంస్థ విచ్ఛిన్నం అయిపోయిందనుకోండి దానిగురించి మనం ఏమనుకోవాలి... మనది రాజకీయ ఉద్యమం, సాంఘిక ఉద్యమం కాదు, దాన్ని మనకు వ్యతిరేకంగా ఎవరూ ఎత్తిచూపలేరు. ఎందుకంటే మన లాయరు మిత్రుల్ని వారు డాక్టర్లు కాలేదేమని అడగలేరు కదా. రాజకీయ విషయాలపై కూడా మైనారిటీల అభిప్రాయాలంటే మనకెంతో గౌరవం ఉంది. ఎప్పుడో 1887లో మన సంస్థ అధ్యక్షుడు శ్రీ భద్రుద్దీన్ త్యాబ్జీ పిలుపు మేరకు అనుకుంటాను ఆయన బొంబాయి హైకోర్టు జడ్జిగా పదవి స్వీకరించి మన జాతి అభినందనలు పొందాడు. ఒక విషయంపై ఒక వర్గానికి ఏకాభిప్రాయం ఉన్నప్పటికీ ఆ వర్గం కాంగ్రెసులో మైనారిటీ అయితే ఆ విషయాన్ని చర్చించకూడదు, దాన్ని పూర్తిగా వదిలివేయాలి అని తీర్మానించారు"

"మన సంస్థ వంటి దానికి ఒక ప్రత్యేకమైన ప్రమాదం పొంచి ఉంది. దాన్నుంచే మన సంస్థను కాపాడుకోవాలి... మన సంస్థ లోపలి నుంచి విభేదాలు, తగాదాలు తలెత్తడం అనే ప్రమాదం అది."

## II

ఈ ప్రకటన వల్ల ఉత్పన్నమయిన రెండు ప్రశ్నలకు వివరణ ఇవ్వాలి. మొదట తెలుసుకోవలసింది ఈ అధ్యక్షులు ప్రస్తావించిన సాంఘిక సంస్కరణ పార్టీ ఏమిటి. రెండోది, సాంఘిక సంస్కరణకు కాంగ్రెసుకు ఉన్న సంబంధాన్ని చర్చించిన కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ సురేంద్రనాథ్ బెనర్జీ 1895లో ఇచ్చిన ఉపన్యాసమే ఆఖరుది. తరువాత ఏ అధ్యక్షుడు దీని గురించి మాట్లాడలేదెందుకని.

మొదటి ప్రశ్నకు సమాధానం దొరకాలంటే ఈ విషయాన్ని గుర్తించాలి: భారతజాతీయ కాంగ్రెసును 1885లో బొంబాయిలో స్థాపించినపుడు దాని నాయకులు ఈ జాతీయ ఉద్యమం రాజకీయ సమస్యల్నేకాకుండా భారతీయ సామాజిక ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన సమస్యల్ని కూడా పరిశీలించాలనుకున్నారు. హిందూ సమాజాన్ని పటిష్టం చేయడానికి అన్ని సామాజిక దోషాల్ని, దుర్గతుల్ని నివారించడానికి తీవ్రమైన కృషి చెయ్యాలని కూడా నిర్ణయించారు. ఈ దృష్టితోనే బొంబాయిలో మొదటి కాంగ్రెసు సమావేశంలో దివాన్ బహద్దూర్ ఆర్.రఘునాథరావు, శ్రీ జస్టిస్ (అప్పటికి రావుబహద్దూర్) ఎం.జి. రనడే సాంఘిక సంస్కరణ మీద ప్రసంగాలు చేశారు. కలకత్తా సమావేశంలో 1886లో ఈవిషయం

గురించి ఏమీ పట్టించుకోలేదు. అయితే కాంగ్రెసు ఉద్యమ నాయకుల్లోను, భారతీయ విజ్ఞానం అధ్యయనం చేసిన నాయకుల్లోను కూడా సాంఘిక సమస్యలగురించి కాంగ్రెసు పట్టించుకోవాలాలేదా? వీటి గురించి చర్చించడానికి వేరే సంస్థను ఏర్పరచాలా అనే విషయంపై చర్చలు జరిగాయి. దివాన్ బహద్దూర్ ఆర్. రఘునాధరావు, శ్రీ మహదేవ్ గోవింద రనడే, శ్రీ నరేంద్రనాథ్‌సేన్, శ్రీ జానకీనాథ్ ఘోశాల్ ఇంకా కొంత మంది ఈ విషయంపై క్షుణ్ణంగా చర్చించిన తరువాత భారతీయ సామాజిక ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన సమస్యలను పరిశీలించడానికి భారత జాతీయ సాంఘిక సంస్థ (Indian National Social Conference) అనే పేరుతో ఒక ప్రత్యేకమైన సంస్థను ఏర్పాటు చెయ్యాలని నిర్ణయించారు. ఈ సంస్థకు జన్మస్థానంగా ఉండే గౌరవం మద్రాసుకు దక్కింది. ఎందుకంటే అప్పటి ప్రధాన రాజనీతిజ్ఞుడైన కే.శే. రాజా సర్ టి. మాధవరావు, కె.సి.ఎస్.ఐ వంటి మహామహుని అధ్యక్షతలో 1887లో మద్రాసులో భారత జాతీయ సాంఘిక సంస్థ మొదటి సమావేశం జరిగింది. కానీ ఈ మొదటి సమావేశంలో పని ఎక్కువ జరగలేదు. అప్పుడు హాజరయిన సభ్యులు తీసుకున్న ముఖ్యమైన నిర్ణయాల్లో ఒకటి దేశవివిధ ప్రాంతాల్లో ఈ సంస్థ సాంవత్సరిక సమావేశాల్ని జరపాలని. ఈ సమావేశాలు మన సమాజస్థాయిని పెంచడానికి, సాంఘిక ఆచారాలను బాగుచెయ్యడానికి అవసరమైన చర్యల్ని పరిశీలిస్తాయి. ఈ సమావేశాలు రాష్ట్రస్థాయి ఉపసంఘాల (Sub-Committees) ఏర్పాటుకు కూడా చర్యలు తీసుకుంటాయి.

సుదూర సముద్రయానం వల్ల కలిగే ఇబ్బందులు, కుటుంబం చితికిపోయేట్టు చేసే పెళ్ళిళ్ళ ఖర్చులు, బాలబాలికలకు పెళ్ళికిప్పుడు ఉండాల్సిన కనీసవయసు, యువతులైన విధవల పునర్వివాహాలు, యువతులను వయస్సు మళ్ళిన వారికి ఇచ్చి పెళ్ళి చేసినందువల్ల కలిగే అరిష్టాలు, పెళ్ళిళ్ళ విధానాలు, పెళ్ళి జరిగినట్లున్న సాక్ష్యాధారాలు, ఒకే కులంలో వివిధ శాఖల వారి మధ్య వివాహాలు వంటి సాంఘిక విషయాలను ఈ సంస్థ చేపట్టాలని అంగీకారం కుదిరింది.

వేరువేరు సాంఘిక సమస్యలపై నిర్ణయాలు తీసుకోడానికి వేరువేరు ఉపసంఘాలను నియమించాలని అనుకున్నారు. ఈ ఉపసంఘాలు తీసుకున్న నిర్ణయాలను ఉల్లంఘిస్తే తీసుకోవాల్సిన చర్యలు, ఇవ్వాల్సిన పెనాల్టీల వంటి వాటికి సంబంధించిన మౌలిక సూత్రాలను ఈ ఉపసంఘాలే రూపొందించాలి. ఈ మౌలిక సూత్రాలకు కట్టుబడి ఉంటామని, పెనాల్టీలను భరిస్తామని సాంఘిక సంస్కరణ పార్టీ (Social Reform Party) సభ్యులు వాగ్దానం చెయ్యాలి. ఈ పెనాల్టీల అమలులో 1) ఈ ఉపసంఘాలే చర్య తీసుకోవచ్చు. 2) వీలున్నప్పుడు వారి వారి పీఠాధిపతుల ద్వారా చర్య తీసుకోవచ్చు. లేదా 3) సివిల్ కోర్టులద్వారా,

ఇవన్నీ విఫలమైతే 4) వాగ్దానం ఇచ్చిన తమ సభ్యుల విషయంలో ఈ సంఘాలే చర్య తీసుకోగలిగేలా రూల్సును తయారు చెయ్యాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చెయ్యాలి.

హిందూ సమాజాన్ని బాధిస్తున్న సాంఘిక దురాచారాన్ని పరిష్కరించడానికి సాంఘిక సంస్కరణ పార్టీ వేరే సంస్థను స్థాపించినప్పటికీ వారు, సాంఘిక సమస్య నుంచి పూర్తిగా దూరంగా ఉండాలన్న కాంగ్రెసు నిర్ణయం పట్ల వారు ఏమాత్రం సంతృప్తి ప్రకటించలేదు. రాజకీయ సంస్కరణలకు ముందే సాంఘిక సంస్కరణలు జరగాలా లేదా అనే విషయంపై ఒక నిర్ణయం తీసుకోవాలని ఈ విషయంలో చర్చ జరగాలని పట్టుబట్టడానికి కొంత మంది సిద్ధంగా ఉన్నారు. వీరిని సమర్థించడానికి వీరి మిత్రులు ఎంతో మంది ఉన్నారు. వీరిలో వైశ్రాయి ఎక్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యుడు సర్ ఆక్లాండ్ కోల్విన్ ఒకరు. భారతీయులు వారి దృష్టిని "భారత ప్రభుత్వ విషయంలో బ్రిటిష్ వారు నెరవేర్చాల్సిన విధుల్ని బోధించడానికి బదులు" సాంఘిక సంస్కరణల వైపు మరల్చాలని ఆయన తేటతెల్లంగా, ఖచ్చితంగా చెప్పారు.

కాంగ్రెసు అధ్యక్షులు వారి ప్రసంగాల్లో సాంఘిక సంస్కరణ గురించి ఎందుకు పేర్కొన్నారో ఇప్పుడు మనకి సులువుగా అర్థమౌతుంది. కాంగ్రెసు సాంఘిక సంస్కరణ నుంచి దూరంగా ఉండడాన్ని గురించి సాంఘిక సంస్కరణ పార్టీ (Social Reform Party) చేసిన విమర్శకు ఇది సమాధానమన్న మాట.

ఇక 1895 తరువాత ఏ కాంగ్రెసు అధ్యక్షుడు సాంఘిక సంస్కరణ గురించి ఎందుకు మాట్లడలేదన్న రెండో ప్రశ్నకు వస్తే దీనికి సమాధానం ఏమిటంటే 1895కు ముందు కాంగ్రెసువారిలో సాంఘిక సంస్కరణ రాజకీయ సంస్కరణపై రెండు వర్గాలున్నాయి. ఒక వర్గం అభిప్రాయాన్ని దాదాబాయి నౌరోజీ, ఖద్రుద్దీన్ త్యాబ్జీ, సురేంద్రనాథ్ బెనర్జీ వెలిబుచ్చారు. రెండో వర్గం అభిప్రాయాన్ని డబ్ల్యు. సి. బెనర్జీ వెలిబుచ్చారు. మొదట పేర్కొన్న వర్గం సాంఘిక సంస్కరణల అవసరాన్ని గుర్తించారు కాని కాంగ్రెసు సమావేశం దానికి సరియైన వేదిక కాదని అభిప్రాయపడ్డారు. రెండో వర్గం సాంఘిక సంస్కరణే అవసరం లేదన్నారు. సాంఘిక సంస్కరణ లేనిదే రాజకీయ సంస్కరణ ఉండదన్న వాదాన్ని వారు ఖండించారు. కాంగ్రెసులోని ఈ రెండు వర్గాలు మౌలికంగా ఒకరినొకరు వ్యతిరేకించినా 1895 వరకూ ఒకరంటే ఒకరికి విరోధభావం ఒకరిని ఒకరు సహించలేకపోవడమూ రాలేదు. మొదటి వర్గానికి కాంగ్రెసులో ఎక్కువ పలుకుబడి ఉండేది. ఫలితంగా భారత జాతీయ కాంగ్రెసు, సాంఘిక సంస్థ (Social Conference) వాటిపరిధుల్లో అవి ఉంటూ, వాటి విధుల్ని అవి నిర్వర్తిస్తూ సమానాంతర సంస్థలుగా పనిచేసేవి. వీటి మధ్య సహాయ సహకారాలు ఎంత గొప్పగా ఉండేవంటే జాతీయ కాంగ్రెసు, సాంఘిక సంస్థ వాటి వార్షిక సమావేశాల్ని వరుసగా ఒకదాని తరువాత ఒకటి ఒకే పెండాలులో

జరుపుకునేవి. జాతీయ కాంగ్రెసు సమావేశానికి హాజరైన వారిలో ఎక్కువ మంది సాంఘిక సంస్థల సమావేశానికి కూడా హాజరయ్యేవారు. కానీ సాంఘిక సంస్కరణ వ్యతిరేక వర్గానికి చెందిన కాంగ్రెసువారికి మాత్రం సాంఘిక సంస్థలను చూస్తే కన్నెర్రగా ఉండేది. కాంగ్రెస్‌లో పలుకుబడిగల వర్గం ఈ సాంఘిక సంస్థకు ఇచ్చే సహకారం వారికి నచ్చేది కాదు. ముఖ్యంగా కాంగ్రెసు పెండాలునే ఈ సంస్థ సమావేశానికి ఇవ్వడం గిట్టేది కాదు.. 1895లో పూనాలో కాంగ్రెసు సమావేశమైనప్పుడు ఈ సాంఘిక సంస్కరణ వ్యతిరేక వర్గం తిరుగుబాటు చేసింది. కాంగ్రెసు తన పెండాలుని సాంఘిక సంస్థకు ఉపయోగించుకోవడానికి ఇస్తే ఆ పెండాలుని తగలబెట్టేస్తామని బెదిరించింది. సాంఘిక సంస్థను వ్యతిరేకించిన వర్గానికి నాయకత్వం వహించింది మరెవరో కాదు. కీ.శే. తిలక్ మహాశయుడే. ఈయన సాంఘిక మితవాది కాని రాజకీయ అతివాది. భారతదేశంలో ఇలాంటి వారు చాలామందే ఉన్నారు. కాంగ్రెసు బేనర్లు అన్నిటిపైనా ప్రస్ఫుటంగా ఉండే "స్వరాజ్యం నా జన్మ హక్కు" అన్న స్లోగన్‌కు పిత ఈయనే. ఈ తిరుగుబాటు జయప్రదమైంది. ఎందుకంటే సాంఘిక సంస్కరణ పార్టీ అనుకూలురైన కాంగ్రెసువారు వారి వ్యతిరేకులతో తలపడ్డానికి సిద్ధంగా లేరు.[1] ఈ తిరుగుబాటులో ఒక పని జరిగింది. అదేమిటంటే ఎంత అర్జంటు అయినా కాంగ్రెసు సాంఘిక సంస్కరణను మాత్రం చేపట్టకూడదని.[2] ఏ కాంగ్రెసు అధ్యక్షుడూ 1895 తరువాత సాంఘిక సంస్కరణ గురించి పేర్కొనకపోవడానికి ఇదీ కారణం. కాంగ్రెసు 1895లో తీసుకున్న ఈ చర్యవల్ల సాంఘిక దురాచారాన్ని మాన్పడంలోగానీ, తగ్గించడంలోగానీ దృష్టి సారించకుండా కేవలం రాజకీయ సంస్థగా మాత్రమే ఉండిపోయింది.

---

1. సురేంద్రనాథ్ బెనర్జీ రనడేకు రాసిన ఉత్తరంలో సాంఘిక సంస్థ కాంగ్రెస్ పెండాలును ఉపయోగించడాన్ని తిలక్ వర్గం వ్యతిరేకించడం గురించి చర్చించారు. దీన్నిబట్టి సాంఘిక సంస్కరణ అనుకూల వర్గం వీరి సవాలును స్వీకరించలేదన్నది స్పష్టమౌతుంది. ఆ ఉత్తరంలో ఆయన ఏమన్నారంటే : "సాంఘిక సమస్యల్ని మన చర్చల్లోంచి ఎందుకు తొలగించామంటే, వాటి చర్చ తీవ్ర అభిప్రాయభేదాలకు దారితీయవచ్చు. దీనివల్ల సంస్థ చీలిపోవచ్చు. ఈ చీలిక రాకుండా చేయడం మన మొదటి కర్తవ్యం. ఎదుటి వర్గం వారి కోరిక సవ్యమైనది కాదు. కానీ మనం అసంబద్ధమైన కోరికలకు తలవొగ్గాల్సి ఉంటుంది. అంతకంటే పెద్దవైన అరిష్టాలనుంచి తప్పించుకోడానికి."

2. సాంఘిక సంస్కరణ సంస్థపై కాంగ్రెసులోని సాంఘిక సంస్కరణ వ్యతిరేక వర్గం చేసిన ఈ తిరుగుబాటుకు సాంఘిక సంస్కర్తల్లోని కొందరు పెద్దలు స్వాగతం చెప్పారు. దివాన్ బహద్దూర్ ఆర్. రఘునాథరావు రనడేకి రాస్తూ ఇలా అన్నారు. "సాంఘిక సంస్థ (Social Conference) పెండాల్‌ను ఉపయోగించకుండా చేసినందుకు సంతోషంగా ఉంది ఎందుకంటే కాంగ్రెసు అది సాంఘిక సంస్థలో కలిసి పనిచేస్తోందని ఇంగ్లీషువారిని నమ్మించడానికి చేసిన మోసం బట్టబయలైంది. కాంగ్రెసు నిజంగా సాంఘిక సంస్థతో కలిసి పనిచేయడానికి ఉద్దేశించలేదని ఇప్పుడు ఇంగ్లీషు వారికి తేటతెల్లమైపోతుంది."

# III

ఈ నేపథ్యంలో, 1917లో కాంగ్రెసు దళిత వర్గాలపై ఆమోదించిన తీర్మానం తప్పక ఒక వింత సంఘటనే. అప్పటికి 32 ఏళ్ళపాటు పని చేస్తున్నా ఇటువంటిది కాంగ్రెసు అంతకు పూర్వం ఎప్పుడూ చేయలేదు. పైగా అది కాంగ్రెసు ప్రకటించిన విధానానికి విరుద్ధం కూడా.

1917లో అటువంటి తీర్మానాన్ని ఆమోదించడం అవసరం అని కాంగ్రెసు ఎందుకు అనుకుంది. అంటరాని వారి ఉనికిని కాంగ్రెసు ఎందుకు గుర్తించింది., దీనివల్ల అది ఏ లాభం పొందాలనుకుంది. ఎవరిని మోసం చేయాలనుకుంది, దాని దృష్టికోణంలో మార్పు ఇచ్చినందువల్లనా లేక ఇంకేదయినా దురుద్దేశం ఉందా? ఈ ప్రశ్నలకు సమాధానం కోసం 1917లో బొంబాయిలో జరిగిన రెండు సమావేశాల్ని గమనించాలి. వాటికి ఇద్దరు వేరువేరు వ్యక్తులు అధ్యక్షత వహించారు. అవి ఆమోదించిన తీర్మానాన్ని పరిశీలించాలి. మొదటి సమావేశం నవంబరు 11, 1917న సర్ నారాయణ్ చందావర్కర్ అధ్యక్షతన జరిగింది. ఆ సమావేశంలో ఈ క్రింది తీర్మానాల్ని ఆమోదించారు:—

"మొదటి తీర్మానం - బ్రిటిష్ ప్రభుత్వానికి విధేయత, మిత్రపక్షాలకు (Allies) జయంచేకూరాలని ప్రార్థన."

"ఒక డజను మంది మినహా, మిగిలిన అందరూ అంగీకరించి ఆమోదించిన రెండవ తీర్మానంలో భారత జాతీయ కాంగ్రెస్, ఆలిండియా ముస్లింలీగ్ భారత దేశపు అధికార యంత్రాంగం విషయంలో సిఫార్సు చేసిన ప్రణాళికకు ఆమోదం తెలిపారు."

"ఏకగ్రీవంగా ఆమోదించిన మూడవ తీర్మానం: భారతదేశంలో దళిత, అంటరాని వారుగా పరిగణించిన వర్గాల జనాభా అత్యధికం అయినా వారికి సంఘంలో కేటాయించిన స్థానంవల్ల వారి పరిస్థితి దయనీయమైంది. విద్య విషయంలో ఇతరులకంటే వెనుకబడి పోయారు. అందుచేత వారిని మెరుగుపరచుకోడానికి సరైన అవకాశం లేకుండా పోయింది. అందుచేత శాసనసభలను (Legislative Councils) పునర్నిర్మించి సంస్కరించే పథకంలో పైన పేర్కొన్న వర్గాల అవసరాలను దృష్టిలో ఉంచుకోవాలని ఈ దళిత వర్గాల బహిరంగ సభ కోరుతోంది. అంచేత ఈ సభలకు (Councils) ఈ వర్గాలు వారి జనాభామేరకు వారి ప్రతినిధుల్ని వారే ఎన్నుకునే హక్కుని ఇచ్చి బ్రిటిష్ ప్రభుత్వం దయతో వారి మంచి చెడ్డల్ని రక్షించాలని ఈ సమావేశం ప్రార్థిస్తోంది".

"ఆ సమావేశంలో ఏకగ్రీవగంగా ఆమోదించిన నాల్గవ తీర్మానం:- ఏ వర్గం సామాజిక అభివృద్ధైనా ఆ వర్గం సభ్యులందరికీ విద్య అందుబాటులో ఉన్నప్పుడే సాధ్యమౌతుంది. ఈ దళిత వర్గాల దుర్గతికి వారి అవిద్య, అజ్ఞానమే కారణం. అంచేత వీలైనంత త్వరితగతిని ఈవర్గాలకు ఉచిత నిర్బంధ విద్య అందచేయాలని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాము."

"ఏకగ్రీవంగా ఆమోదించిన ఐదవ తీర్మానం:— దళిత వర్గాలు పడుతున్న బాధలు ఎంతో దారుణమైనవి, దయనీయమైనవి, వీరు పాఠశాలలలో ఆసుపత్రులలో న్యాయస్థానాలలో ప్రభుత్వ కార్యాలయాలలో ప్రవేశించడానికి వీలులేకుండా చేస్తున్నారు. ఊరి బావుల్ని ఉపయోగించనివ్వడం లేదు. అంచేత రాబోయే భారత జాతీయ కాంగ్రెస్ సమావేశం ఈ దళిత వర్గాలపై మతం, ఆచారం రుద్దిన ఆంక్షలని తొలగించాల్సిన అవసరాన్ని, న్యాయాన్ని ఉద్ఘాటిస్తూ ఒక ప్రత్యేకమైన ఖచ్చితమైన తీర్మానాన్ని ఆమోదించాలి. ఈ మేరకు కాంగ్రెసును కోరడానికి ఈ బహిరంగ సమావేశం అధ్యక్షుడికి అధికారాన్నిస్తున్నాం. ఈ ఆంక్షలు మౌలికంగా సమాజపరమైనవి. కాని ఇవి చట్టపరం కాదు, ఆచరణలోను రాజకీయమైన ఆంక్షలుగా రూపొందుతున్నాయి. అంచేత న్యాయంగా ఇవి భారత జాతీయ కాంగ్రెస్ రాజకీయ, ప్రచార, లక్ష్యాల పరిధిలోకే వస్తాయి."

"ఆరవ తీర్మానం, అంటరాని వారు, దళితులు తప్ప మిగిలిన హిందువులందరిని, ముఖ్యంగా రాజకీయ హక్కుల్ని కోరుతున్న అగ్రవర్ణాలను ప్రార్థించే దేమిటంటే వారి దేశంలో వారి ఎన్నోబాధలకు గురి అవుతున్న దళిత వర్గాల వారు అనుభవిస్తున్న దుర్గతిని నిర్మూలించడానికి చర్యలు తీసుకోవాలి."

మొదటి సమావేశం జరిగిన దాదాపు ఒక వారం రోజుల్లో, నవంబరు 1917లో రెండవ సమావేశం జరిగింది . బ్రాహ్మణేతర పార్టీ (Non _ Brahmin Party) నాయకుడైన ఒక బాపూజీ నామ్ దేవ్ బగాడే అనే ఆయన అధ్యక్షుడు. ఈ సమావేశంలో ఈ క్రింది తీర్మానాల్ని[1] ఏకగ్రీవంగా ఆమోదించారు.

"(1) బ్రిటిష్ సింహాసనానికి విధేయులుగా ఉంటామని తీర్మానం."

"(2) 11 నవంబరు 1917 న జరిగిన సభలో అత్యధిక మెజారిటితో ఆమోదించారని చెప్పిన కాంగ్రెసు-లీగ్ పథకాన్ని ఈ సమావేశం ఆమోదించదు."

"(3) అన్ని వర్గాలు, ముఖ్యంగా దళిత వర్గాలు దేశ అధికారనిర్వహణలో పూర్తిగా పాల్గొనగలిగే వరకూ భారత దేశంలో అధికారం పూర్తిగా బ్రిటిష్ వారి అధీనంలోనే ఉండాలని ఈ సభ ఉద్దేశం."

"(4) బ్రిటిష్ ప్రభుత్వం భారత ప్రజలకి రాజకీయమైన రాయితీలు ఇవ్వదలుచుకుంటే, వివిధ శాసనసభల్లో, అంటరాని వారు, రాజకీయ పౌరహక్కుల్ని అనుభవించడానికి వీలుగా, వారి ప్రతినిధులుగా అంటరాని వారే ఉండేలా చూడాలి."

1. భారతవైస్రాయికి, రైట్ ఆనరబుల్ ది సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియాకి సమర్పించిన పత్రాలు (1918) పార్లమెంటరీ పేపర్ సిడి. 9178, 74-75 పేజీలు.

2. ఐబిడ్ పే. 75.

"(5) బహిష్కృత భారత సమాజం (Depressed India Association) ఆశయాల్ని ఈ సమావేశం ఆమోదిస్తుంది. మాంటేగు వద్దకు ఆ సమాజం ప్రతినిధి వర్గాన్ని పంపడాన్ని కూడా సమర్ధిస్తుంది."

"(6) దళిత వర్గాల ప్రత్యేక అవసరాల దృష్ట్యా ప్రభుత్వం ప్రాధమిక విద్యను ఉచితము నిర్బంధమూ చెయ్యాలని ఈ సభ ప్రార్థిస్తోంది. ప్రభుత్వం దళిత వర్గ విద్యార్థులకు స్కాలర్‌షిప్‌ల వంటి ప్రత్యేక సౌకర్యాలను సమకూర్చాలని కూడా ఈ సమావేశం కోరుతోంది."

"(7) ఈ తీర్మానాలను వైస్రాయికి, బొంబాయి ప్రభుత్వానికి పంపడానికి ఈ అధ్యక్షుడిని అనుమతిస్తోంది."

సర్ నారాయణ్ చందావర్కర్ అధ్యక్షతన బొంబాయిలో జరిగిన దళిత వర్గాల సమావేశం ఆమోదించిన తీర్మానానికి 1917 లో జరిగిన రాజకీయ సంఘటనల్ని పరిశీలిస్తే ఈ అవినాభావసంబంధం సులువుగా అర్ధమవుతుంది. మనం జ్ఞాపకం చేసుకోవాల్సిందేమిటంటే 1917 లోనే ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే ఆగస్టు 20, 1917 న అప్పటి సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా అయిన మాంటేగు కామన్సు సభలో మహా ఘనత వహించిన బ్రిటిష్ రాజుగారి ప్రభుత్వం భారతదేశం పట్ల రూపొందించిన కొత్త విధానాన్ని ప్రకటించారు. అదేమిటంటే "బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగా భారత దేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి క్రమంగా స్వయం పాలనా సంస్థల్ని నెలకొల్పే విధానం." ముఖ్యమైన భారత రాజకీయవాదులు బ్రిటిష్ ప్రభుత్వం ఏదో అటువంటి విధానాన్ని ప్రకటిస్తుందని ఎదురుచూస్తున్నారు. ఆ ప్రకటనకు ముందుగానే రాజ్యాంగ నిర్వహణలో మార్పులను సూచిస్తు పథకాలను రూపొందించడానికి తయారవుతున్నారు. అలా రూపొందించిన పథకాలలో, రెండింటి విషయంలో ప్రజల దృష్టి కేంద్రీకృతమైఉంది. ఒక దాని పేరు "పంధొమ్మిది మంది రూపొందించిన పథకం." రెండో దానిపేరు "కాంగ్రెసు లీగ్‌పథకం". మొదటిది అప్పటి ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ఎన్నికైన 19 మంది ఎడిషనల్ సభ్యులు రూపొందించింది. రెండోది కాంగ్రెసులీగ్ సమర్థించి, వారందరూ అంగీకరించిన రాజకీయ సంస్కరణల పథకం. దీన్ని లక్నో అంగీకారం (Luckunow pact) అని కూడా అంటారు. మాంటేగు ఇంకో ఏడాదిలో ఈ ప్రకటన చేస్తాడనగా, అంటే 1916లో ఈ రెండు పథకాలు రూపొందాయి. ఈ రెండు పథకాల్లోనూ తన పథకాన్నే బ్రిటిష్ ప్రభుత్వం (His Majesty's Government) అంగీకరించాలని కాంగ్రెస్ ఉబలాటం. ఆ ఉద్దేశంతో కాంగ్రెసు లీగ్ పథకాన్ని జాతి అంతటి డిమాండుగా దానికి స్థాయిని, రూపాన్ని కల్పించాలని కాంగ్రెసు సంకల్పించింది. భారతదేశంలోని అన్ని వర్గాల అంగీకారం దీనివెనుక ఉంటేనే అది సాధ్యమౌతుంది. ముస్లింలీగ్ సమర్ధించింది కనుక వేరే ముస్లింవర్గాల అంగీకారం అనే సమస్య రాదు. సంఖ్యాబలం దృష్ట్యా, తర్వాత వచ్చేది

దళిత వర్గాలే. ముస్లింలంత సంఘటితం కాకపోయినా, వారు కూడా రాజకీయంగా చైతన్యవంతులేనని వారామోదించిన తీర్మానాలవల్ల తెలుస్తుంది. రాజకీయంగా చైతన్యవంతులవడమే కాదు మొదటి నుంచీ వారు కాంగ్రెసు వ్యతిరేకులు. నిజానికి 1895 లో కాంగ్రెసు పెండాల్‌ని సాంఘిక సంస్థనివారి సాంఘిక రుగ్మతల్ని బట్టబయలు చెయ్యడానికి ఉపయోగించనిస్తే ఆ పెండాల్‌ని తగలెట్టేస్తామని తిలక్ అనుయాయులు బెదిరించినప్పుడు కాంగ్రెసుకు వ్యతిరేకంగా అంటరానివారు నిరసన ప్రకటించడమే కాకుండా, కాంగ్రెసు దిష్టిబొమ్మను తగలబెట్టారు. అప్పటి నుంచి ఈ కాంగ్రెసుకు వ్యతిరేకత వ్యక్తమౌతూనే ఉంది. 1917 లో బొంబాయిలో జరిగిన దళిత వర్గాల రెండు సమావేశాలను పరిశీలిస్తే, ఈ వర్గాలకు కాంగ్రెసు పట్ల ఉన్న వ్యతిరేకతకు కావల్సినంత రుజువు దొరుకుతుంది. కాంగ్రెసు-లీగ్ సంస్కరణలకు దళితవర్గాల సమర్థనకోసం ఎంత ఉవ్విళ్లూరుతున్నా అది సాధ్యంకాదని కాంగ్రెసుకు బాగా తెలుసు. ప్రజల్ని భ్రష్టుపట్టించే కళ కాంగ్రెసుకు ఇప్పుడు తెలిసినంతగా అప్పుడు తెలీదు కనక కాంగ్రెసు మాజీ అధ్యక్షుడు, కీర్తిశేషుడు సర్ నారాయణ్ చందావర్కర్ సహాయాన్ని తీసుకుంది. దళిత వర్గాల కమిషన్ సొసైటి అధ్యక్షుడిగా ఆయనకు దళిత వర్గాలలో పలుకుబడి బాగానే ఉంది. ఆ పలుకుబడి, ఆయన పట్ల ఉన్న గౌరవం మూలంగా, దళిత వర్గాలలో కొంత మంది కాంగ్రెసు-లీగ్ పథకాన్ని సమర్థించడానికి ఒప్పుకున్నారు.

కాంగ్రెసులీగ్ పథకానికి అవధుల్లేని పూర్తి మద్దతును ఇవ్వడంలేదని తీర్మానం పాఠాన్ని చదివితే తెలుస్తుంది. దాంట్లో అంటరాని వారిపై ఉన్న సాంఘిక అవరోధాలను నిర్మూలించే తీర్మానాన్ని కాంగ్రెసు ఆమోదిస్తేనే ఆ పథకానికి మద్దతునిస్తామని అన్నారు. సర్ నారాయణ్ చందావర్కర్ ద్వారా దళిత వర్గాల వారితో చేసుకున్న ఒప్పందాన్ని అమలు చెయ్యడంలో భాగంగానే కాంగ్రెసు ఈ తీర్మానాన్ని చేసింది.

దీనివల్ల దళిత వర్గాల గురించి 1917 లో కాంగ్రెసు చేసిన తీర్మానం పుట్టు పూర్వోత్తరాలు, దానికి సర్ నారాయణ్ చందావర్కర్ అధ్యక్షతన దళిత వర్గాలు చేసిన తీర్మానానికిగల సంబంధమూ అర్థమౌతాయి. దీనివల్ల కాంగ్రెసు ఇలా తీర్మానం చెయ్యడంలో దురుద్దేశ్యం ఉన్నట్లు నిరూపణ అయిపోయింది. దీనివెనుక అతి లౌకికమైన ఆధ్యాత్మికమైన భావన ఏమీ లేదు. అది కేవలం రాజకీయమైనదే.

కాంగ్రెసు తీర్మానం ఏమైనట్లు? దళిత వర్గాలు వారి తీర్మానంలో "హిందువులందరూ ముఖ్యంగా రాజకీయ హక్కుల్ని కోరుతున్న అగ్రవర్ణాలు, వారిదేశంలోనే ఎన్నో బాధలకు గురి అవుతున్న దళిత వర్గాల వారు అనుభవిస్తున్న దుర్గతిని నిర్మూలించడానికిచర్యలుతీసుకోవాలి." అని పిలుపు నిచ్చారు. దళితుల ఈ డిమాండును అమలు చెయ్యడానికి కాంగ్రెసు ఏం చేసింది? కాంగ్రెసుకు అందిన మద్దతుకు స్పందనగా, తన తీర్మానంలో పేర్కొన్న భావాల అమలు కోసం, అంటరాని తనానికి వ్యతిరేకంగా

కాంగ్రెసు ఒక ఉద్యమాన్ని చేపట్టాల్సిఉంది. కాంగ్రెసు ఏమీ చెయ్యలేదు. తీర్మానాన్ని ఆమోదించడం కేవలం హృదయంలేని చర్య మాత్రమే. కాంగ్రెసు-లీగ్ పథకానికి మద్దతునివ్వడానికి దళిత వర్గాలు పెట్టిన నిబంధనను అమలు చెయ్యడానికి కాంగ్రెసు తీసుకున్నది లాంఛనప్రాయమైన చర్య మాత్రమే. అంటరానితనం అనేది, మానవుడు తోటిమానవుని పట్ల చూపిన అమానుషత్వం. దీని పట్ల కాంగ్రెసు వారి ఆత్మ క్షోభించినట్లుగాని, ఈ దారుణం పట్ల వారి మనసులు క్రోధంతో నిండిపోయాయని అనడానికి గాని ఏమీ దాఖలాలు లేవు. ఆ తీర్మానం ఆమోదించిన రోజునే దాని గురించి మరిచిపోయారు. కేవలం వృధా ప్రయాస ఆ తీర్మానం. దాని వల్ల ఒరిగిందేమీ లేదు.

అలా, అంటరాని వారికి కాంగ్రెసు ఏం ఒరగదీసిందన్న చరిత్రలో మొదటి అధ్యాయం ముగిసింది.

*

## అధ్యాయం II

# అల్ప ప్రదర్శన

## కాంగ్రెసు తన పథకాన్ని విడిచిపెట్టింది

### I

గాంధీ భారత రాజకీయాల్లో 1919 లో ప్రవేశించారు. తర్వాత కొద్ది కాలనికే ఆయన కాంగ్రెసును వశం చేసుకున్నారు. వశం చేసుకోవడమే కాదు క్షాళన చేసి దాన్ని గుర్తు పట్టలేనంతగా మార్చేశారు. ఆయన మూడు ప్రధానమైన మార్పుల్ని ప్రవేశపెట్టారు. పాత కాంగ్రెసుకు కార్యాచరణ అనేది ఏమీ ఉండేదికాదు. తీర్మానాల్ని ఆమోదించి వాటిని అలా వదిలివేసేది. బ్రిటిష్ ప్రభుత్వం వాటిపై ఏదో ఒక చర్య తీసుకుంటుందని ఆశించేది. బ్రిటిష్ ప్రభుత్వం ఏమీ చెయ్యకపోతే అదే తీర్మానాన్ని సంవత్సరం తర్వాత సంవత్సరం తిరిగి ఆమోదించేది. పాత కాంగ్రెసు కేవలం మేధావుల సమ్మేళనం. అది ప్రజలదగ్గరకు వెళ్ళి రాజకీయ ఉద్యమంలో వారు చురుకుగా పాల్గొనేలా చెయ్యలేక పోయింది. ఎందుకంటే దానికి ప్రజాఉద్యమాల్లో నమ్మకం లేదు. ప్రజాందోళన చేపట్టడానికి దానికి యంత్రాంగంగాని ధనంగాని లేవు. తన శక్తి ఇంత పెద్దదని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించేలా చెయ్యడానికి గాని, ప్రజాబాహుళ్యంలో ఆలోచన రేపి, ఆకర్షించడానికిగాని, పెద్ద ఎత్తున రాజకీయ చర్యలు చేపట్టడంలోగాని దానికి నమ్మకంలేదు. దీన్ని అంతా కొత్త కాంగ్రెసు మార్చేసింది.

వాళ్ళు వీళ్ళు అనకుండా అందరికి దానిలో సభ్యత్వం ఇచ్చి కాంగ్రెసును ఒక ప్రజాసంస్థగా చేసింది. ఏడాదికి నాలుగు అణాలిస్తే కాంగ్రెసు సభ్యుడు కావచ్చు. తన తీర్మానాలపై సహాయనిరాకరణ, శాసనోల్లంఘన విధానాలను అనుసరించి ఒక కార్యాచరణ రూపొందించింది. సహాయనిరాకరణ, శాసనోల్లంఘనాన్ని ప్రదర్శించి జైలుకి వెళ్ళడానికి తయారయ్యే విధానాన్ని పాటించింది. దేశ వ్యాప్తంగా సంస్థను నెలకొల్పి కాంగ్రెసు పక్షాన ప్రచారాన్ని నిర్వహించింది. సమాజక్షాళనకి నిర్మాణకార్యక్రమం అనేదాన్ని చేపట్టింది. ఈ కార్యక్రమాల కోసం ఒక కోటి రూపాయల నిధిని సేకరించడానికి సమకట్టింది. దీనికి తిలక్ స్వరాజ్ నిధి అని పేరు పెట్టారు. ఆ విధంగా 1922 నాటికి గాంధి కాంగ్రెసును పూర్తిగా మార్చివేశారు. పేరులో తప్ప మిగిలిన అన్నిటిలోనూ కొత్త కాంగ్రెసు పాత కాంగ్రెసుకంటే పూర్తిగా భిన్నమైంది.

సమాజాన్ని బాగు చెయ్యడానికి చేపట్టిన నిర్మాణ కార్యక్రమం కాంగ్రెసులో ఒక ముఖ్య భాగం. బార్డోలిలో ఫిబ్రవరి 1922 లో జరిగిన కాంగ్రెసు కార్యాచరణ సంఘం (Working committee) సమావేశంలో దీన్ని రూపొందించారు. దాన్ని బార్డోలి కార్యక్రమం అని కూడా అంటారు. ఈ కార్యక్రమం వివరాల్ని ఇచ్చిన తీర్మానం ఇలా ఉంది :—

ఈ క్రింది కార్యక్రమాల్లో కాంగ్రెసు శాఖలన్నీ పాల్గొనాలని కార్యాచరణ సంఘం పిలుపునిస్తోంది :—

(1) కనీసం ఒక కోటి మంది సభ్యుల్ని చేర్పించాలి.

* * *

(2) చరఖాని ప్రజామోదయోగ్యం చెయ్యాలి. చేత్తో వడికి, చేత్తో నేసిన ఖద్దరు తయారీకి చర్యలు తీసుకోవాలి.

* * *

(3) జాతీయ పాఠశాలల్ని నెలకొల్పాలి.

* * *

(4) దళిత వర్గాల జీవన విధానం మెరుగు పడేందుకు చర్యలు తీసుకోవాలి. వారి సాంఘిక, మానసిక, నైతిక స్థితిని బాగు చేయాలి. వారి పిల్లల్ని జాతీయ పాఠశాలలకు పంపడానికి ప్రోత్సహించాలి. ఇతర ప్రజలకు అందుబాటులో ఉన్నవన్నీ వారికి కూడా అందచేయాలి.

* * *

(5) ఇంటింటికీ తిరిగి మద్యానికి అలవాటుపడ్డ వారిమధ్య మద్యపానాన్ని మానాల్సిన అవసరాన్ని తెలియచెప్పాలి. పికెటింగ్ చెయ్యడంకంటే ఈ దురలవాటున్న వారి ఇళ్ళ దగ్గరే దాని గురించి తెలియచెప్పాలి.

* * *

(6) అన్ని తగాదాల్ని ప్రయివేటు గానే పరిష్కరించుకోడానికి వీలుగా గ్రామ, పట్టణ పంచాయితీల్ని నెలకొల్పాలి. పంచాయితీలు ఇచ్చిన పరిష్కారం ఆమోదం పొందడానికి ప్రజాభిప్రాయం బలం మీద, పంచాయితీల సత్యపాలన మీద మాత్రమే ఆధారపడాలి.

* * *

(7) అన్నీ వర్గాల, జాతుల మధ్య ఐక్యతను, సుహృద్భావాన్ని పెంపొందించాలి. సహాయ నిరాకరణోద్యమం ఉద్దేశం కూడా ఇదే. దీనికోసం ఏవిధమైన భేద భావం చూపకుండా అనారోగ్యంగా ఉన్నవారిని ఏక్సిడెంటు అయి బాధ పడ్డవారిని ఆదుకోడానికి ఒక సాంఘిక సేవా శాఖను ఏర్పరచాలి.

* * *

(8) తిలక్ స్మారక స్వరాజ్య నిధికి వసూళ్ళు కొనసాగించాలి. ప్రతి కాంగ్రెసు సభ్యునీ, కాంగ్రెసు అభిమానీ 1921 సాంవత్సరిక ఆదాయంలో 100వ వంతు ఇవ్వాలని పిలుపునివ్వాలి. తిలక్ స్మారక స్వరాజ్యనిధి ఆదాయం నుంచి ప్రతి రాష్ట్రమూ, ప్రతి నెలా 25 శాతాన్ని అఖిల భారత కాంగ్రెసు కమిటీకి పంపాలి.

* * *

ఢిల్లీలో1922 ఫిబ్రవరి 20న జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం ముందు ఈ తీర్మానాన్ని ఆమోదానికి పెట్టింది. దాన్ని ఆమోదించారు. ఈ నిర్మాణ కార్యక్రమంలోని వివిధ అంశాలవిషయంలో అక్కడేం జరిగిందన్నది నాకనవసరం. నాకవసరం ఉన్నది ఒక్క విషయం మాత్రమే. అదేమిటంటే, దళిత వర్గాలకు సంబంధించిన అంశం. దాని గురించి నేనిప్పుడు ప్రస్తావిస్తాను.

అంటరాని వారికి సంబంధించిన బార్డోలీ తీర్మానానికి ఏం గతి పట్టిందో అంచెలంచెలుగా ఆ వధని నేను వివరిస్తాను. ఆ కథాక్రమంబెట్టిదనిన, అఖిల భారత కాంగ్రెసు కమిటి బార్డోలీ తీర్మానానికి ఆమోదం తెలిపాక దాన్ని నిర్వర్తించడానికి వర్కింగ్ కమిటీకి నివేదించారు. లక్నోలో 1922 జూన్‌లో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో ఆ విషయాన్ని చేపట్టారు. బార్డోలీ తీర్మానంలో అంటరాని వారి ఉద్దరణకు సంబంధించిన సమస్యపై వర్కింగ్ కమిటీ ఈ తీర్మావాన్ని ఆమోదించింది:-

"దేశవ్యాప్తంగా అంటరానివారు అనబడే వారి స్థితిగతుల్ని బాగు చేయడానికి ఆచరణయోగ్యమైన కార్యక్రమాన్ని చేపట్టడానికి ఒక పథకాన్ని రూపొందిచడానికి స్వామి శ్రద్ధానంద, శ్రీమతి సరోజిని నాయుడు, సర్వశ్రీ ఐ.కె. యాజ్ఞిక్, జి.బి. దేశ్‌పాండేలతో ఒక కమిటీని ఈ వర్కింగ్ కమిటీ ఏర్పాటు చేస్తోంది. ఈ పథకాన్ని పరిశీలించడానికి రాబోయే వర్కింగ్ కమిటీ సమావేశం ముందుంచాలి. ప్రస్తుతానికి, ఈ పథకానికి 2 లక్షల రూపాయలు సేకరించాలి."

లక్నోలో జూన్ 1922 లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో ఈ వర్కింగ్ కమిటీ తీర్మానాన్ని చర్చించారు. తీర్మానంలోని 2 లక్షల రూపాయలకు బదులు, ప్రస్తుతానికి ఈ పథకానికి 5 లక్షల రూపాయలు సేకరించాలి " అన్న సవరణతో ఈ వర్కింగ్ కమిటీ తీర్మానాన్ని ఆ సమావేశం ఆమోదించింది.

ఆ కమిటీని వేస్తూ చేసిన తీర్మానాన్ని వర్కింగ్ కమిటీ ఆమోదించే ముందు ఆ కమిటీ సభ్యులలో ఒకరయిన స్వామి శ్రద్ధానంద్‌జి తన సభ్యత్వానికి రాజీనామా చేశారట. ఈ కమిటీ ఏర్పాటుకు ఆమోదం తెలిపిన వర్కింగ్ కమిటీ సమావేశంలోనే, ఇదే విషయం మీద, ఇంకో తీర్మానాన్ని ఆమోదించారు. అదేమిటంటే :—

"దళిత వర్గాల విషయంలో పథకాన్ని రూపొందించే ముందు ఎడ్వాన్సుగా కొంత ధనం కావాలని అడుగుతూ స్వామి శ్రద్ధానందజీ జూన్ 8, 1922 న రాసిన ఉత్తరం చదవండి. ఈ విషయంలో ఏర్పాటు చేసిన ఉపసంఘానికి శ్రీ గంగాధరరావు బి. దేశ్‌పాండేని సమావేశకర్తగా నియమిస్తూ తీర్మానించడమైనది. త్వరలో సమావేశాన్ని ఏర్పాటు చెయ్యాలని ఆయన్ని కోరాలి. స్వామి శ్రద్ధానందజి ఉత్తరాన్ని ఆ ఉపసంఘానికి నివేదించాలి."

ఆసక్తికరమైన ఈ తీర్మానం, చరిత్రలో ఈ కమిటీని ఏర్పాటు చెయ్యడం రెండో అంచె.

ఈ కమిటీని నియమిస్తూ చేసిన తీర్మానం గురించి తిరిగి ఉటంకించడం జూలై 1922 లో బొంబాయిలో జరిగిన కాంగ్రెసు వర్కింగ్ కమిటీ చర్చల వివరాల్లో కనిపిస్తుంది. ఆ సమావేశంలో ఆ కమిటీ ఈ తీర్మానాన్ని ఆమోదించింది.

"తన రాజీనామాను పునఃపరిశీలించి ఉపసంహరించుకోమని స్వామి శ్రద్ధానంద్‌ని అభ్యర్థించాలని, ప్రధాన కార్యదర్శిని కోరాలి. కంటింజెంట్ ఖర్చులకోసం దళిత వర్గాల ఉపసంఘం సమావేశకర్త జీ.బి. దేశ్‌పాండేకి 500 రూపాయలు చెల్లించాలి."

1922వ సంవత్సరానికి సంబంధించినంతవరకూ ఈ విషయం ఇంతటితో ఆఖరయింది. దీని మీద ఇంకేమీ చేసినట్లులేదు. 1923వ సంవత్సరం వచ్చేసింది. అంటరానివారి స్థితిగతుల్ని మెరుగు పరచడానికి ఏమీ చెయ్యలేరన్న విషయాన్ని గమనించి, గయలో జనవరి 23,1923 న సమావేశమైన వర్కింగ్ కమిటీ, ఈ విషయాన్నిపరిశీలించి ఇలా తీర్మానించింది :—

"స్వామి శ్రద్ధానంద్ రాజీనామా విషయంలో, దళిత వర్గాల ఉపసంఘంలోని మిగిలిన సభ్యులు కమిటీగా ఏర్పడాలని తీర్మానించడమైనది. యాజ్ఞిక్ సమావేశకర్తగా ఉంటారు."

ఆ తర్వాత 1923 మే లో బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం ఈతీర్మానాన్ని ఆమోదించింది:—

"అంటరానివారి పరిస్థితుల సమస్యమీద, తగు చర్యతీసుకోడానికి వర్కింగ్ కమిటీకి నివేదించాలని తీర్మానించడమైనది."

అంటరాని వారి సమస్యను ఒక ప్రత్యేక కమిటీకి అప్పగించిన చరిత్రలో రెండో అంచె ఇక్కడ అంతమైంది. బొంబాయిలో 1923 మే లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ ఆమోదించిన తీర్మానంతో దీని చరిత్ర మూడో అధ్యాయం మొదలైంది. ఆ తీర్మానం ఇలా ఉంది.:—

"కాంగ్రెసు విధానానికి స్పందనగా అంటరాని వారు అనబడే వారి పట్ల ప్రవర్తన కొంత మెరుగైనప్పటికీ, ఈ విషయంలో చెయ్యాల్సిందిచాలా ఉందనే విషయం ఈ కమిటీ అవగాహనలో ఉంది. అంటరానితనం అనే సమస్య ముఖ్యంగా హిందూ సమాజానికి సంబంధించింది కనక అఖిల భారత హిందూమహాసభ ఈ విషయాన్ని చేపట్టి ఈ దురాచారాన్ని హిందూసమాజంలోంచి తొలగించడానికి పటిష్టమైన చర్యలు చేపట్టవలసిందిగా కోరుతూ తీర్మానించడమైంది."

ఈ దయనీయమైన తీర్మానం కథ ఇలా మొదలై, ఇలా అంతమైంది. అంతగా వెలుగుతూ మొదలైన విషయం ఎంత సిగ్గు చేటుగా అఖరయ్యింది.!

అంటరానివారి సమస్య విషయంలో కాంగ్రెసు తన చేతుల్ని ఎలా కడిగేసుకుందో ద్యోతకమయింది. దీనిని హిందూమహాసభకి అప్పగించేసి కాంగ్రెసు గాయపరచడమే కాకుండా ఆపైన కించపరచిందికూడా. అది అలాచెయ్యకుండా ఉండాల్సింది. అంటరాని వారిని ఉద్ధరించే పని నిర్వహించడానికి హిందూమహాసభ కంటె పనికి మాలిన సంస్థ ఇంకోటి ఉండదు. అంటరాని వారి సమస్యను చేపట్టడానికి ఎంత మాత్రమూ తగని సంస్థ ఏదైనా ఉంటె అధి హిందూమహాసభే. అది హిందూ తీవ్రవాద హిందూ సంస్థ. హిందూ అనే ప్రతివిషయాన్ని, మతపరంగా, సాంస్కృతికంగా, పరిరక్షించడమే దాని ఆశ, ఆశయం.

అది సంఘసంస్కరణ సంస్థకాదు. అది పూర్తిగా రాజకీయ సంస్థ. భారత రాజకీయాలలో ముస్లింల పలుకుబడిని ప్రతిఘటించడమే దాని ప్రధాన ధేయం, ఆశయం. దాని రాజకీయ దారుఢ్యాన్ని రక్షించుకోడానికి, దాని సాంఘిక ఐక్యతని నిలబెట్టుకోవాలనుకుంటుంది. సాంఘిక ఐక్యతని నిలబెట్టుకోవడం అంటె దాని ఉద్దేశం కులాన్ని గురించిగాని అంటరానితనాన్ని గురించిగాని మాట్లాడటం కాదు. అంటరాని వారి సమస్యను చేపట్టడానికి అటువంటి సంస్థను కాంగ్రెసు ఎలా ఎంపిక చేసిందో నా కసలు అర్థం కావటంలేదు.

అంటే కాంగ్రెసు ఒక ఇబ్బందికరమైన సమస్యను ఏదోరకంగా వదిలించుకుని తన చేతులు కడిగేసుకుందన్న మాట. ఈ పనిని చేపట్టడానికి హిందూమహాసభ ముందుకురానే లేదు. ఎందుకంటే ఈ విషయం దానికి పట్టదు. వారికి ఈ పనిచేపట్టాలని పురమాయిస్తూ ఒకఘనమైన తీర్మానాన్ని ఆమోదించిందే గాని, కాంగ్రెసు ఏ విధమైన ఆర్థిక సహాయం చేస్తామని ముందుకు రాకపోవడం కూడా ఒక కారణం. ఆ విధంగా ఈ పథకం ఘోరంగా, ఊరూపేరూ లేకుండా సమసిపోయింది. అంత పెద్దగా ప్రకటించుకున్న, అంటరాని వారి సాంఘిక ఉద్ధరణకు సంబంధించిన పనిని కాంగ్రెసు ఎందుకు విడిచిపెట్టేసింది? ఈ అధ్యాయాన్ని ముగించేముందు ఈ విషయాన్ని తెలుసుకోవడంలో లాభం లేకపోలేదు. ఈ పథకానికి రెండు నుండి ఐదు లక్షల రూపాయల కంటే ఎక్కువ ఖర్చు కాకూడదని కాంగ్రెసు ఉద్దేశించిందా? స్వామిశ్రద్ధానందాని ఈ కమిటీలో సభ్యునిగాజేర్చి తప్పు చేసామనుకుందా? తాము అంగీకరించనూ లేక, తిరస్కరించనూ లేని ఒక బృహత్పథకాన్నిచ్చిన స్వామి శ్రద్ధానంద్ వల్ల వాళ్ళకు ఇబ్బంది కలిగిందా? కాంగ్రెసు మొదట్లో ఆయన్ని సమావేశకర్త[1] (Convener)గా నియోగించకూడదని అనుకుంది. కాని తర్వాత ఆ కమిటీని రద్దుచేసి ఈ పనిని హిందూమహాసభకే అప్పగించడం నయమనుకుంది. ఇలా నిర్ధారించడానికి తగినన్ని పరిస్థితులు లేకపోలేదు. ఈ స్వామి అంటరానివారి ఉద్ధరణకు ఎంతో ఎక్కువగా, నిజాయితిగా కంకణం కట్టుకున్నవాడు. ఆయన ఆ కమిటీలో సభ్యుడుగా ఉంటే ఒక బృహత్పథకాన్ని తయారుచేసే వాడనడంలో ఎంత మాత్రం సందేహంలేదు. కాంగ్రెసుకి ఆయన ఆ కమిటీలో ఉండడం ఇష్టంలేదు. అంటరాని వారికోసం కాంగ్రెసు ఎక్కువగా నిధులు కేటాయించాలని, ఆయన డిమాండు చేస్తారని భయపడింది. ఆయనకు అప్పటి కాంగ్రెసు ప్రధానకార్యదర్శి పండిత మోతీలాల్ నెహ్రూకు మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు[2] చూస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. వీటిని అనుబంధంలో ప్రచురించాము. ఈ నిర్ధారణే సరియైనది అయితే కాంగ్రెసు ఆమోదించిన తీర్మానం ఎంతనిజాయితీ రహితమో తెలిసిపోతుంది.

విప్లవాత్మకమైనదని కాంగ్రెసు ఆ తీర్మానాన్ని విడిచి పెట్టేసిందా? ఏ అర్థంలోనూ కూడా అది విప్లవాత్మకమైన తీర్మానం కాదు. ఆ తీర్మానానికి అనుబంధంగా వర్కింగ్

1. దేశ్ పాండేనే సమావేశకర్తగా నియమించడం వల్ల ఈ పనిని పూర్తిగా స్వామి శ్రద్ధానంద్‌కు విడిచిపెట్టకూడదని కాంగ్రెసు భావించినట్లు అర్థమైపోతుంది. దేశ్‌పాండేను ఎంపిక చెయ్యడంవల్ల వాళ్ళు ఈ విషయంలో ఏమీ చెయ్యడానికి ఇష్టంలేనట్లు తెలిసిపోతుంది. ఎందుకంటే దేశ్ పాండే సనాతనాచారపరుడైన బ్రాహ్మణుడు. ఆయన అంటరానివారి శ్రేయస్సు విషయంలో ఏ విధమైన శ్రద్ధాచూపలేదు.

2. అనుబంధం ?

కమిటీ తయారుచేసిన నోట్ చూస్తే ఇది తేటతెల్లమౌతుంది. దాన్ని అఖిల భారత కాంగ్రెసు కమిటీ ఆమోదించింది. దాంట్లో ఇలా ఉంది :—

"అందుచేత అంటరానివారి పట్ల దురభిప్రాయం ఇంకా బలంగా ఉన్నచోట్ల కాంగ్రెసు నిధులు వెచ్చించి ప్రత్యేక పాఠశాలలను ప్రత్యేక బావుల్ని ఉండనివ్వాలి. అయితే పిల్లల్ని ఎక్కువగా జాతీయ పాఠశాలల్లో చేర్చేలాగా, అంటరాని వారి సామూహిక బావులను ఉపయోగించనిచ్చేలా ప్రజల్ని ఉద్బోధించాలి."

కాంగ్రెసు, అంటరానితనాన్ని నిషేధించడానికి తయారుగా లేదనేది స్పష్టం. ప్రత్యేక పాఠశాలలు, ప్రత్యేక బావులు ఉండడానికి అది అంగీకరించింది. ఆ తీర్మానం అంటరానివారి స్థితిగతుల్ని మెరుగుపరచడానికి సమకట్టడం కంటే ఎక్కువేమీ చెయ్యాలనుకోలేదు. భయం భయంగా తలపెట్టిన ఇంత మాత్రం కార్యక్రమాన్ని కూడా అది అమలు పరచలేకపోయింది. ఏ విధమైన పశ్చాత్తాపమూ, సిగ్గూ లేకుండా ఆ కార్యక్రమాన్ని విడిచిపెట్టేసింది.

# II

కాంగ్రెసు ఈ కార్యక్రమాన్ని నిధులకొరతవల్ల విడిచిపెట్టేసిందా? కానే కాదు, కాంగ్రెసు 1921లో తిలక్ స్వరాజ్య నిధిని ప్రారంభించింది. కాంగ్రెసు ఎంత ధనాన్ని సేకరించింది కింద ఇచ్చిన పట్టిక వల్ల మనకి ఒక అవగాహన ఏర్పడుతుంది. ఒక కోటి, ముప్పయి లక్షల రూపాయల్ని ప్రజలు విరాళంగా ఇచ్చారు. కాంగ్రెసు ప్రచారం నిర్వహించడానికి, బార్డోలీలో వర్కింగ్ కమిటీ తయారుచేసిన నిర్మాణ కార్యక్రమానికి, ఈ నిధిని సేకరించారు. ఇంత పెద్ద మొత్తాన్ని కాంగ్రెసు ఎలా ఖర్చు పెట్టింది? కాంగ్రెసు వర్కింగ్ కమిటీ 1921, 1922, 1923 సంవత్సరాల్లో వోటు చేసిన గ్రాంట్ల పట్టీని పరిశీలిస్తే, ఈ డబ్బుని ఎలా ఖర్చు పెట్టారన్న విషయంలో ఒక అవగాహన ఏర్పడుతుంది.

## పట్టిక I

## తిలక్ స్వరాజ్యనిధి వసూళ్ళు

| | 1921 | 1922 | 1923 | మొత్తం |
|---|---|---|---|---|
| | రూ. అ. పె | రూ. అ. పె | రూ. అ. పె | రూ. అ. పె |
| సాధారణ వసూళ్లు అనుబంధం నం. I (Annexure No.I) | 64,31,779-15-10 | 3,92,430-2-61/2 | 2,64,288-9-1 | 70,88,498-11-51/2 |
| ప్రత్యేక (కేటాయించిన) విరాళాలు లేక గ్రాంట్లు- అనుబంధం నె. II | 37,32,230-2-101/2 | 9,45,552-1-41/2 | 7,10,801-10-3 | 53,88,583-14-6 |
| | 1,01,64,010-2-81/2 | 13,37,982-3-11 | 9,75,090-3-4 | 1,24,77,082-2-111/2 |
| కలపవలసినవి చిల్లరవసూళ్ళు, వడ్డీ, ఇతర నిధులు, కరువు, వరదలు, రాష్ట్ర ప్రభుత్వం, ప్రతినిధులు, అనుబంధం (Affiliation) మొదలైనవి. 1921-23 కి.. | | | | 5.42,332-5-7 1/2 |
| | | | | 1,30,19,415-15-7 |

ది ఇండియన్ ఏన్యూవల్ రిజిస్టర్ 1923- పేజి 112.

**I . 1921లో వోటు చేసిన గ్రాంటు:**

కలకత్తాలో 1921జనవరి 31, ఫిబ్రవరి 1, 2, 3, తేదీల్లో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు :-

1. రూ. 1,00,000 మహాత్మాగాంధీ అధీనంలో వుంటాయి. ప్రాక్టీసు విడిచిపెట్టేసిన లాయర్ల సహాయార్థం, సహాయం కావలసినవారికి (IV)

1. రూ. 1,00,000 మహాత్మాగాంధీ అధీనంలో వుంటాయి. ప్రాక్టీసు విడిచిపెట్టేసిన లాయర్ల సహాయార్థం, సహాయం కావలసినవారికి (IV)

2. రాజగోపాలా చారియార్ దగ్గర నుంచి 31, జనవరి, 1921 తారీఖుతో వచ్చిన టెలిగ్రాం చదవండి :-

"సమావేశానికి హాజరు కాలేనందుకు విచారిస్తున్నాను. 100 మంది పనికి పూర్తిగా అంకితమైన (Full-time) వర్కర్లను తమిళలో, కేరళలో, కర్నాటక కొన్ని ప్రాంతాలలో పని చెయ్యడానికి ఎంపిక చేశాము. వీరిలో దాదాపు 40 మంది లాయర్లు ప్రాక్టీసు విడిచిపెట్టేసినవారు. తిలక్ నిధికి వసూళ్ళు చేసే లోపుగా నెలకు రు. 5600 లు శాంక్షన్ చెయ్యండి. పత్రికలు వార్తలు ప్రచురించక పోయినా విద్యార్థుల ఉద్యమం త్వరితంగా పెరుగుతోంది. కనీసం రెణ్ణెళ్ల పాటు తల్లి దండ్రులు వ్యతిరేకిస్తున్నా దీన్ని కొనసాగించాలి. దీనికోసం నెలకు మూడు వేల రూపాయల్ని తీసుకోవాలి. స్వరాజ్యనిధి వసూళ్ళను కాంగ్రెసు పేరుతో వీలుగా ఉండే ఖిలాఫత్ వసూళ్ళ వంటి డినామినేషన్లలో పంపండి. ప్రతి గ్రాంటు తర్వాత బ్రాకెట్లలో వేసిన రోమను అంకెలు వర్కింగ్ కమిటీ గ్రాంటు ఇచ్చిన తీర్మానం అంకెను తెలుపుతాయి. దీనికి వర్కింగ్ కమిటీ అనుమతి (Authority) నిస్తూ టెలిగ్రాం పంపండి. మూడు నెలల్లో మాకు ఎడ్వాన్సుగా ఇచ్చిన ధనాన్ని భర్తీ చెయ్యగలమని నమ్మకం ఉంది. మద్రాసు నుంచి పెద్ద మొత్తాల్లో ధనం ఆశించకండి."

**ii. బెజవాడలో 1921 మార్చి 31న, ఏప్రిల్ 1 న జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో అది వోటు చేసిన గ్రాంట్లు :-**

3. ప్రచార కార్యక్రమానికి, నిధివసూళ్ళకీ యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కార్యదర్శి పండిత్ మోహన్‌లాల్ నెహ్రూకి 6,000 రూపాయలు మొత్తంగా ఎడ్వాన్సుగా ఇవ్వాలి (V).

4. ప్రస్తుత సంవత్సరంలో మిగిలిన భాగానికి అధ్యక్షుడు, కార్యదర్శులు, కేషియర్ ఆఫీసు ఖర్చులకోసం 17,000 రూపాయలు శాంక్షన్ చెయ్యాలి. ఈ సొమ్ములోంచి నెలకు 300 రూపాయలచొప్పున సి. రాజగోపాలాచారియార్‌కి ఇవ్వాలి. ఇది ఆయన కార్యదర్శికి అధ్యక్షుడి స్టెనో టైపిస్ట్ కోసం అవసరం (VII).

5. వెయ్యి డాలర్ల మొత్తాన్ని డి.వి.ఎస్.రావు, ఇండియా విభా రూల్ లీగ్ ఆఫ్ అమెరికా, 1,400, బ్రాడ్వే, న్యూయార్కుకు పంపించాలి (VIII).

**III. గ్రాంట్ల కోసం వచ్చిన అభ్యర్థనల్ని పరిశీలించి నిర్ణయాలు తీసుకోడానికి వర్కింగ్ కమిటీ 1921 జూలై 31 న చేసిన తీర్మానం 18 ద్వారా ఒక గ్రాంట్ల ఉపసంఘాన్ని నియమించింది. ఆ ఉప సంఘంలో గాంధీ, పండిత్ మోతీలాల్ నెహ్రూ, సేట్ జమ్నాలాల్ బజాజ్‌లు సభ్యులు, ఆ గ్రాంట్ల ఉపసంఘం అనేక సమావేశాలు జరిపి ఈ కింది గ్రాంట్లను వోటు చేసింది. :—**

6. బీహార్ స్వదేశీ ఉద్యమం పనికోసం 1 లక్ష రూపాయల మొత్తాన్నివ్వాలి. ఇదే పనికోసం 4 లక్షల రూపాయల అప్పు సిఫార్సు చేస్తున్నాం. (I)
7. సి.పి. (హిందూస్తానీ) రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి స్వదేశీ కోసం రూ 35,000 అప్పు మంజూరు (II).
8. యు.పి.లో కరువు నివారణ పనులకు రూ. 25,000, (III).
9. కరువు నివారణ పనులకు, జాగ్రాం స్కూలుకోసం పంజాబ్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రూ. 25,000 (IV).
10. మలబార్‌లో బాధితుల సహాయార్థం టెలిగ్రాం ద్వారా అభ్యర్థన మేరకు రు. 50,000 (V).
11. బెనారస్ సిటిలో గాంధి ఆశ్రమానికి రు. 15,000 (VI).
12. పల్లిపాడు ఆశ్రమానికి రు. 10,000 (VII).
13. మచిలీపట్నం ఆంధ్రజాతీయ కళాశాలకు రు. 15,000 (VIII).
14. కర్జత్ ( మహారాష్ట్ర) తాలూకా కాంగ్రెసు కమిటీ కార్యదర్శికి రు.10,000 (XX).
15. క్లించ్‌వాడ (మహారాష్ట్ర) అనాథ విద్యార్థి గృహానికి రు. 10,000 (X).
16. **(1) శ్రీ కె.జి. పటాడే, సహాయ ప్రధాన కార్యదర్శి, డిప్రెస్డ్ క్లాసెస్ మిషన్ సొసైటి ఆఫ్ ఇండియా, (2) కుల్లడైకురిచి జాతీయ పాఠశాల, విద్యాసంగమ్ (3) రాజమండ్రి డిప్రెస్డ్ క్లాసెస్ మిషన్‌ల అభ్యర్థనలు ఉపసంఘం ఇచ్చిన ఒజ్జల మేరకు లేనందున, వాటిని తిరస్కరించాము (XIII).**
17. ముఖ్యంగా స్వదేశి మీద ఖర్చు పెట్టడానికి, చేతితో వడకడాన్ని, చేతితో నెయ్యడాన్ని ప్రజలలోకి తీసుకువెళ్ళడానికి, కేరళ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు.10,000 (XX).
18. మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు 60,000 (XXII).
19. యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి కేటాయించినది రు. 1,50,000 (XXIII).
20. సింద్ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కి రూ. 63,000 (XXIV).

21. ఆంధ్రలోని దత్తమండలాల్లో కరువు పనులకు రు. 25,000 (XXV).

22. మహారాష్ట్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు. 20,000 (XXVI).

23. స్వదేశీకి, చేతితో వడకడాన్ని, చేతితో నెయ్యడాన్ని ప్రజలలోకి తీసుకు వెళ్ళడానికి గంజాం జిల్లా కాంగ్రెసు కమిటీకి రు. 20,000 (XVII).
వర్కింగ్ కమిటీ 1921 నవంబరు 6, తీర్మానం. నెం. 8 ద్వారా ఉపసంఘాన్ని రద్దు చేసి గ్రాంట్లు ఇచ్చే పనిని చేతుల్లోకి తీసుకుంది.

**IV. ఢిల్లీలో 1921 నవంబరు 3, 5, 6 తేదీల్లో జరిగిన సమావేశంలో ఈ గ్రాంట్లు ఇచ్చింది:-**

24. చేతితో వడికే నూలు, ఖద్దరు తయారీకి ప్రత్తి కొనడానికి అస్సామ్‌కు చెందిన ఫూకన్‌కి రు. 25,000 (IX).

25. ఆంధ్రలోని గుంటూరు జిల్లా కృష్ణాపురానికి రు. 5000 (X).

26. ఆంధ్ర జాతీయ కళాశాలకి రు. 10,000ల అదనపు గ్రాంటు (X).

27. రాజమండ్రి డిప్రెస్డ్ క్లాసెస్ కమిషన్‌కి రు. 1000 (XII).

28. అంగలూరు జాతీయ పరిశ్రమాలయానికి రు. 5000 (XIII).

29. ఆంధ్రలోని కౌతారంకి రు. 3,000 (XIC).

30. సాధారణ స్వదేశీ పనికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు. 15,000 (X°b).

31. మచిలీపట్నం జిల్లా కాంగ్రెసు కమిటీకి రు. 3000 (XVI).

32. చేతితో వడికే నూలు, ఖద్దరు తయారీకి ఉత్కళ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు. 30,000 (XVII).

33. వారి పని మానేసినందుకు ఠాణా జిల్లా కల్లుగీత పనివారి సహాయార్థం రు. 3,000 (XVIII).

34. నాగపూర్ తిలక్ విద్యాలయానికి రు. 5,000 (XIX).

35. నాగపూర్ అసహ్యారోగాశ్రమంకి రు. 5,000 (XX).

36. ఖద్దరు, చరఖా నూలు ఉత్పత్తి పెంచడానికి అజ్మీర్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు. 25,000 (XXI).

37. గుజరాత్‌కి వీలయితే రు. 18,00,000 లేకపోతే కనీసం రు. 10,00,000 (XXII).

38. మలబారులో బాధితుల సహాయార్థం సి. రాజగోపాలాచారియార్‌కి వెంటనే పంపాల్సిన సొమ్ము రు. 40,000 (XXIII).

**V. బొంబాయిలో 1921 నవంబరు 22, 23 తేదీల్లో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు:-**

39. పంజాబ్, రోహతక్‌లోని జాట్ ఆంగ్లో సాంస్కృట్ హైస్కూల్‌కి రు. 10,000 (III)

40. కరువునివారణ, స్వదేశీ పనులను బిజాపూర్ జిల్లా కాంగ్రెసు కమిటీకి రు. 25,000 (iii).

41. మద్రాసులో డిస్మిస్ చేసిన మిల్లు కార్మికులకు స్వదేశీపని ఇవ్వడం ద్వారా సాయం చెయ్యడానికి రు. 30,000 (iii).

**II. 1922లో వోటు చేసిన గ్రాంట్లు**

I బొంబాయిలో 1922 జనవరి 17న జరిగిన సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు:-

42. యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కోరిన రు. 50,000 ఇదివరకే మంజూరు అయ్యాయి. అది స్వదేశీ పని కోసం అదనంగా అడిగిన లక్ష రూపాయల విషయంలో తుది నిర్ణయానికి మహాత్మాగాంధీకి నివేదించాలి. (ii)

43. అస్సాం రాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి శాంక్షను అయిన రు. 50,000ల గ్రాంటులో ఇంకా ఇవ్వాల్సిన రు. 25,000ల విషయంలో తుది నిర్ణయానికి మహాత్మాగాంధీకి నివేదించాలి.(Vi).

**II. 1922 ఫిబ్రవరి 26న ఢిల్లీలో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు:-**

"44. మహాత్మాగాంధీ తయారు చేసిన విదేశీ పథకం కోసం మొట్టమొదటిగా అయ్యే ఖర్చుకి రు. 10,000 (i).

45. ఈ సంవత్సరంలో ఆఫీసు ఖర్చుకి రు. 14, 000 (IV)".

**III. అహమ్మదాబాద్‌లో 1922 మార్చి 17,18 తేదీల్లో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు:-**

"46. ఖద్దరును ఇంకా అధికంగాఉత్పత్తి చేసి అమ్మకం పెంచెయ్యడానికి రు. 3,00,000 (i).

47. యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి ఇప్పటికే మంజూరు చేసిన రు.50,000లలో నుంచి రు. 10,000 (ix).

48. సాధారణ కాంగ్రెసు కార్యక్రమానికి కేరళ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు.5,000; ఈ మొత్తాన్ని మలబారు సహాయానికి కేటాయించిన రు.84,000ల లోంచి మినహాయించాలి. ఇదికాక రు. 20,000 లను కూడా పైన చెప్పిన రు.84,000 లలో నుంచి తీసి సహాయ కార్యక్రమాల కోసం పంపించాలి. ఎబివి

49. రోహతక్ ఆంగ్లో-వర్నాక్యులర్ స్కూలుకి రు. 10,000 (XI)

50. దత్తమండలంలో కరువు పనుల కోసం మంజూరు చేసిన రు.25,000లలోంచి రు.15,000లను ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ప్రతినిధి టి. ప్రకాశానికి చెల్లించాలి (XII).

**IV. కలకత్తాలో 1922 ఏప్రిల్ 20, 21,22 తేదీల్లో** జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో ఓటు చేసిన గ్రాంట్లు:-

**"51. గుజరాత్‌లో దళిత వర్గాలకు విద్య చెప్పడానికి అహమ్మదాబాదులోని అంత్యజ కార్యాలయంకు రు. 5,000 (V).**

52. ప్రత్యేకంగా ఖద్దరు కార్యక్రమానికి వినియోగించేందుకు హైదరాబాద్, దక్కనుకు చెందిన మౌల్వీ బద్రుల్ హసన్‌కి రుణంగా రు. 40,000 (VI).

53. ఇండిపెండెంట్ పత్రికను తిరిగి ప్రారంభించి దాన్ని కాంగ్రెసు పద్ధతిలో నడపడానికి నేషనల్ జర్నల్స్ లిమిటెడ్‌కి రు. 25,000. ఈ కంపెనీ ఆస్తులపై కాంగ్రెసుకు ఈ సొమ్ము మేరకు హక్కు ఉండాలి. (XiX)".

**V. బొంబాయిలో 1922 మే 12, 13, 14, 15 తేదీల్లో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో ఓటు చేసిన గ్రాంట్లు:-**

**"54. ఇదివరకే మంజూరు చేసిన రు. 5,000 కాక అదనంగా మరో రు. 17,381 అహమ్మదాబాద్‌లోని అంత్యజ కార్యాలయానికి (X).**

**55. పంజాబ్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీ షాహదారా డిప్రెస్డ్ క్లాసెస్ సెటిల్‌మెంటు కోసం అడిగిన రు. 1,25,000 విషయంలో ఈ పథకాన్ని ప్రారంభించడానికి స్థానికంగా తగినన్ని నిధుల్ని సమకూర్చారని, అలా ప్రారంభించిన పథకం సరిగా పనిచేస్తోందని, వర్కింగ్ కమిటీకి నమ్మకం కలిగితే తప్ప దాన్ని పరిశీలించడం కుదరదని తీర్మానించడమైంది. (XI).**

**56. అహమ్మద్‌నగర్ దళిత వర్గాల హోంబు కోసం రు. 5,000 కేటాయించాలని తీర్మానించడమైంది. అయితే, ఆ హోంబును స్థానికంగా లభించిన సహాయంతో**

ప్రారంభించారని, అది సరిగా పనిచేస్తోందని, వర్కింగ్ కమిటీకి నమ్మకం కలిగాకే ఆ సొమ్మును విడుదల చెయ్యడానికి సిఫార్సు చెయ్యాలి (XII).

**57. మద్రాసులో దళిత వర్గాల కార్యక్రమాల కోసం ఎస్. శ్రీనివాస్ అయ్యంగార్ అడిగిన రు. 10,000 దానికోసం కేటాయించాలి. అయితే, అప్లికేషను రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ద్వారా పంపాక, ఇదే మొత్తాన్ని స్థానికంగా సమకూర్చారని, ఈ కమిటీకి సంతృప్తి కలిగాకే ఈసొమ్మును చెల్లించాలి (XIII).**

**58. ఆంధ్రలో దళిత వర్గాల కార్యక్రమాలకోసం శ్రీ టి. ప్రకాశానికి రు. 7,000 (XXIV)".**

**.. లక్నోలో 1922 జూన్ 6, 7,10 తేదీల్లో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు :-**

59. సింద్ రాష్ట్రంలో ఖద్దరు కార్యక్రమానికి రు. 50,000 (VIII).

60. సి. రాజగోపాలాచారియార్‌కి కంటిజెంట్ ఖర్చులకోసం రు. 1,000 ఎడ్వాన్సుగా ఇవ్వాలి (VIII).

**I. ఢిల్లీలో 1922 జూన్ 30వ తేదీన జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో వోటు చేసిన గ్రాంట్లు:-**

61. బెంగాల్ నుంచి ఆరుగురు కార్యకర్తలు అస్సాంలో పనిచెయ్యడానికి నెలకు రు.180 చొప్పున రాబోయే 3 నెలలకు ఇవ్వాలి. (vi)"

**III. బొంబాయిలో 1922 జూలై 18,19 తేదీల్లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ వోటు చేసిన గ్రాంట్లు:-**

"62. అస్సాంకి రు. 5,000 (i)

63. ఆంధ్రా ఉత్కళ్‌లలో ఖద్దరు కార్యక్రమానికి చెరో రు. 1,50,000 (x).

**. కలకత్తాలో 1922 నవంబరు 18, 19, 25 తారీఖుల్లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ వోటు చేసిన గ్రాంట్లు:-**

64. గుజరాత్ కి రు. 3,00,000 గ్రాంట్లు (XII).

65. శాసనోల్లంఘన ఎంక్వయిరీ కమిటీ ఖర్చుల కోసం రు. 16,000 (XXI).

**III . 1923లో వోటు చేసిన గ్రాంట్లు**

**గయలో 1923 జనవరి 1, 2 తారీఖుల్లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ వోటు చేసిన గ్రాంట్లు:-**

**"66. అంటరాని తనం తొలగించడానికి, మద్యపానాన్ని మాన్పించడానికి వివిధ వర్గాల మధ్య ఐక్యత పెంపొందించడానికి భారత జాతీయ సాంఘిక సంస్థ జనరల్ సెక్రటరీకి రు. 3000 (XXII)**

67. గయలో కాంగ్రెసు చేసిన తీర్మానాల ననుసరించి ప్రచారం నిర్వహించే షరతుపై హిందీ డైలీ పత్రిక నవయుగకి సహాయం రు. 1,200 (XXXI)

68. కాంగ్రెసు పబ్లిసిటీ బ్యూరోకి రు. 10,000 (XXXII)"

**II. అలహాబాదులో 1923 ఫిబ్రవరి 26, 28 తారీఖుల్లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ వోటు చేసిన గ్రాంట్లు:-**

**69. దళిత వర్గాల కార్యక్రమానికి తమిళ దేశ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు.౧0,000 (VI).**

70. పండిట్ జవహర్‌లాల్ అప్లికేషను మేరకు యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు.15,000 అప్పుగా ఇవ్వాలి (X).

71. సి. రాజగోపాలాచారియార్ అప్లికేషను మేరకు తమిళదేశ్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు. 15,000 అప్పుగా ఇవ్వాలి (X).

72. బెనారస్‌లోని గాంధి ఆశ్రమ్‌కోసం యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు.5000 గ్రాంటు (XI)"

**III. బొంబాయిలో 1923 మే 23, 24, 25, 26, 27, 28 తారీఖుల్లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ వోటు చేసిన గ్రాంట్లు:-**

73. దేశంలోని వివిధ రాష్ట్రాల్లో మిగిలిపోయిన ఖాదీ నిల్వలను వదిలించడానికి గుజరాత్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి అప్పుగా, 5 లక్షల రూపాయలు (V)

74. బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి ఖాదీ కార్యక్రమానికి అప్పుగా రు.50,000 (Viii).

75. బీహార్ రాష్ట్ర విద్యాలయానికి రు. 15,000 (Xii).

76. సత్యావాద విద్యాలయానికి రు. 10,000.

77. స్వావలంబన్ రాష్ట్రీయ పాఠశాలకి రు. 5,000 (XIV).

78. కాంగ్రెసు లేబర్ కమిటీ నిర్ణయించిన పని నిర్వహించడానికి డాక్టర్ సతాయే కి రు. 5,000 (XXXIV).

**IV. నాగపూర్‌లో 1923 జూలై 7,8,11,12 తేదీల్లో జరిగిన సమావేశంలో వర్కింగ్ కమిటీ వోటు చేసిన గ్రాంట్లు:-**

79. మద్రాసు ప్రెసిడెన్సీలో హిందూస్తానీ నేర్పేపనికి హిందీ సాహిత్య సమ్మేళన్ కార్యదర్శి బ్రజరాజ్‌కి రు. 20,000 (IX).

80. ప్రత్యేకంగా నాగపూర్‌లో సత్యాగ్రహం సహాయానికి, కాంగ్రెసు సాధారణ కార్యక్రమాలకి సి.పి. హిందుస్తానీ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి రు. 2,000 (XI).

ఈ అంశాల వారీ ఖర్చు లెక్కల వల్ల కాంగ్రెసు ప్రజాధనం వినియోగం గురించి కానీ, దుర్వినియోగం గురించి కానీ, పాఠకుడికి ఖచ్చితమైన అభిప్రాయం ఏర్పడకపోవచ్చు. ఈ ఖర్చు ఏదయినా సిద్ధాంతానికి లోబడి జరిగిందా? రాష్ట్రాల అవసరాన్ని బట్టి దీన్ని పంచడం జరిగిందా? ఈ క్రింది పట్టికను పరిశీలించండి:-

పట్టిక 2

| రాష్ట్రాలు | కేటాయించిన ధనం | జనాభా+ | మొత్తం జనాభాకి జనాభా నిష్పత్తి ప్రకారం కేటాయించాల్సిన శాతం | అసలు కేటాయించిన శాతం |
|---|---|---|---|---|
| సాధారణ | రు. | | | |
| అఖిల భారత* | 4,94,000 | 227,238,000 | — | 10 |
| బొంబాయి | 26,90,381 | 16,012,623 | 8 | 54.3 |
| మద్రాసు | 5,05,000 | 42,319,000 | 18 | 10.1 |
| బీహార్, ఒరిస్సా | 5,65,000 | 33,820,000 | 15 | 11.3 |
| యు.పి. | 3,11,200 | 45,376,000 | 20 | 6.26 |
| సింద్ | 1,13,000 | 3,279,377 | — | 2.2 |
| అస్సామ్ | 51,080 | 6,735,000 | 3 | 1.1 |
| బెంగాల్ | 50,000 | 46,241,000 | 20 | 1.0 |
| సి.పి. | 47,000 | 12,780,000 | 5 | .95 |
| పంజాబ్ | 45,000 | 20,675,000 | 9 | .9 |
| హైదరాబాద్ | 40,000 | — | — | .81 |
| అజ్మెర్ | 25,000 | — | — | .5 |
| విదేశ | 14,000 | — | — | .28 |
| మొత్తం | 49.50,660 | | | |

* బర్మా, స్వదేశ సంస్థానాలు కాక.

+ సైమన్ కమిషన్ నివేదిక వాల్యూం I నుంచి ఈ అంకెలు తీసుకున్నాం. అవి 1921 సంవత్సరానికి సంబంధించినవి.

సాంస్కృతిక యూనిట్లని బట్టి వాటి సైజునిబట్టి ఈ పంపకం జరిగిందా? ఈ కింది అంకెల్ని పరిశీలించండి:-

**పట్టిక 3**

| వివిధ భాషా ప్రాంతాలు | మొత్తం గ్రాంటు రు. | ఇచ్చిన గ్రాంటు రు. | రాష్ట్రానికిచ్చిన మొత్తం గ్రాంటులో శాతం | రాష్ట్ర జనాభాలో ఆ ప్రాంత జనాభా శాతం |
|---|---|---|---|---|
| బొంబాయి ప్రెసిడెన్సీ | 26,90,381 | — | — | 100 |
| గుజరాత్ | — | 26,22,381 | 97.4 | 18 |
| మహారాష్ట్ర | — | 43,000 | 1.6 | 69 |
| కర్నాటక | — | 25,000 | 0.93 | 13 |
| మధ్యరాష్ట్రాలు (సి.పి) | 47,000 | — | — | 100 |
| మరాఠీ జిల్లాలు | — | 10,000 | 21.2 | 45 |
| హిందుస్తానీ జిల్లాలు | — | 37,000 | 78.7 | 55 |
| మద్రాసు ప్రెసిడెన్సీ | 5,05,000 | — | — | 100 |
| తమిళనాడు | — | 1,03,000 | 20.4 | 38 |
| ఆంధ్ర | — | 3,02,000 | 60.0 | 52 |
| కేరళ | 1 | 1,00,000 | 19.6 | 10 |
| బీహారు, ఒరిస్సా | 5,65,000 | — | — | 100 |
| బీహారు | — | 5,15,000 | 91.0 | 73 |
| ఒరిస్సా | — | 50,000 | 0.9 | 27 |

ఈ అంకెలను బట్టి ఈ సొమ్ము పంపిణీ ఏ అర్థవంతమైన సూత్రం మీద ఆధారపడి జరగలేదని తెలుస్తుంది. ఇచ్చిన గ్రాంటుకీ, జనాభాకి ఏ విధమైన సంబంధమూలేదు. సాంస్కృతిక యూనిట్లు అడిగిన దానికి ఇచ్చిన గ్రాంటుకి కూడా ఏ

సంబంధం లేదు. ఒకటిన్నర కోట్ల జనాభాఉన్న బొంబాయి రాష్ట్రంలాటి దానికి రు. 27 లక్షలు లభించింది.

దాదాపు ఒక్కోదానిలో 4 కోట్ల జనాభా ఉన్న యు.పి. మద్రాసులకు మొత్తం రు. 5 లక్షల కన్నా లభించలేదు. సాంస్కృతిక యూనిట్లను బట్టి గ్రాంట్లు ఎలా ఇచ్చారో చూడండి. బొంబాయి రాష్ట్రాన్ని తీసుకోండి. దాంట్లో మూడు సాంస్కృతిక యూనిట్లు ఉన్నాయి; అవి మహారాష్ట్ర, గుజరాత్, కర్నాటక. బొంబాయి రాష్ట్రానికిచ్చిన 26 లక్షల 90 వేల రూపాయల్లో రాష్ట్రంలో 18 శాతమే జనాభా ఉన్న గుజరాత్‌కి 26 లక్షల 22 వేల రూపాయలు, అంటే 97.4 శాతం లభించిందన్న మాట. 69 శాతం జనాభా ఉన్న మహారాష్ట్రకి రు. 43.000 అంటే 1.6 శాతం, 13 శాతం జనాభా ఉన్న కర్నాటకకి రు. 25,000 అంటే .9 శాతం గ్రాంట్లు లభించాయి. సి.పి.లో రు.47,000 మొత్తం గ్రాంటులో 55 శాతం జనాభా ఉన్న హిందూస్థాని జిల్లాలకి రు. 37,000 అంటే 78.7 శాతం రాగా 45 శాతం జనాభా ఉన్న మరాఠీ జిల్లాలకి రు.10,000 మాత్రమే అంటే 21.2 శాతం లభించిందన్న మాట. బీహారు, ఒరిస్సాలలో 5 లక్షల 65 వేల రూపాయల మొత్తం గ్రాంటులో బీహారుకి 5 లక్షల 15 వేల రూపాయలు అంటే 73 శాతం జనాభాకి 91 శాతం గ్రాంటు లభించింది. 27 శాతం జనాభా ఉన్న ఒరిస్సాకి 50 వేల రూపాయలు మాత్రమే అంటే 9 శాతం గ్రాంటు లభించిందన్న మాట. మద్రాసు రాష్ట్రంలోని మూడు ప్రాంతాలకి జరిగిన పంపకాల్లో కూడా ఈ అసమానతలు గోచరమౌతాయి.

నిధుల పంపకంలో ఏ సిద్ధాంతమూ లేకపోగా సిగ్గు చేటయిన పక్షపాత ధోరణి మాత్రం ఉంది. మూడేళ్లలోనూ పంపకం చేసిన మొత్తం సొమ్ము రు.49 1/2 లక్షల రూపాయల్లో గుజరాత్‌కి - గాంధీ రాష్ట్రానికి - ఈ 2 1/2లక్షల రూపాయలు లభించింది. మిగతా దేశానికి మాత్రం 23 లక్షల రూపాయలు ఇచ్చారు. దీని అర్థం 29 1/2 లక్షల జనాభాకి రు. 26 1/2 లక్షలు రాగా 23 కోట్ల జనాభా ఉన్న మిగతా దేశానికంతటికీ 23 లక్షలు లభించాయి!!

ఎవళ్లకి ఏ డబ్బు ఎందుకిచ్చారో ఒక హద్దూపద్దూలేదు. ఈ క్రింది వ్యవహారాలు గమనించండి:-

పట్టిక 4

| సొమ్ములు కేటాయించి ఏ ప్రత్యేకమైన పనికీ నిర్ధారించకుండా వ్యక్తుల ఆధీనంలో ఉంచినవి | | ఏ పనికి నిర్ధారించకుండా ఏ గ్యారంటీ పేర్కొనకుండా సొమ్ముల కేటాయింపు | |
|---|---|---|---|
| | రు. | | రు. |
| మౌల్వీపర్రుల్‌హాసన్ | 40,000 | గుజరాత్‌కి | 3,00,000 |
| టి.ప్రకాశం | 7,000 | గుజరాత్‌కి | 18,00,000 |
| సి. రాజగోపాలా చారియార్ | 1,000 | | |
| బజాజ్ | 20,000 | గుజరాత్‌కి | 3,00,000 |
| గాంధీ | 1,00,000 | | |

వ్యక్తుల పేర కేటాయించిన పెద్దమొత్తాలకి ఏమన్నా లెక్కలు చెప్పారో లేదో తెలీదు. పేరు చెప్పకుండా కేటాయించిన సొమ్ము ఎవరు స్వీకరించారో కూడా తెలీదు. ఈ ప్రశ్నలకి సంతృప్తికరమైన సమాధానం దొరికిందే అనుకోండి, అయినా ఇంత హద్దూపద్దూ లేని వృధా ఖర్చు జరిగిన ఇంకో ఉదాహరణ దొరకడం మాత్రం చాలా కష్టం. ఏ ఆత్మక్షోభం లేకుండా వాళ్ళ స్వప్రయోజనాలు కాపాడుకోడానికి ఆశ్రితుల్ని ఆదుకోడానికి ప్రజాధనాన్ని ఉపయోగించి పరులను పీక్కుతినే కాంగ్రెసు నాయకులు చేసిన దోపిడీయే ఈ విషాదగాథ.

తర్వాత సంవత్సరాల్లో ఖర్చయి మిగిలిన ఒకకోటి 30 లక్షల రూపాయల్ని, ఒక ప్రత్యేక పద్ధతిలో కలిసికట్టుగా కాంగ్రెసు వాళ్ళు ఎలా లూటీ చేశారు అన్న కథని తరచడం అనవసరం. ప్రజా ధనాన్ని అంత పకడ్బందీగా లూటీ చెయ్యడం అనేది ఎన్నడూ జరగలేదంటే సరిపోతుంది. తక్షణ ఆసక్తికరమైన విషయం ఏమిటంటే, ఈ గ్రాంట్ల పట్టిక పరిశీలనలో, అంటరాని వారి పరిస్థితిని మెరుగుపరచిన విషయం మాత్రం గోచరం కాదు. మరి స్వరాజ్య నిధినుంచి డబ్బు కేటాయించిన అంశాల్లో ఇది కూడా ఒకటి. జాతి కోసం ఏ ప్రాక్టీసు లేని లాయర్లు ప్రాక్టీసు వదలిపెట్టేశారన్న వాళ్ళ భుక్తికోసం వేలకొద్దీ రూపాయలు ఎంక్వయిరీ లేకుండా ఖర్చు చేశారు. కల్లుగీసేవాళ్లు కూడా వాళ్ళపని వదిలేసినందుకు వాళ్లు బిచ్చం మీద బతకడానికి వేలకొద్దీ రూపాయల ప్రజాధనాన్ని వినియోగించారు. దుర్నీతి కొట్టొచ్చినట్లు ముఖం మీద కనపడే అనేక పిచ్చిపథకాలపైన కూడా ధనాన్ని వెచ్చించారు. అలాటప్పుడు, అంటరాని వారి స్థితిగతులు మెరుగుపరచడం అనేది మొదటి బాధ్యత కాకపోతే పోనీ, ఒక బాధ్యతగానైనా స్వీకరించాల్సింది. కాని, కాంగ్రెసు అటువంటి దేమీ చెయ్యలేదు, సరికదా అంటరాని వారిని ఆదుకోవడానికి ఒక ప్రత్యేకనిధిని ఏర్పాటు చెయ్యాలని కాంగ్రెసు తలపెట్టింది. ఈ ప్రత్యేక అంటరాని వారి

నిధి మొత్తం ఎంత? అఖిల భారత కాంగ్రెసు కమిటీ దీన్ని 5 లక్షలు రూపాయలుగా నిర్ణయించింది. అంత ప్రాముఖ్యం లేని, లాభం లేని అంటరాని వారిని ఆదుకోవడం అనే పనికి అది చాలా పెద్దమొత్తం అని తలచి వర్కింగ్ కమిటీ దాన్ని రెండు లక్షల రూపాయలకు తగ్గించింది. ఆరుకోట్ల అంటరాని వారికి రెండు లక్షల రూపాయలు!!

అంటరానివారిని ఉద్ధరించడానికి కాంగ్రెసు నిర్ణయించిన ఘనమైన మొత్తం ఇది. దీనిలో ఎంత భాగాన్ని నిజంగా దీనికోసం కేటాయించారు? ఇవిగో లెక్కలు:-

పట్టిక 5

| ఉద్దేశించినపని | మంజూరు చేసిన సొమ్ము రు. |
|---|---|
| రాజమండ్రి డిప్రెస్‌డ్‌క్లాస్ మిషన్ | 1,000 |
| అంత్యజ కార్యాలయం, అహమ్మదాబాద్ | 5,000 |
| అంత్యజ కార్యాలయం, అహమ్మదాబాద్ | 17,381 |
| ఆంధ్రలో దళిత వర్గాల కార్యక్రమానికి | 7,000 |
| దళిత వర్గాల పని కోసం జాతీయ సాంఘిక సంస్థకి | 3,000 |
| దళిత వర్గాల పని కోసం తమిళ జిల్లా పి.సి.సి.కి | 10,000 |
| మొత్తం రు. | 43,381 |

మొత్తానికి బార్డోలి కార్యక్రమం అనబడే నిర్మాణ కార్యక్రమంలో అంత ప్రాముఖ్యం ఇచ్చిన అంటరాని వారి ఉద్ధరణకు 49 1/2 లక్షల రూపాయల్లోంచి కాంగ్రెసు రు. 43,381 మాత్రం కేటాయించ గలిగింది. ఇంత కంటే ఘోరంగా నిజాయితీలోపించిన మరో ఉదాహరణ ఎక్కడేనా ఉంటుందా? అంటరాని వారి కోసం అంతగా చాటుకున్న ప్రేమ ఏమయిపోయింది? అంటరాని వారిని ఉద్ధరించాలన్న కాంగ్రెసు కోరిక ఏమయినట్లు? అంటరాని వారికి సంబంధించినంత వరకూ బార్డోలి తీర్మానం ఒక పచ్చి దగా అంటే తప్పా?

అయితే ఇప్పుడు ఒక ప్రశ్న మాత్రం తప్పకుండా అడగాలి. కాంగ్రెసు ఆధ్వర్యంలో అంటరాని వారి సమస్యల విషయంలో ఇదంతా జరుగుతుంటే గాంధీ ఎక్కడున్నట్లు? స్వరాజ్యం సాధించడానికి అంటరానితనం నిర్మూలించడానికి ఉన్న దగ్గర సంబంధాన్ని గాంధీ కాంగ్రెసులో చేరినప్పటి నుంచీ నొక్కిచెప్తూనే ఉన్నారు. అంచేత ఈ ప్రశ్న అడగాల్సిన అవసరం ఉంది. గాంధీ వ్యవస్థాపకుడైన 'యంగ్ ఇండియా' 1921 నవంబరు 3 పత్రికలో గాంధీ ఇలా రాశారు:-

"ఈ కార్యక్రమంలో అంటరాని తనానికి ద్వితీయ స్థానాన్ని ఇవ్వలేము. ఈ మచ్చని మాపుకోకపోతే స్వరాజ్యం అనేది అర్థంలేని మాటగా మిగిలిపోతుంది. ఈ విషయంలో వాళ్లు చేసేపనిలో కార్యకర్తలు సంఘపరమైన వెలిని, బహిరంగ శాపనార్థాలనీ కూడా

ఆహ్వానించాలి. స్వరాజ్యాన్ని సాధించే విధానంలో అంటరాని తనం నిర్మూలన అతిశక్తివంతమైన దాన్నిగా నేను పరిగణిస్తాను."

ఆ విధంగా ఆయన అంటరాని వారిని స్వరాజ్యానికి వ్యతిరేకంగా బ్రిటీష్ వారితో చేతులు కలపొద్దని, స్వరాజ్యం సాధించడానికి హిందువులతో కలసిపోరాడాలని ఉద్బోధించారు. 1920 అక్టోబరు 20వ తేదీ 'యంగ్ ఇండియా'లో గాంధీ అంటరానివారిని ఉద్దేశించి ఇలా రాశారు:-

"ఈ దేశంలో అట్టడుగున పడి ఉన్న వీరికి మూడు మార్గాలున్నాయి. సహనం కోల్పోయి వారు బానిసల స్వంతదారులైన ప్రభుత్వంవారి సహాయం కోరవచ్చు. అది లభిస్తుంది. కాని వారు కాలుతున్న పెనంలోంచి మండుతున్న నిప్పుల్లోకి పడిపోతారు. ఈనాడు వారు బానిసల బానిసలు. ప్రభుత్వ సహాయం కోరినందువల్ల వారి బంధుగణాన్ని అణచడానికి వారినే ఉపయోగిస్తారు. వారిపై పాపపుదండన ప్రయోగం బదులు వారేపాపం చేసినవారవుతారు. దీన్ని ముస్లింలు ప్రయోగించి విఫలులైనారు. మనకంటే వారు అధ్వాన్నంగా ఉన్నట్లు కనుగొన్నారు. తెలీకుండా సిఖ్ఖులు అదే పని చేసి విఫలులైనారు. ఈనాడు భారతదేశంలో సిఖ్ఖుల కంటే నిస్పృహకు లోనైన వారు లేరు. అంచేత ప్రభుత్వ సహాయం పరిష్కార మార్గం కాదు.

రెండోది, హిందూ మతాన్ని తిరస్కరించి, అందరూ కలిసికట్టుగా ముస్లింలు గానో, క్రిస్టియన్లుగానో మారి పోవడం. ప్రాపంచికమైన అభివృద్ధికి మతం మార్పిడి సరియైనదేననుకుంటే, ఏ సందేహమూ లేకుండా అలాగే చేయమని నేను సలహా ఇస్తాను. కాని మతం హృదయానికి సంబంధించినది. భౌతికంగా ఎటువంటి ఇబ్బందులు కలిగినా, స్వమతాన్ని తిరస్కరించరాదు. పంచములపట్ల అమానుషంగా ప్రవర్తించడం హిందూత్వంలో భాగమైతే దాన్ని తిరస్కరించడం వారికి, నాలాంటి వారికి కూడా తప్పని ఘనమైన విధి. ఎందుకంటే మతాన్ని నిరాధారంగా ఆరాధించని మాలాటి వాళ్ళం దాని పవిత్రమైన పేరిట జరిగే దుష్టత్వాన్ని క్షమించఖ్ఖర్లేదు. కాని అంటరాని తనం హిందూమతంలో భాగం కాదని నా నమ్మకం. ఎంత ప్రయత్నమైనా చేసి దానిలోని వెర్రితలల్ని నిర్మూలించాలి. హిందూమతంలోని ఈ మచ్చను తొలగించడానికి హృదయపూర్వకంగా ప్రయత్నించిన బోలెడు మంది హిందూ సంస్కర్తలున్నారు. అంచేత నా ఉద్దేశం మతం మార్పిడి దీనికి పరిష్కారం కానేకాదు. ఇక ఆఖరుగా మిగిలేది, పంచమేతరులు, ఏదో ఒకవిధిగా కాక, తమంత తాము స్వచ్ఛందంగా అందించిన సాయాన్ని తీసుకుంటూ, స్వయంసహాయం చేసుకుని తమపైన తామే ఆధారపడటం. ఇప్పుడు సహాయనిరాకరణ ఉపయోగానికొస్తుంది... అందుచేత హిందూ మతంపై నిరసన వ్యక్తం చెయ్యడానికి పంచములు ఇతర హిందువులతో, తమప్రత్యేకమైన ఇబ్బందులు కొనసాగినంతకాలం ఏ విధమైన సంబంధమూ, సంపర్కమూ పెట్టుకోకూడదు. కాని దీనికి సంఘటితమైన తెలివైన సాధన కావాలి. అయితే నేను గమనించినంత వరకూ పంచములలో సహాయ నిరాకరణ ద్వారా విజయం సాధించడానికి వారికి నాయకత్వం వహించగలిగే వారెవరూ లేరు.

అందుచేత ఇప్పటి ప్రభుత్వ బానిసత్వాన్ని వదిలించుకోడానికి ప్రస్తుతం నడుస్తున్న బృహత్ జాతీయ ఉద్యమంలో హృదయపూర్వకంగా చేరిపోవడమే బహుశా పంచములకు నయమైన మార్గం. ఈ దుష్టప్రభుత్వంతో సహాయ నిరాకరణం అంటే భారతజాతిలో ఉన్న వివిధ వర్గాల మధ్య సయోధ్య ఉండాలనేది పంచములైన నేస్తాలు సులభంగానే చూడగలుగుతారు."

అదే వ్యాసంలో గాంధీ హిందువులకు ఇలా చెప్పారు:-

"ప్రభుత్వానికి వ్యతిరేకంగా సహాయ నిరాకరణాన్ని విజయవంతంగా నడపాలంటే ముస్లింలతో కలిసి పనిచేసినట్లే, హిందువులు పంచములతో కూడా కలిసి పని చేయాలి."

1920 డిసెంబరు 29వ తేదీ 'యంగ్ ఇండియా'లో ఈ హెచ్చరికను తిరిగి చేస్తూ ఆయన ఇలా అన్నారు:-

"ప్రభుత్వానికి వ్యతిరేకంగా సహాయ నిరాకరణ అంటే అర్థం, పాలితుల మధ్య సయోధ్య అన్నమాట. హిందువులు అంటరానితనం అన్న పాపపు మచ్చని తొలగించకపోతే స్వరాజ్యం అన్నది, ఒక ఏడాదిలో కాదు గదా ఒక వందసంవత్సరాలలోకూడా రాదు. హిందూ ముస్లిం ఐక్యత లేకుండా స్వరాజ్యం ఎలా సమకూరదో అలాగే అంటరాని తనం అనే పాపాన్ని తొలగించకుండా కూడా అది సమకూడదు."

దీనంతటినుంచి గాంధీ బార్డోలి తీర్మానం ప్రకారం అంటరాని వారి పరిస్థితుల్ని మెరుగుపరచాలన్న కాంగ్రెసు సిద్ధాంతాన్ని అమలు పరుస్తారని మనం అనుకుంటాం. నిజానికి పవిత్రమైన సిద్దాంతాన్ని వల్లెవేయడం తప్ప, ఈ మెరుగు పరచే కార్యక్రమంలో గాంధీ సుతరామూ శ్రద్ధ తీసుకోలేదు. ఆ ఉద్దేశమే ఉంటే ఆయన ఇంకో కమిటీని ఏర్పాటు చేసేవారు. ఆ ఉద్దేశమే ఉంటే తిలక్ స్వరాజ్యనిధిని కాంగ్రెసు వారు ఒక పద్ధతి ప్రకారం చేస్తున్న లూటీ నుంచి రక్షించి దాన్ని అంటరాని వారు బాగుపడటానికి కేటాయించేవారు. అది వింతగా అనిపించవచ్చు, ఆయన ఏమిపట్టనట్లు మౌనంగా కూర్చుండి పోయారు. ఈ విషయంలో ఏ విధమైన పశ్చాత్తాపం వ్యక్తం చెయ్యకపోగా అంటరాని వారిపట్ల ఆయన చూపిన నిరాసక్తతని సమర్థించుకోడానికి ఎటువంటి కారణాలు చూపారంటే వాటిని ఎవరూ నమ్మరు. 1920 అక్టోబరు 20వ తేదీ 'యంగ్ ఇండియా'లో వాటిని చూడొచ్చు:-

"ఇంగ్లీషు వారిని వారి రక్తసిక్తమైన చేతుల్ని కడుక్కోమనే ముందు హిందువులం మన చేతుల్ని కడుక్కోవద్దా? ఇది న్యాయంగా అడగాల్సిన ప్రశ్న. ఒక బానిస జాతి సభ్యుడిగా నన్ను నేను విముక్తుడ్ని చేసుకోకుండానే అణచబడిన వర్గాన్ని, వారి బానిసత్వాన్నించి విముక్తుల్ని చెయ్యగలిగితే, ఆ పని నేను ఈ రోజే చేసేస్తాను. కాని ఇది అసాధ్యమైన పని. ఒక బానిసకి ఒక సరైన పని చెయ్యడానికి కూడా స్వతంత్రం లేదు."

గాంధీ ఇలా ముగించారు:-

"ఆ కార్యక్రమం ప్రారంభమైంది. పంచములు దాంట్లో కావాలని పాత్ర తీసుకున్నా లేకపోయినా, హిందువులు, స్వంత అభ్యుదయాన్ని కుంటుపరచకుండా వారిని నిర్లక్ష్యం చెయ్యలేరు. అంచేత పంచముల సమస్య నాకు జీవిత మంత ప్రీతిపాత్రమైంది. అయినప్పటికీ జాతీయ సహాయ నిరాకరణకి ప్రత్యేక శ్రద్ధ చూపగలిగితే నేను సంతృప్తి చెందుతాను. బృహత్ అన్న దాంట్లో తక్కువది కూడా ఉందని నాకు తెలుసు."

ఆ విధంగా అంటరాని వారి కోసం కాంగ్రెసు ఏమి చేసిందన్న రెండవ అధ్యాయం ముగిసింది. ఈ విషాద పర్వంలో విచారించదగ్గ విషయం ఏమంటే గాంధీ ఇలాంటి మాయల్లోపడి తన్నుతాను ఎలా బుజ్జగించుకోగలిగారన్నది తెలుసుకోవడం. గాంధీకి మాయామేయజగంలో నివసించడం ఇష్టమా అన్నది అనుమానాస్పదమైన విషయం. కాని తనకు ప్రీతిపాత్రమైన ప్రతిపాదనల సమర్థన కోసం వాదనలుగా ఉపయోగించడానికి ఆయన మాయలను సృష్టించుకోడానికి ఇష్టపడతాడనడంలో ఏ సందేహమూ లేదు. అంటరానివారి అభ్యున్నతికి తను పూచీ వహించక పోవడానికి ఆయన చూపిన కారణం గాంధీకున్న ఈ అలవాటుకి మంచి తార్కాణం. అంటరానివారు హిందువులకి వ్యతిరేకంగా పనిచెయ్యకూడదు ఎందుకంటే అది వారి బంధువర్గానికే వ్యతిరేకంగా పనిచెయ్యటం అని అంటరాని వారికి చెప్పడం అర్థం చేసుకోవచ్చు. కాని అంటరాని వారిని హిందువులు వారి బంధు వర్గంగా చూస్తారని ఊహించడం ఒక మాయని కల్పించడమే. అంటరానితనం నిర్మూలించడానికి పూనుకోవాలని హిందువులకి చెప్పడం మంచి సలహా. కాని అంటరాని వారిపట్ల అంత అమానుషంగా ప్రవర్తించినందుకు హిందువులు సిగ్గుతో కృంగిపోవడం వల్ల వారికి అంటరానితనం నిర్మూలించడం తప్ప వేరే గత్యంతరం లేదని, బోలెడు మంది హిందూ సంస్కర్తలు అంటరాని తనం నిర్మూలించడం తప్పవేరే పని పెట్టుకోలేదనీ తనని తాను సంబాళించుకొనేటంత దూరం పోయాడంటే అంటరాని వారిని, మిగతా ప్రపంచాన్ని తప్పుదారి పట్టించడానికి గాంధీ పన్నిన ఒక మాయ. మొత్తానికి లాభం జరిగితే అందులో భాగానికి కూడా లాభిస్తుందనీ అంచేత కేవలం ఆ భాగాన్ని గుర్తించే ప్రత్యేకంగా శ్రద్ధ వహించక్కర్లేదనీ అనడం మంచితర్కమే కావచ్చు. కాని అంటరాని వారంతా వేరేగా ఉన్న ఒక ముక్క హిందూ అనే ఒక మొత్తంలో భాగమేననడం తన్నుతాను మోసంచేసుకోవడం మాత్రమే. గాంధీ సృష్టించిన మాయలవల్ల అంటరానివారు, దేశమూ అనుభవించిన విషాదాల గురించి కొద్ది మందికే తెలుసు.

అనువాదం: మంచిరాజు శ్యామలరావు

## అధ్యాయం III

# లేకిపని

## అధికారం వదులుకోడానికి కాంగ్రెస్ తిరస్కరించింది

### I

1919నాటి భారత ప్రభుత్వచట్టంలో ఒక అంశం జోడింపబడింది. పదేళ్ళ తర్వాత ఒక రాయల్ కమిషన్‌ను నియమించే బాధ్యతను ప్రభుత్వానికి అప్పజెప్పడమే ఆ అంశం. రాజ్యాంగం పని చేస్తున్న తీరును పరిశీలించి అవసరమనిపించిన మార్పులను సూచించే నివేదిక సమర్పించడమే ఆ కమిషన్ చేయవలసినపని. అందుకనుగుణంగా 1928 లో సర్ జాన్ సైమన్ అధ్యక్షతన రాయల్ కమిషన్ నియమించబడింది. ఆ కమిషన్‌లో భారతీయులు కూడా సభ్యులుగా ఉంటారని భారతీయులు భావించారు. అయితే భారతదేశానికి అప్పటి స్టేట్ సెక్రటరీ అయిన లార్డ్ బిర్కెన్ హెడ్ ఈ కమిషన్లో భారతీయుల్ని చేర్చడాన్ని వ్యతిరేకించాడు. అది స్వచ్ఛమైన పార్లమెంటరీ కమిషన్‌గా ఉండాలని నొక్కి చెప్పారు కాంగ్రెస్ ఉదారవాదులు దీనికి కోపగించుకున్నారు. దీనిని అవమానంగా భావించారు. కమిషన్‌ను బహిష్కరించి దీనికి వ్యతిరేకంగా పెద్ద ఉద్యమం లేవదీశారు. ఈ వ్యతిరేకతను ఉపశమింపజేయడానికి, కమిషన్ తనపని పూర్తిచేసిన తర్వాత, రాజ్యాంగం తుదిరూపం దిద్దుకొనే లోపల భారతీయప్రతినిధులు కలిసి చర్చించవచ్చునని ప్రభుత్వం ప్రకటించింది. ఈ ప్రకటనకు అనుగుణంగా లండన్‌లో రౌండుటేబిల్ కాన్ఫరెన్స్ ఏర్పాటు చేయబడింది. అందులో పాల్గొనడానికి భారతీయుల్ని ఆహ్వానించింది ప్రభుత్వం.

1930, నవంబరు 12న రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌ను కీ.శే. అయిదవ కింగ్‌జార్జి ప్రారంభిచారు. భారతీయుల దృష్టిలో రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్సు పెద్దప్రాముఖ్యం గల సంఘటన. భారతదేశానికి రాజ్యాంగాన్ని రూపొందించడంలో సంప్రదించవలసిన హక్కు భారతీయులకుండడాన్ని ప్రభుత్వం గుర్తించడమే ఆ ప్రాముఖ్యం. అస్పృశ్యులకు వాళ్ల చరిత్రలో ఇదొక మైలురాయి. ఎందుకంటే, మొట్టమొదటి ,సారిగా ప్రత్యేకంగా అస్పృశ్యులనుండి ఇద్దరు ప్రతినిధులు ఇందులో పాల్గొనడానికి అనుమతించబడ్డారు గనక. ఆ యిద్దరిలో నేనొకణ్ణి, ఇంకొకరు దివాన్ బహదూర్ ఆర్ శ్రీనివాసన్. అస్పృశ్యులు హిందువులకన్నా భిన్నమైన వాళ్ళుగా గుర్తిపబడ్డారని దీనిఅర్థం. అంత మాత్రమే కాదు, భారతదేశానికి రాజ్యాంగాన్ని నిర్మించడంలో అస్పృశ్యులను కూడా సంప్రదించవలసి రావడం చెప్పుకోదగ్గ విషయం.

ఈ కాన్ఫరెన్స్‌పని తొమ్మిది కమిటీలమీద విభజింపబడింది. వాటిల్లో ఒకటి అల్పసంఖ్యాకుల కమిటీ. మత/కుల సమస్యకు పరిష్కారం కనుక్కొనే అతికష్టమైన పని ఈ కమిటీకి అప్పజెప్పబడింది. ఈ కమిటీ చాలా ముఖ్యమైందనే అంశాన్ని ముందే పసికట్టి, స్వయంగా ప్రధానమంత్రి కీ.శే. రాంసే మెక్డొనాల్డ్ ఈ కమిటీకి అధ్యక్షత వహించారు. అల్పసంఖ్యాకుల కమిటీలోని కార్యక్రమాలు అస్పృశ్యులకు చాలా ప్రాముఖ్యం గలవి. ఎందుకంటే కాంగ్రెస్‌కు అస్పృశ్యులకు మధ్య ఏమి జరిగింది, వాళ్ళమధ్య స్పర్ధలకు దారితీసిన పరిస్థితులు ఈ కమిటీ చర్చల్లోకి వస్తాయి గనక.

రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ సమావేశమయ్యే నాటికి అస్పృశ్యులు కాని ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారి రాజకీయ డిమాండ్లు స్పష్టంగానే ఉన్నాయి.

నిజానికి 1919 నాటి రాజ్యాంగం వాళ్ళను చట్టబద్ధమైన అల్పసంఖ్యాకులుగా గుర్తించి వాళ్ల సంక్షేమానికి భద్రతకు సంబంధించిన అంశాలను, అందులో పొందు పరిచింది. వాళ్ళ విషయంలో ఆ అంశాలను విస్తరించడమో లేక రూపాన్ని మార్చడమో చెయ్యడమే మిగిలింది. అణచబడ్డ వర్గాల పరిస్థితి ఇందుకు భిన్నమైంది. 1919 నాటి రాజ్యాంగంలో అణచబడ్డవర్గాల రక్షణకోసం అవసరమైన అంశాలను చేర్చాలని ఖచ్చితంగా చెప్పింది. అయితే దురదృష్టవశాత్తు రాజ్యాంగ వివరణల్ని రూపొందించేటప్పుడు భారతప్రభుత్వం చట్టసభలలో నామినేషన్ పద్ధతిలో వాళ్ళకు ప్రాతినిధ్యం కల్పించడం తప్ప, ఇంకేమి చెయ్యాలన్నా కష్టంగా భావించింది. అయితే అప్పుడు చెయ్యవలసి ఉండిన మొదటి పని ఏమిటంటే, హిందువుల వేదనకు అణచివేతకు గురౌతున్న అస్పృశ్యుల రక్షణకు అవసరమైన విధానాన్ని రూపొందించటం. ఇందుకు నేను రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు చెందిన పత్రం సమర్పించాను. అవగాహన కోసం, నేను రూపొందిచిన రక్షణ సౌకర్యాలను ఇక్కడ పేర్కొంటాను.

స్వపరిపాలక భారతదేశం కోసం భవిష్యత్తులో రూపొందే రాజ్యాంగంలో అణచబడ్డ వర్గాల రక్షణ కోసం కల్పించవలసిన రక్షణల పథకం - రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు సమర్పించబడింది.

స్వపరిపాలక భారతదేశంలో అధిక సంఖ్యాకుల పాలనలో సమ్మతించి ఉండడానికి బడుగువర్గాలు పెడుతున్న నియమ నిబంధనలివి.

**ఒకటో నియమం.**

**సమాన పౌరసత్వం**

ప్రస్తుతమున్న వంశపారంపర్య బానిసత్వ స్థితిలోనే అధికసంఖ్యాకుల పాలనలో మనుగడ సాగించడానికి అణచబడ్డ వర్గాల వాళ్ళు సమ్మతించలేరు. అధిక సంఖ్యాకుల పాలన వచ్చేముందుగానే అస్పృశ్యతా వ్యవస్థనుండి వాళ్ళకు విమోచన జరగాలి. దీనిని అధికసంఖ్యాకుల ఇష్టానికి వదిలిపెట్టరాదు. రాజ్యంలోని ఇతర పౌరులతో సమానంగా అణచబడ్డ వర్గాల వాళ్ళను అన్ని పౌరసత్వ హక్కులను అనుభవించదగిన స్వతంత్రపౌరులుగా చెయ్యబడాలి.

ఎ. అస్పృశ్యతానిర్మూలనను సాధించి సమానపౌరసత్వాన్ని సాధించడానికి భారత రాజ్యాంగంలో ఈ క్రింది ప్రాథమిక హక్కును కల్పించాలి.

**ప్రాథమిక హక్కు**

యు.ఎస్.ఎ రాజ్యాంగ సవరణ XIV. ఐర్లండు ప్రభుత్వ చట్టం 1920, 10 & 11. జియో V. అధ్యా - 57 సెక్షన్ 5 (2)

చట్టం ముందు భారతరాజ్యంలోని పౌరులందరూ సమానం. అందరూ సమానహక్కులు కలిగుంటారు. ఈ రాజ్యాంగం అమలులోకి వచ్చిన రోజునుండి అస్పృశ్యతను ఆధారం చేసుకొని రాజ్యంలోని ఎవరిపట్లనైనాసరే చట్టం, నియమం, ఆజ్ఞ, ఆచారం, చట్టవివరణ ద్వారా ఎవరినైనా అపరాధం, అసౌకర్యం, అశక్తత కలగజేయడం,, వివక్షచూపబడితే రాజ్యాంగం భారతదేశంలో విఫలమైనట్లే.

ఇప్పటికి ఇది అన్ని రాజ్యాంగాల్లోనూ చూ. ప్రొ.కత్

బి. 1919 నాటి భారత దేశ చట్టంలో 110, 111 సెక్షన్‌లద్వారా ప్రభుత్వాధికారులు అనుభవిస్తున్న విశేషాధికారాలు రద్దు కావాలి. వాళ్ళ అధికారాన్ని యూరోపియన్ బ్రిటిష్ అధికారుల అధికారంతో సమానం చెయ్యాలి.

**రెండో నియమం.**

**సమానహక్కుల స్వేచ్ఛానుభవం**

సమానహక్కుల్ని ప్రకటించినంత మాత్రాన అణచబడ్డవర్గాల వారికి ఒరిగే ప్రయోజన మేమీ లేదు. వాళ్ళు సమాన పౌరసత్వహక్కుల్ని ఆచరణలో అనుభవించడానికి ప్రయత్నిస్తే,

సనాతనుల సంపూర్ణ బలాన్ని ఎదుర్కోవలసి వస్తుందనడంలో సందేహంలేదు. అందువల్ల ఈ హక్కులు కేవలం ప్రకటనలుగా మాత్రమే మిగిలిపోకుండా అవి నిత్య జీవితంలో వాస్తవాలు కావాలంటే, ఆ హక్కుల అనుభవానికి అడ్డుతగిలే వాళ్లకు తగిన శిక్షల్ని కూడా నిర్ధారించ వలసిఉందని అణచడ్డవర్గాల వాళ్ళ అభిప్రాయం.

ఎ. అందువల్ల 1919 నాటి భారతప్రభుత్వ చట్టంలోని XI.వ విభాగంలో ఈ క్రింది సెక్షన్‌ను చేర్చాలని అణచబడ్డవర్గాల వాళ్ళు ప్రతిపాదిస్తున్నారు.

### 1. పౌరసత్వాతిక్రమణ నేరం

యు.ఎస్.చట్టం నీగ్రోల ఉద్దరణ తర్వాత వాళ్ళ ప్రయోజనాల కోసం రూపొందించిన ఏప్రిల్, 9, 1866 మార్చి 1, 875 పౌరహక్కుల సంరక్షణ చట్టాలు.

అస్పృశ్యతను ఆధారంచేసుకొని ఏవ్యక్తినైనా వసతి సౌకర్యం, అనుకూలతలు, సౌకర్యాలు, గృహ, విద్యాసంస్థలు, వీధులు, దారులు, చెరువులు, బావులు, ఇతర నీటిస్థావరాలు, నేలమీదగాని, గాలిలోగాని, నీటిమీదగాని, నాటకశాలలు ఇతర స్థలాల్లోగాని - అవి ప్రజలకు అంకితం చెయ్యబడినవి అయితే, వాటి ద్వారాలభించే సామాన్యసదుపాయాలను అనుభవించడం నుండి అడ్డుకుంటే నేరం. ఈ నేరానికి పాల్పడ్డవారికి అయిదేళ్ళు కారాగార శిక్షపడాలి, అపరాధంకూడా వెయ్యొచ్చు.

బి. అణచబడ్డవర్గాల వాళ్ళు వాళ్ళ హక్కుల్ని ప్రశాంతంగా అనుభవించడానికి సనాతనులైన వ్యక్తుల నుంచే కాదు ఆటంకం వచ్చేది. సాంఘిక బహిష్కరణ అనేది చాలా సాధారణ విషయం. అణచబడ్డవాళ్ళు సనాతన వర్గాల వాళ్ళకు రుచించని ఏ పనిచేసినా వాళ్ళమీద ఉపయోగించడానికి భయంకరమైన సాధనం సాంఘిక బహిష్కరణ. 1928 లో బొంబాయి ప్రభుత్వం ఒక కమిటీని వేసింది. ప్రెసిడెన్సీలోని అణచబడ్డవర్గాల (అస్పృశ్యులు) ఆదిమ జాతులవాళ్ళ సాంఘిక ఆర్థిక విద్యాపరిస్థితిని గురించి విచారించి, దాని అభివృద్ధికి అవసరమైన చర్యలను సూచించడం ఈ కమిటీ చెయ్యవలసిన పని. ఈ కమిటీ నివేదిక ఈ సాంఘిక బహిష్కరణ ఎలా అమలుచేయబడుతుందో, దానిని ఏయే సందర్భాలలో ఉపయోగిస్తారో వివరించింది. ఆ నివేదికలో ఒకభాగం ఇలాఉంది.

### అణచబడ్డవర్గాలు - సాంఘిక బహిష్కరణ

"102. అణచబడ్డవర్గాలవాళ్ళు వాళ్ళహక్కుల్ని పొందడానికి మేము అనేక పరిష్కారాలు, సిఫారస్‌లు చేసినా, వాళ్ళు వాటిని పొందడానికి ష-తం అనేక ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుంది. ఇందుకు చాలా కాలం పడుతుంది కూడా. మొదటి కష్టం సనాతవ వర్గాలవారి ప్రత్యేక హింస. ప్రతి గ్రామంలోనూ అణచబడ్డవర్గాల వాళ్ళు తక్కువ

సంఖ్యలోను, సనాతనులు ఎక్కువ సంఖ్యలోను ఉంటారు. పోలీసులు విచారించే అపాయం ఉన్నందువల్ల సనాతనుల హింసకు కొంత పరిమితి ఏర్పడింది. ఫలితంగా అలాంటి సంఘటనలు తక్కువయ్యాయి.

"రెండో ఇబ్బంది నేటికీ కనబడుతున్న అణచబడ్డవాళ్ళ ఆర్థికస్థితి నుండి పుడుతుంది. ప్రెసిడెన్సీలోని అనేకప్రాంతాల్లో అణచబడ్డ వర్గాల వారికి ఆర్థిక స్వాతంత్ర్య లేదు. కొందరు అగ్రవర్ణాలవాళ్ళ భూముల్ని కౌలుకు తీసుకుని వ్యవసాయంచేస్తారు. ఇతరులు వ్యవసాయ కూలీలుగా పనిచేసి ఆ సంపాదన మీద బతుకుతారు. మిగిలిన వాళ్ళు గ్రామసేవకులుగా పనిచేసి అగ్రవర్ణాల వాళ్ళు పెట్టే తిండితో ఇచ్చే గింజలతో పొట్టనింపుకుంటారు. అణచబడ్డ వర్గాలవాళ్ళు తమహక్కుల్ని ఉపయోగించుకోడానికి ప్రయత్నించినప్పుడు అగ్రవర్ణాల వాళ్ళు తమ ఆర్థికబలాన్ని ఆయుధంగా వాడిన సందర్భాలు, పొలాల్లోంచి వెళ్ళగొట్టిన సందర్భాలు, గ్రామసేవక ఉద్యోగాలను ఊడబీకి జీతాలను చెల్లించకుండా నిలిపేసిన సందర్భాలు అనేకం విన్నాం. అందరూ నడిచే దార్లో నడవనీయకపోవడం, బనియాలను (వైశ్యులను) నిత్యావసరవస్తువులను వాళ్ళకు అమ్మనీయకుండా లడ్డుకోవడందాకా ఈ బహిష్కరణ కొనసాగుతుంది. కొన్నిసార్లు చాలా చిన్నకారణాలకు కూడా సాంఘిక బహిష్కరణము అమలు చేసినట్లు తెలుస్తుంది. సాధారణంగా అణచబడ్డవాళ్ళు ఊరబావిలో నీళ్ళు తోడుకున్నప్పుడు, ఈ బహిష్కరణను విధించేవాళ్ళు. అయితే అస్పృశ్యులు యజ్ఞోపవీతాన్ని తాకారనీ, కొంతభూమిని కొన్నా, మంచి బట్టలు, నగలు వేసుకున్నారనో ప్రధాన వీధిలో గుర్రంమీద పెళ్ళికొడుకు ఊరేగింపుగా తీసుకుపోయారనో ఈ బహిష్కరణను అమలు చేసిన సందర్భాలు తక్కువేమీకాదు.

"అణచబడ్డవాళ్ళను తొక్కడానికి సాంఘిక బహిష్కరణ కన్నా మించిన బలమైన ఆయుధం ఇంకేదన్నా ఉందేమో తెలియదు. దీనిముందు ప్రత్యక్ష దౌర్జన్యంకూడా వెలవెలపోతుంది. ఇది స్పర్శా స్వాతంత్ర్య సిద్ధాంతానికి తగినట్లు కనబడుతుంది. కాబట్టి ఇది చాలా అపాయకరమైంది. అణచబడ్డవాళ్ళ అభివృద్ధికి వాక్స్వాతంత్ర్యం పని స్వాతంత్ర్యం, అవసరమని గ్యారంటీ ఇవ్వాలంటే అధిక సంఖ్యాకుల ఈ పీడను గట్టిగా అణచివేయాలి.

అణచబడ్డవాళ్ళ అభిమతం ప్రకారం వాళ్ళహక్కుల్ని స్వాతంత్ర్యాన్ని అణగదొక్కే పద్ధతి పోవాలంటే, సాంఘిక బహిష్కరణను చట్టం ద్వారా శిక్షింపవలసిన విషయంగా నిర్ణయించాలి. దీనిని నేరం, విచారణ, శిక్షలకు సంబంధించిన 1919 నాటి భారతప్రభుత్వ చట్టంలోని XI భాగంలో చేర్చాలి.

### I బహిష్కరణ నేరం - నిర్వచనం

(1) క్రింది పరిస్థితుల్లో ఒకవ్యక్తి మరొకవ్యక్తిని బహిష్కరించినట్లౌతుంది.

ఇది, దీని తర్వాతవచ్చే న్యాయపరమైన అంశాలు బర్మాబహిష్కరణ వ్యతిరేక చట్టం, 1922, నుండి కేసుకు తగిన మార్పులతో తీసుకోబడినాయి.

ఎ. ఒక ఇల్లు లేక భూమిని బాడుగకి /కౌలుకి తీసుకోవడం లేదా ఆక్రమించుకోవడం లేదా ఉపయోగించుకోవడం, కష్టం చేసుకోవడం, ఇతరులతో కలిసి వ్యాపారం చేసుకోవడం, ఇంకొకరికి సేవచెయ్యడం లేక ఇంకొకరితో సేవ చెయ్యించుకోవడం, ఇవి లేక ఇలాంటి సామాన్యమైన పనులలో ఒకరు ఇంకొకరిని అడ్డుకుంటే అది బహిష్కరణ అవుతుంది.

బి. రాజ్యాంగంలో పేర్కొన్న ప్రాథమిక హక్కులకు లేక ఇతర పౌరహక్కులకు వ్యతిరేకం కాని సాంఘిక, వృత్తి వ్యాపార సంబంధాలను నిరోధించడం బహిష్కరణ అవుతుంది.

సి. ఒకవ్యక్తి న్యాయ సమ్మతమైన హక్కులను అనుభవించనీకుండా జోక్యంచేసుకోవడం, అవరోధం కలిగించడం, ఇబ్బంది పెట్టడం కూడా బహిష్కరణ అవుతుంది.

## II బహిష్కరణకు శిక్ష

ఒకవ్యక్తి న్యాయసమ్మతంగా చెయ్యదగిన పనిని చెయ్యనివ్వకుండా, చెయ్యకూడని పనిని చేసేటట్లు చెయ్యడం, అతనికి శారీరకంగా గాని, మానసికంగా గాని, అతని కీర్తికి గాని సంపదకు గాని, వ్యాపారానికి గాని, జీవనవిధానానికి గాని, హానిచెయ్యడం అతనికి ఇష్టమైన వ్యక్తుల్ని బహిష్కరించడం - ఇలాంటివి చేసిన వారు ఏడేళ్ళదాకా జైలు శిక్షకు లేక అపరాధానికి లేక రెండింటికీ అర్హులు అవుతారు.

కాని ముద్దాయి ఇతరుల ప్రోత్సాహంతోగాని, ఇంకొకరితో చెయ్యికలిపిగాని, కుట్రతోగాని, ఒప్పందంతోగాని బహిష్కరణకు పాల్పడలేదు అని కోర్టు నమ్మితే శిక్షార్హుడు కాకుండా పోతుంది.

## III బహిష్కరణను ప్రోత్సహించేవారికి, అందుకు దోహదం చేసేవారికి శిక్ష

ఎ. ఎవరైనా బహిరంగంగా బహిష్కరణకు పూనుకున్నా లేక బహిష్కరణకు అనుకూలంగా ఏదైనా ప్రతిపాదనను ప్రచురించినా లేక పంచిపెట్టినా

బి. ఉద్దేశపూర్వకంగా గాని, విశ్వసించి గాని ఒకస్టేట్‌మెంటునో, నివేదికనో లేక పుకారునో సృష్టించినా, ప్రచురించినా, పంచిపెట్టినా

సి. ఇంకే పద్ధతిలోనైనా ఒకవ్యక్తినిగాని మరోవర్గప్రజలను గాని బహిష్కరించడానికి ప్రోత్సహించినా, దోహదం చేసినా అయిదేళ్ళు జైలు శిక్ష లేక అపరాధం లేక రెండూ విధించబడతాయి.

*వివరణ:* పైన పేర్కొన్నట్లుగా ఒకవ్యక్తి బాధకు గురికావడం అన్నది అతని మీద జరిగినా అతని పేరు చెప్పకుండా జరిగినా నేరమే అవుతుంది.

### IV బహిష్కరిస్తామని బెదిరిస్తే శిక్ష

ఒకవ్యక్తి న్యాయసమ్మతంగా చెయ్యవలసినపనిని చేస్తే, చెయ్యకూడదని; చెయ్యకూడనిపనిని చెయ్యకపోతే చెయ్యమని లేకుంటే బహిష్కరిస్తామని బెదిరిస్తే, అది సాంఘిక బహిష్కరణ అవుతుంది. అందుకు అయిదేళ్ళ జైలు శిక్షగాని, అపరాధంగాని రెండూగాని శిక్షలు.

*మినహాయింపు :* అది కార్మిక వివాదానికి సంబంధించిగాని వ్యాపార పోటీకి సంబంధించి గాని బహిష్కరణ కాకపోతే దీని కిందికి రాదు.

*గమనిక :* ఈ నేరాలన్ని విచారించదగిన నేరాలు.

### మూడో నియమం

### వివక్షకు వ్యతిరేకంగా రక్షణ

అణచబడ్డవర్గాల వాళ్ళు భవిష్యత్తులో శాసనం ద్వారాగాని ప్రభుత్వం ద్వారాగాని వివక్షను ఎదుర్కోవలసి వస్తుందని భయపడుతున్నారు. అందువల్ల శాసనంగాని ప్రభుత్వంగాని అణచబడ్డ వర్గాల వాళ్ళు ద్వేషపూరితమైన వివక్షను చూపడానికి వీల్లేకుండా చట్టంలో అవకాశం కల్పిస్తే తప్ప వాళ్ళు అధిక సంఖ్యాకుల పాలనలో ఉండడానికి ఒప్పుకోరు.

అందువల్ల భారతదేశ రాజ్యాంగ చట్టంలో క్రింది అధికారిక సూత్రాలు కల్పించాలని ప్రతిపాదిస్తున్నాం.

"భారతదేశంలోని ఏప్రాంతంలోనైనాసరే అస్పృశ్యత కారణంగా, ప్రజల హక్కులను కాలరాచే ఏచట్టాన్నిగాని, ఆజ్ఞనుగాని నియమ నిబంధనల్నిగాని జారీచేసే హక్కు ఏ అధికారికీ సాధ్యంకాదు.-

1. సంపదను కాంట్రాక్టు చెయ్యడం, వ్యాజ్యం చెయ్యడం, ఆధారం చూపడం వారసత్వంగా పొందడం, కొనడం, కౌలుకు ఇవ్వడం, అమ్మడం సంపదను కలిగి ఉండడం.

2. సివిల్, మిలటరీ ఉద్యోగాల్లో, విద్యాసంస్థల్లో రాజ్యంలోని విభిన్నవర్గాలకు కల్పించిన ప్రాతినిధ్యానికి భంగం కాకుండా ప్రవేశించడానికి అర్హులు కావడం.

3. అన్నిజాతులు, తరగతులు, కులాలకు అన్వయించే నిబంధనలకు, పరిమితులకు లోబడి, సౌకర్యాలను, అవకాశాలను, విద్యాసంస్థలను, ఇళ్లు, సత్రాలు, బావులు, చెరువులు, రోడ్లు, దారులు, వీధులు, భూమిమీద, గాలిలో, నీళ్ళమీద సౌకర్యాలు, ప్రభుత్వపు ఇతర

పబ్లిక్ స్థలాలో ఉండే వినోదస్థలాలు. వాటి ద్వారాలభించే సుఖసంతోషాలను అనుభవించడానికి హక్కు.

4. సామాన్య ప్రజానీకం కోసం లేక ఒకే విశ్వాసానికి, మతానికి చెందిన ప్రజల కోసం అనుమతించబడిన, నిర్వహించబడిన, సృష్టించబడిన, అంకితం చెయ్యబడిన మత లేక ధర్మసంస్థల ద్వారాలభించే ప్రయోజనాలను పక్షపాతంలేకుండా పంచుకోడానికి అర్హత.

5. వ్యక్తి రక్షణకు లేక సంపద రక్షణకు కల్పించబడిన సకల శాసనాల ప్రయోజనాలను పొందడానికి అర్హత - వీటిని అస్పృశ్యత నెపంతో తక్కిన వాళ్ళతో సమానంగా అనుభవించడాన్ని బహిష్కరిస్తే శిక్షకు, అపరాధానికి అర్హులౌతారు.

## నాలుగో నియమం

## చట్టసభల్లో తగిన ప్రాతినిధ్యం

అణచబడ్డవర్గాల వాళ్ళ సంక్షేమాన్ని కాపాడుకోవడం కోసం శాసన కార్య నిర్వహణాధికారాలను ప్రభావితం చెయ్యడానికి తగిన రాజకీయాధికారం ఇవ్వాలి. ఇందుకోసం ఎన్నికల శాసనంలో క్రింది అంశాలు చేర్చాలని వాళ్ళు డిమాండ్ చేస్తున్నారు.

1. కేంద్ర రాష్ట్ర చట్టసభల్లో తగిన ప్రాతినిధ్యం వహించడానికి హక్కు.

2. వాళ్ళలోంచే తమ ప్రతినిధుల్ని ఎన్నుకోడానికి హక్కు.

ఎ. వయోజన వోటుద్వారా.

బి. మొదటి పదేళ్ళు ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా, తర్వాత ఉమ్మడి నియోజకవర్గాలు మరియు రిజర్వుడ్ స్థానాలద్వారా. ఉమ్మడి నియోజకవర్గాలు వయోజన వోటుతో కలిసిఉండాలి, తప్ప, అణచబడ్డ వర్గాల వాళ్ళ అభిమతానికి వ్యతిరేకంగా ఉమ్మడి నియోజక వర్గాలను వాళ్ళమీద రుద్దరాదని అర్థం చేసుకోవాలి.

*గమనిక :* ఇతర కులాల/మతాల వారికి కల్పించిన ప్రాతినిధ్యం ఏమిటో తెలిసేదాకా అణచబడ్డవర్గాల వారికి తగిన ప్రాతినిధ్యం పరిమాణాన్ని నిర్వచించడం సాధ్యం కాదు. అయితే అణచబడ్డవర్గాలకు అనుమతించిన దానికి మించిన అవకాశాల కోసం ఇతర వర్గాల కోరికల్ని వాళ్ళు ఒప్పుకోరు. ఈ విషయంలో వాళ్ళ అసౌకర్యస్థానంలో ఉండడానికి సమ్మతించరు. ఎలాగైనా సరే బొంబాయి, మద్రాసులలోని అణచబడ్డవర్గాల వాళ్ళు తమ జనాభాకు తగిన నిష్పత్తిలో ప్రాతినిధ్యాన్ని కల్పించాలి. ఆ రాష్ట్రాలలో ఇతర మైనారిటీలకు అనుమతించిన ప్రాతినిధ్యంతో దానికి సంబంధంలేదు.

## అయిదో నియమం

## ఉద్యోగాల్లో తగిన ప్రాతినిధ్యం

ఉన్నత కులాలకు చెందిన అధికార్లచేతుల్లో అణచబడ్డవర్గాల వాళ్ళు చాలా కష్టాలనుభవించారు. ఆ అధికార్లు న్యాయం, సమానత్వం సుహృద్భావాలను తుంగలోతొక్కి సవర్ణ హిందువులకు అనుకూలంగా, అణచబడ్డవర్గాల పట్ల ద్వేషంతో వాళ్ళ విచక్షణను చట్టాన్ని దుర్వినియోగంచేసి ప్రభుత్వ రంగాన్ని ఏకభుక్తం చేసుకున్నారు. ప్రభుత్వ రంగ సర్వీసుల్లో సవర్ణహిందువుల గుత్తాధిపత్యాన్ని నాశనంచేసి అణచబడ్డవర్గాలవారితో సహా అన్ని కులాలకూ తగిన భాగస్వామ్యం కల్పిస్తూ నియామకాలను క్రమ బద్ధంచెయ్యడం ద్వారా ఈ అన్యాయాన్ని పరిహరించవచ్చు. ఇందుకోసం అణచబడ్డవర్గాలవాళ్ళు రాజ్యాంగ నిబంధనల్లో క్రిందిసూత్రాలను చేర్చాలని ప్రతిపాదించాలి.,

1. కేంద్రంలోను, రాష్ట్రాల్లోను ప్రభుత్వ సర్వీసులను అజమాయిషీచేస్తూ నియామకాలు చెయ్యడంకోసం పబ్లిక్ సర్వీస్ కమిషన్‌ను ఏర్పాటు చెయ్యాలి.

2. చట్టసభ ద్వారా చేసే ప్రతిపాదన ద్వారా తప్ప మరే రకంగానూ పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లోని ఏసభ్యుడు కూడా తొలగించబడకూడదు. అలాగే అతడు పదవీ విరమణ చేసిన తర్వాత అతనిని మరే ప్రభుత్వోద్యోగంలోనూ నియమించరాదు.

3. ప్రతిభను పరీక్షించే పరీక్షలు నిర్వహిస్తూ పబ్లిక్ సర్వీస్ కమిషన్ క్రింది బాధ్యతల్ని నిర్వహిస్తుంది.

ఎ. అన్నికులాలకు తగిన ప్రాతినిధ్యం లభించేవిధంగా ఉద్యోగాల్లో నియామకాలు చేస్తుంది.

బి. ఆయా రంగాలలోని ఉద్యోగాల్లో విభిన్న కులాల ప్రాతినిధ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఎప్పటికప్పుడు సరిచేస్తూ ఉంటుంది.

## ఆరో నియమం

## పక్షపాతంగా వ్యవహరించడాన్ని ప్రయోజనాలను విస్మరించడాన్ని, నివారించడం.

భవిష్యత్తులో మెజారిటి పాలన సనాతనుల పరిపాలన అనే వాస్తవాన్నిదృష్టిలో పెట్టుకొని ఆ మెజారిటీ పాలనవాళ్ళపట్ల సానుభూతి కలిగి ఉండదు. వాళ్ళప్రయోజనాల పట్ల పక్షపాతంతో ఉంటుంది, వాళ్ళ అవసరాలను విస్మరిస్తుంది - అనే భయాన్ని త్రోసిపుచ్చలేం. చట్టసభల్లో ఎంతగా తగినంత ప్రాతినిధ్యం కల్పించినా అణచబడ్డవర్గాల వాళ్ళు మైనారిటీలో ఉంటారు. అణచబడ్డవర్గాల వాళ్ళు రాజ్యాంగంలో దానికి సంబంధించి నివారణ సదుపాయం కల్పించబడాలని కోరుతున్నారు. అందువల్ల భారత రాజ్యాంగంలో క్రింది నిబంధనను చేర్చాలని ప్రతిపాదిస్తున్నారు.

బ్రిటిష్ ఉత్తర అమెరికా చట్టం 1867, సెక్షన్ 93

1. దేశంలోను రాష్ట్రంలోను అణచబడ్డవర్గాల వారికి కల్పించబడిన విద్య, భద్రత, ప్రభుత్వ ఉద్యోగాల్లో నియామకం, ఇతర సాంఘిక, రాజకీయ అభివృద్ధి అవకాశాలకు భంగం కలక్కుండా చూడడం, చట్టంద్వారా స్థాపించబడిన శాసన సభ ప్రభుత్వం, ఇతర అధికారుల బాధ్యత.

2. రాష్ట్రంలోగాని, దేశంలోగాని ఈ సెక్షన్‌లోని నిబంధనలు అతిక్రమింపబడితే రాష్ట్రానికి సంబంధించి. కేంద్రానికి సంబంధించి స్టేట్ సెక్రటరికి నివేదించవచ్చు.

3. కౌన్సిల్‌లోని గవర్నర్ జనరల్‌కు గాని, కేంద్రంలో స్టేట్ సెక్రటరీకిగాని రాష్ట్రం లేక కేంద్రప్రభుత్వం ఈ సెక్షన్‌లోని నిబంధనలను అమలు పరచడానికి తగిన చర్య తీసుకోలేదని అనిపిస్తే, సర్వాధికారులుగా ఆ సెక్షన్‌లోని నిబంధనలు అమలు జరిపేటట్లు చూడవలసి ఉంటుంది.

## ఏడో నియమం

## ప్రత్యేక ప్రభుత్వ జాగ్రత్త

అణచబడ్డవర్గాలవాళ్ళ నిస్సహాయ, దురదృష్ట నీరస స్థితికి సనాతనుల వ్యతిరేకత కారణం. సనాతనులు వాళ్ళను సమాన స్థాయిని సమాన గౌరవాన్ని అనుభవించనివ్వకుండా అడ్డుకుంటారు. అణచబడ్డవర్గాలవాళ్ళు దారిద్ర్యబాధితులు, భూమిలేని నిరుపేదలు అన్నవి వాస్తవాలే అయినప్పటికీ అవేవాళ్ళ అర్థికస్థితికి కారణాలుకావు. అణచబడ్డవర్గాల వాళ్ళ దారిద్ర్యానికి వాళ్ళు బతకడానికి అవసరమైన సంపాదనామార్గం లేకుండా చెయ్యడం కారణమని గుర్తించాలి. ఈ సత్యం సవర్ణుడైన కూలిని అణచబడ్డవర్గాల వాళ్ళనుంచి వేరే చేస్తుంది. ఇదే వాళ్ళిద్దరి మధ్య ఘర్షణకు కారణం అవుతుంది. అణచబడ్డవర్గాల వారిని పీడించడానికి, అణచి పెట్టడానికి అనుసరించే విధానాలు అనేక రకాలని, అణచబడ్డవర్గాల వారికి తమను తాము రక్షించుకునే శక్తి చాలా పరిమితంగా ఉందని గుర్తు పెట్టుకోవాలి. ఇందుకు సంబంధించిన వాస్తవాలు, భారత దేశమంతా మామూలుగా జరిగేవి, 1892 నవంబర్ 5 నాటి మద్రాసు ప్రభుత్వ రెవెన్యూ బోర్డు ప్రొసీడింగ్స్ సంక్షిప్త పాఠంలో పేర్కొనబడ్డాయి. అందులోంచి క్రిందివి ఉదాహరిస్తున్నా:

134. అణచివేత విధానాలు ఇంతకుముందు సూచించిన వాటిని పేర్కొనాలి. పరయా (అస్పృశ్యుల) అవిధేయతను శిక్షించడానికి వాళ్ళ యజమానులు

ఎ. గ్రామ కచేరిలోగాని, క్రిమినల్‌కోర్టులోగాని తప్పుడు కేసులు పెడతారు.

బి. ప్రభుత్వానికి అర్జీపెట్టి వాళ్ళ నివాసాల చుట్టూ ఉన్న భూమిని ఆక్రమించుకొని వాళ్ళ పశువులను మేతకు రాకుండా చేస్తారు. లేదా వాళ్ళను గుడికి రానీకుండా చేస్తారు.

సి. ప్రభుత్వ రికార్డులో దొంగతనంగా మిరాసిపేర్లు నమోదు చేసుకుంటారు.

డి. గుడిసెలు పడగొట్టి, పెరళ్ళను నాశనం చేస్తారు.

ఇ. అనాదిగా వస్తున్న ఆక్రమణ హక్కును తిరస్కరిస్తారు.

ఎఫ్. అస్పృశ్యుల పంటల్ని దౌర్జన్యంగా కోసుకుపోతారు. ఎవరైనా అడ్డుకుంటే దొంగతనం కేసులు పెడతారు.

జి. దొడ్డిదారిలో రికార్డులను మాయంచేసి వాళ్ళను నాశనంచేస్తారు.

హెచ్. వాళ్ళ పొలాలకు నీళ్ళు పోనీకుండా జేస్తారు.

ఐ. చట్టంపరంగా తెలియజేయకుండానే కౌలుదారుని సంపదను తీసేసుకుంటారు.

135. ఈ ఇబ్బందిని పరిహరించడానికి సివిల్‌కోర్టులు, క్రిమినల్ కోర్టులు ఉన్నాయంటారు. కోర్టులేమో ఉన్నాయి. కాని భారతదేశం నియమించదు. కోర్టుకు వెళ్ళాలంటే ధైర్యం ఉండాలి, న్యాయజ్ఞానాన్ని కొనాలంటే వకీళ్ళను పెట్టుకోవాలంటే డబ్బుకావాలి. కేసు నడిచేటప్పుడు బతకడానికి డబ్బుకావాలి. కేసులు మొదటి కోర్టు తీర్పుమీద ఆధారపడి ఉంటాయి. ఈ కోర్టులు భూస్వామ్య సంపన్న వర్గాల ఆధిపత్యంలో ఉంటాయి. న్యాయాధికారులు ఆ వర్గం వాళ్ళకు అనుకూలంగానే సాధారణంగా తీర్పుచెప్పుతారు. వీళ్ళలో లంచగొండ్లు కూడా ఉంటారు.

136. అధికార వ్యవస్థమీద ఈ వర్గాల ప్రభావం ఉంటుందనడం అతిశయోక్తికాదు. కింది నుంచి పైదాకా అన్ని ఆఫీసులు వాళ్ళ ప్రతినిధులతో నిండిపోయి ఉన్నాయి. వాళ్ళ ప్రభావం ఉంటుంది.

ఈ పరిస్థితుల్లో అన్ని ప్రభుత్వ కార్యకలాపాల్లోను దానికి సంబంధించి, ప్రయత్నం జరిగితే తప్ప, ప్రభుత్వం ఖచ్చితమైన విధానంతో నిర్దిష్టమైన అభిప్రాయంతో సమాన అవకాశాలను ఆచరణలో ప్రవేశపెడితే తప్ప అణచబడ్డవర్గాల ఉద్ధరణ అన్నది కేవలం ఆశగానే మిగిలి పోతుంది. దీనిని సాధించడానికి వాళ్ళ సమస్యలను మాత్రమే పరిశీలించే శాఖను పెట్టేటట్లు భారతప్రభుత్వ చట్టంలో నిబంధన పెట్టాలి - అని అణచబడ్డవర్గాలు ప్రతిపాదిస్తున్నాయి.

1. రాజ్యాంగాన్ని ప్రవేశ పెట్టడంతోటే, భారత ప్రభుత్వంలో ఒక మంత్రి అధీనంలో ఉండేటట్లు అణచబడ్డవర్గాల వారి ప్రయోజనాలను కాపాడే, వాళ్ళ అభివృద్ధికి దోహదం చేసే శాఖను సృష్టించాలి.

2. కేంద్రశాసన సభ విశ్వాసం పొందనంత కాలం అతడు ఆ శాఖను నిర్వహిస్తాడు.

3. చట్టం ప్రకారం సంక్రమించిన బాధ్యతల్ని అధికారాల్ని నిర్వహించడం మంత్రి బాధ్యత. సామాజిక అన్యాయం అణచబడ్డవర్గాల అణచివేతను, వాళ్ళ అభివృద్ధిని కుంటుపరచడం జరక్కుండా చూస్తూ అందుకు సంబంధించిన అంశాల్లో సహకరించడం అతని బాధ్యత.

4. గవర్నర్ జనరల్‌కు

ఎ అణచబడ్డవర్గాల వారి విద్య, శుభ్రత మొదలైన అంశాలకు సంబంధించిన వాళ్ళ అభివృద్ధికి చెందిన బాధ్యతల్ని కొన్నింటినిగాని అన్నింటినిగాని ఆ మంత్రికి దాఖలు చేసే అధికారం ఉంది.

బి. ప్రతి రాష్ట్రంలోను ఆ మంత్రి ఆధ్వర్యంలోగాని, అతని సహకారంతోగాని పనిచేసే అణచబడ్డవర్గాల అభివృద్ధి బ్యూరోలను నియమించే అధికారం ఉంది.

## ఎనిమిదో నియమం

### అణచబడ్డ వర్గాలు - మంత్రివర్గం

శాసనసభల్లో తమ స్థానాలద్వారా ప్రభుత్వ కార్యకలాపాలను అణచబడ్డ వర్గాల వాళ్ళు ప్రభావితంచేసే అధికారం పొందినట్లుగానే, వాళ్ళకు ప్రభుత్వ విధానాన్ని రూపొందించడంలో కూడా అవకాశం రావాలి. వాళ్ళకు మంత్రి వర్గంలో స్థానం లభించినప్పుడే అది సాధ్యమౌతుంది. అందువల్ల ఇతర మైనారిటీ వర్గాలతో సమానంగా అణచబడ్డవర్గాల వారికి కూడా మంత్రివర్గంలో ఉండే నైతిక హక్కును గుర్తించాలని కోరుతున్నారు. ఈ ప్రయోజనం దృష్ట్యా అణచబడ్డ వర్గాల వాళ్ళు ఇలా ప్రతిపాదిస్తున్నారు.

అణచబడ్డవర్గాలకు మంత్రివర్గంలో స్థానం లభించేటట్లు చూసే ప్రయత్నం చెయ్యవలసిందిగా గవర్నర్ మరియు గవర్నర్ జనరల్‌లకు సూచన లివ్వాలి.

## II

అస్పృశ్యులు చేసిన ఈ డిమాండ్లకు ఏగతి పట్టింది? అల్పసంఖ్యాక వర్గాల కమిటీ సభ్యులు ఎలాస్పందించారు? దానిని తెలుసుకోవాలంటే [illegible]

పెందిన అల్పసంఖ్యాకవర్గాల కమిటీ నివేదికను పరిశీలిస్తే అర్థమౌతుంది. ఆ నివేదికలోంచి కొన్ని భాగాలను ఇక్కడ పేర్కొంటాను.

5. "అనేక కమిటీ మీటింగుల్లో కొన్ని నిర్ణీత స్థానాలను కుల ప్రాతినిధ్యానికి కేటాయించాలనే వాదనలు ముందు కొచ్చాయి. అల్పసంఖ్యాకులకు వాళ్ళ జనాభాను దృష్టిలో పెట్టుకొని ఈ ప్రత్యేకస్థానాల కేటాయింపు జరగాలని కూడా అడిగారు. ఇందుకు మూడు మార్గాలు సూచింపబడ్డాయి. 1. నామినేషన్ 2. నియోజకవర్గం 3. ప్రత్యేకనియోజకవర్గం.

6. నామినేషన్ పద్ధతి వద్దని ఏకగ్రీవంగా భావించబడింది.

7. కులాల జనాభాను బట్టి కొన్ని స్థానాలను రిజర్వు చేసే షరతు మీద సంయుక్త ఎన్నికలు ప్రతిపాదించబడింది. ఎన్నికల వ్యవస్థ అల్పసంఖ్యాక వర్గాల ప్రాతినిధ్యం పొందినప్పుడు, ఆ ప్రాతినిధ్యం తగినదే నన్న గ్యారంటీలేదు, అదే నామినేషన్ లేక మరో పద్ధతిలో అయితే మైనారిటీ ప్రతినిధులు మెజారిటీ కులాల చేత ఎన్నుకోబడతారు.

ఇది నిజానికి పేరుకు ఒకానొక కులప్రాతినిధ్యమని, ఆచరణతో కుల నియోజక వర్గాలకు ప్రత్యక్ష రూపమని భావించబడింది.

8. దానిపైన జరిగిన చర్చ ప్రత్యేక నియోజక వర్గాల వాదనే అందరికీ అభిమతమని తేల్చింది. ఈ పథకానికి అభ్యంతరముంటే అది భారతదేశంలో ముందు జరిగిన చర్చకు సంబంధించిందే. ఇందులో పరిష్కారానికి కష్టమైన పెద్ద సమస్య ఉంది. కేంద్రంలో రాష్ట్రాలలో కులప్రాతినిధ్యం ఏ పరిమాణంలో ఉండాలన్నదే ఆ సమస్య. శాసనసభలోని మొత్తం స్థానాలను కులాలకు పంచిపెడితే, స్వతంత్రమైన రాజకీయాభిప్రాయాలకు లేక నిజమైన రాజకీయపార్టీలకు ప్రగతి ఉండదు. పైగా అణచబడ్డవర్గాల ప్రతినిధి, వాళ్ళను హిందూ జనాభా నుంచి వేరుచేసి, ఎన్నికల కోసం ప్రత్యేక జాతి, కులంగా పరిగణించాలని డిమాండ్ చెయ్య డంతో ఈ సమస్య జటిలమైంది.

9. కులాలకు స్థానాలను నిర్ణయించడంలోని పెద్ద అభ్యంతరాన్ని ఎదుర్కోడానికి ఎనభై లేక తొంభైశాతం అలా ఉంచి, తక్కిన ఇరవై లేక పదిశాతాన్ని బహిరంగ ఎన్నికలతో నింపొచ్చు అని సూచింపబడింది. అయితే ఇది తమకులాల కిచ్చిన గ్యారంటీని కాపాడేది కాదని కొన్ని కులాలు/మతాలు వాదించాయి.

10. సబ్ కమిటీ సభ్యుడైన మౌలానా మహమ్మద్ అలి ఒక సూచన చేశారు. ఏ కుల/మత వ్యక్తి అయినా ఇతర కులాల/మతాల వోట్లలోంచి కనీసం 40% మద్దతు సంపాదించుకోలేక పోయినట్లైతే, అతడు ఎన్నిక కావడానికి వీల్లేదు అన్నారు. ఇదీ పరిశీలింపబడింది. అయితే దీనికోసం ప్రత్యేకంగా కుల/మత రిజిస్టర్లు పెట్టాలి కదా అన్న ప్రశ్న వచ్చింది.

11. మహిళలకు ప్రత్యేక నియోజక వర్గాలు లేక కొన్నిస్థానాల రిజిర్వేషన్ పెట్టి పురుషులతో సమానంగా వాళ్ళు ఎన్నిక కావాలని ఎవరూ వాదించలేదు. రాజకీయ జీవితంలో మహిళలు కూడా చురుకైన పాత్ర నిర్వహించాలనే అభిప్రాయాన్ని ప్రజల్లో కలిగించడానికి, ఇప్పుడు చట్ట సభల్లో వాళ్ళు ప్రాతినిధ్యం వహించడానికి, మొదటి మూడు కౌన్సిళ్ళలో 5% స్థానాలు మహిళలకు రిజర్వు చెయ్యాలని, ఎన్నికైన అభ్యర్థులు కోఆప్ట్ చేసుకోవడం ద్వారా వాటిని భర్తీ చెయ్యాలి అభిప్రాయం వ్యక్తమైంది.

12. II (రెండవ) నంబర్ సబ్‌కమిటీ (రాష్ట్రరాజ్యాంగం) సిఫారస్‌ల మీద సాధారణ సమ్మతి లభించింది. నూతన రాజ్యాంగం విజయవంతంగా పనిచెయ్యాలంటే రాష్ట్రం ప్రభుత్వంలో (ప్రొవిన్షియల్ ఎగ్జిక్యూటివ్) ముఖ్యమైన అల్పసంఖ్యాక కులాల ప్రాతినిధ్యం చాలా ముఖ్యం. ఆవిధంగానే ఫెడరల్ ఎగ్జిక్యూటివ్‌లో మహమ్మదీయుల ప్రాతినిధ్యం ఉండాలి - అన్నది ఆ సిఫారస్. చిన్న మైనారిటీల తరపున, రాష్ట్రం, ఫెడరల్ ఎగ్జిక్యూటివ్‌లలో సమిష్టిగా గాని, విడి విడిగా గాని వాళ్ళ ప్రాతినిధ్యం ఉండాలి. ఇది అసాధ్యమనిపిస్తే ఒక్కోమంత్రి వర్గంలో అల్పసంఖ్యాక వర్గాల సంక్షేమాన్ని సంరక్షించడానికి ప్రత్యేకంగా ఒక మంత్రి ఉండాలి - అని ప్రతిపాదన వచ్చింది. డా. అంబేద్కర్, సర్దార్ ఉజ్జల్ సింగ్ 'మహమ్మదీయులు' అన్నమాట తర్వాత 'ఇతరముఖ్య మైనారిటీలు' అనేమాటను చేర్చారు.

ఈ పథకంలో ఎగ్జిక్యూటివ్‌లు ఉమ్మడిగా పనిచెయ్యడంలోని కష్టం ప్రస్తావించబడింది.

13. పరిపాలనకు సంబంధించి కేంద్ర రాష్ట్ర ఉద్యోగాల్లో నియామకాలు చెయ్యడానికి పబ్లిక్ సర్వీస్ కమిషన్ ప్రారంభించడానికి ఒప్పందం కుదిరింది. ప్రభుత్వసర్వీసుల్లో అనేక కులాలకు సముచితమైన ప్రాతినిధ్యం ఉండేటట్లు చూడడానికి, ప్రతిభా ప్రమాణాన్ని పాటించడానికి తగిన సూచనలివ్వాలని కూడా ఆమోదించబడింది.

14. భారతప్రభుత్వం, ఏదైనా ఒప్పందం ఉంటే తప్ప, కులాలకు ఇష్టంలేకుండా ఏరకమైన ఎన్నికల విధానాన్ని వాళ్ళనెత్తిన రుద్దదు అని స్పష్టంచెయ్యబడింది. ఒప్పందంలేని పక్షంలో, ప్రత్యేక నియోజక వర్గాలు, వాటిలో ఎన్ని లోపాలు నష్టాలు ఉన్నా నూతన రాజ్యాంగంలో ఎన్నిక విధానానికి పునాదిగా ఉంటాయి. ఈ పరిస్థితుల్లో అణచబడ్డవర్గాల వారి వాదాలకు తగినంతగా ప్రాముఖ్యం ఇవ్వబడతాయి.

15. అల్పసంఖ్యాక వర్గాలు, అణచబడ్డ వర్గాలవాళ్ళు, తమ డిమాండ్లను సహేతుకమైన పద్ధతిలో ఒప్పుకోకపోతే, భారతదేశంలో రాబోయే స్వయంపాలక రాజ్యాంగాన్ని ఒప్పుకోరు అన్నది స్పష్టం.

కేంద్ర ప్రభుత్వ స్వరూప స్వభావాలను గురించి చర్చించడానికి రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ నియమించిన ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ, మరో అస్పృశ్యుని సమస్యని పరిశీలించవలసి వచ్చింది. ఈ కమిటీ కాన్ఫరెన్స్‌కు సమర్పించిన నివేదికలో ఇలా పేర్కొంది.

"వీలైతే రెండు సభల్లో, ఖచ్చితంగా క్రింది సభలో అణచబడ్డ వర్గాలవారు, భారతీయ క్రైస్తవులు, యూరోపియన్లు, ఆంగ్లో ఇండియన్లు, భూస్వాములు, వ్యాపారులు యూరోపియున్ మరియు ఇండియన్ శ్రామికులు వాళ్ళకు ప్రాతినిధ్యం కల్పించాలి అన్న అంశంమీద సబ్ కమిటీలో ఏకాభిప్రాయం వ్యక్తమైంది. అల్పసంఖ్యాక వర్గాల సబ్ కమిటీ రిపోర్టు మీద ఇది ఆధారపడి ఉంటుంది.

## III

రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ మొదటి సమావేశం ముగిసే లోపల రెండు కమిటీల నివేదికలు కాన్ఫరెన్స్ ముందు ఉంచబడ్డాయి. రెండూ ఆమోదింప బడ్డాయి కూడా. వివరాల మీద ఒప్పందం సంగతి లేకున్నా అస్పృశ్యులు రాజకీయ రాజ్యాంగ అవసరాల కోసం ప్రత్యేక గుర్తింపు పొందదగిన వారన్న అంశం ఏకగ్రీవంగా ఆమోదింప బడిందన్న అంశాన్ని గుర్తించాలి.

రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ మొదటి సమావేశం ముగిసినప్పుడు తీసుకున్న ఈ నిర్ణయంమీద తన అభిప్రాయాన్ని తెలపని పార్టీ దేశంలో ఒకటే ఒక్కటి ఉంది. అది కాంగ్రెస్. కాంగ్రెస్ రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌ను బహిష్కరించి, నియమోల్లంఘనోద్యమంలో పాల్గొనటమే ఇందుకు కారణం. కాన్ఫరెన్స్ రెండో సమావేశం జరిగేటప్పటికి ప్రభుత్వానికి కాంగ్రెస్‌కు మధ్య రాజీ కుదిరింది. రెండో సమావేశంలో పాల్గొని కాన్ఫరెన్స్ ఎదుర్కొంటున్న అనేక సమస్యల్ని పరిష్కరించడానికి కాంగ్రెస్ సమ్మతించటం ఫలితమే ఈ రాజీ. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ తొలి సమావేశంలో ప్రతినిధులు ప్రదర్శించిన ఇచ్చిపుచ్చుకునే ధోరణి, సుహృద్భావ వాతావరణం, ఆనందదాయకమైన సంబంధం, చూపిన వారందరూ సమావేశాలు జరిగే కొద్దీ అభివృద్ధి చెందుతుందని ఆశించారు. నిజానికి సమావేశానికి కాంగ్రెస్ హాజరైనందు వల్ల ఒప్పందం కుదురుతుందని అనుకున్నారు.

అందువల్ల కాన్ఫరెన్స్ విజయం సాధించేటట్టు నడపడానికి కాంగ్రెస్ కోసం అందరు ఎదురు చూస్తున్నారు. దురదృష్టవశాత్తు కాంగ్రెస్ గాంధీని తన ప్రతినిధిగా ఎన్నుకొంది. భారతదేశం అదృష్టాన్ని (తలరాతను) నడిపించడానికి పనికిమాలిన మనిషిని ఎన్నుకొని ఉండకూడదు. ఐక్యంచేసే వ్యక్తిగా గాంధీ ఘోరంగా విఫలమయ్యాడు. గాంధీ తనకు తాను గొప్ప వినయవంతుడుగా ప్రదర్శించుకొంటాడు. కాని రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో గాంధీ ప్రవర్తన అతను చిన్న బుద్ధి గలవాడుగా నిరూపించింది. సమావేశానికి రాబోయే ముందుగా గాంధీ ప్రభుత్వంతో కుదిరిన ఫలవంతమైన రాజీ ఫలితంగా కాంగ్రెసేతర ప్రతినిధి వర్గాన్ని తృణీకార భావంతో చూశారు. తనకు అవకాశం వచ్చినప్పుడల్లా కాంగ్రెస్ ప్రతినిధిగా తాను మాత్రమే దేశం ప్రతినిధినని బహిరంగంగా అనేవారు, అవమానించేవారు. భారతీయ ప్రతినిధులను ఐక్యం చేయడానికి బదులు అగాధాన్ని పెంచారు. జ్ఞానదృష్టితో గాంధీ చాలా అల్పుడుగా తనకుతాను నిరూపించుకున్నాడు. సమావేశంలో అనేకమైన రాజ్యాంగ ప్రశ్నలు, మత సంబంధమైన ప్రశ్నలు చర్చకు వచ్చినప్పుడు చాలా చప్పటి

మాటలు మాట్లాడాడు తప్ప నిర్మాణాత్మకమైన సలహాలు ఇవ్వలేదు. ఆయనకు సిద్ధాంతంగా తోచిన అంశంమీద ఏ రకంగాను రాజీపడటానికి ఇష్టపడడు. వీలయినన్ని రకాలుగా వ్యతిరేకిస్తాడు. కాని ఆయనకు సిద్ధాంతంగా తోచిన అంశంనీద కాని ఆయనకు సిద్ధాంతంగా తోచినది ఇతరులకు పక్షపాతంగా కనిపిస్తుంది. ఇతరులకు ఏమాత్రం రాజీపడటానికి వీలుకాని ప్రాథమిక సిద్ధాంతంగా కనిపించే అంశంమీద గాంధీ నికృష్టమైన రాజీ కుదుర్చుకోవడానికి వెనుకాడడు. ఆ విధంగా గాంధీ వింతైన సంకీర్ణ వ్యక్తిగా నిరూపించుకున్నాడు.

రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ రెండో సమావేశంలో అస్పృశ్యుల డిమాండ్లపట్ల గాంధీ అభిప్రాయం అతని వ్యక్తిత్వంలోని విచిత్ర చిహ్నాలకు చక్కని ఉదాహరణ. కాన్ఫరెన్స్ రెండో సమావేశానికి ప్రతినిధులు హాజరైనప్పుడు మొదట ఫెడరల్ కమిటి కలిసింది. 1931 సెప్టెంబరు 15న ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీలో మొట్టమొదట ప్రసంగిస్తూ గాంధీ అస్పృశ్యులను గురించి ప్రస్తావించాడు. ఆయన ఇలా అన్నారు.

"పుట్టినప్పటి నుంచి కాంగ్రెస్ 'అస్పృశ్యు' లనబడేవాళ్ళ సమస్యను పట్టించుకుంటూనే ఉంది. ఒకప్పుడు కాంగ్రెస్ ప్రతీ వార్షిక సమావేశంలోను సోషల్ కాన్ఫరెన్స్‌ను అనుబంధంగా నిర్వహించేది. రనడే ఎన్నో ఇతర పనులతోపాటు ఈ సమస్య మీద కూడా తన శక్తుల్ని అంకితం చేశాడు. సోషల్ కాన్ఫరెన్స్‌కు ఆయన నాయకుడు. కార్యక్రమంలో అస్పృశ్యుల సంస్కరణకు ప్రాముఖ్యం ఉండేది. అయితే 1920 లో కాంగ్రెస్ ఒక పెద్దడుగు ముందుకు వేసింది. అస్పృశ్యతా నిర్మూలనను రాజకీయ వేదిక మీదకు తీసుకు వచ్చింది. దానినొక రాజకీయ కార్యక్రమంగా చేపట్టింది. స్వరాజ్య సంపాదనకు హిందూ ముస్లిం ఐక్యత - అంటే అన్ని వర్గాల ఐక్యత-అత్యంత ఆవశ్యకమని భావించినట్లే, అస్పృశ్యత అనే శాపాన్ని విముక్తి చేయడం కూడా అంతే ఆవశ్యకమని భావించింది. 1920 నాటి ఆ తీర్మానం ఇంకా అమలులో ఉంది. అందువల్ల కాంగ్రెస్ మొదటినుంచి తనను తాను వర్ణించుకున్న జాతీయ స్వభావం కలిగుందని మీరు గుర్తించవచ్చు."

అస్పృశ్యు ఉద్ధరణ కోసం 1922 నాటి కార్యక్రమాన్ని బార్డోలి కార్యక్రమంలో చేర్చబడిన అంశాన్ని ముందుకు తీసుకుపోవడంలో కాంగ్రెస్ ఎలా విఫలమైందో, ఆ సమస్యను కాంగ్రెస్ హిందూ మహాసభకు ఎలా వదిలివేసిందో చూసినవారు గాంధీ చెప్పింది అబద్ధం అని చెప్పడానికి వెనుకాడరు. గాంధీ ప్రసంగం అస్పృశ్యుల డిమాండ్లపట్ల ఆయన ఏమార్గం అనుసరిస్తారో సూచించదు. నాకు మాత్రం దాని సూచన కనబడుతుంది.[1] అయినా ఆయన పరిస్థితి ఏమౌతుందో ఊహించే అవకాశాన్ని ఆయన ప్రజల కివ్వలేదు.

1. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళేముందు నేను బొంబాయిలో గాంధీతో ఇంటర్వ్యూ తీసుకున్నాను. అందులో రాజకీయ అవసరాల కోసం అస్పృశ్యులకు ప్రత్యేక గుర్తింపుకు తాను వ్యతిరేకినని ఆయన నాతో అన్నాడు.

1931 సెప్టెంబరు 17న జరిగిన ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ మీటింగు ఆయనకు వసరమైన అవకాశాన్ని ఇచ్చింది. అజెండాలో ఫెడరల్ లెజిస్లేచర్ల సభ్యుల ఎన్నిక ంది. ఈ విషయం మీద గాంధీ తన దృక్పథాన్ని తెలుపుతూ ఇలా ప్రసంగించాడు:-

"ప్రత్యేక ప్రయోజనాలకోసం ప్రత్యేక నియోజక వర్గాల దగ్గరికి వస్తాను. నేను ంగ్రెస్ తరపున మాట్లాడుతున్నాను. హిందూ ముస్లిం సిక్కు సంబంధాన్ని ప్రత్యేక చర్యల ్వారా సమన్వయపరచాలని కాంగ్రెస్ భావించింది. ఇందుకు గొప్ప చారిత్రక ారణాలున్నాయి. అయితే ఈ సూత్రాన్ని ఇంకే రూపంలోను పొడిగించదు. ప్రత్యేక పయోజనాల పట్టికను విన్నాను. అస్పృశ్యులకు సంబంధించినంత వరకు డా. అంబేద్కర్ ుమి చెప్పదలచుకున్నాడో నేనింకా సరిగా గ్రహించలేదు. అయితే అస్పృశ్యుల పయోజనాలను ప్రస్తావించే గౌరవాన్ని డా. అంబేద్కర్‌తో పాటు కాంగ్రెస్ కూడా ంచుకుంటుంది. అస్పృశ్యుల ప్రయోజనాలు మరే యితరుల ప్రయోజనాల వంటివే. విశాల ారతదేశంలో ఏ ఒక్క వ్యక్తి ప్రయోజనాల వంటివే అని కాంగ్రెస్ అభిప్రాయం. అందువల్ల ు ప్రత్యేకమైన విజ్ఞప్తినైనా నేను గట్టిగా అడ్డుకుంటాను."

ఇది గాంధీ, కాంగ్రెస్ అస్పృశ్యులకు వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించడం తప్ప మరేమీ కాదు. ఇద్దరి మధ్య ఇది అన్నిరకాలా యుద్ధమే అయ్యింది. ఈ ప్రకటన చేసిన గాంధీ, అస్పృశ్యుల సమస్యను చర్చించే ప్రధాన వేదిక అయిన అల్పసంఖ్యాక వర్గాల కమిటీలో ఏమి చేస్తారో నాకు తెలుసు.

గాంధీ హిందూ ముస్లిం సిక్కులనబడే మూడు పార్టీల మధ్య ఒప్పందాన్ని కుదిర్చి, మతసమస్యను ముగించి, అస్పృశ్యులను అప్రధానం చెయ్యడానికి పథకాలు వేస్తున్నాడు. అల్పసంఖ్యాక వర్గాల కమిటీ సమావేశానికి ముందు ముస్లింలతో ప్రత్యేకంగా రాయభారం నడుపుతున్నాడు. అయితే అది పూర్తికాలేదు. ఫలితంగా 1931 సెప్టెంబర్ 28న అల్పసంఖ్యాక వర్గాల కమిటీ సమావేశమైనప్పుడు, నేషనలిస్టు ముస్లిం ప్రతినిధి సర్ ఆలిఇమామ్ చర్చను ప్రారంభించాడు. ఆయన ఇలా మొదలుపెట్టాడు:- .

"ముస్లిం ప్రతినిధి వర్గానికి సంబంధించినంత వరకు ఏమైనా సంప్రదింపులు జరుగుతున్నాయేమో వ్యక్తిగతంగా నాకు తెలియదు. ప్రస్తుతం ఏవైన ప్రతిపాదనలు పరిశీలనలో ఉన్నాయేమో తెలుసుకునే అవకాశం కూడా నాకు రాలేదు. నేనేదో కర్ణాకర్ణిగా విన్నట్లు ఏదైనా ఒక రకమైన అవగాహనకు రావచ్చేమో. దానిని నేను రూఢీగా చెప్పలేను. దానిని గురించి నాకేమీ తెలియదు. సార్! ముస్లిం జాతీయవాదుల దృక్పథాన్ని మీ ముందుంచమని మీరు కోరితే నేను అలాగే చేస్తాను. అలా చేయడానికి మీ అనుమతి కావాలి. ఎందుకంటే ఇది కొంత సమయం తీసుకుంటుంది. ఇలాంటి సమావేశాలలో కాలాన్ని పొదుపు చేయడం ప్రాథమిక లక్ష్యంగా ఉండాలి.

ఛైర్మన్ : అల్పసంఖ్యాక వర్గాల సమస్యను ఒక కొలిక్కి తీసుకురావడమే ఈ కమిటీ పని అన్నది ప్రధానాంశం.

సర్ అలీ ఇమామ్: నేను ఆ దృష్టికోణం నుండే విషయాన్ని చూస్తాను.

ఛైర్మన్: మరెవరూ అధికారికంగా మాట్లాడకపోతే నేను సర్ అలీ ఇమాంను పిలుస్తాను.

తర్వాత ఆగాఖాన్ ఇలా అన్నారు.

"మహాత్మాగాంధీ ఈ రోజు రాత్రి ముస్లిం ప్రతినిధి వర్గాన్ని కలుసుకుంటారనుకుంటాను. మా మిత్రునితో ఈ రోజు రాత్రికి స్నేహపూర్వకమైన చర్చ జరుగుతుందనుకుందాం. ఏదైనా సంప్రదింపులు జరిగే అవకాశాన్ని గురించి ఇంత మాత్రమే నేను చెప్పగలను."

పండిత మదనమోహన మాలవీయ కూడా ఉపయోగకరమైన ఫలితాల కోసం చర్చల్ని కొంత వాయిదా వేస్తే మంచిదని సలహా ఇచ్చారు. ఇదొక దుర్మార్గమైన ప్రయత్నం అని తెలిసి నేను లేచి ఇలా అన్నాను.

"మనం వాయిదా వేసే లోపల ఒక్కమాట చెప్పదలచుకుంటున్నాను. మీ సలహాకు సంబంధించి సంప్రదింపులు జరుగుతుండగా ఇతర అల్పసంఖ్యాక కులాలు జాతులు, వాళ్ళకు సంబంధించిన సమాచారాన్ని తయారు చేస్తారు. అణచబడ్డ వర్గాల వాళ్ళకు సంబంధించినంత వరకు మేమిదివరకే మా విషయాల్ని పోయినసారే మైనారిటీస్ సబ్ కమిటీకి సమర్పించాం.

"ఇప్పుడు కమిటీ ముందు చెప్పడానికి నాకు మిగిలిందల్లా విభిన్న చట్టసభల్లో ఎంతమందికి ప్రాతినిధ్యం ఇవ్వాలి అన్నదానిని గురించి ఒకచిన్న స్టేట్‌మెంట్[1] ఇవ్వడమే.

దానికి మించి నేను చేయగలిగిందేమీ లేదనుకుంటాను. అయితే మొట్టమొదట చెయ్యాలని ఉబలాట పడుతున్నది, మతాల జాతుల సమస్యను పరిష్కరించుకోడానికి తిరిగి సంప్రదింపులు జరగబోతున్నాయనే వార్త విని సంతోషించాను. అయితే మొదటే మా పరిస్థితిని స్పష్టం చేయదలచుకుంటున్నాను. ఈ సమస్యమీద ఎలాంటి సందేహానికి తావు ఇవ్వడం నాకిష్టంలేదు. సంప్రదింపులు జరపడానికి కమిటీ సర్వాధికారాలిచ్చి వాళ్ళను నియమించలేదని గ్రహించాలి. గాంధీ లేక ఆయన సంప్రదింపులు జరపాలనుకునే ఇతర పార్టీలు ఏరకం ప్రతినిధులైనప్పటికీ మమ్మల్ని బంధించే స్థితిలో లేరు. తప్పకుండా లేరు. ఈ సమావేశంలో దానిని నేను చాలా ఖచ్చితంగా చెబుతున్నాను.

---

1. దీనిని నేను మరో విజ్ఞప్తిగా చేశాను. అనుబంధం II లో చేర్చాను.

"నేను చెప్పాలనుకుంటున్న మరో విషయం ఇది. అనేక రకాల అల్పసంఖ్యాకులు చేసేవాదాలు ఇతర అల్పసంఖ్యాకుల వాదాలకు విరుద్ధంకాకుండా ఉన్నాయో లేవోనని పరిశీలించకుండా చేస్తున్నవే. ఫలితంగా ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారి వాదనను పరిశీలించకుండా ఒక అల్పసంఖ్యాక వర్గానికి, కాంగ్రెస్‌కి, ఇంకా చెప్పాలంటే ఇంకేదైనా పార్టీకి మధ్యను, కుదిరే పరిష్కారం నాకు తెలిసినంత వరకు కట్టుబడి ఉండవలసింది కాదు. ఏదో ఒక కులం, జాతికి అదనపు సౌకర్యం ఇవ్వాలా వద్దా అనే ప్రశ్నతో నాకు పేచీలేదు. అయితే నేను చాలా స్పష్టంగా చెప్పదలచుకున్నది మాత్రం అదనపు సౌకర్యాలను కోరే వాళ్ళు, వాటిని ఇవ్వడానికి ఇష్టపడే వాళ్ళు నా భాగంలోంచి ఇవ్వరాదని - ఇవ్వలేరని మాత్రమే. ఈ విషయాన్ని ఏమాత్రం దాపరికం లేకుండా చెబుతున్నాను."

తర్వాత ఏం జరిగిందో క్రింది మాటల వల్ల తెలుస్తుంది.

ఛైర్మన్: ఈ విషయంలో ఎలాంటి అపార్థానికి చోటివ్వరాదు. చివరి పరిష్కారం దొరకవలసిన వేదిక ఇదే. సలహా ఏమిటంటే సంఘర్షణ పడుతున్న అల్పసంఖ్యాక వర్గాలు, కులాలు ఉంటే వాళ్ళ నుంచి బయట పడటానికి చాలా తక్కువ సమయాన్ని వాడుకోవాలి. అది సర్వసాదారణమైన ఒప్పందం దిశగా ముఖ్యమైన మెట్టు, అవసరమైన మెట్టు. అయితే ఒప్పందం సర్వసాధారణమైనదిగా ఉండాలి.

డా. అంబేద్కర్: నా అభిప్రాయాన్ని నేను స్పష్టంగా విశదం చేశాను

ఛైర్మన్: డా. అంబేద్కర్ అభిప్రాయం చాలా స్పష్టంగానే ఉంది. ఆయన సహజమైన పదునైన రీతిలో సందేహానికి తావులేకుండా చెప్పాడు. ఈ వేదిక (కమిటి) తిరిగి సమావేశమైనప్పుడు అది చర్చకు వస్తుంది. మనందరం సమిష్టిగా అందరికీ వర్తించే పరిష్కారం సాధించడంలో సహకరించుకొంటున్నామని మీరు భావించేటట్లు చేయాలి. ఆ పరిష్కారం ఏ ఇద్దరి మధ్యనో, ముగ్గురి మధ్యనో కాదు. అది సంపూర్ణ పరిష్కారం.

ఛైర్మన్: పరిస్థితి ఇలా ఉంది. ఇప్పటికి విరమిద్దాం. తర్వాత మన చర్చలు కొనసాగిద్దాం. ఏ ఇద్దరి మధ్యనో ముగ్గురి మధ్యనో జరిగే సంప్రదింపులు పక్కన బెట్టి ఇతర అల్పసంఖ్యాకుల వాదనల్ని వినటానికి కాలాన్ని వినియోగిద్దాం. ఇది ఎక్కువ ప్రయోజనకారి అనుకుంటాను. ఇది కాలాన్ని మిగుల్చుతుంది. పైగా ఇది సిక్కుమిత్రులకు; గాంధీ, అతని మిత్రులకు; ఆగాఖాన్ అతని మిత్రులకు మధ్య కుదిరే ఏదైనా సామరస్యానికి అడ్డంకి కాదు.

డా. అంబేద్కర్: విరామసమయంలో కూర్చొని చర్చించడానికి వీలుగా విభిన్న అల్పసంఖ్యాక కులాల నుంచి, అలాగే కాంగ్రెస్ నుంచి ప్రతినిధులను తీసుకుని చిన్న కమిటీని ఏర్పాటు చేయడానికి వీలుందేమో చూడాల్సిందిగా సలహా ఇస్తున్నాను.

ఛైర్మన్: నేనే ఈ సలహా ఇవ్వాలను కున్నాను. ఈ కమిటీని నియమించమని నన్ను అడక్కండి. మీరే చెయ్యండి. మిమ్మల్నందరిని కలుసుకోమని నేను ఆహ్వానించాను. మీలో మీరు ఇష్టాగోష్ఠి సమావేశం జరుపుకొని, సమస్యను గురించి చర్చించి తర్వాత మనం చర్చించుకునే సమయంలో, ఇతరులను గురించి ఏమి మాట్లాడుతున్నారో తెలిసి మాట్లాడలేరా? దానిని అలా వదిలి పెడదామా?

డా. అంబేద్కర్: మీ యిష్టం.

ఛైర్మన్: అదే చాలా మంచిది.

విరామ సమయంలో మూడుపార్టీల మధ్య ఎలాంటి పరిష్కారమూ కుదరలేదు. 1931 అక్టోబర్, 1న అల్పసంఖ్యాక వర్గాల కమిటి తిరిగి సమావేశమైనప్పుడు గాంధీ ఇలా అన్నాడు:

"ప్రధానమంత్రి గారు! గతరాత్రి గౌరవనీయ శ్రీ ఆగాఖాన్ ఇతర ముస్లిం మిత్రులతో చర్చించిన తర్వాత, ఈ సమావేశాన్ని ఒక వారం రోజులు వాయిదా వెయ్యమని అడిగితే, మనిమిక్కడ సమావేశమైనందుకు మరింత మంచి ఫలితాలొస్తాయనే నిర్ణయానికి వచ్చాం. నేను నా ఇతర మిత్రులను కలుసుకునే అవకాశం రాలేదు. అయితే నా ప్రతిపాదనను వాళ్ళుకూడా సమ్మతిస్తారనడంలో నాకు సందేహంలేదు."

ఈ ప్రతిపాదనను ఆగాఖాన్ బలపరిచాడు. నేను లేచి ఆ ప్రతిపాదనను వ్యతిరేకించాను. ఈ క్రింది వాక్యాలు నేనేమి చెప్పానో విశదం చేస్తాయి. డా. అబేద్కర్: ఈ కమిటి సమస్యకు పరిష్కారం కనుగొనడానికి చేసే ఏ చిన్న ప్రయత్నానికి నేను కష్టం కలిగించను. మహాత్మాగాంధీ సలహా ననుసరించి ఒక పరిష్కారం కుదిరేటట్లైతే ఆ ప్రతిపాదనకు నేనేమి అభ్యంతరం చెప్పను.

"అయితే ఇందులో అణచబడ్డ వర్గాల ప్రతినిధిగా నాకు ఎదురయ్యే కష్టం ఒకటుంది. విరామ సమయంలో ఈ సమస్యను పరిశీలించడానికి మహాత్మాగాంధీ ఎలాంటి కమిటీని నియమించాలని ప్రతిపాదిస్తున్నారో తెలియడంలేదు. ఆ కమిటీలో అణచబడ్డ వర్గాల ప్రతినిధులుకూడా ఉంటారనుకుంటున్నాను.

గాంధీ: నిస్సందేహంగా.

డా. అంబేద్కర్: కృతజ్ఞతలు అయితే నేను ఇప్పుడున్న స్థితిలో ఆ కమిటీలో పనిచేయడం వల్ల ఏ ప్రయోజనముంటుందో నాకు తెలియదు. మహాత్మాగాంధీ తొలిరోజే అతను ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీలో భారత జాతీయ కాంగ్రెస్ ప్రతినిధిగా మాట్లాడినట్లు, మహ్మాదీయునకు సిక్కునకు తప్ప మరే యితర కులాల, మతాల వారికి రాజకీయ గుర్తింపు ఇవ్వడానికి తాను సిద్ధంగా లేనట్లు చెప్పాడు. ఆయన ఆంగ్లో ఇండియన్లను,

అణచబడ్డ వర్గాల వారిని భారతీయ క్రైస్తవులను గుర్తించడానికి ఇష్టపడలేదు. ఒకవారం క్రితం నేను మహాత్మాగాంధీని కలిసి అణచబడ్డ వర్గాల వాళ్ళ సమస్యను గురించి ఆయనతో చర్చించాను. ఇతర అల్పసంఖ్యాక వర్గాల సభ్యులుగా నిన్న ఆయన కార్యాలయంలో మాట్లాడే అవకాశం వచ్చింది. ఈ రెండు సందర్భాల్లోనూ ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీలో ఆయన తీసుకున్న నిర్ణయం ఖచ్చితమైంది. బాగా ఆలోచించి తీసుకున్నది. అని నిర్ద్వంద్వంగా చెప్పారు. దీనిని ప్రస్తావించడం ద్వారా నేను మర్యాదను అతిక్రమించడం లేదని అనుకుంటున్నాను. నేను చెప్పదలచుకుంటున్నది ఏమిటంటే, భవిష్యత్తులో రూపొందబోయే భారత రాజ్యాంగంలో అణచబడ్డ వర్గాలు ప్రత్యేక రాజకీయ గుర్తింపుగల కులంగా, జాతిగా గుర్తింప బడతాయని మొదటే నాకు తెలపక పోతే, ఈ సమస్యను గురించి మహాత్మాగాంధీ ప్రతిపాదిస్తున్న కమిటీలో చేరడంవల్ల ప్రయోజనం ఉంటుందని నేననుకోను. అందువల్ల రాబోయే భారత రాజ్యాంగంలో గుర్తింపు పొందడానికి అర్హమైనవిగా అల్పసంఖ్యాక వర్గాల సబ్‌కమిటీ సిఫారస్ చేసిన కులాలన్ని చేర్చబడతాయని ముందే హామీ ఇవ్వకుంటే, ఈ సమావేశాల వాయిదా ప్రతిపాదనకు నేను మనస్ఫూర్తిగా సహకరించలేను. ఇదినేను స్పష్టంగా చెప్పాలనుకున్నది.

* * *

డా. అంబేద్కర్: నేను నా పరిస్థితిని ఇంకా స్పష్టం చెయ్యదలచుకుంటున్నాను. నేను చెప్పిన దానిని అపార్థం చేసుకున్నట్లు కనబడుతుంది. నేను సమావేశం వాయిదా వెయ్యడానికి అభ్యంతరం చెప్పడం లేదు. ఈ సమస్యను చర్చించే ఏ కమిటీలోనైనా నన్ను సభ్యునిగా వేస్తే పని చేయడానికి అభ్యంతరం చెప్పడంలేదు. ఈ కమిటీలో ప్రవేశించడానికి ముందే నేను చెప్పదలచుకున్నది ఏమంటే ఆకమిటీలో పనిచేసే గౌరవం నాకిస్తే, ఆ కమిటీ పరిశీలించ బోయే అంశం ఏది? హిందు ముస్లింల మధ్య నలుగుతున్న విషయాలను మాత్రమే పరిశీలిస్తుందా ? ముస్లింలకు పంజాబ్‌లోని సిక్కులకు మధ్య ఉన్న అంశాలను మాత్రమే పరిశీలిస్తుందా ? క్రైస్తవులు, ఆంగ్లోఇండియన్లు, అణచబడ్డ వర్గాల వాళ్ళ సమస్యల్ని కూడా పరిశీలిస్తుందా ?

"మనం పని మొదలుబెట్టక ముందే ఈ కమిటీ హిందూ ముస్లింల సమస్యలకో, హిందూ సిక్కుల సమస్యలకో మాత్రమే పరిమితంకాదు, అణచబడ్డ వర్గాల, ఆంగ్లోఇండియన్ల, క్రైస్తవుల సమస్యల్ని పరిశీలించే బాధ్యతను కూడా తీసుకుంటుంది అని మనం స్పష్టంచేసుకుంటే సమావేశాన్ని వాయిదా వెయ్యాలనే తీర్మానాన్ని నేను నిరభ్యంతరంగా ఆమోదిస్తాను. అయితే ఈ విరామం హిందూ ముస్లిం అవసరాలను పరిష్కరించడానికి ఉపయోగించకోబడుతుంటే వేరే అనధికార కమిటీని కొందరు అల్పసంఖ్యాకుల సమస్యల్ని మాత్రమే పరిష్కరించే పనికి వదిలిపెట్టడం కన్నా, ప్రస్తుతమున్న అల్పసంఖ్యాక వర్గాల కమిటీయే దానిని గట్టిగా పట్టుకొని పరిశీలించాలని నా అభిప్రాయం.

"గాంధీ: ప్రధానమంత్రిగారు! మిత్రులారా! మనలోనే కొందరం రూపొందించుకున్న పనియొక్క పరిధికి సంబంధించి కొంత అపార్థం కలిగినట్లు తోస్తున్నది. డా. అంబేద్కర్, కల్నల్ గిడ్నే ఇతర మిత్రులు ఏమి జరగబోతుందోనని భయపడుతున్నట్లున్నారు. ఒక వర్గం లేక వ్యక్తికి రాజకీయ స్థాయిని తిరస్కరించడానికి నేనెవర్ని? కాంగ్రెస్ ప్రతినిధిగా, నేను ఏ ఒక్క జాతీయ ప్రయోజనాన్ని త్యాగం చేసినా, కాంగ్రెస్ నామీద పెట్టిన విశ్వాసానికి నేను అనర్హుడనవుతాను. ఈ విషయాలను గురించి నా అభిప్రాయాలను సందేహానికి ఆస్కారం లేకుండా వ్యక్తం చేశాను ఆ అభిప్రాయాలకు నేను కట్టుబడి ఉంటానని నొక్కి చెబుతున్నాను. ప్రతి ఒక్కరి ప్రయోజనాన్ని రక్షించడానికి ఎన్నో మార్గాలున్నాయి. అయితే ఒక నిర్దిష్టమైన పథకాన్ని రూపొందించడం ఇక్కడ ఆలోచనలో మునిగిన మనందరిపైనా ఉంది. ఈ అనధికార సమావేశంలో పాల్గొనే సభ్యుల మీద తన అభిప్రాయాలను రుద్ది ఎవరూ దీనికి అడ్డం రాదు.

"అందువల్ల తన అభిప్రాయాలను చెప్పడానికి ఎవరూ భయపడాల్సిన పనిలేదు. నా అభిప్రాయాలు ఇతరుల అభిప్రాయాలతో సమానమే. నా అభిప్రాయాలకు అంతకన్నా మించిన విలువలేదు. ఇతరుల అభిప్రాయాలకు విరుద్ధంగా నా అభిప్రాయాలను తీసుకుపోయే అధికారం నాకులేదు. నేను జాతీయ ప్రయోజనం దృష్టితో నా అభిప్రాయం చెప్పాను అంతే. ఎప్పుడు అవకాశం వచ్చినా నా అభిప్రాయాలను చెబుతాను. ఈ అభిప్రాయాలను స్వీకరించడమో, తిరస్కరించడమో మీ చేతుల్లో ఉంది, ఉంటుంది. అందువల్ల దయచేసి అందరి మెదళ్ళలోంచి నేను సూచించిన ఈ కాన్ఫరెన్స్‌లో, ఈ అనధికార సమాశంలో ఏదో మసిపూసి మారేడుకాయ చేయబోతున్నాననే భావాన్ని (స్టీమ్ రోలింగ్) తరిమేయండి. అయితే ఇక్కడ బల్లలకు అతుక్కుపోయి కూర్చోవడం కన్నా, ఈ పద్ధతిలో మనం పరస్పరం సన్నిహితం కాగలమని మీరు భావిస్తే ఈ వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించరు. ఈ అనధికార సమావేశాల ప్రతిపాదనకు హృదయపూర్వకమైన సహకారమందిస్తారు"

* * *

ఛైర్మన్: "అయితే ఈ అనధికార సమావేశాలను నేను ఆమోదిస్తున్నాను. మిత్రులారా, నేను ఆమోదించడంలోని ఉద్దేశమిది. కాలం వృధాకాదు. ఈ సమావేశాలు గాంధీ చెప్పినట్లు అనధికార సమావేశాలు అయినా చాలా విలువైనవి. ఉపయోగకరమైనవి. అందువల్ల ఇవి ఇప్పుడూ, తర్వాత కూడా జరుగుతాయి. మీరు ఆవిధంగా కాలాన్ని వాడుకోడానికి పూనుకుంటారనుకుంటాను."

వాయిదా తర్వాత అనధికార సమావేశంలో ఏమి జరిగిందో నేను వివరించడం అనవసరం. ఏది కాకపోయినా సంపూర్ణ వైఫల్యం మాత్రం అయ్యింది. సమావేశానికి గాంధీ అధ్యక్షత వహించారు. గాంధీ అత్యంత సమస్యాత్మకమైన పంజాబ్‌లోని సిక్కు ముస్లిం

త వివాదంతో మొదలుపెట్టారు. ఒక దశలో ఒక మధ్యవర్తి నిర్ణయానికి అన్ని పార్టీలు మోదం తెలపడంతో సమస్య ఒక కొలిక్కి వచ్చి పరిష్కారం దొరుకుతుందనిపించింది. యితే మధ్యవర్తి ఎవరైంది తెలుపనంత వరకు ఇక ముందుకు పోవడానికి సిక్కులు ప్పుకోలేదు. ముసల్మానులు మధ్యవర్తి పేరు తెలియనక్కర లేదనుకోవడంతో ఈ విషయాన్ని క్కడికి ముగించారు. గాంధీకి అస్పృశ్యుల వంటివాళ్ళ సమస్య మీద ఆసక్తిలేదు. కాని ందరు అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధులను తమతమ డిమాండ్లను వరుసగా చెప్పమని ాత్రం ఒక ప్రహసనం సృష్టించాడు. వాటినన్నింటిని అతడు విన్నాడేగాని పెద్దగా ట్టించుకోలేదు. ఆయన వాటిని పరిశీలనా సంఘం ముందుకు ఉంచాడా? ఎప్పుడైతే క్కు ముస్లిం ఒపప్పందం బద్దలైందో గాంధీ సమావేశాన్ని రద్దుచేసేశాడు. అల్పసంఖ్యాక ర్గాల కమిటీ 1931 అక్టోబర్ 8న సమావేశమైంది. ప్రధానమంత్రి మొదట గాంధీని ాట్లడమని కోరగా ఆయన ఇలా మాట్లాడాడు:- .

"ప్రధానమంత్రిగారు! మిత్రులారా! అనధికార సమావేశాల్లో భిన్న గ్రూపుల ితినిధులతో విడివిడిగాను, సమిష్టిగాను జరిపిన సంప్రదింపుల ద్వారా మతసమస్యకు ామోదయోగ్యమైన పరిష్కారాన్ని సాధించడంలో నేను ఘోరంగా విఫలమైనానని అత్యంత షాదంతో, మిక్కిలి అవమానభావంతో పేర్కొంటున్నాను. ప్రధానమంత్రిగారు, ఇతర ుత్రులారా! విలువైన ఒక వారంరోజుల కాలాన్ని వృధా చేసినందుకు నేను క్షమాపణ ెబుతున్నాను. ఒక్క ఊరట ఏమంటే, ఈ సంప్రదింపుల భారాన్ని మోయడానికి నేను ప్పుకునే సమయంలో విజయం సాధిస్తాననే ఆశ ఉండింది. పైగా పరిష్కారాన్ని ొరుకోడానికి గల ఏ అవకాశాన్ని నేను వదలలేదు. ఇది వాస్తవం. ఇదే నాకు ఊరట.

"అయితే సంప్రదింపులు మనం సిగ్గుపడాల్సినంతగా విఫలమయ్యాయని చెప్పితే ఃత్యమంతా చెప్పినట్లుకాదు. భారతీయ ప్రతినిధి వర్గ నిర్మాణంలోనే ఈ వైఫల్యానికి ారణాలు దాగున్నాయి. మనలో దాదాపు అందరం ప్రాతినిధ్యం వహించాలని భావించిన ూపుల నుండిగాని, పార్టీలనుండిగాని ఎన్నుకోబడిన ప్రతినిధులం కాము. మనం ప్రభుత్వం ామినేట్ చేసిన వాళ్ళం. లేక ఆమోదయోగ్యమైన ఒప్పందం కుదరడానికి అందరం కప్పనిసరిగా ఉండాల్సిన వాళ్ళం కూడా కాము. పైగా అల్పసంఖ్యాక వర్గాల కమిటీని సమావేశపరచాల్సిన సమయం కూడా కాదు. దీనికి వాస్తవిక జ్ఞానంలేదు,. దీని ద్వారా మనం ఏమి సాధిస్తామో కూడా తెలియదు. మనకు కావల్సింది మనం పొందుతామని ఖచ్చితంగా తెలుసుంటే, ఆ కులసమస్యకు సంబంధించిన ఈ చిక్కుముడిని విప్పే సామర్థ్యం ప్రస్తుత ప్రతినిధి వర్గం మీద ఆధారపడుతుందనే విషయం మనం స్పష్టం చేసుకునేంతవరకు 50 సార్లు పునరాలోచించడానికి కూడా సందేహించకూడదు. అలాచేస్తే అది పాపపు పని అవుతుంది. ఈ పరిష్కారం స్వరాజ్య రాజ్యాంగానికి శిఖరాయమైందేకావచ్చు. పునాది మాత్రం కాదు. ఎందుకంటే భేదాభిప్రాయాలు

ఘనీభవించడం చేతనే తప్ప విదేశీ ఆధిక్యత చేత పుట్టింది కాదు కాబట్టి. స్వాతంత్ర్య సూర్యుని వేడిమి క్రింద ఈ కులభేదాలనే మంచుగడ్డలు కరిగిపోతాయనటంలో నాకు ఏమాత్రం సందేహంలేదు.

అందుచేత రాజ్యాంగ సంబంధమైన మౌలిక ఆలోచనలు తొందరగా రూపుదిద్దుకోడానికి అల్పసంఖ్యాక వర్గాల కమిటీ సమావేశాన్ని నిరవధికంగా వాయిదా వెయ్యాలని సలహా ఇవ్వడానికి సాహసిస్తున్నాను. ఈ లోపల కుల సమస్యకు వాస్తవమైన పరిష్కారాన్ని కనుకొనే అనధికార పని కొనసాగుతుంది. కొనసాగాలి. కాకుంటే అది రాజ్యాంగ నిర్మాణంలో ప్రగతిని నిరాశపరచరాదు. అడ్డుకోడానికి దానిని అనుమతించరాదు. దృష్టిని దీనిమీద నుంచి ప్రధాన భాగం మీదికి మరల్చాలి.

అయితే నా వైఫల్యం ఆమోదయోగ్యమైన పరిష్కారాన్ని కనుగొనడం అసాధ్యమని అనుకోరాదని కమిటీకి నొక్కి చెప్పదలచుకుంటున్నాను. నా వైఫల్యం కూడా ఘోరమైన ఓటమి కాదు. నా నిఘంటువులో అలాంటి పదమేలేదు. నా ప్రత్యేక ప్రయత్నం మాత్రం విఫలమైందని నేనొప్పుకుంటాను.

నా వైఫల్యం విజయోన్ముఖంగా మరోమెట్టు అని భావిస్తున్నాను. మీరందరు అలాగే చెయ్యాలని కోరుతున్నాను. అయితే ఒప్పందంలో ప్రయత్నమంతా విఫలం మయ్యేటట్టయితే రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ కృషి చివరి దశకు చేరుకున్నప్పుడు సైతం ప్రయత్నం విఫలమైతే రాబోతున్న రాజ్యాంగానికి అన్ని వాదాలను పరిశీలించడానికి, అపరిష్కృతంగా ఉన్న అన్ని అంశాల మీద తుదితీర్పు ఇవ్వడానికి ఒక జ్యూడీషియల్ ట్రిబ్యునల్‌ను నియమించాలని నేను సూచిస్తాను."

ప్రతినిధులందరూ ప్రభుత్వం నామినేట్ చేసినవాళ్ళు తప్ప ప్రజాప్రతినిధులు కారన్న గాంధీ ఆరోపణ మీద జరిగిన చర్చలో అందరూ ఆ ఆరోపణను ఖండించారు. నా అభిప్రాయాన్ని స్పష్టం చెయ్యడానికి నేనిలా అన్నాను.

"ప్రధానమంత్రి గారూ! నిన్న రాత్రి అనధికార కమిటీ సమావేశంలో పాల్గొన్నప్పుడు విఫలం అయ్యామనే భావించినా, ఒక సాధారణ అవగాహనకు రాగలిగాం. ఆ అవగాహన ఏమిటంటే ఈరోజు ఇక్కడ మనం సమావేశమైనప్పుడు ఎవరూ కూడా ఇతరులకు ఉద్రేకం కలిగించే ప్రసంగంకాని, వ్యాఖ్యకాని చెయ్యకూడదు అన్నది. గాంధీ ఆ అవగాహనకు గండికొడుతుండటం బాగాలేదు. క్షమించండి. నాకు మాట్లాడే అవకాశం రావాలి. ఆయన అతని దృష్టిలో అనధికార వైఫల్యానికి కారణాలు చెప్పడం ప్రారంభించాడు. ఆ కమిటీ ఆమోదయోగ్యమైన ఒప్పందాన్ని చేరుకోవడంలో విఫలం కావడానికి నాకు తోచిన కారణాలను చెబుతాను. అయితే ఇప్పుడు వాటిని చర్చించాలని నేను చెప్పను. గాంధీ మాటలు విన్న తర్వాత నన్ను కలత పెట్టినదేమంటే, అల్పసంఖ్యాక వర్గాల

కమిటీని వాయిదా వెయ్యాలనే తన ప్రతిపాదనకు గాంధీ పరిమితం కాకుండా, విభిన్న కులాల ప్రతినిధుల మీద, ఈ టేబిల్ చుట్టూ కూర్చున్న విభిన్న మతాల/కులాల ప్రతినిధులమీద తనకుతోచిన వ్యాఖ్యాలు చెయ్యడం మొదలు బెట్టాడు. ప్రతినిధులు ప్రభుత్వం నామినేట్ చేసిన వాళ్ళు ఏ కులాలకు / మతాలకు ప్రతినిధులుగా ఉన్నారో ఆ మత/కుల ప్రజల మనోభావాలకు ప్రతినిధులు కారు అన్నాడు గాంధీ. మేము ప్రభుత్వం నామినేట్ చేసిన వాళ్ళం అనే ఆరోపణను కాదనం. కాని నా వరకు మాట్లాడితే, భారతదేశంలోని అణచబడ్డ వర్గాల వాళ్ళకు తమ ప్రతినిధుల్ని ఎన్నుకునే అవకాశమిచ్చుంటే వాళ్ళు నన్ను ఎన్నుకొని ఉంటారనడంలో నాకెలాంటి సందేహమూ లేదు. అందువల్ల నేను ప్రజలు పంపిన ప్రతినిధిని అయినా, కాకపోయినా, నా కులప్రజల అభిప్రాయాలను సంపూర్ణంగా ప్రతిబింబించగలనని చెబుతున్నాను. దానికి సంబంధించి ఎవరూ తప్పుడు అభిప్రాయాన్ని పెట్టుకోకండి.

"కాంగ్రెస్ అణచబడ్డ వర్గాలపట్ల నిలబడుతుందని, నాకన్నా నా మిత్రుని కన్నా ఎక్కువగానే కాంగ్రెస్ వాళ్ళపట్ల నిబద్ధమై ఉందని మహాత్మా ఎప్పుడు వాదిస్తూనే ఉంటాడు. ఆ వాదన బాధ్యతా రహితమైన వ్యక్తులు చేసే తప్పుడు వాదాల్లో ఒకటి అని నా సమాధానం. ఎందుకంటే ఆ వాదం చేస్తున్న వాళ్ళ అభిప్రాయాలను తిరస్కరిస్తున్నారు గనక.

ఇప్పుడు నా దగ్గరొక టెలిగ్రాం ఉంది. ఇది ఇప్పుడే వచ్చింది. దీనిని పంపినవారు ఆల్మోరాలోని కుమాన్‌కు చెందిన అణచబడ్డ వర్గాల సమాఖ్య అధ్యక్షుడు. ఈ ఊరు బహుశా సంయుక్త పరగణాల్లో ఉందనుకుంటాను. ఆయననుగానీ, ఈ ఊరినిగాని చూడలేదు. టెలిగ్రాంలో ఈ తీర్మానం ఉంది. :

"దేశం లోపలా బయటా కాంగ్రెస్ చేపట్టిన ఉద్యమంపట్ల ఈ సమావేశం అవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నది. కాంగ్రెస్ కార్యకర్తలు అనుసరిస్తున్న పద్ధతిని ఖండిస్తున్నది."

నేను ముందు చదవదలచుకోలేదు, అయితే ఈ విషయం మాత్రం చెప్పదలచుకున్నాను. ఆత్మవిమర్శ చేసుకుంటే గాంధీ తన స్థానాన్ని సత్యాన్ని తెలుసుకో గలడనుకుంటాను. అయితే కాంగ్రెస్‌లో అణచబడ్డ వర్గాలపట్ల సానుభూతి గలవాళ్ళు కొందరుండ వచ్చునేమోగాని, అణచబడ్డ వర్గాలు మాత్రం కాంగ్రెస్‌లో లేవు అని మాత్రం చెప్పగలను. నేను చెప్పదలచుకున్నది ఇదే. ఈ వివాదగ్రస్తమైన అంశాల జోలికి నేను వెళ్ళదలచుకోలేను. అవి ప్రధాన ఆలోచనకు అవతల ఉన్న అంశాలు. గాంధీ చేసిన ప్రధానమైన ప్రతిపాదన ఈ కమిటీని వాయిదా వేయడం. దీనికి సంబంధించి నేను సర్ మహమ్మద్ షఫీతో ఏకీభవిస్తాను. ఒక కారణంవల్ల ప్రతిపాదనను నేను సమ్మతించలేను. నాకు రెండు ప్రత్యామ్నాయాలు కనిపిస్తున్నాయి. ఒకటి ఈ అల్పసంఖ్యాక వర్గాల కమిటీ ఈ సమస్యను గురించి చర్చిస్తూ సంతృప్తికరమైన పరిష్కారం కోసం ప్రయత్నిస్తుండడం.

వీలయితే ఇది, వీలుకాకుంటే ఆ సమస్యకు పరిష్కారాన్ని ప్రభుత్వమే స్వీకరించాలి. అంతేతప్ప దానికి కనుగొనే పనిని బ్రిటిష్ ప్రభుత్వానికున్నంత బాధ్యతా దృష్టిలేని స్వదేశీపార్టీ ఇష్టానికి వదిలివేయడానికి మాత్రం ఇష్టపడం.

"ప్రధానమంత్రి గారూ! ఒక విషయం స్పష్టం చేయడానికి అనుమతించండి. అణచబడ్డ వర్గానికి ఆతృతలేదు, వాళ్ళు అరచి పెడబొబ్బలు పెట్టడంలేదు. తక్షణం అధికారం బ్రిటిష్ వాళ్ళ నుంచి భారతీయుల చేతుల్లోకి మారిపోవాలని వాళ్ళు ఉద్యమం మొదలుపెట్టలేదు. బ్రిటిష్ ప్రజలవల్ల వాళ్ళకు ప్రత్యేకమైన ఇబ్బందులున్నాయి. ఆ ఇబ్బందుల్ని చాలా ఖచ్చితంగా స్పష్టం చేశాననుకుంటున్నాను. నిజానికి అణచబడ్డ వర్గాల వాళ్ళ పరిస్థితి ఏమిటంటే, రాజకీయాధికార బదిలి గురించి వాళ్ళు అందోళన చేయడంలేదు, స్పష్టంగా చెప్పాలంటే మేము అధికార బదిలీకోసం ఆతృత చూపడంలేదు. ఆయితే బ్రిటిష్ ప్రభుత్వం ఇప్పుడు దేశంలో అవతరించి రాజకీయాధికార బదిలికి ఆతృత చూపుతున్న శక్తుల్ని అడ్డుకోలేకపోతే అణచబడ్డ వర్గాలు ఇప్పుడు ఆశక్తుల్ని అడ్డకునే స్థితిలో లేవని మాకు తెలుసు. మా అభిప్రాయం ఇది. వీరు ఆ అధికారాన్ని బదిలీ చేస్తే ఆ అధికారం కుట్రదారుల చేతుల్లోకి కొందరు 'పెద్ద మనుషుల' చేతుల్లోకి పోయే పరిస్థితులు ఏర్పడరాదు. వాళ్ళు మహ్మదీయులు కావచ్చు, హిందువులు కావచ్చు. అధికారాన్ని అన్ని మతాల/కులాల వాళ్ళకు తగినంత భాగస్వామ్యంతో పంచుకోవాలి. ఈ దృష్టితో చూచినప్పుడు, నేను నా వర్గం ఎక్కడ నిలబడతామో తెలియకుండా ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ కార్యకలాపాల్లో చురుకైన పాత్ర ఎలా నిర్వహించగలనూ!"

ప్రధానమంత్రి ముగింపు ప్రసంగం చేస్తూ ఇలా అన్నారు." కాసేపు వాయిదా వేద్దాం. మళ్ళీ అందర్నీ పిలుస్తాను. ఈ మధ్యలో నాకు ఎదురుగా కూర్చున్న వాళ్ళలో అతిచిన్న అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన ప్రతినిధులు కూడా వాళ్ళకు చేతనైనంతలో పనిని గురించి ఆలోచించవచ్చు."

"మీలో మీకు ఏమైన ఒప్పందాలు కుదిరితే వాటిని అందరికి తెలియ జేయండి....బ్రిటిష్ ప్రభుత్వం ఏ ఒప్పందానికీ అడ్డురాదు... ఇప్పుడు ఒక రకంగా నిరాశా పూరితమైన ప్రకటనలు విన్నాం. అందువల్ల మీకు నేను ఇలా చెబుతున్నాను: బ్రటిష్ ప్రభుత్వం తన పని తాను చేసుకుపోతుంది. బ్రిటిష్ ప్రభుత్వం మిమ్మల్ని మీ పని చేయమని కోరుకుంటున్నది. మీరు ఒక నిర్ణయానికి రాకపోతే బ్రటిష్ ప్రభుత్వం చర్య తీసుకుంటుంది. ఎందుకంటే మేము భారత ప్రభుత్వంలో మెరుగులు తీసుకు రావాలను కుంటున్నాం. అవి భారత ప్రభుత్వం మా భావాలకు విరుద్ధం కాని రీతిలో తెచ్చే మెరుగులు. స్వేచ్ఛా ముఖంగా మరిమరి అభివృద్ధి చెందే మెరుగులు. మేము కోరేది అదే. ఈ రోజు ఇక్కడ అన్ని మతాల (కులాల) ప్రతినిధులకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను. మా దారికి అడ్డం రాకండి. ఇప్పుడు మీరు ఆ పని చేస్తున్నారు."

# IV

ప్రధానమంత్రి సలహానుసరించి అల్పసంఖ్యాక వర్గాలవాళ్ళు పరిష్కారం ఏదైనా కుదురుతుందేమోనని సమావేశమయ్యారు. వాళ్ళు ప్రయత్నించి ఒక పరిష్కారాన్ని తయారు చేశారు. దానిని 1931 నవంబర్ 13 అల్పసంఖ్యాక వర్గాల కమిటి సమావేశమయ్యే ముందు సాయంకాలం ప్రధానమంత్రికి సమర్పించారు.

సమావేశంలో ప్రారంభోపన్యాసమిస్తూ ప్రధానమంత్రి ఇలా అన్నారు:-

"మొదటి నుంచి ఈ కమిటీ పని అత్యంత ప్రాధాన్యం కలిగింది. మీరు ఒక ఆమోదయోగ్యమైన పథకం సమర్పించలేకపోయుంటే బాధే".

"గత రాత్రి మహ్మదీయులు, అణచబడ్డ వర్గాలు, ఎంతోకొంతమంది భారతీయ క్రైస్తవులు, ఆంగ్లోఇండియన్లు, బ్రిటిష్ వాళ్ళ ప్రతినిధులు వచ్చారు. బహుశా వచ్చిన వాళ్ళు వాళ్ళే అనుకుంటాను. వాళ్ళు గతరాత్రి హౌస్ ఆఫ్ కామన్స్‌లో నా గదిలో నన్ను కలుసుకున్నారు. ఒక డాక్యుమెంటును సమర్పించారు. దానిని సమర్పిస్తూ బ్రిటిష్ ఇండియాలో జనాభాలో నలభై ఆరుశాతాన్ని ఆ డాక్యుమెంటు పరిగణనలోకి తీసుకుందని చెప్పారు."

"మనకు దానిని పరిశీలించే వ్యవధి ఇప్పుడు లేదు గనక, ఆ డాక్యుమెంటును ఈ కమిటీ రికార్డులకు అధికారిక డాక్యుమెంటుగా భావిద్దాం. ఆ విధంగాచెయ్యడానికి ఆగాఖాన్ గారిని దానిని సమర్పించాల్సిందిగా కోరుతున్నాను."

ఆగాఖాన్ లేచి ఇలా చెప్పారు :-

"ప్రధానమంత్రిగారు! మహ్మదీయులు, అణచబడ్డ వర్గాలవాళ్ళు ఆంగ్లోఇండియన్లు, యూరోపియన్లు, భారతీయ క్రైస్తవుల తరపున ఈమతాల వాళ్ళు సంప్రదించుకొని రూపొందించిన ఒప్పందం డాక్యుమెంటును సమర్పిస్తున్నాను. అనేక చిక్కులతో కూడుకున్న ఈ సమస్య మీద ఈ ఒప్పందం కుదిరింది. గనక దీనిని యథాతథంగా స్వీకరించాలని కోరుతున్నాను. ఈ ఒప్పందంలోని అన్ని భాగాలు స్వతంత్రమైనవి. అవి కూలినా, నిలిచినా మొత్తంగానే కూలుతాయి లేక నిలుస్తాయి."

ఈ డాక్యుమెంటును "అల్పసంఖ్యాక వర్గాల ఒప్పందం"[1] అంటారు. దీనిమీద జరిగిన సాధారణ చర్చలో గాంధీ ప్రసంగం నిస్సందేహంగా అతిశ్రద్ధగా చూడదగింది. ఆయనకు చాలా కోపం వచ్చింది. అల్పసంఖ్యాక వర్గాల ఒప్పందం తయారు చేయడంలో పాల్గొన్న ప్రతి ఒక్కరిని ఆయన ఎదిరించాడు; విమర్శించాడు. ప్రత్యేకించి, అస్పృశ్యులకు ప్రత్యేక రాజకీయ అస్తిత్వాన్ని గుర్తించినందుకు చాలా కోప్పడ్డాడు. గాంధీ చెప్పింది ఇది:-

"ఇంతకుముందు చెప్పిన దానిని మరలా చెబుతున్నాను. హిందువులకు, మహమ్మదీయులకు, సిక్కులకు ఆమోదయోగ్యమైన పరిష్కారాన్ని కాంగ్రెస్ ఎప్పుడూ

1. దీనిని అనుబంధం III లో ఇవ్వడమైంది

సమర్థిస్తుంది. గనక, ఏ అల్పసంఖ్యాక వర్గానికి ప్రత్యేకమైన నియోజకవర్గాలను, ప్రత్యేకించి అస్పృశ్యులకు, కాంగ్రెస్ అంగీకరించదు. అల్పసంఖ్యాక వర్గాల వాళ్ళ వాదనను నేను అర్థం చేసుకోగలను. కాని అస్పృశ్యుల పక్షాన లేవదీసిన వాదాలు ఆ సమయంలో దయలేని కోత. ఇది నిశ్చితంగా అవరోధాన్ని కగిలించడమే.

భారత దేశానికి స్వతంత్రం సాధించడానికైనా సరే విలువైన అస్పృశ్యుల ప్రయోజనాలను నేను పణంగా పెట్టాను. అసంఖ్యాకులైన అస్పృశ్యుల పక్షాన నేను వ్యక్తిగతంగా ప్రాతినిధ్యం వహిస్తాను. ఇక్కడ నేను కేవలం కాంగ్రెస్ పక్షానమాట్లాడ్డంలేదు. నేను నాపక్షాన మాట్లాడుతున్నాను. నేను చెబుతున్నాను. ఇప్పుడు అస్పృశ్యుల అభిప్రాయ సేకరణ నిర్వహిస్తే వాళ్ళ వోట్లు నాకు వస్తాయి. నేను గెలుస్తాను. అస్పృశ్యులకు ప్రత్యేక నియోజక వర్గాలు, ప్రత్యేక రిజర్వేషన్లు, కల్పించడం నిరంతర అవరోధాన్ని నిర్మూలించే పద్ధతి కానేకాదని దేశమంతా తిరిగి చెప్పగలను. ఆ నిరంతర అవరోధం అనేది సిగ్గుపడాల్సిన అంశం. అస్పృశ్యులకు కాదు, సనాతన హైందవ తత్వానికి.

ఈ మచ్చలాంటి అస్పృశ్యతను నిర్మూలించడానికి హిందూ సంస్కర్తల మండలి ఒకటుంది అనే విషయాన్ని ఈరోజు ఈ కమిటీకి, ప్రపంచానికి తెలపాలి. రిజిస్టర్‌లలో, జనాభా లెక్కల్లో అస్పృశ్యులను ప్రత్యేక వర్గంగా (క్లాస్) విశ్లేషించి చూపాల్సిన అవసరం లేదు. సిక్కులు యధాతధంగా శాశ్వతంగా కొనసాగని, అలాగే మహమ్మదీయులు, యురోపియన్లు. అస్పృశ్యులు శాశ్వతంగా అస్పృశ్యులు గానే నిలుస్తారా? అప్పుడు అస్పృశ్యత ఉంది అనడంకన్నా హైందవతత్వం (హిందు/హిందూయిజం) చచ్చింది అంటాను. డా.అంబేద్కర్ పట్ల అస్పృశ్యుల ఉద్ధరణకు ఆయన చూపుతున్న ఆసక్తి, ఆయన శక్తిసామర్థ్యాల పట్ల నాకు గౌరవం ఉంది. అయినప్పటికీ ఆయన కృషిచేయడంలో అనుసరించిన తప్పుడు దారి ఆయన రుచి చూసిన భయంకరానుభవాలు ఆయన తీర్పును ఒక క్షణం ముసుగు వేశాయి అని సవినయంగా చెబుతున్నాను.

ఇలా చెబుతున్నందుకు బాధ పడుతున్నాను. అయితే ఇది చెప్పకుంటే, నేను నా జీవిత సర్వస్వంగా అభిమానించే అస్పృశ్య ఉద్యమానికి న్యాయం చేసినవాడిని కాకుండా పోతాను. ప్రపంచాధిపత్యం కోసం నేను వాళ్ళ హక్కుల్నిబేరంగా పెట్టను. నేను బాధ్యతతో మాట్లాడుతున్నాను. భారతదేశంలోని మొత్తంఅస్పృశ్యుల పక్షాన మాట్లాడటానికి ప్రయత్నించడంలో డా.అంబేద్కర్ సరైన రీతిలో వాదించడం లేదంటున్నాను. ఆయన వాదం హిందూయిజంలో చీలికను సృష్టిస్తుంది. దానిని ఏరకంగానూ కోరుకోవడంలేదు. కావాలనుకుంటే అస్పృశ్యులు ఇస్లాం మతాన్నిగాని, క్రైస్తవమతాన్నిగాని స్వీకరించవచ్చు. దాన్నైనా నేను భరిస్తానుగాని, హిందూయిజానికి నిలయమైన గ్రామాల్లో రెండు శాఖల్ని సృష్టించడం సహించలేను. అస్పృశ్యుల రాజకీయ హక్కుల్ని గురించి మాట్లాడేవాళ్ళకు భారత దేశాన్ని గురించి తెలియదు. అందువల్ల నేను నొక్కిచెబుతున్నాను. దానిని అడ్డగించాల్సిన వ్యక్తిని నేనొక్కణ్ణే అయితే, దానిని జీవితాన్ని పణంగా పెట్టి అడ్డగించి అడ్డాపించగలను."

అల్పసంఖ్యాక వర్గాల మీటింగును వాయిదా వేసేముందు ఆమోదయోగ్యమైన పరిష్కారం సాధించే ఆశలేదని తెలుసుకున్న ఛైర్మన్ ప్రతినిధులకు ఇలా సలహా నిచ్చారు.

"మీలో ప్రతి ఒక్కరు మతసమస్యను పరిష్కరించమని, నా నిర్ణయాన్ని అందరూ ఒప్పుకుంటామని ప్రతిజ్ఞచేస్తూ ఒక విజ్ఞప్తిని రాసి సంతకం చేసి ఇస్తారా? ఇది చాలా ఉచితమైన సూచన అనుకుంటాను........నాకు ప్రతి వ్యక్తి, ప్రతి వర్గమూ కావాలి. ఈ కమిటీ సభ్యులమంతా మత సమస్యమీద ఒక నిర్ణయం ప్రకటించమని, అది తాత్కాలికమైనా సరే అందరూ ఒప్పుకుంటామని సంతకం చేసి ఇస్తారా? అది ఇప్పుడు అక్కరలేదు. మీ సంతకాలు చేసి నాకివ్వండి. నేను చేసే నిర్ణయాన్ని మీరు ఒప్పుకొని నూతన రాజ్యాంగ నిర్మాణ సమయంలో దాన్ని అమలు చేయడానికి మీ శక్తివంచనలేకుండా కృషిచేస్తామని హామి ఇవ్వండి. దీనికోసం నేను ఎన్నోవర్గాలను, వ్యక్తులను అడిగాను. ఎవరూ ఈ పని చేయలేదు. ఇది మన స్థితిని చక్కబరుస్తుంది. దానితోబాటు సమావేశం ప్రారంభంలో నేను చెప్పిన దానిని మరచిపోకండి. ప్రభుత్వం మతవైషమ్యాలను సమ్మతించదు. ప్రతిజ్ఞను నెరవేర్చడం ద్వారా, రాజ్యాంగ నిర్మాణం ద్వారా వాటిని నివారిస్తుంది అని నేను అన్నాను. మరచిపోకండి. అందువల్ల మత వైషమ్యాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వకండి.

## V

అల్పసంఖ్యాక వర్గాల కమిటీ మతసమస్యకు పరిష్కారం కనుగొనడానికి చేసిన ప్రయత్నాలు అలాముగిశాయి. కమిటీలో జరిగిన చర్చలు గాంధీకి అస్పృశ్యులపట్ల గల దృష్టిని బహిర్గతం చేశాయి. అందరూ గాంధీ అస్పృశ్యులకు బద్ధశత్రువని భావించారు. గాంధీ అస్పృశ్యుల సమస్యమీద ఎంతో ఆసక్తి చూపారు. కాని అదందా అస్పృశ్యుల డిమాండ్లను వ్యతిరేకించడానికే. అందుకే గాంధీ రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు వచ్చాడంటే అసహజం కాదు.

అస్పృశ్యుల డిమాండ్లపట్ల, గాంధీ దృక్పథం ఏమిటో ఆయన మిత్రులే అర్థం చేసుకోలేక పోయారు. ముస్లిములకు, సిక్కులకు, గుర్తింపు ఇచ్చి, అస్పృశ్యులకు దానిని నిరాకరించడం ఆశ్చర్యాన్ని అయోమయాన్ని కలిగించింది. దానిని గురించి వాళ్ళు అడిగినప్పుడంతా కోప్పడడం తప్ప సమాధానం చెప్పడు. అస్పృశ్యుల పట్ల తన వ్యతిరేకతను గాంధీయే సహేతుకమైన సమాధానం ఇవ్వలేక పోయాడు. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో హిందువులే అస్పృశ్యుల సమస్యలను పరిష్కరించే పని చేపట్టారు కాబట్టి వాళ్ళకు రాజకీయ రక్షణ అక్కరలేదన్నాడు. కాన్ఫరెన్స్‌కు బయట ఇందుకు భిన్నమైన మాటలు చెప్పాడు తన అభిప్రాయాల్ని సమర్థించుకొంటూ గాంధీ ఇలా చెప్పాడు:-

"ముస్లిములు, సిక్కులు బాగా సంఘటితంగా ఉన్నారు. అస్పృశ్యులు సంఘటితులు కారు. వాళ్ళలో రాజకీయ స్పృహలేదు. వాళ్ళను సమాజంహీనంగా చూస్తుంది. నేను వాళ్ళను రక్షించాలను కుంటున్నాను. వాళ్ళకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పాటు చేస్తే హిందూ సనాతనులకు నిలయమైన గ్రామాల్లో వాళ్ళ పరిస్థితి చాలా దారుణమౌతుంది. యుగయుగాలుగా అస్పృశ్యుల్ని నిరాదరించి నందుకు ఉన్నత వర్గాలకు చెందిన హిందువులు ప్రాయిశ్చిత్తం చేసుకోవాలి. చురుకైన సంఘసంస్కరణ, అస్పృశ్యులకు అపారమైన సేవ చేయడం ద్వారా వాళ్ళు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అంతే గాని వాళ్ళకు ప్రత్యేక నియోజక వర్గాలివ్వడంద్వారా అస్పృశ్యులకు, సనాతనులకు మధ్య పోటి అనే ఆపిల్‌ను విసురుతున్నామన్నమాట. ముసల్మానుల, సిక్కులకు ప్రత్యేక ప్రాతినిధ్య ప్రతిపాదనను నేను అత్యవసరమైన చెడు

(కీడు) పాపంగా భరించగలనని మీరు అర్థం చేసుకోవాలి. ఇది అస్పృశ్యులకు అనుకూలమైన అపాయం. అస్పృశ్యులకు ప్రత్యేక నియోజక వర్గాలంటే, ప్రభుత్వాన్ని కొత్తగా తయారు చెయ్యడమని నాకు తెలుసు. వాళ్ళను వోటర్లలిస్టులో చేర్చి రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులనుకల్పించడం అవసరం. ఒకవేళ వాళ్ళకు అన్యాయం జరిగితే, వాళ్ళప్రతినిధి ఉద్దేశపూర్వకంగా వాళ్ళను నిరాదరిస్తే, వాళ్ళకు సంపూర్ణరక్షణనిచ్చే ప్రత్యేక ఎలక్షన్ ట్రిబ్యునల్ ఉండాలి. ఈ ట్రిబ్యునల్‌కు ఎన్నికైన అభ్యర్థిని నిరాదరించిన వ్యక్తి ఎన్నికను రద్దు చేసే హక్కు నివ్వాలి.

అస్పృశ్యులకు ప్రత్యేక నియోజక వర్గాలు వాళ్ళను శాశ్వతంగా బానిసలను చేస్తాయి. ప్రత్యేక నియోజక వర్గాలు కలిగుండడంద్వారా ముసల్మానులు ఎప్పుడు ముసల్మానులు కాకుండా పోరు. మీరు అస్పృశ్యులుగనే మిగిలి పోవాలనుకుంటూన్నారా? మంచిది. ప్రత్యేక నియోజక వర్గాలు ఈమచ్చను శాశ్వతం చేస్తాయి. కావలసింది అస్పృశ్యతా నిర్మూలన. అది నువ్వు చేసినప్పుడు అహంకారి అయిన ఉన్నతవర్గం నిమ్నవర్గాల మీద రుద్దిన నిరంతర అవరోధం నిర్మూలింప బడుతుంది. నువ్వు ఆ నిరంతర అవరోధాన్ని నిర్మూలించావంటే ఇంకెవరికి ప్రత్యేక నియోజక వర్గాలిస్తావు? యూరప్ చరిత్రచూడు. శ్రామిక వర్గానికి, స్త్రీలకు ప్రత్యేక నియోజక వర్గాలున్నాయా?వయోజనులకు వోటు హక్కు ద్వారా అస్పృశ్యులకు సంపూర్ణ భద్రత నివ్వు. సనాతనులు కూడా వోట్ల కోసం వాళ్ళను ఆశ్రయిస్తారు.

" ఇప్పుడడగండి, అస్పృశ్యుల ప్రతినిధి డా. అంబేద్కర్ వాళ్ళకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలంటాడేమో. డా. అంబేద్కర్ మీద నాకు ఎంతో గౌరవముంది. అతనికి నిశితంగా, ఖచ్చితంగా మాట్లాడే హక్కుంది. ఈ రోజు ఆయన అనుమానంతో నిండిపోయాడు. దానిని తప్ప మరో దానిని చూడలేనంతగా నిండిపోయాడు. ఆయన ప్రతి హిందువులోను ఒక అస్పృశ్యుని వ్యతిరేకిని చూస్తున్నాడు. అది సహజం కుడా. నాతొలి నాళ్ళలో దక్షిణాఫ్రికాలో నాకు ఇదేజరిగింది. యూరోపియన్లు నేను వెళ్ళిన చోటల్లా నన్ను వేటాడారు. ఆయనకు కోపం కట్టలు తెంచుకురావడం సహజం. అయితే ఆయన కోరుకునే ప్రత్యేకనియోజక వర్గాలు సంఘసంస్కరణను తేసుకురాలేవు. ఆయన అధికారాన్నో, పదవినో పొందవచ్చు కాని అస్పృశ్యులకు ఒనగూడే మంచి మాత్రం శూన్యం. నేను, అస్పృశ్యులతో ఇన్నాళ్ళు సహజీవనం చేసి, వాళ్ళ సుఖదుఃఖాలనుపంచుకున్న వాణ్ణి. ఈ విషయాన్ని అధికారికంగా చెప్పగలను."

రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ సందర్భంగా, గాంధీ కేవలం ప్రచారంతో సంతృప్తిచెందలేదు. ప్రచారం తాను ఆశించినంతగా సఫలం కావడం లేదని తెలిసి, ఆయన కుట్రకు దిగాడు ... ప్రధానమంత్రి సలహాను, అల్పసంఖ్యాక వర్గాల వాళ్ళు ఒక ఒప్పందాన్ని / పరిష్కారాన్ని సమర్పిస్తారన్న విషయాన్ని; ఆ పరిష్కారాన్ని అస్పృశ్యులు ఇతర మైనారిటీలు ముఖ్యంగా ముస్లిముల మద్దతు పొందుతున్నారన్న విషయాన్ని విని గాంధీ చాలా గాబరా పడ్డాడు. అస్పృశ్యులను ఏకాకులను చేయడానికి పథకం పన్నాడు. అందుకోసం ముసల్మానులు చేస్తున్న పధ్నాలుగు డిమాండ్లను మొదట వ్యతిరేకిస్తున్నగాంధీ వాటిని ఒప్పుకోవడం ద్వారా వాళ్ళను కొనాలని పథకం వేశాడు. అయితే ముసల్మానులు అస్పృశ్యులకు మద్దతునిస్తూన్నారని తెలుసుకొని గాంధీ ఆ పధ్నాలుగు పాయింట్లను ఒప్పుకోడానికి ముందు వాళ్ళ ఆ మద్దతును ఉపసంహరించుకోవాలని షరతు పెట్టాడు. నిజంగా ఒప్పందం తయారయింది. దాని పాఠం ఇది.

## గాంధీ - ముస్లిం ఒడంబడిక [1]

### రౌండ్‌టేబిల్ సమావేశంలో పాల్గొనే ముస్లిం ప్రతినిధి వర్గం [2]

టెలి : విక్టోరియా 2360
టెలిగ్రామ్స్ : కోర్ట్‌లైన్, లండన్

'క్వీన్స్ హౌస్'
5, సెయింట్ జేమ్స్ కోర్ట్
బకింగ్‌హామ్ గేట్
లండన్, ఎస్ - డబ్ల్యు,1
6 అక్టోబరు,1931

గతరాత్రి 10-00 గంటలప్పుడు ముస్లిం ప్రతినిధివర్గం, గాంధీ, కలిసి క్రింద ప్రతిపాదనల్ని చర్చించారు. అవి రెండు భాగాలు. ముస్లిములు తమ హక్కుల పరిరక్షణ కోసం చేసిన ప్రతిపాదనలు, కాంగ్రెస్ విధానపరంగా గాంధీ చేసిన ప్రతిపాదనలు- గాంధీ ఆమోదించగా, ముస్లిం ప్రతినిధివర్గం అభిప్రాయం కోసం సమర్పించబడినవి క్రిందఇవ్వబడ్డాయి.

| ముస్లిముల ప్రతి పాదనలు | గాంధీ ప్రతిపాదనలు |
|---|---|
| 1) పంజాబ్ బెంగాల్ రాష్ట్రాల్లో ముసల్మానుల మెజారిటీ కేవలం ఒక శాతం. అయితే ఆ ప్రాతినిధ్యం ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా మరియు మొత్తంసభలో 51 శాతం ఉండేలా చేయటమన్న ప్రశ్న రాజ్యాంగం అమల్లోకివచ్చే లోపల ముస్లింల అభిప్రాయ సేకరణ ద్వారా తెలుసుకొని వాళ్ళ తీర్పు నుసమ్మతించాలి. | 1) ఎన్నిక వయోజనుల ఓటు ద్వారా జరగాలి. |

1) ఈ డాక్యుమెంటు 1939 లో పాకిస్తాన్ మీద అభిప్రాయాలు అనే నా పుస్తకంలోఅనుబంధంగా అచ్చయింది. ఇది వెలుగు చూడడం ఇదే మొదటి సారి. దీనిఅవశ్యకత ఎప్పుడూ ప్రశ్నింపబడలేదు. దీని ప్రతినిది నేను రౌండ్‌టేబిల్‌కాన్ఫరెన్స్‌కు వచ్చిన ఒక ప్రతినిధి ద్వారా సంపాదించగలిగాను.

2)ముస్లింలీగ్ ప్రతినిధి బృందానికి చెందిన కాగితాల మీద ఈ డాక్యుమెంటు టైపుఅయ్యింది.

2) ముస్లింలు తక్కువగా ఉన్న ఇతర ప్రాంతాలలో వాళ్ళిప్పుడు అనుభవిస్తున్న సౌకర్యాలు కొనసాగాలి. అయితే వాళ్ళకు సమిష్టి నియోజకవర్గాల్లో కొన్నింటిని రిజర్వు చేయడమా లేక ప్రత్యేక నియోజక వర్గాలు కావాలా అనేది నూతన రాజ్యాంగంలో ముస్లింల అభిప్రాయాలను సేకరించి నిర్ణయించాలి. వాళ్ళ తీర్పును సమ్మతించాలి.

2) ఏ మతానికి కులానికీ ప్రత్యేకమైన రిజర్వేషన్లు ఉండరాదు.

3) రెండు సభల్లోని ప్రతి నిధుల సంఖ్యలో 26 శాతం ముసల్మాను ప్రతినిధులుండాలి. అంతేగాక 7 శాతం కనీసం ఒప్పందం ద్వారానైనా ముసల్మానులు ఉండాలి. భారతీయ రాష్ట్రాలకు కేటాయించిన కోటాలో మొత్తంమీద 1/3 భాగం ఉండాలి.

3) కాంగ్రెస్ డిమాండ్లు:
ఎ) సంపూర్ణ స్వాతంత్ర్యం .
బి) రక్షణ మీద తక్షణ సంపూర్ణ ఆధిపత్యం.
సి) విదేశీ వ్యవహారాల మీద సంపూర్ణ ఆధిపత్యం.
డి) ఆర్థిక విభాగం మీద సంపూర్ణ ఆధిపత్యం.
ఇ) ఒక స్వతంత్ర ట్రిబ్యునల్ ద్వారా పబ్లిక్ రుణాలు మొదలైన అంశాల మీదపరిశీలన.
ఎఫ్) సమ్మతంలోలాగా భాగస్వాములైన ఎవరికైనా తమ భాగాన్నిఉపసంహరించుకునే హక్కు ఉండడం.

4) ఈ క్రింది అంశాలు కూడా ఒప్పుకోవలసినవి.
1. సింధు[1]
2. ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి[2]
3. సర్వీసులు[3]
4. క్యాబినెట్[4]
5. ప్రాధమిక హక్కులు, మతానికి సంస్కృతికి భద్రతలు.
6. ఏ జాతినైనా చట్టం ద్వారా బాధ కలిగించే పద్ధతికి వ్యతిరేకంగా భద్రతలు.

ఈ ముసాయిదా ఒప్పందంలో అస్పృశ్యుల ప్రస్తావన లేదన్నది సత్యం .ముసల్మానులు, సిక్కులను తప్ప ఇతర అల్పసంఖ్యాక వర్గాల వారిని సమర్థించకూడదు కాబట్టి వాళ్ళు అస్పృశ్యులను సమర్థించ రాదన్నది స్పష్టం. ఈ కుట్రలో గాంధీ విఫలమయ్యాడు. కాక

1. సింధూ రాష్ట్ర విభజన.
2. వాయవ్య సరిహద్దు ప్రాంతానికి స్వయం ప్రతి పత్తి, బాధ్యతాయుత ప్రభుత్వం.
3. సర్వీసుల్లో ప్రాతినిధ్యం
4. క్యాబినేట్‌లో ప్రాతినిధ్యం

తప్పదు తమ రక్షణలను డిమాండు చేసే ముసల్మానులు అస్పృశ్యుల డిమాండ్లను వ్యతిరేకించలేక పోయారు. అస్పృశ్యులను అణచి వేసే వ్యామోహంలో గాంధీ, తాను అనుసరించాల్సినపద్ధతిలో, మంచి చెడును విడదీసి చూసే జ్ఞానాన్ని కూడా కోల్పోయాడు. గాంధీ తన మాటను తానే గౌరవించలేదు. అల్పసంఖ్యాక వర్గాల కమిటీలో అస్పృశ్యులకు ప్రత్యేక గుర్తింపునివ్వాలని కమిటి ఒప్పుకుంటే నిరభ్యంతరంగా ఇవ్వొచ్చు అన్నాడు. మెజారిటి నిర్ణయానికి కట్టుబడి ఉంటానని దాని అర్థం. కాని ఇతర అల్పసంఖ్యాక వర్గాల వాళ్ళు అస్పృశ్యులకు మద్దతు నివ్వడానికిసమ్మతించారని తెలుసుకున్న గాంధీ ముస్లిములను కలుసుకొని వాళ్ళను అస్పృశ్యులకు వ్యతిరేకంగా తిప్పుకోవడం కోసం వాళ్ళు కోరుతున్న పధ్నాలుగు కోర్కెలను అదివరకు కాంగ్రెస్, హిందు మహాసభ, సైమన్ కమిషన్ తిరస్కరించిన వాటిని ఆమోదించడానికి వెనుకాడలేదు.

గాంధీ ప్రజాభిప్రాయాన్ని ప్రజానైతికతను తిరస్కరించడానికి పూనుకున్నా ఆయన పన్నిన దుర్మార్గమైన పధకం విఫలమైంది. ఎందుకంటే ముసల్మానులు ఆ పథకంలో చేరి తమను తాము అవమానించ దలచుకోలేదు. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ రెండో సమావేశం ముగిసినప్పుడు అల్ప సంఖ్యాక వర్గాల కమిటి ప్రతినిధులు ప్రధానమంత్రి చేసిన ప్రతిపాదన-మత సమస్యను పరిష్కరించే భాధ్యతను ఆయనకు అప్పగిస్తూ సంతకం చేసి విజ్ఞప్తి పత్రాన్ని సమర్పించడాన్ని సమ్మతించారు. అనేక మంది ప్రతినిధులు, గాంధీతో[1] సహా ఆపని చేశారు. ప్రతినిధులకు మిగిలింది ఏమిలేదు. భారతదేశానికి తిరిగి వచ్చి ప్రధానమంత్రి నిర్ణయం కోసం చూడటం తప్ప.

## VI

ప్రధానమంత్రి ఏ నిర్ణయంచేశారో చెప్పేముందుగా ఎన్నికల కమిటి సభ్యుడుగా నేను గమనించిన విషయాన్ని మీ ముందుంచుతాను. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ రెండో సమావేశాన్ని ముంగించిన తర్వాత, ప్రధానమంత్రి నూతన రాజ్యాంగం కోసం వోటుహక్కు సమస్యను పరిశీలించే కమిటీని ఒకదానిని వేస్తే బాగుంటుందనుకున్నాడు. అందుకనుగుణంగా 1931 డిసెంబర్ లో ఒక కమిటీని నియమించాడు. దానికి కీ.శే. లార్డ్ లాథియన్ అధ్యక్షుడు. ఎన్నిక విధానాన్ని పరిశీలించడమే ఆ కమిటీ చేయాల్సిన పని.చైర్మన్‌కు ప్రధానమంత్రి సూచనలిస్తూ రాసిన లేఖలో ఇలా ఉంది:

"బాధ్యతల్ని అప్పగించాల్సిన శాసనాధికారి ప్రజలకు ప్రతినిధిఅయిఉండాలి. సమాజంలోని ఏ ముఖ్యమైన వర్గమూ తన అవసరాలను, అభిప్రాయాలను వ్యక్తం చేసే పద్ధతికి లోపం ఉండరాదు."

ఈ కమిటి 1932 జనవరిలో పనిచేయడం ప్రారంభించింది. ఇందులో ఆ కమిటీరాష్ట్ర ప్రభుత్వాల సహాయం తీసుకుంది. అలాగే ఈ పని మీదనే అనధికారులు గల రాష్ట్ర ఎన్నికల

1) నేను అలాంటి విజ్ఞప్తి ఏదీ చెయ్యలేదు. అస్పృశ్యుల డిమాండ్లు అన్నీసహేతుకమైనవి, అందువల్ల ఏ మధ్యవ్యక్తి అవసరం లేదు అని భావించాను.

కమిటీల సహాయాన్ని కూడ తీసుకుంది. కమిటీ ఒక ప్రశ్నావళిని విడుదల చేసింది. దానికి రాష్ట్ర ప్రభుత్వాలు సమాధానాలివ్వాలి. అలాగే ఎన్నిల కమిటీలు, విడివిడి వ్యక్తులు సమాధానాలివ్వాలి. ఒక్కో రాష్ట్ర ఎన్నికల కమిటీ దగ్గర కూర్చొని సాక్షుల్ని పరీక్షించింది ఈ కమిటి. ఈ కమిటీకి రాష్ట్రప్రభుత్వాలు, కమిటీలు విడివిడిగా నివేదికల్ని సమర్పించాయి. కమిటి వాటి మీద నిర్ణయం తీసుకునే వాటిని గురించి రాష్ట ప్రభుత్వాలతో రాష్ట్ర కమిటీలతో చర్చించింది. లాథియన్ కమిటికి సాధారణ కర్తవ్యాలతో బాటు ప్రత్యేక కర్తవ్యాన్ని కూడా పెట్టాడు ప్రధానమంత్రి. ఇది అస్పృశ్యుల రాజకీయ డిమాండ్లకు సంబంధించింది. ఆ కమిటి చైర్మన్‌కురాసిన లేఖలో ప్రధానమంత్రి ఇలా పేర్కొన్నాడు:-

" కాన్ఫరెన్స్‌లో అనేక సందర్భాలలో చోటు చేసుకున్న చర్చల ద్వారా నూతన రాజ్యాంగం అణచబడ్డ వర్గాల వారి ప్రాతినిధ్యానికి తగిన అవకాశం కల్పించాలని, ఆ ప్రాతినిధ్యం కూడా నామినేషన్ పద్ధతిలో కల్పించడం తగింది కాదని స్పష్టమైంది. అణచబడ్డ వర్గాల వారికి ప్రత్యేక నియోజకవర్గాలను కల్పిచాలనే విషయంపట్ల అభిప్రాయభేదాలుండటం మీకందరికి తెలుసు. మీకమిటి చేసే పరిశీలనలద్వారా అణచబడ్డ వర్గాలకు వోటుహక్కు పరిమితి ఎంతవరకు ఉండాలో స్పష్టం చెయ్యడం మూలంగా ఈ ప్రశ్నకు సరైన పరిష్కారం లభించేట్టు కృషి చెయ్యాలి. మీరు సిఫారస్ చేసే ఈ సాధారణ పరిమితి ద్వారా సాధారణ నియోజకవర్గాలలో వోటు చేసే హక్కు ఎంతవరకు సిద్ధిస్తుందో కూడా స్పష్టం చెయ్యాలి. అలాకాకుండా అణచబడ్డవర్గాలకోసం సాధారణంగా కాని జనాభాలో వాళ్ళు విలక్షణంగా ప్రత్యేకంగా ఒక వర్గంగా ఉన్నరాష్ట్రాల్లో కాని క్రమంగా వారికోసం ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటుచెయ్యాలన్న తీర్మానం చేసేలా ఉంటే మీ కమిటీ చేసే పరిశీలనలో వాళ్ళ వోటుహక్కు విస్తరించే విషయంగా ఉన్న సమస్య పట్ల మొదట వాస్తవాలకు సేకరించి తద్వారా ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు ఎలా చెయ్యాలో సూచించేటు ట్ఉండాలి." ఈ సూచనల్ని అనుసరించి బ్రిటిష్ ఇండాయాలో అస్పృశ్యులజనాభాకు సంబంధించి ఒక నిర్ణయానికి రావడం కమిటీ కర్తవ్యమైంది.

భారతదేశంలో అస్పృశ్యుల జనాభా ఎంత అనే ప్రశ్నకు వచ్చిన సమాధానాలు ఎవరినైనా సంచలింప చేస్తాయి. తమ రాష్ట్రాలలో అస్పృశ్యులసంఖ్య చాలా తక్కువ అని చెప్పడానికి ఒకరు ముందుకు వచ్చారు. అసలు అస్పృశ్యులే లేరు అని చెప్పే సాక్షుల అవసరమే లేకపోయింది. అస్పృశ్యులఉనికినే తిరస్కరిస్తూ లేదా సంఖ్యను గుర్తించలేనంతగా కుదించివేస్తూ సత్యాన్నిపట్టించు కోకుండా అబద్ధాలకు తలపడే హిందూసాక్షులను చూడటానికి అసాధారణ దృష్టి అవసరం. రాష్ట్ర ఎన్నికల కమిటి సభ్యులు కూడా ఈపథకానికి బాధ్యులు. లాథియన్ కమిటీలోని కొందరు సభ్యులు ఈ ఆటలో ఉండటం విచిత్రం. కొన్ని రాష్ట్రాలలో అస్పృశ్యుల ఉనికినే తిరస్కరించడం లేదా వాళ్ళ సంఖ్యను దాదాపు శూన్యదశకు తగ్గించడం మరీ భయంకరంగా ఉండేది. హిందువులు సత్యాన్ని కుదించడానికి నిర్మూలించేందుకు ఎలా తయారయ్యారో క్రింది సంఖ్యలు తెలియజేస్తాయి. సంయుక్త రాష్ట్రాలలో 1931 లో అస్పృశ్యులసంఖ్య 12.6 మిలియన్లు అని అంచనా వేయగా, రాష్ట్ర ప్రభుత్వం 6.8 మిలియన్లని చెప్పింది. రాష్ట్ర ఎన్నికల కమిటి మాత్రం, 6 మిలియన్లు మాత్రమేనని అంచనా కట్టింది. బెంగాల్లో జనాభాలెక్కలు 10.3 మిలియన్లనితేల్చగా, రాష్ట్ర ప్రభుత్వం 11.2 మిలియన్లని నిర్ణయించింది. కాని రాష్ట్ర ఎన్నికల కమిటి మాత్రం.07 మిలియన్లు మాత్రమే అని నిర్ణయించింది.

రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ ముందు అస్పృశ్యుల జనాభా సంఖ్య ఖచ్చితంగాఎంత ేదాన్ని ఏ హిందువూ పట్టించుకోలేదు. జనాభా లెక్కలు చూపిన 70 నుండి 80 మిలియన్లు ే సంఖ్యతో వాళ్ళు సంతృప్తి చెందారు. అయితే లాథియన్ కమిటి ఈ సమస్యను చేపట్టగానే ందువులు హఠాత్తుగా ఎందుకు ఛాలెంజ్ చేయడం ప్రారంభించారు? లాథియన్ కమిటికి ందు అస్పృశ్యులజనాభా సమస్యకు అంతగా విలువలేదు. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ తర్వాత స్పృశ్యులు తమ ప్రాతినిధ్యానికి ప్రత్యేక కేటాయింపును కోరుతున్నారని ఆభాగస్వామ్యం చివరకు హిందువులు అనుభవిస్తున్న దాంట్లోంచి ఇవ్వవలసి వస్తుందని, ఎంత గస్వామ్యం ఇవ్వాలనేది అస్పృశ్యుల జనాభా మీద ఆధారపడి ఉందనివాళ్ళు గ్రహించారు. స్పృశ్యుల ఉనికిని ఒప్పుకోవడం తమ ప్రయోజనాలకు నష్టం అని వాళ్ళు పసిగట్టారు. ళ్ళు సత్యాన్ని, మర్యాదను తుంగలోతొక్కడానికి కూడా వెనుకాడ లేదు. భారతదేశంలో స్పృశ్యులు ఉన్నారనే వాస్తవాన్ని తిరస్కరించి, దాని ద్వారా అస్పృశ్యుల రాజకీయ డిమాండును క్కిపారేసి, వాదానికి చోటు లేకుండా చెయ్యాలని నిర్ణయించుకున్నారు. ఇదివాళ్ళకు చాలా రపాయకరమైన పద్ధతి. ఇది హిందువులు ఎంత చక్కగా కుట్రపన్నగలరనడానికి, వాళ్ళకు స్పృశ్యుల పట్ల కల్తీలేని స్వార్థ దృష్టికి, ప్రత్యక్షంగా చెయ్యలేని దానిని పరోక్షంగా చెయ్యడానికి దర్శనం.

## VII

ప్రధాన విషయానికి వద్దాం. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌తో విసుకెత్తిపోయి. అక్కడ మర్శించే వాళ్ళు తప్ప సమర్థించే వాళ్ళు లేకపోవడంతో, మొదట భారతదేశానికి వచ్చింది ాంధీయే. వస్తూ వస్తూ రోమ్‌లో ఒక విలేఖరికి గాంధీ ఇంటర్వ్యూ ఇస్తూ యమోల్లంఘనోద్యమాన్ని చేపట్టబోతున్నట్లు చెప్పాడన్న అంశం మీద, అయన రాగానే రెస్ట్ చేసి జైల్లో పెట్టింది ప్రభుత్వం. జైలులో ఉన్నా గాంధీ బుర్రలో ఉన్నది స్వరాజ్యంగాదు, అస్పృశ్యులే. జీవితాన్ని పణంగా పెట్టినా ఈ సమస్యను అడ్డుకుంటానన్న ఆయన బెదిరింపుకు లెక్క చెయ్యకుండా, రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో అస్పృశ్యులవాదనను మధ్యవర్తి అయిన ప్రధానమంత్రి ఒప్పుకుంటాడేమోనని భయపడ్డాడు. ప్రధానమంత్రి నిర్ణయాన్ని ప్రకటించడానికన్నా ముందే, గాంధీ 1931 మార్చి 11న జైలు నుంచే భారతదేశానికి స్టేట్ సెక్రటరీ అయిన సర్ శామ్యూల్ హోరేకి ఉత్తరం రాశాడు. అందులో అస్పృశ్యుల వాదనకు తాను వ్యతిరేకినని గుర్తు చేశాడు. ఆలేఖ పాఠం ఇది:-

ప్రియమైన సర్, శామ్యూల్!

రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో అల్పసంఖ్యాక వర్గాల విషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు చివర్లో నేను చేసిన ప్రసంగం మీకు గుర్తుండే ఉంటుంది. అందులో అణచబడ్డ వర్గాల వాళ్ళకు ప్రత్యేక నియోజక వర్గాలను మంజూరు చేయడాన్ని ప్రాణాన్ని ఒడ్డైనా అడ్డుకుంటానన్నాను. ఆ మాట నేను క్షణికోద్రేకంలోనో, ఆలంకారికంగానో అన్నది కాదు. అది దృఢంగా చేసిన ప్రకటన. ఆప్రకటనను గురించి భారతదేశం తిరిగిరాగానే, ఏ పరిస్థితిల్లోనైనా సరే అణచబడ్డవర్గాల వారికి ప్రత్యేక నియోజక వర్గాల మంజూరుకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని పోగుచెయ్యాలను కున్నాను. అయితే అలా జరగలేదు.

"ప్రభుత్వం ఏక్షణంలోనైనా తన నిర్ణయాన్ని ప్రకటించవచ్చని నాకు లభించిన వార్తా పత్రికల ద్వారా తెలుసుకున్నాను. అణచబడ్డ వర్గాలకు ప్రత్యేక నియోజక వర్గాలను సృష్టించాలని నిర్ణయిస్తే, నా ప్రతిజ్ఞను ఆచరణలో పెట్టే అవకాశాన్ని పరిశీలించాలని మొదట అనుకున్నాను. అయితే ముందుగా తెలపకుండా అలా చెయ్యడం బ్రిటిష్ ప్రభుత్వానికి ఇబ్బంది కలిగించడమే ననిపించింది. సహజంగానే నా ప్రకటనకు నేనిచ్చిన ప్రాముఖ్యాన్ని వాళ్ళివ్వలేదు."

"అణచబడ్డ వర్గాల వారికి ప్రత్యేక నియోజక వర్గాలను సృష్టించడం పట్ల నా అభ్యంతరాలను పునరుద్ఘాటించడం అనవసరం. నేనువాళ్ళలో ఒకడిగా భావించుకుంటాను. వాళ్ళ సమస్య ఇతరుల సమస్యకన్నా సంపూర్ణంగా భిన్నమైంది. చట్టసభల్లో వాళ్ళ ప్రాతినిధ్యానికి నేను వ్యతిరేకినికాను. వాళ్ళలోని స్త్రీ పురుషులందరూ, విద్యతోగాని ఆస్తితోగాని సంబంధంలేకుండా వోటర్లుగా నమోదు కావడాన్ని నేను అభిమానిస్తాను.

ఇతరుల విషయంలో వోటు హక్కు నియమాలు ఇంకా కఠినంగా ఉన్నా ఫరవాలేదు. అయితే ప్రత్యేక నియోజక వర్గాలంటే మాత్రం కేవలం రాజకీయ దృష్టితో చూచినప్పటికీ, వాళ్ళకు, హిందుమతానికి అపాయం అన్న అభిప్రాయాన్ని నేనిప్పటికి కలిగి ఉన్నాను. వాళ్ళకు ప్రత్యేక నియోజక వర్గాలు చేసే చెడును సమర్థించాలంటే సవర్ణ హిందువుల మధ్య అస్పృశ్యులు ఎలా కలిసిపోయిఉన్నారో, వాళ్ళ మీద అస్పృశ్యులు ఎలా ఆధారపడి ఉన్నారో తెలుసు కోవాలి. హిందుమతానికి సంబంధించినంత వరకు, ప్రత్యేక నియోజక వర్గాలు దాని గొంతుకోస్తాయి. హిందువులను విభజిస్తాయి.

"నా దృష్టి లో అస్పృశ్యుల సమస్య అధిక భాగం నైతికమైంది, మతపరమైంది. రాజకీయ దృష్టి ముఖ్యమైనదే అయినా, నైతిక, మత దృష్టులతో పోల్చిచూస్తే అది చాలా పేలవమైంది.

" ఈ విషయంలో ఈ వర్గాల వాళ్ళ పరిస్థితి పట్ల బాల్యం నుంచి నేను ఆసక్తి చూపిస్తూ, అనేక పర్యాయాలు నాసర్వస్వాన్ని దాని కోసం వినియోగిచడాన్ని మీరు అభినందించాలి. ఇది ఏవిధంగాను గర్వంతో చెప్పడంకాదు. శతాబ్దాలుగా అణచబడ్డ వర్గాల వారి పతనానికి కారకులైన హిందువులు ఏప్రాయశ్చిత్తం చేసుకున్నా చాలదని నా అభిప్రాయం.

"అయితే ప్రత్యేక నియోజక వర్గాల సృష్టి మాత్రం ప్రాయశ్చిత్తం కాదు. వాళ్ళను పతనావస్థ నుండి గట్టెక్కించడానికి పరిష్కారమూ కాదు. అందువల్ల ప్రభుత్వానికి నేను వినయంగా తెలియజేస్తున్నాను. అణచబడ్డ వర్గాల వారికి ప్రత్యేక నియోజకక వర్గాలు కావాలి అనే నిర్ణయాన్ని తీసుకున్న సందర్భంగా నేను అమరణ నిరాహార దీక్ష చేపడుతాను.

"అయితే నేను జైల్లో ఉంటూ అలాంటి చర్యకు పూనుకోవడం ప్రభుత్వానిక ఇబ్బందికరమని నాకు తెలుసు. దానిని చాలామంది నాలాంటి స్థాయిగలవ్యక్తికి రాజకీయరంగంలో ఉపయోగించే పద్ధతి కాదంటారనీ నాకు తెలుసు. ఈపద్ధతిని వాళ్ళు కేవలం మానసిక దౌర్బల్యం అన్నా అంటారు. నన్ను సమర్థించుకుంటూ చెప్పదలచుకున్నదే మంటే ఇప్పుడు నేను చెయ్యదలచుకున్న పని ఒక పద్ధతి కాదని అది నా జీవితంలో ఒక భాగం అనీ. ఇది నా అంతరాత్మ పిలుపు. దీనిని నేను తిరస్కరించలేను. నామనస్థైర్యం ఎంతటిదైనా నేను ఆ పనిచెయ్యలేను. దాని ద్వారా తెలివికి సంబంధించిన గౌరవం పోయినా ఫరవాలేదు. ఇప్పుడు నాకు తెలుసున్నంత వరకు నేను జైలు నుంచి విడుదల అయినా

ఉపవాస దీక్ష తక్కువైనదిగా అనిపించడంలేదు. ఇప్పటికి కూడా నేను బ్రిటిష్ ప్రభుత్వానికి అణచబడ్డ వర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు చెయ్యాలన్న సంకల్పం లేదని నమ్ముతున్నాను.

స్టేట్ సెక్రటరి గాంధీకి పంపిన సమాధానం ఇది:-

ఇండియా ఆఫీసు, వైట్‌హాల్

ఏప్రిల్ 13, 1932.

ప్రియమైన గాంధీగారు,

"ఇది మార్చి 11 నాటి మీ ఉత్తరానికి బదులు - అణచబడ్డ వర్గాల వారికి ప్రత్యేక నియోజక వర్గాల సమస్య పట్ల మీ అభిప్రాయం ఎంత గాఢమైందో తెలిసింది. అయితే మేము చేసే ఏ నిర్ణయమైనా అది సమస్యలోని గుణాలను అనుసరించి ఉంటుంది. ఆవశ్యకతను బట్టి ఉంటుంది. లార్డ్ లాథియన్ కమిటీ పర్యటన ఇంకా పూర్తికాలేదు. కొన్ని వారాలలో ఆ కమిటి నివేదికను, దాని తీర్పును స్వీకరిస్తాం. ఇది మీకు తెలుసు - నివేదిక అందిన తర్వాత దాని సిఫార్సులను చాలా జాగ్రత్తగా పరిశీలించాల్సి ఉంటుంది. కమిటి అభిప్రాయంతోపాటు, మీరు మీతోపాటు దానిని గురించి మాట్లాడుతున్నవారు అభిప్రాయాలువ్యక్తం చేయందే మేము నిర్ణయం ప్రకటించం. బహుశా మాస్థానంలో మీరున్నా ఇప్పుడు మేము చేస్తున్న పనినే చేస్తారనుకుంటాను. మొదట కమిటీ నివేదిక సమర్పించాలి. దానిని పూర్తిగా పరిశీలించాలి. తుది నిర్ణయం తీసుకునే లోపల రెండు పక్షాల అభిప్రాయాలను పరిగణలోకి తీసుకోవాలి. ఇంతకు మించి ఏమీ చెప్పలేను. నేను ఇంతకు మించి ఏమన్నా చెప్పాలని మీరు భావిస్తారని నేననుకోను."

ఈ వార్నింగ్ ఇచ్చిన తర్వాత ఆమరణనిరాహార దీక్ష చేస్తానని రెండోసారి బెదిరించడం బ్రిటిష్ ప్రభుత్వం దిగిరావడానికి, అస్పృశ్యుల డిమాండ్లను సమ్మతించే ప్రయత్నాన్ని నివారించడానికి ఉపయోగపడినట్లు భావించి గాంధీ నెమ్మది అయ్యాడు. 1932 ఆగష్టు 17న మత సమస్య మీద ప్రధానమంత్రి ప్రకటన వెలువడింది.

అస్పృశ్యులకు సంబంధించినంత వరకు ఆయన నిర్ణయం ఇది:-

1. కులమత సమస్య మీద 1932 నాటి ప్రభుత్వం ప్రకటన రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ రెండో సమావేశం చివర్లో ప్రభుత్వం తరపున ప్రధానమంత్రి గత డిసంబర్ నెల 1న ఒక ప్రకటన చేశారు. దానిని ఆ తర్వాత పార్లమెంటు ఉభయసభలు ఆమోదించాయి - ఆ ప్రకటనలో మతకుల సమస్యను పరిష్కరించడంలో కాన్ఫరెన్స్ విఫలమైనట్లు భావించబడింది. ఆ సమస్యను గురించి భారతదేశంలోని మతాలు/కులాలు ఒక ఆమోదయోగ్యమైన ఒప్పందానికి రాకపోతే ఆ కారణంగా భారత రాజ్యాంగ నిర్మాణ ప్రగతి కుంటు పడగూడదని ప్రభుత్వం నిర్ణయించింది. అందుకోసం ప్రభుత్వం వారే ఒక చట్టపరమైన పథకాన్ని రూపొందించి ఆ అడ్డంకిని తొలగించాలని కూడ నిర్ణయించబడింది.

2. విభిన్న మతాలు/జాతులు ఒక ఆమోదయోగ్యమైన ఒప్పందానికి రావడంలో ప్రతి సారీ విఫలం అవుతున్నాయన్న సంగతి తెలిసి ప్రభుత్వం గత మార్చి 19న అతిక్లిష్టము, వివాదాస్పదమూ అయిన ఈ సమస్యను జాగ్రత్తగా తిరిగి పరిశీలిస్తున్నట్లు పేర్కొంది. కొత్త

రాజ్యాంగంలో అల్పసంఖ్యాక వర్గాలస్థితిగతుల సమస్యకుసంబంధించి ఒక నిర్ణయానికి రాకపోతే రాజ్యాంగ నిర్మాణంలో పురోగతి సాధ్యం కాదని గుర్తించింది.

3. అందుకనుగుణంగా ఈ పథకానికి పుష్టినివ్వడానికి కొన్ని సదుపాయాలను కల్పించాలని ప్రభుత్వం నిర్ణయించింది. పార్లమెంటు ముందు సమర్పించిబోయే భారత రాజ్యాంగానికి సంబంధించి ఈ క్రింది ప్రతిపాదనలు రూపొందించింది. రాష్ట్రశాసనసభల్లో బ్రిటిష్ ఇండియన్ మతాలు/కులాల ప్రాతినిధ్యం ఉండేట్లు ఏర్పాటు చేయడానికి మాత్రమే ఈ పథకం పరిమితం చెయ్యబడింది. కేంద్రశాసనసభల్లో ప్రాతినిధ్యం గురించిన పరిశీలన ప్రస్తుతానికి నిలిపివేయబడింది. కారణం 20వ పేరాలో ఇవ్వబడింది. ఇలా ఈ పథకానికి పరిధిని నిర్ణయించడం వల్ల ప్రభుత్వం రాజ్యాంగ నిర్మాణానికి ఎంతో ప్రాముఖ్యం గలఇతర అల్పసంఖ్యాక వర్గాల వారి సమస్యల పట్ల నిర్ణయం తీసుకునే అగత్యాన్నికల్పిస్తుందన్న నిజాన్ని గుర్తించడంలో విఫలమైందని అర్థం చేసుకోరాదు. అయితే విభిన్నమతాల/కులాల ప్రాతినిధ్య పరిమాణం, విధానం, ప్రాథమిక సమస్యల మీద ఒకసారి ప్రకటన, వెలువడితే అది ఇతర మతాల/కులాల సమస్యల పట్ల సామరస్యం కుదరడానికి అవకాశం కల్పిస్తుందని భావించబడింది.

4. ప్రభుత్వ నిర్ణయాన్ని పునరాలోచన చేసే దృష్టితో పార్టీ చేసే ఏ సంప్రదింపులకైనా ప్రభుత్వం పార్టీ కాదని అర్థం చేసు కోవాల్సి ఉంది. దీనికి మార్పులు చేర్పులు చేసే ఏ ప్రతిపాదనైనా, దానిని అన్ని పార్టీలు సమర్థిస్తే తప్ప ప్రభుత్వం అంగీకరించదు. అయితే అందరికీ ఆమోదయోగ్యమైన పరిష్కారం కుదిరేట్టయితే తలుపులు ఎప్పుడూ తెరిచే ఉంటాయి. అందువల్ల నూతన భారత ప్రభుత్వచట్టం శాసనరూపం ధరించే లోపల అన్ని మతాలు/కులాలు పరస్పరం అంగీకరించే ఆచరణాత్మకమైన పథకం రూపొందితే ఒకటి లేక ఎక్కువ రాష్ట్రాలలోగాని మొత్తం బ్రిటిష్ ఇండియాకు సంబంధించి గాని దానిని ప్రభుత్వం పార్లమెంటుకు సిఫారసు చేస్తుంది.

5) * * *

6) * * *

7) * * *

8) * * *

9. అణచబడ్డ వర్గాల వాళ్ళలో వోటువెయ్యడానికి అర్హతకల వాళ్ళుసాధారణ నియోజక వర్గాలలో వోటు వేస్తారు. ఒక నిర్దిష్ట కాలందాకా వీళ్ళు చట్టసభలో కావలసినంత ప్రాతినిధ్యాన్ని సంపాదించుకోరు అన్న వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకొని, పట్టికలో చూపినట్లు, కొన్ని ప్రత్యేక స్థానాలు వాళ్ళకు కేటాయించబడతాయి. ఈ స్థానాలు ప్రత్యేక నియోజక వర్గాల ఎన్నికల ద్వారా భర్తీ చెయ్యబడతాయి. అణచబడ్డ వర్గాల వాళ్ళలో మాత్రమే వోటు వేసే అర్హతఉన్న వాళ్ళు ఇందులో వోట్లు వేస్తారు. ఈ ప్రత్యేక నియోజక వర్గంలో వోటు వేసే అభ్యర్థి సార్వజనీన (సాధారణ) నియోజక వర్గంలో కూడా వోటు వేస్తాడు. ఈ నియోజక వర్గాలు అణచబడ్డ వర్గాల ప్రజలు అధిక సంఖ్యలో ఉండేప్రాంతాల్లో, మద్రాసులో తప్ప, ఏర్పాటు చేయబడతాయి. అవి రాష్ట్రమంతా ఆవరించి ఉండవు.

బెంగాల్‌లో కొన్ని సార్వజనిక నియోజక వర్గాల్లో అధిక సంఖ్యాకులు అణచబడ్డ వర్గాల వాళ్ళున్నట్లుంది - అందువల్ల తర్వాతి పరిశీలనను ఆపి, ఆరాష్ట్రంనుండి ప్రత్యేక నియోజక వర్గాలనుండి ఎన్నిక కావలసిన ప్రతినిధుల సంఖ్య ఏదీ నిర్ణయింప బడలేదు. బెంగాల్ చట్టసభలో పదికి ఎక్కువ కాకుండా అణచబడ్డ వర్గాల వాళ్ళ స్థానాలు సంపాదించుకోవాలని భావించబడింది.

అణచబడ్డ వర్గాల ప్రత్యేక నియోజక వర్గాల్లో వోటు వెయ్యదగిన వారెవ్వరు అనే విషయం ఇంకా సమగ్రంగా నిర్వచింపబడలేదు. ఎన్నికల కమిటి నివేదికలో సూచించిన సాధారణ సూత్రాల మీద ఆధారపడి దానిని నిర్వచించాలి. ఉత్తర భారతదేశంలో కొంత మార్పు అవసరమౌతుంది. రాష్ట్రంలోని ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా అస్పృశ్యులకు మనం చేప్పే సాధారణ నిర్వచనం అన్వయించదు. ప్రభుత్వం అణచబడ్డ వర్గాలను నియమిత కాలానికి మించి కొనసాగించదు. ఆరవ పేరాలో పేర్కొన్నట్లు ఎన్నికల పునఃపరిశీలన తర్వాతసాధారణ అధికారాల్ల ద్వారా ఇవి నిలిపివేయ బడక పోయిన పక్షంలో, 20 సంవత్సరాల తర్వాత నిలిపివేసే అవకాశం రాజ్యాంగం కల్పిస్తుంది.

## VIII

గాంధీ తన బెదిరింపు విఫలమైనట్లు తెలుసుకున్నాడు. ప్రధానమంత్రిని మధ్యవర్తిగా ఉండమని కోరుతూ తాను సంతకం చేయడాన్ని కుడా ఆయన లెక్కచేయలేదు. అలా సంతకం చేసిన వ్యక్తిగా నిర్ణయానికి కట్టుబడి ఉండాలన్న విషయాన్ని విస్మరించాడు. ప్రధానమంత్రి చేసిన దానిని ఆయన అడ్డుకోవడం మొదలు పెట్టాడు. కమ్యూనల్ అవార్డ్ నియమాలను తిరిగి పరిశీలించాలని మొదట ప్రయత్నించాడు. అందుకోసం ప్రధానమంత్రికి ఇలా ఉత్తరం రాశాడు:-

ఎరవాడ సెంట్రల్ జైలు,

ఆగష్టు 18, 1932.

ప్రియమైన మిత్రునికి,

అణచబడ్డ వర్గాల ప్రాతినిధ్య సమస్యమీద మార్చి 11న నేను రాసిన ఉత్తరాన్ని సర్ శామ్యూల్ హోరె మీకు, మీ మంత్రివర్గానికి చూపెట్టి ఉంటాడు. ఆ లేఖను ఈ లేఖలో భాగంగా భావించి దీనితో కలిపి చదవాల్సిందిగా కోరుతున్నాను.

అల్పసంఖ్యాక వర్గాల ప్రాతినిధ్యం సమస్య మీద బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయం చదివాను. దానిని గురించి మరచిపోయాను. సర్ శామ్యూల్ హోరేకు నేను రాసిన లేఖ, సెయింట్ జేమ్స్ ప్యాలస్‌లో 1931 నవంబర్ 13న జరిగిన రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు చెందిన అల్పసంఖ్యాక వర్గాల కమిటీ సమావేశంలో నేను చేసిన ప్రకటనలను అనుసరించి మీ నిర్ణయాన్ని నేను నా ప్రాణం ద్వారా అడ్డుకోవలసి ఉంది. నేను ఆమరణ నిరాహార దీక్షను ప్రకటిస్తాను. ఉప్పు సోడకలిపిన లేక కలవని నీరు మాత్రమే తీసుకుంటాను. నా నిరాహారదీక్ష

కొనసాగుతున్న సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం తనంతట తానుగాని, ప్రజాభిప్రాయానికి తలఒగ్గికాని అణచబడ్డ వర్గాల వారికి కులప్రాతిపదిక మీద ఏర్పాటు చేసినపథకాన్ని విరమించుకుంటే దీక్ష విరమింప బడుతుంది. ఆ ప్రతినిధులు సాధారణ ఎన్నికలలో సాధారణ వోటు ద్వారా ఎన్నుకోబడాలి.

పైన పేర్కొన్నట్లు ప్రభుత్వ నిర్ణయం మారకపోతే, సెప్టెంబర్ 20 మధ్యాహ్నం నా దీక్ష మొదలౌతుంది. మీకు ఎక్కువ సమయం దొరికేటట్లు చెయ్యడానికి నా ఉత్తరం పాఠాన్ని తంతి ద్వారా మీకు పంపమని ఇక్కడి అధికారులను కోరుతున్నాను. నెమ్మదిగా మీకు చేరినా, అవసరమైనంత వ్యవధి ఉండేటట్లు గానే మీకు ఉత్తరం రాస్తున్నాను.

ఈ ఉత్తరాన్ని సర్ శామ్యూల్ హోరేకు రాసిన ఉత్తరాన్ని సాధ్యమైనంత తొందరగా ప్రచురించాలని కూడా కోరుతున్నాను. నేను జైలు నియమాలను క్షుణ్ణంగా పాటించాను. నా కోరికను లేక నా రెండుత్తరాల్లోని విషయాలను తెలిపాను. ఒకరికి కాదు. సర్దార్ వల్లభాయ్ పటేల్, మహాదేవ్ దేశయ్ అనే నా ఇద్దరు సమాచరులకు. కాని మీరు అవకాశం ఇస్తే నా ఉత్తరాలకు సంబంధించి ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చెయ్యాలను కుంటున్నాను. అందువల్ల తొందరగా వాటిని ప్రచురించమని నా కోరిక.

నా నిర్ణయం పట్ల చింతిస్తున్నాను. ఒక మత వ్యక్తిగా ఇంతకు మించి గత్యంతరం లేదు. సర్ శామ్యూల్ హోరేకు నేను రాసిన లేఖలో పేర్కొన్నట్లు, వాళ్ళ ఇబ్బందుల నుంచి బయట పడటానికి నన్ను విడుదల చేసినా నా దీక్ష కొనసాగుతుంది. నిర్ణయాన్ని మరే విధంగాను అడ్డుకునే అవకాశం లేక, నా విడుదలను గౌరవనీయం కాని పద్ధతిలో తప్ప మరో రకంగాను చూడాలని నేను కోరుకోవడం లేదు.

నా నిర్ణయం కాలం చెల్లినది కావచ్చు. అణచబడ్డ వర్గాల వారికి ప్రత్యేక నియోజక వర్గాల కేటాయింపు వారికీ హిందూమతానికి హానికరం అని భావించడంనా తప్పుకావచ్చు. అలా అయితే నా జీవిత తత్వంలోని ఇతర అంశాల పట్లకూడా నేను ఒప్పుగా, సరిగ్గా ఉన్నట్లు కాదు. అలాంటప్పుడు నిరాహారదీక్ష ద్వారా నామరణం నా తప్పుకు ప్రాయశ్చిత్తం అవుతుంది. నా సిద్ధాంతాలపట్ల అమాయకమైన విశ్వాసం గల అసంఖ్యాకమైన స్త్రీ పురుషులకు నాభారాన్ని తగ్గించినట్లు అవుతుంది. ఒకవేళ నా నిర్ణయం సరైనదైతే ఇంక నాకు దీనిపట్ల కొంచెం సందేహముంది. నేను ఉద్దేశించిన నా దీక్ష నా జీవితంలో దాదాపు 25 సం .లపాటు ఏజీవన క్రమాన్ని పాటించానో దాని సఫలీకరణం మాత్రమే. అంతేకాదు ఇందులో నేను తగినంత విజమాన్ని పొందాననే భానిస్తున్నాను.

ఉంటాను

మీ విశ్వాస ప్రియమిత్రుడు,

ఎం.కే.గాంధీ

ప్రధానమంత్రి ఇలా బదులిచ్చారు:-

10, డౌనింగ్ స్ట్రీట్
సెప్టెంబర్ 8, 1932.

ప్రియమైన గాంధీ,

మీ ఉత్తరం చేరినది. ఆశ్చర్యం కలిగించింది. నా విచారం వ్యకం చేస్తున్నాను. అణచబడ్డ వర్గాలపట్ల ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని అపార్థం చేసుకుని మీరు ఉత్తరం రాసినట్టు భావిస్తున్నాను. అణచబడ్డవర్గాల వాళ్ళను హిందూ మతం నుండి శాశ్వతంగా వేరు చేయడాన్ని మీరు తప్పకుండా వ్యతిరేకిస్తారని మాకు తెలుసు. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కు చెందిన అల్పసంఖ్యాక వర్గాల కమిటి ముందు మీ అభిప్రాయాన్ని స్పష్టం చేశారు. అంతేగాక మార్చి 11న సర్ శామ్యూల్ హోరేకు రాసిన లేఖలో మరలా చెప్పారు. మీ అభిప్రాయం సమస్త హిందువుల అభిప్రాయంలో భాగమని మాకు తెలుసు.అందువల్ల అణచబడ్డ వర్గాల ప్రాతినిధ్య సమస్యను మేము ఎంతో జాగ్రత్తగా పరిశీలించాం.

అణచబడ్డ వర్గాల వారి సంఘాల నుండి వచ్చిన లెక్కలేనన్నివిజ్ఞప్తులను, మీరు కూడా గుర్తించినట్లు వాళ్ళ నిస్సహాయ పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని అణచబడ్డ వర్గాల వారికి చట్టసభల్లో తగిన ప్రాతినిద్యాన్ని కల్పించడం మా కనీస బాధ్యతగా భావించాం. అదే సందర్భంలో వాళ్ళను హిందూ సమాజం నుండి విడివడకుండా జాగ్రత్త పడ్డాం. చట్టసభల్లో వాళ్ళ ప్రాతినిధ్యాన్ని మీరు వ్యతిరేకించడం లేదని మార్చి 11 నాటి ఉత్తరంలో మీరే పేర్కొన్నారు.

ప్రభత్వ ప్రణాళికలో అణచబడ్డ వర్గాల వాళ్ళు హిందూమతంలో భాగంగానే ఉంటారు. హిందూ వోటర్లతో సమానంగా వోటు వేస్తారు. అయితే మొదటి ఇరవై ఏళ్ళు ఎన్నికల విషయంగా హిందూసమాజంలో భాగంగా ఉంటూనే, కొన్ని పరిమితమైన ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా వాళ్ళ హక్కులను, ప్రయోజనాలను సరంక్షించుకునే మార్గాన్ని సంపాదించు కుంటారు. ప్రస్తుత పరిస్థితుల్లో ఇది అవసరమి మనం ఒప్పుకున్నాం.

ప్రత్యేక నియోజక వర్గాలు సృష్టించిన చోట, అణచబడ్డ వర్గాల వాళ్ళు సాధారణ హిందూ నియోజక వర్గాల్లో వోటును పోగొట్టుకోరు. హిందూసమాజంలో వాళ్ళ ప్రభుత్వానికి ఆటంకం కలక్కుండా వాళ్ళకు రెండు వోట్లు ఉంటాయి.

అణచబడ్డ వర్గాలకు మీరు వర్ణించిన ప్రత్యేక కుల / మత పరమైననియోజక వర్గాల సృష్టికి వ్యతిరేకంగానే మేము నిర్ణయం తీసుకున్నాం. అణచబడ్డ వర్గాల వోటర్లందరినీ సాధారణ హిందూ నియోజక వర్గాల్లో కలిపాం. దాని ద్వారా ఎన్నికల్లో ఉన్నత కులాల అభ్యర్థులు వాళ్ళ వోట్లను అడుగుతారు. అలా హిందూ సమాజ సమైక్యత అన్ని రకాలుగా క్షేమంగా ఉంటుంది.

బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడిన తొలి దశలో చట్టసభల్లో ఆధిక్యతవచ్చిన వాళ్ళకు అధికారం దక్కుతుంది. కాబట్టి అణచబడ్డ వర్గాల వాళ్ళు వాళ్ళ ప్రతినిధులంటూ కొంతమందిని ఈ చట్ట సభలకు రప్పించుకోవాలని అనుకున్నాం. తొమ్మిది రాష్ట్రాలలో ఏడింటిలోంచి వాళ్ళ ప్రతినిధులు వస్తారు. ఆవిధంగా వాళ్ళు తమ కష్టాలను చెప్పుకోడానికి, వాళ్ళకు

వ్యతిరేకంగా చేసే నిర్ణయాలను ప్రభుత్వం అవసరం లేకుండా అడ్డుకోడానికి ఇది అవసరం. ఒక్కమాటలో వాళ్ళంతట వాళ్ళే మాట్లాడ గలిగే స్థితిలో వాళ్ళను ఉంచడానికి ఇది అవసరం. ఇది అవసరమని సజావుగా ఆలోచించే వారెవరైనా అంగీకరిస్తారు. వాళ్ళను సవర్ణ హిందువులు శతాబ్దాలుగా హీనాతిహీనంగా చూచినట్లు సర్ శామ్యూల్ హోరేకు రాసిన లేఖలో మీరే వర్ణించారు కదా! ప్రస్తుత పరిస్థితుల్లో సీట్లు రిజర్వు చేసి ప్రత్యేక ప్రతినిధుల్ని ఎన్నుకునే పద్ధతిని మేము పరిశీలించలేదు. ఆచరణాత్మకమైన ఏ ఎన్నిక పద్ధతిలోనైనా వాళ్ళకు ప్రాతినిధ్యం వరింహించే వాళ్ళు, వాళ్ళకు జవాబు దారిగా ఉండాలి. ఎందువల్ల నంటే అలాంటి సభ్యులు ఎక్కువ మంది ఉన్నత వర్ణ హిందువుల చేత ఎన్నుకోబడతారు.

అణచబడ్డ వర్గాల వాళ్ళకు సాధారణ హిందూ నియోజక వర్గాల్లో ఎన్నిక హక్కులతో పాటు పరిమిత సంఖ్యల్లో ప్రత్యేక నియోజక వర్గాల కల్పన రూపంలో ప్రభుత్వం కల్పించిన సౌకర్యం ముస్లింలకు ప్రత్యేక కమ్యూనల్ నియోజక వర్గాలు కేటాయించడం కన్నా అన్ని రకాల భిన్నమైంది. ఉదాహరణకు ముసల్మాన్ సాధారణ నియోజక వర్గంలో అభ్యర్థి కాలేడు, వోటువెయ్యలేడు. కాని వోటుహక్కుగల అణచబడ్డ వర్గాల వాళ్ళు సాధారణ నియోజక వర్గాలలో వోటువెయ్యొచ్చు. ఎన్నికల్లో పోటీ చెయ్యొచ్చు.

ముస్లింలకు కేటాయించిన స్థానాల సంఖ్య, వాళ్ళు ఇతర స్థానాలు సంపాదించలేరు కాబట్టి పెరగదు. ఇలా రాష్ట్రాలలో వాళ్ళ జనాభా నిష్పత్తిలోని ఆధిక్యతవల్ల ఎక్కువ సౌకర్యాలు అనుభవిస్తారు. అణచబడ్డ వర్గాల వారి ద్వారా పూరించవలసిన ప్రత్యేక స్థానాలు చాలా తక్కువ. వాళ్ళ జనాభాకు సరిపోయేంతగా ప్రాతినిధ్యం వహించవలసిన సంఖ్యలో వాళ్ళ స్థానాలను నిర్ణయించ లేదు. గరిష్ట సంఖ్యలో వాళ్ళకు వాళ్ళే తమ ప్రతినిధులనుఎన్నుకుంటారు. అన్నిచోట్ల అణచబడ్డ వర్గాల జనాభాతో పోల్చిచూస్తే వాళ్ళకు కేటాయించిన ప్రత్యేక స్థానాలు చాలా తక్కువ.

మీ అభిప్రాయాన్ని నేనర్థం చేసుకున్న దాని ప్రకారం మీరు ఆమరణనిరాహార దీక్షను చేపట్టడం అణచబడ్డ వర్గాలవాళ్ళు ఇతర హిందువులతో కలసిస్థానాలను పొందడం కోసం కాదు. అది ఇది వరకే కల్పించ బడింది. కాబట్టి హిందువులు ఐక్యతను కాపాడటం కోసం కాదు. ఆది కూడా ఇదివరకే ఉంది. కాని, నేడు భయంకర నిస్సహాయతలో ఉన్న అణచబడ్డ వర్గాల వాళ్ళను చట్టసభల్లో తమ తరపున మాట్లాడే ప్రత్యేక ప్రతినిధులను పరిమిత సంఖ్యలో ఎన్నుకోవడాన్ని నివారించడానికే, ఎందుకంటే ఈ ప్రత్యేక ప్రాతినిధ్యం వాళ్ళ భవిష్యత్తుమీద పెద్ద ప్రభావాన్ని చూపుతుంది కాబట్టి.

స్పష్టంగా జాగ్రత్తగా చేసిన ఈ ప్రతిపాదనల వెలుగులో మీరీ నిర్ణయం తీసుకోవడానికి కారణం అర్థం కావడం లేదు. వాస్తవాలను మీరు అపార్థం చేసుకున్నారని మాత్రం చెప్పగలను.

తమంత తామే ఒక నిర్ణయం తీసుకోలేక భారతీయులు కోరిన మీదటనే, ప్రభుత్వం తన ఇష్టానికి వ్యతిరేకంగా అల్పసంఖ్యాక వర్గాల సమస్యమీద ఒకనిర్ణయం ప్రకటించే బాధ్యతను తీసుకొంది. ప్రభుత్వం తన నిర్ణయం ప్రకటించింది. ప్రభుత్వం వారు దానిని మార్చలేరు, పైన పేర్కొన్న నియమం ప్రకారం తప్ప. అందువల్ల మీకు నా సమాధానం ప్రభుత్వ నిర్ణయం మారదు అన్నదే. ప్రభుత్వం చిత్త శుద్ధితో ప్రయత్నించి ఆయావాదాల

గుణాలను దృష్టిలో పెట్టుకొని ఏర్పాట్లు చేసింది. వాటిని మార్చి ఇతర రకాల ఎన్నికల ఏర్పాట్లు చెయ్యాలంటే విభిన్న మతాలు / జాతులు కలసి కట్టుగా చేసుకున్న ఒప్పందం మాత్రమే చెయగలదు.

మీ రెండు ఉత్తరాలను ప్రచురించమని మీరు అడిగారు. మీరు కారాగారవాసం వల్ల నిరాహార దీక్షకు ఎందుకు పూనుకుంటాన్నారో ప్రజలకు తెలుసుకునే అవకాశానికి అడ్డంవస్తే అది నావైపు నుంచి మర్యాదగా ఉండదు. అందువల్ల మీకోరికను వెంటనే ఆమోదిస్తున్నాను. అయితే మీరు మీకోరికను పునరుద్ఘాటించినప్పుడు మాత్రమే. ఏమైనప్పటికీ ప్రభుత్వ నిర్ణయంలోని వాస్తవికమైన వివరాలను మరోసారి పరిశీలించమని, మీ నిర్ణయం న్యాయసమ్మతమైనదేమో మిమ్మల్ని మీరే ప్రశ్నించు కోమని కోరుతున్నాను.

మీ అత్యంత విధేయుడు.

జె. రాంసో. మెక్‌డొనాల్డ్.

ప్రధానమంత్రి ఇక చిక్కడని తెలుసుకుని తాను అమరణ నిరాహార దీక్షకు పూనుకొంటున్నట్లు పునరుద్ఘాటిస్తూ ఇలా ఉత్తరం రాశాడు గాంధీ.

ఎరవాడ సెంట్రల్ జైలు
సెప్టెంబర్ 9/1932

ప్రియ మిత్రమా!

టెలిగ్రాం ద్వారా మీరు పంపిన సంపూర్ణ ఉత్తరం ఈ రోజు చేరింది. అది దాపరికం లేని ఉత్తరం. కృతజ్ఞతలు. నా మనసులో లేని భావాన్ని మీరు వ్యాఖ్యానించి చెప్పారంటున్నందుకు క్షమించండి. ఎవరి ఆశయాలను త్యాగం చెయ్యడం కోసం నేను అమరణ దీక్షను ప్రారంభించానని మీరు నా విషయంలో ఆరోపిస్తూన్నారో ఆపర్గ ప్రజల తరఫున నేను మాట్లాడుతున్నానని స్పష్టంచేసి ఉన్నాను.

స్వార్థంతో కూడిన అలాంటి వ్యాఖ్యానాన్ని దేన్నైనా ఈ తీవ్ర నిర్ణయం నివారించగలదని భావించాను. వాదనలోకి దిగకుండా నాకు ఈ విషయం స్వచ్ఛమైన మతంలో భాగమని నొక్కిచెబుతున్నాను. అణచబడ్డ వర్గాల వారు కేవలం రెండు వోట్లు కలుగుండటం. అటు వాళ్ళను గాని ఇటు హిందూసమాజాన్ని కాని చీలికనుండి కాపాడదు. వాళ్ళకు ప్రత్యేక నియోజక వర్గాలను కేటాయించడంలో హిందూమతాన్ని నాశనం చెయ్యడానికి పథకం ప్రకారం విషం ఎక్కించడం ఉందని, అణచబడ్డ వర్గాలకు కూడ ఒరిగేది ఏమిలేదని నేను అనుకుంటున్నాను. మీరు ఎంత సానుభూతి పరులైనప్పటికీ, ఆయా వర్గాలకు చెందిన మత విషయాల మీద మీరు సరైన నిర్ణయం తీసుకోలేరని చెప్పడానికి నన్ను అనుమతించండి.

అణచబడ్డ వర్గాలకు అపరిమిత ప్రాతినిధ్యం ఇచ్చినా నేను వ్యతిరేకించ కూడదు. నేను వ్యతిరేకిస్తున్నది పరిమిత గూసంలోనే అయినా వాళ్ళను హిందూసమాజం నుంచి శాశ్వతంగా విడదీయడాన్ని, మీ నిర్ణయమే నిలబడి నూతన రాజ్యాంగం వస్తే అన్ని జీవిత రంగాల్లోను అణచివేయబడ్డ తమ సహచరులను, తోటి మనషులను ఉద్ధరించడానికి అంకితమైన హిందూ సంస్కర్తల అత్యద్భుత కృషికి అడ్డుకట్ట వేసేస్తారని మీరు గ్రహించారా?

అందువల్ల నేను మీకు తెలిపిన నిర్ణయం మీద తిరుగులేని విధంగా నిలబడవలసి వస్తున్నది. మీ ఉత్తరం అపార్థానికి అవకాశమిస్తుంది కాబట్టి మీనిర్ణయంలో అణచబడ్డ వర్గాల వాళ్ళకు ప్రత్యేక సదుపాయాలను కల్పించేభాగాన్ని నేను వ్యతిరేకిస్తున్నానంటే తక్కిన భాగాలను ఆమోదిస్తున్నానని అర్థం కాదని చెప్పదలచు కుంటున్నాను. నా అభిప్రాయంలో మీ నిర్ణయంలోని చాలా భాగాలు తీవ్రంగా వ్యతిరేకించాల్సి ఉన్నాయి.

ఉంటాను,
మీ విశ్వాసనీయ మిత్రుడు
ఎం.కె.గాంధీ

తదనుగుణంగా 1932 సెప్టెంబర్20న అస్పృశ్యులకు విశిష్టమైన ప్రత్యేకనియోజక వర్గాల కేటాయింపును వ్యతిరేకిస్తూ ఆమరణ నిరాహార దీక్షను ప్రారంభించాడు.

ఈ వాస్తవ గాథను ప్యారేలాల్ "ఐతిహాసిక నిరశన దీక్ష" అనే గ్రంథంలో సజీవంగా చిత్రించారు. ఆసక్తిగల వాళ్ళు చదవచ్చు. ఏమైనా దానిని బోస్వెల్ రాశాడని అందులో చాలా దోషాలున్నాయని హెచ్చరిస్తున్నాను. దానికి మరోపార్శ్వం కూడా ఉంది. అయితే దానిని చెప్పడానికి స్థలంగాని కాలంగాని లేవు. అయినప్పటికీ గాంధీ దీక్ష చేపట్టడంలోగల ఎత్తుగడలను ఎత్తి చూపుతూ నేను చేసిన ప్రకటనను[1] చూడండి. గాంధీ ఆమరణ నిరాహార దీక్షను ప్రకటించినా ఆయనచచ్చిపోవాలని మాత్రం కోరుకోలేదని చెప్పవచ్చు. అతను బతకాలనీకోరుకున్నాడు.

దీక్ష సహజంగానే సమస్యను సృష్టించింది. గాంధీ ప్రాణాన్ని కాపాడటంఎలా అన్నదే ఆ సమస్య. ఆయన ప్రాణాన్ని కాపాడటానికి ఒకటేదారి. అది ఆయన అంతరాత్మను క్షోభపెట్టిన కమ్యూనల్ అవార్డ్‌ను మార్చడం - బ్రిటిష్ మంత్రివర్గం తనంతట తాను దానిని విరమించు కోవడం లేదా మార్చడం చెయ్యదు. సవర్ణ హిందువులు అస్పృశ్యులు సమానంగా అంగీకరించే సూత్రం ఏదైనా ఉంటే ప్రభుత్వం పథకానికి బదులు దానిని ఆమోదిస్తుందని ప్రధానమంత్రి స్పష్టం చేశారు. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో అస్పృశ్యుల ప్రతినిధిగా ఉండే గౌరవం నాకు దక్కింది గాబట్టి అస్పృశ్యుల ఆమోదమేదైనా సరే నాప్రమేయం లేకుండా దానికి విలువలేదని భావించింది. ఆశ్చర్యకరమైన వాస్తవం ఏమిటంటే, భారతదేశంలోని అస్పృశ్యుల నాయకుడిగా నాకున్న స్థానాన్ని కాంగ్రెస్ వాళ్ళు ప్రశ్నించలేదు సరికదా! దానిని ఆమోదించారు. సహజంగానే అందరి కళ్ళు నా వైపు తిరిగాయి.

నాలాగా ఆసమయంలో భయంకరమైన సందిగ్ధావస్థలో పడిన వ్యక్తి ఇంకొకరు లేరంటే అతిశయోక్తి కాదు. ఇది చాలా ఆందోళన కలిగించే సందర్భం. రెండు భిన్నమైన ప్రత్యామ్నాయాలలో దేనినో ఒక దానిని ఎన్నుకోవాలి. నాముందొక బాధ్యత ఉంది. అది సాధారణ మానవతను ప్రదర్శించి గాంధీని మరణం నుంచి కాపాడడం. నా ముందొక సమస్య ఉంది. ప్రధానమంత్రి అస్పృశ్యులకు కల్పించిన రాజకీయ హక్కులను కాపాడడం. నేను మానవతాదృష్టికి స్పందించాను. గాంధీకి నచ్చిన రీతిలో కమ్యూనల్ అవార్డును మార్చడానికిఒప్పుకొని గాంధీ ప్రాణాన్ని కాపాడాను. ఈ ఒప్పందానికే పూనా ఒప్పందంఅనిపేరు.

1. అనుబంధం iv

## పూనా ఒప్పందం పాఠం

రాష్ట్ర శాసనసభల్లో సాధారణ నియోజక వర్గ స్థానాల నుంచి అణచబడ్డ వర్గాల వారికి క్రింద పేర్కొన్నట్లు సీట్లు రిబర్వు చేయాలి.:

మద్రాసు 30, సింధ్‌తో కలుపుకుని బొంబాయి 15, పంజాబు 8, బీహార్, ఒరిస్సా 18, మధ్యపరగణాలు 20 అస్సాం 7, బెంగాల్ 30,సంయుక్తపరగణాలు 20, మొత్తం 148.

ఈ సంఖ్యలు ప్రధానమంత్రి నిర్ణయంలో ప్రకటించిన రాష్ట్ర కౌన్సిళ్ళలోని మొత్తం జనాభా ఆధారంగా నిర్ణయించబడ్డాయి.

2. ఈ స్థానాలకు ఉమ్మడి ఎన్నికల ద్వారా ఎన్నికలు జరుగుతాయి అయితే ఈ క్రింది క్రమాన్ని అనుసరించాలి.

ఒక నియోజక వర్గంలో సాధారణ ఎన్నికల వోటర్లుగా నమోదుచేసుకున్న అణచబడ్డ వర్గాల వాళ్ళు ఒక ఎలెక్టోరల్ కాలేజిగా రూపొందుతారు. ఆ కాలేజికి ఒక వోటు పద్ధతిలో రిజర్వ్‌డ్ సీట్లలో నలుగురు వ్యక్తులుండే ప్యానల్‌ను ఒక్కొక్కదానిని ఎన్నుకుటుంది. ప్రాథమిక ఎన్నికలో అత్యధికంగా వోట్లు సంపాదించిన నలుగురు వ్యక్తులు సాధారణ ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులౌతారు.

3. కేంద్ర శాసనసభల్లో అణచబడ్డ వర్గాల ప్రాతినిధ్యం కూడా ఉమ్మడి నియోజక వర్గాల పద్దతిలోను సీట్ల రిజర్వేషన్ ద్వారాను ఉంటుంది. పైన రెండో నిబంధనలో చూపినట్లుగా ప్రాథమిక ఎన్నిక పద్దతి ద్వారా ప్రాంతీయ శాసనసభల్లో వారి ప్రాతినిధ్యం నిర్ణయించ బడుతుంది.

4. కేంద్ర శాసనసభలో బ్రిటిష్ ఇండియా లోని సాధారణ సభ్యుల సంఖ్యలో18 శాతం అణచబడ్డ వర్గాల వారికి రిజర్వ్ చేయబడతాయి.

5. పైన పేర్కొన్న కేంద్ర రాష్ట్ర శాసనసభలకు ఎన్నుకోవడం కోసం అభ్యర్థుల ప్యానల్‌కు జరిపే ప్రాథమిక ఎన్నిక పద్ధతి మొదటి పదేళ్ళు ఉంటుంది. తర్వాత పోతుంది. ఆరోక్లాజులో పేర్కొన్నట్లు పరస్పర అంగీకారం కుదిరి దానికి ఇంకా ముందే తీసేస్తే తప్ప అది పదేళ్ళు కొనసాగుతుంది.

6. 14, క్లాజులలో పేర్కొన్నట్లు రాష్ట్ర కేంద్ర శాసన సభలలో రిజర్వేషన్‌ద్వారా అణచబడ్డ వర్గాల ప్రాతినిధ్యం ఉండే పద్ధతి ఒప్పందంలోని విభిన్నకులాలు/మతాలు పరస్పరం అంగీకరించి నిర్ణయించేంత కాలం కొనసాగుతుంది.

7. ఈ రెండు సభలకు అణచబడ్డ వర్గాల వారిని ఎన్నుకోవడం లాధియన్ కమిటి నివేదిక సూచించిన పద్ధతిలో జరుగుతుంది.

8. అణచబడ్డ వర్గాలకు సభ్యుడు అనే కారణం చేత స్థానిక సంస్థలకుఎన్నికల్లో పోటీ చేయడానికిగాని, ప్రభుత్వోద్యోగాల్లో నియమింప బడటానికిగాని ఎవరూ అనర్హులు కారు.

ప్రభుత్వోద్యోగాలకు అవసరమైన విద్యార్హతలుంటే అణచబడ్డ వర్గాల వారికి రాదగిన ప్రాతినిధ్యాన్ని రక్షించడంకోసం అవసరమైనంత ప్రయత్నం జరుగుతుంది.

9. ప్రతి రాష్ట్రంలోను విద్యకోసం మంజూరుచేసే నిధిలో అవసరమైనంత మొత్తం అణచబడ్డ వారికి విద్యాసౌకర్యం కల్పించడానికి కేటాయించ బడుతుంది.

ఒప్పందంలోని నియమాలను గాంధీ సమ్మతించాడు. వాటిని ప్రభుత్వంభారత ప్రభుత్వచట్టంలో పొందుపరచింది. పూనా ఒప్పందం అనేక రకాల స్పందనల్ని సృష్టించింది. అస్పృశ్యులు నిరాశ చెందారు. అందుకు కారణాలు ఉన్నాయి. దానిని ఆమోదించని వాళ్ళు ఉన్నారు. వాళ్ళు ప్రధానమంత్రి కమ్యూనల్ అవార్డ్ ద్వారా ప్రతిపాదించిన స్థానాల సంఖ్యకన్నా పూనా ఒప్పందం ద్వారా పొందే స్థానాలు ఎక్కువ సంఖ్యలో ఉన్నాయనడానికి వెనుకాడారు. అస్పృశ్యులకు కమ్యూనల్ అవార్డ్ ద్వారా 78 స్థానాలు రాగా పూనా ఒప్పందం ద్వారా 148 స్థానాలు వచ్చిన మాట వాస్తవమే. అయితే కమ్యూనల్ అవార్డ్ ద్వారా స్థానాల సంఖ్యకన్నా పూనా ఒప్పందం ద్వారావచ్చిన స్థానాల సంఖ్య ఎక్కువ అని నిర్ణయించే ముందు కమ్యూనల్ అవార్డ్ అస్పృశ్యులకు ఇచ్చిందేమిటి అన్నదాన్ని విస్మరించరాదు. కమ్యూనల్ అవార్డ్అస్పృశ్యులకు రెండు లాభాలను చేకూర్చింది.

1. అస్పృశ్యుల కోసం ప్రత్యేకంగా నిర్ణీత సంఖ్యలో స్థానాలు. వాటిని అస్పృశ్యులైన వ్యక్తులతోనే భర్తీ చేస్తారు.

2. రెండు వోట్లు. ఒకటి ప్రత్యేక ఎన్నికల్లో వాడుకోడానికి. ఇంకొకటి సాధారణ ఎన్నికల్లో వాడుకోడానికి.

ఇప్పుడు పూనా ఒప్పదం నిర్ణీత స్థానాల సంఖ్యను పెంచినా రెండువోట్ల సౌకర్యాన్ని రద్దుచేసింది. రెండు వోట్లు పోవడం ద్వారా జరిగిన నష్టానికి స్థానాల సంఖ్య పెరుగుదల పరిహారం కానేకాదు. రాజకీయ ఆయుధంగా దీని విలువ లెక్కకడట్టలేం. ఒక్కో నియోజక వర్గంలో అస్పృశ్యుల వోట్ల సంఖ్య ఒకటి నుంచి పదిదాక ఉంటుంది. ఈ శక్తిని సవర్ణ హిందువుల ఎన్నికలో ఉపయోగించే స్వతంత్రంతో, అస్పృశ్యులు సాధారణ ఎన్నికల ఫలితాలను ఆజ్ఞాపించ లేక పోయినా నిర్ణయించే స్థితిలో ఉండేవారు. ఏ సవర్ణ హిందూ అభ్యర్థి కూడా తన నియోజక వర్గంలోని అస్పృశ్యుడిని విస్మరించేవాడు కాదు. అస్పృశ్యుల వోట్ల మీద ఆధార పడేట్టుంటే వాళ్ళ ప్రయోజనాలకు హాని చేసే వారు కాదు. ఇప్పుడు కమ్యూనల్ అవార్డు ఇచ్చిన దానికన్నా కొన్ని స్థానాలు పెరిగాయి. అయితే వాళ్ళకు దక్కింది ఆస్థానాల పెరుగుదల మాత్రమే. ప్రతి ఇతర సభ్యుడుశత్రువుగా కాకపోయినా నిర్లక్ష్యంగా ఉన్నాడు. కమ్యూనల్ అవార్డు ప్రసాదించిన రెండు వోట్లు ఉండిఉంటే ప్రతి ఇతర సభ్యుడు అస్పృశ్యులకు సభ్యుడు గానే ఉండేవారు. అస్పృశ్యులకు రిజర్వ్డ్ స్థానాల సంఖ్య పెంచడం, ప్రత్యేకస్థానాలు, రెండు వోట్లుపోవడం వల్ల కలిగిన నష్టానికి ప్రతిఫలం కానేకాదు. హిందువులు పూనా ఒప్పందాన్ని పండుగ చేసుకోలేక పోయినప్పటికీ దానిని ఇష్టపడలేదు. గాంధీ ప్రాణాన్ని కాపాడాలి అనే అందోళన ఉన్నా, వాళ్ళలో ఆయన ప్రాణరక్షణ కయ్యే వ్యయం ఎక్కువ కావచ్చు అనేభావం ఎడతెగకుండా ఉంది. అందువల్ల పూనా ఒప్పందంలోని నియమాలను చూడగానే వాళ్ళు తిరస్కరించే ధైర్యం లేక పోయినా తప్పకుండా అయిష్టత చూపారు.

హిందువులు అయిష్టత చూపినా, అస్పృశ్యులు సమర్థించక పోయినా పూనా ఒప్పందం రెండు పార్టీలచేత గుర్తింపును పొందింది. భారత ప్రభుత్వ చట్టంలో పొందుపరచబడింది.

## IX

పూనా ఒప్పందం మీద సంతకాలు జరగ్గానే హామండ్ కమిటి నియమింపబడింది. నూతన రాజ్యాంగంలో పొందుపరచడం కోసం నియోజకవర్గాలను, ఒక్కో నియోజక వర్గంలో ఉండ వలసిన స్థానాలను, వాటికి వోటువేసే విధానాన్ని నిర్ణయించటానికి ఈ కమిటి నియమించబడింది.

తన పని తాను చేసే సమయంలో హామండ్ కమిటీ, పూనా ఒప్పందంలోని అంశాలను అస్పృశ్యుల అవసరాలకోసం ఆమోదించిన ప్రత్యేక ఎన్నిక విధానాన్ని పరిగణలోకి తీసుకోవాలి. తొందర తొందరగా ముగించడం వల్ల దురదృష్టవశాత్తూ, పూనా ఒప్పందం చాలా అంశాలను నిర్వచించకుండానే వదిలిపెట్టింది. అలా వదిలి పెట్టిన వాటిలో ముఖ్యమైనవి రెండు:

1. ప్రాథమిక ఎన్నికలో నలుగురు సభ్యుల ప్యానల్‌ను ఎన్నుకోవాలి - అన్నదాంట్లో నలుగురు గరిష్ట సంఖ్యా? అంటే నలుగురు తక్కువ కాకుండా ఎన్నుకోవాలా లేకనలుగురికి మించకుండా ఎన్నుకోవాలా? . 2.ఆఖరి ఎన్నికలో ఎన్నికవిధానం ఎలా ఉండాలి? హిందూవుల పక్షాన నలుగురు అభ్యర్థులు ముందుకు రాకుంటే ప్రాథమిక ఎన్నిక ఉండదు. అందువల్ల రిజర్వుడ్ స్థానానికి ఎన్నిక ఉండదు. అది ఖాళీగా ఉంటుంది. అస్పృశ్యులకు ప్రాతినిధ్యం ఉండదు. అస్పృశ్యుల పక్షాన వివాదాస్పద అంశాల మీద వ్యాఖ్యానించవలసి వచ్చింది. నేను పూనా ఒప్పందంలో 'నలుగురు' కు అర్థం నలుగురుకన్నా మించకుండా అని వాదించాను. అంటే నలుగురికి తక్కువ కాకుండా అని అర్థంలేదు. ఎన్నికల విధానం మీద, హిందువులు, నిర్బంధ విభాజిత ఎన్నిక బాగుంటుందని వాదించారు. నేను కూడిక (క్యుములేటివ్) విధానం మంచి ఎన్నిక పద్ధతి అనివాదించాను. అస్పృశ్యులకు అదృష్ట వశాత్తు హామండ్ కమిటి నా అభిప్రాయాలను ఆమోదించి, హిందువుల అభిప్రాయాన్ని తిరస్కరించింది. హిందువులు అలా ఎందుకు వాదించారో పరిశీలించడం ఆసక్తికరంగా ఉంటుంది. ఎవరైనా ఇక్కడు ఆగి, హిందువులు హామండ్ కమిటి ముందు అలా ప్రత్యేకించి ఎందుకు వాదించారు అని అడగవచ్చు. వాళ్ళకేదైనా నిర్ధిష్టమైన ఉద్దేశం ఉందా. నేను అర్థం చేసుకున్నంత వరకు, ప్రాథమిక ఎన్నికలో కనీసం నలుగురు అభ్యర్థులు ఉండాలి అని హిందువులు డిమాండు చెయ్యడంలో వాళ్ళ ఉద్దేశం అస్పృశ్యులలో హిందువులకు సాధనంగా ఉపయోగపడే వ్యక్తిని, వాళ్ళ అభ్యర్థిగా ఉండే వ్యక్తిగా గెలిపించుకొని ఆస్థానాన్ని కైవసం చేసుకుందామని కావచ్చు. చివరి ఎన్నికలో అలాంటి వ్యక్తి ఎన్నిక కావాలంటే మొదట అతను ప్యానల్‌లోకి రావాలి. అది పెద్ద ప్యానల్ అయినప్పుడే అతడు ప్యానల్‌లోకి రాగలడు. ప్యానల్‌కు జరిగే ఎన్నికలో కేవలం అస్పృశ్యులే వోటర్లుగా ఉంటారు కాబట్టి. ఒక్కడే ఉంటే అతడు అస్పృశ్యులకు గట్టి అభ్యర్థి అవుతాడుతప్ప హిందువులకు కాదు. ఇద్దరుంటే రెండో వ్యక్తి మొదటి వ్యక్తి కన్నా తక్కువ శక్తివంతుడౌతాడు. అది హిందువులకు మేలు చేస్తుంది. నలుగురుంటే మూడో వ్యక్తికన్నా నాలుగో వ్యక్తి తక్కువ శక్తిమంతుడౌతాడు. అది హిందువులకు మేలుచేస్తుంది. అందువల్ల నలుగురున్న ప్యానల్ ఉంటే, అస్పృశ్యులలోంచి హిందువులకు అనుకూలమైన

వ్యక్తిని గెలిపించుకునే అవకాశం వస్తుంది. హామండ్ కమిటి ముందు కనిష్టం నలుగురుండే ప్యానల్ కావాలని అందుకే వాదించింది.

నిర్బంధ విభాజిత వోటును గురించి పట్టుబట్టడంలో కూడా అస్పృశ్యులకు కేటాయించిన స్థానాల్ని హిందువులు కొట్టెయ్యాలను కోవడమే ఉద్దేశం. కూడిక ఎన్నిక పద్ధతిలో ఎన్నుకనే వ్యక్తికి ఎన్ని స్థానాలుంటే అన్ని వోట్లుంటాయి. అతడు వాటినన్నింటినీ ఒకడికే ఇవ్వవచ్చు. లేదా అతను కోరుకునే ఇద్దరు ముగ్గురికి పంచపచ్చు. విభాజిత పద్ధతిలో కూడా ఎన్నుకునే వ్యక్తికి స్థానాలెన్ని ఉంటే అన్ని వోట్లుంటాయి. కాని ఏ అభ్యర్థికైనా ఒక్కవోటు మాత్రమే ఇవ్వగలడు. ఈ రెండూ భిన్నమైనవిగా కనిపిస్తున్నా ఫలితంలో తేడా లేదు. ఎందుకంటే కూడిక ఎన్నిక విధానంలో సైతం వోటరును తన వోట్లను పంచడం నుంచి నివారించలేము. అతడు ఒక అభ్యర్థికి ఒక వోటు వెయ్యొచ్చు. అయితే హిందువులు అదృష్టం మీద ఆధార పడదలచు కోలేదు. వాళ్ళ ఉద్దేశం సంయుక్త ఎన్నికలో హిందువుల అదనపు వోటర్లను తమకు అనుకూలమైన అస్పృశ్యుల అభ్యర్థికి వేసి అస్పృశ్యులకు కేటాయించిన స్థానాలను కైవసం చేసుకోవడమే. అస్పృశ్య వోటర్ల సంఖ్యను తగ్గించేసి, వాళ్ళు తమ అభ్యర్థులను ఎన్నుకోకుండా చెయ్యడం వాళ్ళ లక్ష్యం. హిందువుల అదనపు వోటర్లను హిందూ అభ్యర్థుల నుంచి అస్పృశ్య అభ్యర్థుల వైపు మళ్ళించనిదే ఇది సాధ్యంకాదు. కూడిక ఎన్నిక విధానంలో కన్నా విభాజిత ఎన్నిక విధానంలోనే ఇందుకు ఎక్కువ అవకాశం ఉంది. విభాజిత ఎన్నిక విధానంలో వోటరు ఒక హిందూ అభ్యర్థికి ఒక్క వోటు మాత్రమే ఇవ్వగలడు. రెంటో వోటు హిందువులకు వెయ్యడానికి వీల్లేదు కాబట్టి అస్పృశ్య అభ్యర్థికి వాడుకోవచ్చు. విభాజితఎన్నిక విధానం ద్వారా అస్పృశ్యుల స్థానాలను దక్కించుకొనే అవకాశం ఉందికాబట్టి హిందువులు దానినే కోరుకున్నారు. అయితే వాళ్ళు దానిని అదృష్టానికి వదిలెయ్యదలచుకోలేదు. వాళ్ళ దృష్టిలో విభాజిత ఎన్నిక విధానం కూడా సురక్షితమైంది కాదు. ఈ విధానంలో వోటరు అన్ని వోట్లనూ ఉపయోగించుకోవాలన్న నిర్బంధం లేదు. ఒక వోటును సవర్ణ హిందువుకు వేసి, తక్కినవి ఉపయోగించు కోకుండా మానుకోవచ్చు. అలాంటప్పుడు అస్పృశ్య అభ్యర్థిని గెలిపించు కోవడం వీలుకాదు. దీనిని అదృష్టానికి ఎదిలి పెట్టకుండా హిందువులు విభాజిత ఎన్నిక విధానంలో; హిందూ వోటరుకి ఇష్టమున్నా లేకున్నా అస్పృశ్య అభ్యర్థికి వోటు వేసి తీరాలని నిర్బంధం చేశారు. దీని ద్వారా హిందువులు అస్పృశ్య ప్రతినిధిని గెలిపించుకోవచ్చు.

ఈ పరిస్థితిల్లో, పూనా ఒప్పందం, అస్పృశ్యులకు తగిలిన మొదటి దెబ్బఅయ్యింది. దీనిని ఇష్టపడని హిందువులు అవకాశం దొరికినప్పుడల్లా దెబ్బకొట్టడానికి వీలైంది. హామండ్ కమిటి ముందు హిందువులు చేసిన రెండు వాదాలను పూనా ఒప్పందం వల్ల అస్పృశ్యులకు ఎలాంటి ప్రయోజనమూ కలక్కుండా ఉండడానికి కుట్ర అనడానికి తగిన ఆధారాలు. అస్పృశ్యులు రాజకీయ డిమాండ్లపట్ల కాంగ్రెస్ ప్రవర్తనా గాథను ఇక్కడితో మరచి పోరాదు. ఎందుకంటే అది ఇక్కడితో ఆగలేదు. ఇప్పటి దాకా చెప్పుకున్న వాటికన్నా, ఇంకా రాబోయేవి ఎక్కువ.

రాబోయే భాగం, 1935 నాటి భారత ప్రభుత్వ చట్టం రూపొందించిన రాష్ట్రశాసన సభలకు 1937ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికల కథ. కాంగ్రెస్ చరిత్రలో ఎన్నికలను ఎదుర్కోవడం ఇదే తొలిసారి. అస్పృశ్యులు తమ ప్రతినిధిని ఎన్నుకునే అవకాశం రావడం కూడా ఇదే తొలిసారి. పూనా ఒప్పందం రూపుదిద్దు కొంటున్నప్పుడు కాంగ్రెస్ వైపు తిరుగుతున్న కొందరు

అస్పృశ్యుల నాయకులు కీ.శే. దివాన్ బహద్దర్ ఎం.సి రాజాలాంటి వాళ్ళు- అస్పృశ్యులకు ప్రత్యేకించిన స్థానాల ఎన్నికల విషయంలో కాంగ్రెస్ జోక్యం చేసుకోదని చాలా నమ్మకంతో ఉన్నారు. కాని ఆ ఆశ ముక్కచెక్కలయింది. అస్పృశ్యులకు ప్రత్యేకించిన స్థానాల ఎన్నికల్లో కాంగ్రెస్ రెండు ప్రయోజనాల కోసం తన పాత్ర నిర్వహించింది. ఒకటి ప్రభుత్వం స్థాపించడానికి అవసరమైన మెజారిటీని కైవసం చేసుకుంది, రెండు కాంగ్రెస్ అస్పృశ్యుల పక్షాన ఉంది. అస్పృశ్యులకు కాంగ్రెస్ మీద నమ్మకముంది. అని గాంధీ చేసిన ప్రకటన నిజమైందని నిరూపించడం. అందువల్ల కాంగ్రెస్ అస్పృశ్యుల కోసం ప్రత్యేకించిన స్థానాల్లో ఆ అభ్యర్థుల్ని నిలబెట్టి వాళ్ళ స్థానాలకు జరిగిన ఎన్నికల్లో శక్తివంతంగా, ఇంకా చెప్పాలంటే ద్వేషపూరితమైన పాత్రను నిర్వహించింది. కాంగ్రెస్ తనకున్న ఆర్థిక స్తోమతతో గొప్పలాభాన్నే పొందింది.

1935 నాటి భారత రాజ్యాంగ చట్టం అస్పృశ్యులకు ప్రత్యేకించిన స్థానాలు 151[1.]

ఈ క్రింది పట్టిక కాంగ్రెస్ టికెట్ మీద పోటి చేసి గెలిచిన అస్పృశ్యుల అభ్యర్థుల వివరాలిస్తుంది.

పట్టిక V

| రాష్ట్రం /పరగణాలు | అస్పృశ్యులకు ప్రత్యేకించిన మొత్తం స్థానాలు | కాంగ్రెస్ గెలుచుకున్న స్థానాలు |
|---|---|---|
| సంయుక్త పరగణాలు | 20 | 16 |
| మద్రాసు | 30 | 26 |
| బెంగాల్ | 30 | 6 |
| మధ్య పరగణాలు | 20 | 7 |
| బీహార్ | 15 | 11 |
| బొంబాయి | 15 | 4 |
| పంజాబ్ | 8 | 0 |
| అస్సాం | 7 | 4 |
| ఒరిస్సా | 6 | 4 |
| మొత్తం | 151 | 78 |

1. మొదటి 148 సీట్ల స్థానంలో బీహార్, ఒరిస్సాలలో కేటాయించిన అదనపు సీట్లవల్ల 151 కు పెరిగింది

అస్పృశ్యులకు ప్రత్యేకించిన స్థానాల్లో కాంగ్రెస్ 51 శాతం గెలుచుకున్నట్లు పై పట్టిక నిరూపిస్తుంది.

కాంగ్రెస్ 78 స్థానాలు గెలుచుకొని స్వతంత్రమైన నిజమైన అస్పృశ్యుల ప్రతినిధులకు 73 స్థానాలు వదిలిపెట్టింది. ప్రధానమంత్రి అవార్డ్ ద్వారా పొందే దానికన్నా పూనా ఒప్పందం వల్ల హరిజనులు ఘోరంగా నష్టపోయారు. ప్రధానమంత్రి కల్పించిన ప్రాతి నిధ్య సంఖ్య కన్నా చాలా తక్కువ ప్రాతినిధ్యం దొరికిందిప్పుడు. ఇందుకు భిన్నంగా, పూనా ఒప్పందం వల్ల కంగ్రెస్ బాగా లాభంపొందింది. పూనా ఒప్పందం ప్రకారం అస్పృశ్యులకు 151 స్థానాలనిచ్చినా 78 స్థానాలను లాగేసుకుని రాజకీయ వ్యాపారంలో మంచి లాభం సంపాదించింది.

1937 నాటి ఎన్నికల్లో కాంగ్రెస్ అస్పృశ్యులకు కలిగించిన నష్టం ఇది. కాంగ్రెస్ అస్పృశ్యుల మీద దెబ్బ ఇంకొకటుంది. కార్యనిర్వహణలో వాళ్ళకు భాగస్వామ్యాన్ని నిరాకరించింది.

మొదటి నుంచి. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ చర్చల్లో శాసనసభల్లో అస్పృశ్యులకు స్థానం కల్పించడం మాత్రమే కాదు. మంత్రివర్గంలో ప్రాతినిధ్యం వహించే హక్కుండాలని వాదిస్తూనే ఉన్నాను. పరిపాలనంతా తరతరాలుగా అస్పృశ్యుల మీద ద్వేషపూరితులైన హిందువుల దుర్మార్గ సూత్రాలతో నడవడంవల్ల అస్పృశ్యులు కడగళ్ళు చెప్పడానికి వీలుకాదు. పబ్లిక్ సర్వీసులు హిందువుల చేతుల్లో ఉన్నంత కాలం అస్పృశ్యులు పోలీసుల నుంచి రక్షణనుగాని, న్యాయస్థానం నుంచి న్యాయాన్ని గాని, పరిపాలన నుంచి స్థిరమైన చట్టంగాని పొందడానికి ఆశించలేదు. పబ్లిక్ సర్వీసులు అస్పృశ్యుల అవసరాలకు అనుగుణంగా తక్కువ ద్వేషపూరితంగా ఉండాలంటే పైస్థాయిపాలనా రంగంలో అస్పృశ్యులకు స్థానం కల్పించాలి. ఈ కారణాల వల్ల నేను శాసన సభల్లో అస్పృశ్యుల ప్రాతినిధ్య హక్కు గుర్తింపు కోసం వాదించినట్లుగానే, మంత్రివర్గంలో కూడా వాళ్ళ ప్రాతినిధ్య హక్కు, గుర్తింపు కోసం వాదించాను. రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌లో నావాదంలోని విలువను ఒప్పేసుకుంది. అందుకు రూపకల్పన చేయడానికి మార్గాలను పరిశీలించింది. ఈ ప్రతిపాదనకు రూపం ఇవ్వడానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి భారత ప్రభుత్వ చట్టంలో తప్పించుకోడానికి వీల్లేని కట్టుబాట్లు చెయ్యడానికి చట్టబద్ధమైన అవకాశం కల్పించడానికి బదులు ఇంగ్లీష్ రాజ్యాంగంలో లాగా పెద్ద మనషుల ఒప్పందానికి వదిలిపెట్టడం. నేను, ఇతర అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధులు మన దేశ పెద్దలమీద అపనమ్మకం ప్రదర్శింపకూడదన్న కొందరు ప్రముఖ భారతీయుల అభిప్రాయాలకు బద్ధులమై మొదటి రకం మార్గంకోసం చట్టబద్ధమైన అవకాశ కల్పన కోసం పట్టుబట్టలేదు. అయితే రెండోరకం మార్గానికి పెద్ద మనుషుల ఒప్పందానికి వదలి పెట్టడానికి కూడా మేముఒప్పుకోలేదు ఎందుకంటే ఇందులో కూడా చేసి తీరాలన్న నియమంలేదు కాబట్టి. ఒక మధ్యేమార్గం అంగీకరించ బడింది. అది మంత్రివర్గంలో అల్పసంఖ్యాకుల ప్రతినిధులు కూడా ఉండేట్లు చూడ వలసిందని గవర్నర్లకు ఇచ్చే సూచనల్లో ఒక క్లాజును పొందుపరచాలి అన్నది. ఆ క్లాజు ఇది:

"మంత్రివర్గ నియామకంలో గవర్నర్ తన మంత్రులను ఎన్నుకునేటప్పుడు క్రింది విధంగా మంచి ప్రయత్నాన్ని చెయ్యాలి. తన అభిప్రాయం ప్రకారం శాసనసభలో స్థిరమైన

మెజారిటీని నిల్పుకోగల వ్యక్తితో సంప్రదించి శాసనసభలో విశ్వాసాన్ని పొందగలిగిన సామర్థ్యం గల వ్యక్తులను (సాధ్యమైనంతవరకు ప్రముఖ అల్పసంఖ్యాక మతాల/కులాల ప్రతినిధులను కలుపుకొని) నియమించాలి. అలా చెయ్యడంలో మంత్రులలో ఉమ్మడి బాధ్యతనుపెంపొందించే విషయాన్ని నిరంతరం మనసులో ఉంచుకోవాలి.

ఈ సదుపాయ కల్పనకు ఏమిగతి పట్టిందో నన్నది ఆసక్తికరమైన కథ .కాంగ్రెస్ 1936 నాటి భారతప్రభుత్వ చట్టాన్ని అనేక కారణాల వల్ల అమోదించబోవడం లేదని ప్రకటించింది. కారణాలను తిరిగి చెప్పాలన్న పనిలేదు. ఈ ప్రకటన చెయ్యడంలో చిత్తశుద్ధి లేదని అందరికీ, అందులోను చాలామంది కాంగ్రెస్ వాళ్ళకు తెలుసు - కాంగ్రెస్ విప్లవాత్మక సంస్థ అది బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని సమూలంగా నిర్మూలిస్తుందనే భావాన్ని ప్రజలలో కల్పించి తనగౌరవాన్ని పెంచుకోవడం కన్నా మరో లక్ష్యం లేదు కాంగ్రెస్‌కు. ఇది కేవలం ఎత్తుగడే తప్ప మరేమి కాదు. అవసరం వచ్చినప్పుడు తన ప్రత్యేక బాద్యతల్ని నిర్వహించడానికి రాజ్యాంగం గవర్నర్‌కు కొన్ని అధికారాలిచ్చింది. రాజ్యాంగాన్ని తిరస్కరిస్తున్నట్లు ప్రకటిండానికి కాంగ్రెస్ వెనుకాడలేదు. ఎందుకంటే నూతన పార్లమెంటరీ వ్యవస్థను తాను మాత్రమే నిర్వహించగలనని బ్రిటిష్ ప్రభుత్వం తనతో ఒప్పందం కుదుర్చుకోవడానికి వస్తుందని కాంగ్రెస్ భావించింది. బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెస్‌ను పక్కన బెడతానని హెచ్చరించింది. బ్రిటిష్ ప్రభుత్వం 1937 ఏప్రియల్ 1న రాజ్యాంగంలోని ప్రొవిన్షియల్ విభాగాన్ని ప్రారంభించే రోజుగా ప్రకటించడమేగాక కాంగ్రెసేతర వ్యక్తులతో మధ్యకాలపు ప్రభుత్వాన్ని నియమించేదాకా పోయింది. అధికార దాహంతో నిండిన కాంగ్రెస్‌వాళ్ళు అసూయ అనుమానంగల రాజకీయ నాయకుల గుంపైన కాంగ్రెస్‌వాళ్ళు దీంతో కలవర పడ్డారు. వాళ్ళశ్రమ ఫలితం వాళ్ళకు దక్కకుండా పోతుందని భయపడ్డారు. ప్రభుత్వానికి కాంగ్రెస్ అధిష్ఠాన వర్గానికి మధ్య సంప్రదింపులు జరిగాయి. రాష్ట్రాల నిత్యపాలనా వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం ద్వారా రాజ్యాంగం తనికిచ్చిన ప్రత్యేకాధికారాలను గవర్నర్ ఉపయోగించదు అని ప్రభుత్వం లిఖిత పూర్వకంగాహామీ ఇస్తే, మెజారిటి అభిమతంతో నూతన రాజ్యాంగం అమలు కావాలని ఉవ్విళ్ళూరుతున్న కాంగ్రెస్ కూడా లిఖిత పూర్వకంగా హామి ఇవ్వగలదని అధిష్ఠానవర్గం డిమాండు చేసింది. ఇందులో ఆశ్చర్యం కలిగించే భాగం ఏమిటంటే ప్రభుత్వం ఇవ్వవలసిన లిఖితపూర్వక హామి పరిధిని విస్తృతం చేసింది. రాష్ట్రమంత్రివర్గంలో అల్పసంఖ్యాక వర్గాల ప్రతినిధులు చేర్చబడేట్లు చూసేట్లు గవర్నర్లకు ఇచ్చిన అధికారాలను వాళ్ళు వాడుకో కూడదు అని ప్రభుత్వంఇచ్చే లిఖిత పూర్వక హామిలో చేర్చాలని డిమాండు చేసింది. గవర్నర్లు కాంగ్రెస్‌కు పూర్తిస్వేచ్ఛనిచ్చి వాళ్ళ అధికారాన్ని కాంగ్రెస్‌కు దాఖలు చేసేశారు. రాజ్యాంగంలోని ముఖ్య విభాగం ద్వారా దాడి చేయడానికి కాంగ్రెస్‌ను వదిలిపెట్టారు. ఫలితంగా అస్పృశ్యులు, ఇతరమైనారిటీలు మంత్రివర్గంలోప్రాతినిధ్యం పొందకుండా కాంగ్రెస్ సులువుగా చెయ్యగలిగింది.

అస్పృశ్యులకు మంత్రి వర్గంలో ప్రాతినిధ్యం పోగొట్టడం కాంగ్రెస్‌వాళ్ళ ద్వేషభావాన్ని ప్రదర్శిస్తుంది. మంత్రివర్గంలో మైనారిటీల ప్రతినిధులను చేర్చుకోరాదని కాంగ్రెస్ కోరడంలో ఒక కారణం ఉంది. అది సమిష్టి బాధ్యతనిర్వహించాలంటే మంత్రివర్గం పార్టీ మంత్రివర్గంగా ఉండాలి. మంత్రివర్గంలో మైనారిటీల సభ్యులను కలుపుకోవాలంటే వాళ్ళు కాంగ్రెస్‌లోచేరి కాంగ్రెస్ ప్రతిజ్ఞమీద సంతకంచెయ్యాలి. ఈ వాదం ఇతర మైనారిటీల పట్ల ఎలాంటివిలువ

గలిగున్నా అస్పృశ్యులకు మాత్రం విలువలేనిదే. కాంగ్రెస్ చేసిన వాదం రెండు కారణాల వల్ల అస్పృశ్యులను మంత్రివర్గంలో చేర్చుకోకుండాచెయ్యడంలో విఫలమైంది. ఒకటి పూనా ఒప్పందం ప్రకారం మంత్రి వర్గంలో అస్పృశ్యులకు ప్రాతినిధ్యం ఇవ్వాలన్న నియమానికి కాంగ్రెస్ కట్టుబడి ఉంది. రెండు కాంగ్రెస్ పార్టీలో సభ్యులు కాని, అస్పృశ్యులు శాసనసభల్లో లేరని కాంగ్రెస్ చెప్పలేకపోయింది. ఎందుకంటే కాంగ్రెస్ సిద్ధాంతాలను ఆమోదించి కాంగ్రెస్ టికెట్‌మీద గెలిచిన అస్పృశ్యులు 78 మంది ఉన్నారు. అలాంటప్పుడు కాంగ్రెస్ వాళ్ళెందుకు మంత్రివర్గంలో చేర్చరు? ఇందుకు సమాధానం మంత్రివర్గంలో అస్పృశ్యులు ప్రాతినిధ్యం పొందే హక్కును ఆమోదిచకపోవడం కాంగ్రెస్ సిద్ధాంతంలో భాగం అని, ఈ సిద్ధాంతానికి గాంధీ మద్దతు ఉంది. ఇందులో ఎవరి కన్నా సందేహం ఉంటే క్రింద పేర్కొన్న ఆధారాన్ని చూడవచ్చు.

మొదటి ఆధారం ఆనవాళ్ళు గౌరవనీయ డా.ఖేర్‌ను కాంగ్రెస్ నుండి గెంటివేయడం. మధ్యపరగణాల్లో కాంగ్రెస్ మంత్రివర్గంలో ప్రధానమంత్రి డా.ఖేర్. ఆయన తన మంత్రి వర్గంలోని సభ్యులలో అంతర్గత కలహాల వల్ల, అననుకూలమైన ఆ సమస్యలలోంచి బయట పడటానికి కొత్తమంత్రివర్గ నిర్మాణాన్ని దృష్టిలో పెట్టుకొని తాను, తన మంత్రి వర్గం రాజీనామా చేసిసరైన నిర్ణయాన్ని తీసుకున్నారు. తర్వాత గవర్నర్ రాజ్యాంగాన్ని బాగా పరిశీలించి నిర్ణయం తీసుకుని మరలా ప్రభుత్వాన్ని రూపొందించాల్సిందిగా డా.ఖేర్ ను ఆహ్వానించాడు. డా.ఖేర్ ఆ ఆహ్వానాన్ని మన్నించి పాతవాళ్ళను అననుకూలురను మినహాయించి కొందరు కొత్తవాళ్ళను కలుపుకొని మంత్రివర్గాన్ని స్థాపించాడు. ఒక విషయంలో డా.ఖేర్ రెండోసారి రూపొందించిన ప్రభుత్వం విభిన్నమైంది. ఎందుకంటే ఒక అస్పృశ్యుడైన అగ్నిభోజ్‌ను మంత్రివర్గంలోకి తీసుకున్నారు. అగ్నిభోజ్ మధ్యపరగణాల్లో సభ్యుడు, కాంగ్రెస్ పార్టీ సభ్యుడు తన విద్యద్వారా మంత్రిగా ఉండటానికి తగిన వ్యక్తి. 1938 జులై 26 న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ వార్ధాలో సమావేశమైంది. డా.ఖేర్ పాతమంత్రి వర్గం రాజీనామాను సమర్పించాలనే నిర్ణయాన్ని తీసుకోవడం తప్పుడు నిర్ణయమని తీర్మానించింది. అలాగే నూతనమంత్రి వర్గాన్ని స్థాపించడం క్రమశిక్షణా రాహిత్యమని కూడా తీర్మానించింది. నూతన మంత్రివర్గ నిర్మాణంలోని క్రమశిక్షణా రాహిత్యం ఏమిటో డా.ఖేర్ బహిరంగంగా వివరించారు. ప్రభుత్వంలో ఒక అస్పృశ్యుని రానివ్వడమే గాంధీ దృష్టిలో క్రమశిక్షణ లేని పని అని ఆయన వివరించారు. అస్పృశ్యులలో అలాంటి కోరికల్ని, ఆ ఆశల్ని రేకెత్తించడం అతని తప్పని అదీ తానెప్పుడూ మరచిపోలేని తప్పుడు నిర్ణయమని గాంధీ తనతో అన్నట్లు కూడా డా.ఖేర్ చాలాసార్లు వేదికమీద ఈ ప్రకటన చేశారు. కాని గాంధీ ఎప్పుడూ దానిని ఖండించలేదు.

ఈ అంశం నిరూపించడానికి ఇంకా స్పష్టమైన ఆధారం ఉంది. 1942 అఖిలభారత అస్పృశ్యుల సమావేశం జరిగింది. ఆ సమావేశంలో అస్పృశ్యుల రాజకీయ డిమాండ్లు కొన్ని తీర్మానించబడ్డాయి. ఆ సమావేశానికి హాజరైన కాంగ్రెస్ పార్టీకి ఒక అస్పృశ్యుడు గాంధీని కలుసుకుని అస్పృశ్యుల డిమాండ్లమీద ఆయన అభిప్రాయాన్ని నిర్ధారించుకోవాలని అయిదు ప్రశ్నలు ఆయన ముందుంచాడు. అవి:

1) భవిష్యత్తులో రూపొందే రాజ్యాంగంలో హరిజనుల స్థితి ఎలా ఉంటుంది?

2) జనాభా ప్రాతిపదికగా పంచాయితీ బోర్డు నుండి స్టేట్‌కౌన్సిల్ దాకా అయిదు స్థానాలను నిర్ణయించడానికి ప్రభుత్వానికి, కాంగ్రెస్‌కు సలహా ఇస్తారా?

3) రాష్టాలలోని శాసనసభల్లో, అధిక సంఖ్యాకులైన షెడ్యూల్డ్ కులాల సభ్యుల విశ్వాసం పొందిన షెడ్యూల్డ్ కులాల శాసన సభ్యులను మంత్రి వర్గాలకు నామినేట్ చెయ్యమని కాంగ్రెస్‌కు శాసనసభల్లోని మెజారిటి పార్టీలనాయకులకు సలహా ఇస్తారా?

4) హరిజనుల వెనుకబాటు తనం దృష్ట్యా లోకల్ బోర్డు లలోను, మున్సిపల్ కౌన్సిళ్ళలోను హరిజనులకు ప్రెసిడెంటులు, చైర్మన్లు కావడానికి అనుకూలంగా కార్యనిర్వహణ స్థానాలను కులాల వారిగా రొటేషన్ పద్ధతిలో చట్టం చెయ్యమని ప్రభుత్వానికి సలహా ఇస్తారా?

5) జిల్లా కాంగ్రెస్ కమిటీల నుండి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ వరకు హరిజనులకు కొంతశాతం స్థానాలను ఎందుకు నిర్ణయించ కూడదు?

ఈ ప్రశ్నలకు 1942 ఆగష్టు 2నాటి హరిజన పత్రికలో గాంధీ సమాధానాలిచ్చారు.

1) నేను ప్రభావం చూపించే రాజ్యాంగంలో ఏ రూపంలో అస్పృశ్యతను పాటించినా నేరంగా పరిగణించబడుతుంది. అస్పృశ్యులనబడేవాళ్ళకు వాళ్ళ జనాభానుసరించి ఆయాప్రాంతాల్లో అన్ని రకాల ఎన్నికల్లో స్థానాలు రిజర్వ్ చేయబడతాయి.

2) నేనిప్పుడు చెప్పబోయే విషయంలో సమాధానం పూర్తవుతుందని మీరు గమనించగలరు.

3) సాధ్యంకాదు. ఈ సిద్ధాంతం అపాయకరమైంది. నియమిత వర్గాల రక్షణను వాళ్ళకు దేశానికి హాని చేసేదాగా తీసుకుపోరాదు. ఒక క్యాబినెట్ మంత్రి సార్వజనీన విశ్వాసాన్ని పొందే ఉన్నత వ్యక్తిగా ఉండాలి. ఒక వ్యక్తి ఎన్నికైన తర్వాత పదవులకోసం తన సహజమైన ప్రతిభ మీద, ప్రతిష్టమీద ఆధారపడాలి.

4) మొదటి ప్రస్తుత చట్టంపట్ల నాకు ఆసక్తిలేదు. ఎందుకంటే అది దాదాపు చచ్చిపోయింది. అయితే నేనిది వరకే పేర్కొన్న అభిప్రాయాన్ననుసరించి, నీప్రతిపాదనను వ్యతిరేకిస్తున్నాను.

5) నేను దానిని వ్యతిరేకిస్తాను. అయితే విస్తృతంగా ఎన్నికలు జరుపుతున్న కాంగ్రెస్ సంస్థలో హరిజనులను కాంగ్రెస్ రిజిస్టర్‌లో నమోదైన సంఖ్యకు అనుగుణమైన సంఖ్యలో ఎన్నుకోమని వత్తిడి చేస్తాను. హరిజనులు కాంగ్రెస్ 4 అణాల సభ్యులుగా చేరడానికి ఆసక్తి చూపకపోతే, ఎన్నికల రంగంలో వాళ్ళపేర్లు చూడటం కష్టం. అయితే హరిజనులతో సంప్రదించి వాళ్ళను కాంగ్రెస్ సభ్యులుగా చేర్పించమని కాంగ్రెస్ కార్యకర్తలకు గట్టిగా సలహా ఇస్తాను.

మంత్రివర్గంలో అస్పృశ్యులు చేరే హక్కును గుర్తించకూడదని కాంగ్రెస్, గాంధీలు నిర్ణయించుకున్నారని అనడానికి ఏమైనా సందేహముందా? గాంధీ పేర్కొన్న అర్హతను ఆయన అన్ని మతాలకు/కులాలకు విస్తరించి ఉంటే అర్ధముండేది. ముస్లింలపట్ల గాంధీ అలా

అనర్హుడైన అస్పృశ్యుడు మంత్రి కావాలని ఎవరూ కోరలేదు. ఇది గాంధీ హృదయంలో అంతరంగికంగా దాగిన వ్యతిరేకతను నిరూపిస్తున్నది.

పూనా ఒప్పందాన్ని నిర్వీర్యం చేసే క్రమంలో నడిపిన అకృత్యాలలో పేర్కొనదగినవి మరో రెండున్నాయి. మొదటిది కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ ఎన్నికల్లో, అభ్యర్థుల ఎన్నిక చేయడానికి అవలంభించే విధానం. దురదృష్టవశాత్తు ఈ అంశానికున్న ప్రాముఖ్యానికి తగినంత అధ్యయనం జరగలేదు. దీనిని బాగా అధ్యయనం చేశాను. ఫలితాలను మరో చోటప్రచురించగలను- ఇక్కడ ఈ విభాగం లోని సాధారణ సూత్రాలను పేర్కొంటాను. ఇందులో కులం ప్రధానపాత్ర వహించింది. ఇద్దరిలో ఒకరిని ఎన్నిక చేయాల్సి వచ్చినప్పుడు మెరుగైన వ్యక్తిని ఎన్నుకునే ఆవశ్యకతను గురించి కాంగ్రెస్ పట్టించుకోలేదు. ఆ ఇద్దరిలో ఎవరికి కులం బల ముందో ఆవ్యక్తిని ఎన్నుకొంది. ధనం పాత్ర కూడా బాగానే ఉంది. ఎక్కువ అర్హతలున్న పేదవాని కన్నా, అర్హతలు లేని ధవనంతుడి వైపే కాంగ్రెస్ మొగ్గు చూపింది. ఇది సమర్థనీయం కాదు. ఎవరు గెలుస్తారో వాళ్ళే మంచి అభ్యర్థులుగా కాంగ్రెస్ భావించింది. అయితే లోతుగా ఆలోచించి వేసిన పథకాన్ని తెలిపే ఇతర సూత్రాలు కొన్ని ఉన్నాయి. భిన్న వర్గాల అభ్యర్థులకు అనేక వర్గాల అర్హతలు నిర్ణయింపబడ్డాయి. సవర్ణ హిందువులైన బ్రాహ్మణులు ఇతర అగ్రవర్ణాల అభ్యర్థుల్లో ఎక్కువ అర్హతలున్న వారు ఎన్నికయ్యారు. బ్రాహ్మణేతరులలో అభ్యర్థులకన్నా తక్కువ అర్హతలున్న వాళ్ళనే ఎన్నుకున్నారు. అస్పృశ్యులలో కొద్దోగొప్పో అర్హతలున్న వాళ్ళకన్నా ఏ అర్హతాలేని వాళ్ళే ఎన్నుకోబడ్డారు. అన్నిచోట్లా అలా జరిగిందని కాదు. మొత్తం మీద జరిగిందేమిటంటే బ్రాహ్మణులు ఇతర అగ్రవర్ణాల అభ్యర్థులలో బాగా చదువుకున్న వాళ్ళు, బ్రాహ్మణేతరులలో ఓమాదిరిగా చదువుకున్న వాళ్ళు. అస్పృశ్యులలో బొటాబొటిగా చదువుకున్నవాళ్ళు ఎన్నుకోబడ్డారు. ఈ ఎన్నిక విధానం కుట్రపూరితం. ఇదేదో అనుకోకుండా జరిగింది కాదు. బాగా ఆలోచించి పథకం వేసుకుని చేసిందే. దీనిని అధ్యయనం చేసిన వాళ్ళు ఎవరైనా సరే. బ్రాహ్మణులు, ఇతర అగ్రవర్ణాలు మంత్రి వర్గంలో అధికభాగం ఆక్రమించుకుంటే పరమ విధేయులైన బుర్రలు లేని బ్రాహ్మణేతరులు, అస్పృశ్యులు వాళ్ళకు మద్దతునిచ్చేటట్టు పన్నిన పథకం ఇది అని అర్థం చేసుకుంటారు. బ్రాహ్మణేతరులు అస్పృశ్యులు తమ తెలివితో, అగ్రవర్ణాలతో నిండిన మంత్రివర్గంలో శత్రువులుగా మారకుండా, శాసనసభల్లో సభ్యులైనామని సంతృప్తి పడిపోయి ప్రశ్నించకుండా ఉండేటట్లు జాగ్రత్త తీసుకున్నట్లు కూడా అర్థమౌతుంది. గాంధీ మంత్రి కావాలనుకునే అస్పృశ్యుడు చదువుకున్న వాడై ఉండాలి అని చెప్పినప్పుడు ఈ పార్శ్వాన్ని గమనించలేదు. లేకపోతే కాంగ్రెస్ పార్టీలోని అస్పృశ్యుల్లో చదువుకున్నవాళ్ళు లేకపోతే కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు బాగాచదువుకున్న అస్పృశ్యులను ఎన్నిక చేసుకోక పోవడమే కారణం అని తెలుసుకునేవాడు.

ఇదే ఎన్నిక విధానం కొనసాగితే కాంగ్రెస్ మంత్రివర్గంలోకి ప్రవేశించడానికి మెట్టుగా ఉన్న శాసనసభలో సభ్యులుగా చదువుకున్న భారతీయులను రానీయకుండా నిరంతరం నివారించగలదు. ఇది చాలా భయంకరమైన పరిస్థితి. దీనిని సంస్కరించడానికి చర్యలు తీసుకోవాలి. అభ్యర్థులను ఎన్నుకోవడానికి కాంగ్రెస్ అనుసరించే విధానం అర్హతలు లేని అస్పృశ్యులను పాలనాధికారానికి నోచుకోకుండా దెబ్బకొడుతున్నది.

కాంగ్రెస్ చేసిన రెండో చెడ్డపని: పార్టీ క్రమశిక్షణకు అస్పృశ్యుల్ని కట్టిపడెయ్యడం. వాళ్ళు పూర్తిగా కాంగ్రెస్ పార్టీ కార్యనిర్వాహక వర్గంచెప్పుచేతుల్లో ఉంటారు. కార్యనిర్వాహక వర్గానికి నచ్చని ప్రశ్న వెయ్యలేరు.అది అనుమతించని తీర్మానాన్ని ప్రతిపాదించలేరు. వాళ్ళ ఇష్టానికి అనుగుణంగా వోటు వెయ్యలేరు. వాళ్ళు అనుకున్నది మాట్లాడలేరు. వాళు వట్టిమూగవాళ్ళుగా ఉండాలి. అస్పృశ్యులకు శాసనసభలో ప్రాతినిధ్యం కావాలనడంలో ఒకానొక లక్ష్యం ఏమిటంటే వాళ్ళ కష్టాలను వాళ్ళు చెప్పుకోవడం, వాళ్ళ తప్పుల్ని సరిదిద్దడం. ఇది జరక్కుండా కాంగ్రెస్ విజయవంతంగా పకడ్బందీగా నివారించ గలిగింది. ఈ సుదీర్ఘమైన విషాద గాథను ముగిస్తూ కాంగ్రెస్ పూనా ఒప్పందంలోని రసాన్ని పీల్చుకుని తొక్కను పిప్పిని అస్పృశ్యుల ముఖాన కొట్టింది అని చెబుతున్నాను.

అనువాదం : *డా. ఆర్. చంద్ర శేఖర రెడ్డి.*

## అధ్యాయం IV

# చేతులెత్తేసిన కాంగ్రెసు

## పరువు పోయి వేసిన వెనుకంజ

### I

పూనా ఒడంబడిక 1932 సెప్టెంబరు 24న సంతకమైంది. ఆ మరుసటి రోజున దానిని బలపరిచే నిమిత్తం బొంబాయిలోని హిందువుల బహిరంగ సభ జరిగింది. ఆ సభలో యీ క్రింది తీర్మానాన్ని ఆమోదించారు.

1932 సెప్టెంబరు 24న సవర్ణ హిందువుల నాయకులకు, దళిత వర్గాల నాయకులకు మధ్య కుదిరిన ఒప్పందాన్ని ఈ సమావేశం ధ్రువ పరుస్తున్నది. హిందూ సమాజంలో వేర్పాటు వోటరు వర్గాలను ఏర్పరచాలని బ్రిటిషు ప్రభుత్వం తను చేసిన నిర్ణయాన్ని ఉపసంహరించుకో గలదని, ఒడంబడికకు పూర్తి ఆమోదాన్ని యివ్వగలదని ఈ సమావేశం విశ్వసిస్తున్నది. సమయం మించిపోకుండా గాంధీ మహాత్ముడు తమ శపథనియమానుగుణంగా పుపవాసం విరమించేందుకు వీలుగా ప్రభుత్వం సత్వర చర్యలు గైకొనాలని సమావేశం గట్టిగా కోరుతున్నది. ఒడంబడికను యీ తీర్మానంలోని ఆణిమేరాలూ అవగతం చేసుకుని, వాటిని పాటించేందుకు మనసారా యత్నించ వలసిందిగా సంబంధిత వర్గాల నాయకులకు యీ సమావేశం విజ్ఞప్తి చేస్తున్నది.

ఇక ముందు హిందువుల్లో ఏ ఒక్కర్నీ కూడ జన్మ కారణంగా అంటరాని వాడుగా చూడరాదని, యిప్పటివరకు అట్లావున్న వారందరికీ మిగతా హిందువుల మోస్తరుగా బావులు, పాఠశాలలూ, రోడ్లూ, తదితర ప్రజా వసతులను బాహాటంగా వినియోగించుకునే హక్కు వుంటుందని, యీ సమావేశం తీర్మానిస్తున్నది. హక్కుకు శాసన పరమైన గుర్తింపు లభించే వీలుందేమో మొదట చూడాలి. అలా కుదరని పక్షంలో స్వరాజ్య పార్లమెంట్ చేసే చట్టాల్లో యిది మొదటిదై వుండాలి.

దేవాలయ ప్రవేశానికి వున్న అడ్డంకితో సహా, అంటరాని వర్గాలుగా పేర్కొంటున్న ప్రజలపైన సంప్రదాయం విధించిన సామాజిక అనర్హతలన్నింటినీ చట్టబద్ధమూ, శాంతియుతమూ అయిన సకల సాధనాలద్వారా తొలగించటం హిందూ నాయకులందరి కర్తవ్యంగా వుండాలని కూడా అంగీకరించబమైంది.

అంటరాని వారికి దేవాలయాల ద్వారాల్ని తెరిచే సంరంభం. ఈ తీర్మానం దరిమిలా హిందువుల్లో తొడతొక్కిడిగా ప్రారంభమైంది. గాంధీ ప్రారంభించిన 'హరిజన్' వారపత్రికలో మొదటిపేజీలోని 'వారం వారం' అనే ప్రత్యేక శీర్షిక కింద - అంటరానివారికి తలుపులు తెరిచిన గుళ్లు, బళ్లు, బావులు అంటూ ఒక పొడుగాటి జాబితా ప్రచురించకుండా ఒక్కవారం కూడ గడిచేది కాదు. 'హరిజన్' పత్రిక రెండుసంచికలలోని 'వారం వారం' శీర్షికను మచ్చుకి కింద యిస్తున్నాను.

1933 ఫిబ్రవరి 18 నాటి 'హరిజన్'

వారం వారం

(ఫిబ్రవరి 7తో ముగిసిన వారంలో)

ప్రవేశం కల్పించిన దేవాలయాలు:

ఉత్తర కలకత్తాలో లక్షన్నర రూపాయల ఖర్చుతో యిటీవల నిర్మించిన ఒక గుడి.

మద్రాసు రాష్ట్రపు గంజాం జిల్లా భాపూరు గ్రామంలో ఒక గుడి.

పంజాబు రాష్ట్రపు జలందర్ లోని నౌరానియా వద్ద ఒక ఠాకూర్ ద్వార్ దేవాలయం.

వాడుక అనుమతించిన బావులు :

ఒరిస్సాలోని కటక్‌జిల్లా జైపూరు పట్నంలో గురియాపూరు వద్ద ఒక మునిసిపలు బావి.

ఉత్తర ప్రదేశ్ ఆగ్రా జిల్లా వజీర్‌పురానికి అలలో రెండు బావులు.

(మద్రాసు) తిరుచినాపల్లిలో హరిజనులు, సవర్ణులు ఉమ్మడిగా వాడుకోటానికి 3 బావుల ఖర్చు భరించటానికి ఒక సాంప్రదాయిక బ్రాహ్మణుడు సిద్ధపడ్డాడు.

ప్రారంభించిన పాఠశాలలు :

ఉత్తర్‌ప్రదేశ్ మీరట్‌జిల్లా బచ్‌రోటాలో ఒక ఉచిత పాఠశాల.

రాజపుటానా మేవాజిల్లాలో ఒక పాఠశాల

రాజపుటానా జయపూర్ సంస్థానంలో ఫతేపురు, చేమున్, అభయపూర్‌లలో 3 పాఠశాలలు.

ఉ.ప్ర. ఫరూకాబాద్ జిల్లా ఫతేగడ్‌లో ఒక స్కూలు.

ఉ.ప్ర. ముత్రాలో 3 రాత్రి పాఠశాలలు.

ఉ.ప్ర. గోరఖ్‌పూర్‌లో 3 రాత్రి పాఠశాలలు

ఉ.ప్ర. గోరఖ్‌పూర్ జిల్లా హాటా తాలూకాలో ఒక రాత్రిబడి

సఖోనియాలో ఒక రాత్రిబడి.

భారత సంస్థానాలు:

1.హరిజనులకు కల్పించే సౌకర్యాల గురించి పెద్ద మెజారిటీతో పలిటానాసంస్థానం(కథియవాడ్) శాసనసభ 3. తీర్మానాలను ఆమోదించింది.

2. రాష్ట్రంలోని హరిజనుల స్థితిగతులను మెరుగుపరిచే చర్యలను ముమ్మరం చేసేందుకు మద్రాసులోని సంధూర్ సంస్థానపు ప్రభుత్వం ఒక స్థాయీ సంఘాన్ని నియమించింది.

మిగతావి :

గోరఖ్‌పూర్ జిల్లా కాషియా వద్దగల అనేక గ్రామాల్లో హరిజనులు చచ్చినగొడ్ల మాంసం తినటం మానేశారు.

బసంత పంచమి పండుగ సందర్భంగా (బీహారు) ముజఫర్‌పూర్‌లోని చతుర్భుజనాథ్‌జీ దేవాలయంలో హరిజన సేవాసంఘపు ఆధ్వర్యంలో జరిగిన బసంతోత్సవంలో అన్ని కులాల హిందువులు పాల్గొన్నారు.

ఏ.వి.ధక్కల్, ప్రధానకర్యదర్శి.

రంగ అయ్యరు గారి రెండు అస్పృశ్యత బిల్లులను బలపరచ వలసిందిగా గట్టిగా కోరుతూ పూనాలోని అఖిలభారత అస్పృశ్యతా వ్యతిరేక లీగ్ అధ్యక్షులు, డిప్రెస్డ్ మిషను సొసైటీ ఆఫ్ ఇండియాకు స్థాపక ధర్మకర్త అయిన వి.ఆర్. షిండే ఒక బహిరంగ లేఖ వ్రాసారు.

బొంబాయి 'జి' వార్డు లోని తైకల్ వాడిలో ఇటీవల అగ్నిప్రమాదం జరిగి 48 మహర్ కుటుంబాల ఆస్తిపాస్తులకు అపార నష్టం జరిగింది. హరిజన సేవాసంఘపు బొంబాయి రాష్ట్ర బోర్డు అధ్యక్షుడు ఈ కుటుంబాల సహాయానికి రు.500లు మంజూరు చేశారు. 'జి' వార్డు సంఘానికి చెందిన ఒక ఉపసంఘం ఈసహాయాన్ని అందించింది. మొత్తం 163 సభ్యులున్న ఈ 48 కుటుంబాలకు తక్షణ సహాయంగా రు.402. 8 పంచారు.

బొంబాయి ప్రభుత్వం ఆజ్ఞలు జారీచేసింది. వీటి ప్రకారం అన్నికులాలవారూ సమానంగా వాడుకోవాలనే షరుతులేకుండా బావులు, చెరువులు, ధర్మసత్రాలకు ప్రభుత్వభూములు కేటాయించాలని స్థానిక సంస్థలు చేసిన విజ్ఞాపనలను మన్నించరాదు.

1933 జులై 15 నాటి 'హరిజన్'

వారం వారం

విద్యావసతులు :

ఉత్తర ఆర్కాటు జిల్లాలో హరిజన సేవకుల సంఘం హరిజనుల కోసం 3 పఠనాలయాలను ప్రారంభించింది.

మధుర జిల్లాలోని వీరంగనూరు తాలూకా బోర్డు పాఠశాలలో హ.సే.సం. కార్యకర్తలు హరిజనుల పిల్లలకు ప్రవేశం కల్పించారు.

మధుర హ.సే.సం. వారు స్థాపించిన మేలిచేరి బడిపిల్లలకు బనియన్లు,తువ్వాళ్లు పలకలు మొ.. వాటిని ఉచితంగా పంచారు.

ఢిల్లీ రాంజస్ కళాశాలలోని ఇద్దరు హరిజన విద్యార్థులకు ఉచిత వసతి, విద్యార్థివేతనం, మరొకనికి ఉచిత విద్యార్థివేతనం కళాశాల ప్రధానాచార్యులు తడాని నెలకొలిపారు.

మోచిగేటుకు వెలుపల వున్న హరిజన ఆ రోజుల్లో హరిజన వయోజనుల కోసం లాహోరు హ.సే.సం వారి ఆధ్వర్యంలో ఒక రాత్రిబడి ప్రారంభించారు. శ్రీమతి. బ్రిజ్ లాల్ నెహ్రూ ఈ ప్రారంభోత్సవం జరిపారు.

(గుంటూరు) బ్రాహ్మణ కోడూరులో హరిజన విద్యార్థులకని మరో వసతిగృహం నిర్మించాలని నిర్ణయించారు.

కాకినాడలో చదువుకుంటున్న హరిజన బాలికలకు ఒక వసతి గృహం ప్రారంభించాలని తూ.గో.జిల్లా హ.సే.సం సంకల్పించింది. 15 మంది విద్యార్థులతో ప్రారంభించే ఈ వసతి గృహానికప్పుడే రు.630 రొక్కం, 20 బస్తాల బియ్యం, కావలసిన వంట చెరుకు విరాళాలుగా అందాయి.

ఉరవకొండలోని హరిజన విద్యార్థులను ఒక వసతి గృహం తెరవాలని అనంతపురం హ.సే.సం పూనుకొన్నది. కొన్ని సరుకులు, పైకం అప్పుడేపోగుచేసారు. 20 మంది విద్యార్థులతో దీనిని ప్రారంభించాలని ఉద్దేశం.

గుంటూరు హ.సే.సం వారి అకుంఠితకృషి వల్ల అనేక గ్రామాల్లో, పట్టణాల్లోని సవర్ణపాఠశాలల్లో హరిజనుల పిల్లలను చేర్చుకున్నారు.

కోయంబత్తూరు జిల్లాలో పాడుపడిన 3 బావులను శుభ్ర పరిచి మళ్ళీవాడుకలోకి తెచ్చారు.

హ.సే.సం. ఎంపిక చేసిన గూడేలలో 4 బావులు తవ్వించటానికి దక్షిణ ఆర్కాటు జిల్లాబోర్డు అధ్యక్షుడు వాగ్దానం చేశారు.

ఆంధ్రదేశంలో 1933 మే 31కి అంతమయిన పక్షం రోజుల్లో అన్నీ కనీస పక్షం 125 బావులకు హరిజన ప్రవేశం కల్పించారు. కొత్తగా 5 బావులు తవ్వారు.

మిగతావి :

ఆహారదినుసుల్ని చవకగా అందించేందుకు (కలకత్తా) హాగ్ మార్కెటువద్ద ఒక బస్తీలో దుకాణం తెరిచారు. ఈ బస్తీలో 'డోం'లు నివసిస్తారు.

(కలకత్తా) బీబీచాగన్ బస్తీలోని ఒక హరిజన కుటుంబపు అప్పులు తీర్చేటందుకు బెంగాలు హ.సే.సం రు.60 లు చెల్లించింది.

(కలకత్తా) అమృత సమాజంవారు కొందరు హరిజనులకు సాయపడ్డారు.

(బీర్భం) బోర్పూరుకు చెందిన 450మంది హరిజనులు తాగుడు అలవాటు మానేశారు.

ముచ్చీలు 1275 మంది గొడ్డుమాంసం ముట్టమని ప్రమాణం చేశారు.

బంకూర, ముర్షీదాబాదు, 24 పరగణాలలో హ.సే.సం 3 కొత్తజిల్లా కేంద్రాలను స్థాపించింది.

గూడేలలో స్వయంగా, నేరుగా సేవ చెయ్యటానికి గాంధీ హరిజన సేవా సమితుల స్థాపనను తిరుచినాపల్లి, తంజావూరు, తిరునల్వేలి, సేలం, దిండిగల్లు, ఉత్తర ఆర్కాటు, మధురలు తలపెట్టాయి.

కోయంబత్తూరకు 12 మైళ్ల దూరంలోనున్న అలందుర్ హరిజన గూడెంలో ఒక అగ్ని ప్రమాదం జరిగిన వెంటనే, గ్రామస్తుల్ని ఆదుకోవటానికి రు.25 విలువైన ధాన్యం, రు.100 విలువైన బట్టలు, రు.5 ఖరీదుచేసే నూనె అందించారు.

చిదంబరంలో ఒక హరిజన్ యువక కేంద్రం నెలకొల్పారు. సరుకుల్ని ఉత్పత్తిధరకు హరిజనులకు అందించటానికి తెనాలిలో ఒక దుకాణం తెరిచారు. వారు దీన్నివినియోగించు కుంటున్నారు కూడ.

(తూర్పు కృష్ణాజిల్లా) వాలన్నపాలెంలో ఇటీవల జరిగిన అగ్నిప్రమాదంలో ధ్వంసమయిన యిళ్లు మళ్ళీ కట్టు కోవటానికి రు.110 మొత్తం అందచేశారు.

(విశాఖ) యలమంచిలి అగ్ని ప్రమాదంలో యిళ్లు కోల్పోయిన హరిజనుల సహాయార్థం రాష్ట్ర సంఘం రు.110ల విరాళం యిచ్చింది. ఇప్పటికంటె మెరుగైన ప్రదేశంలో కొత్తయిళ్ళు కట్టేందుకు స్థానిక హ.సే.సం కృషిచేస్తూ కట్టడం సామగ్రిని, రొక్కాన్ని విరాళాలుగా సేకరిస్తున్నది.

గొల్ల పాలెంలో సవర్ణ కామందు ఒక హరిజనుడిని నౌకరుగా నియమించుకున్నాడు.

దేవాలయాల ధర్మకర్తలుగాని, యజమానులు గాని హరిజనులకు ప్రవేశం కల్పించటానికి వొప్పుకోక పోతే, బలవంతంగా వాళ్ళను దారిలోకి తేవటానికి హిందువులు సత్యాగ్రహం నిజంగానే చేసేవారు. గురువయ్యూరు గుడిలో అంటరానివారి ప్రవేశం సాధించటానికి వేలప్పన్ చేసిన సత్యాగ్రహం ఈ ఆందోళనలో భాగమే. హిందుభక్తుల్లో అధికులు ఆమోదిస్తారని లెక్కకువస్తే, ప్రవాహానికి ఎదురొడ్డి నిలిచిన దేవాలయ ధర్మకర్తలు చేతులు కట్టేసిపెట్టటానికి హిందూ శాసనసభ్యులు తొడతొక్కిడిగా ముందు కొచ్చేవారు. అట్లాంటి బిల్లులు ఒక వంద

దాకవచ్చాయి. మొదటి స్థానానికి శాసనసభ్యులు పరుగు పందెమే కట్టారు. మద్రాసు శాసనపరిషత్తు సభ్యుడు డా.సుబ్బరాయన్ దేవాలయ ప్రవేశం బిల్లు ఒకటుంది. కేంద్ర శాసనసభలో 4 బిల్లులు ప్రవేశపెట్టారు. ఒకటి సి.ఎస్.రంగయ్యరుది, మరొకటి హరబిలాస్ శారదది, మూడోది లాల్‌చందు నవల్రాయిది, ఎం.ఆర్. జయకర్‌ది నాలుగోది.

గాంధీ కూడ ఉద్యమంలో చేరారు. అస్పృశ్యులు హిందూదేవాలయాల్ని ప్రవేశించటాన్ని గాంధీ 1932 కు ముందు వ్యతిరేకించారు. స్వయంగా గాంధీ అన్నమాటలు[1].

"ఇప్పుడున్న అన్నిదేవాలయాల్లోకి అంత్యజులు (అంటరానివారు) ప్రవేశించే హక్కు వుండాలంటే ఎట్లాకుదురుతుంది? కులం, ఆశ్రమ వ్యవస్థల శాసనానికి హిందూమతంలో ముఖ్యస్థానం వున్నంత కాలం ప్రతి హిందువు ప్రతి గుడిలోకి వెళ్లవచ్చుననటం ఈ రోజు సాధ్యపడే సంగతి కాదు."

అందుచేత దేవాలయ ప్రవేశాందోళనలో ఆయన చేరటం గొప్ప విస్మయంగొలిపే విషయంగానే వుంటుంది. గాంధీ యీ పిల్లిమొగ్గ ఎందుకువేశారో వూహించటం కష్టమే. హిందూ దేవాలయాల్లో అంటరానివారు ప్రవేశించటాన్ని వ్యతిరేకించి తాను పొరపడ్డాననే నమ్మిక వల్ల నిజంగా కలిగిన హృదయపరివర్తనేనా? హిందువులు, అస్పృశ్యుల మధ్య పూనా ఒడంబడిక తెచ్చిపెట్టిన రాజకీయపు ఎడబాటు... సాంస్కృతిక, మతపర బంధనాలు పూర్తితెగతెంపులకి దారి తీస్తుందేమోనని, అందుచేత ఈ ధోరణిని అరికట్టి యిద్దరిని కట్టివుంచటానికి దేవాలయ ప్రవేశం వంటి ఏదో ఒకచర్య అవసరమని కలిగిన అవగాహన వల్లనా? లేక, హిందువుల నించి అస్పృశ్యులను వేరు పరిచే అడ్డుగోడని, ధ్వంసం చేయటం ద్వారా, వారి రాజకీయ హక్కులకు వున్న ఆధారాన్ని ధ్వంసం చెయ్యటం దేవాలయ ప్రవేశోద్యమంలో ఆయన చేరిన ఉద్దేశమా? కాక తన కీర్తి ప్రతిష్టలు పెంచుకునే బృహదవకాశం కళ్ల ముందు నిలిచే సరికి ముందు కురికాడా? రెండో వివరణకాని, మూడోది గాని సత్యానికిదగ్గరగా వుండవచ్చు.

## II

ఈ దేవాలయ ప్రవేశోద్యమాన్ని అస్పృశ్యులు ఎలా చూశారు? ఉద్యమాన్ని బలపరచమని గాంధీ నన్ను అడిగారు. నేను నిరాకరించి ఆ విషయమై పత్రికలకు ఒక ప్రకటన విడుదల చేశాను. ఈ విషయమై నా దృక్పథానికి గల కారణాలను పాఠకుడు తెలుసుకునే వీలవుతుంది గనుక దాన్ని పూర్తిగా యివ్వాలనుకున్నాను. ఇదిగో చూడండి.

దేవాలయ ప్రవేశపు బిల్లు గురించి ప్రకటన

14 ఫిబ్రవరి 1933

దేవాలయ ప్రవేశాన్ని గూర్చిన వివాదం సనాతనులకి, మహాత్మా గాంధీకి పరిమితమైనప్పటికి, వివాదం తుది పరిష్కారానికి వచ్చేటప్పుడు త్రాసు ఏదోవైపుకు మొగ్గటంలో దళితవర్గ అభిప్రాయపు బరువు పడటం తప్పని సరిగనక నిస్సందేహంగా వారు అతిముఖ్యమైన

1 గాంధీ శిక్షణ్ సంచిక II- పుట 132

పాత్రవహించాలి. అందుచేత ఎటువంటి సందేహానికి తావివ్వని విధంగా దృక్పధాన్ని నిర్వచించి ప్రకటించటం అవసరం.

ఇప్పుడు తయారుచేసిన రూపంలో రంగయ్యారు దేవాలయప్రవేశపు బిల్లుకి దళిత వర్గాలు బహుశా తమ మద్దతు యివ్వలేరు. ఒకానొక దేవాలయం చుట్టుపక్కల వున్న మునిసిపలు, స్థానిక సంస్థల వోటర్లలో అధికసంఖ్యాకులు, దళిత వర్గాల దేవాలయ ప్రవేశాన్ని అనుమతించటానికే రెఫరెండం ద్వారానిర్ణయిస్తే ఆ దేవాలయపు మేనేజరు లేక ధర్మకర్తలు సదరు నిర్ణయాన్ని అమలుచేయాలనేది బిల్లు ఉద్దేశం. మెజారిటీ సూత్రం వంటి సాదాసూత్రాన్ని పాటించే వుద్దేశం యిది. అందుచేత యీబిల్లులో తీవ్రమైనది. విప్లవాత్మకమైనది ఏమీలేదు. ఇక సనాతనులు తెలివిగల వారైతే, గొణక్కుండా దీన్ని ఆమోదిస్తారు.

ఈ సూత్రంపై ఆధారపడ్డ బిల్లును దళిత వర్గాలు బలపరచలేకపోవటానికి కారణాలు రెండు.



ఈ బిల్లువల్ల దళితవర్గ దేవాలయ ప్రవేశం బిల్లు లేనప్పటికంటె ఒక్కరోజు కూడ త్వరిత పరచలేదు. మెజారిటీ నిర్ణయం ప్రకారం గుడితలుపులు తెరచే ధర్మకర్త, లేదా మేనేజరుకు వ్యతిరేకంగా ఇంజంక్షను ఉత్తరువు తెచ్చేహక్కు ఈ బిల్లు కింద మైనారిటీ వారికి లేని మాట నిజమే. కాని యీసమస్యని వోటుకి పెట్టినప్పుడు మెజారిటీ వోటర్లు దేవాలయ ప్రవేశానికి అనుకూలంగా వుంటారని నమ్మకం కుదరాలి. అప్పుడే బిల్లులోని యీ అంసంతృప్తి కలిగించినా, బిల్లు కర్తని మనం అభినందించినా. మనం ఏరకమైన భ్రమలబారినో పడితేతప్ప, దేవాలయ ప్రవేశానికి అనుకూలంగా మెజారిటీ సభ్యులు వోటు వేస్తారన్న ఆశ అతిసకృత్తుగానైనా ఫలిస్తుందో లేదో అన్న వాస్తవాన్ని అంగీకరించక తప్పదు. ఈ రోజున మాత్రం మెజారిటీ వర్గం ఖచ్చితంగా వ్యతిరేకిస్తున్నారు. శంకరాచార్యతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలలో బిల్లు కర్త ఈ విషయాన్ని వొప్పుకున్నారు.

మెజారిటీ పభ్యులు యిప్పటికంటె భిన్నంగా ప్రవర్తించే స్థితిని ప్యాసయినబిల్లు సృష్టిస్తుందని ఎట్లా ఆశపెట్టుకోవాలి? నాకయితే లేదు. గురువయ్యూరుగుడి విషయంలో జరిగిన రెఫరెండం ఫలితాలు గుర్తుచేస్తారు కాబోలు.మహాత్మాగాంధీ ప్రాణం బరువుతో ముడిపడి గుంజబడ్డ ఆ రిఫరెండం ఫలితం సజావైనదంటే నేను తిరస్కరిస్తాను. అటువంటి గణకాల్లో మహాత్ముడి ప్రాణం విలువని తీసివెయ్యాలి.

రెండోది-- దేవాలయాల్లో అంటరాని తనాన్ని ఒకపాపిష్టి ఆచారంగా బిల్లు పరిగణించదు. అస్పృశ్యతని అది ఒక సామాజిక దౌష్ట్యంగా చూస్తుందే కాని, మిగతారకాల సామాజిక దౌష్ట్యాల కంటె ఖచ్చితంగా మరింత దుష్టమైనదిగా చూడదు. అందుకే కేవలం అస్పృశ్యతని చట్టవిరుద్ధంగా అని ప్రకటించడం లేదు. అధిక పంఖ్యాకులు అట్లా నిర్ణయిస్తేతప్ప దాని పాటింపుని తొలగించలేరు. అధికసంఖ్యాకులు వాటికి అలవాటు పడ్డందువల్లగాని, అధిక సంఖ్యాకులు వాటి ఆచరణనే ఎన్నుకున్నందు వల్లగాని, పాపం, నీతి బాహ్యతలు పవ్యాలు కానేరవు. అస్పృశ్యత అన్నది పాపపంకిలమూ, నీతి బాహ్యమూ అయిన ఆచారమే అయితే, అది అధిక సంఖ్యాకులకు ఆమోదయోగ్యమైనా నిస్సంకోచంగా దాన్ని పట్టి చెల్లార్చాలని దళిత వర్గాలు భావిస్తాయి. నీతి బాహ్యము, ప్రభుత్వ విధానానికి వ్యతిరేకమూ అయిన అన్ని ఆచారాల విషయంలో న్యాయస్థానాలు వ్యవహరించే పద్ధతి యిదే.

సరిగ్గా బిల్లు ఈపనే చేయటంలేదు. తాగుడు అలవాటును మద్యనిషేధవాది చూసే కంటె తీవ్రమైన విషయంగా బిల్లుకర్త అస్పృశ్యతను చూడటంలేదు. నిజానికి యీరెంటిమధ్యన వుందనుకున్న పోలికకు ఆయన ముగ్ధుడయ్యాడు. తాగుడు అలవాటును మాన్పించటానికి మద్యనిషేధవాది కోరేపద్ధతినే ఆయన కూడ కోరాడు: స్థానికుల ఆమోదం. అస్పృశ్యత మద్యపానంకంటె అధ్వాన్నమైనది కాదని నమ్మే మిత్రుడికి దళిత సోదరులు అంతగా కృతజ్ఞత చూపలేరు. అస్పృశ్యతను పారదోలటానికి, కొద్దిమాసాల క్రితమే మహాత్మా గాంధీ ఆమరణ దీక్ష పట్టారని రంగయ్యరు మరిచారు. లేకపోతే ఆయన దీన్ని యింతకంటె తీవ్రతరమైనదిగా భావించి, యీ విషవృక్షాన్ని కూకటివేళ్లతో పెకలించి తరలించి వేసే సంస్కరణ నొకదాన్ని ప్రతిపాదించి వుండేవారు.సాధ్యాసాధ్యాల విషయంలో బిల్లు లొసుగులు ఏమైనప్పటికీ, అస్పృశ్యత పాపం అన్న ఒక నీతిని అది గుర్తించాలని దళిత వర్గాలు కనీస పక్షంగా భావించి ఎదురుచూసే విషయం.

అస్పృశ్యత ఒక శాపం, పాపం అని నొక్కిచెప్పే మహాత్మా గాంధీకి యీబిల్లు ఎట్లా నచ్చిందో నాకు నిజంగా అంతుబట్టని సంగతి. దళిత వర్గాలనైతే అది ఏ మాత్రం తృప్తి పరచలేదు. ప్రత్యేకంగా యీ బిల్లు మంచిదా చెడ్డదా, సరిపోతుందా సరిపోదా అన్నది అప్రధానమైన సమస్య.

ప్రధానమైన ప్రశ్న యిది. **దళిత** వర్గాలు దేవాలయ ప్రవేశాన్ని కోరుతున్నారా, కోరటంలేదా? ఈ ప్రధాన సమస్యని దళిత వర్గాలు రెండు దృక్కోణాలనించి చూస్తున్నారు. మొదటిది ఆర్థికస్థితి గతుల దృష్టి. అక్కడి నుంచి బయలుదేరి దళితులు, తమ వున్నతికి రాచబాట ఉన్నత విద్య, ఉన్నత ఉద్యోగాలు, మెరుగైన వృత్తుల్లో జీవనోపాధి ద్వారా వుందని భావిస్తున్నారు. ఒకసారి సమాజ జీవనంలో సముచిత స్థానం పొందితే, తాము గౌరవ పాత్రులవుతారు. ఒకసారి గౌరవ పాత్రులయితే, తమ యెడల ఛాందసుల కున్న మత పరమైన దృష్టి కూడ తప్పక మారుతుంది. ఒకవేళ ఆదృష్టిమారక పోయినా, తమ ఆర్థిక స్థితిగతులకేమీ ముప్పురాదు. ఈ విధంగా ఆలోచిస్తున్న దళితులు దేవాలయ ప్రవేశం వంటి శుష్క విషయంల్లో తమ శక్తియుక్తులు వెచ్చించమని చెబుతున్నారు. ఈ పోరాటంలో వారికి ఆసక్తిలేక పోవటానికి మరోకారణం కూడ వుంది. ఆత్మగౌరవ భావన వారి వాదం.

ఆ మధ్య వరకూ భారతదేశంలో యూరపు వాసులు నిర్వహించిన విలాసకేంద్రాలు క్లబ్బులలో ద్వారాలకు కట్టిన బోర్డులు హెచ్చరించేవి."కుక్కలకు, భారతీయులకు" అనుమతి లేదు, అని ప్రస్తుతం హిందు దేవాలయాలకు కూడ యిలాంటి బోర్డులు వున్నాయి. తేడా అంటూ ఏమిటంటే, వాస్తవంలో అవి ప్రకటించేది యిలా వుంటుంది. "హిందువులందరికీ, కుక్కలతోసహా అన్ని జంతువులకూ ప్రవేశం వుంది. అంటరానివారికి మాత్రం లేదు." రెండు సందర్భాలలోనూ పరిస్థితి ఒకే విధంగా వుంది. అహంకారంతో యూరపువాసులు తమల్ని వెలివేసిన ప్రదేశాల్లో ప్రవేశానికి హిందువులెవ్వరూ ప్రాధేయపడలేదు. అదే అహంకారంతో హిందువులు తమని వెలివేసిన ప్రాంతంలో ప్రవేశించటానికి ఒకఅంటారానివాడు ఎందుకు ప్రాధేయపడాలి? ఆర్థికంగా తన బాగు కోరుకుంటున్న దళితవర్గీయుడి వాదం యిది. హిందువులకు అతను చెప్పదలచింది. " గుడితలుపులు తెరుస్తావో లేదో తేల్చుకో వలసింది నువ్వు. దాని కోసం నేనుగొడవపడను. మనిషి వ్యక్తిత్వపు పవిత్రతని మన్నించక పోవటం

మర్యాద కాదని భావిస్తే, పెద్దమనిషిలాగ గుడి తలుపులు తెరుపు. పెద్దమనిషిని కాదు హిందువునే నేను అనుకుంటే తలుపులు మూసుకుని తగులడు. మాకు రావలిసిన ఖర్మేంలేదు."

పండిత మదనమోహన మాలవీయా వంటివారు దళితులు తమ మెహర్బానీ కోసం ఎదురుచూస్తున్నారన్న నమ్మికతో వున్నారు. అలాంటివారి ఆలోచనల్ని క్షాళనం చెయ్యటానికి, వాదాన్ని యీ రూపంలో వినిపించటం అవసరమని నేను భావించాను.

రెండవ దృక్కోణం ఆధ్యాత్మకం. మతానుయాయులుగా దళితులు దేవాలయప్రవేశం కోరుతున్నారా, లేదా అన్నది అసలు ప్రశ్న. ఐహిక దృష్టిదే పైచెయ్యి అయితే దేవాలయ ప్రవేశానికి నిరాసక్తంగా వున్నట్టు, ఆధ్యాత్మక దృష్టి సారించినప్పుడు వుండరు. కాని వాళ్ళ తుది సమాధానం మహాత్మ గాంధి, హిందువులు యీ ప్రశ్నకు యిచ్చే జవాబుపై ఆధారపడి తీరుతుంది. దేవాలయప్రవేశ ఉద్యమం వెనక వున్న ఆంతర్యం ఏమిటి? అన్నది ఆ ప్రశ్న. హిందూ సమాజపు సాంఘికస్థాయిలో దళిత వర్గాల వికాసానికి దేవాలయ ప్రవేశమే చరమావధా? లేక అది మొదటి అడుగు మాత్రమేనా? మొదటి అడుగు మాత్రమే అయితే తుది గమ్యం ఏది? దేవాలయ ప్రవేశమే తుది గమ్యంగా దళితులు ఎన్నటికీ అంగీకరించరు. నిజానికి వాళ్లు దాన్ని నిరాకరించటమేకాక, తమను హిందూసమాజమే తిరస్కరించినట్టు, వేరే తమ గమ్యాన్ని తామే నిర్దేశించుకునే స్వేచ్ఛవున్నట్టు భావిస్తారు. అట్లాకాక, యిది గమ్యంవైపు మొదటి అడుగు మాత్రమే అయితే, బలపరచటానికి వాళ్లు సుముఖంగా వుండవచ్చు. ఈ రోజుభారత రాజకీయాల్లో వున్నస్థితి లాంటిదే అప్పుడు వుంటుంది. భారతీయులందరూ దేశానికి డొమినియను ప్రతి పత్తి అడిగారు. కాని వాస్తవంలోరాజ్యాంగం దానికి సరితూగక పోయినా, చాలామంది భారతీయులు దాన్నిఆమోదిస్తారు. ఎందుచేత? గమ్యాన్ని నిర్ధేశించుకున్నారు కాబట్టి దాన్ని ఒక్కఅంగలో చేరకపోయినా అడుగడుగూ కూడదీసుకుని చేరినా ఫరవాలేదు. కానిడొమినియను ప్రతిపత్తి గమ్యాన్ని బ్రిటిషువారు అంగీకరించి వుండక పోతే,యిప్పుడు చాలామంది ఆమోదిస్తున్న పాక్షిక సంస్కరణల్ని ఏ ఒక్కరూఅంగీకరించేవారుకాదు. అదేవిధంగా హిందూ సమాజ ఛాయలో దళితవర్గాల సాంఘిక ప్రతిపత్తి పురోభివృద్ధికి గాంధీ మహాత్ముడు. యితర సంస్కరణ వాదులు ఏ గమ్యం నిర్ధేశించాగో చాటిచెపితే దేవాలయ ప్రవేశం ఎడల తమ దృక్పధాన్ని నిర్ణయించు కోవటం దళితవర్గాలకు తేలికవుతుంది. ఇక, ఆసక్తివున్న అందిరి సమాచారం, సమాలోచనకొరకు దళితవర్గాల ధ్యేయాన్ని యిక్కడ ప్రకటించడం బాగుంటుంది. దళిత వర్గాలకు కావలసింది - సమ సాంఘిక హోదా యిచ్చే ఒకమతం. ఆపార్థాలకు తావు లేకుండా మతతత్వం ఆధారంగా వున్న సాంఘికదౌష్ట్యాలను, మతేతరాశయాల ఫలితంగా వున్న సాంఘికదౌష్ట్యాలను విడమరుస్తూ ఈ అంశాన్ని విశద పరచదలిచాను. నాగరిక సమాజంలో సాంఘికదౌష్ట్యాలు ఏ మాత్రం సమర్థనీయంకావు. మతం పేరున వీటిని సమర్థించబూనటంకంటె హేయమూ, దుర్మార్గమూ లేదు. తాము గురవుతున్న అక్రమాలని దళిత వర్గాలు మట్టుపెట్టలేక పోవచ్చు. కాని ఈ అక్రమాల కొనసాగింపుకు వత్తాసుయిచ్చే మతాన్ని సహించరాదని వాళ్లు తేల్చుకున్నారు.

హిందూమతం వాళ్ల మతం కావటానికి ముందు అది సామాజిక సమానత్వపు మతం కావాలి. అందరకీ దేవాలయ ప్రవేశం కల్పిస్తూ ఒక అంశాన్ని పొందుపరచి హిందూమత శాస్త్రానికోసవరణ చేసిన మాత్రాన, అది సాంఘిక సమానత్వపు మతం అయిపోదు. ఇప్పటి

రాజకీయాల్లో బాగా అలవాటయిన శబ్దాల్లో చెప్పాలంటే- మహాఅయితే అది వాళ్లని జాతీయులు (ఏలియన్సు)గా కాక స్వజాతీయులు (నేషనల్సు)గా గుర్తించగలదు. అంటే ఎవరికంటేనూ వాళ్లుఎక్కువ, తక్కువ కాకుండా స్వేచ్ఛా సమానత్వాల స్థితికి చేరి. పోతారని దీని అర్థంకాదు. కారణం సులువు. సాంఘిక హోదాలో సమానత్వం అనేనీతిని హిందూమతం గుర్తించదు, పైగా ప్రజల్ని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులని శ్రేణులుగా పట్టుపట్టి విడదీస్తూ అసమానతని పెంచుతుంది. వీళ్లేమో ఆరోహణ క్రమంలో ద్వేషంతోను, అవరోహణ క్రమంలో ఏహ్యంతోను పరస్పరం మోహరించి వున్నారు. హిందుమతం సాంఘిక సమతామతం కావటానికి దేవాలయ ప్రవేశపరంగా దానికి ఒక సవరణ చాలదు. జరగవల సిందేమంటే చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని దాన్నుంచి వదలగొట్టాలి. అసమానత కంతటికీ అది మూలకారణం. కేవలం అసమానత్వ రూపాలయిన కులవ్యవస్థ, అస్పృశ్యులకు అది జన్మదాత కూడ. ఇది జరగనినాడు దళితులు దేవాలయ ప్రవేశాన్నే కాదు హిందూ ధర్మాన్నే తోసివేస్తారు. చాతుర్వర్ణ్యం, కులవ్యవస దళిత వర్గాల ఆత్మగౌరవంతో పొసగనివి. అవి దాని ప్రధాన ధర్మంగా వున్నంత వరకూ దళిత వర్గాలని తక్కువ చేసి చూడటం తప్పనిసరి. కులం, చాతుర్వర్ణ్య సిద్ధాంతాన్ని త్యజించి, వాటిని హిందూధర్మ శాస్త్రాలనించి తొలగించినప్పుడు దళితులు తాము హిందువులమని చెప్పుకోగలరు. దీనిని తమ ధ్యేయంగా మహాత్ముడు, హిందూ సంస్కర్తలూ ఆమోదించి, దానికొరకు కృషిచేసే ధైర్యం వారికుందా? నా తుది అభిప్రాయం ఏర్పరచుకునే ముందు, ఈ విషయమై వారి ఉద్ఘాటనలను ఎదురు చూస్తాను. ఒకవేళ గాంధీ మహాత్ముడు, హిందువులు, దీనికి సిద్ధపడనీ, పడకపోనీ- దీనికి పీసం తక్కువ ఏదీ దళితుల్ని తృప్తిపరచదనీ, దేవాలయ ప్రవేశానికి వాళ్లు సమ్మతించరని తుదిమాటగా తెలియగలరు. దేవాలయ ప్రవేశానికి వొప్పుకుని దానితో తృప్తిపడి వూరుకోవటం దుష్టత్వానికి తలవంచటం, తమలో వసిస్తున్న మానవీయ పవిత్రతని అమ్ముజూపటం అవుతుంది.

అయితే నేను వచ్చిన ఈ నిర్ణయానికి వ్యతిరేకంగా గాంధీ మహాత్ముడు హిందూ సంస్కర్తలు ఒక వాదం లేవనెత్త వచ్చు. ఇప్పుడు దేవాలయ ప్రవేశానికివొప్పుకోవటం తరువాత కులం, చాతుర్వర్ణ్యాల నిషేధానికి చేసే ఆందోళనకు అడ్డురాదని వాళ్లు అనవచ్చు. అదే వాళ్ల ఉద్దేశమైతే సమస్యనిప్పుడే తేల్చివేసి భవిష్యత్పరిణామాలకు దారి సుగమం చేయడానికి వాళ్ల వాదనకి ఈదశలోనే జవాబు చెపుతాను. నా జవాబు యిది: ఇప్పుడు నేను దేవాలయ ప్రవేశానికి అంగీకరిస్తే చాతుర్వర్ణ్య కుల వ్యవస్థల నిషేధానికి ఆందోళన చేసే హక్కు పోని మాట నిజమే. కాని ఆ సమస్య వచ్చి ఎదుట నిలిచినప్పుడు గాంధీ మహాత్ముడు ఏ పక్షం వహిస్తాడన్నది ప్రశ్న. అప్పుడాయన నా ప్రత్యర్థుల శిబిరంలో వుండదలిస్తే ఇప్పుడు నేనాయన శిబిరంలో ఉండనని తనకి చెప్పాలి అప్పుడు ఆయన నా శిబిరంలో వుంటే, యిప్పుడే ఆయన నాతో వుండాలి.

బి.ఆర్. అంబేద్కర్.

రౌండ్ టేబుల్ సమావేశానికి నాతో పాటు అంటరాని వారి ప్రతినిధిగా వున్న దివాన్ బహదర్ ఆర్. శ్రీనివాసన్ కూడ దేవాలయ ప్రవేశోద్యమాన్ని బలపరచలేదు. పత్రికా ప్రకటనలో ఆయన ఇలా అన్నాడు:

''ఒక దళిత వర్గ సభ్యుడిని సవర్ణ దేవాలయ ప్రవేశానికి అనుమతిస్తే, అతన్ని నాలుగు కులాల్లో దేంట్లోకీ తీసుకోరు. పంచముడిగా, కడజాతివాడిగా లేదా నీచ కులస్తుడిగా పరిగణిస్తారు. అంటరాని వాడనిపించుకోవటం కంటె యిదియింకా పెద్ద మచ్చ. మళ్ళీ అదే సమయంలో అతడు చాలా కుల విధినిషేధాలకు, అవమానాలకు గురి అవుతాడు. గుడిని చేరిన వాడిని దళితులు రోసి సవర్ణుడిగా వెలివేస్తారు. కోట్లాది దళిత వర్గాల వారు కుల విధి నిషేధాలకు లొంగరు. అట్లా లొంగితే వాళ్లు గుంపులుగా చీలిపోతారు. గ్రామ చట్టం ద్వారా బలవంతంగా దేవాలయ ప్రవేశం చేయించలేం. గ్రామ సవర్ణులు బాహాటంగానో పరోక్షంగానో చట్టం అతిక్రమిస్తారు. దళిత గ్రామీయుడికిది 'చక్కెర' అని రాసిన కాగితం ముక్క చేతిలో పెట్టి రుచి చూడమన్నట్టు వుంటుంది. దేశం అల్లర్లూ అయోమయం పాలు కాకుండా యీ వాస్తవాల్ని సకాలంలో ప్రజల ముందు పెట్టడమైంది.''

నా ప్రకటనలో నేను వేసిన ప్రశ్నకు గాంధీ సూటిగా జవాబు యిచ్చాడు. అంటరానితనానికి తాను వ్యతిరేకినే కాని కులానికి వ్యతిరాకిని కాదన్నారు. అమాట కొస్తే తాను కుల వ్యవస్థకి అనుకూలుడినన్నారు. అందుచేత తన సంఘసంస్కరణ అస్పృశ్యత నివారణ దాటి పోదన్నారు. నా ధృక్పథం నిశ్చయించు కోవటానికి యిడిచాలు నాకు. ఇక ముందు దీనితో నాకు ప్రమేయంవుండదని నిర్ణయించు కున్నాను.

అంటరాని జాతిలో ఒకే ఒక్క ప్రముఖుడు కీ.శే. దివాన్ బహదర్ రాజా. ఈ వ్యవహారంలో చాలా శోచనీయమైన పాత్ర వహించాడని చెప్పక తప్పదు. 1927 నుంచి కేంద్ర శాసన సభకు ప్రభుత్వం కూర్చోబెట్టిన (నామినేటెడు) సభ్యుడు. సభకు లోపలగాని, వెలుపలగాని కాంగ్రెసుతో అతనికెట్టి సంబంధం లేదు. పొరపాటునో, గ్రహపాటునో కూడ అతను కాంగ్రెసు వైపున కనబడలేదు. నిజానికి అతడు కాంగ్రెసును విమర్శిస్తాడంటే చాలదు, ప్రతికూలుడు కూడ. ప్రభుత్వానికి మిక్కిలి నమ్మకమైన మిత్రుడిగా దాని పక్షాన నిలబడటానికి ఎన్నడూ సందేహించలేదు. కాంగ్రెసు తీవ్రంగా వ్యతిరేకించిన అస్పృశ్యుల ప్రత్యేక వోటరు వర్గాలను (ఎలక్టరేట్లు) అతడు బలపరిచాడు. 1932 క్లిష్టస్థితిలో ప్రభుత్వాన్ని నట్టేట వదిలి కాంగ్రెసు పక్షాన చేరటానికి అకస్మాత్తుగా నిర్ణయించాడు. ఉమ్మడి వోటరు వర్గాలు, దేవాలయ ప్రవేశం గురించి కాంగ్రెసు వుద్యమంలో ముందు భాగాన నిలిచాడు. ఏ యితరప్రజావుద్యమ గతిలోనూ దీనికి సాదృశ్యం కనుక్కోవటం అసాధ్యం. కేవలం స్వార్థం మినహా దీని వెనక వేరే ప్రేరణ లేక పోవటం యీ వ్యవహారంలోని అధ్వాన్న స్థితి. అస్పృశ్యుల ప్రతినిధిగా రౌండ్‌టేబుల్ సమావేశానికి ప్రభుత్వం ఎవరిని పంపకుండా దివాన్ బహదర్ ఆర్. శ్రీనివాసన్ పంపటంలో అతడు కక్షకట్టాడు. అతన్ని పంపక పోవటానికి ప్రభుత్వానికి మంచి కారణమే ఉంది. సైమను కమీషనులో సభ్యులకు గాని, కేంద్ర శాసన సభ సభ్యులకు గాని రౌండ్‌టేబుల్ సమావేశంలో స్థానం యివ్వరాదని నిర్ణయమైంది. ఈ దివాన్ బహదరు కేంద్ర శాసన సభ సభ్యుడు గనక వదిలి వెయ్యవలసి వచ్చింది. ఇది చాలా సవ్యమైన వివరణ. దివాన్ బహదర్ రాజా దెబ్బతిన్న అభిమానం దీన్ని ఆయనకెక్కనివ్వలేదు. మద్రాసులో కాంగ్రెసు ప్రభుత్వం అధికారం చేపట్టాక పూనా ఒప్పందాన్ని ఎలా దుమ్ములో పొర్లాడించారో కాంగ్రెసుకు తను చేసిన సేవలు విస్మరించి తనని కాదని తన ప్రత్యర్థి నెలా మంత్రిని చేశారో ప్రత్యక్షంగా చూసి తను వెనక చేసిందానికి ఖిన్నుడయ్యాడు. ఏమైనా కీలకమైన 1932లో దివాన్ బహదర్ రాజా కాంగ్రెసుకు తన పూర్తి మద్దతు యిచ్చాడన్నది కాదనలేని వాస్తవం. కాంగ్రెసు గుంపుతో

పాటు పరుగు పెట్టటమేకాదు. అస్పృశ్యతకి వ్యతిరేకంగా చట్టం తెచ్చే పందెంలో కూడ వెనక బడకుండా జాగ్రత్త పడ్డాడు. అతడు కూడ రెండు బిల్లులు ప్రతి పాదించాడు. ఒకటి అస్పృశ్యతా నివారణబిల్లు, రెండోది క్రిమినలు ప్రొసీజరు సవరణ బిల్లు.

## III

వ్యతిరేకతని గాని, అది ఛాందసపు హిందువుల నుంచా అంటరాని వారినుంచా అని గానీ గాంధీ పట్టించు కోలేదు. వెర్రిగా తన లక్ష్యం వెంట పడేవాడు. ఈవుద్యమం ఏమైందని అడగటం ఆసక్తి గొలుపుతుంది. కాని యీ పరిశీలనని సాగదీయటంగాని. జరిగిందంతా ఉద్యమ విజయ మని చెప్పుకునే సాక్ష్యాలను గురించి రాయటం గాని యీ పుస్తకపు చిన్న పరిధిలో సాధ్యం కాదు.

క్లుప్తంగా చెప్పాలంటే గుళ్లూ, బావులు తెరవటం ద్వారా అంటరానితనం రూపుమాపే దిశలో కొద్ది సంరంభపు పొటమరింపు తర్వాత, హిందువుల మనస్సు తిరిగి తొలి దశకు మళ్లింది.

"హరిజన్" పత్రిక వారం వారం శీర్షికలో వస్తున్న నివేదికలు తగ్గుముఖం పట్టి తరునాత అప్పుడొకటి, అప్పుడొకటిగా వచ్చి చివరకు అదృశ్యమైనాయి. హిందూ హృదయం జబ్బుపడి అంత త్వరగా ఆగిపోవడం నావరకు ఆశ్చర్యమనిపించలేదు. హరిజన్‌లో వారం వారం శీర్షిక ప్రపంచాన్ని నమ్మించినంతగా హిందువుల గుండెలలో మానవ దయాక్షీరం నిండివుందని నేనేనాడూ నమ్మలేదు. నిజానికి వారం వారంలో వచ్చిన వార్తలలో చాలా భాగం కేవలం కల్పన. ఉబ్బుడు ప్రచారం. అస్పృశ్యతకు వ్యతిరేకంగా పోరాడటానికి హిందువులు కృతనిశ్చయులై వున్నట్లు ప్రపంచాన్ని నమ్మించి మోసగించటానికి యిదంతా కాంగ్రెసు వారు కల్పించినది. అసలు దేవాలయాలంటూ హరిజనులకోసం తెరవలేదు. తెరచామని రిపోర్టులు పంపిన వాటిలో చాలా భాగం శిధిలమై పాడుపడిపోయినవి. శునకాలు, గార్ధభాలు తప్ప వాటిలోకి ఎవరూ వెళ్లరు. ఈ కాంగ్రెసు ఆందోళనలోని ఒకదుష్ఫలితం ఏమంటే కాంగ్రెసుకు సాయం జరుగు తుందనుకుంటే ఏ అబద్ధమైనా ఆడటానికి వెనుదీయని అబద్ధాలపుట్టగా రాజకీయాసక్తి వున్న హిందువులు తయారయ్యారు. సామాన్య హిందూ జనం వహించిన పాత్ర లేదా దేవాలయ ప్రవేశోద్యమంలో వహించినట్లు కనపడ్డ పాత్ర ఆ విధంగా అంతమయింది. గురువాయూరు గుడి సత్యాగ్రహానికి, అస్పృశ్యుల దేవాలయ ప్రవేశం సాధించడానికి వుద్దేశించిన శాసన కలాపానికీ, అదేగతి పట్టింది. ఈ కలాపాలన్నీ గాంధీకాంగ్రెసు వాదులు సాగించినవే. అంటరానివారంటే వారికున్న అసలు తత్వాన్ని బయట పెడతాయి కనుక కొన్ని వివరాలతో వారి చరిత్ర చెప్పుకోవడం మంచిది.

## IV

గురువాయూరు గుడి సత్యాగ్రహంతో మొదలు పెడదాం. మలబారులోని పొన్నాని తాలూకాలో గురువాయూరు వద ఒక దేవాలయం వున్నది. కేలికట్‌కు చెందిన రాజా ఈ

దేవాలయపు ధర్మకర్త. మలబారులో అంటరానివారి శ్రేయస్సు కొరకు పాటు పడుతున్న కేలప్పన్ అనే ఒక హిందువు ఆ గుడిలో అస్పృశ్యులకు ప్రవేశం కల్పించడానికి ఆందోళన ఆరంభించాడు. గుడి ధర్మకర్తగా కేలికట్ రాజా అంటరాని వారికోసం గుడి తెరవడానికి నిరాకరించాడు. తన చర్యకు మద్దతుగా హిందూ దేవాదాయ ధర్మాదాయ చట్టంలోని 40వ విభాగాన్ని వుదహరించాడు. దీని ప్రకారం తన సంరక్షణలోవున్న దేవాలయాల ఆచార అనుష్ఠానాలకు వ్యతిరేకంగా ధర్మకర్త ఏమీ చేయలేడు. 1932 సెప్టెంబరు 20వ తేదీన దీనికి నిరసనగా కేలప్పన్ నిరాహార దీక్ష ప్రారంభించాడు. అంటరానివారికి అనుకూలంగా రాజా తన అభిప్రాయాలు మార్చుకోవాలని కోరుతూ గుడి ఎదురుగా ఎండలో అతను పడుకున్నాడు. కొంత కాలంపాటు దీక్షను నిలుపుచేయమని కేలప్పన్ కోరవలసిందిగా రాజా గాంధీని అర్థించాడు. ముందు ఈ చిక్కునూ, చికాకునూ వదిలించుకోవడం అతని ఉద్దేశం. గాంధీ విజ్ఞప్తి మేరకు 1932 అక్టోబరు 1వ తేదీన 10 రోజులపాటు సాగిన దీక్షను విరమించి 3 నెలల పాటు కేలప్పన్ వాయిదా వేశాడు. ఈలోగా రాజా కదల లేదు మెదల లేదు. చట్టపరమైన, తదితరమైన అన్ని యిబ్బందులను అధిగమించి ఈ విషయంలో వెంటనే కదలవలసిందిగా గాంధీ ఆయనకు ఒక తంతి పంపించారు. తన సలహాప్రకారం కేలప్పన్ దీక్ష విరమించినందువల్ల, అస్పృశ్యుల ప్రవేశం సాధించడానికి అవసరమైతే కేలప్పన్‌తో పాటు తాను కూడా దీక్షవహించవలసినంత వరకూ తన బాధ్యత వుందని కూడా గాంధీ రాజాకు చెప్పారు. 1932, నవంబరు 5న గాంధీ ఈవిధంగా ఒక పత్రికా ప్రకటన చేశారు:-

" త్వరలో మరొక ఉపవాస దీక్షకు అవకాశం వున్నది. అది గురువాయూరు దేవాలయం తెరవటానికి సంబంధించినది. నాశీఘ్ర విన్నపాన్ని మన్నించి కేలప్పన్ 3 నెలల పాటు తన దీక్షను నిలుపు చేశాడు. ఆ దీక్ష ఆయనను మృత్యుద్వారం దరిదాపులకు తీసుకువెళ్లింది. ఖచ్చితంగా అస్పృశ్యులకు వర్తించే షరతులపైనే 1933, జనవరి 1వ తేదీన గాని అంతకు ముందుగాని అస్పృశ్యుల కొరకు ఆ దేవాలయం తెరవక పోయినట్లైతే, కేలప్పన్ తిరిగి దీక్షను పట్టవలసి వస్తే , నాపరువుకు పణంగా నేను కూడా ఆయనతో బాటు దీక్ష వహించడం తప్పనిసరి అవుతుంది.

రాజా లొంగి రాలేదు. దీనికి ప్రతిగా చేసిన పత్రికా ప్రకటనలో యిలా అన్నాడు:

"అవర్ణులకోసం దేవాలయాలను తెరవమని చేస్తున్న వివిధమైన విజ్ఞాపనలు అందులోవున్న యిబ్బందులను తగినంతగా అవగతం చేసుకోనట్టివి. దేవాలయ ప్రవేశ ఉద్యమ మద్దతుదారులు కోరుతున్నట్లుగా గురువాయూరు గుడిలోనికి అవర్ణులను అనుమతించడానికి నాకు అధికారంవుందని అనుకోవటానికి ఏ ఆధారమూ లేదు."

ఈ పరిస్థితులలో గాంధీ ఉపవాస దీక్షాబద్ధుడు కావడం అనివార్యమైంది. కానీ గాంధీ దీక్ష వహించలేదు. ఆయన తన వాదం మార్చుకున్నాడు. దేవాలయంవున్న పొణ్ణని తాలూకాలో రెఫరెండం తీసుకోవాలని, ఆ రెఫరెండంలో అస్పృశ్యుల దేవాలయ ప్రవేశానికి అధిక సంఖ్యాకులు వ్యతిరేకతను కనపరిస్తేతాను దీక్ష వహించడం ఆపుతానని ఆయన అన్నాడు. దీని ప్రకారం ఒక రెఫరెండంజరిపారు. నిత్యం గుడికి వెళ్లేవారికి వోటింగు పరిమితం చేశారు. గుడి ప్రవేశానికి అర్హత లేనివారిని, గుడికి వెళ్లనివారిని వోటర్ల జాబితా నుండి తొలగించారు. గుడి ప్రవేశానికి అర్హత వున్న వారిలో 73 శాతం పాల్గొన్నట్టు నమోదు అయింది. గుడి ప్రవేశానికి అనుకూలంగా

56 శాతం, వ్యతిరేకంగా 9 శాతం, తటస్థంగా 8 శాతం వుండగా, 27 శాతం మంది వోట్లు వెయ్యకుండా తప్పుకున్నారు.

రెఫరెండం ఫలితాన్ని బట్టి గాంధీ దీక్షను ప్రారంభించి తీరవలసి వున్నది. కాని ఆయన ప్రారంభించలేదు. దానికి బదులు 1932 డిసెంబరు 29వ తేదీన ఆయన యిచ్చిన పత్రికా ప్రకటనలో ఈ విధంగా ముగించారు.:

"దేవాలయ ప్రవేశాన్ని గురించి డా. సుబ్బారాయన్ మదరాసు శాసనపరిషత్తులో ప్రవేశ పెట్టదలచిన బిల్లుకు అనుమతి యిచ్చే విషయాన్ని వైస్రాయ్ నిర్ణయం జనవరి 15కు ముందు ప్రకటించే అవకాశం లేదని అధికార ప్రకటన వెలువడింది. అందుచేత కొత్త సంవత్సరంలో రెండవ రోజు నుంచీ ప్రారంభించాలని ఉద్దేశించిన ఉపవాస దీక్షను నిరవధికంగా వాయిదా వేశాను. కనీసం వైస్రాయ్ నిర్ణయం ప్రకటించే తేదీ వరకు యిది వాయిదా పడుతుంది. ఈ వాయిదాకు కేలప్పన్ సమ్మతించారు."

గాంధీ పేర్కొన్న వైస్రాయ్ తీర్పు శాసన సభలో దేవాలయ ప్రవేశపు బిల్లులను ప్రతిపాదించే విషయమై వైస్రాయ్ గారు తమ మంజూరును అనుమతించడానికి లేదా తిరస్కరించడానికి సంబంధించినది. వైస్రాయ్ సదరు అనుమతిని యిచ్చారు. అయినా గాంధీ దీక్ష వహించలేదు. ఆయన దీక్ష పట్టలేదు సరికదా అది అంత ముఖ్యమైన సంగతి కానట్లు ఆ విషయమే పూర్తిగా మరిచిపోయారు. ఈ రోజుకూ అస్పృశ్యులకు ఈ గుడి మూసివున్నా, గురువాయూరు దేవాలయ సత్యాగ్రహం ఊసు మళ్లీ ఎవరూఎత్తలేదు.

## V

గురువాయూరు కధ ఆ విధంగా ముగిసింది. మరో కార్యక్రమమైన దేవాలయ ప్రవేశ శాసన యత్నాల గురించి యిప్పుడు చెబుతాను. ఉన్న చాలా వాటిలో రంగయ్యర్ పేర కేంద్ర శాసన సభలోవున్న బిల్లు ఒక్కటే అట్టిపెట్టుకొని మిగతావి వదులుకున్నారు. బిల్లు పుట్టుక సమయంలోనే ఒక తుఫాను చెలరేగింది. అప్పుడున్న భారత ప్రభుత్వ చట్టం ప్రకారం మతానికి గానీ, మతాధారంగా వున్న ఆచార అనుష్ఠానాదులకు గాని ప్రమేయమున్న ఏ శాసనమూ, గవర్నరు జనరల్ మంజూరువుంటే తప్ప, శాసన సభలో ప్రవేశ పెట్టరాదు. ఆ బిల్లును అట్లా మంజూరుకు పంపినపుడు గవర్నరు జనరల్దానిని తిరస్కరించ బోతున్నారన్న వార్త బాగా ప్రచారమై మరొక సంచలనం సృష్టించింది. ఈ వార్తలకు గాంధీ గణనీయంగా కలవరపడ్డారు. 1933 జనవరి 21 న చేసిన పత్రికా ప్రకటనలో గాంధీ యిలా అన్నారు:

" రాబోయే వైస్రాయ్ నిర్ణయాన్ని గురించి ఈ వార్త తెలివైన అంచనా అయితే అది విషాదకర మైనదని మాత్రం చెప్పగలను. ఈ శాసనం వెనక ఎలాంటి రాజకీయ వుద్దేశం వుందని అన్నా నేను ముమ్మూర్తులా ప్రతిఘటిస్తాను. న్యాయస్థానాల తీర్పుల వల్ల సందేహాస్పదంగా వున్న ఒక ఆచారం చట్టంగా కరుడు కట్టింది. అందువల్ల గానీ లేకపోతే ఏ శాసన ప్రయత్నమూ అవసరంలేదు. మత విషయాలలో ప్రభుత్వ జోక్యాన్ని సహించరాని ఒక చికాకుగా నేనే భావిస్తాను. కానీ ఈ సందర్భంలో చట్టపరమైన ఒక అడ్డంకిని తొలగించడానికి శాసనం ప్రాణావసరమైంది. నాకు తెలిసినంతవరకూ యిది ప్రజా సంకల్పానికి

అనుగుణంగా వుంటుంది కనుక విరుద్ధ అభిప్రాయాలున్న వర్గాల మధ్య ఘర్షణ వచ్చే ప్రశ్నే లేదు."

ప్రభుత్వ నిర్ణయాన్ని 1933 జనవరి 23న ప్రకటించారు. మదరాసు పరిషత్తులోని డా. సుబ్బరాయన్ యొక్క దేవాలయ ప్రవేశపు బిల్లుకు విల్లింగ్టన్ ప్రభువు మంజూరు నిరాకరించారు. కానీ ఆయన రంగయ్యార్ యొక్క అస్పృశ్యతా నివారణ బిల్లును కేంద్ర శాసన సభలో ప్రవేశ బెట్టడానికి అనుమతించారు. తాము ఎలాంటి దృక్పథం అవలంబించాలి అని తేల్చుకునేముందు, హిందువుల అభిప్రాయాన్ని తెలియవలసిన అవసరం వుందని ప్రభుత్వం నొక్కి చెప్పింది. గవర్నరు జనరలు, భారత ప్రభుత్వం కూడా ఒక విషయం స్పష్టం చేయదలచినట్టు కూడా ఆ ప్రకటన తెలిపింది. అదేమంటే ఆ బిల్లుకు ప్రమేయమున్న యావన్మంది కూడా శాసన సభ లోపల, వెలుపల దాని అన్ని అంశాలను సంపూర్ణంగా పరిశీలించిన తరువాతనే దానిని చర్చకుతీసుకు రావడం అత్యావశ్యకం అని అందుచేత ప్రజాభిప్రాయాన్ని రాబట్టే నిమిత్తం బిల్లుకు చాలా విస్తృతంగా ప్రచారం యిస్తేనే ఈ ఆశయం నెరవేరుతుంది. అయితే కేంద్ర శాసన సభలో ప్రవేశానికి మంజూరు యిచ్చినంత మాత్రాన బిల్లులో వున్న ఆశయాలకు అంగీకారాన్నో, మద్దతునో యివ్వడానికి ప్రభుత్వం బాధ్యత వహించదని కూడా అర్థం చేసుకోవాలి. ఆ మరునాడు యిచ్చిన పత్రికా ప్రకటనలో గాంధీ యిలా అన్నారు:-

"ఇందులోవున్న దైవ ప్రమేయాన్ని కనుక్కోవడానికి నేను ప్రయత్నించాలి. ఆయన నా అంతరాంతరాలను పరీక్షించ దలిచారు. అఖిల భారత బిల్లుకు యిచ్చిన మంజూరు హిందూ మతానికీ, సంస్కర్తకూ అనుకోకుండా వచ్చి పడ్డ సవాలు. సంస్కర్త సత్యసంధుడైతే హిందూ మతం దాని మానాన అది మనగలదు. ఈ విధంగా చూస్తే భారత ప్రభుత్వ నిర్ణయాన్ని దైవదత్తంగా స్వీకరించాలి. అది సమస్యను తేటరుస్తుంది. ఇప్పుడు భారత దేశంలో జరుగుతున్న నైతిక పోరాటంయొక్క ప్రచండ ప్రాముఖ్యతను యిది దేశానికీ, ప్రపంచానికీ తెలియ పరుస్తుంది. సనాతనవాదులు ఏది నిర్ణయించినప్పటికీ దేవాలయ ప్రవేశోద్యమం యిప్పుడు దక్షిణాది చివరనవున్న గురువాయూరు నుంచి ఉత్తరాన ఉన్న హరిద్వార్ వరకూ వ్యాపిస్తుంది. వాయిదాపడ్డ నా ఉపవాస దీక్ష యిప్పుడు ఒక్క గురువాయూరు పైననే కాక అలవోకగా అన్ని దేవాలయాలపైనా ఆధారపడుతుంది."

ఈ బిల్లు తన శాసన జీవితాన్ని ఎంత ఆర్భాటంతో ప్రారంభించిందో పాఠకుడీపాటికి గ్రహించి వుండాలి. 1932 మార్చి 24న శాసన సభలో రంగయ్యరు లాంఛనంగా ఈ బిల్లును ప్రవేశ పెట్టారు. అది గాంధీ బిల్లు కనుక శాసన సభ కాంగ్రెసు సభ్యులు దానిని బలపరచడానికి ఎట్లాగూ సిద్ధంగా వున్నారు. ఈ బిల్లు సుఖ ప్రయాణం చేసేందుకుగాను కాంగ్రెసేతర సభ్యులతోమద్దతు పొందడానికి రాజగోపాలాచారిని, జి.డి. బిర్లాను గాంధీ నియమించారు. తనకంటే వాళ్ళు బాగా లాబీ చేస్తారని ఆయన అన్నారు. ఈ బిల్లు శాసనమండలికి విరుద్ధమని బిల్లు ప్రతిపాదనను కొల్లెంగోడు రాజా, ధంపన్ ఒకప్రాథమిక అభ్యంతరంలో వ్యతిరేకించారు. అధ్యక్షులు ఈ అభ్యంతరాన్ని త్రోసిపుచ్చారు. బిల్లు ప్రవేశానికి సభ అనుమతించింది. జులై 30వ తేదీలోగా ప్రజాభిప్రాయ సేకరణ నిమిత్తం దేవాలయ ప్రవేశపు బిల్లును ప్రచారంలో పెట్టవలసిందిగా ఆ తరువాత రంగయ్యార్ ప్రతిపాదించాడు. ఈ బిల్లు ప్రచారాన్ని వ్యతిరేరించిన రాజా బహదర్ కృష్ణమాచారి, తలపెట్టిన శాసనాన్నిబహు కఠినంగా ఖండించారు. చివరగా

ఆయన అభిప్రాయసేకరణ తేదీ జులై 31 కాక డిసెంబరు 31 వరకు వుండాలని అర్థించారు. అభిప్రాయ సేకరణ ప్రతిపాదనను గుంజాల్ వ్యతిరేకించి బిల్లును బలపరచవద్దని సభను కోరాడు. అప్పటికే సాయంత్రం 5 గంటలు అయినందువల్ల , యింకా పొద్దు పోయి కూర్చునేందుకు అధ్యక్షులు సభ అంగీకారాన్ని కోరారు. కాని తిరుగులేని అధికృత రానందువల అధ్యక్షులు సభను వాయిదా వేశారు. ఆ విధంగా సభ శిశిర ఋతు సమావేశాలకు బిల్లు వాయిదా పడింది.

కేంద్ర శాసన సభ శిశిర ఋతు సమావేశంలో 1933 ఆగస్టు 24న బిల్లు చర్చకు వచ్చింది. బిల్లుపై ప్రజాభిప్రాయ సేకరణ ప్రతిపాదనను బలపరుస్తున్నామంటే దానిలో వున్న అంశాలకు మద్దతు యిస్తున్నట్లుగా ఏవిధంగానూ భావించరాదని ప్రభుత్వం తరపున సర్ హేరీ హేగ్ వివరించారు. ప్రభుత్వం దళితవర్గాలంటే సానుభూతిలో వుందని, వారి సామాజిక, ఆర్థిక అభ్యున్నతికి తమ శక్తికొలది పాటుపడటానికి ఆతృతగా వున్నమాట నిజమనీ ఆయన అన్నారు. ప్రభుత్వ దృక్పథాన్ని సమగ్రంగా వివరించిన గత జనవరినాటి ప్రభుత్వ పత్రం నుంచి ఆయన వుదహరించారు. సాధ్యమైనంత విస్తృతప్రచారం సాధించడానికి జూన్ నెలాఖరు సబబైన వ్యవధి అని ఆయన అభిప్రాయపడ్డారు. ఇక అభిప్రాయ సేకరణ గుడికి వెళ్ళే హిందువులకు పరిమితం చేయటం విషయమై ఆచరణ దృష్ట్యా అది సాధ్యం కాని విషయమని సర్ హేరీ హేగ్ అన్నారు. హిందువులలో అన్నీ వర్గాల ప్రజలు క్షుణ్ణంగా చర్చించాలని ప్రభుత్వం భావించింది కనుక శర్మ చేసిన సవరణను బలపరచడానికి ప్రభుత్వం సిద్ధమయింది. 1934 జూన్ నెలాఖరు వరకు బిల్లును అభిప్రాయ సేకరణకు పంపే శర్మ ప్రతిపాదనను సభ ఆమోదించి చర్చ ముగించారు.

యథావిధిగా అభిప్రాయాలు వచ్చిపడ్డాయి. ఒక వెయ్యి తావులకు మించిన పెద్ద గ్రంథమే అయ్యింది. తరువాత దశకు అంటే సెలక్ట్ కమిటీ నియామకం ప్రతిపాదించటానికి బిల్లు సిద్ధమయింది. అలాంటి ప్రతిపాదనకు రంగయ్యర్ నోటీసు కూడా యిచ్చాడు. అప్పుడొక వింత జరిగింది. శాసన సభను రద్దుచేసి కొత్తగా ఎన్నికలు జరపాలని భారత ప్రభుత్వం నిర్ణయించింది. ఈ ప్రకటన ఫలితంగా రంగయ్యర్ బిల్లు ఎడల కేంద్ర శాసన సభలోని కాంగ్రెసు సభ్యుల దృక్పథం హటాత్తుగా మారింది. విడిగాను, మూకుమ్మడిగానూ కూడా బిల్లుకు ఎదురు తిరిగి తరువాత ఎటువంటి మద్దతు యివ్వడానికీ నిరాకరించారు. వోటర్లంటే వాళ్లకు ఒణుకు పుట్టింది. రంగయ్యర్ పరిస్థితి చాలా దయనీయంగా వుంది. తన స్థితిని పళ్లు పటపట కొరుకుతూ ఆయన వర్ణించారు. ఆ భాషలోనివిషాన్ని యింకా గరళం చేయడం సాధ్యం కాదు. తన పరిస్థితిని ఆయన చాలాబాగా చిత్రించాడు గనక ఆయన ఉపన్యాసంలో నుంచి క్రింది భాగాల్ని తిరిగిరాయడానికి నేను క్షమాపణలు చెప్పను. ప్రతిపాదించడానికి లేచి రంగయ్యర్ యిలా అన్నాడు:-

"అధ్యక్షా , దళిత వర్గాలని పిలవబడుతున్నవారి అనర్హతను తొలగించడానికి ఉద్దేశించిన దేవాలయ ప్రవేశపు బిల్లుగా చెలామణీ అవుతున్న బిల్లును ప్రతిపాదిస్తున్నాను."

అధ్యక్షా నా ప్రతిపాదన యిది:-

'దళిత వర్గాలుగా పిలవ బడుతున్నవారికి హిందూ దేవాలయాల ప్రవేశానికిగల అనర్హతలను తొలగించడానికి ఉద్దేశించిన ఈ బిల్లును గౌరవనీయ సర్ నృపేంద్ర సర్కార్,

గౌరవనీయ సర్ హెన్రీ క్రేక్, భాయి పరమానంద్, రావు బహదుర్ యం.సి.రాజు, బి.యస్. రామకృష్ణారెడ్డి, రావు బహదుర్ టి.యల్. పాటిల్, మరియు ఈ ప్రతిపాదకునితో గల ఒక సెలెక్ట్ కమిటీకి నివేదించవలసిందిగా',

"మీ అనుమతిస్తే ఒక పక్షం రోజులలో నివేదించమని ఆదేశాలతో అన్నమాటలను తొలగించి ప్రతిపాదనలోని మిగతా భాగాన్ని కొనసాగిస్తాను."

'కమిటీ సమావేశానికి హాజరకు అవసరమయ్యే సభ్యుల సంఖ్య 5గురని.'

"అధ్యక్షా, ఈ ప్రతిపాదనకు నేను నోటీసు యిచ్చిన సమయంలో ఓ పక్షంరోజుల్లో మనం అగమ్యం పాలవుతామని నేనను కోలేదు. బిల్లును సెలెక్ట్ కమిటికి పంపించడానికి కూడా సమయం చాలదు కనుక ఈ ప్రతిపాదన పరిమితిని నేను గుర్తిస్తున్నాను. అయితే ఈ విషయమై మన అభిప్రాయాలు తెలపడానికి యిదొక అవకాశం యిస్తున్నదని గుర్తిస్తున్నాను."

"సత్యమూర్తికి నేను క్షమాపణలు చెప్పుకోవలసి వుందని యిది వరకే అన్నాను. ఆయన ధారాపాతంగా తన ఉపన్యాసాన్ని కొనసాగిస్తుండగా అయనను మధ్యలో అపి నేను పూర్తి వివరణలో యిచ్చే స్థితిలో సహజంగానే లేను. నేను ఆవిధంగా చేసివుంటే ఆయనకు అన్యాయం జరిగివుండేది. దేవాలయప్రవేశ బిల్లుకు ఏనాడూ అనుకూలంగా లేని సత్యమూర్తి కాంగ్రెసు వారితో తిలోదకాలిప్పించడంలో సఫలుడయ్యాడని గుర్తిస్తున్నాను. ఆగస్టు 16వ తేదినాటి మదరాసు "హిందూ" పత్రిక నుంచి సి.రాజగోపాలా చారియార్ యిచ్చిన లిఖిత ప్రకటనను నేను చదువుతాను. హిందూ చాలా బాధ్యతాయుతమైన వార్తా పత్రిక. ఇది లిఖిత ప్రకటనేగాని తంతి రూపంలో వున్న యింటర్వ్యూ కాదు గనుక రాజగోపాలాచారియార్ ప్రకటన సరిగా వున్నట్టు భావించ వచ్చుననుకుంటాను. అంటరానివారి సమస్యను తాను గాలికి వదిలేసినందుకు ఆయన ప్రజలకు క్షమాపణ చెబుతున్నారు. ఆయన గాంధీ మహాత్ముడికి ప్రధానమైన అనుయాయి గనుక ఆయన వెన్నుపోటును సభా పత్రాలలో వుంచాలి. ఆయన యిలా అన్నారు:"

"మత విధుల ఆచరణ విషయంలో శాసనపర జోక్యానికి కాంగ్రెసు మద్దతు వుండదని కాంగ్రెసు అభ్యర్ధులు హామీ యిస్తారా అని కొందరు సనాతనులు అడుగుతున్నారు. ఆయా విషయాలలో ఆసక్తివున్న వ్యక్తులు, బృందాలు వివిధమైన అంశాలపైన యిలాంటి ప్రశ్నలే అడగవచ్చు. అయితే యిలాంటి ప్రశ్నలను కాంగ్రెసు అభ్యర్థులనే అడగటం మిగతా పార్టీలను గానీ, స్వతంత్ర అభ్యర్థులను గానీ వీటిపై స్పష్టీకరణ యిప్పించుటకు ప్రయత్నించక పోవటం, కాంగ్రెసుకు యిస్తున్న గొప్ప నివాళి."

"ఇలా అంటున్నారు శ్రీమాన్ రాజగోపాలచారియార్. ఈ శాసనానాకి మనం ఉమ్మడి మద్దతు సాధించాలి అని ఢిల్లీలో అనేక సార్లు నన్ను కలిసి చెప్పి, తనఅల్లుడు దేవీదాస్ గాంధీతో కలిసి నా యింటివద్ద ధర్నాకు కూర్చున్న ఈఘనత వహించిన కాంగ్రెస్ నాయకుడు ప్రజలు తమకందించిన నివాళిపైన భరోసావుంది, అంత ప్రజాకర్షకం కాని ఈ శాసనానికి ప్రజాభిప్రాయాన్ని అనుకూలంగా మళ్ళించడంపోయి, ఇప్పుడు ఈ పెద్దమనిషి, షేక్స్పియర్ భాషలో చెప్పాలంటే, ఎండ్రకాయలాగా వెనక్కు నడుస్తున్నాడు. ఒక విశాలావరణంలోని వివిధ సమస్యలపైన రాజకీయ పక్షాలకు విలక్షణమైన విధానాలు వుంటాయని, అయితే

అవన్నీ ఒక్కసారిగా ఎన్నికల సవాళ్లుగా వుండవని ఈ దక్షిణాది సునిశిత మేధావి సంజాయిషీ చెబుతున్నారు."

"అధ్యక్షా, తాను రెచ్చగొట్టిన ప్రజాభిప్రాయాన్ని ఎదుర్కోడానికి తానే భయపడుతున్నాడు ఈ కాంగ్రెసు నాయకుడు."

"అధ్యక్షా, కాంగ్రెసు వాదులు బానిసలా" "పతితుల, బడుగుల పక్షాన మాట్లాడడానికి భయపడేవారు బానిసలు."

" మిల్టన్ ఉవాచ: అన్నది అనలేదని వాదించేవాడు అబద్ధాల కోరు కాదు, పిరికి పంద......' సాధారణ ఎన్నికలకు చాలా కాలం ముందు నుంచి ప్రతివేదిక మీదా ఆయన అన్న ఈ క్రింది మాటలను రాజగోపాలా చారియార్ యిప్పుడు కాదంటున్నారు." సుస్పష్టమైన రాజకీయ సమస్యల గురించే కాంగ్రెసు అభ్యర్థులు వోటర్లవద్దకు వెళతారు.".

"అంటే అర్థం, ప్రజానీకాన్ని తామే తప్పుదోవ పట్టించి మళ్లీ వాళ్ల దురభిమానాల్ని ఎగసన దోస్తూ వోటర్ల వద్దకు వెళుతున్నారు. పోయి పోయి తాము బురదలో కూరుకుంటున్నారు. ఈ బురద నుంచి వారిని బయట పడవేసి రక్షించడానికి విల్లింగ్‌టన్ ప్రభువు శాసన సభ రద్దును ప్రకటించారు. ఆ విధంగా రాజ్యాంగ బద్ధత అనే చల్లటి దారులవెంట వెళ్లడానికి రాజ్యాంగ బద్ధుడైన వైస్రాయ్ వారికొక అవకాశం యిచ్చారు. అందుచేత తమ విశ్వాసాల నుంచి బహుదూరంగా పారిపోయి సాధ్యమైనంత ఎక్కువ సంఖ్యలో శాసన సభకు తిరిగిరావటానికి ఎన్నో కుయుక్తులు పన్నుతున్నారు. అస్పృశ్యతా సమస్యకు దేవాలయ ప్రవేశం బిల్లుకు వాళ్లు జతకడితే అవి ప్రజాకర్షకం కావు కనుక చాలా వోట్లు కోల్పోతారు. గాంధీ మహాత్ముడు నన్ను బహిరంగంగా ఆ సమయంలో వ్యతిరేరించినా నేనీమాట చెప్పాను. మలబారు పాల్‌ఘాట్‌లో నా సోదరుడి గృహంలో శంకరాచార్యులు విడిది వున్నప్పుడు కూడా నేనీమాట చెప్పాను."

" బిల్లును వ్యతిరేకిస్తూ వైస్రాయ్ దర్శనార్థం నా సోదరుడు వచ్చాడు. మలబారులో అధిక సంఖ్యాబలం సంస్కర్తకు లేదని, నాకు తెలుసని చెప్పాను. మరెక్కడా కూడా సంస్కర్తలకు అధిక సంఖ్యాబలం వుండదు. కాకపోతే తమ ఆలోచనల వైపుకు అధిక సంఖ్యాకులను మళ్లించాలని చూస్తారు. మలబారు గురువాయూరులో కాంగ్రెసు వాదులు తీసుకున్న రెఫరెండం ఫలితం ఏమైనప్పటికీ అంటరానివారికి దేవాలయాల్లో ప్రవేశం కల్పించే విషయంలో గుళ్ళకు వెళ్లే భక్తులలో అధిక సంఖ్యాకులు అనుకూలంగా వుంటారని నేను పిసరంత కూడా నమ్మనని చెప్పాను. కానీ వాళ్లతో పోట్లాడటానికి నేను సిద్ధంగా వున్నాను. వాదించి ఒప్పించడానికీ సిద్ధంగా వున్నాను. అంటరానివారు నా జాతిలో భాగంగా భావిస్తాను కనుక వారి విషయంలో వారి క్షేమం విషయంలో ప్రజలలో ఆసక్తి కలిగించేందుకు సిద్ధంగా వున్నానని అప్పుడు చెప్పాను. అధ్యక్షా, మతం పేరుతో నా జాతిలో మూడో భాగం ప్రజ బహిష్కృతిలో మునిగివుంటే, ఆ జాతి మనుగడకే హక్కులేదని నేనెల్లప్పుడూ భావించాను, చెప్పాను. వేదకాలంలో అస్పృశ్యత అనేది ఎవరూ ఎరగని సంగతని, అట్లాంటి జాతి సమైక్యత సాధించాలని ఈ ధ్యేయంతో వారి వికాస ఉద్యమాన్ని చేపట్టాను. నిన్నటివరకు అస్పృశ్యతను గురించి జంధ్యాలు తెంపుకున్న కాంగ్రెసు వాదులు ఈ రోజున ఎందుకు తాము వూసు ఎత్తడంలేదో సంజాయిషీ యివ్వడం చూస్తున్నాను. దేశంలోని సనాతనవాదుల బృందాలకు

ప్రతినిధులైన రాజా బహదర్ కృష్ణమాచారియార్, కొల్లెంగోడు రాజాసాహెబ్, లేదా సర్ సత్యాచరణ్ ముఖర్జీ వంటి వారు దేవాలయ ప్రవేశపు బిల్లు యొక్క శవపేటికలో ఆఖరు మేకును రాజగోపాలాచారియార్ కొట్టారని భావిస్తున్నారు.

"వేరే ఏ యితర సమస్య మీద" అంటే అర్థం దేవాలయ ప్రవేశపు సమస్యమీద ఎన్నికలలో పోరాడి గెలవమని తమకెవ్వరూ చెప్పడం లేదని రాజగాపాలాచారియార్ అంటున్నారు. కేవలం రాజకీయ బ్రిటిషు విద్వేష సమస్యపైనే ఎన్నికలకు నిలబడతారు. ప్రజల సానుభూతిని నిర్లజ్జగా వాడుకొని దానికి సాధ్యమైనంత జాతి వైషమ్యాన్ని రంగరించి అహింస పేరుతో, ఎందుకూ మతం పేరుతోనే ఎందుకంటే అహింసకు అప్పుడప్పుడు మతం రంగుకూడా పులిమరుగా - ఆ అంశంపైనే ఎన్నికలలో పోరాడుతారు. అపనమ్మకంతో దేశవాతావరణాన్ని కలుషితంచేసి, అస్పృశ్యతా నివారణలాంటి గురుతరమైన,పరిశుభ్రమైన, ఉన్నతమైన సమస్యమీద పోరాడితే తమకు మాట దక్కదని తెలిసి సమస్యను కప్పదాటు వేస్తున్నారు, విశ్వాసం నుంచే పలాయనమవుతున్నారు."

"ఇద్దరు ముగ్గురు సాయంతోనైనా న్యాయం కోసం సాహసించనివారు బానిసలు."

" ఇంకా గాంధీజీ ప్రధాన అనుయాయి అయిన ఈ పెద్దమనిషి ఏమంటున్నాడంటే : ఎన్నికలలో గెలుపు లభిస్తే, వేరే ఏ ఇతర సమస్య గురించైనా ప్రజల ఆమోదాధికారం తమకు లభించిందని వాళ్లు నమ్మలేరు."

"అంటే అర్థం ఏమిటి? దేవాలయ ప్రవేశపు బిల్లుకు ప్రజల ఆమోదాధికారం (మాండేటు) వాళ్లకు లభించడం లేదు. మద్దతు అర్థిస్తూ అరుచుకుంటూ మా వాకిటి వద్దకు వచ్చిన ఈ పెద్ద మనిషి కాంగ్రెసు క్షేమం కోసం యాచన చేసిన వీరు, ఒక్క అస్పృశ్యుల క్షేమాన్ని మాత్రమే బలిపెట్టడం లేదు. మహాత్ముడి నీతిసూత్రాలనే బలి పెడుతున్నారు. ఎందుకంటే మనకు తెలుసు, కమ్యూనల్ అవార్డు విషయంలో రాయితీ యివ్వడం ద్వారా అంటరానివారి అభ్యున్నతి సాధించాలనే ధ్యేయంతో మహాత్ముడు ఉపవాస దీక్ష చేశాడు. కానీ కమ్యూనల్ అవార్డు తిరస్కరించడానికి కాంగ్రెసు సహజంగానే వెనకాడింది. ఎందుకంటే దానికి అస్పృశ్యతా సమస్యతో ప్రత్యక్షమైన లంకెవుందని మనకు తెలుసు. దీనిని కదిలించడానికి, కదిలించి పరిష్కరించడానికి మహాత్ముడు, ఆ మహానుభావుడు దేశమంతా పర్యటించాలనుకున్నాడు. కౌన్సిళ్లను బాయికాట్ చేయాలనుకున్న కాంగ్రెసు కౌన్సిళ్లలో దూరడానికి యత్నించడం ద్వారా మొదటిసారి మహాత్ముణ్ణి వంచించింది. ఇప్పుడేమో ప్రజల ఆమోదాధికారం లేకుండా అస్పృశ్యతా సమస్యను, దేవాలయ ప్రవేశపు బిల్లును ముందుకు తీసుకుపోమని చెబుతూ స్వయంగా ఆయన వియ్యంకుడి సాయంతోనే ఆయనను రెండనసారి వెన్నుపోటు పొడిచింది కాంగ్రెసు ఈనాడు!.

అధ్యక్షా, రాజా బహదర్ కృష్ణమాచారియార్‌కి శ్రీమాన్ రాజగోపాలాచారియార్‌కి భేదం ఎక్కడుందని అడుగుతున్నాను. రాజాబహదర్ కృష్ణమాచారియార్ ఎప్పుడూ ఒప్పుకుంటూనే వున్నారు. ప్రజల ఆమోదాధికారం తీసుకొని వచ్చి శాసనం చేయమని. అధ్యక్షా, ఆయన పిరికి వాడు కాదు. సనాతనవాది అయివుండి పరిస్థితిని ఎదుర్కోడానికి సిద్ధపడుతున్నాడు. ఇక వీళ్లేమో, సనాతన ధర్మం చిరంతన సత్యం అనేమాట మరిచి పోయి, దేశం ఆవైపునుంచి ఈవైపు వరకు సనాతన వాదుల్ని శిలువ వేస్తున్నారు. సనాతనధర్మం చిరంతన సత్యం

కనుక, సత్య వంచన యిలాంటి నయవంచకులకే చెల్లుతుంది. వీళ్ల వర్తనను సనాతన వాదులే హర్షించరు. జాతీయగమ్యం వైపుకు మనల్ని నడిపించే అనేకానేక నీతి సూత్రాలకి తిలోదకాలిచ్చిన వీళ్లు, తమ మానం దక్కించుకోవడానికి మాత్రమే అంటరానివారి విషయం చేపట్టారు. అంతేగానీ వారికే ధర్మబద్ధత లేదని యిప్పుడు మనం చూస్తున్నాం. ఒక్క గాంధీ మహాత్ముడిని మినహాయించి, కాంగ్రెసు పక్షాన రాబోయే ఎన్నికల నిర్వాహక ప్రధాని అయిన రాజగోపాలాచారియర్ ద్వారా మిగతా కాంగ్రెస్ నాయకమాన్యులు ఏమంటున్నారో చూడండి:

" ఎప్పటికైనా దానిని అధికార కాంగ్రెస్ బిల్లుగా స్వీకరించే ముందు యధావిధిగా దానిని పరిశీలించడానికి కాంగ్రెస్ వాదులందరికీ స్వేచ్ఛవున్నది".

అంటరానివారి విషయంలో జరిగిన ఈ ఘాతుకాన్ని ప్రతిఘటించేందుకు రాజ్యాంగ బద్ధులైన హిందువులు, ముసల్మానులూ కూడా సంఘటితమవుతారని ఆశిస్తున్నాను. మత విషయాల మీద తరువాత వాళ్ళు విభేదించుకోవచ్చు. కానీవాళ్ళు ఐక్యమై సంకుల సమరంలో కాంగ్రెస్‌తో తలపడతారు, ఆ ముసుగు దొంగ సంస్థను కాళ్ళబేరానికి తెస్తారు. అధ్యక్షా, అస్పృశ్యుల, దళిత వర్గాల శ్రేయస్సు యిక్కడ వంచన పాలయింది. గాంధీ మహాత్ముడు ఈ ఉద్యమాన్ని చేపట్టక ముందునుంచీ, రాజగోపాలాచారియార్ ఢిల్లీలో యింటింటికి తిరగక ముందు నుంచీ ఈ ఉద్యమంలో నాకు విశ్వాసమే లేకపోతే ఈ బిల్లును ప్రతిపాదిండానికి నేనిక్కడ వుండేవాడినే కాదు.

## VI

వైభవం నుంచి వెనుకంజ వేసిన సందర్భమిది ! పైగా ఎంత పరువు తీసిన వెనుకంజ? గాంధీకి ఎలా అనిపించింది? 1932 నవంబరు 4న జారీ చేసిన ప్రకటనలో గాంధీ యిలా అన్నారు:-

"తమ సంకెళ్ళ విరిగి పడాయని తోటి గ్రామస్తులకు తాము ఏవిధంగానూ తీసిపోమని, ఒకే దైవానికి తామంతా ఆరాధకులమని, మిగతా వారు అనుభవిస్తున్న హక్కులకూ, సదు పాయాలకు తాము కూడా వారసులమని పల్లెలలోని అస్పృశ్యులు భావించేలా చేయాలి.

ఒప్పందంలోని ప్రాణాధారమయిన ఈ షరతును సవర్ణులు నెరవేర్చకపోతే, దైవానికి, మనిషికీ ఎదురు పడి ముఖం చూపించడానికి నేను బతికి వుండగలనా? ఒప్పందపు షరతులను సవర్ణులు పాటించేందుకు తనను బందీగా పట్టివుంచాలని అణగారిన సమాజానికి చెందిన డా.అంబేద్కర్, రావు బహదుర్ యం.సి. రాజా తదితర మిత్రులకు కూడా చెప్పే సాహసం చేశాను. ఉపవాసదీక్షంటూ వహిస్తే, అది సంస్కరణకు వ్యతిరేకులైన వారిని రగిలించి రంగంలో దింపడానికి మాత్రమే. తమ ప్రమాణాలను వారు త్రోసిపుచ్చినా హిందూమతం ముసుగు క్రింద వాటిని జీవితాంతం పాటించే ఉద్దేశం కనపరచక పోయినా, నాకు జీవించాలనే ఆశ మిగిలి వుండదు."

ఇట్లా మళ్లీ మళ్లీ చెప్పడానికి ఆయన ఎన్నడూ అలసిపోలేదు. హిందూ దేవాలయాల నుంచి అంటరాని వారిని వెలివేయటం తనకు "ఆత్మవేదన" కలిగిస్తున్నదని ఆయన వరించారు. అయితే దీనికి ఆయన చేసింది ఏమిటి? ఈ సంస్కరణ జరగక పోతే తనకు

జీవించే ఆశ లేదన్నవాడు రాజగోపాలాచారి చేసిన ద్రోహానికి ఆగ్రహించాడా? ఎన్నికలలో విజయం సాధించడానికి కాంగ్రెస్ పార్టీచేసిన ఈ ద్రోహాన్ని ఆయన అధిక్షేపిస్తాడని అందరూ అనుకుంటారు. కాని దీనికి వ్యతిరేకం జరిగింది. రాజగాపాలాచారిని నిందించడానికి బదులు, బిల్లుకుమద్దతు ఉపసంహరించిన కాంగ్రెస్ పార్టీని తీవ్రంగా తిట్టిపోశాడని ఆయన రంగయ్యర్‌నే నిందించాడు. **1934** ఆగస్టు **31** నాటి హరిజన్ సంచికలో గాంధీ చెప్పింది యిది:

"జాతకం బాగోని దేవాలయ ప్రవేశపు బిల్లుకు మరణమే తప్పనిసరి అయితే, బిల్లు ప్రతిపాదకుడు జరిపించినదాని కంటే ఎక్కువ గౌరవప్రదంగా దానికి శ్రాద్ధకర్మలు జరగి వుండాల్సింది. సంస్కర్తల తరఫున, సంస్కర్తలు ప్రోత్సహించిన బిల్లు కాదది. అందుచేత ప్రతిపాదకుడు సంస్కర్తలను సంప్రదించి వారి ఆదేశాలను నిర్వర్తించవలసి వున్నది. కాగా నాకు తెలిసినంతవరకు, ఆయన తన ఆగ్రహానికి తానే లొంగిపోవడానికి, కాంగ్రెస్ వాదుల ఎడల ఆయన కనపరిచిన మనస్తాపానికి సందర్భమే లేదు. **1932** సెప్టెంబరు **25**న పండిత మాలవ్యాజీ అధ్యక్షతన బొంబాయిలో జరిగిన హిందూ ప్రతినిధుల సమావేశం చేసిన పవిత్ర బహిరంగ ప్రకటనకు అనుకూలంగా వచ్చిన, ఉద్దేశించిన మత సంస్కర్తణ యిది అని స్పష్టంగానే కనిపిస్తున్నది. ఆసక్తి వున్నవారు హరిజన్ పత్రిక మొదటి పేజీలో దాదాపు ప్రతివారం ముద్రించిన ఆ ప్రకటనను చూడవచ్చు. సవర్ణుడైనా, హరిజనుడైనా ప్రతిహిందువుకు కావలసిన సంస్కరణ అది. మిగతా హిందువుల కంటే కాంగ్రెస్ హిందువులకు ఎక్కువ పట్టుదలవున్న సంస్కరణ కాదని. అందుచేత ఈచర్చలోకి కాంగ్రెస్‌ను ఈడ్వడం దురదృష్టకరం. అంతరంగంతో పూర్తిగా సాగవలసిన బిల్లు అది."

ఈ దేవాలయ ప్రవేశాన్ని రాజకీయపు పిల్లిమొగ్గల వింత క్రీడగా వర్ణించడం తప్ప ఎవరు చేసేదేముంది? దేవాలయ ప్రవేశానికి మొదట్లో గాంధీ వ్యతిరేకి. ఎప్పుడైతే అస్పృశ్యులు రాజకీయ హక్కుల కొరకు పట్టుబట్టారో అప్పుడాయన తన మతం మార్చుకొని దేవాలయ ప్రవేశ మద్దతు దారుగామారాడు. ఈ విషయాన్ని చివర వరకు సాగదీస్తే ఎన్నికలలో కాంగ్రెస్‌ను ఓడిస్తానని హిందువులు బెదరించగానే, రాజకీయాధికారం కాంగ్రెస్ చేతులలోనే వుంచేందుకు దేవాలయ ప్రవేశోద్యమానికి గాంధీ తిలోదకాలిచ్చాడు. ఇదేనా చిత్తశుద్ధి, ఇదేనా ధర్మదీక్ష ? గాంధీ పడ్డ 'ఆత్మవేదన' ఒక శుష్కశబ్దానికి మించి ఏమైనా వుందా?

# అధ్యాయం V

# రాజకీయ దయా ధర్మం

## దయతో అస్పృశ్యులను మట్టుపెట్టడానికి కాంగ్రెస్ పథకం

### I

హిందువులు పెద్ద సంఖ్యలో హాజరైన సమావేశం ఒకటి బొంబాయి కోవాస్‌జీ జహంగీర్ హాల్‌లో 1932 సెప్టెంబరు, 30వ తేదీన పండిత మాలవ్య అధ్యక్షతన జరిగింది. వివిధ రాష్ట్ర కేంద్రాలతో, శాఖలతో ఒక అఖిల భారత అస్పృశ్యతా వ్యతిరేక లీగ్‌ను స్థాపించడం సమావేశపు ధ్యేయం. లీగ్ కేంద్ర స్థానం ఢిల్లీలో వుంటుంది. జి.డి.బిర్లా అధ్యక్షుడుగాను, అమృత్‌లాల్ వి.ధక్కర్ ప్రధాన కార్యదర్శి గాను వుంటారు. అఖిల భారత అస్పృశ్యతా వ్యతిరేక లీగ్ గాంధీ యోచన. ఆయన ఊహాజనితమైన లీగ్ పూనా ఒప్పందానికి ప్రత్యక్ష ఫలం. ఏమైనా అది పుట్టిన మరుక్షణం నుంచి గాంధీ ముద్దుబిడ్డ అయింది. మొదటగా గాంధీ చేసింది దాని పేరు మార్చటం. 1932 డిసెంబరు 9న పత్రికలకు యిచ్చిన సందేశంలో ఈ సంస్థ ఇక అస్పృశ్యుల సేవా సంఘంగా పిలవబడుతుందని ప్రజలకు తెలియజేశారు. ఈ పేరు కూడ అంత ఉత్తమంగా అనిపించలేదు గాంధీకి. మరో పేరుకోసం ఆయన వెతుకుతున్నారు. చివరికి దానికొక కొత్తపేరు యివ్వాలని ఆయన నిర్ణయించారు. అట్లా దానిని హరిజన సేవా సంఘం అన్నారు. అంటే అస్పృశ్యుల సేవలో నిమగ్నమైన సంఘం అన్నమాట. అస్పృశ్యుల్ని ఆయన పిలిచే హరిజన్ అన్న శబ్దానికి యిది సహజ పరిణామమే. శైవులకీ, వైష్ణవులకీ మధ్య ఈ మార్పు వివాద కారణమైంది. విష్ణువుకున్న శతనామాలలో హరి ఒకటి. అట్లాగే హర్ అన్న శబ్దం శివుడి నూరు పేర్లలో ఒకటి. హరిజన్ పేరును ఎంపిక చేయడం వల్ల శాఖాపరమైన పక్షపాతం గాంధీకి అంటకట్టారు. అస్పృశ్యుల్ని హరిజనులని పిలవడం శైవులు ప్రతిఘటించారు. గాంధీ లొంగలేదు. ఈ సంస్థ యొక్క ప్రథమ ఫలంగా అస్పృశ్యులకు ఒక కొత్త పేరు వచ్చింది.

1932 నవంబరు 3వ తేదీన జారీ చేసిన పత్రికా ప్రకటనలో బిర్లా, ధక్కర్‌లు సంస్థ యొక్క కార్యక్రమాన్ని, దానిని కొనసాగించే యంత్రాన్ని పొందుపరిచారు. ప్రకటన చెప్పిన కార్యక్రమం యిలా వుంది :-

"సనాతనులలో సహృదయులైన వారు అంతర్వర్ణ విందులను, వివాహాలను వ్యతిరేకించినంతగా, అస్పృశ్యతను మాత్రం వ్యతిరేకించరని లీగ్ నమ్ముతుంది. తన పరిధికి మించిన సంస్కరణలను తలకెత్తు కోవటం లీగ్ ఆశయం కాదు కనక, అంటరానితనపు అన్ని అవశేషాలను సవర్ణుల సమ్మతితోనే తొలగించడానికి లీగ్ యత్నిస్తుందని స్పష్టం చేయడం వాంఛనీయం. దళితవర్గాలను విద్యా విషయికంగా, ఆర్థికంగా, సామాజికంగా ఉన్నతికి తేవడంవంటి నిర్మాణాత్మకమైన కృషే దాని ప్రధాన మార్గం. అంటరానితనాన్ని రూపుమాపడానికి యిది చాలా దూరం వెళుతుంది. ఇటువంటి పనికి కరుడు కట్టిన సనాతన వాదికి కూడా సానుభూతి తప్పించి మరే ఆలోచనా వుండదు. ప్రధానంగా ఇటువంటి పనికే లీగ్‌ను స్థాపించింది. కుల వ్యవస్థ నిర్మూలనం, అంతర్వర్ణ భోజనాలు వంటి సామాజిక సంస్కరణలు లీగ్ కార్యపరిధి బయటవుంటాయి."

ఈ కార్యక్రమ సులభ నిర్వహణకు ప్రతి రాష్ట్రాన్ని అనేక యూనిట్లుగా విభజించాలని ప్రతి యూనిట్ వేతన కార్యకర్తల ఆధీనంలో వుండాలని ఆలోచించారు. ఒక్కొక్క యూనిట్ జిల్లాలో సమంగా వుండ వచ్చును, లేక పోవచ్చును. రెండు జిల్లాలను గాని, రెండు రాష్ట్రాలను గాని ఒక యూనిట్ క్రిందకు తేవచ్చును.

సంవత్సరానికి మామూలుగా వుండే బడ్జెటును కూడా ప్రకటన పొందుపరచింది. ఈ క్రింద చూపిన మొత్తాలలో అది వుంటుంది :-

" ఖర్చులో రెండువంతులకు తక్కువ కాకుండా సిసలు సంక్షేమ కృషికి వెచ్చించాలి సిబ్బందికి, వారి వేతవాలకు మిగతా మూడవ వంతు. కనీస సిబ్బందిగా ఇద్దరు వేతన కార్యకర్తలు వుండాలి. 15 నుంచి 29 రోజుల వరకు ప్రతినెలలోను వారు గ్రామాలలో సంచరించాలి.

| | | |
|---|---|---|
| ఇద్దరు సంచార కార్యకర్తలకు పోషణ భత్యం | 30 + 20 = 50 x 12 | = 600 |
| ఇద్దరు సంచార కార్యకర్తలకు ప్రయాణపు ఛార్జీలు | 2 x 10 x 12 | = 240 |
| కార్యకర్తలకు,వారి తరుపున అయ్యే చిల్లర ఖర్చు | 2 x 10 x 12 | = 240 |
| సంక్షేమ కృషి అనగా స్కూలు పుస్తకాల వెల, విద్యార్థి వేతనాలు, బహుమతులు, ఇసే బావులకు విరాళాలు, హరిజన పంచాయతుల ఏర్పాటు | | 2000 |
| | మొత్తం | 3080 |

## మొత్తం దేశానికి బడ్జెటు

మొత్తం దేశానికి వెచ్చించవలసిన కనీసపు మొత్తాన్ని సుమారుగా ఈ క్రింద యిస్తున్నాం. కృషి యొక్క బృహత్ స్వభావాన్ని దృష్టిలో పెట్టుకుంటే ఈపథకం చిన్నదే. కావలసిన నిధిని సేకరించడం ప్రజలకు కష్టం కాకూడదు. నిధికి యిచ్చే ప్రతి పైసా కూడా చాలా విలువైన విరాళం అవుతుంది. కనుక ఆశయసిద్ధి కోసం కొంత త్యాగం చేయవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాం. ప్రతి రాష్ట్రానికి కావాలనుకున్న యూనిట్లు కేవలం తాత్కాలికమైనవి. ఎట్లాగూ తుది నిర్ణయం రాష్ట్రీయ బోర్డులో చేసుకోవలసి వుంటుంది.

వివిధ రాష్ట్రాలలో కనీస పక్షంగా ఈ క్రింద చూపించి నన్ని యూనిట్లు వుండాలని లెక్క వేశాం:-

| రాష్ట్రం పేరు | జిల్లాల సంఖ్య | యూనిట్ల సంఖ్య |
|---|---|---|
| అస్సాం | 11 | 6 |
| ఆంధ్ర | — | 6 |
| బెంగాల్ | 26 | 15 |
| కలకత్తా నగరం | 1 | 3 |
| బీహార్ | 16 | 16 |
| బొంబాయి, బొంబాయి నగరం, పరిసర జిల్లా | 1 | 3 |
| మహారాష్ట | 10 | 8 |
| గుజరాత్, బరోడ, కతియవార్, కచ్ మరి ఇతర 5 సంస్థానాలు | 10 | 15 |
| సెంట్రల్ ప్రావిన్సు, బేరారు, మరాఠీ, | 9 | 7 |
| మధ్య ఇండియా సంస్థానాలు | 11 | 8 |
| ఢిల్లీ రాష్ట్రం | 1 | 2 |
| కాశ్మీర్ | 1 | 1 |
| మలబార్, కొచ్చిన్, తిరువాన్కూర్ | 4 | 10 |
| మైసూరు, బొంబాయిలోని కన్నడ జిల్లాలు, మదరాసు | 8 | 10 |
| నిజాం సంస్థానం | 14 | 10 |
| ఒరిస్సా ఉప సంస్థానాలు (5 +26) | — | 8 |
| పంజాబు, వాయవ్య సరిహద్దు రాష్ట్రం, పంజాబు సంస్థానాలు (32+7) | 39 | 10 |
| రాజపుటానా సంస్థానాలు, అజ్మీర్ మేవార్ సంస్థానం (18) | 19 | 9 |
| సింధు | 18 | 5 |
| తమిళనాడు | 13 | 8 |
| యునైటెడ్ ప్రావిన్సు | 48 | 24 |
| మొత్తం | | 184 |

| | |
|---|---|
| మొత్తం 184 యూనిట్లకు ఖర్చు | 3000 x 184 = రు. 5,52,000 |

| | | |
|---|---|---|
| కేంద్ర రాష్ట్ర కార్యాలయాలు: | | |
| కేంద్ర కార్యాలయం | 1000 x 12 | = రు. 12, 000 |
| రాష్ట్ర కార్యాలయాలు | 4000 x 12 | = రు. 48,000 |
| | మొత్తం | రు. 60,000 |
| | పెద్ద మొత్తం | రు. 6,12,000 |
| | లేక | రు. 6,00,000 |

అటు రాష్ట్రాలు, జిల్లాలు పోగు చేసిన నిధులతోను, ఇటు కేంద్ర నిధినుంచి ఈ మొత్తాన్ని రాబట్టాలి.

దేశవ్యాప్తంగా అస్పృస్యతా నివారణకు, హరిజనుల సహాయక కృషికి ఆరు లక్షల రూపాయలు సేకరించి ఖర్చు చేయడం ఉద్దేశంగా గ్రహించగలరు. ఈకార్యాక్రమం, ముఖ్యంగా సహాయక కృషి సమర్ధవంతంగా జరగాలంటే కనీసం 5 సంవత్సరాల పాటు కొనసాగాలి. 22 రాష్ట్రాలకు, సంస్థానాలకు, 4 కోట్లు లేదా 400 లక్షల హరిజనులకు దేశ వ్యాప్తంగా విస్తరించిన ఈ పనికి యిది నిజంగా స్వల్పమైన బడ్జెట్.

ఈ కృషికి నిధుల్ని సమకూర్చడానికి గాంధీ చేసిన అఖిల భారత యాత్ర 1933 నవంబరు, 7 న ప్రారంభమై 1934 జులై 29 న అంతమయింది. మొత్తం సేకరించింది 8 లక్షల రూపాయలు. (1934 ఆగస్టు 3 నాటి హరిజన్) అస్పృశ్యుల క్షేమానికి హిందువులలో వుత్సుకతను రేకెత్తించడం, నిధులను సేకరించడం యాత్ర లక్ష్యం కనుక గాంధీ ఎక్కువ భాగం కాలి నడకనే తిరిగారు. గాంధీ రు.8 లక్షలు పోగుచేశారు. ఈ మొత్తం తోను, డబ్బున్న గాంధీ మిత్రుల వార్షిక విరాళాలతోను సంఘం తన పని మొదలు పెట్టింది.

హరిజన సేవా సంఘం 1932 సెప్టెంబరు నుంచి తన కృషి సాగిస్తున్నది. అస్పృశ్యుల స్థితిగతులంటే గాంధీ ఆత్మవేదనకు, వారి అభ్యున్నతి కొరకు ఆయనపడే ఆరాటానికి ఈ కృషి ఒక ఉజ్వలమైన సాక్ష్యంగా చూపిస్తున్నారు. చాలా అమెరికన్లను ఢిల్లీలోని సంఘ కార్యాలయానికి ప్రధాన కార్యదర్శి ఆహ్వానించి, అస్పృశ్యుల సంక్షేమానికి గాంధీ చేస్తున్న అసదృశ్యమైన సాంఘిక కృషిని వారికి చూపిస్తున్నారు.

అణగారిన ప్రజ కొరకు జరిగే ఏ సంక్షేమ కృషినైనా ప్రతి ఒక్కరూ ఆదరించ వలసిందే. కాని దీని అర్థం ఎవరూ విమర్శించరాదని కాదు. దీనిని ఎవరూ అంగీకరించ లేరు. దీనిని గురించి అంతగా చెబుతున్నారు గనుక, సంఘం ఏమి పనిచేస్తున్నదీ న్యాయంగా విచారించి తెలుసుకోడానికి అందరికి హక్కున్నది. స్పష్టంగా నిర్దేశించిన కొన్నిమూస పద్ధతులను సంఘం అవలంబిస్తున్నదని దాని వార్షిక నివేదికలు చదివిన వారికి ఎవరికైనా తెలుస్తుంది.

మానవీయ. సాంకేతిక, వృత్తి పరమైన కోర్సులలో విద్యార్థి వేతనాలు నెలకొల్పడం ద్వారా అస్పృశ్యులలో ఉన్నత విద్యను ప్రోత్సహించడానికి సంఘం యత్నిస్తున్నది. ఉన్నత పాఠశాల విద్యార్థుల కూడా సంఘం విద్యార్థి వేతనాల్నిస్తున్నది. కళాశాలలు, ఉన్నత పాఠశాలలకు హాజరవుతున్న అంటరాని విద్యార్థుల కొరకు సంఘం వసతి గృహాలను కూడా నిర్వహిస్తున్నది. పరిసర ప్రాంతాలలో ఉమ్మడి పాఠశాలలు లేనిచోట లేదా వాటిలోకి వారికి ప్రవేశం లేక పోయినా, ఈ విద్యార్థులకు ప్రాథమిక స్థాయిలో ప్రత్యేక పాఠశాలను నిర్వహించడమే సంఘంయొక్క విద్యావిషయిక కార్యక్రమాలలో ఎక్కువ భాగం ఆక్రమిస్తున్నది.

తరువాత లెక్కలోకి వచ్చేవి సంఘం యొక్క సంక్షేమ కార్యక్రమాలు. అస్పృశ్యులకు సంఘం అందిచే వైద్య సహాయం ఈ పద్దు క్రిందకు వస్తుంది. సంఘం యొక్క సంచార కార్యకర్తలు హరిజనుల ఇళ్ళకు వెళ్ళి అస్పృశ్య రోగులకు, దీర్ఘరోగగ్రస్తులకు వైద్యసహాయం చేస్తారు. అస్పృశ్యుల ఉపయోగార్థం సంఘం కొన్ని చికిత్సా కేంద్రాలను కూడా నిర్వహిస్తున్నది. సంఘం చేస్తున్న ఈ కృషి చాలా కొంచెం మాత్రమే.

సంఘం చేస్తున్న ఇంతకంటే ముఖ్యమైన సంక్షేమ చర్య నీటి సరఫరాకు సంబంధించినది. సంఘం ఈ పనిని అస్పృశ్యుల వాడుక కోసం కొత్త బావులను త్రవ్వడం లేక గొట్టపు బావులను పంపులను ఏర్పాటు చేయడం, 2. పాతవాటికి మరమ్మతులను చేయడం, 3. బావులు త్రవ్వడానికి, మరమ్మత్తులు చేయడానికి స్థానిక ప్రభుత్వాలను, సంస్థలను ఒప్పించడం ద్వారాను చేస్తున్నది. సంఘం చేపట్టిన మూడవ పద్ధతి కార్యక్రమం ఆర్థిక పరమైనది. సంఘం కొన్ని పారిశ్రామిక పాఠశాలలను నిర్వహిస్తున్నట్లు, వాటిల్లో శిక్షణపొందిన అనేకమంది వృత్తిపని వారు స్వతంత్రంగా జీవనోపాధి సంపాదించుకుంటున్నట్లు సంఘం చెప్పుకోవడం కనిపిస్తున్నది. కాని అస్పృశ్యులలో సహకార సంఘాలను ఏర్పాటుచేసి అజమాయిషీ చేయడం వల్ల కొంత గట్టి పని విజయవంతంగా జరిగినట్లు నివేదికలు తెలుపు తున్నాయి.

## II

కార్యక్రమాల ఈ సమీక్ష చూస్తే, అంటరానివారి సంక్షేమం పైన సంఘం చాలా డబ్బు ఖర్చు పెడుతున్నదన్న అభిప్రాయం కలుగ వచ్చు. కాని వాస్తవాలేమిటి? అంటరాని వారి అభ్యున్నతి కృషిలో సాలీనా సంఘం ఖర్చు పెట్టాలని అనుకున్న మొత్తం 6 లక్షలని గుర్తు తెచ్చుకోవాలి. కాని యదార్థంలో సంఘం ఖర్చుపెడుతున్నదెంత? మే, 1941 లో సంఘ కార్యదర్శి తమ నివేదికలో యిలాచెప్పారు, నివేదిక పుట 58.

గత 8 సంవత్సరాలలో వివిధ శాఖలు, సంఘ కేంద్ర కార్యాలయం హరిజన్ కృషికి సుమారుగా ఖర్చు పెట్టినది వరుసగా రు. 24, 25, 700, రు. 3, 41, 607 మొత్తాలు. సమస్య యొక్క అవసరాలను దృష్టిలో పెట్టుకుంటే ఈ రు. 27, 67, 307 లమొత్తం ఏమాత్రం లెక్కలోనిది కాదు.

ఈ లెక్కన సంవత్సరానికి సంఘపు ఖర్చు రు 3,45,888 అయింది. సంఘం

పెద్దచేసి చెబుతున్నట్లుగా సంఘం లేదని తెలుస్తున్నది. సంఘం కడు పేదగా తన జీవితం వెళ్ళదీస్తున్నది. 50 మిలియన్ల అంటరాని వారి గురించి సంవత్సరానికి 3 లక్షల బడ్జెటు వారు పొంగిపోవలసిన విషయమేమి కాదు. వివిధ రాష్ట్రాలలో ఈ రెండు సంవత్సరాలలోన కాంగ్రెస్ ప్రభుత్వాలు అధికారంలో వుండి సంఘానికి పెద్ద గ్రాంటులు యిచ్చివుండక పోతే సంఘం ఈమాత్రం ఆర్భాటం చేయగలిగి వుండేది కాదు.

తన పేదస్థితికి సంఘాన్ని నిందించనవసరం లేదు. నిందించ వలసింది హిందువులన స్తబ్దంగా వుంటూ ఏ మాత్రమో దిగజారి పోతూవున్న సంఘపు ఆర్థిక స్థితి, అస్పృశ్యుల క్షేమ అంటే హిందువులకు ఏమాత్రం పట్టిందో తెలియజేస్తున్నది. రాజకీయావసరాల కోసం తిల స్వరాజ్య నిధికి ఒక కోటి రూపాయలను వాళ్ళు విరాళంగా యిచ్చారు. ఇక సర్వ సంక్షే కృషికని కస్తూరిబాయి స్మారక నిధికి ఇటీవల వారు 1కోటి 15 లక్షల రూపాయలు పోగుచేశార వీటితో పోలిస్తే హరిజన సేవా సంఘానికి హిందువులు యిచ్చిన విరాళాలు బిచ్చపు ప్రాయవే

సంఘం చేస్తున్న సంక్షేమ కృషి స్వభావంతో మనం విభేదించ వచ్చు. అది చేస్తున పని చాలావరకు ఏ నాగరిక ప్రభుత్వమైనా ప్రభుత్వ నిధులు ఖర్చు పెడుతూ చే తీరవలసిందే. మామూలుగా ప్రభుత్వం చేయవలసివున్నా ప్రభుత్వం చేయదలచని ఈ పని. పథకాలను ప్రభుత్వం తన నిధులు ఖర్చుపెట్టి చేపట్టవలసిందిగా సంఘం ప్రభుత్వా ఎందుకు అడగాలని ఎవరైనా అనవచ్చు.

దీనివల్ల అస్పృశ్యులకు సంఘం యడల వైమన్యభావా లేమి కలగవు. ఐతే అలాం వైమనస్యం ప్రస్తుతం వున్నదని ఒప్పుకోవాలి. 1944 అక్టోబరు 14వ తేదీనాటి ఇండియ సోషల్ రిఫార్మర్‌లో ఒక వ్యాస కర్త ఈ పరిస్థితులు, వాటి కారణాలను గురించి రాశాడు ఆయన అన్నాడు కదా:-

"ఒక హరిజన ప్రతినిధి వర్గం సేవాగ్రామ్‌లో గాంధీని దర్శించి, షెడ్యూల్డు కులా అన్న వర్గంలో చేర్చిన కులాల సభ్యులకు హరిజన సేవా సంఘపు పరిపాలక మండలి ప్రాతినిధ్యం కల్పించాలని కోరారు. సంఘం హరిజనులసేవ కొరకు వుందికాని హరిజన సం కాదని, అందువల్ల వాళ్ళ కోరిక సమంజసం కాదని గాంధీజీ చెప్పినట్లు తెలిసింది. రౌం టేబుల్ సమావేశంలో నేమో హరిజనులు హిందువులని, వాళ్ళని ప్రధాన సమాజం నుం వేరు చేయరాదని వాదించి హరిజనుల సీట్ల రిజర్వేషన్‌ను గాంధీజీ వ్యతిరేకించారు. తరువ యర్వాడ ఒప్పందంలో హిందువుల కోటా నుంచి వాళ్ళకు ప్రత్యేకంగా కొన్ని స్థానా వేరు పరచడానికి ఆయన అంగీకరించక తప్పు లేదు. బొంబాయిలో పండిత మదన మోహ మాలవ్య అధ్యక్షత వహించిన సాధారణ సమావేశంలో ఈ ఒడంబడిక ముసాయి ఆమోదానికి వచ్చినప్పుడు, అలజడిగావున్న ప్రేక్షకులను వుద్దేశించి ఒకరు ఒకసూ చేసారు. దాని ప్రకారం హిందూ సమాజం వెన్నంటి వున్న అస్పృశ్యత అనే మచ్చ

*1944 సెప్టెంబరు 24 వ తేదీన అస్పృశ్యులు కొంతమంది గాంధీని కలిసి హరిజన సంఘపు పరిపాలక మండలిలో తమ ప్రతినిధులను నియమించమని అర్థించినట్టు, గా తిరస్కరించినట్టుపత్రికలలో వచ్చిన వార్త ఆధారంగా ఈ రచయిత తన వ్యాఖ్యలు చేసాడు. ఈ రచ నగో గారు, కే. నటరాజన్ అని అందరూ అనుకుంటున్నారు.

తొలంగించడానికి (పండిట్‌జీ సూచించినట్లు )ఒక పెద్ద మొత్తంసేకరించడం అవసరం లేదు. సమావేశానికి హాజరైన ప్రతి పురుషుడూ, స్త్రీ (స్త్రీలు చాలా సంఖ్యలో హాజరైనారు) మిగితా హిందువుల మోస్తరుగానే హరిజనులు కూడా తమ ఇళ్లల్లోకి స్వేచ్ఛగా రానిస్తే, సమస్య తక్షణమే తీరుతుంది. ఆ ఆగంతకునివైపు తిరిగి శాంతంగా ఒక బొంబాయి వ్యాపార శ్రేష్ఠుడు అన్నాడు : "వాళ్ళకు కనువిప్పు కలిగించే సూక్తి మీరు చెప్పారు. ఐతే ఒక్కరూ దాన్ని పాటించే స్థితిలో లేరు." మొదటి నుంచీ హరిజన సేవా సంఘానికి ఇదే ప్రాథమిక బలహీనత అని నాకనిపించింది. ఫలితం ఏమిటి? సంఘం యొక్క దాదాపు ప్రతి లబ్దిదారు డా.అంబేద్కర్‌కు గట్టి అనుచరుడు. హిందువులంటే డా. అంబేద్కర్‌కు వున్న మూర్ఖపు తీవ్ర విద్వేషం, వాళ్ళకూ పూర్తిగా వుందని గాని లేకపోతే యిందులో విశేషమేమీలేదు. ఈ మాట రుజువు చేయడానికి నేను చాలా దృష్టాంతరాలు చూపించ గలను. కాని పరిస్థితిని మరింత విషమం చేస్తుంది. హరిజన స్త్రీ, పురుషులను మిగతా హిందువులతో పాటుగా అన్ని కేంద్ర, స్థానిక సంస్థలలో చేర్చుకొని విధాన రూప కల్పనలో వారికొక నిర్ణయాత్మక పాత్ర యిచ్చినట్లైతే ఈధోరణి అరికట్ట గలమని నేననుకుంటాను. హరిజనుల తోడు లేకుండా వారికి సాయం చేయగలమనుకోవడం సంఘసంస్కరణ ఉద్దేశానికే విరుద్ధం. ఇంతకు ముందు హరిజన వికాస ఉద్యమాలలో నేను పనిచేసాను. నాకు తారస పడిన స్త్రీ పురుషులు ఎవ్వరిలోనూ ఈ వైమనస్య భావం రేకత్తినట్టు నాకు కనపడలేదు. నా దృష్టిలో ప్రధానంగా వున్న దళిత వర్గాల మిషను వారిని బట్టి చూస్తే, ఈ ఉద్యమ స్థాపకులు తమ మత విశ్వాసం, సామాజిక నీతి కారణంగా దళితవర్గ సభ్యులతోనే కలిసి వున్నప్పుడు ఎటువంటి విచక్షణను దీక్షగా దూరం చేయటం వలననే యిది సాధ్యమయింది. షెడ్యూల్డు కులాల సభ్యులను హరిజన సంఘంలో చేర్చుకోలేమని గాంధీజీ అనటం పూర్తిగా సమంజసమని నేను అనుకోవటం లేదు. సంఘం స్థాపించినప్పుడు డా. అంబేద్కర్ ఒక సంఘ సభ్యుడని ఒక మిత్రుడు నాకు గుర్తుచేశాడు".

విరోధ భావాలకు గల కారణాలను విశద పరచి సంఘం యొక్కనిజ స్వరూపాన్ని వెల్లడి చేయడానికి వీలు కలుగుతుంది కనుక నేను ఇదంతా వుదహరించాను.

## III

సంఘం నిర్వహణలో అంటరానివారిని కలుపుకోవాలని ఇండియన్ సోషల్ రిఫార్మర్‌లో వ్యాసకర్త వాదించాడు. సంఘం యొక్క కేంద్రీయ బోర్డులోఅస్పృశ్యులకు ఏనాడూ ప్రాతినిధ్యం లేదని ప్రజలు అనుకునే విధంగా ఆయన ప్రకటన వుంది. అది పొరపాటు అవుతుంది. సంఘపు కేంద్రీయ బోర్డులోఅంటరానివారిలో ప్రముఖులు గణనీయమైన సంఖ్యలో సంఘం స్థాపించిన రోజులలో వున్నారన్నది వాస్తవమైన పరిస్థితి. 1932 నవంబరు 3వ తేదీన బిర్లా, థక్కర్‌లు జారీచేసిన ప్రకటనలో కేంద్రీయ బోర్డులో వున్న సభ్యుల పేర్లు వున్నాయి. ఆ ప్రకటనలో:-

"ఈ క్రింద పేర్కొన్న నిర్వాహక సభ్యులతో కేంద్రీయ బోర్డును ఏర్పాటుచేయడమైనది. :-

ఢిల్లీ కలకత్తాలనుండి జి.డి.బిర్లా, బొంబాయి నుండి పురుషోత్తమదాస్ ఠాకూర్ దాస్, లల్లూభాయ్ శ్యామల్ దాస్, డా బి.ఆర్. అంబేద్కర్, అహమ్మదాబాద్ నుంచి సేఠ్ అంబాలాల్ సారాభాయ్, డా.బి.సి.రాయ్ కలకత్తా నుండి లాలా శ్రీరామ్, ఢిల్లీ నుండి రావు బహదర్ యం.సి. రాజా, మదరాసు నుండి డా.బి.యస్. రాజన్, తిరుచినాపల్లి, నుండి రావుబహదూర్ శ్రీనివాసన్, మదరాసు నుండి ఎ.వి..థక్కర్, ప్రధాన కార్యదర్శి, ఢిల్లీ."

ఎనిమిది మంది సభ్యులలో ముగ్గురిని అంటరానివారినుంచితీసుకున్నారని గమనించగలం. నేను బోర్డు నుంచి విరమించిన తరువాత మిగితాయిద్దరు అనగా రావుబహదర్ యం.సి.రాజా, రావుబహదర్ శ్రీనివాసన్ కూడావిరమించారు. వాళ్లు సంఘం నుంచి ఎందుకు తప్పుకున్నారో ఆ కారణాలునాకు తెలియదు.

సంఘంతో నా సంబంధాలు ఎందుకు తెగతెంపులు చేసుకున్నా కారణాలు చెప్పడం సక్రమంగా, సముచితంగా వుంటుంది. పూనా ఒప్పందం తరువాత మన్నించి మరచిపో అన్న ధోరణిలో నేను ముందుకు సాగాను. చాలామంది నా స్నేహితులు కోరినట్లు గాంధీతో చర్చించాలని నిజానికి అనుకున్నాను. అది జరగక ముందే లండన్‌లో 3వ రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరుకమ్మని నన్ను పిలిచారు. అందుచేత నేను చేయగలిగినది సంఘపు కార్యదర్శి అయిన ఎ.వి థక్కర్‌కు నా అభిప్రాయం తెలపడం.

ఆవిధంగానే స్టీమరు నుంచి ఆయనకు ఈ క్రింది వుత్తరం రాశాను:-

యం/యన్ ''విక్టోరియా"
సేద్ రేవు,
నవంబరు 14-1932.

ప్రియమైన థక్కర్ మహాశయా,

రావు బహదూర్ శ్రీనివాస్‌ను కేంద్రీయ బోర్డుకు డి.వి.నాయక్‌ను బొంబయి రాష్ట్ర బోర్డుకు నామినేట్ చేయాలని నేను చేసిన సూచనను ఆమోదిస్తూ నాకు తెలియపరచిన తంతి లండన్‌కు బయలుదేరే ముందే చేరింది. ఈ సమస్య స్నేహపూర్వకంగా పరిష్కారమైనందుకు నాకు సంతోషంగా వుంది. అస్పృశ్యతా వ్యతిరేక లిగ్‌కు సంబంధించిన కార్యక్రమాలను మనం ఇప్పుడు సంయుక్తంగా నిర్వహించవచ్చు[1].

తన కార్యక్రమాలు రూపొందించు కోవడంలో లీగ్ పాటించవలసిన సూత్రాలను కేంద్రీయ బోర్డు సభ్యులతో కలిసి చర్చించే అవకాశం వుంటే బాగుండేది. అయితే దురదృష్టవశాత్తు అతికొద్ది వ్యవధిలో నేను లండనుకు ప్రయాణం కట్టవలసి రావడం వల్ల నేను ఈ అవకాశం పోగొట్టు కోవలసి వుంది. ఇక ద్వితీయంగా ఉత్తమమైన పనిని అనగా

1.లీగ్‌కు తరువాత దశలో హరిజన సేవా సంఘం అన్న పేరు వచ్చింది

నా అభిప్రాయాలను పరిశీలనార్థం కేంద్రీయ బోర్డుముందు వుంచటానికి మీకు తెలియ పరచటం చేస్తున్నాను.

నా అభిప్రాయంలో దళిత వర్గాల అభ్యున్నతికి కృషిని రెండు విలక్షణమైన పద్ధతుల ద్వారా చేయవచ్చును. దళితవర్గాలకు ఒక వ్యక్తి చెందడం అన్నది, అతని వ్యక్తిగత ప్రవర్తనతో ముడిపడి వుందని భావించేది ఒక దృక్పథం. అతడు దారిద్ర్య దైన్యాలతో మగ్గుతున్నాడంటే, అతడు పాపి, దుర్మార్గుడు అయి వుండాలి. ఇట్లాంటి ఆలోచనతో బయలుదేరిన పంథావారు తమ యావత్తు శక్తి యుక్తులన్ని మద్యపానం, సంయమనం, సహకారం, క్రీడా స్థలాలు, గ్రంథాలయాలు,పాఠశాలలు మొదలైన విషయాలపై కేంద్రీకరిస్తారు. ఇవి మనిషి సచ్ఛీలతను పెంపొందించి మరింత ఉత్తముడైన పుణ్యపురుషుడుగా మారాలని లక్ష్యంగా పెట్టుకున్నట్టివి. నా వుద్దేశంలో ఈ సమస్యను సమీపించటానికి మరొక పద్ధతి కూడా వున్నది. మనిషి తాను నివసించ వలసిన పరస్థితులు, పరిసరాలు అతని స్థితిగతులను నిర్ణయిస్తాయని, అతడు దారిద్ర్య దైన్యాలతో మగ్గుతున్నాడంటే అతని పరిసర వాతావరణం శుభోదర్కంగా లేదని ఈ రెండో పద్ధతి భావిస్తున్నది. మొదటి పద్ధతి వల్ల కదాచిత్తుగా కొద్దిమంది వ్యక్తులు తమ వర్గపు స్థాయిని దాటి పైకి రాగలరేమో కాని ఈ రెండు మార్గాలలో రెండోదే చాలా సవ్యమైనదనటంలో నాకు ఏ మాత్రం సందేహం లేదు. వర్గాన్ని మొత్తంగా మొదటి మార్గం ఉద్ధరించదు. వర్గాన్ని మొత్తంగా మరింత ఉన్నత స్థాయికి కొనిపోవాలి కాని ఎవరో కొద్దిమంది వ్యక్తులకు మన చ్చిత్తానుసారం సాయం చేయడంగాని, దళిత వర్గాలకు చెందిన కొంతమంది కుర్రవాళ్ళను ఏరితేవటం కాని అస్పృశ్యతా వ్యతిరేక లీగ్ యొక్క ఆశయం గాని, అది పుట్టిన కారణంగాని కాదని నా అభిప్రాయం. ఫలితంగా, వ్యక్తిగతమైన సచ్ఛీలతను పెంచే కార్యక్రమాలపైన లీగు తన శక్తిని ఖర్చు చేయటం నేను యిష్టపడను. దళితవర్గాల సామాజిక వాతావరణంలోనే ఒక మార్పు తెచ్చే కార్యక్రమం పైన బోర్డు తన శక్తిని కేంద్రీకరించాలని నేను కోరుకుంటాను. నా అభిప్రాయాలను సార్వజనికమైన మాటల్లో చెప్పాను గనక యిప్పుడు లీగు చేయవలసిన పని విషయంలో కొన్ని ధృఢమైన ప్రతిపాదనలు చేయ సాహసిస్తాను.

## 1. పౌర హక్కులు సాధించే ఉద్యమం

ప్రప్రథమంగా గ్రామ బావుల నుంచి నీరు తెచ్చుకోవడం, ఊరి బళ్ళలో ప్రవేశం, గ్రామ చావిడికి ప్రవేశం, ప్రభుత్వ రవాణా వాడకం వంటి తమ పౌరహక్కులను దళిత వర్గాలు అనుభవించేందుకు గాను దేశ వ్యాప్తంగా ఒక ఉద్యమాన్ని లీగ్ చేపట్టాలని నేననుకుంటున్నాను. ఈ కార్యక్రమం గ్రామాల్లోకి చొచ్చుకు పోయినట్లయితే హిందూ సంఘపు సామాజిక వాతావరణంలో అవసరమైన మార్పును తెస్తుంది. అది లేకుండా సామాజికంగా సమాన హోదాను దళిత వర్గాలు పొందడం ఎన్నటికీ సాధ్యం కాదు. ఇలాంటి పౌరహక్కుల ఉద్యమం నడిపినపుడు ఎలాంటి చిక్కులు ఎదురౌతాయో బోర్డు తెలుసుకోవలసి వుంది. ఇక్కడ నా అనుభవాన్ని చెప్పగలను. బొంబాయి రాష్ట్రంలో కొలాబా, నాసిక్ జిల్లాలలో దళిత వర్గాల సంస్థ, సామాజిక సమతా లీగ్ ఇలాంటి పథకాన్ని ప్రారంభించినపుడు ఏమి జరిగిందో అధ్యక్షుడిగా నాకు తెలుసు. మొదటగా దళిత వర్గాలకు, సవర్ణ హిందువులకు మధ్య ఘర్షణలు చెలరేగి తలకాయలు పగుల్తాయి. ఒక పక్షంలో గాని , మరోదానిలో గాని క్రిమినల్

ప్రాసిక్యూషన్లు వుంటాయి. ఈ పోరాటంలో పోలీసు, న్యాయస్థానాలు దళిత వర్గాలకు వ్యతిరేకంగా వుంటాయి కనుక, వాళ్ళు బాధలు పడతారు. న్యాయం దళిత వర్గం పక్షాలవైపు ఉన్నప్పటికీ ఈ రెండు జిల్లాలలో సాగిన సామాజిక పోరాటంలో పోలీసులు, న్యాయస్థానాలు దళిత వర్గాల పక్షం వహించిన సందర్భం ఒకటి కూడాలేదు. పోలీసు, న్యాయ శాఖలు వుండ గలిగినంత అవినీతి మయంగా వున్నాయి. ఇంతకంటే అధ్వాన్నం ఏమంటే వాళ్ళు ఖచ్చితంగా రాజకీయ ప్రయోజనాల కోసం పనిచేస్తారు. న్యాయం జరగాలని కాక, దళిత వర్గాలకు వ్యతిరేకంగా సవర్ణుల మాన మర్యాదలను కాపాడాలని పట్టుదలగా వుంటారు. రెండోది దళిత వర్గాలు తమతో సమాన హోదా పొందడానికి ప్రయత్నిస్తున్నారని గ్రామాలు గ్రహించిన మరుక్షణం అవి దళిత వర్గాలను పూర్తిగా బహిష్కరించి వెలివేస్తాయి. మీరు సభ్యులుగా వున్న రాష్ట్ర కమిటీ ముందు దళిత వర్గాలు తమ ఆకలి, నిరుద్యోగం వేధింపుల గురించిన హృదయ విదారకమైన గాథల్ని ఎన్నింటిని మళ్ళీ మళ్ళీ విన్నవించు కున్నారో మీకు తెలుసు. అందుచేత దళిత వర్గాలు తమ నికృష్టస్థితి నుంచి బయట పడాలని చేసే యత్నాలను వమ్ము చేయడంలో ఇది ఎంత క్రూరమైన ఆయుధమో, భీతావహమైన శక్తో యింకా ఎక్కువ చెప్పవలసిన అవసరం లేదు.

ఈ పౌర హక్కుల ఉద్యమం విజయవంతం కావాలంటే లీగ్ అధిగమించవలసిన ఎన్నో అడ్డంకులలో రెంటిని మాత్రమే చెప్పాను. గ్రామీణ ప్రాంతాలలో లీగ్‌కు కార్యకర్తల సైన్యం వుండాలి. దళిత వర్గాలు తమ హక్కులకోసం చేసే పోరాటంలో ప్రోత్సాహ పరచాలి. ఏవైనా కోర్టు వ్యవహారాలు వచ్చినపుడు అవి గెలవటంలో సాయపడాలి. ఈ కార్యక్రమం యొక్క కార్యసాధకత మీద నాకు అంతులేని విశ్వాసముంది. వేరే ఏ యితర కార్యక్రమంతోపోల్చినా ఇది ప్రాథమికమూ, ప్రధానమూ అని లీగ్ పరిగణించాలని

చెప్పడంలో నాకు ఇసుమంత సందేహం లేదు. ఈ కార్యక్రమం సామాజికమైన అలజడి తెచ్చి పెడుతుందనడం సత్యమే. రక్తపాతం కూడ జరగవచ్చు. కాని దీనిని తప్పించుకోగలమని తోచదు. ఎవరికీ నొప్పి తగలని ప్రత్యామ్నాయ విధానం అవలంబించడం నాకు తెలుసు. అస్పృశ్యతను కూకటి వేళ్లతో పెకలించడం దానివల్ల కాదని నేను పూర్తిగా నమ్ముతున్నాను. అజ్ఞానంలో కూరుకొనివున్న సవర్ణ హిందువులలో కొన్ని హేతువాద భావాలు నిశ్శబ్దంగా చొచ్చుకు పోవడం వల్ల దళిత వర్గాల ఎడల అస్పృశ్యతను పాటిచడంలో సవర్ణహిందువు కూడా మిగతా అందరు మానవ మాత్రుల మాదిరిగానే తన సమాజపు ఆచారాన్ని పాటిస్తున్నాడు. మరో ఎవరో దీనికి వ్యతిరేకంగా ప్రభోదం చేసినంత మాత్రాన సాధారణ మానవులు ఆచార సిద్ధమైన తమ నడవడికను వదులుకోరు. ఇక అటువంటి ఆచార సిద్ధమైన వర్తనకు మత ప్రమాణంవున్నా, లేదా మత ప్రమాణం వుందని నమ్మినా, కేవలం ప్రభోదాన్నంతా గాలికి వదిలేస్తారు. అది మనసు మీద పనిచేయదు. పైగా ఆగ్రహం, ప్రతిఘటన కూడా కలిగించవచ్చు. సవర్ణ హిందువు తాను కళ్ళు నులుముకుని ఆలోచించవలసినస్థితి వచ్చింది గనక తన పద్ధతుల్ని మార్చుకోక తప్పదని భావించినపుడే దళిత వర్గాలకు ముక్తి లభిస్తుంది. అందుకే అతని ఆచార సిద్ధమైన వర్తనకు వ్యతిరేకంగా ప్రత్యక్ష చర్యద్వారా సంక్షోభం సృష్టించాలి. సంక్షోభం అతనిలో ఆలోచనలు రేకెత్తిస్తుంది. అట్లా ఆలోచన ఆరంభమైన మరుక్షణం మార్పుకు ఎక్కువ అనుకూలుడౌతాడు. లేకపోతే ఆ అనుకూలత రాదు. ఎవరికీ నొప్పితగలని విధానంలోనూ, హేతువాద భావాల నిశ్శబ్ద ప్రభావంలోనూ వున్న గొప్ప లోపం ఏమిటంటే,

అవి అతనిలో ఆలోచనలు రేకెత్తించవు. కారణం, అవి సంక్షోభాన్ని సృష్టించవు. మహద్ లోని చాదార్ చెరువు , నాసిక్ లోని కాలారామ్ గుడి, మలబార్‌లోని గురువాయూర్ దేవాలయం సందర్భాలలో జరిగిన ప్రత్యక్ష చర్య సంస్కర్తలు ఒక మిలియన్ రోజులపాటు ప్రచారం చేసినా ఎన్నటికీ సాధించలేని ఫలితాన్ని సాధించింది. దళిత వర్గాలు పౌర హక్కులు సాధించుకోడానికి ప్రత్యక్ష చర్య మార్గాన్ని అస్పృశ్యతా నివారణ లీగ్ అవలంబించాలని నేను గట్టిగా సిఫారసు చేస్తున్నాను. ఇటువంటి ఉద్యమంలో సాధక బాధకాలు నాకు తెలుసు. ఇది విజయం సాధించాలంటే శాంతి భద్రతలకు బాధ్యత వహిస్తున్న వర్గాలు మన పక్షాన వుండితీరాలని స్వానుభవం ద్వారా నమ్ముతున్నాను. ఇందువల్లనే మన కార్యక్రమపు పరిధి నుంచి దేవాలయాలను కావాలని వదిలి వేశాను. పరిరక్షించవలసిన కర్తవ్యం ప్రభుత్వానికి వుందని భావించడం వల్ల, పౌర స్వభావం కలిగిన సార్వజనీనమైన హక్కులకే దీన్ని పరిమితం చేశాను.

## 2. సమాన అవకాశాలు

దళిత వర్గాలకు సమానావకాశాలను కల్పించడం అన్నది అస్పృశ్యతా నివారణ లీగ్ కృషి చేయవలసిన రెండవ అంశంగా భావిస్తాను. మళ్లీ దానికి మూలకారణం అస్పృశ్యతే. కూరగాయలు, పాలు, వెన్న అమ్ముకోవడం. జీవనోపాధికోసం ఎవరు పడితే వారు చేసే పనే. ఐతే గ్రామాలలోను, ఆఖరికి పట్టణాలలోను కూడా దళిత వర్గాలు ఈ పని చేయలేరని మీకు ఖచ్చితంగా తెలుసు. సవర్ణుడు ఈ వస్తువుల్ని అన్య మతస్తుడి వద్దనైనా కొంటాడుగాని దళితుడివద్ద కొనడు. ఇక ఉద్యోగాల విషయంలో అతని పరిస్థితి మరీ అధ్వాన్నం. ప్రభుత్వ శాఖల్లో ఒక మహమ్మారి కూర్చుని, ఒక కానిస్టేబుల్, ఆఖరికి ఒక నౌకరు ఉద్యోగం కూడా అతనికి దక్కకుండా చేస్తుంది. పరిశ్రమలలోనూ అతనికి యింతకంటే మంచి రాత లేదు. అమెరికాలో నీగ్రోలాగానే మంచిరోజుల్లో కొలువుకు అతడు ఆఖరు వాడు, చెడ్డ రోజులలో ఉద్వాసనకు మొదటివాడు. ఒకవేళ అతనికి కాలూనే జాగా దొరికినా, ఉన్నతికి అతనికి అవకాశాలేమిటి? బొంబాయి, అహమ్మదాబాద్ కాటన్ మిల్లులలో నెలకు 25 రూపాయలు దొరికే అతి తక్కువ శాఖే అతనికి దొరుకుతుంది. ఎక్కువ ఆర్జనవుండే నేత వంటి శాఖలు శాశ్వతంగా అతనికి మూసుకొని వుంటాయి. అతి తక్కువ ఆర్జన వున్న శాఖలలో కూడా నిచ్చెన చివరి మెట్టుకు అతడు ఎదగలేడు. యజమాని స్థానం సవర్ణ హిందువుకు సిద్ధంగా వుంటుంది. దళిత వర్గ కార్మికుడు ఎంత సీనియరూ, సమర్థుడూ అయినా నికృష్టంగా అతని వద్ద ఊడిగం చేయవలసిందే. పనిని బట్టి చెల్లించే శాఖలలో కూడా సామాజిక విచక్షణ కారణంగా సవర్ణ హిందూ ఉద్యోగులు సంపాదించినంత అతను ఆర్జించ లేడు. వైండింగు, రీలింగు శాఖలలో పనిచేసే దళిత స్త్రీలు పందలాదిగా వచ్చి నాదగ్గర మొర పెట్టుకున్నారు. ముడి సరుకును ఒక న్యాయమైన దామాషాలో కార్మికులందరికి సమంగా పంచవలసిన నాయకిణులు తమ నోట్లో మట్టి కొట్టి అంతా సవర్ణ స్త్రీలకే యిచ్చేవారు. ముఖ్యంగా హిందువుల చేతుల్లో దళితవర్గాలు గురి అవుతున్న దారుణ అసమానతకు సంబంధించిన కొద్ది దృష్టాంతరాలను మాత్రమే నేను చెప్పాను. ఇలాంటి అసమానతా సందర్భాలను ఖండించడంలో ప్రజాభిప్రాయాన్ని సమీకరించడం, వాటి కొరకు బ్యూరోలను ప్రారంభించడం అస్పృశ్యతా నివారణ లీగ్ చేపడితే సముచితంగాసమంజసంగా వుంటుందని భావిస్తాను. కాటన్ మిల్లులలోని

నేత శాఖలలో దళిత వర్గాలకు పని కల్పించడం లీగ్ మరీ ముఖ్యంగా పరిష్కరించవలసిన సమస్యగా భావిస్తాను. దీనివల్ల దళిత వర్గ సభ్యులకు మెరుగైన ఉపాధి దొరికే బృహదవకాశం కల్పించినట్లవుతుంది. హిందువులు నడిపే ప్రైవేటు కంపెనీలు, సంస్థలు దళిత వర్గాలకు ప్రోత్సాహమిచ్చి, అభ్యర్థుల సామర్థ్యాన్ని బట్టి తమ కార్యాలయాల్లో చిన్న, పెద్ద ఉద్యోగాలను యివ్వజూపితే ఎంతో ఫలితాన్ని సాధించవచ్చు.

## 3. సామాజిక సంసర్గం

ఆఖరుగా, అస్పృశ్యులంటే స్పృశ్యులు కనపరిచే వైముఖ్యాన్ని క్రమంగా విరిచివేసే ప్రయత్నం లీగ్ చెయ్యాలని నేననుకుంటాను. రెండు విభిన్న విలక్షణ వర్గాలుగా ఏర్పడేంత ఎడంగా వీరుండడానికి కారణం యిదే. ఇరువురి మధ్య సన్నిహిత సాంగత్యాన్ని ఏర్పరచడమే అత్యుత్తమ మార్గంగా భావిస్తాను. ఒకరి సన్నిధిలో మరొకరు పడే బెరుకు భావాన్ని అధిగమించటం ఉమ్మడి సంసర్గంవల్లనే సాధ్యమవుతుంది. సవర్ణుల ఇళ్ళల్లోనికి అస్పృశ్యులను అతిథులుగానో సేవకులుగానో ప్రవేశం కల్పించడం కంటే నా అభిప్రాయంలో అధిక ఫలప్రదమైన పద్ధతి లేదు. అట్లా ఏర్పరచిన సజీవ బంధం ఒక ఉమ్మడి జీవనాన్ని సాంగత్యాన్ని అనుభవంలోకి తెస్తుంది. మనం అంతా పెనుగులాడుతున్న ఐక్యతా భావానికి దారి తీస్తుంది. కాస్త, కూస్తో ముందుకు వచ్చిన చాలా మంది దీనికి సిద్ధంగా లేకపోవడం విచారకరం. భారత ప్రపంచాన్ని మహాత్ముడి ఉపవాస దీక్ష కుదిపివేసి ఆ పది రోజుల్లోనూ, తమ యజమానులు అస్పృశ్యతా నియమాలను ఉల్లంఘించి వారిని చేర దీసినందుకు సవర్ణ హిందూ నౌకర్లు సమ్మె చేసి పనిని నిలుపు చేసిన సందర్భాలు విలీపార్లే మహద్‌లలోజరిగాయి. సమ్మె ఖాళీలను దళిత సభ్యులతో భర్తీ చేసి తప్పుచేసిన నౌకర్లను శిక్షించడం ద్వారా సమ్మెను అంతం చేస్తారని నేను భావించాను. ఇది చేయక పోగా ఛాందస శక్తులకు వారు లొంగిపోయి వాళ్ళనే బలపర్చారు. ఇట్లాంటి గాలివాటపు స్నేహితులవల్ల దళిత వర్గాలకు ఏమి జరుగుతుందో నాకు తెలియడం లేదు. సానుభూతి పరులు సానుభూతి చూపడం కంటే ఏమీ చేయకపోతే అలాంటి సానుభూతిపరులు వృందువల్ల ఆపదలో ఉన్నవారికి ఒదార్పేమీ కలుగదు. నీగ్రో జాతీయుడి విమోచనం కోసం ఉత్తరాది శ్వేత వర్ణులు స్వయంగా తమ జ్ఞాతులైన దక్షిణాది శ్వేత వర్ణులతో సాక్షాత్తు యుద్ధం చేసినట్లు - హిందూసానుభూతి పరులు కూడా అవసరం పడినప్పుడు తమ జ్ఞాతులతో పోరాడటానికి కూడా సిద్ధపడతారని రుజువయ్యే వరకు సవర్ణుల చిత్త శుద్ధిని దళితవర్గాలు నమ్మలేవని లీగ్‌కు నేను చెప్పదలచాను. ఈ విషయం కొంత పక్కకు పెట్టి నేను చెప్పిన పద్ధతిలో స్పృశ్యులకూ, అస్పృశ్యులకూ మధ్య సామాజిక సంసర్గాన్ని, సాంగత్యాన్ని కల్పించవలసిన ఆవశ్యకతను హిందువుల మనస్సులకు నాటేటట్లుగా లీగ్ ప్రయత్నం చేయటం అవసరం.

## 4. నియమించవలసిన ఏజెన్సీ

ఈ కార్యక్రమం నిర్వహించడానికి కార్యకర్తలతో ఒక చాలా పెద్ద దళాన్ని లీగ్ నియమించవలసి ఉంటుంది. సంఘసేవకుల్ని నియమించడం ఒక అల్ప విషయంగా అనిపించవచ్చు. కాని ఈ సందర్భంలో నియమించవలసిన ఒకసముచితమైన ఏజెన్సీ ఎంపిక చేయడానికి నామటుకు నేను చాలా గొప్ప ప్రాముఖ్యం ఇస్తాను. ఏదో ఫలానా పనిని చేయడానికి - ఆ మాటకొస్తే ఏపనికైనా డబ్బు చెల్లించాలే గాని కార్యకర్తలు ఎప్పుడూ దొరుకుతారు. కాని అటువంటి కిరాయి కార్యకర్తలు లీగ్ ఆశయాన్ని నెరవేర్చలేరని నేను

నిశ్చయంగా చెప్పగలను. టాల్‌స్టాయ్ చెప్పినట్లు "ప్రేమించే వారే సేవించగలరు." నాఉద్దేశంలో ఈ పరీక్షలో నెగ్గగలిగింది దళిత వర్గాల నుంచి కార్యకర్తలను తీసుకున్నపుడే. అందుచేత ఎవర్ని నియమించాలి. ఎప్పుడు నియమించకూడదు అని నిర్ణయించేటపుడు లీగ్ ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలని నేను కోరుతాను. దళిత వర్గాలలో సాంఘిక సేవను తమరి అఖరి ఛాన్సుగా చేసుకున్న త్రాష్టులు లేరని నేను ధ్వనించడం లేదు. కాని మొత్తం మీద చూసుకుంటే, దళితవరాల నుంచి తీసుకున్న కార్యకర్త దీనిని మనసుపెట్టే శ్రమగా భావిస్తాడని ఖచ్చితంగా అనుకోవచ్చు. ఇది మరి లీగ్ విజయానికి అత్యంతావశ్యక మైనది. ఇక రెండో విషయం ఒక వర్గ హితమని, ఒక ధ్యేయమని పరిమితులు లేకుండా సంఘసేవ చేస్తూ పోయే ఏజన్సీలు యిది వరకే ఉన్నాయి. ఒక మంచి సహాయక గ్రాంటు మంజూరుచేస్తే అస్పృశ్యతా నివారణ లీగ్‌కు చెందిన పనిని తమ పనిలోపనిగా చేయడానికి ఇవి సిద్ధపడవచ్చు. ఇటువంటి కిరాయి సేవల పనివిధానం_ఇలాంటి మాట వాడొచ్చని అనుకుంటాను గట్టిగా సాధించేది సున్న. ఒక ధ్యేయానికి, ఒకే ఒక ధ్యేయానికి మాత్రమే అన్యమనస్కత లేని అంకితభావం ఉన్న ఏజన్సీ కావాలి. తమ ఆశయానికి ప్రాణం పట్టేందుకు గాను, కావాలని సంకుచిత మనస్కతను కోరుకున్న సంస్థలు, సంఘాలు మనకు కావాలి. కేవలం దళిత వర్గ కృషికే సమర్పణం చేసుకొనేవారికి ఈ పనిని అప్పగించాలి.

ఒక లేఖకు వుండవలసిన పరిమితులను ఈ పాటికే ఉల్లంఘించానని భయపడుతున్నాను. విసుగు పుట్టించేంతగా ఈ విషయాన్ని సాగదీయటం అక్కరలేదు. ఇంకా చాలా విషయాలు చెప్పవలసి వుంది కాని వాటిని వేరే సందర్భానికి అట్టిపెడతాను. ఇది ముగించేముందు ఒక్క సంగతి మాత్రం చెప్పదలిచాను. బ్రిటీష్ సామ్రాజ్యాన్ని పట్టి వుంచడం ప్రేమకు సాధ్యం కాని చట్టానికి సాధ్యంకాదు: బాల్‌ఫోర్ అనుకుంటాను ఈ మాట చెప్పింది. ఈ పరిశీలన హిందూ సమాజానికి కూడ సమానంగా వర్తిస్తుంది. స్పృశ్యులను, అస్పృశ్యులను ఐక్యంగా కట్టి ఉంచేది చట్టం కాదు. వేర్పాటు వోటరు వర్గాలకు బదులు ఉమ్మడి వోటరు వర్గాలను తెచ్చిపెట్టే శాసనం ముమ్మాటికీ కాదు ఉభయుల్నీ బంధించి వుంచేది ఒక్క ప్రేమ మాత్రమే. కుటుంబ పరిధికి బైట, నా ఉద్దేశంలో ప్రేమను సాధ్యం చేసేది న్యాయం మాత్రమే. అందుచేత స్పృశ్యుడు, అస్పృశ్యుడికి న్యాయం చేసేట్లు, అది కుదరకపోతే అతని **చేత** న్యాయం చేయించేటట్లు కృషి చేయడం అస్పృశ్యతా నివారణ లీగ్ యొక్క కర్తవ్యం కావాలి. నా ఉద్దేశంలో వేరే ఏదీ కూడా లీగ్ కార్యక్రమాన్ని గాని దాని మనుగడను కాని సమర్థించ లేదు.

శుభాభినందనలతో,

భవదీయుడు,

సం.బి.ఆర్. అంబేద్కర్

సాధారణ ప్రజానీకం నా అభిప్రాయాలను తెలుసుకుని నివేదించేందుకు వీలుగా దీనిని పత్రికలకు విడుదల చేస్తున్నాను,

ఎవి. ధక్కర్ మహాశయుడు,
ప్రధాన కార్యదర్శి,
అస్పృశ్యతా నివారణ లీగ్,
బిర్లా హౌస్,
న్యూ ఢిల్లీ.

# IV

నా ప్రతిపాదనలు ఎవరూ పట్టించుకోక పోవడం నాకు గొప్ప విస్మయాన్ని కలిగించింది. నిజానికి నా లేఖ అందినట్లే తెలపలేదు. ఇక నేను సంఘంలో వుండడం దండగని భావించాను. దానినుంచి తప్పుకున్నాను. నేను లేని కాలంలో ఆశయ, లక్ష్యాలు పూర్తిగా మారిపోయినట్లు తెలుసుకున్నాను. కోవాస్‌జీ జహంగీర్ హాల్ ( బొంబాయి) లో 1932 సెప్టెంబరు 30 వ తేదీన జరిగిన సమావేశంలో సంస్థ ఆశయాలుగా ప్రకటించినవి ఇవి:

"అంటరానితనానికి వ్యతిరేకంగా ప్రచారం చేయడం; దౌర్జన్యం కాని, బలాత్కారం కాని చెయ్యకుండ కేవలం శాంతియుత ప్రభోదం ద్వారా మాత్రమే సాధ్యమైనంత త్వరలో ఉమ్మడి వాడుకలోనున్న అన్ని బావులు, ధర్మశాలలు, రోడ్లు, పాఠశాలలు, స్మశానాలు, దహన వాటికలు, దేవాలయాలలో దళిత వర్గాలకు ప్రవేశం కల్పించడానికి సత్వర చర్యలు తీసుకోవడం."

ప్రారంభించిన రెండు నెలల తరువాత నవంబరు 3వ తేదీన జి.డి. బిర్లా, ఎ.వి.ధక్కర్‌లు జారీచేసిన ప్రకటనలో ఈ విధంగా వుంది:-

"వర్ణాంతర భోజనాలను, వివాహాలను వ్యతిరేకించినంతగా, సనాతనులలోని సహృదయులు కేవలం అస్పృశ్యతా నివారణను వ్యతిరేకించరని లీగ్ నమ్ముతున్నది. తన శక్తికి మించిన సంస్కరణలను చేపట్టడం లీగ్ ఆశయం కాదు. అందుచేత అస్పృశ్యత యొక్క అన్ని అవశేషాలను సవర్ణులను తొలగించి కోవాలని ప్రభోధం చేయడానికి లీగ్ కృషిచేస్తుందని స్పష్టం చేయడం వాంఛనీయం. విద్యా విషయికంగా, ఆర్థికంగా, సామాజికంగా దళిత వర్గాలను ఉన్నతికి తీసుకొని రావటం అస్పృశ్యతను దూరంచేయడంలో చాలా దూరం పోగలదు గనుక అటువంటి పనికి కరుడు కట్టిన సనాతనుల నుంచి కూడా కోకొల్లలుగా సానుభూతి లభిస్తుంది. నిజానికి ఇటువంటి పనికే లీగ్ ప్రధానంగా స్థాపించబడింది. కుల వ్యవస్థ నిర్మూలనం, వర్ణాంతర భోజనాలవంటి సాంఘిక సంస్కరణలు లీగ్ పరిధికి వెలుపల వుంచడమైనది."

సంస్థ మౌలిక ఆశయాలకు పూర్తి తిలోదకాలు ఇది. కార్యక్రమంలో అస్పృశ్యతా నివారణకు నామమాత్రమైన స్థానం మాత్రమే వుంది. సంఘపు పనిలో నిర్మాణ కార్యక్రమానికి ఇప్పుడు ప్రధాన స్థానం వచ్చింది. ఆశయ లక్ష్యాలలో ఈ మార్పు ఎందుకు తెచ్చారని అడగటం ఉపయుక్తంగా వుంటుంది. గాంధీకి తెలియకుండా, ఆయన సమ్మతి లేకుండా ఆశయ లక్ష్యాలలో ఈ మార్పువచ్చి వుండదు. ఒక వేదికగా అస్పృశ్యతా నివారణ మహాబాగా వుంటుంది. కాని ఒక ఆచరణ పథకంగా గాంధీని హిందువులకు అది చాలా దూరం చేసి తీరుతుంది. అలాంటి అప్రియత్వం కొని తెచ్చుకోవడానికి ఆయన సిద్ధ పడలేదు. అందుకని అన్నీ లాభాలేవున్న, ఏ నష్టాలూ లేని నిర్మాణాత్మక కార్యక్రమాన్ని ఆయన ఎంచుకున్నారు. అది హిందువులకంత బాధ అనిపించలేదు. హిందువుల అసంతోషాన్ని కొని తెచ్చుకోకుండా గాంధీ తన కృషి సాగించవచ్చు. నిర్మాణాత్మక కార్యకలాపం ఎటువంటి యిబ్బంది తెచ్చిపెట్టదు. పైగా బాగా చెలామణీ కావటానికి దానికొక ప్రత్యేకమైన అర్హత కూడా వుంది. అస్పృశ్యులు తమంత తాము ఒక స్వచ్ఛంద ఉద్యమాన్ని నిర్మించుకొని, పూనా ఒప్పందానికి అంగీకరింప చేయడం ద్వారా 1932లో తమ కోర్కెల అంగీకారానికి గాంధీని బలవంతంగా లొంగదీశారు.

ఇప్పుడు నిర్మాణాత్మక కార్యక్రమంవల్ల కలిగే ప్రయోజనాలను వాళ్లకు చూపిస్తూ పూర్తి చేయటం ద్వారా వారి ఉద్యమాన్ని పడకొట్టే అవకాశం వచ్చింది. కాంగ్రెసు వాదులు ఎగబడి కోరుకునే పరిణామం యిది. ఇప్పుడు అస్పృశ్యులు కూడా కాంగ్రెస్ వాదులు కావచ్చు. అది కూడా అందంగా, గౌరవప్రదంగా, దయతో అంటరాని వారిని ఖతంచేసే ఒక పథకం. ఈ నిర్మాణాత్మక కార్యక్రమాన్ని రూపు మార్చే అవకాశం వుంది. నిజానికి ఇది జరగనేజరిగింది. స్వతంత్రంగా వుండి, హిందువులను కాంగ్రెస్‌ను వ్యతిరేకించే అస్పృశ్యుల) ఉద్యమం అన్నా హరిజన సేవా సంఘానికి అసహనం. అందుకే దానిని ధ్వంసం చేయడానికి నడుం కట్టింది. ఆశయ లక్ష్యాలలో మార్పుకి ఈ ఫలితాలు వుంటాయని ఊహించి నేను సంఘం నుంచి తప్పుకున్నాను.

అస్పృశ్యుల మొదటి జట్టు సంఘాన్ని విడిచి పెట్టినపుడు వాళ్లస్థానాల్లో తిరిగి అస్పృశ్యులను నియమించడానికి గాంధీ ఏ ప్రయత్నం చేయలేదు. పైగా సంఘ నిర్వహణ కాంగ్రెస్ అనుకూల్యత వున్న హిందువుల చేతులలోకి వెళ్లనిచ్చారు. నిజానికి ఇప్పుడు సంఘం యొక్క నిర్వహణ నుంచి, ఉన్నత మార్గ దర్శకత్వం నుంచి అస్పృశ్యులను తప్పించడం సంఘపు పాలసీ అయింది. నిర్వాహణ మండలిలో అస్పృశ్యులని నియమించ వలసిందిగా వారిబృందం[1] చేసిన విజ్ఞాపనను గాంధీ తిరస్కరించడాన్ని బట్టి ఇది గ్రహించవచ్చు. ఆ బృందాన్ని ఓదార్చడానికి గాంధీ ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రవచించారు. ఆయన అన్నారు : "అస్పృశ్యుల సంక్షేమ కృషిని హిందువులు చేయవలసి రావడం వారి పాపానికి ప్రాయశ్చిత్తం. పోగుచేసిన డబ్బు హిందువులు విరాళాలుగా యిచ్చింది. అందుచేత రెండు విధాలుగా సంఘాన్ని హిందువులే నిర్వహించాలి. నైతికంగా గాని హక్కుగా గాని సంఘపు బోర్డులో స్థానాన్ని కోరడం అస్పృశ్యులకు భావ్యం కాదు." తన సిద్ధాంతం వల్ల అస్పృశ్యుల్ని ఎంత దారుణంగా అవమానించాడో గాంధీ గ్రహించలేదు. అది ఎంత గడుసుగావున్నా తన మొరటు, అమానుష తత్వాన్ని దాచుకోవటంలో విఫలమైంది. నిధుల్ని హిందువులు సేకరించారు కనుక వాటిని ఖర్చు పెట్టే విషయంలో అస్పృశ్యులకేమీ హక్కులేదని గాంధీ ఉద్దేశమైతే ఆత్మాభిమానమున్న ఏ అస్పృశ్యుడికి ఆయనతో పేచీ లేదు. అదృష్టవశాత్తు అటువంటి సాయం కోసం ఆయన వద్దకు వెళ్ళిన వారు, బతుకు తెరువు కోసం రాజకీయాలను ఒక సాధనంగా వాడుకోవాలనుకున్న నిరుద్యోగ దిమ్మరులు. తను చెప్పేది మార్పుకొక సాకు మాత్రమేనని గాంధీ గ్రహించాలి. సంఘపు మౌలిక ఆలోచనలలో ఇంత తీవ్రమైనమార్పు రావడానికి కారణం ఏమిటో ఆయన వాదం వివరించదు. ఒకప్పుడు సంఘపు పాలక మండలిలో అస్పృశ్యులు వుండాలని ఎందుకు ఆయన ఆదుర్దాపడ్డారో, ఇప్పుడెందుకు వాళ్లను తప్పించాలని నిర్ణయించు కున్నారో అడగడం సబబుగా వుంటుంది.

## V

హరిజన సేవా సంఘం మాదిరిగానే అస్పృశ్యుల సంక్షేమ నిమగ్నమైన దళిత వర్గాల మిషను సొసైటివారన్నా అస్పృశ్యులకు విరోధ భావనమేమీ లేదని ఇండియన్ సోషల్ రిఫార్మర్‌లో

---

1. గాంధీని దర్శించిన అస్పృశ్యుల బృందం మొట్టమొదటిది ఏ మాత్రం కాదు. అంతకు ముందు అనేకులు కలినప్పుడు ఫలితం ఇదే.

లేఖకుడు అన్నది సబబే. మిషనువారి పనిని ముందుకు తీసుకుపోవడంలో హిందువులూ, అస్పృశ్యులూ కూడా పూర్తిసామర్ధ్యంతో పనిచేశారు. దళిత వర్గాల మిషను వారు తమ నిర్వాహక మండలిలో ఎప్పుడూ కొంతమంది అస్పృశ్యులు వుండేటట్లు జాగ్రత్త పడటంవల్ల ఇది సాధ్యమయిందని ఆ వ్యాసకర్త అనడం సరికాదు. మిషను వారికీ, అస్పృశ్యులకూ మధ్య విరోధ భావం లేకపోవడానికి, సంఘానికీ అస్పృశ్యులకీ మధ్య వుండటానికి వేరే కారణం వున్నది. మిషను వారికి తమ కృషి వెనుక ఏరాజకీయ లక్ష్యమూ లేకపోవటం. సంఘం వారికి అది ఉండడం దీనికి కారణం.

ససేమిరా రాజకీయాలకు దూరంగా సంఘాన్ని వుంచాలని మొదట్లో ఉద్దేశం ఉన్నమాట నిజమే. 1932, నవంబరు 3 నాడు జారీచేసిన ప్రకటనలో యిలా వుంది:-

"రాజకీయ పక్షాల ప్రమేయం లేకుండా లీగ్ తన పనిని కొనసాగించవచ్చు. ఏరకమైన రాజకీయాలలోను, మతప్రచారంతోను ప్రమేయం పెట్టుకోకూడదని అది నిర్ణయించుకుంది. అందుచేత రాష్ట్ర కేంద్ర నిర్వాహక మండలుల అధిపతులు అంతా తమ క్రియాశీలక కార్యకర్తలను ఎంపిక చేసుకోడంలో చాలా జాగ్రత్తగా వుండాలి. ఈ ఆశయం ప్రకారం, రాజకీయాలలోగాని ఏ వర్గ, మత ప్రచారంలో గాని సంఘపు పూర్తి కాలపు వేతన కార్యకర్తలు పాల్గొకుండా వుండడం అవసరం." కాని ఈ సాధికార ప్రకటనను పాటించటం కంటే ఉల్లంఘించటమే ఎక్కువ జరిగింది. అంటరాని వారిని కాంగ్రెస్ భావజాలంలోకి వారిని ఆకర్షించాలనే ప్రలోభాన్ని తట్టుకోవడం అసాధ్యమై వుండవచ్చు. ముఖ్యంగా ఎంత అల్పమైనదైనా ఎంతో కొంత సేవ చేశారన్న కృతజ్ఞతా భావంవల్ల, వారు ఈ కార్యకలాపాలకు సుముఖంగా వుంటారు. హరిజన సేవాసంఘాన్ని అస్పృశ్యుల సేవా కేంద్రంగానే కాక ఒక రాజకీయ కర్మాగారంగా చేయటం బహుశా అవసరమై వుండవచ్చు. జీవన పోరాటానికి అస్పృశ్యులకు తగిన వనరులు చేకూర్చి తరువాత వాళ్ల రాజకీయాలకు వాళ్లని స్వేచ్ఛగా వదిలివేయటం కేవలం దాక్షిణ్యం అవుతుంది. అలాంటి దాక్షిణ్యాన్ని హిందువులు ఎంతకాలం పోషిస్తారు? దీర్ఘకాలం కుదరదు. అస్పృశ్యులంటే హిందువులకున్న దృక్పథ, ప్రవర్తనలలో పాప భావం లేకపోవడం, వారి పశ్చాత్తాపానికి గాని, ప్రాయశ్చిత్తానికి గాని అవసరం లేకపోవడం వల్ల, దయాధర్మాలమీద ఆధారపడ్డ సంఘం కొడిగట్టి వుండేది. దీన్ని నిరోధించి దయాధర్మాలను పొందుతూ వుండేందుకు ఫలితాలు చూపించాలని సంఘం భావించి వుండవచ్చు. అంటే అస్పృశ్యులు ఇక ఏమాత్రం స్వతంత్రంగా లేరని, మత రాజకీయాల విషయంలో వారు హిందువుల వ్యతిరేకులు కారని హిందువులకు ఋజువు చేయాలి. ఈకారణాల నా విశ్లేషణ మరీ ఖండితంగా లేకపోవచ్చు.

ఐతే హరిజన సేవా సంఘం ఒక రాజకీయ సంస్థ అని, అస్పృశ్యులను కాంగ్రెస్ కౌగిలిలోకి తేవటం దాని ఆశయం, లక్ష్యం అనేది ఎవరూ కాదనలేని సత్యం.

ముఖ్యమని నాకు తట్టిన కొన్ని దృష్టాంతరాలు మాత్రం నేను యివ్వగలను.

హరిజన సేవా సంఘం తన కార్యకర్తల సమావేశాలు ఏర్పాటు చేస్తూవుంటుంది. పైకి ఈ సమావేశాలు "భిన్న భాషా రాష్ట్రాలలో జరుగుతున్న పని ప్రగతిని పరిశీలించడానికి, అభిప్రాయాలను, అనుభవాలను కలబోసుకోవడానికి." 1939 జూన్ మొదటి వారంలో అలాంటి సమావేశ మొకటి పూనాలో జరిగింది. క్యుములేటివు వోటింగు స్థానంలో పంపకపు విధానం (డిస్ట్రిబ్యూటివు సిస్టమ్) ప్రవేశ పెట్టడం ద్వారా పూనా ఒప్పందంలోని వోటింగు విధానాన్నిమార్చమని ప్రభుత్వాన్ని కోరే ఒక తీర్మానాన్ని ఆమోదించాలని ఈ సమావేశం అనుకునట్లు తెలిసింది. పూనా ఒప్పందమే గుర్తుగా లొంగి వచ్చిన కాంగ్రెస్ ఏవిధంగా పంపకపు విధానపు వోటింగు అమలు చేయాలని పట్టుపడుతున్నదీ, అది ఏవిధంగా అస్పృశ్యులకు ప్రమాదకరంగా తయారయి పూనా ఒప్పందాన్నే రద్దుపరుస్తుందీ నేనిదివరకే చెప్పివున్నాను. కాంగ్రెసేమో ఓడి పోయింది. అస్పృశ్యులు వ్యతిరేకించారని పూర్తిగా తెలిసి కూడా కాంగ్రెస్ నెగ్గలేని పనిని సంఘం తనపైన వేసుకున్నది. రాజకీయ వాసన లేని సంస్థకు ఎంత వింత తీర్మానం! ముఖం కందగడ్డగా మారిన తాగుబోతు తాను మద్యపాన విరోధినని పొరుగు వారిని నమ్మించ బూనినట్లుందీ చందం. ఐతే అస్పృశ్యులు చేసిన ప్రదర్శనవల్ల సంఘం ఈదారి వెంట వెళ్లకుండా నిరోధించబడింది.

కాంగ్రెస్ వ్యతిరేక ధోరణి కారణంగా బొంబాయిలో నివసిస్తున్న కొన్ని అంటరాని జాతులను 'నల్ల జాబితాలలోకి' ఎక్కించే విధానాన్ని హరిజన సేవాసంఘపు బొంబాయి శాఖ అవలంబించిందని చెప్పగలిగే స్థితిలో నేనున్నాను. ఇట్లా నల్ల జాబితాలోకి ఎక్కిన జాతుల విద్యార్థులకు విద్యార్థి వేతనాలు, ఇతర విద్యాపర సహాయాలు నిరాకరించారు. అస్పృశ్యుల రాజకీయ ఉద్యమ అగ్రభాగాన నిలిచి, మొదటి నుంచీ కాంగ్రెస్‌తో పోరాడుతూ వచ్చిన మహర్ కులం నల్లజాబితాలోకి ఎక్కింది. తమ కులం వారి కాంగ్రెస్ వ్యతిరేక భావాలు తమకు లేవని విద్యార్థులు ఋజువు పరిస్తే తప్ప, మహర్ కులపు విద్యార్థులు సాధారణంగా ఈ విచక్షణకు గురి అవుతూ వుండేవారు.

చివరగా నేను యిస్తున్న దృష్టాంతరంలో హరిజన సేవా సంఘపు ప్రధాన కార్యదర్శి అయిన ఎ.వి.ధక్కర్ ప్రసక్తి వున్నది. బొంబాయి ప్రభుత్వపు వెనుకబడిన తరగతుల బోర్డులో కూడా ధక్కర్ ఒక సభ్యుడు. 1929 లో దానిని స్థాపించారు. అస్పృశ్యులకు, తదితర వెనుకబడిన తరగతులకు సంబంధించిన విషయాలపై అది అప్పుడప్పుడూ సమావేశమవుతూ ప్రభుత్వానికి సలహాయిస్తూ వుండేది.

ప్రభుత్వానికి సిఫారసు చేసే ఉద్దేశంతో బోర్డు సమావేశంలో ధక్కర్ ఒక తీర్మానాన్ని తెచ్చారు. అస్పృశ్యుల పిల్లలకని ప్రభుత్వం ప్రత్యేకించిన ఉపకారవేతనాల్ని మహర్ కులపు పిల్లలకు యివ్వరాదని. కారణం, విద్యారంగంలో మహర్ కులం ఎంతో పురోభివృద్ధి సాధించి ఇతర అస్పృశ్య జాతులకని ప్రత్యేకించి ప్రభుత్వ నిధులవాటాను వారు దక్కించుకుంటున్నారని, లేదా ఆయన ప్రకారం తస్కరిస్తున్నారని. ఆ తీర్మానం వెనుకవున్న వాస్తవాలను దర్యాప్తు చేయాలన్న తీర్మానాన్ని కిందకు పంపించారు. ఈ వాస్తవాలన్నీ తప్పని, అస్పృశ్య జాతులలో

మిగతా వారితో పోలిస్తే విద్యలో వాళ్లు ముందు లేరు సరికదా నిజంగా చాలా వెనుకబడి వున్నారని దర్యాప్తులో తేలింది. ఆ విధంగా కాంగ్రెస్ వ్యతిరేక రాజకీయాలు అనుసరిస్తున్న మహార్‌లను దండించడానికి హరిజన సేవా సంఘ ప్రధాన కార్యదర్శి అంతటి వాడు పన్నిన రాజకీయవ్యూహమేకాని ఆ తీర్మానం మరేమీ కాదు.

దీనంతటివల్ల ఏమి తేలుతుంది? హరిజన సేవా సంఘం పేరుకే ఒక ధార్మిక సంస్థ కాని, దాని అసలు ఆశయం అస్పృశ్యులను కబళించే వారిని హిందువులకు, కాంగ్రెస్ వారికి అనుయాయులుగా చేయాలని, హిందువుల సామాజిక, ధార్మిక, ఆర్థిక, రాజకీయ ప్రాబల్యం నుంచి తమ్ము తాము విముక్తి చేసుకోవాలనే ఆశయ లక్ష్యాలతో ప్రారంభించిన వారి ఉద్యమాన్ని మట్టుపెట్టాలని తెయటం లేదా? దయతో తమను చంపాలనే లక్ష్యంతో వున్న హరిజన సేవా సంఘాన్ని అస్పృశ్యులు ఒక పీడగా భావిస్తున్నారంటే ఆశ్చర్యమేముంది?

X X X

## అధ్యాయం VI

# వట్టి గొప్పలు

## కాంగ్రెస్ అందరికీ ప్రతినిధి అవుతుందా?

## I

భారత ప్రజానీకానికి ఒకే ఒక భారత రాజకీయ సంస్థగా తాను ప్రాతినిధ్యం వహిస్తానని మొండిగా గొంతు చించుకొని కాంగ్రెస్ చెబుతున్నది. ఒకప్పుడైతే ముసల్మానులకు కూడా తనే ప్రతినిధినని అది గొప్పకు పోయింది. ఈ మాట అది ఇప్పుడు అనడం లేదు. ఏమైనా అంత మొండిగా గొంతు చించుకొని అనడం లేదు. కాని అస్పృశ్యులకు సంబంధించినంత వరకు తనే ప్రతినిధినని అది తీవ్రంగా వాదిస్తూనే వుంది. రెండవ వైపున కాంగ్రెసేతర రాజకీయపక్షాలు ఈ దంభాన్ని ఎప్పుడూ తిరస్కరించాయి. అస్పృశ్యుల విషయంలో ఇది మరీ నిజం. తమకు ప్రాతినిధ్యం వహిస్తున్నామన్న కాంగ్రెస్ గొప్పల్ని తృణీకరించడానికి వారెప్పుడూ వెనుకాడ లేదు.

ప్రచారం, పబ్లిసిటీ, వనరులలో బాగా పైచేయిగా వున్న కాంగ్రెస్ ఈ వైరంలోఅస్పృశ్యులను ఇతర కాంగ్రెసేతర పక్షాలను వంచ గలిగింది. భారత వ్యవహారాలలో ఆసక్తివున్న విదేశీయులు చాలా మందికి ఈ ప్రచారం సోకి కాంగ్రెస్ చెప్పుకునే గొప్పలు నిజమని నమ్మటం మొదలు పెట్టారు. లోకమంతా ప్రచారం మీద ఆధారపడవలసి వచ్చినంత కాలం, విదేశీయుల్ని కాంగ్రెస్ చాలా తేలికగా మభ్య పెట్టింది. అందరికీ ప్రతినిధిననే కాంగ్రెస్ దంభాన్ని నిరాకరించినవారు నిస్సహాయులుగా వుండిపోయారు. పరిస్థితి తట్టుకునే దారి వారికి లేదు. కాని, రాష్ట్రశాసన సభకు 1937లో ఎన్నికలు జరిగిన తరువాత ఈ పరిస్థితిలో మార్పువచ్చింది. ప్రచార బలం వున్న ప్రకటనల మీద ఆధార పడడం పోయి అంతకంటే ఖచ్చితమైన మదింపుకు అవకాశంవున్న సీట్లు, వోట్లు ఆధారంగా ఇప్పుడే తేల్చుకుంటున్నారు.

ఎన్నికల ఫలితాలు ఏమి చెబుతున్నాయి? కాంగ్రెస్ చేజిక్కించుకున్నమొత్తం సీట్ల సంఖ్య ఎంత? కాంగ్రెస్ సాధించిన మొత్తం వోట్ల సంఖ్య ఎంత?

కాంగ్రెస్ చేజిక్కించుకున్న స్థానాల సంఖ్య ముందుగా తేలుద్దాం. ఎన్నికలు పూర్తయిన వెంటనే, రాష్ట్ర శాసన సభలకు కాంగ్రెస్ టికెట్టు పైన ఎన్నికైన వారందరిని కాంగ్రెస్ సమావేశ

పరచింది. 1937 మార్చి 19,20 తేదీలలో న్యూ ఢిల్లీలో ఈ సమావేశం జరిగింది. ఆ సందర్భంగా కాంగ్రెస్ జారీచేసిన చిరుపుస్తకంలో వాళ్ల పేర్లు యిచ్చారు. ఈ సమాచారం ఖచ్చితమని భావిస్తే ఒక్కొక్క రాష్ట్ర శాసన సభలో కాంగ్రెస్ బలం ఈ విధంగా కనబడుతుంది:-

పట్టిక 6

రాష్ట్ర శాసన సభలలో కాంగ్రెస్ బలం

| రాష్ట్రం | శాసన సభలో మొత్తం బలం | శాసన సభలో కాంగ్రెస్ బలం |
|---|---|---|
| అస్సాం | 108 | 35 |
| బెంగాల్ | 250 | 60 |
| బీహార్ | 152 | 95 |
| బొంబాయి | 175 | 85 |
| సెంట్రల్ ప్రావిన్సెస్, బేరారు | 112 | 70 |
| మద్రాసు | 215 | 159 |
| ఒరిస్సా | 60 | 36 |
| పంజాబు | 175 | 18 |
| సింధు | 60 | 8 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 228 | 134 |
| వాయువ్య సరిహద్దు రాష్ట్రం | 50 | 19 |
| మొత్తం | 1585 | 719 |

పట్టిక 7

రాష్ట్ర కౌన్సిళ్లలో కాంగ్రెస్ బలం

| రాష్ట్రం | కౌన్సిల్ మొత్తం బలం | కౌన్సిళ్లలో కాంగ్రెస్ బలం |
|---|---|---|
| అస్సాం | 18 | 0 |
| బెంగాల్ | 57 | 10 |
| బీహార్ | 26 | 8 |
| బొంబాయి | 26 | 14 |
| మద్రాస్ | 46 | 26 |
| మొత్తం | 173 | 58 |

శాసన సభ, కౌన్సిళ్లను కలుపుకొని మొత్తం 1758 స్థానాలలో కాంగ్రెస్ 777 స్థానాలు సంపాదించుకున్నట్లు ఈ పట్టికలు తెలుపుతున్నాయి. స్పష్టంగా సీట్ల సంఖ్యా పరంగా కాంగ్రెస్ పరిస్థితి యిది. ఇక వోట్ల పరంగా కాంగ్రెస్ స్థానం ఏమిటి? వోటింగు బలం విషయంలో కూడా కాంగ్రెస్ మైనారిటీ పక్షంగానే బయటపడిందని ఈ క్రింది అంకెలు చూపుతున్నాయి.

### పట్టిక 8

కాంగ్రెస్, కాంగ్రెసేతర పక్షాలు ఎన్నికలలో పోలయిన వోట్లను పంచుకొన్న సంక్షిప్త చిత్రం

| రాష్ట్రం | మొత్తం పోలయిన వోట్లు | కాంగ్రెస్‌కు పడిన వోట్లు | కాంగ్రెసేతరులకు పడిన వోట్లు |
|---|---|---|---|
| మదరాసు శాసన సభ | 4,327,734 2 | 658,966 | 1,668,768 |
| కౌన్సిలు | 33,511 | 16,907 | 16,604 |
| బొంబాయి శాసన సభ | 3,408,308 | 1,568,193 | 1,840 ,215 |
| కౌన్సిలు | 23,730 | 9,420 | 14,310 |
| బెంగాలు శాసన సభ | 3,475,730 | 1,055,900 | 2,419,839 |
| కౌన్సిలు | 5,593 | 1,489 | 4,104 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ శాసన సభ | 3,362,736 | 1,899,325 | 1,463,411 |
| కౌన్సిలు | 9,795 | 1,580 | 8,215 |
| బీహార్ శాసన సభ | 1,477,668 | 992,642 | 485,026 |
| కౌన్సిలు | 4,318 | 96 | 4,222 |
| పంజాబు శాసన సభ | 1,710,934 | 181,265 | 1,529,669 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ శాసన సభ | 1,317,461 | 678,2 | 65 639,196 |
| అస్సాం శాసన సభ | 522,332 | 129,218 | 393,114 |
| కౌన్సిలు | 2,623 | శూన్యం | 2,623 |
| వాయువ్య సరిహద్దు శాసన సభ | 179,529 | 43,845 | 135,684 |
| ఒరిస్సా శాస . సభ | 304,749 | 198,680 | 106,069 |
| సింధు శాసన సభ | 333,589 | 18,944 | 314,645 |
| మొత్తం | 20,500,340 | 9,454,635 | 11,045,705 |

ఈ అంకెలు తెలుసుకోవడం చాలదు. ఇతర పరిస్థితులను దృష్టిలో వుంచుకొని వాటిని చదవాలి. మొదటి పరిస్థితి, వోటు అర్హత స్థాయి. ఎన్నికలలో రెండు పక్షాల పరస్పర బలాలు రెండవ పరిస్థితి. వీటిని లెక్కలోకి తీసుకోకుండా ఎన్నికల ఫలితాల ప్రాముఖ్యం పూర్తిగా అర్థంకాదు. వోటు హక్కు వినియోగం చూస్తే చాలా అధికంగా వుంది. మొత్తం జనాభాతో పోల్చి చూస్తే వోటరు వర్గం చాలా చిన్నది. మొత్తం జనాభాతో అది ఎంత చిన్న భాగమో ఈ క్రింది పట్టికలోని అంకెలను చూస్తే తెలుస్తుంది:-

పట్టిక 9

| రాష్ట్రం | జనాభా 1931 | ఓటరు వర్గం |
|---|---|---|
| మదరాసు | 47,193,602 | 6,145,450 |
| బొంబాయి మరియు సింధు | 26,398,997 | 3,249,500 |
| బెంగాల్ | 51,087,338 | 6,695,483 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 49,614,833 | 5,335,309 |
| పంజాబు | 24,018,639 | 2,686,094 |
| బీహారు మరియు ఒరిస్సా | 42,329,583 | 2,932,454 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 17,990,937 | 1,741,364 |
| అస్సాం | 9,247,857 | 815,341 |
| వాయువ్య సరిహద్దు రాష్ట్రం | 4,684,364 | 246,609 |
| మొత్తం | 272,566,150 | 29,847,604 |

జనాభాలో 10 శాతానికి మాత్రమే వోటు హక్కు వుంది. అధికమైన పోలింగు వల్ల వోటరు వర్గం అంతా మధ్య తరగతి మేధావి వర్గంతో క్రిక్కిరిసింది. ఈ రెండు వర్గాలు కాంగ్రెసు అనుకూలురే. కాంగ్రెసు, కాంగ్రెసేతర పక్షాల పరస్పర బలాల వద్దకు వస్తే, ఈ క్రింది అంశాలను బాగా గమనంలోకి తీసుకోవాలి . పోరాట పటిమ, ధనం, హంగు అన్నీ కాంగ్రెస్ పక్షాన మోహరించి వున్నాయి. కాంగ్రెసేతర అభ్యర్థులకేమో పార్టీ బొక్కసం లేదు, పార్టీ హంగు లేదు. కాంగ్రెస్ అభ్యర్థులు ప్రజలకు ఆరాధ్య వీరులు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సాధించటానికి ఉద్యుక్తులై బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి శత్రువులు వారు. జైలు జీవితం కాంగ్రెస్ అభ్యర్థులకు బలిదానపు కీర్తి వెలుగునిచ్చింది. జైలుకు వెళ్లని ఏ ఒక్కరిని కాంగ్రెస్ అభ్యర్థిగా ఎంపిక చేయకుండా నియమం పాటించారు. ఇహ కాంగ్రెస్ పత్రికలు దేశంలో వేరే పత్రికలంటూ లేవని నేను చెప్పాను కాంగ్రెసేతర అభ్యర్థుల్ని బ్రిటిష్ వారు నిలబెట్టిన షోకిల్లాలు గాను, దేశానికి చేసిన సేవా త్యాగాల చరిత్ర ఏమీ లేని బ్రిటిష్ సామ్రాజ్యవాద ఏజంట్లు గాను, దేశ శత్రువులుగా, వుద్యోగాల వేటగాళ్లగా, ఒక ముంతెడు గంజినీళ్లకు దేశ క్షేమాన్ని పణంగా పెట్టే భ్రష్టులుగా ఇంకేమేమో చిత్రించారు. కాంగ్రెస్ అభ్యర్థులకు అనుకూలంగానూ, కాంగ్రెసేతరులకు వ్యతిరేకంగాను పనిచేసిన మరొక అంశం వుంది. 1920 నాటి మాంటెగు చేమ్సు ఫర్డ్ సంస్కరణలను కాంగ్రెస్ బహిష్కరించింది కనుక దేశ పరిపాలనలోని అవకతవకలకు కాంగ్రెస్ అభ్యర్థుల జవాబుదారీ ఏమీ లేదు. సంస్కరణలను అమలు జరుపుతూ పరిపాలన భాద్యతను తమ భుజాన వేసుకునే సాహసం కనపరచిన వర్గాలకు చెందిన కాంగ్రెసేతర అభ్యర్థలు అటువంటి అవకతవకలకు సమాధానం చెప్పవలసి వచ్చింది. దేశాన్ని మురికి కూపంగా తయారు చేశారని కాంగ్రెసేతర అభ్యర్థులను తిట్టి పోసి ఈ మురికినంతా ప్రక్షాలనం చేసే దేవతా

మూర్తులుగా కాంగ్రెస్ అభ్యర్థులను ఈ పత్రికలు కీర్తించాయి. ఇంతగా గాలివాటం కాంగ్రెస్‌కు అనుకూలంగా ఉన్న పరిస్థితి తెలిసిన వారికి ఎన్నికలలో కాంగ్రెస్ ముఖం వేళ్లాడేసిన తీరు విస్మయం కలిగించక తప్పలేదు. పరువు ప్రతిష్టలు, వనరులు, ప్రజాదరణ ఎంతగానో వున్న కాంగ్రెస్‌కు ఎన్నికలు నల్లేరు మీద బండిలాగ సాగ వలసినవి. కాని వారికి సీట్లలో గాని, వోట్లలో గాని 50 శాతం కూడా రాలేదు. అన్ని వర్గాలకు, జాతులకు తానే ప్రతినిధినని కాంగ్రెస్ చెపుకున్న గొప్పలకు ఆధారమేలేదని అవి వట్టి గొప్ప లేనని చెప్పడంలో ఏమైనా సందేహం వుందా ?

ఇక దీని తరువాత అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వహిస్తానని కాంగ్రేస్ చెప్పుకొనే గొప్పలని పరిశీలిస్తాను. 1937లో జరిగిన ఎనిక్కల ఫలితాలన్ని బట్టి ఈగొప్పల్ని కూడా తేల్చి వేయవచ్చు. అస్పృశ్యులకు ప్రాతినిధ్యం కల్పించడానికి ఉద్దేశించిన ఎన్నికల పథకం గురించి తెలియని వారికి కాంగ్రెస్‌కు, అస్పృశ్యులకు మధ్య జరిగిన ఎన్నికల పోరాట ఫలితాలు కూడా సరిగ్గా అర్థం కావని నా భయం. అందుచేత ముందు నేను భారత దేశ ఎన్నికల విధానం గురించి, ముఖ్యంగా విదేశీయుల ప్రయోజనార్థం, వివరించటం అవసరమని భావిస్తున్నాను. ఎన్నికల విధానంలోని నాలుగు అంశాలను ప్రస్తావించడం ద్వారా దీనిని వివరించవచ్చును. అవి: 1. వోటరు వర్గాలు అన్నవి నియోజక వర్గాలకు భారతీయ మాట. 2. వోటు హక్కు 3. ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడే హక్కు 4. గెలిచిన అభ్యర్థిని నిర్ణయించే నియమాలు.

1.1935 నాటి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టం రెండు రకాల వర్గాలను గుర్తించిది.

1. ప్రాంతీయం కానివి..
2. ప్రాంతీయమైనవి.

2. భూస్వాములు, వాణిజ్య ఛాంబర్లు, ట్రేడ్ యూనియన్లు మొదలగు ప్రత్యేక వర్గాలకు.

3. ప్రాంతీయమైన వోటరు వర్గాలు 3 రకాలు గా వున్నాయి

1. ప్రత్యేక ప్రాంతీయ వోటరు వర్గాలనే సంక్షిప్తంగా ప్రత్యేక వోటరు వర్గాలుగా పిలుస్తున్నారు.
2.. సాధారణ ప్రాంతీయ వోటరు వర్గాలు
3. రిజర్వుచేసిన సీట్లకొరకు ఉద్దేశించిన ఉమ్మడి ప్రాంతీయ వోటరు వర్గాలను మామూలుగా ఉమ్మడి వోటరు వర్గాలంటున్నారు.

4. ప్రత్యేక వోటరు వర్గాలు కులపరమైన వోటరు వర్గాలు. నిర్దేశించిన జాతులకోసం అసగా ముస్లిములు, భారత క్రైస్తవులు, యురోపియన్లు, ఆంగ్లో యిండియన్లకు ప్రాతినిధ్యం కల్పించేందుకు ఇవి ఉద్దేశించబడినవి. వీటిలో ఒక్కొక్క జాతికి చెందిన వోటర్లను మిగితా వారితో కలపకుండా ఒక వోటరు వర్గంగా ఏర్పరిచారు. వారు తమ జాతికి ప్రతినిధిగా విడిగా తమ వోట్ల ద్వారానే ఒక వోటరును ఎన్నుకుంటారు. ఒక ప్రత్యేక వోటరు వర్గం ద్వారా ఒక జాతికి చెందిన వోటర్లే వోటు వేయడానికి, ఎన్నికకు నిలబడటానికి అర్హతకలిగి వుండడం, ప్రత్యేక వోటరు వర్గం యొక్క నిర్ణాయకాంశం. అది ముస్లిం వోటరు వర్గం అయితే, వోటరు

అభ్యర్థి ముసల్మానులే అయివుండాలి అది క్రైస్తవ వోటరు వర్గం అయితే, వోటరు అభ్యర్థి క్రైస్తవుడే అయి వుండాలి. ఇట్లాగే మిగితావి. ఆ ప్రత్యేక జాతికి చెందిన వోట్ల మెజారిటీయే ఎన్నికను నిర్ణయిస్తుంది.

5. ఇక సాధారణ వోటరు వర్గమనేది మామూలుగా వుండే వోటరు వర్గం రూపంలో వుంటుంది. ప్రాంతంలో నివసిస్తు అన్ని జాతుల వోటర్లు వుంటారు. కాని ప్రత్యేక వర్గాలలోని వోటర్లు మాత్రంవుండరు. ఒక జాతికి గాని, మతానికి గాని ప్రత్యేకమైన గుర్తింపులేని కారణంగా దీనిని సాధారణ వోటరు వర్గం అన్నారు. ఇది మిగతావారి అందరి వోటరు వర్గం. అంటే ముస్లిములు, భారత క్రైస్తవులు, యూరోపియన్లు, ఆంగ్లో ఇండియన్లు కాని వారంతా ఒక సాధారణ వోటరు వర్గంలో :

1. ప్రత్యేక వోటరు వర్గంలోవున్న ఏ వోటరుకు ఈ ఎన్నికలో వోటువెయ్యడానికి, నిలబడడానికి హక్కు లేదు.
2. కులం, విశ్వాసం, జాతి నిమిత్తం లేకుండా జాబితాలో వున్న ప్రతి వోటరుకు వోటు వేసే, నిలబడే హక్కు వున్నది.
3. పోలయిన వోట్లలో సాధారణ మెజారిటీ ఎనిక ఫలితాన్ని నిర్ణయిస్తుంది.

6. ఉమ్మడి వోటరు వర్గమనేది ప్రత్యేక వోటరు వర్గానికి, సాధారణ వోటరు వర్గానికి మధ్యసంకరం వంటిది. ప్రత్యేకసాధారణ వోటరు వర్గాలకు దీనికి కొన్ని సాదృశ్యాలు విభేదాలు వున్నాయి. వాటితో కలిసే అంశాలు, విభేదించే అంశాలు క్రింద యివ్వబడ్డాయి:

I. ఉమ్మడి ప్రత్యేక వోటరు వర్గాల పోలికలు వ్యత్యాసాలు

1. ఈ రెండు కూడా ఒక సీటును ఒక ప్రత్యేక జాతికి వేరు పరుస్తాయి కనుక ఉమ్మడి వోటరు వర్గానికి ప్రత్యేక వోటరు వర్గంతో పోలిక వున్నది.
2. రెండు అంశాలలో ఉమ్మడి వోటరు వర్గం, ప్రత్యేక వోటరు వర్గంతో విభేదిస్తుంది:-

అ. ఏ జాతికైతే సీటు కేటాయించబడిందో, ప్రత్యేక వోటరు వర్గంలో ఆ జాతి వోటర్లకే వోటు హక్కు పరిమితమవుతుంది. ఇక ఉమ్మడి వోటరు వర్గంలో సీటైతే ఒక ప్రత్యేక జాతికి కేటాయించ బడుతుంది. అంటే అర్థం నిలబడే హక్కు ఆ ఫలానా జాతి సభ్యులకే పరిమితం అవుతుంది. కాని ఎన్నికలలో వోటుచేసే హక్కుమాత్రం సాధారణ వోటరు వర్గంలో లాగా మిగతా జాతులకు కూడా లభిస్తుంది.

ఆ. రెండు సందర్భాలలోను మెజారటీ వోట్ల ఆధారంగా ఎన్నిక ఫలితం వుంటుంది. కాని ప్రత్యేక వోటరు వర్గం విషయంలో మెజారిటీ ఆధిక్యత అభ్యర్థికి చెందిన జాతి వోటర్ల నుంచే లభించాలి. ఉమ్మడి వోటరు వర్గంలో మెజారిటీ ఆధిక్యత అభ్యర్థి జాతి నుంచే రానవసరం లేదు.

ii) ఉమ్మడి, సాధారణ వోటరు వర్గాల పోలికలు వ్యత్యాసాలు :-

1. సాధారణ నియోజకవర్గంలో నిలబడ్డ ఏ అభ్యర్థికైనా వోటువేసే స్వేచ్ఛ వోటరుకు వుంటుంది. ఈ విషయంలో ఉమ్మడి వోటరు వర్గంలో సాధారణ వోటరు వర్గంలో పోలుతుంది.

2. ఇక ఉమ్మడి వోటరు వర్గం రెండు అంశాలలో సాధారణ వోటరు వర్గంతో విభేదిస్తుంది.

అ. సాధారణ వోటరు వర్గం కేవలం ఒక సభ్యుడే వుండేది. కాని ఉమ్మడి వోటరు వర్గంలో ఒకటి సాధారణమైననది, ఒకటి ప్రత్యేకించ బడినది, కనీసం ఇద్దరు సభ్యుల వోటరు వర్గం అవుతుంది.

ఆ. సాధారణ వోటరు వర్గంలో సీటు ఏ ప్రత్యేక జాతికి కేటాయించబడదు. కాని ఉమ్మడి వోటరు వర్గంలో కనీసం ఒకటి వేరు పరచబడి వుంటుంది.

7. ఉమ్మడి వోటరు వర్గాల ప్రత్యేకాంశాలు: రిజర్వు సీటుతోవున్న ఒక ఉమ్మడివోటరు వర్గం, దానిని వేరు పరిచే ఈ క్రింది అంశాలు మినహా ప్రధానంగా అది సాధారణ వోటరు వర్గమే.

1. సాధారణ వోటరు వర్గం ఏకసభ్య వోటరు వర్గమే. కాని ఉమ్మడి వోటరు వర్గం బహుళ సభ్య వోటరు వర్గం అయివుంటుంది.

2. సాధారణ వోటరు వర్గంలో ఎలక్షన్ ద్వారా భర్తీ చేయవలసిన సీటుగాని, సీట్లుగాని అందరికీ అందుబాటులో వుంటాయి. వోటరు జాతితో గాని, అభ్యర్థి జాతితో గాని సంబంధం లేకుండా అభ్యర్థికి వచ్చిన వోట్ల మెజారిటీ ఎన్నికల ఫలితాన్ని నిర్ణయిస్తుంది. కాని ఉమ్మడి వోటరు వర్గంలో కనీసం ఒక సీటు ఏదైనా ప్రత్యేకమైన జాతికి రిజర్వు అవుతుంది. అంటే అటువంటి రిజర్వుస్థానానికి అభ్యర్థిగా నిలబడే హక్కును ఆ జాతి సభ్యులకే పరిమితం చేస్తారు.

3. ఉమ్మడి వోటరు వర్గంలో నిలబడే హక్కు పరిమితమై వుంటుంది గాని వోటుచేసే హక్కుకు పరిమితులు లేవు. సాధారణ వోటరు వర్గంలోని వోటర్లందరూ అనగా సీటు రిజర్వు అయిన జాతులకు చెందిన వోటర్లు కూడా రిజర్వుసీటు అభ్యర్థి ఎన్నికలో వోటు వేయడానికి అర్హత కలిగి వుంటారు.

4. రిజర్వు సీటుకు ఎన్నిక ఫలితం ప్రకటించటంలో, ఆ జాతికి చెందిన వోటర్ల తాలూకు ఫలానా యిన్ని వోట్లు, గెలిచే అభ్యర్థికి వచ్చివుండాలనే ఆంక్షలేదు. ఒక రిజర్వు సీటుకు ఒకరుగాని ఒకరి కంటే ఎక్కువగాని అభ్యర్థులున్నపుడు, వారిలో అత్యధిక సంఖ్య సంపాదించిన ఆ జాతి అభ్యర్థే గెలిచినట్లు ప్రకటించడం నియమంగా వున్నది. ఇట్లా జాతి అభ్యర్థికంటే మరొక సాధారణ అభ్యర్థి ఎక్కువ సంఖ్య వోట్లు సంపాదించినా యిందులో వ్యత్యాసం రాదు.

భారత దేశంలో అమలులోవున్న ఎన్నికల విధానం యిటువంటిది. రిజర్వుసీట్లతోవున్న ఉమ్మడి వోటరువర్గం విధానం, పైన 7లో వివరించినట్లు, అస్పృశ్యులకు వర్తించే విధానం. అస్పృశ్యులకు రిజర్వేషను సూత్రాన్ని అమలు చేయడానికి చేసిన పనేమంటే కొన్ని నిర్ణీతమైన సాధారణ వోటరు వర్గాలను ఏరి, వాటిని బహుళ సంఖ్య వోటరు వర్గాలుగా మార్పుచేసి

వాటిలో షెడ్యూలు కులాల వారికి ఒకటి లేక రెండు సీట్లను ప్రత్యేక పరచటం రాష్ట్ర శాసన సభలో షెడ్యూల్డు కులాలకు కేటాయించిన సీట్ల సంఖ్యను బట్టి ఒక్కొఉమ్మడి వోటరు వర్గంలో వారికి రిజర్వుచేసిన సీట్ల సంఖ్యను బట్టి ఈ ఏర్పాటు జరుగుతుంటుంది. ఫలితాల దృష్ట్యా కీలక స్వభావం వున్న పథకపు కొన్ని అంశాలను కూడా పరిశీలిద్దాం.

ఉమ్మడి వోటరు వర్గం సాధారణ వోటరు వర్గమే. ఇట్లా అన్నపుడు, ఆ నియోజకవర్గంలో సాధారణ వోటర్ల సముదాయమంతా వుంటుందని కాదు. ఇదివరకే వివరించినట్లుగా, ముస్లిములు, భారత క్రైస్తవులు, ఆంగ్లో యిండియన్లు యురోపియన్లకు ప్రత్యేక వోటరు వర్గాలుంటాయి. తత్ఫలితంగా ఉమ్మడి వోటరు వర్గం నుంచి ముస్లిములు, భారత క్రైస్తవులు, ఆంగ్లో యిండియన్లు, యురోపియన్ల వోటును తొలగిస్తారు. ఫలితమేమంటే షెడ్యూల్డు కులాలు, హిందువులు, పార్సీలు, యూదులకు చెందిన వోటర్లు మాత్రమే వుండి నియోజకవర్గం ఉమ్మడి వోటరు వర్గం అవుతుంది. బొంబాయిలో తప్ప పార్సీలు, యూదులు లెక్కలోకి రారు కనుక ఉమ్మడి వోటరు వర్గంలో హిందువులు, షెడ్యూల్డు కులాలు మాత్రమే వుంటారు.

అస్పృశ్యుల రిజర్వు సీటు కొరకు ఎంపిక చేసిన సాధారణ వోటరు వర్గం ద్విసభ్య నియోజకవర్గం కంటే పెద్దదైనప్పటికీ, సాధారణ వోటరువర్గంలో అస్పృశ్యులకు ఒకటికంటె ఎక్కువ సీట్లను రిజర్వుచేసే అవకాశం ఉన్నప్పటికీ, అన్ని రాష్ట్రాలను ద్విసభ్య సాధారణ వోటరు వర్గాన్ని ఎంపికచేసి అందులో హిందువులకు ఒక సీటును, షెడ్యూల్డు కులాలకు వేరొక సీటును రిజర్వు చేయడమే సాధారణ వ్యూహం. ఒక్క బెంగాల్‌లో మాత్రమే షెడ్యూల్డు కులాలకు రెండు సీట్లను రిజర్వు చేసిన మూడు నియోజక వర్గాలున్నాయి. ఆవిధంగా ఉమ్మడి వోటరు వర్గం ఒక లంకె ఉన్న నియోజకవర్గం. ఉమ్మడి వోటరు వర్గం యొక్క రెండు అంశాలను గమనించాలి. 1. ఉమ్మడి వోటరు వర్గంలో ఎప్పుడూ కూడా హిందూ వోటర్ల మెజారిటీగానో, అమిత ప్రాబల్యంవున్న మెజారిటీగానో వుంటారు. అట్లాగే షెడ్యూల్డ్ కులాల వోటర్లు ఎప్పుడూ మైనారిటీగానో, ఏమాత్రం ఛాన్సులేని మైనారిటీగానో వుంటారు. 2. షెడ్యూలు కులాలకు రిజర్వు అయిన సీటుకు నిలబడ్డ షెడ్యూల్డు కులాల అభ్యర్థిఎన్నికకు హిందూ వోటరు వోటు వేయవచ్చును. హిందూ సీటు కొరకు నిలబడ్డ హిందూ అభ్యర్థి ఎన్నికకు షెడ్యూల్డు కులాల వోటరు వోటు వేయవచ్చు. ఈపద్ధతి వ్యూహంలో సాధ్యాసాధ్యాలు ఏమిటి? రిజర్వు సీటుకు తమ విశ్వాసం చూరగొన్న షెడ్యూల్డు కులపు అభ్యర్థిని షెడ్యూల్డు కులాలవారు ఎన్నుకోగలుగుతారా, లేక షెడ్యూల్డు కులాల విశ్వాసం చూరగొనని తమ కొరముట్టు అయిన షెడ్యూల్డు కులాల అభ్యర్థిని హిందువులు ఎన్నుకోగలుగుతారా? రెండు విషయాలను విచారిస్తే ఈ సాధ్యాసాధ్యాలు తేలుతాయి:

1. హిందువులకు రిజర్వు అయిన సీట్ల సంఖ్య 2. హిందువులలో ప్రాపకం ఉన్న రాజకీయ సంస్థల స్వభావం. హిందువులకు ఒక సీటు మాత్రమే రిజర్వు అయివుండి, తమ వోట్లు చెందరవందర కాకుండా పోటీని నివారించ గలిగేటంత కట్టడి వారు చేసుకోగలిగితే, హిందువులు నిలబెట్టిన షెడ్యూల్డు కులాల అభ్యర్థి గెలవటం ముమ్మాటికి ఖాయం. దీనికి కారణం అధికవోటు ప్రాబల్యం వున్న హిందువులకు తమ సీటు గెలవడానికి అక్కరపడని అదనపు వోట్లు వుంటాయి. తాము నిలబెట్టిన షెడ్యూల్డు కులాల అభ్యర్థికి వాటిని మళ్ళించి

షెడ్యూల్డు కులాల రిజర్వు సీటు గెలుచుకోడానికి తోడ్పడవచ్చు. అమలులోవున్న ఉమ్మడి వోటరు వర్గ రిజర్వు సీట్ల విధానం ద్విసభ్య నియోజకవర్గ విధానం అవుతుంది. ఎన్నికలో పోటీ, తద్వారా వోట్ల దుబారాకు అవకాశం లేనంతగా కాంగ్రెస్ పక్షాన హిందువులు పూర్తిగా సంఘటితమై వున్నారు. పర్యవసానమేమంటే రిజర్వు సీట్లను హిందువులు గెలుచుకోడానికి తోడ్పడి, షెడ్యూల్డు కులాలకు వ్యతిరేకంగా ఈ వ్యూహం పనిచేస్తుంది. ఉమ్మడి వోటరువర్గం షెడ్యూల్డు కులాలకు రిజర్వు అయిన సీటును గెలవటానికి మెజారిటీ వోటర్లు షెడ్యూల్డు కులాలకు చెందిన వారై వుండాల్సిన అవసరం లేకపోవడం హిందువులకు పెద్ద ఎత్తున సానుకూలపడిన విషయం.

ఉమ్మడి వోటరువర్గ విధానంలోని ఈ బలహీనతలను 1937లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ ఏ విధంగా కొల్లగొట్టిందీ తరువాత వివరిస్తాను. ప్రస్తుతానికి షెడ్యూల్డు కులాలకు ప్రాతినిధ్యం కల్పించే ఉద్దేశంతో రూపొందించిన ఎన్నికల వ్యూహం ఎలాంటిదో, దాని కొన్ని రూపురేఖలు ఎంత అవిటివో, మాత్రం మీ దృష్టికి తెస్తున్నాను.

## III

ఇప్పుడు ముందుకెళ్లి ఎన్నికల ఫలితాల్ని పరిశీలిద్దాం. సరళమైన ఒకప్రశ్న అడగటంతో దీనిని ప్రారభించటం బాగుంటుంది. కాంగ్రెస్ అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వహిస్తుందని 1937 నాటి ఎన్నికలు చూపెట్టాయని కాంగ్రెస్ వారు అన్నపుడు, దాని అర్థం ఏమిటి? చాలా తేలికగా ఈ ప్రశ్నకు రెండు అర్థాలు వుండవచ్చు గనుక స్పష్టీకరణ అవసరం. కాంగ్రెస్ టికెట్‌పైన నిలబడ్డవారు విజయం సాధించారని దాని అర్థం కావచ్చు. కాంగ్రెస్ టికెట్‌పైన నిలబడ్డ అస్పృశ్య అభ్యర్థులకు అనుకూలంగా తతిమ్మా అస్పృశ్య అభ్యర్థుల కంటే ఎక్కువ వోట్లు వచ్చాయని కూడా దాని అర్థం కావచ్చు. ఈ రెండు దృక్కోణాలనుంచి ఫలితాల్ని పరిశీలించే యత్నం చేస్తాను.

గెలిచిన సీట్ల పరంగా ఎన్నికల ఫలితాలను ఇదివరకే మీముందుంచాను. తిరిగి ఆ అంకెలను యిక్కడ యివ్వడం అనవసరం. 151 సీట్లలో కాంగ్రెస్ 78 గెలిచిందని చూశాం. తాను అస్పృశ్యుల ప్రతినిధినని కాంగ్రెస్ చెప్పే వాదనకు కాంగ్రెస్‌కు, అస్పృశ్యులకు మధ్య జరిగిన ఈ పోటీ ఫలితం బలమైన సాక్ష్యమని ఎవరూ అనలేరు. కాంగ్రెస్ 78 తెచ్చుకుంటే అస్పృశ్యులు 73 తెచ్చుకున్నారు. అది నువ్వా నేనా అనిపించుకున్న పందెం.

కాంగ్రెస్ అస్పృశ్య అభ్యర్థులకు పడ్డ వోట్ల పరంగా, తాను అస్పృశ్యుల ప్రతినిధినని కాంగ్రెస్ చెప్పుకోవడాన్ని పరిశీలిద్దాం. 1937 ఎన్నికలో అస్పృశ్యవోటర్లు మొత్తం వేసిన వోట్ల సంఖ్య 1,586,456. ఈ వోట్లు ఎలా చీలాయో, కాంగ్రెస్ అస్పృశ్య అభ్యర్థులకు అనుకూలంగా ఎన్ని వోట్లు పడ్డాయో, కాంగ్రేసేతర అస్పృశ్య అభ్యర్థులకు ఎన్ని వచ్చాయో ఈ క్రింది పట్టిక చూపుతుంది.

## పట్టిక 10

| | అస్పృశ్య వోటర్ల వోట్లు | | |
|---|---|---|---|
| రాష్ట్రం | కాంగ్రెస్‌కు అనుకూలంగా | కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా | ఎన్నికలో మొత్తం పోలయిన అస్పృశ్యుల వోట్లు |
| యునైటెడ్ ప్రావిన్స్ | 52,609 | 79,57 | 132,180 |
| మదరాసు | 126,152 | 195,464 | 321,616 |
| బెంగాలు | 59,646 | 624,797 | 684,443 |
| సెంట్రల్ ప్రావిన్స్ | 19,507 | 115,324 | 134,861 |
| బొంబాయి | 12,971 | 158,076 | 171,047 |
| బీహార్ | 8,654 | 22,187 | 30,841 |
| పంజాబు | 0 | 69,126 | 69,126 |
| అస్సాం | 5,320 | 22,437 | 27,757 |
| ఒరిస్సా | 5,878 | 8,707 | 14,585 |
| మొత్తం | 290,737 | 1,295,719 | 1,586,456 |

ఒక పార్టీ గెలుచుకున్న సీట్ల సంఖ్య ఆ పార్టీకి అనుకూలంగా పడ్డ వోట్లసంఖ్య ఎప్పుడూ దామాషాన వుండదని, మైనారిటీ వోట్లలో తరచుగా ఒక పార్టీ మెజారిటీ సీట్లను సంపాదించగలదని అందరికీ తెలిసిందే. భారత దేశంలోలా ఏకసభ్య నియోజకవర్గ విధానం వున్నచోట యిది మరింత నిజం. పార్టీ సాధించిన వోట్ల సంఖ్యే నిజమైన బలాన్ని తెలుస్తుంది. ఈ కొలమానాన్ని బట్టి **1,586,456** వోట్లలో **290,737** వోట్లు మాత్రమే, అనగా **18** శాతం వోట్లు కాంగ్రెస్‌కు అనుకూలంగా పడ్డాయనేది స్పష్టమవుతుంది. **82** శాతం కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా వచ్చాయి. అస్పృశ్యుల ప్రతినిధినని కాంగ్రెస్ చెప్పుకునే గొప్పలకు ప్రతిగా యింతకంటే తిరుగులేని సాక్ష్యం వుండగలదా? వోట్ల బలాన్ని కొలబద్దగా కాంగ్రెస్‌వాదులు అంగీకరించక పోవచ్చు. గెలుచుకున్న సీట్ల ఆధారంగా తాము అస్పృశ్యుల ప్రతినిధులమని కాంగ్రెస్ గొప్ప చెప్పుకోవడం కొనసాగించవచ్చు. **151**లో **78** లేక **5** అధిక స్థానాలు,. నలుగురికీ చెప్పుకునే యోగ్యతవున్న విజయంగా తలకాయ వున్న వాడెవడూ పరిగణించడు. నిజం చెప్పవలసి వస్తే, సీట్ల ఆధారం పైన కాంగ్రెస్ పలికే దంభంకూడా పసలేనిది. కారణం

మెజారిటీ సీట్లను కాంగ్రెస్ దక్కించుకోలేదు సరికదా షెడ్యూల్డు కులాలకు రిజర్వు అయినవాటితో మైనారిటీ సీట్లనే దక్కించుకున్నదని ఎన్నికల ఫలితాన్ని ఒకింత లోతుగా విశ్లేషిస్తే తెలుస్తుంది.

కాంగ్రెస్ జమ పద్దు బోగస్ కాకుండా యదార్థంగా చూపాలంటే కాంగ్రెస్ గెలుచుకున్న మొత్తం 78 స్థానాల నుంచి ఈ దిగువ చెప్పిన తీసివేతలు చేయాలి:

1. కేవలం అస్పృశ్యుల వోట్ల నిర్ణయానికే వదిలితే కాంగ్రెస్ వోడిపోయి వుండి, హిందూ వోట్ల సాయంతో మాత్రమే కాంగ్రెస్ గెలుచుకున్న సీట్లు.

2. తిరుగులేని మెజారిటీవల్ల కాక చాలా చాలా మంది కాంగ్రెసేతర అస్పృశ్య అభ్యర్థులు కాంగ్రెస్ అస్పృశ్య అభ్యర్థికి పోటీలో నిలబడ్డంవల్ల కాంగ్రెస్ గెలుచుకున్న సీట్లు.

3. సాధారణ లేక రిజర్వు కాని సీట్లకు పోటీచేస్తున్న అభ్యర్థులకు వోట్లు వేయకుండ, ఎన్నికలలో అస్పృశ్యులు తమ వోట్లను రిజర్వు సీట్లవరకే ఉపయోగించి ఉన్నట్లైతే గెలవడం అస్పృశ్యులకు సులభసాధ్యమైన సీట్లు.

న్యాయానికి నిలబడే మనిషి ఈ తీసివేతలకి ఎలా అభ్యంతరం చెప్పగలడో నాకు తెలియడం లేదు. అస్పృశ్యులు కానివారి వోట్లవల్ల మెజారిటీ తెచ్చుకున్న అభ్యర్థి, తాను అస్పృశ్యుల ప్రతినిధినని చెప్పుకునే హక్కు లేదు. కేవలం అతను కాంగ్రెస్ టికెట్‌పైన నిలుచున్న అస్పృశ్యుడు కనక అతనిని చూపించి కాంగ్రెస్ తాను అస్పృశ్యుల ప్రతినిధినని చెప్పుకోజాలదు. ప్రత్యర్థుల శిబిరంలో చీలికవల్ల మెజారిటీ వచ్చి, చీలికలేని పక్షంలో వోడిపోయి వుండే అస్పృశ్య అభ్యర్థి అస్పృశ్యుల నిజమైన ప్రతినిధిగా పరిగణించరాదు. అట్లాగే కేవలం అతను కాంగ్రెస్ టికెట్‌పైన నిలబడ్డ అస్పృశ్యుడైనంత మాత్రాన, కాంగ్రెస్‌కు ప్రాతినిధ్యం దక్కదు. ఒక పెద్ద మెజారిటీ వోటర్లు తమ కర్తవ్యం నిర్వహించని ఎన్నికలో గెలుపొందిన రిజర్వు అభ్యర్థి కేవలం ఆ సీటు అస్పృశ్యుల సీటు అయినంత మాత్రాన వోటర్ల ప్రతినిధి కాజాలదు. అందుచేత కాంగ్రెస్ గెలుచుకున్న సీట్ల సంఖ్య మొత్తం నుంచి అస్పృశ్య అభ్యర్థులు అట్లా దక్కించుకున్న రిజర్వు సీట్లను తీసివేయాలి. నేరుగా అస్పృశ్య వోటర్ల వోట్లద్వారా కాంగ్రెస్ గెలుచుకున్న సీట్లే అది హక్కుగా గెలుచుకున్న అస్పృశ్యుల సీట్లుగా లెక్కించవచ్చు. మిగతా వన్నీ తీసివేయవలసిందే. షెడ్యూల్డు కులాలకు కేటాయించబడి కాంగ్రెస్ గెలుచుకున్న సీట్ల వివరం, ఆ విజయానికి కారణమైన పరిస్థితి వైనం ఈ దిగువ పట్టిక చూపుతుంది:

## పట్టిక 11

### కాంగ్రెస్ దక్కించుకున్న సీట్లు, అది గెలవడానికి తోడ్పడిన పరిస్థితుల విశ్లేషణ.

| | కాంగ్రెస్ గెలుచుకున్న సీట్ల సంఖ్య | | | | |
|---|---|---|---|---|---|
| రాష్ట్రం | హిందూ వోట్లతో | హిందూ వోట్లు లేకుండా | షె.కు. వోట్ల చీలికవల్ల | షె.కు. సీట్లఎన్నికలలో షె.కు. కనపరచిన నిరాసక్తత వల్ల | మొత్తం |
| | 1 | 2 | 3 | 4 | 5 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 3 | 6 | 3 | 4 | 16 |
| మదరాసు | 5 | 1 | 5 | 42 | 26 |
| బెంగాల్ సెంట్రల్ | - | 4 | - | 2 | 6 |
| ప్రావిన్సెస్ | 1 | 5 | - | 1 | 7 |
| బొంబాయి | 1 | 1 | 1 | 1 | 4 |
| బీహార్ | 1 | 3 | - | 7 | 11 |
| పంజాబు | | | | | |
| అస్సాం | 1 | 2 | - | 1 | 4 |
| ఒరిస్సా | 1 | 2 | - | 1 | 4 |
| మొత్తం | 13 | 38 | 8 | 19 | 78 |

ఎన్నికల ఫలితాల అధ్యయనం వల్ల వెలికి వచ్చిన వాస్తవాలివి. అవి తిరుగు లేనివి, అంగీకరించి తీరవలసినవి. వోట్ల కొలమానంతో విచారిస్తే కాంగ్రెస్ అస్పృశ్యుల ప్రతినిధి కాదు సరికదా, వారు కాంగ్రెస్‌ను తిరస్కరించినట్టు రుజువు అవుతుంది. సీట్ల కొలమానం బట్టి చూస్తే మొత్తం15 1 సీట్లలో కాంగ్రెస్ 38 మాత్రమే గెలుచుకుంది. అది గెలవలేక పోయింది 73 సీట్లు, హిందూ వోట్ల వల్ల అది గెలిచింది 13 సీట్లు, కాంగ్రెస్ అస్పృశ్య అభ్యర్థికి వ్యతిరేకంగా తంబగా అస్పృశ్యులు నిలబడటంవల్ల చీలిన ఫలితంగా 8, ఇక 19 సీట్లేమో అస్పృశ్యులు తెలివిమాలిన తనంతో తమకు కేటాయించిన సీట్ల ఎన్నికలో తగినంత శ్రద్ధ చూపకపోవడం వల్ల.

ఇట్లాంటి ఘటనలు జరిగిన నియోజకవర్గాలను ఈ దిగువ పట్టిక నిర్దేశించి చెబుతుంది. రాష్ట్రాల వారీగా అవి మూడు పద్దుల క్రింద వర్గీకరించబడి వున్నాయి. అనుబంధాలలో చూపిన విధంగా వాటి క్రమసంఖ్యలు యివ్వబడ్డాయి.

## పట్టిక 12
( వివరాలకు అనుబంధం II చూడండి)

| రాష్ట్రం | షెడ్యూల్డు కుల నియోజకవర్గాల విశ్లేషణ | | |
|---|---|---|---|
| | హిందూ వోట్లతో కాంగ్రెస్ గెలిచిన నియోజక వర్గాల క్రమ సంఖ్య | షెడ్యూల్డు కుల వోట్ల చీలిక వల్ల కాంగ్రెస్ గెలిచిన నియోజక వర్గాల క్రమ సంఖ్య | షెడ్యూల్డు కులాల అలక్ష్యం వల్ల కాంగ్రెస్ గెలిచిన నియోజక వర్గాల క్రమ సంఖ్య |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 1,3,4 | 8,9,10 | 11,13,14,18 |
| మదరాసు | 1,22,23,24,25 | 8,12,15,17 | 4,21 |
| బెంగాల్ | 0 | 0 | 6,7 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 6 | 0 | 15 |
| బొంబాయి | 1 | 14 | 3 |
| బీహార్ | 11 | | 0 2,6,7,8,910,13 |
| పంజాబు | 0 | 0 | 0 |
| అస్సాం | 1 | 0 | 4 |
| ఒరిస్సా | 6 | 0 | 2 |

అందుచేత కాంగ్రెస్ తాను అస్పృశ్యుల ప్రతినిధినని చెప్పుకోడం ఆది నుంచి తుది వరకు వట్టి గొప్పలే. ఎన్నికల ఫలితాల వెలుగులో ఈ భ్రమ పూర్తిగా భగ్నమయింది.

ఎన్నికల ఫలితాలు మరికొన్ని ఆసక్తికరమైన అంశాలను బయట పెడుతున్నాయి. ఈ దిగువ రెండు పట్టికలు వాటిని సంక్షిప్తంగా చూపెడుతున్నాయి.

తమకు కేటాయించిన సీట్ల ఎన్నికలో అస్పృశ్యులు కనపరచిన ఆసక్తిని 13వ పట్టిక చూపుతుంది. 151లో ఎక్కువ భాగం అంటే 121 వరకు పోటీ వున్నవి. అస్పృశ్యులకు రాజకీయ విద్యగాని, రాజకీయ చైతన్యంగాని లేని కారణంగా వారికి రాజకీయపు హక్కులు యివ్వడం దండగ అనే ఆరోపణను ఇది వమ్ముచేస్తుంది. కాంగ్రెస్‌ను అస్పృశ్యులు తమ సఖుడుగా, సహచరుడుగా చూడటం లేదు సరికదా, దానిని తమ ప్రధమ రాజకీయ శత్రువుగా పరిగణిస్తున్నారని 14 పట్టిక రుజువుచేస్తుంది. అస్పృశ్యులకు కేటాయించిన సీట్ల ఎన్నికలో కాంగ్రెస్ ప్రవేశించడాన్ని సవాలుచేయకుండా వాళ్లు ఎన్నడూ వదలలేదు. అస్పృశ్యులకు

కేటాయించిన సీటుకు కాంగ్రెస్ టికెట్‌పైన అస్పృశ్య అభ్యర్థిని నిలబెట్టిన అనేక సందర్భాలలో అస్పృశ్యులు ఆ సీటును బేలగా కాంగ్రెస్‌కు అర్పణం చేయలేదు. కాంగ్రెసేతర పక్షం టికెట్‌పైన తమ స్వంత అభ్యర్థిని నిలబెట్టి ప్రతిఘటించడానికి ముందుకు వచ్చారు. షెడ్యూల్డు కుల స్థానాలకు కాంగ్రెస్ నిలబెట్టిన 78 మంది అభ్యర్థులకు ఏకంగా 64 వరకు పోటీ పెట్టారు.

పట్టిక 13

షెడ్యూల్డు కులాల స్థానాలకు ఎన్నిక

| రాష్ట్రం | పోటీ వున్నవి | పోటీ లేనివి | మొత్తం |
|---|---|---|---|
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 15 | 5 | 20 |
| మదరాసు | 26 | 4 | 30 |
| బెంగాల్ | 28 | 2 | 30 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 19 | 1 | 20 |
| బొంబాయి | 14 | 1 | 15 |
| బీహార్ | 6 | 9 | 15 |
| పంజాబు | 6 | 2 | 8 |
| అస్సాం | 6 | 1 | 7 |
| ఒరిస్సా | 4 | 2 | 6 |
| మొత్తం | 124 | 27 | 151 |

పట్టిక 14

కాంగ్రెస్ గెలిచిన షెడ్యూలు కులాల స్థానాలు

| రాష్ట్రం | పోటీ వున్నది | పోటీ లేనివి | మొత్తం |
|---|---|---|---|
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 14 | 2 | 16 |
| మదరాసు | 24 | 2 | 26 |
| బెంగాల్ | 6 | 0 | 6 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 6 | 1 | 7 |
| బొంబాయి | 3 | 1 | 4 |
| బీహార్ | 4 | 7 | 11 |
| పంజాబు | 0 | 0 | 0 |
| అస్సాం | 3 | 1 | 4 |
| ఒరిస్సా | 4 | 0 | 4 |
| మొత్తం | 64 | 14 | 78 |

## పట్టిక - 15

ప్రతి 100 సాధారణ హిందూ వోటర్లకు షెడ్యూల్డ్ కులాల వోటర్ల నిష్పత్తి ప్రకారం వర్గీకరించబడ్డ నియోజక వర్గాల సంఖ్య

| రాష్ట్రం | 10 అంతకంటే తక్కువ | 11-15 | 16-20 | 21-25 | 26-30 | 31-35 | 36-40 | 41-45 | 46-50 | 50 పైన | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| యునైటెడ్ ప్రావిన్స్ | 0 | 7 | 3 | 6 | 2 | 1 | 0 | 1 | 0 | 0 | 20 |
| మదరాసు | 0 | 5 | 6 | 10 | 3 | 3 | 1 | 1 | 1 | 0 | 30 |
| బెంగాలు | 0 | 0 | 0 | 3 | 1 | 3 | 1 | 3 | 0 | 14 | 25* |
| సంట్రల్ ప్రావిన్స్ | 5 | 5 | 1 | 2 | 1 | 0 | 1 | 1 | 1 | 3 | 20 |
| బీహారు | 4 | 5 | 2 | 2 | 2 | 0 | 0 | 0 | 0 | 0 | 15 |
| పంజాబు | 1 | 1 | 0 | 1 | 2 | 0 | 0 | 1 | 0 | 2 | 8 |
| ఒరిస్సా | 2 | 0 | 0 | 2 | 0 | 2 | 0 | 0 | 0 | 0 | 6 |
| అస్సాం | 3 | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 1 | 0 | 2 | 7 |
| బొంబాయి | 5 | 3 | 6 | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 15 |
| మొత్తం | 20 | 27 | 18 | 27 | 11 | 9 | 3 | 8 | 2 | 21 | 146 |

బెంగాలులో షెడ్యూల్డ్ కులాలకు రెండేసి సీట్లు కేటాయించిన 5 నియోజక వర్గాలున్నాయి. వీటిలో షెడ్యూల్డ్ కులాలకు కేటాయించిన మొత్తం 30.

## IV

1937 నాటి ఎన్నికల పోరాటంలో అస్పృశ్యులపైన కాంగ్రెస్ విజయం సాధించలేదని అనటం తక్కువ చేసి చెప్పడం అవుతుంది. యదార్థంగా అస్పృశ్యులు కాంగ్రెస్‌పైన విజయభేరి మ్రోగించారు. దీనిని ఒప్పుకునేవారు చాలామంది లేరంటే, కాంగ్రెస్‌తో పోటీ పడటంలో అస్పృశ్యులు పడ్డ యిబ్బందుల అజ్ఞానమే వారి అశక్తత లేదా అయిష్టత అని చెప్పాలి. వీటిలో 3. యిబ్బందులు మరీ యదార్థమైనవి, కఠోరమైనవి. కాంగ్రెస్‌కు తాము దూరమని, కాంగ్రెస్ తమకు ప్రాతినిధ్యం వహించదని రుజువు చేసేందుకు అస్పృశ్యులు తమ పోరాటంలో కనపరచిన ధైర్య స్థైర్యాలను ప్రజలు తెలుసుకునేందుకు వాటిని వివరించటం సముచితంగా వుంటుంది.

1. వ్యవస్థాపరమైనవి 2 ఎన్నికల పరమైనవిగా ఈ యిబ్బందులను రెండు పద్దుల క్రింద వర్గీకరించ వచ్చును.

మొదటి పద్దు క్రింద రెండు అంశాలను ప్రత్యేకంగా చెప్పవలసి వుంది:-

కాంగ్రెస్‌కు, అస్పృశ్యులకు తమ కనుసన్నలలో వున్న వనరుల సాపేక్ష వ్యత్యాసం యిందులో మొదటిది. కాంగ్రెస్ అతిభాగ్యవంత మైన పార్టీ అని వేరే చెపక్కర లేదు. 1937 నాటి ఎన్నికలలో కాంగ్రెస్ వెచ్చించిన డబ్బును ఎవరూ యింతవరకూ అంచనా వేయలేదు. ప్రకటనలకు, రవాణా సదుపాయాలకు, తమ టికెట్‌పై నిలబడ్డ అభ్యర్థుల ప్రచారానికి కాంగ్రెస్ వెచ్చించిన ఖర్చు మహా భారీ అయినదని దర్యాప్తు చేస్తే తెలుస్తుంది. కాంగ్రెస్ టికెట్‌పై నిలబడ్డ అస్పృశ్యులు వాడుకునేందుకు కాంగ్రెస్ ఈ వనరులను వారికి సమకూర్చింది. కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా నిలబడ్డ అస్పృశ్య అభ్యర్థులవద్ద ఇందులో ఒక మిలియను భాగపు వనరులు కూడా లేవు. కొందరైతే తమ డిపాజిట్లు చెల్లించడానికి కూడా అప్పులు చేశారు. ప్రకటనలు, ప్రయాణాలు, ప్రచారమూ ఏ సహాయమూ లేకుండా ఎన్నికలలో వారు పోరాడారు.

కాంగ్రెస్ పక్షాన పార్టీయంత్రం వుండడం, అస్పృశ్యుల పక్షాన అది పేరుకైనా లేకపోవడం రెండవ అంశం. పార్టీ యంత్రమే కాంగ్రెస్‌కు నిజమైన బలమన్నసంగతి అందరూ ఎరిగినదే. పార్టీ యంత్రాన్ని సృష్టిచేసిన ఘనత గాంధీకి చెందాలి. గత 20 సంవత్సరాలుగా మనుగడ సాగిస్తున్న ఈ యంత్రం కాంగ్రెస్‌కున్న వనరులలో నూనెవోడుతూ, మీటనొక్కితే చాలు కదిలివచ్చే మంచి కండిషన్‌లో వున్నది. దేశంలోని ప్రతి పట్టణానికి, పల్లెకు విస్తరించిన విస్తృతమైనయంత్రమది. ఈ యంత్రాన్ని నడపడానికి కాంగ్రెస్ ఏజెంటు లేని ప్రాంతం లేదు. కాంగ్రెస్ టికెట్ పై నిలబడ్డ అస్పృశ్యులకు ఈ పార్టీ యంత్రం ఎన్నికల ప్రచారం అంతా చేసి పెడుతుంది. కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా నిలబడ్డ అస్పృశ్యులకు సాయంచేసే పార్టీ యంత్రమేమీ లేదు. భారత రాజకీయాలలో మొదటగా 1909వ సంవత్సరంలో ప్రత్యేక ప్రాతినిధ్య విధానాన్ని ప్రవేశ పెట్టారు. అప్పట్లో ఈసౌకర్యాన్ని ఒకే ఒక్క జాతికి అనగా ముస్లిములకు మాత్రమే కల్పించారు. 1920లో రాజ్యాంగాన్ని సవరించారు. సవరించిన రాజ్యాంగంలో దానిని బ్రాహ్మణేతరుల వరకు విస్తరింపచేశారు. అస్పృశ్యులు అప్పటికీ

వదిలివేయబడ్డారు. వివిధ రాష్ట్ర శాసన సభలలో నామినేషను పద్ధతిన ఒకటి రెండు సీట్ల ప్రాతినిధ్యం కల్పించి వారిని ఓదార్చారు. మొట్టమొదటిసారిగా 1935లో వారికి వోటు హక్కు, ఎన్నిక ద్వారా ప్రాతినిధ్యపు హక్కు లభించాయి. అటు వోటు హక్కు, పోటీ చేయడానికి ఇటు ఎన్నికలూ లేని కారణంగా ఒక పార్టీయంత్రాన్ని నెలకొల్పుకొనే అవసరం అస్పృశ్యులకు కలగలేదనేది స్పష్టం.1937లో హఠాత్తుగా ఎన్నికల బరిలోకి దిగమన్నపుడు వారికి సంఘటితమవటానికిగాని పార్టీ యంత్రాన్ని స్థాపించుకోడానికి గాని వ్యవధి లేదు. కాంగ్రెస్‌కు,. అస్పృశ్యులకు జరిగిన పోరాటం ఒక సైన్యానికీ, గుంపుకూ మధ్య జరిగే పోరాటం లాంటిది.

అస్పృశ్యులకెదురైన ఎన్నికల పరమైన యిబ్బందులు కూడా దీనికి దీటుగా తీవ్రంగా వున్నాయి. అస్పృశ్యులకు కేటాయించిన సీట్లు వున్న సాధారణ వోటరు వర్గాలలో హిందువులకు, అస్పృశ్యులకూ మధ్య అసమమైన వోటింగుబలం వుండడం మొదటి యిబ్బంది. సాపేక్షంగా యిరుపక్షాల వోటింగు బలాన్ని చూపే సంఖ్యలను ఈ దిగువ పట్టిక యిస్తుంది.

సాధారణ వోటరు వర్గాలలో షెడ్యూల్డు కులాల వోటర్లకంటే హిందూ వోటర్లు ఎంత ఎక్కువగా యిబ్బడిముబ్బడిగా వున్నారో ఈ పట్టిక ద్వారా తెలుస్తుంది. హిందువుల ఆధిక్యత వున్న నిష్పత్తి పైన ప్రత్యేకంగా దృష్టి కేంద్రీకరించాలి. 20 నియోజకవర్గాలలో షెడ్యూల్డు కుల వోటర్లకు, హిందూవోటర్లకు నిష్పత్తి 100 కి 10,27. నియోజక వర్గాలలో ౧౦౦కి 11 నుంచి 15 వరకు, 18 నియోజకవర్గాలలో 100 కి 15 నుంచి 20 వరకు, 27 నియోజకవర్గాలలో 100కి 21నుంచి 25 వరకు, మరి 11 నియోజకవర్గాలలో 100 కి 20 నుంచి 30 వరకు నిష్పత్తి వున్నట్లు ఈ పట్టికలోని అంకెలు తెలుపుతాయి. హిందూ వోటర్లు ఎంత అధికాధిక ప్రాబల్యంతో వున్నారో, ఎంత గట్టి వ్యత్యాసంతో హిందువులు, షెడ్యూల్డు కులాల వోటర్లను పరాస్తం చేయగలరో ఈ దృష్టాంతరాలు తెలుపుతున్నవి. ప్రతి షెడ్యూల్డు కుల నియోజకవర్గమూ ఒక ఉమ్మడి నియోజకవర్గమని, దానిలో రెండు వర్గాల వోటర్లు _ అటు షెడ్యూల్డు కులాలకు చెందినవారు, ఇటు హిందువులకు చెందినవారు కూడా షెడ్యూల్డు కుల స్థానానికి వోటుచేసి పోటీ పడి హస్తగతం చేసుకోవచ్చుని ఈ సందర్భంలో జ్ఞప్తిలో వుంచుకోవాలి. ఈ క్రీడలో, ఇద్దరి వోటింగు బలాల మధ్యవున్న వ్యత్యాసం చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటుంది. అట్లాంటి అంకె వున్న నియోజక వర్గపు ఎన్నికలో విజయం, పోటీ పడుతున్న బృందాల మధ్య సాపేక్షంగా వున్న వోట్లబలం మీదే ఆధారపడుతుంది.

అస్పృశ్యులకు సీట్లు రిజర్వు అయిన సాధారణ నియోజక వర్గాలలో ఎన్ని సీట్లు స్థిరపరచారు అన్న దాన్నిబట్టి, ఎన్నికల పరంగా రెండో యిబ్బంది కలుగుతుంది. భిన్న రాష్ట్రాలలో అవలంబించిన విధానాన్ని దిగువ పట్టిక చూపుతుంది.

## పట్టిక 16

### అస్పృశ్యులకు రిజర్వు అయిన సీట్లు వున్న సాధారణ నియోజకవర్గాల వర్గీకరణ

| రాష్ట్రం | అస్పృశ్యుల రిజర్వుసీట్ల సంఖ్య | రెండు సీట్లున్న నియోజకవర్గాల వర్గాల సంఖ్య | మూడు సీట్లు వున్న నియోజక వర్గాల సంఖ్య | నాలుగు సీట్లు వున్న నియోజక వర్గాల సంఖ్య |
|---|---|---|---|---|
| మదరాసు | 30 | 30 | 0 | 0 |
| బొంబాయి | 15 | 0 | 6 | 9 |
| బెంగాలు | 30 | 20 | 5 | 0 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 20 | 20 | 0 | 0 |
| పంజాబు | 8 | 8 | 0 | 0 |
| బీహారు | 15 | 15 | 0 | 0 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 20 | 20 | 0 | 0 |
| అస్సాం | 7 | 6 | 1 | 0 |
| ఒరిస్సా | 6 | 6 | 0 | 0 |
| మొత్తం | 151 | 12 5 | 12 | 9 |

షెడ్యూల్డు కులాలకు రిజర్వు చేసినట్టుగా ప్రకటించిన 151 సాధారణ నియోజక వర్గాలలో 130 దాకా ద్విసభ్య నియోజక వర్గాలున్నాయి. వీటిల్లో ఒక సీటును షెడ్యూల్డు కులాలకు కేటాయించగా రెండవదాన్ని సాధారణస్థానంగా వుంచారు. చాలా మందికి ఈ ద్విసభ్య నియోజకవర్గ నిధానంలో అస్పృశ్యులకు వ్యతిరేకంగా పొంచివున్న ప్రమాదం బోధ పడక పోవచ్చు. కానిప్రమాదం యదార్థమైనది. మనం యిదివరకే దృష్టి సారించినట్లు సాధారణ నియోజకవర్గంలో హిందువులకు, అస్పృశ్యులకు సాపేక్షంగావున్న వోటింగు బలాలను పరిశీలించివట్టైతే ఈ ప్రమాదం ఎంత యదార్థమైనదో స్పష్టమవుతుంది. ముగ్గురు లేక నలుగురు సభ్యులుండి, నియోజకవర్గం బహుళ సంఖ్యాక నియోజకవర్గమైనపుడు అంటే షెడ్యూల్డు కులాలకి ఒకటి రిజర్వుచేసి, మిగతా రెండు, మూడు సాధారణ అభ్యర్థులకు వదిలి పెట్టినపుడు హిందువుల వోట్ల ప్రాబల్యం అంత ప్రమాదకారి కాదు. అదే ద్విసభ్య నియోజకవర్గమై వుండి హిందువులు ఒక అభ్యర్థినే ఎన్నుకోవలసినపుడు ఈప్రమాదంముంచుకొస్తుంది. ఎన్నికకు ఎక్కువ అభ్యర్థులున్నపుడు సాధారణ స్థానానికి తమ అభ్యర్థులను గెలిపించుకోడంలో కీచులాడుకోని హిందువుల వోట్లు చీలిపోతాయి. అప్పుడు వారికి అదనపు వోట్లు వుండని కారణంగా నియోజకవర్గంలోని వారి వోట్ల అధిక బలాఢ్యత షెడ్యూల్డు కులాలకు అంతగా భయ హేతువు కాదు. అదే గెలవడానికి ఒక్క సీటు మాత్రమే

వున్నపుడు, వారి వోట్లు చిందర వందర అయ్యే అవకాశం బహు స్వల్పం. అందులో కాంగ్రెస్ స్థాపించిన మాదిరిగా సంఘటిత పార్టీ విధానంలో ఆ అవకాశాలు మృగ్యం. వాడుకోనవసరం లేకుండా వారు అట్టిపెట్టుకున్న వోట్ల బలం వారికి అదనంగా అనవసరంగా మిగులుతుంది. ఆ బలాన్ని తమ చేతిలో కీలుబొమ్మకాని స్వతంత్రుడైన షెడ్యూల్డు కులపు అభ్యర్థికి వ్యతిరేకంగా, తమ ఇష్టాను వర్తియైన షెడ్యూల్డు కులపు అభ్యర్థికి మద్దతు యివ్వడానికి స్వేచ్ఛగా వాడుకుంటారు. ఎన్నికల ఫలితాల వల్ల, హిందువులు తమ అదనపు వోట్లతో ఎంత భీభత్సం సృష్టించగలరో స్పష్టమయింది.

వోటింగు పద్ధతి, నిర్ధారించిన సీట్ల సంఖ్య సాధారణ నియోజక వర్గాలలో వోటు బలం నిస్తరించిన విధానం పరిశీలించి చూస్తే అస్పృశ్యులను వంచించడానికి ఇంత కంటే మెరుగైన వ్యూహాన్ని పన్నడం సాధ్యమా అనిపిస్తుంది. షెడ్యూల్డు కులాలను కట్టిపడవేసిన ఉమ్మడి వోటరు వర్గాలు 1832 నాటి రిఫాం యాక్టుకు ముందు ఇంగ్లండులో వున్న "రాటెన్ బరో" ల మోస్తరుగా వున్నాయి. రాటెన్‌బరో విధానంలో బరో (ప్రాంతం) ను శాసిస్తున్న ఆసామి పేరు పెట్టిన అభ్యర్థే ఎన్నికయ్యే అభ్యర్థి. అదే విధంగా ఉమ్మడి వోటరు వర్గ విధానంలో కూడా హిందువులు పేరు పెట్టిన షెడ్యూల్డు కుల అభ్యర్థే శాసన సభకు ఎన్నిక అవుతాడు. ఈ కారణం వల్లనే ఉమ్మడి వోటరు వర్గ విధానం అంటే గాంధీకి అంతభక్తి.

ముస్లిం లీగ్ బలం అంతకంతతూ పెరుగుతున్నట్లుగా చాలాచాలా వింటున్నాం. కాని ప్రత్యేక వోటరువర్గ విధానంవల్ల ముస్లిం లీగ్‌కు ఎంత భద్రత చేకూరిందో ఎవరూ గ్రహించరు. కాంగ్రెస్ ప్రమాదం నుంచి, టక్కరితనం నుంచి ముస్లింలకు భద్రత వున్నది. అస్పృశ్యులకు ఆ యోగం లేదు. కాంగ్రెస్ ధనం, కాంగ్రెస్ వోట్లు, కాంగ్రెస్ ప్రచారపు ధాటి ముందు వారు నిస్సహాయులు. వనరులు లేకుండా,. పార్టీ యంత్రం లేకుండా, ఎన్ని యిబ్బందులు ఎదురైనా, అస్పృశ్యులు వాటినన్నింటినీ అధిగమించారంటే తమ స్వతంత్ర మనుగడను పరిరక్షించుకోవాలనే వారి కాంక్ష కాంగ్రెస్‌పై వారి విజయం విదితమవుతున్నాయి.

X - X - X



చేసుకోని కులాలున్నాయి, కులక్రైస్తవులూ, కులేతర క్రైస్తవులూ అని వున్నారు. వారు ఒకరితో ఒకరు కలిసి భోజనం చేయరు. ఒకే చర్చికి వెళ్లరు. పూనా ఒప్పందానికి భాగస్వామి అయినప్పటికీ అనుసూచిత కులాలకు ప్రత్యేక మూలకమనే హోదా యివ్వనీయ కూడదనే దృఢసంకల్పంతో ఉన్నారనీ తన వ్యతిరేకవైఖరి న్యాయమనిపించడానికి ఎంతటి దుస్సాహస పూర్వకమైన వాదననైనా చెయ్యడానికి సిద్ధపడతాడని తెలియజేస్తున్నది.

ముక్తసరిగా చెప్పాలంటే అంటరానివారికి సంబంధించినంత వరకు గాంధీ యింకా సమరమార్గంలోనే వున్నాడు. మళ్లీ ఆయన గొడవ మొదలుపెట్టవచ్చు. అతన్ని నమ్మే సమయం యింకా రాలేదు. అంటరానివారు ఆత్మరక్షణకోసం అవలంబించ వలసిన సర్వోత్తమ మార్గం యిలా అనడం, **"బాబోయ్, గాంధీవున్నాడు, జాగ్రత్త!"**

# అధ్యాయం VII

# ఒక అసత్య ఆరోపణ

## అస్పృశ్యులు బ్రిటిష వారి కొరముట్లా?

### I

నేను యింతకు ముందు చెప్పినట్టు, కాంగ్రెసు గాంధీ ఆధ్వర్యం లోకి వచ్చాక ఒక సంపూర్ణ పరివర్తనం చెందింది. వీటిలో ఒక మార్పు గమనించ దగ్గది, యిదే కాంగ్రెసుకు పెద్ద కీర్తిని ఆర్జించి పెట్టి అది ప్రజల మనసులను చూరగొనేలా చేసింది. గాంధీ రాక పూర్వం అది దేశం వివిధ స్థలాల్లో ఏడాది కొకసారి సమావేశమై, భారత దేశంలో బ్రిటిష పాలనలోని ఏదో తప్పును స్పృశిస్తూ కొన్ని, ఒకొక్కప్పుడు అవే తీర్మానాలను ఆమోదించటం కంటే ఏమీ చేసేది కాదు. 1919 లో గాంధీ కాంగ్రెసు భాధ్యత తీసుకున్న తరువాత , అది కార్యాచరణ పార్టి అయింది. లేదా కాంగ్రెసు వారు చెప్పు కోవటానికి సరదా పడినట్లు, ధర్మాస్త్రాలు ఎక్కు పెట్టింది. యింతకు ముందు యిది వూహించ శక్యంకాని సంగతి. కాంగ్రెసు తన ఆయుధాగారంలో పెట్టుకొని ఎప్పుడో ఒకప్పుడు ప్రయోగించినవి: 1. సహాయ నిరాకరణం 2. బహిష్కరణ (బాయికాట్) 3.శాసనోల్లంఘనం 4. నిరశనం. ప్రభుత్వ పాఠశాలలు, కాలేజిలు, కోర్టుల్ని గుర్తించటం కాని వాటిని వుపయోగించటంగాని నిరాకరించటం ద్వారా ప్రభుత్వాన్ని నిరర్థకం చేయటం, ప్రభుత్వ ఉద్యోగాల్ని కాదనటం దాని పనిని అసాధ్యం చెయ్యటం సహాయనిరాకరణ ధ్యేయం. కాంగ్రెసు ఆజ్ఞల్ని శిరసావహించని యెడల వంచటం బహిష్కరణ ఆయుధపు గురి. దానికి సామాజికం, ఆర్థికం

అన్న రెండు అంచులున్నాయి. చాకలి, మంగలి, కసాయి, దుకాణదారు, వర్తకుడు వీరందరినీ దూరం చేయటం ద్వారా, ఒక్క మాటలో - అపరాధి జీవనం అసాధ్యం చేయటం ద్వారా, అతని సామాజిక సాంగత్యాన్ని యావత్తూ ఈ ఆయుధపు సాంఘికపుటంచు తుంచి వేస్తుంది. ఇక ఆర్థికపుటంచేయే వస్తువులు కొనటం అమ్మటం వంటి అన్ని వ్యాపార సంబంధాల్ని కోసివేస్తుంది. విదేశీ వస్తువులు అమ్మే వ్యాపార వర్గానికి హాని గురి. బ్రిటిషు ప్రభుత్వాన్ని నేరుగా దెబ్బతీయటానికి వుద్దేశించింది శాసనోల్లంఘనం. ధైర్యము నాహ్వానించి , జైళ్ళను నింపి ప్రభుత్వాన్ని అప్రతిష్ట పాలు చేయటానికి కావాలని చేసే పట్టుదిక్కారం అది. దాన్ని సామూజిక శాసనోల్లంఘనంగా గాని, వ్యక్తి గత శాసనోల్లంఘనంగా గాని ఆచరించవచ్చు. దురదృష్టవశాత్తు విస్తార జన సామాన్య స్థాయిలో కాంగ్రెసువారు ఉపవాస దీక్షను పాటించలేదు. నిరసశనం ఎప్పుడూ వ్యక్తిపనే. దురదృష్టం అమరణ నిరాహార దీక్షను గూడా కాంగ్రెసు వారు ఆచరించలేదు. అదెప్పుడూ ఒక నిర్ణీత సమయం వరకే . ప్రత్యేకంగా తన కొరకు గాంధీ అట్టిపెట్టుకున్న ఆయుధమది. ఆయన కూడా నిర్ణీత కాలానికే దానిని వాడతారు. తన భారత స్వాతంత్ర్యేచ్ఛకు ధర్మబలం కలిపించటానికి కాంగ్రెసుకు సంభందించిన నాలుగు అస్త్రాలు ఇవి.

ధర్మాస్త్రాలు తయారు చేసిన కాంగ్రెసు , వాటి ప్రయోగంలో ప్రదర్శన నిర్వహించటానికి బయలు దేరింది.. **1920 - 1942** మధ్య కాలంలో ఏదో ఒక పద్ధతిన కాంగ్రెసు చేసిన ఈ అస్త్రప్రదర్శనాలని దేశం చూసింది. అది రేపిన దుమ్ము, ధ్వనులతో వాతావరణం నిండి పోయింది, వాటిని చూడటానికి గుంపులు ఎగబడ్డారు. "స్వేచ్ఛ కొరకు పోరాటం" గా వాటిని వర్ణించారు. ఈ ధర్మాస్త్రాల వల్ల కలిగిన ప్రయోజనం ఏమిటనేది గట్టి పరిశీలనను కోరే విషయం. కాని దానికిది సందర్భంకాదు. ఇంతకంటే అధ్వాన్నమేమి వృద్ధ కాంగ్రెసు చేయగలిగి వుండేది కాదని మాత్రం అనుకుని తృప్తి చెంది వూరుకోవాలి. ఈ అస్త్రాల వాడకం నిజంగా ఒక విషాద గాధ. పూర్వం వున్నంత దూరంలోనే స్వరాజ్యం వుంది. కాని బాధ్యత ఎరగకుండా వెర్రిగా వీటిని వాడటంవల్ల దేశ విభజన మాత్రం మరింత చేరువైంది. కఠోరమైంది, మాయమైంది. వీటి ప్రయోగం వల్ల కలిగిన లాభాల్ని చర్చించటం సాధ్యంకాదు గాని ఒక్క మాట మాత్రం చెప్పుకోవాలి ఈ " స్వేచ్ఛాపోరాటాన్ని" ఎక్కువ భాగం హిందువులే జరిపారు. ఒక్క సారి మాత్రం ముసల్మానులు పాల్గొన్నారు. అది అర్ధాయుష్కమైన ఖిలాఫత్ ఉద్యమ కాలంలో. వెంటనే వాళ్లు బయట కొచ్చేసారు. తత్తిమా జాతులు, ముఖ్యంగా అస్పృశ్యులు దానిలో పాలొన లేదు . స్వలాభంకోసం అక్కడొకరు ఇక్కడొకరు దానిలో చేరవచ్చు. కాని జాతి పరంగా మాత్రం వారు వెలుపల వున్నారు. **1942** ఆగస్టులో కాంగ్రెసు చేసిన ‘ క్విటిండియా తీర్మానం’ తర్వాత జరిగిన స్వేచ్ఛా పోరాటపు ఆఖరి ముట్టడిలో యిది కొట్ట వచ్చినట్టుగా కనపడింది.

సగానికిపైబడిన జనాభా ఈ ‘స్వేచ్ఛా పోరాటంలో ’ కాంగ్రెసుతో సహాయ నిరాకరణ చేయటం ముఖ్యంగా భారతదేశానికి వచ్చి చూసిన విదేశీయుడికి కొట్టవచ్చినట్లు కనబడే వాస్తవం. ఈ వింత పరిస్థితిని చూసి సహజంగానే అతడు అప్రతిభుడై అడుగుతాడు, ఎందువల్ల ముస్లిములు, క్రైస్తవులు, అస్పృశ్యులు స్వేచ్ఛాపోరాటంలో పాల్గొనటంలేదు ? వివరణకోసం కాంగ్రెస్ వంక చూస్తాడు. తయారు చేసి సిద్ధంగా వుంచిన జవాబు కాంగ్రెస్‌వద్ద

వుంది. అస్పృశ్యులు బ్రిటిష్ సామ్రాజ్యవాదపు కీలుబొమ్మలు కావడంవల్ల వాళ్లు స్వేచ్ఛాపోరాటంలో పాల్గొనటం లేదని, యుద్ధకాలంలో తారసపడిన చాలామంది విదేశీయుల నోటిద్వారా ఈ ఆరోపణ ప్రతిధ్వని వినిపించింది. ఈ ఆరోపణ నిజమేనని చాలామంది విదేశీయులు అంగీకరించినట్టు కనపడటం తీవ్రంగా కలవరపరచే అనుభవం. ఈ వాదం సరళంగా విశ్వసనీయంగా వుండటమే దీనిని వాళ్లు అంగీకరించడానికి ఒకేఒక కారణం. ఇది రెండు ప్రయోజనాలను నెరవేరుస్తుంది. ఒక వింత స్థితికి కారణం చెప్పటం కాంగ్రెసుకు సులువైనది. పరిస్థితులు దీనికి అనుకూలంగా వున్నట్టు కనిపించటం తగిన జవాబు అవుతుంది.

లబ్ధప్రతిష్టులైన విదేశీయులుకూడా ఈ ఆలోచన బారిన పడటం వల్లగాని, లేక పోతే ఈ దుష్టప్రచారాన్ని పట్టించుకోవలసిన శ్రమ ఎవరూ తీసుకోరు. స్వేచ్ఛా పోరాటం అని చెప్పుకొంటున్న దానిలో అస్పృశ్యులు పాల్గొనకపోవటానికి కాంగ్రెస్ యిచ్చిన వివరణ అసంబద్ధమైనది. అట్లాటి వివరణ యివ్వటానికి ఒక టక్కరి మనిషే సాహసించ గలడు. అది బాగానేవుందని అంగీకరించటం ఒక మూర్ఖుడే చేయగలడు. రాబోయే కాలంలో భారత దేశపు సమస్యల గురించి విదేశీయులు ఏమనుకుంటున్నారో అన్న దానికి కొంత ప్రాముఖ్యముండటం ఖాయం కనుక, అస్పృశ్యుల గురించి అలాంటి పొరపాటు అభిప్రాయాలు వారి మనసులో నాటుకునే అవకాశం లేకుండా చేయడానికి వాస్తవ పరిస్థితిని వివరించటం అవసరమని భావిస్తాను. పైగా అస్పృశులకు వ్యతిరేకంగా చేసిన ఈ తప్పుడు ఆరోపణను ఖండించటంలో కష్టంగూడా ఏమీ లేదు. స్వేచ్ఛాపోరాటంలో అస్పృశ్యులు పాల్గోలేదంటే వారు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కీలుబొమ్మలైనందువల్ల కాదని, స్వేచ్ఛా భారతం హిందువుల ఆధిపత్యాన్ని నెలకొల్పుతుందని వారు భయపడుతున్నారని రుజువుచేయవచ్చు. అలాంటి హిందూ ఆధిపత్యంలో వారు కట్టెలు కొట్టుకుంటూ, నీళ్లు మోసుకుంటూ బతకవలసిందే కాక వారి మాన ప్రాణాలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, సౌఖ్యాన్వేషణ అన్నీ శాశ్వతంగా హరించుకు పోవడం తథ్యం.

స్వేచ్ఛా పోరాటంలో కాంగ్రెస్‌తో కలవడానికి అస్పృశ్యులు అంగీకరించక పోవడమే, సహాయ నిరాకరణ విషయంలో కాంగ్రెస్ పేర్కొన్న కారణం-నేలబారుగా వుందనడానికి చాలా గట్టి రుజువు. నిజానికది యదార్థమూ, బలవత్తరమూ అయిన కారణమై వుండాలిగదా. ఏమిటది? బనియాలు, బ్రాహ్మణులు ప్రభువులుగాను, నిమ్నజాతి హిందువులు రక్షక భటులుగాను వుండే హిందూ రాజ్యం తమకు అక్కరలేదని వాళ్ళు కులాసాగా చెప్పే మాటల్లోనే అస్పృశ్యుల సహాయ నిరాకరణానికి అసలు కారణం వుంది. ఆ ప్రభువులూ, రక్షక భటులూ అస్పృశ్యుల తరతరాల శత్రువులు. ఈ భాషా సంస్కారాన్ని నొప్పించేదిగా వుందన్నారు. కావచ్చును. ఇలాంటి నినాదాలు సంస్కారహీనంగా వున్నాయి కనుక వాటిలో విజ్ఞత లోపించింది గానీ, అవి వెల్లడిచేస్తున్న దృక్పధంలోనూ, రూపుకడుతున్న ఆశయాలలోనూ అప్రతిహతమైన శక్తిలేదని అర్ధంగాదు. కాకాపోతే వాటికి ఒక గౌరవప్రదమైన రాజకీయ సిద్ధాంతపు ముసుగు తొడగటం సాధ్యం కాకపోవచ్చు.

రాజకీయ శాస్త్ర పరిభాషలోకి అనువదించినపుడు ఈ నినాదాల వెనుకవున్న అర్థమేమిటి? బ్రిటిష్ సామ్రాజ్యవాదం నుంచి విముక్తికి అస్పృశ్యులు వ్యతిరేకం కారని వాటి అర్థం. కాని కేవలం బ్రిటిష్ సామ్రాజ్యవాదం నుంచి విముక్తితో తృప్తిపడటానికి వారు అంగీకరించరు. స్వతంత్ర భారత దేశం మాత్రమే చాలదని వారు వక్కాణించి చెప్పదలచారు. స్వతంత్ర భారతంలో ప్రజాస్వామ్యాన్ని పదిలపరచి తీరాలి. ఈ ఆశయం దృష్ట్యా చూస్తే భారత దేశంలోని ఒక వింత సామాజిక పరిణామంతో, మైనారిటీ జాతులకు ఎదురుగా కుల గ్రస్తమైన ఒక హిందువుల మెజారిటీ మోహరించియున్నది. ఈ కులగ్రస్తపు మెజారిటీ హిందువుల కోరలు తొలగించే ఏర్పాటు రాజ్యాంగంలో వుంటేతప్ప భారతదేశంలో ప్రజాస్వామ్యం పదిలం కాదు. అందుచేత భారత దేశంలోని ఈ ప్రత్యేక పరిస్థితులని పరిగణన లోకి తీసుకునే రాజ్యాంగాన్ని రూపొందించాలని అస్పృశ్యులు పట్టుపడుతున్నారు. అస్పృశ్యులను పట్టిచల్లార్చే రాజకీయాధికారం ఈ కుల గ్రస్త హిందువుల మెజారిటీ పాల పడకుండా కొన్ని రక్షణలు రాజ్యాంగంలో వుండాలని, తమ బతుకు తాము బతుకుతూ తలెత్తుకుని తిరిగే విధంగాను తమ ఎడల జరిగే దోపిడీ, దౌష్ట్యాలను నిరోధించగలిగేదిగాను వుండే కొద్దిపాటి రాజకీయ ప్రామాణిక ధర్మమది. అది పవిత్రమైనది. దానిని పరిహరించాలని ఏ హిందువూ అనుకోడు. అందుచేత అంతస్తులవారీ అసమానతా ధర్మాన్ని అవలంబిస్తున్న కులగ్రస్త హిందువుల మెజారిటీ ఏదో దాటి పోతున్న దశ కాదు, అది ఒక శాశ్వత యదార్థం, నిరంతర ప్రమాదం. అందుచేత భారత దేశానికొక రాజ్యాంగాన్ని తయారుచేయటంలో కులగ్రస్త అధిక సంఖ్యాకుల ఉనికిని విస్మరించలేము. కాగా, రక్షణలను రూపొందించి వారిని రాజకీయ ప్రజాస్వామ్యంతో సమన్వయపరచటమనే సమస్యను ఎదుర్కోవలసి వుంది. ఇదీ అస్పృశ్యుల వాదం.

ఇటీవల అఖిల భారత షెడ్యూల్డు కులాల ఫెడరేషన్ కార్యవర్గం ఆమోదించిన తీర్మానాలలో అస్పృశ్యులు కోరుకున్న రాజ్యాంగ రక్షణలు వివరించబడ్డాయి. అవి XI వ అనుబంధంలో వున్నాయి. మనవాదానికి వాటిల్లో మూడింటిని తీసుకుంటాను. 1. శాసన సభలో హామీవున్న కనీస ప్రాతినిధ్యం,2. ప్రావిధాన పార్శ్వం 'ఎగ్జిక్యూటివ్' తో హామీ వున్న కనీస ప్రాతినిధ్యం 3. ప్రభుత్వోద్యోగాలలో హామివున్న కనీస ప్రాతినిధ్యం -ఈ కోరికలను కులతత్వంగా కాంగ్రెస్ వారు ఎగతాళి పట్టించి, అస్పృశ్యుల నాయకులను ఉద్యోగాల వేటగాళ్లుగా చిత్రించారు. ఈ హామీలకు తన వ్యతిరేకతను కాంగ్రెస్ వున్నత జాతీయ పీఠంపైన నిలిపింది. ఆ పీఠానికి తానేమో క్షేత్రపాలక దైవం. రక్షణలకు వ్యతిరేకంగా కాంగ్రెస్ వాదనలో అసంబద్ధతను విదేశీయుడు అర్థం చేసుకోవటం కష్టం. ఏ ప్రయోజనాలకొరకు ఈ హామీలను కోరుతున్నారో అతను అజలోకి తీసుకుంటే, వాటిని కులతత్వంగా చిత్రించాలని కాంగ్రెస్ చేసే ప్రయత్నాన్ని శుద్ధ అసందర్భ కలాపమని అతడు గ్రహిస్తాడు.

అస్పృశ్యులు డిమాండు చేస్తున్న ఈ హామీల ఉద్దేశం శాసన, విధాన, పరిపాలనా పార్శ్వాలను తమ ప్రతినిధులతో నింపివేయాలని కాదు. కులగ్రస్త హిందువుల మెజారిటీ తమను భూగర్భంలోకి అణగదొక్కకుండా కాపాడేందుకు గాను అస్పృశ్యులు ఆశ్రయించే భూతలాలు నిజానికి ఈ హామీలు. వాటిని ఉద్దేశించింది, కులగ్రస్త అధిక సంఖ్యాకులను హద్దులలో వుంచేందుకు. అస్పృశ్యులకు అలాంటి హామీలే లేని పక్షంలో, పర్యవసానమేమంటే ఈ అధిక సంఖ్యాకులు శాసన, విధాన, పాలనా పార్శ్వాలను సంగ్రహించటమే కాదుగా

వాటిని పూర్తిగా లొంగతీసు కుంటారు. బలోపేతమైన ఈ రాజ్య యంత్రాంగం మైనారిటీలను రక్షించటంపోయి, అధిక సంఖ్యాక హిందువుల కొరముట్లుగా మారి వారి ఆజ్ఞలను తల వాలుస్తుంటుంది.

ఈ వివరణ యిచ్చాక ఎంత సామాన్య విచక్షణా జ్ఞానం వున్న బయటివాడికైనా కాంగ్రెస్‌కూ, అస్పృశ్యులకూ మధ్యవున్న పొరపొచ్చాలను అర్థం చేసుకోవటం కష్టం కాకూడదు. కులతత్వ పూంతమైన మెజారిటీ వర్గపు వునికిని గుర్తించక పోవటం ద్వారా కంగ్రెస్ ఈ సమస్యను సృష్టించిందని, అది రాజకీయ ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టని మొదటగా అతడు గ్రహించాలి. దీనికి వ్యతిరేకంగా ఈ పీడన అదుపులో పెట్టేందుకు అస్పృశ్యులు రాజ్యాంగ రక్షణ కొరకు పట్టుపడుతున్నారని కూడా అతడు గ్రహించాలి. వేరే విధంగా చెప్పాలంటే భారత దేశంలో ప్రజాస్వామ్యాన్ని పదిలం చేయాలని అస్పృశ్యులు ఆతృత పడుతున్నారు. కాంగ్రెసేమో ప్రజాస్వామ్యానిక వ్యతిరేకం కాకపోయినా, ప్రజా స్వామ్యాన్ని అర్థవంతం చేసే పరిస్థితులు నెలకొనడాన్ని ఖచ్చితంగా వ్యతిరేకిస్తున్నది.

రెండో అంశంగా అస్పృశ్యులు డిమాండు చేస్తున్న రక్షణలు ఎక్కడా లేని అపురూప విషయాలు కావని విదేశీయుడు గ్రహించగలగాలి. అదుపులూ సమన్వయాలకు ఎ చేక్స్ అండ్ బేలెన్స్‌స్‌ఏ ఈ రక్షణలు మరో పేరని, రాజకీయ ప్రజాస్వామ్యపు చాప క్రిందికి నీరు రాకుండా కాపాడేందుకు అటువంటి అదుపులూ, సమన్వయాలూ లేని రాజ్యాంగం అంటూ లేదని అతను గ్రహిస్తే అవగాహన సులువవుతుంది. అమెరికా రాజ్యాంగం నిండా ఈ అదుపులు వున్నాయ. ప్రాధమిక హక్కులు, అధకార విభజనక సంబంధించిన నిబంధనలతో వీటిని పొందుపరిచారు. ఇది గ్రహిస్తే, ఇతర దేశాల్లో మాదిరి కాకుండా అస్పృశ్యులు కోరుకున్న రక్షణలు యిక్కడ మరో రూపం దాల్చడం అతన్ని కంగారు పెట్టదు. రాజకీయ ప్రజా స్వామ్యానికి ఉత్పాతంగా పరిణమించిన శక్తుల స్వభావాన్ని బట్టి ఈ రక్షణ స్వభావం కూడా మారుతుంది. భారత దేశంలో వున్న ఈ శక్తుల తీరుతెన్నులు వేరుగనుక తప్పనిసరిగా రక్షణలు కూడా వేరురూపం ధరిస్తాయి.

మూడవ అంశంగా- కులతత్వ సంస్థ ఏదైనా వుంటే అది కాంగ్రెస కాని అస్పృశ్యులు కారని, రాజ్యాంగ రక్షణలను వ్యతిరేకించటంలో కాంగ్రెస్ అసలు ఆంతర్యం మెజారిటీ అయిన హిందువులు స్వేచ్ఛగా తిరుగాడే పచ్చిక బయలుగా రాజకీయ క్షేత్రాన్ని అట్టేపెట్టాలని, విదేశీయులు గ్రహించటంలో యిబ్బంది ఉండకూడదు. కాగ్రెస్ బహిరంగంగా చెప్పకపోయినా కులగ్రస్తంగా వుండడం దానికెంత సహజమో అతడు గ్రహించ గలగాలి. కులగ్రస్తులైన హిందువుల మెజారిటీయే కాంగ్రెస్‌కు వెన్నెముక. దాంట్లో వున్నదంతా హిందువులే, దాన్ని పోషించేదీ హందువులే. ఈ మెజారిటీయే కాంగ్రెస్ యొక్క పోషక వర్గం. అందుచేత వారి వాక్కులను పరిక్షించటం దాని విధి. జాతీయతావాదం దృష్ట్యా ఈ డిమాండ్లను తాను వ్యతిరేకిస్తున్నానని కాంగ్రెస్ చేస్తున్న వాదానికి అతడు మోసపోడు. కరుడు కట్టిన కుతత్వాన్ని స్వచ్ఛగా సాగించడానికి జాతీయతని ఒక ముసుగుగా వాడుకుంటూ ప్రపంచాన్ని కాంగ్రెస్ వంచిస్తుందని అతడు గ్రహిస్తాడు.

ఆఖరుగా - భారత రాజకీయాలలో కాంగ్రెస్ యొక్క ప్రాతినిధ్య స్వభావం అంత ప్రాధాన్యంకల విషయం ఎందుకు అయిందో అతను తెలుసుకుంటాడు. భారత రాజ్యాంగం ఎట్లా వుండాలో తేల్చే హక్కు తనకు మాత్రమే వుందని కాంగ్రెస్ అహంకరించక పోతే, కాంగ్రెస్ ప్రాతినిధ్య స్వభావం ఎలాంటిదనిగాని, అదిఎవరికి ప్రాతినిధ్యం వహిస్తుంది, ఎవరికి వహించదని గాని ఎవరూ లక్ష్యపెట్టి వుండరని అతడు గ్రహిస్తాడు. కాని అది అట్లా అహంకరిస్తుంది కనుకనే దేశం తరఫున మాట్లాడే దాని హక్కు అంత ముఖ్య సమస్య అయింది. దీనిని అంగీకరించనివారికి సవాలు చేయడం తప్ప ప్రత్యామ్నాయం లేదు.

## II

" స్వేచ్ఛా పోరాటంలో కాంగ్రెస్‌తో ఎందుకు చేరకూడదు? కాంగ్రెస్‌తో సహకారానికి రాజ్యాంగ రక్షణలపైన ఒప్పందాన్ని ముందుగానే ఒక షరతుగా ఎందుకు చేయాలి? స్వాతంత్ర్యం సంపాదించిన తరువాతనే కదా రక్షణలు కల్పించేది" అని ఇంత అయ్యాక కూడా విదేశీయులు అనవచ్చు. పైన చేసిన చర్చ అర్థం చేసుకున్న విదేశీయుడికి స్వేచ్ఛా పోరాటంలో కాంగ్రెస్‌తో సహకరించడం మంచిదికాదని అస్పృశ్యులు ఎందుకు అనుకున్నారో అర్థం చేసుకుంటాడని వదిలేయవచ్చు. ఐతే ఈ విషయాలు ఊహించలేనివారు, వాటిని తెలుసుకోదలచినవారు కొందరుండవచ్చు. అట్లాంటివారు తప్పుగా కొన్ని కారణాలను అర్థం చేసుకోడం కంటే వారికి సవ్యమైన కారణాలను తెలియచెప్పే శ్రమ తీసుకోవడం మంచిది. దీనికి వేరువేరు కారణాలున్నాయి. కొన్నిముఖ్యమైనవి మాత్రం క్రింద యిచ్చాను.

మొదటి కారణం లోకజ్ఞానం మీద ఆధారపడ్డది ". ముందుగా ఒక అంగీకారానికి రమ్మని కాంగ్రెస్‌ను డిమాండు చేయడంలో నష్టమేముంది? ముందుగా అలాంటి హామీని కాంగ్రెస్ యిస్తే వారికి పోయేదేముంది?" అని అస్పృశ్యులు అడుగుతారు. ముందుగా రక్షణల డిమాండును కాంగ్రెస్ అంగీకరిస్తే దానివల్ల లాభాలుంటాయని వారు వాదిస్తారు. మొదటగా, కులగ్రస్తులైన హిందువుల మెజారిటీ ఆధిపత్యంలో తమ స్థితిగతులెలా వుంటాయోనని భయపడే అస్పృశ్యులకు అది ధైర్యం కలుగజేస్తుంది. ఇక కాంగ్రెస్‌తో సహకరించడానికిఅస్పృశ్యుల్ని సుముఖుల్ని చేయటంలో అలాంటి హామీ ఎంతో ప్రయోజనాన్ని సాధిస్తుందనేది రెండవ అంశం. అసలు అస్పృశ్యులు ఎందుకు సహాయ నిరాకరణం చేస్తున్నారు? ఎందుకంటే- స్వాతంత్ర్యం వస్తే మళ్లీ తమను లోబర్చుకోడానికి మెజారిటీ హిందూ వర్గానికి అది సాయపడుతుందని వారు భయపడుతున్నారు. ఒక స్వల్పమైన మూల్యాన్ని చెల్లించి, అనగా ముందుగానే ఒక అంగీకారానికి వచ్చి ఈ భయాన్ని ఎందుకు తొలగించ కూడదు?

ఇక రెండవ కారణం అనుభవం మీద ఆధారపడింది. స్వేచ్ఛా పోరాటం ముగిసిన మరుక్షణం బలహీన వర్గాలకు భద్రత కల్పించడంలో బలవత్తరమైన వర్గాలు ఔదార్యం చూపుతాయని లోకానుభవం ఆశ కొల్పడం లేదని అస్పృశ్యులు అంటారు.

ఇట్లాంటి విద్రోహానికి అనేకమైన దృష్టాంతరాలు చూపవచ్చు. అమెరికాలో అంతర్ యుద్ధం తరువాత నీగ్రోలకు జరిగిన నమ్మక ద్రోహం వీటిలో అతి నీచమైనది. అంతర్ యుద్ధంలో నీగ్రోలు నెరపిన పాత్ర గురించి హెర్బర్ట్ అప్‌థేకర్ అంటాడు గదా:[1].

"నూట ఇరవై అయిదువేల బానిస రాష్ట్రాల నీగ్రోలు ఫెడరల్ సైన్యాలలో పనిచేశారు. ఉత్తరాదివారి 80 వేలమందితో కలిసి ఉత్తేజకరమైన ధైర్యం సాహసాలతో వాళ్లు 450 పోరాటాల్లో పాల్గొన్నారు. కాన్ఫెడరసీని కూలద్రోసి బానిసత్వాన్ని పారదోలటంలో యిది మిక్కిలి ముఖ్యమైన సంగతి.

నీగ్రో జాతీయుడు అసలు మనిషైతే కూడా, బానిస కావటానికే అర్హుడై పుట్టుకతో వచ్చిన మచ్చను మాపలేనంత క్షుద్రుడు అన్న సిద్ధాంతానికి కట్టుబడి, ఆ సిద్ధాంతం పునాదిగా వెలసిన రాజ్యానికి వ్యతిరేకంగా యిక్కడ రెండు లక్షలమంది నీగ్రోలు పోరాడారు.

* * *

అవమానకరమైన విచక్షణా, యిబ్బందులూ వున్నప్పటికీ రిపబ్లిక్‌కు చెందిననీగ్రో సైనికులు పోరాడారు. తెల్ల సైనికులకు నెలకు 13 డాలర్లు యిచ్చేవారు. నీగ్రోలకు 7 డాలర్లే యిచ్చేవారు. (1864 జూలై 14న, " జనవరి 1" నుంచి జీతాన్ని సమం చేశారు). చేరినప్పుడు తెల్ల రిక్రూట్లకు కానుకలుండేవి, నీగ్రోలకు శూన్యం(1864 జూన్ 15 వరకు). కమీషన్డ్ ఆఫీసర్ల స్థాయికి ఎదగడానికి నీగ్రోలకు అవకాశం లేదు............ పట్టుబడ్డ బానిస నీగ్రో సైనికులను యుద్ధ ఖైదీలుగా కాన్ఫెడరసీ ఎన్నడూ గుర్తించలేదు. పట్టుబడ్డ స్వతంత్రనీగ్రోలకు కూడా 1864 అక్టోబరు వరకు ఈ హోదా యివ్వలేదు. నీగ్రోలను చంపనైనా చంపారు, తిరిగి బానిసత్వంలోకి నెట్టారు, లేదా బందీచేసి బండ చాకిరీ చేయించారు.

* * *

ఇదిగో ఇక్కడ ఇప్పటివరకూ బానిసలుగా అణగద్రొక్క బడిన వేలాదిమంది ప్రజను, కొత్తగా తాము సాధించుకున్న స్వేచ్ఛను రక్షించుకోడానికి, తమ జనసామాన్యాన్ని విముక్తం చేసి తమ మగటిమి రుజావు పరచుకోడానికి, తాము బాగా ఎరిగున్న బానిస స్థితినుంచి తమ తల్లిదండ్రులను, భార్యా బిడ్డలను విముక్తం చేయడానికి ప్రతి కయ్యి, వాగు తాము ఎరిగున్న తమ గడ్డకు సాయుధంగా తిరిగి పంపించారు.... రిపబ్లిక్‌ను రక్షించడానికి 37 వేలమంది నీగ్రోసైనికులు ప్రత్యక్ష యుద్ధంలో హతులయ్యారని ఎల్లవేళలా స్మరించుకోవలసిన విషయం."

అంతర్ యుద్ధం ముగిశాక నీగ్రోల స్థితి ఏమిటి? యూనియన్‌ను రక్షించడానికి యుద్ధాన్ని తలపెట్టి, దాన్ని గెలవడానికి నీగ్రోల సాయం అందిపుచ్చుకున్న రిపబ్లిక్‌లు ప్రథమ విజయోత్సాహంలో రాజ్యాంగపు 13వ సవరణను ఆమోదించారు. చట్టపరమైన అర్థంలో నీగ్రోలు యిక బానిసలుకారు. కాని వోటర్లుగా లేదా అధికారులుగా ప్రభుత్వంలో పాల్గొనేందుకు నీగ్రోలకేమైనా హక్కు కల్పించారా? రాజకీయంగా తెల్లవారితో సమానంగా దక్షిణరాష్ట్రాలలో

1 అంతర్ యుద్ధంలో నీగ్రో పుటలు 35-40

నీగ్రోలను మన్నన చేయడానికి రిపబ్లికన్‌లు కొంత కృషి చేశారు. ఇది 14వ సవరణవల్ల జరిగింది. సంయుక్త రాష్ట్రాలలో పుట్టిన, లేదా స్నాతకులైన నీగ్రోలతో సహా అందరు వ్యక్తులకు అటు రాష్ట్ర పౌర సత్వాన్ని, ఇటు ఫెడరల్ పౌరసత్వాన్ని కూడా యిది దఖలు పరిచింది. సంయుక్త రాష్ట్రాల ఏ పౌరుడిహక్కులను, రక్షణలను కుదించే శాసనాలను రాష్ట్రాలు చేయడం నిషేధించింది. వోటు హక్కును తొలగించిన పౌరుల సంఖ్యకు దామాషాగా అటువంటి రాష్ట్రానికి చెందిన కాంగ్రెస్ ప్రాతినిధ్యాన్ని తగ్గించింది. 14వ సవరణను మన్నించే ఉద్దేశం దక్షిణ రాష్ట్రాలకు లేదు. టెన్నీస్సీ మినహాయించి అన్ని రాష్ట్రాలూ సవరణను కాదని (తెల్ల వాస్తవ్యులతో ప్రభుత్వాలను) ఏర్పరచాయి. తెల్ల వాస్తవ్యులతో ఏర్పరచిన ప్రభుత్వాలను విస్మరించి ఇంకా యూనియన్‌లో పునఃప్రవేశం కల్పించని రాష్ట్రాలకు చట్టబద్ధమైన ప్రభుత్వాలను ఏర్పాటు చేయడానికి, అలాంటి పునఃప్రవేశానికి తగిన షరతులను నిర్ణయిస్తూ రిపబ్లికన్లు పునర్నిర్మాణ చట్టం (తిరుగుబాటు) రాష్ట్రాలకు సమర్థమైన ప్రభుత్వాలను ఏర్పాటు చేసే బిల్లుగా పిలువబడ్డ శాసనాన్ని ఆమోదించడానికి ఉద్యుక్తులయ్యారు. (1867 మార్చి, 2). టెన్నిస్సీ మినహాగావిడిపోవాలని కోరిన మిగతా దక్షిణాదినంతా ఈ చట్టం ద్వారా 5 మిలటరీ జిల్లాలుగా విభజించారు. వీటిని ఫెడరల్ సైన్యానికి చెందిన ఒక్కొక్క బ్రిగేడియర్ జనరల్ పరిపాలిస్తాడు. ఈ ఏర్పాటు రాష్ట్రసభ క్రొత్త రాజ్యాంగాన్ని రూపొందించే వరకు 14వ సవరణను అనుమోదించేటంత వరకు (రాటిఫై) రాష్ట్రాలకు సముచిత పునః ప్రవేశానుమతి లభించేంత వరకు ఉంటుంది. 15వ సవరణగా వేరు పడిన మరొక సవరణ కూడా రిపబ్లికన్‌లు ఆమోదించారు. పూర్వబానిస స్థితి, వర్ణం, జాతి, ఆధారంగా పౌరుల వోటింగు హక్కుని కుదించడాన్ని ఈ సవరణ నిషేధించింది. పైన చెప్పిన మోస్తరు అంగీకారంతో యిది కూడా రాజ్యాంగంలో భాగమై అన్ని రాష్ట్రాలకు శిరోధార్యమైంది.

సమాన పౌరసత్వానికి నీగ్రోలను అనుమతించే ఉద్దేశం దక్షిణాది తెల్లవారికి లేదు. నీగ్రోలకు వోట్లు లేకుండా చేయడం బాగా ముందుకు సాగింది. దక్షిణాది రాష్ట్రాలలోని తెల్లవారు, రాష్ట్ర ప్రభుత్వాలు కూడా దీనినొక పవిత్ర ధర్మంగా చేపట్టారు. 15వ సవరణ నుంచి తప్పుకోవడానికి దక్షిణాది రాష్ట్రాలు తమ తెలివితేటలనన్నీ ఉపయోగించి వోటు చట్టాలను రూపొందించాయి. జాతి, వర్ణం మీద ఆధారపడకుండా వేరే 'కారణాలు చూపించి నీగ్రోల వోటు హక్కును అవి కాలరాచాయి. నీగ్రోలను పూర్తిగా వదిలివేసి, తెల్లవారికి పూర్తిగా అన్వయించే తాతయ్య[1] నిబంధనను చాలా రాష్ట్రాలు అమలు చేశాయి. కూ క్లక్స్ క్లేన్ వారు ప్రజల పక్షాన ఈ తతంగాన్ని అమలుచేశారు. ఆరంభంలో తమ వినోదార్థం టెన్నిస్సీ యువకులు ఒక రహస్య సంస్థగా ఈ క్లేన్‌ను ప్రారంభించారు. నీగ్రోలను అణచివేసి వాళ్ళ రాజకీయ హక్కులను అడ్డుకునే సంస్థగా యిది మార్పు చెందింది. దక్షిణ గ్రామీణ ప్రాంతాలలో నీగ్రోలపైన, వారి సానుభూతిపరులైన శ్వేతవర్ణులపైన కొంత తక్కువగా ఈ సంస్థ అత్యాచారాలు చేయడం ఆరంభించింది. ఈ గూండాలను ఎప్పుడూ ఎవరూ పట్టుకోలేదు. అంటే దక్షిణాది తెల్ల జనాభాయొక్క మద్దతు క్లేను మనుషులకు పూర్తిగా ఉందని యిదిరుజువు చేస్తుంది. బహిరంగంగా ఫెడరల్ సైన్యాలను ఎవరూ ప్రతిఘటించలేదు. కాని ఈ కాలంలో కొన్ని జిల్లాలు లజ్జతో తలవంచుకో వలసినట్లుగా జరిగిన కొరడా దెబ్బలు, గృహ దహనాలు,

1 తాత అనుభవించిన వోటు హక్కును వారసత్వంగా అనుభవించే మనవడికి పరిమితం చేయటం వల్ల దీనికి తాతయ్య నిబంధన అని పేరు వచ్చింది.

హత్యలూ నిరోధించటంలో ఈ సైన్యపు చర్యలుగాని, కాంగ్రెస్ అమలు చేసిన అపరాధ చట్టాలు గాని కొరగాకుండా పోయాయి.

అమెరికా సుప్రీం కోర్టువారి తీర్పు దక్షిణాది రాష్ట్రాల ధ్యేయాన్ని, అక్కడి శ్వేతవర్ణుల కార్యాన్ని సులువు చేశాయి. 15వ సవరణ ఉన్నప్పటికీ, నీగ్రోల వోటు హక్కును కాదన్న రాష్ట్ర చట్టాలు న్యాయ సమ్మతమేనని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఎందుకయ్యా అంటే -అవి జాతి, వర్ణ వివక్షత చూపలేదు కనుక. అట్లాగే కూక్లక్స్ వారి కార్యకలాపాలు నీగ్రోలను తమ వోటు హక్కు వినియోగించకుండా అడ్డుకున్నా నిష్కృతి లేదని సుప్రీం కోర్టు నిర్ణయించింది. ఎందుకంటే- వోటు హక్కుల జోలికి రాష్ట్రాలు పోరాదని 15వ సవరణ చెప్పింది కాని ప్రైవేటు సంస్థలను అది నిరోధించదట.

ఇక రిపబ్లికన్‌లు ఏం చేశారు? నీగ్రోలకు రాజ్యాంగం ద్వారా సవ్యమైన, సమర్థమైన రక్షణలు కల్పించటం పోయి వారు దక్షిణ రాష్ట్రాలను గుర్తించి యూనియన్‌లో చేర్చుకున్నారు. తిరుగుబాటు దారులకు టోకుగా క్షమాభిక్ష ప్రసాదించి, నీగ్రోలను వారి దయాదాక్షిణ్యాలకు వదిలివేసి సైన్యాలను ఉపసంహరించారు. ఆప్థేకర్ అంటారు కదా[1].

"ప్రజాస్వామ్యం కొరకు, భూమి కొరకు, పౌర హక్కుల కొరకు, దక్షిణాదిన నీగ్రో ప్రజలు, వారి మిత్రులు జరిపిన వీరోచిత పోరాటం, ఉత్తరాదికి చెందిన పారిశ్రామిక సంపన్న బూర్జువా వర్గాలు చేసిన లజ్జా రహిత విద్రోహం వల్లవీగి పోయింది. ఈ వర్గం 1877లో దక్షిణాదికి చెందిన తిరోగామి భూస్వామ్యవర్గంతో చేతులు కలిపింది. దక్షిణాది రాష్ట్రాలలో పాత బానిస స్వామ్యానికి పూర్తి పెత్తనం అప్పచెప్పి, రిపబ్లికన్ పార్టీలోని తిరోగామి పార్శ్వం ద్వారా ఉత్తరాది బడా బూర్జువా వర్గం విప్లవాన్ని అమ్మివేసింది. ఈ పెద్దమనుషుల ఒప్పందానికి అర్థం నీగ్రో వోటు హక్కుకు తిలోదకాలు, వెట్టిచాకిరి, పంపకం వేటాడి హింసించే ఉగ్రవాదం, విద్యావకాశాలు, పౌరస్వత్వాలు హరించుకు పోవడం."

ఈ విద్రోహ గాధ పూర్తి కాలేదు. దక్షిణాదిలో కూడా రిపబ్లికన్‌లు డెమోక్రాట్‌లకు వ్యతిరేకంగా తమ పార్టీ ప్రతిఘటనను కొనసాగించివుంటే నీగ్రోలను అధఃపతనం నుంచి యింకా కాపాడగలిగేవారని మనం చెప్పుకోవాలి. ఉత్తరాదిలో లాగా దక్షిణాది శ్వేతవర్ణులు రిపబ్లికన్‌లుగా, డెమోక్రాట్‌లుగా చీలిపోయి వుంటే, నీగ్రో వోట్ల ఆధిపత్యంలోకి రాకుండా దక్షిణాదిన ఒక్క రాష్ట్రం మిగిలేది కాదని అభిజ్ఞుల అభిప్రాయం. నీగ్రో వోట్లకోసం కృషిచేయకుండా డెమోక్రాట్లతో రిపబ్లికన్‌లు ఒక ఒప్పందానికి వచ్చినట్లు కనబడుతుంది. నిజానికి దక్షిణాదిన రిపబ్లికన్ పార్టీ అంటూ లేదు. ఉంటే గింటే, నీగ్రో పక్షం వహించాల్సొస్తుందన్న భయం దానికుంది. నీగ్రోల దుర్గతిని అస్పృశ్యులు మరచిపోలేదు. ఇటువంటి దుశ్చర్యను అరికట్టటానికే స్వేచ్ఛాపోరాటం యెడల అస్పృశ్యులు ఆ దృక్పథం అవలంబించారు. ఇందులో తప్పేమిటి? అతిగా విశ్వసించి నాశనమయ్యేకంటే పిరికివారుగా దూషణ పాలవడం మేలని బర్క్ చెప్పిన సలహాకి మించి వారేమి చేయలేదు.

1 అంతర్ యుద్ధంలో, నీగ్రో పుటలు 45-46

స్వేచ్ఛాపోరాటాన్ని ముందుపెట్టి రాజ్యాంగ రక్షణను తరువాత చూసుకోవాలని కాంగ్రెస్‌చేసే వాదన కేమీ ఆధారం లేదనేది మూడవ కారణం. భారతదేశపు స్వాతంత్ర్యపు హక్కంటే బ్రిటిష్ ప్రభుత్వానికున్న ధోరణిని దృష్టిలో పెట్టుకుంటే కాంగ్రెస్ అంతగా మక్కువ చూపించే ఈ పోరాటానికి అవసరమేలేదని అస్పృశ్యులు భావించారు. కనీసం యిది గుర్రానికి ముందు బండిని కట్టడంగా వారికి కనపడింది. 1857 నాటి తిరుగుబాటు రోజులనుంచి స్వాతంత్ర్యానికి భారతదేశానికి గల హక్కు ఎడల బ్రిటిష్ వారి దృక్పధం పూర్తిగా మార్పు చెందింది. భారతదేశపు స్వేచ్ఛా వాంఛితాన్ని పూర్తిగా తిరస్కరించడమే ఒకనాటి బ్రిటిష్ ప్రభుత్వపు దృక్పధం. కలకత్తాలో లారెన్స్ విగ్రహం వద్ద చెక్కిన నినాదం దీన్ని వెల్లడించింది: "భారత దేశాన్ని బ్రిటిష్‌వారు కత్తితోనే జయించారు. దాన్ని కత్తితోనే నిలుపుకుంటారు." ఈ దృక్పధం చచ్చి స్వర్గానికి వెళ్లింది. ఇప్పుడు ప్రతి ఆంగ్లేయుడు దీని విషయమై సిగ్గుపడుతున్నాడనడం అతిశయోక్తి కాదు. ఈ దశదాటి మరొకటి వచ్చింది. పార్లమెంటరీ సంస్థలను భారతీయులు నిభాయించలేరన్న ఆరోపణే భారత స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా బ్రిటిష్ ప్రభుత్వం చేస్తున్న వాదం. తొలుతగా స్థానిక స్వపరిపాలనా రంగంలో తరువాత మాంటేగు ఛేమ్స్ ఫర్డ్ సంస్కరణల కనుగుణంగా రాష్ట్ర పరిపాలనా రంగంలో భారతీయులకు రాజకీయ శిక్షణయిచ్చే ప్రయత్నంలో లార్డ్ రిప్పన్ హయాంలో ఈ దశ ప్రారంభమయింది. ఇప్పుడు మనం మూడవ దశలో అంటే వర్తమానంలో ప్రవేశించాం. భారతదేశాన్ని కత్తితో నిలుపుకుంటాం అని చెప్పేందుకు బ్రిటిష్ ప్రభుత్వం సిగ్గుపడుతున్నది. అట్లాగే పార్లమెంటరి సంస్థలను నడిపే చాకచక్యం భారతీయులకు లేదని కూడా అది అనడంలేదు. భారతీయులు కోరే పక్షంలో, భారతీయుల స్వేచ్ఛకు గల హక్కును, ఆపైన స్వాతంత్ర్యపు హక్కును కూడా బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరిస్తున్నది. తమ రాజ్యాంగాన్ని స్వయంగా రూపొందించుకునే భారతీయుల హక్కును కూడా బ్రిటిష్ ప్రభుత్వం గౌరవిస్తున్నది. ఈ క్రొత్త దృక్కోణానికి క్రిప్స్ ప్రతిపాదనకంటే, గొప్ప రుజువు అక్కరలేదు. ఇక భారత స్వాతంత్ర్యానికి బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన షరతేమంటే-దేశ జాతీయ జీవనంలోవున్న అన్ని వర్గాల ఆమోదంతో భారతీయులు ఒక రాజ్యాంగాన్ని తయారుచేసుకోగలగాలని. అలాంటి దశను యిప్పుడు మనం చేరాం. భారతీయుల మధ్య యిలాంటి అంగీకారాన్ని సాధించడానికి బదులు స్వేచ్ఛాపోరాటమంటూ కాంగ్రెస్ వల్లెవేయటం, అస్పృశ్యులు చేరటం లేదంటూ తూలనాడటం కాంగ్రెస్ ఎందుకు చేస్తున్నదో అస్పృశ్యులకు అర్థం కావడం లేదు.

## III

బ్రిటిష్ ప్రభుత్వపు ప్రతిపాదనను కాంగ్రెస్ ఎందుకు వ్యతిరేకించింది? రెండు కారణాలు చెప్పి ఈ వ్యతిరేకతను అది సమర్థించు కోజూసింది. బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన షరతువల్ల భారత స్వాతంత్ర్యాన్ని గురించిన వీటో అధికారం అస్పృశ్యులచేతిలో పెట్టినట్టవుతుందని అది అంటున్నది. రెండు కారణాల వల్ల ఇది తెలివిమాలిన వాదం. మొదటిది - భారతదేశపు అస్పృశ్యులు అసాధ్యపు కోరికలను ఎప్పుడూ కోరలేదు. సహేతుకం కాని కోరికలను కూడా వారు కోరలేదు. రెడ్మండ్‌తో కార్సన్ చెప్పినట్లు వాళ్లు ఖండించి చెప్పలేదు:" మీ రక్షణలు మీరూ గంగలో కలవండి, మీ పరిపాలన మాకు అక్కర లేదు " అని, సహేతుకమైనట్టి రక్షణలు కొన్నిటిని రాజ్యాంగం యిస్తే చాలు, హిందువుల మెజారిటి యొక్క నీతి సూత్రాలు

ంత అసాంఘికంగా, అప్రజాస్వామికంగా వున్నా వారి పరిపాలనకు లోబడటానికి అస్పృశ్యులు ూర్తిగా సిద్ధపడ్డారు. అందుచేత అసాధ్యమైన కోరికలు కోరి భారత స్వేచ్ఛను గురించి ుస్పృశ్యులు వీటో చెలాయిస్తారనడం ఒక ఘోరమైన అపవాదు. దీనికి ఈషణ్మాత్రం ఆధారం ేదు. ఒకవేళ ఈ భయానికి ఆధారం వుందనుకున్నా కాంగ్రెస్‌కు బొత్తిగా ఉపాయం ేకపోలేదు. కారణం హిందువులకు, అస్పృశ్యులకు మధ్య ఒప్పందం కుదరకపోతే వివాదాన్ని ంతర్జాతీయ మధ్యవర్తిత్వపు బోర్డుకు ఒకదానికి నివేదించమని అడగడానికి కాంగ్రెస్‌కు ుప్పుడూ వీలున్నది. కాంగ్రెస్ ఈ మాటమీద నిలబడితే అటు బ్రిటిష్ ప్రభుత్వంగానీ, ఇటు అస్పృశ్యులు గానీ ఏ మాత్రం అభ్యంతరం పెట్టరనటంలో నాకు సందేహం లేదు. ఇట్లా ందరూ ఆమోదించిన ఒక రాజ్యాంగం తేవటానికి ఒక మనఃపూర్వకమైన ప్రయత్నంచేయడం పోయి - అప్పుడప్పుడూ విరామాలు, వెనుకంజలూ వున్నా- స్వేచ్ఛను సాధించడానికి కాంగ్రెస్ ఉద్యమాన్ని నిర్వహిస్తూ పోయింది. అందుచేత అస్పృశ్యులు కోరిన రక్షణల ప్రసక్తి లేకుండా, రాజ్యాధికారపు బదిలీకి లేదా గాంధీ మాటల్లో " కాంగ్రెస్‌కు తాళాలు అప్పగించడానికి" బ్రిటిష్ ప్రభుత్వం పైన కాంగ్రెస్ నిర్బంధపూరితమైన వత్తిడి తెస్తున్నదని అస్పృశ్యులు అనుకోక తప్పడం లేదు. ఒక్కమాటతో తమ యిష్టానుసారం అస్పృశ్యులతో వ్యవహరించడానికి షరతులు లేని పూర్తి స్వేచ్ఛావున్న స్వేచ్ఛ భారతాన్ని హిందువులకు అప్పగించాలని కాంగ్రెస్ కోరుతున్నది. ఉదాత్తంగా ధ్వనించే "స్వేచ్ఛా పోరాటం" వంటి ఎన్ని నినాదాలిచ్చినప్పటికీ ఈటక్కరి ఉద్యమంలో పాల్గొనటానికి అస్పృశ్యులు నిరాకరించడంలో ఆశ్చర్యం లేదు.

ఇక ఒక అంగీకారం సాధించే ప్రయత్నం చేయకపోవటానికి కాంగ్రెస్ చెప్పే మరొక కారణం - బ్రిటిష్ ప్రభుత్వం అవిశ్వసనీయమైనదని, ఒక సర్వజనామోదమైన రాజ్యాంగాన్ని చూపినప్పటికి అది అధికారాన్ని బదిలీచేయదని వారి చేతులనుంచి అధికారాన్ని గుంజుకోవడానికి అంతిమంగా భారతీయులు బ్రిటిష్ వారితో పోరాడవలసి వుంటుందని. బ్రిటిష్ వారి ఉద్దేశాలను భారతీయులు అంతా అపనమ్మకంతో చూడడానికి తగు కారణం లేదనేది అస్పృశ్యుల జవాబు. భారతీయుల ఆకాంక్షలను నెరవేర్చే దిశలో బ్రిటిషు ప్రభుత్వం ఇది వరకే కదిలింది, ఇంకా కదుల్తున్నది కూడా ఒక వేళ అది నెమ్మదిగా కదులుతుంటే, భారతీయులు అల్ప విషయాలతో తృప్తి పడతారు .కనుకనే భారతదేశాన్ని బ్రిటిషు వారు జయించింది మొదలు 1886 వరకు తమను ఎవరు పరిపాలిస్తున్నారని గానీ , ఎట్లా పరిపాలిస్తున్నారని గానీ భారతీయులకు పట్టలేదు. ఈ ప్రశ్నలతో సతమతమవకుండా కాలం వెళ్ళదీయడంలో తృప్తిపడ్డారు. 1886లో కాంగ్రెస్ స్థాపించబడింది. ప్రథమంగా అప్పటి నుండి భారతదేశ పరిపాలనలో భారతీయులు ఆసక్తి కనబరచటం మొదలు పెట్టారు. అప్పటికి 1910 వరకు మంచి పరిపాలన కావాలని ఆందోళనతో కాంగ్రెస్ తృప్తి పడింది. ప్రథమంగా 1910లో స్వపరిపాలన కావాలని కాంగ్రెస్ డిమాండు చేసింది. 1919లో మాంటేగు ఛేమ్స్‌ఫర్డ్ సంస్కరణలు కళపెళగా ఉన్నపుడు తమ స్వపరిపాలన వాంఛితం యొక్క పరిధిని నిర్వచించే అవకాశం భారతీయులకు వచ్చింది. "19మంది విజ్ఞాపన" అని పేరుపడ్డ పత్రం 1917 నాటి భారతీయుల ఆకాంక్షలను నిర్వచించింది. మిక్కిలి శిష్టులు, ప్రగతి శీలురు అయిన భారతీయులు కూడా రాష్ట్రాల ద్వంద్వ పాలనకు తృప్తి పడ్డారని దానిని ఎరిగిన వారికి తెలుసు. సర్

దిన్‌షా వాచా, సమరథ్[1] వంటి కొందరు భారత నాయకులు దీనిని గొప్ప సాహసంగా భావించారు. స్వాతంత్ర్యానికి పట్టుబడుతూ కాంగ్రెస్ తీర్మానం ఉన్నప్పటికీ, 1930లో రౌండ్ టేబుల్ సమావేశం వద్ద రాష్ట్రాల స్వయం ప్రతి పత్తితోతృప్తిపడడానికి గాంధీ సిద్ధపడ్డారు.[2]

ఐతే అంత కంటె ఎక్కువే బ్రిటిష్ వారు ప్రదానం చేశారు. 1939 నుంచి ఒక విరామం ఏర్పడిందంటే, తమ దేశానికి కావలసిన రాజ్యాంగం విషయమై భారతీయులలో అంగీకారం లేకపోవడమే ముఖ్యమైన కారణం.

కథలో నిధి నిక్షేపం మీద సర్పం చుట్ట చుట్టుకొని కూర్చున్నట్టు, బ్రిటిషు వారు భారత స్వాతంత్ర్యం పైన కూర్చుని ఎవరినీ దరిచేరనీయని దశ ఎన్నడో దాటిపోయిందని అస్పృశ్యులు అనుకున్నారు. కోర్టు రిసీవర్ ఆధీనంలో ఉన్న ఆస్థి వంటిది భారత స్వాతంత్ర్యం. బ్రిటిష్ ప్రభుత్వం తనను తాను రిసీవర్ స్థానంలో పెట్టుకుంది. వివాదం పరిష్కారమై సరియైన రాజ్యాంగం ఖరారైన మరు క్షణం ఆస్థిని హక్కు దారులైన యజమానులకు, అంటే భారతీయులకు అప్పగించటానికి అది కట్టుబడి ఉంది. దీనిని ఎందుకు సద్వినియోగ పరుచుకోకూడదు అని అస్పృశ్యులు అడుగుతున్నారు. దేశంలోని ముఖ్యమైన వర్గాల మధ్య అంగీకారాన్ని సాధించే నిజాయితీ మార్గాన్ని సూటిగా అవలంబించి, అపుడు ఆస్థి విడుదలకు ఒక ఉమ్మడి దరఖాస్తు ఎందుకు పెట్టుకోకూడదు? ఈ కార్యాచరణ మార్గాన్ని కాంగ్రెస్ ఇష్టపడటం లేదంటే, కాంగ్రెస్ వారి "స్వేచ్ఛాపోరాటం" ఏదో ఎత్తుగడకు మించి మరేమీ కాదని అస్పృశ్యులు అంటున్నారు. స్వేచ్ఛా ప్రదానానికి బ్రిటిషు ప్రభుత్వం ఒక షరతును విధించి అస్పృశ్యులు కోరుతున్న ఒక సర్వజనామోదయోగ్యమైన రాజ్యాంగాన్ని రూపొందించే అగత్యం నుంచి తప్పుకు పోవడమే ఈ ఎత్తుగడ లక్ష్యం. బ్రిటిషు ప్రభుత్వం చేస్తున్న ప్రకటనలకు పూచీ పడతామని అస్పృశ్యులు అనడం లేదు. భారతీయులు అంగీకారానికి వస్తే చాలు, తప్పకుండా "తలుపు తడితే చాలు తెరచుకుంటుంది, అడిగితే చాలు నీదౌతుంది" అన్నంత తేలిక వ్యవహారం అని వారనటం లేదు. తాము చేసిన ప్రకటనలకు బ్రిటిషు వారు కట్టుబడి ఉండకపోవచ్చని వారు అంగీకరిస్తారు. ఒక అంగీకృత రాజ్యాంగాన్ని తయారుచేసినా వాళ్ళు తమ వాగ్దానాన్ని నిలబెట్టుకోక పోవచ్చు. స్వేచ్ఛా పోరాటం అవసరమే కావచ్చు. ఇటువంటి సాధ్యాసాధ్యాలను అస్పృశ్యులు విస్మరించరు. అయితే వారు అంటున్నది భారతీయులు బ్రిటిష్ వారినొక పరీక్షకు పెట్టలేదని. ఒక అంగీకృత రాజ్యాంగం సమర్పించక పోతే ఈ పరీక్ష పెట్టలేము. ప్రథమ కార్యాచరణ మార్గంగా - అదే అంతిమం కాక పోయినప్పటికీ - కాంగ్రెస్ దీనిని అనుసరించక పోతే, దేశం యెడల గాని, తమ యెడల గాని కాంగ్రెస్ చిత్త శుద్ధితో వ్యవహరిస్తున్నదని అస్పృశ్యులు భావించరు. కాంగ్రెస్ వారి "స్వేచ్ఛా పోరాటం"లో పాల్గొనకుండా నిరాకరించడానికి అస్పృశ్యులకు తగినంత కారణం లేదని ఎవరనగలరు?

1 రాజకీయ సంస్కరణల గురించి చర్చించడానికి వారు తనను కల్సినపుడు ఈ విధంగా అన్నారని మాంటేగు తన ఇండియన్ డైరీలో వ్రాశారు. ఆ తీర్మానాలు ఆమోదించి ప్రభుత్వాన్ని ఒప్పించడానికి మాకు అధికారం ఇవ్వండి, మేము దానిని సౌహార్థంతో సహేతుకంగా ఉపయోగిస్తాము. బాధ్యతాయుత ప్రభుత్వానికి మాత్రం మేము అర్హులం కాము. పుట 147

2 రౌండు టేబుల్ సమావేశంలో జరిగిన ఈ కథా భాగాన్ని కూడా గ్రంథస్థం చేశారు. రాష్ట్రీయ స్వయం ప్రతి పత్తిని అంగీకరించడానికి గాంధీని ఎలా ఒప్పించారో రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరైన ప్రతి ఒక్కరికీ తెలుసు. ౧౯౩౫ నాటి భారత ప్రభుత్వ చట్టంలో కేంద్రపు బాధ్యతను గురించిన అంశాలు ఉన్నాయంటే, రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొన్న కాంగ్రెసేతర పక్షాల ప్రతినిధులకు ఆ కీర్తి దక్కుతుంది

# అధ్యాయం - VIII

# అసలు ప్రశ్న

## అస్పృశ్యులు ఒక ప్రత్యేక వర్గం కారా?

## I

కాంగ్రెస్‌కూ, అస్పృశ్యులకూ మధ్య తలెత్తిన వివాదంలో ప్రాథమిక ప్రశ్న ఏమిటి? నాకర్థమైనంత వరకు ప్రాథమిక ప్రశ్న ఇది :

భారత జాతీయ జీవనంలో అస్పృశ్యులు ఒక ప్రత్యేక వర్గమా, ప్రత్యేక వర్గం కారా?

వివాదంలోని అసలు ప్రశ్న యిది. ఈ విషయంలో కాంగ్రెసూ, అస్పృశ్యులూ వ్యతిరేక పక్షాలు వహించారు. అస్పృశ్యుల జవాబేమో ఔనని. హిందువుల నుంచి తాము వేరని, తాము విలక్షణులమని వారంటారు. అటు కాంగ్రెస్ ఏమో కాదంటుంది, అస్పృశ్యులు హిందూ వృక్షానికి ఒక కొమ్మేనని అది వక్కాణిస్తుంది. వివాదంలోని రెండు పక్షాల దృక్పథం యిది. వైస్రాయ్ గాను, భారత గవర్నర్ జనరల్ గాను లిన్‌లిత్ గో ప్రభువు[1] తన ప్రకటనలో బ్రిటిష్ ప్రభుత్వ దృక్పథాన్ని స్పష్ట పరిచారు. వాటిలో ఆయన అస్పృశ్యులు భారత జాతీయ జీవనంలో ఒక ప్రత్యేక వర్గమనీ చాలా విశదీకరించి ప్రకటించారు. ( VI అనుబంధం 9, 12 అంశాలు). రాజ్యాంగ రక్షణలను ప్రాథమిక సమస్యగా భావించే చాలా మంది - తాము

1. చూడు అనుబంధం VI అంశాలు 9,12

ప్రాథమికంగా భావించే సమస్యకు చాలా భిన్నంగా కనిపించే ఒక సమస్యను నేను ప్రాథమికంగా భావించడం జూచి ఆశ్చర్యపడతారు. నిజం చెప్పాలంటే తేడా ఏమీ లేదు. మనం దేనిని సమీపంగా దేనిని అంతిమంగా భావిస్తామో దాని మీద ఇది ఆధార పడుతుంది. రాజ్యాంగ రక్షణల సమస్యను అంతిమంగా మిగతావారు భావిస్తారు. నేనేమో దాన్ని సమీపంగా భావిస్తాను. నేను ప్రాథమికంగా అన్న దాన్ని అంతిమంగా భావిస్తాను. తర్కవాదంలో ఉపపత్తి నుంచి ఉపపాద్యానికి చేరినట్లు నేననే అంతిమం నుంచి సామీప్యం వస్తుంది. ఈవ్యత్యాసాన్ని ఎత్తి చూపడం అవసరమని నేనెందుకు భావించానో చెప్పడం బాగుంటుంది. భారత రాజ్యాంగ పరిణామం ఒక రకమైన తర్కవాదాన్ని స్థాపించినట్టు నాకనిపిస్తుంది. ఈ తర్కవాదంలోని ముఖ్యమైన ఉపపత్తి ఏమంటే భారత జాతీయ జీవనంలో విలక్షణంగా వేరుగా నిర్వచించదగ్గ ఒక ప్రత్యేకమైన వర్గం భారత జాతీయ జీవనంలో ఉన్నపుడు, దానికి రాజ్యాంగ రక్షణల అర్హత ఉంటుంది. అంటే రాజ్యాంగ రక్షణలు కోరుతున్న వర్గం తాను మిగతా వారి నుంచి వేరుగా, విలక్షణంగా నిర్వచించదగ్గ వర్గమని ఋజువు చేసుకోవలసి ఉంటుంది. తాను వేరూ, విలక్షణం అని నిరూపించుకో గలిగితే రాజ్యాంగ రక్షణలకు దాని హక్కు అనుమతించ బడుతుంది.

ఈ పద్ధతితోనే ముస్లింలు, భారత క్రైస్తవులు, ఆంగ్లో ఇండియన్లు, యూరోపియన్లు, సిక్కులకు రాజ్యాంగ రక్షణలు అమలులోనికి వచ్చాయి. కొన్ని ఆశయాలకు అనుగుణంగా భారత రాజ్యాంగం రూపొందలేదనేది వాస్తవం. ఆశయాలకంటే తక్షణ అవసరాల కనుగుణంగా కొంత అడ్డదిడ్డంగా అది వృద్ధిచెందింది. నేను పేర్కొన్న ఒక ఆశయం కాకపోయినా, ఈ నిశ్శబ్ద సూత్రం మొదటినుంచీ పనిచేస్తున్నట్లు కనబడుతున్నది. రాజ్యాంగ రక్షణలకు ఒక బృందానికున్న హక్కులను ఒక కార్యాచరణ ఫలంగా భావిస్తున్నారు. ప్రాథమికమైన షరతు నెరవేరినపుడు, అనగా భారత జాతీయ జీవనంలో వారు ఒక వేరైన విలక్షణమైన వర్గమైనపుడు ఈ హక్కు దానంతటదే ఏర్పడినట్టు భావిస్తున్నారు. ఒక తర్కవాదాన్ని చర్చించ వలసినట్టుగానే ఈ వివాదాన్నికూడా చర్చించాలి. తర్కవాదంలో ఉపపత్తి, ఉపపాద్యం రెండూ ప్రాథమికమే. అందుచేత ఉపపత్తిని పరిశీలించకుండా ఉపపాద్యాన్ని మాత్రం చర్చించి వాదనను ముగించటం చాలదు. సమస్యను ఈ కోణం నుంచి చూసినపుడు రాజ్యాంగ రక్షణల చర్చను మాత్రం సాగించి, అస్పృశ్యుల వాదాన్ని ముగించరాదని నేననుకుంటాను. అంతిమము లేక ప్రాథమికమైన ఉపపత్తినికూడా పరిశీలించాలని నేను భావిస్తున్నాను. సహజ పరిణామంగా కాకపోయినా పూర్వ దృష్టాంతంగా నైనా రాజ్యాంగ రక్షణలు ఆ ఉపపత్తి నుంచి వెలువడతాయి.

ఈ విధంగా సామీప్య సూత్రానికి భిన్నంగా అంతిమ సూత్రాన్ని ప్రత్యేకంగా చర్చించడానికి నేను చేసిన నిర్ణయం వెనుక ఆధారం లేకపోలేదని అర్థమవుతుంది. దీనిని విడిగాను, గాఢంగాను చర్చించటం కూడా అవసరమనిపిస్తుంది. ఎందుకంటే యిది ప్రాథమిక సమస్య అని కాంగ్రెస్‌కు పూర్తిగా తెలుసు. ఒక సారి అస్పృశ్యులు ప్రత్యేక వర్గమని తాను అంగీకరించినవాడు తమ రాజ్యాంగ రక్షణల కోరిక విషయంలో నెగ్గకుండా వారిని ఆపడం సాధ్యం కాదు. ఈ సూత్రాన్ని ప్రతిఘటించడానికి కాంగ్రెస్ ముందుకు వచ్చిందంటే పోరాట రంగంలోని ఈ మొదటి అగడ్తను అది నిలుపుకోలేక పోతే పరిస్థితి చేయిజారిపోకుండా కాపాడలేనని భావించబట్టే.

## II

ఒక తిరుగులేని సత్యాన్ని అనగా అస్పృశ్యులు హిందువుల నుంచి వేరనే సంగతిని ప్రతిఘటించటానికి కాంగ్రెస్ ముందుకు రావటం దేశంలోని స్థితిగతులు ఎరిగున్నవారికి కొంత వరకు విస్మయం గొలిపే విషయమే. ఐతే కాంగ్రెస్ ఎలాగూ ఈవిషయమై ముందుకు వచ్చింది కనుక నా శక్తి మేరకు ఈ సమస్యను చర్చిస్తాను. తాము హిందువుల నుంచి వేరని అస్పృశ్యులు చూపెడుతున్న ఆధారాలు అర్థం చేసుకోవడం కష్టం కాదు. దీనికి విస్తారమూ, దీర్ఘమూ అయిన నివరణ అవసరంలేదు. ఒక సాదా ప్రశ్న వారి వాదాన్ని పూర్తిగా వివరిస్తుంది. ఏ రకంగా ఏ అర్థంలో వారు హిందువులు? మొదటగా అనుకోవలసింది, "హిందూ" శబ్దానికి వేర్వేరు అర్థాలున్నాయి. అందుచేత ఒక సరియైన జవాబు చెప్పేముందు దీన్ని ఏ అర్థంలో వాడుతున్నామో తెలియాలి. దానిని ఒక ప్రాంతీయమైన అర్థంలో వాడతారు. హిందూ దేశంలో నివసించే ప్రతి ఒక్కరూ హిందూవే. ఈ అర్థంలో అస్పృశ్యులు ఖచ్చితంగా హిందువులే అని చెప్పుకోవచ్చు. కానీ ముస్లింలు,సిక్కులు, క్రైస్తవులు, యూదులు, పార్శీలు మొదలైన వారు కూడా అట్లాంటివారే. "హిందూ" శబ్దం రెండవ అర్థంలో వాడుతున్నది మత విషయికంగా. ఒక నిర్ణయానికి వచ్చే ముందు హిందూ మతపు పూజా విధానాలను దాని అహేతుక సిద్ధాంతాల నుంచి వేరు చేయడం అవసరం. మత విషయికంగా అస్పృశ్యులు హిందువులా అన్న ప్రశ్న గీటురాయిగా మనం మూఢ సిద్ధాంతాలను తీసుకుంటామా లేక పూజా విధానాలను తీసుకుంటామా అన్నదాని మీద ఆధారపడుతుంది. కులమూ, అంటరానితనమూ వంటి మూఢ సిద్ధాంతాలు హిందూమతానికి గీటు రాళ్ళైతే ప్రతి అస్పృశ్యుడు హిందూ మతాన్ని తిరస్కరించి తాను హిందువు కాదని నొక్కి చెబుతాడు. ఇక హిందూ మతం మన్నించే రాముడూ,కృష్ణుడూ, విష్ణువూ, శివుడూ మొదలుగాగల స్త్రీ, పురష దైవాల్ని కొలిచే పూజావిధానాన్నే గీటురాయిగా భావించదలిస్తే అస్పృశ్యుల్ని హిందువులుగా చెప్పుకోవచ్చు. అవసరం పడినప్పుడల్లా అస్పృశ్యులు హిందువులే నని తాము హిందువులుగానే మరణిస్తామని అరిచి కేకలు వేసే ఒక ఏజెంట్ల ముఠాను అస్పృశ్యులతోనే కాంగ్రెస్ యథావిధిగా పోషిస్తుంటుంది. ఇక హిందూ మతం అంటే కులంలోనూ, అంటరానితనంలోనూ, విశ్వాసమే అయితే ఈ కిరాయి ఏజెంట్లు కూడా తమని హిందువులుగా లెక్కించడానికి అంగీకరించరు, తమను హిందువులుగా ప్రకటించుకోరు.

మరొక అంశాన్ని నొక్కి చెప్పాలి. హిందూ శబ్దాన్ని మత విషయికంగానే, అయితే ఒకపోల్చుకో తగ్గ పూజా విధివిధానపు అనుచరుడు అన్న పరిమితార్థంలో వాడితే పై విశ్లేషణను బట్టి అస్పృశ్యుణ్ణి హిందువుగా వర్గీకరించవచ్చు. ఇప్పుడు కూడా హిందువులదీ అస్పృశ్యులదీ ఒకటే మతమని తేల్చివేసే ముందు ఒక హెచ్చరిక చేయవలసిన అవసరముంది. పోల్చుకోతగ్గ పూజా విధానాన్ని పాటించేవారైనప్పటికీ వారు ఒకే మతానుయాయులు అని చెప్పడానికి వీలులేదనేది యదార్థం. సవ్యమైన ఖచ్చితమైన మాట వాడాలంటే వారి మతాలకు సాదృశ్యముంది అని అనవలసి వుంటుంది. ఒక ఉమ్మడి మతం అంటే ఒక సహభోగ్యం ఒక యిచ్చిపుచ్చుకోవడం వుండాలి. కాని పూజా విధానాల పాటింపులో యిక్కడ ఈ సహభోగ్యం లేదు. హిందువులు, అస్పృశ్యులు తమతమ పూజావాధానాలను ఎవరికివారే విడి విడిగా పాటిసారు. అందుచేత విదేశీయులు మోసరుగా విధి వాధానాలలో ఎంత సాదృశ్యమున్నా

ఎవరికివారే యమునాతీరెగా వుంటారు. ఈ చర్చంతా మనముందున్న రాజకీయ సమస్యను తేల్చుకోవటానికి. అయితే హిందూ శబ్దానికున్న ఈ రెండర్థాలూ కూడా ఈతేర్చటానికి ఏవిధంగానూ సాయపడవు.

ఇక మనకు పనికి వచ్చేసరికి వచ్చే పరీక్ష హిందూ సమాజంలో సభ్యత్వాన్ని సూచించే సామాజికమైన అర్థమే. ఒక అస్పృశ్యుడు హిందూ సమాజంలో భాగమేనని నిర్ణయంగా చెప్పగలమా? మిగతా హిందువులతో వారిని కలిపివుంచే మానవీయ బంధం ఏదన్నా వుందా? అది మృగ్యం. అంతర్వివాహం లేదు, సహపంక్తి భోజనం లేదు. కలివిడి లేకపోతే మానె ముట్టుకునే హక్కు కూడాలేదు. ఆపైన కేవలం స్పర్శ హిందువుకు అంటు కలుగజేస్తుంది. హిందువుల యావత్తు సంప్రదాయమూ అస్పృశ్యుణ్ణి వేరే వర్గంగా గుర్తించడమేకాక దానినొక నిత్యసత్యంగా వక్కాణిస్తుంది. హిందువులు సాంప్రదాయ సిద్ధంగావాడే భాష, హిందువుల్ని, అస్పృశ్యుల్ని వేరుచేసి చూస్తుందని అస్పృశ్యులుచేసే వాదనకు భేషైన సాక్ష్యం. ఈ సాంప్రదాయ భాషలో హిందువులను సవర్ణులని, అస్పృశ్యులను అవర్ణులని పిలుస్తారు. హిందువులను చాతుర్వర్ణ్యలని, అస్పృశ్యులను పంచములని అది చెబుతుంది. ఈ వేరు పరచటం అంత ప్రధానమూ, దాని పాటింపు అంత ఆవశ్యకమూ కాకపోతే యిలాంటి ఒక శబ్దజాలం వాడుకలోకి వచ్చి వుండేది కాదు. ఒక యదార్థానికి రూపాన్ని కలుగజేసే ప్రత్యేకమైన శబ్దాలు పుట్టి వుండేవి కావు.

అస్పృశ్యులు కూడా హిందువులేనని అందుచేత ముస్లిములు తతిమావారిమాదిరిగా అదే రాజకీయపు హక్కులను వారు కోరరాదని కాంగ్రెస్‌చేసే వాదంలో అందువల్లనే పస లేదు. అస్పృశ్యులు హిందువులు కాదని సంప్రదాయం ఆధారంగా చేసే వాదం సవ్యమూ సహేతుకమూ అయినప్పటికీ, కొందరికది బలహీనంగా కనపడుతుంది. కాంగ్రెస్ వాదాన్ని నేరుగా ఎదుర్కోకుండా చర్చనుంచి నేను తప్పుకోదలచ లేదు. మత పరంగా అస్పృశ్యులు హిందువులేనని వాదనకోసం అంగీకరిస్తాను. వాళ్లు హిందువులైనా మాత్రం ఏం జరిగిందనేది ప్రశ్న. భారతజాతీయ జీవనంలో వారినొక ప్రత్యేక వర్గంగా గుర్తించడానికి అది అడ్డు వస్తుందా? మతపరంగా ఒక పరిమితమైన అర్థంలో వారిని హిందువులు అనవచ్చునన్న సంగతి, హిందూ సమాజంలో వారొక అంతర్భాగమేనన్న వాదనకు ఆధారం ఎట్లా అవుతుందో అర్థం చేసుకోడం కష్టం.

వాదన కోసం మతపరంగా వాళ్లు హిందువులేనని అంగీకరించినా నేను చెప్పినదానికి మించి దానికేమైనా అర్థం వుందా? మిగతా హిందువుల మోస్తరుగా వాళ్లు ఆ స్త్రీ పురుష దైవాలనే కొలుస్తారు. ఆ తీర్థయాత్రా స్థలాలకే వెళతారు. అవే అలౌకికమైన నమ్మకాలను కలిగి వుంటారు. మిగతా హిందువుల మోస్తరుగా అవే రాళ్ళను, చెట్లను, గుట్టలను పవిత్రంగా భావిస్తారు. అస్పృశ్యులూ, హిందువులూ ఒకేజాతిలోని అంగాలు అని నిర్ణయించి చెప్పటానికి యిది చాలునా? కాంగ్రెస్ వాదనల వెనుకవున్న తర్కం యిదే అయితే , మరి బెల్జియన్లు, డచ్‌వారు, నార్వేజియన్లు, స్వీడ్లు, జర్మన్‌లు, ఫ్రెంచివారు, ఇటాలియన్లు, స్లావ్ జాతుల మాటేమిటి? వారంతా క్రైస్తవులు కారా? వారంతా ఒకే దేవుణ్ణి అర్చించటం లేదా ? జీసస్‌ని తమ రక్షకుడుగా వారంతా తలదాల్చటంలేదా ? వారందరికీ మతపరమైన ఒకే నమ్మకాలు లేవా? వారంధరికీ చింతనలో, అర్చనలో, నమ్మకాల్లో, మతపరంగా పూర్తి ఐక్యత వున్నదనేది స్పష్టం. అయినా ఫ్రెంచివారు, జర్మన్లు, ఇటాలియన్లు మిగతావారు ఒకేజాతివారు కాదనడంలో

పేచీ ఏమైనా వుందా? అమెరికా సంయుక్త రాష్ట్రాలలో తెల్లవారు, నీగ్రోల విషయం తీసుకుందాం. ఉమ్మడిగా వారికీ ఒక మతం ఉంది. ఇద్దరూ క్రైస్తవులే. అంత మాత్రాన వారు ఒకే జాతి వారని ఎవరైనా అన గలరా?భారత క్రైస్తవులు, యూరోపియన్లు అంగ్లో ఇండియన్లకు సంబంధించిన మరో దృష్టాంతం తీసుకుందాం. ఒకే మతాన్ని వారు విశ్వసించి అనుసరిస్తారు. ఐనా వారంతా ఒకే క్రైస్తవ జాతిగా రూపొందలేదని అందరూ ఒప్పుకుంటారు. సిక్కుల విషయం తీసుకోండి. వారిలో సిక్కులు మజ్బీ సిక్కులు, రాందాసియా సిక్కులు ఉన్నారు. అందరూ సిక్కు మతాన్ని విశ్వసిస్తారు. కానీ వారంతా ఒకే జాతి కారని సర్వులు అంగీకరిస్తారు. ఈ దృష్టాంతరాలను బట్టి చూస్తే కాంగ్రెస్ వాదమంతా తప్పుల తడికేనని తెలిసిపోతుంది.

రాజ్యాంగ రక్షణలను మంజూరు చేయడమా, చేయక పోవడమా అన్న ప్రాథమిక సమస్యను పరిష్కరించడానికి ఒక జనాభాలోని ఒక సామాజిక బృందం ఐక్యమైఉందా, వేరుపడి ఉందా అని చూసుకోక పోవడమే కాంగ్రెస్ వాదంలోని మొదటి తప్పిదం. ఐక్యత ఉందా వేర్పాటు ఉందా గ్రహించుకోవడానికి మతం అనేది ఒక అంశం మాత్రమే. ముసల్మానులకు, భారత క్రైస్తవులకు రాజకీయంగా వేర్వేరు గుర్తింపు లభించింది. వారు ముసల్మానులు క్రైస్తవులు అవటం వల్లకాదని హిందువులకు భిన్నంగా ప్రాథమికంగా వారు ప్రత్యేక వర్ణాలు కావటం వల్లేనని కాంగ్రెస్ అర్థం చేసుకున్నట్లు లేదు.

ఒకే మతం ఉన్నంత మాత్రాన సామాజిక సమైక్యత తప్పక ఉంటుందని ఋజువుచేయటానికి ప్రయత్నించటం కాంగ్రెస్ రెండవ తప్పిదం. ఈ తర్కం ఆధారంగా గెలవాలని కాంగ్రెస్ ఆశ పడుతున్నది. అంతిమంగా కాంగ్రెస్ గెలవలేదు. ఎందుకంటే అలాంటి తీర్పు చెప్పటానికి యదార్థాలు గట్టిగా విరుద్ధంగా ఉన్నాయి. సామాజిక సయోధ్యకు మతం ఒక్కటే మూలం అన్న తీర్పును ఆమోదిస్తే-యూరపులో ఇటాలియన్లు, ఫ్రెంచివారు, జర్మన్లు, స్లావ్‌లు, అమెరికాలో నీగ్రోలు, తెల్లవారు భారతదేశంలో క్రైస్తవులు, యూరోపియన్లు, అంగ్లోఇండియన్లు ఒకే మతాన్ని విశ్వసించినా ఒకే జాతి వారు కాదన్న వాస్తవంచాలు, ఆ వాదాన్ని తిప్పికొట్టడానికి. మతం ఐక్యసంధాయకం అన్న తనవాదానికి కాంగ్రెస్ ఎంత పూర్తిగా మైమరచి పోతుందంటే, ఈ రెంటి మధ్య ఏసాపత్యం లేదని గుర్తించటంలో అది విఫలమైంది. ఇది జాలి పడవలసిన విషయం.మతాలు వేరైనా వేర్పాటు లేని ఒకే మతం ఉన్నా వేర్పాటు ఉన్నటు వంటి, ఇక అన్నిటి కంటే అధ్వాన్నం మతమే వేర్పాటును నిర్దేశించినటువంటి సందర్భాలు ఉన్నాయి. కాంగ్రెస్ వాదాన్ని ఊరుకోబెట్టడానికి ఈ ప్రతి ఒక్క సందర్భానికి ఒక దృష్టాంతం ఇవ్వటం వాంఛనీయం. మొదటి సందర్భానికి నాకు కనిపించిన తేలికైన మంచి ఉదాహరణ హిందువులు, సిక్కులకు సంబంధించినది. వాళ్ళ మతాలేమో వేరు, కానీ సామాజికంగా వేరు కాదు. కలిసి ఉంటారు, కలిసి తింటారు, పెళ్ళిళ్ళు చేసుకుంటారు. ఒక హిందూ కుటుంబంలో ఒక కొడుకు సిక్కు కావచ్చు, మరొకడు హిందువు కావచ్చు. మత భేదం సామాజిక బంధాన్ని తెంచదు. ఇక రెండవ సందర్భానికి యూరపులో, ఇటాలియన్లు, ఫ్రెంచి వారు జర్మన్ల ఉదాహరణ. అమెరికాలో నీగ్రోల విషయం మనకు కడుపునింపేంత దృష్టాంతం. మతం సంధాయక శక్తి అయినప్పటికీ, స్వజాతి భావన వంటి విడదీసే శక్తులను తట్టుకో గలిగినంత ప్రబలమైనది కాదు. ఇక వేర్పాటుకు మాత్రమే కారణం అయిన దృష్టాంతం హిందువులు హిందూ మతానిది ఒకే ఒకటి. ఈ దృష్టాంతాన్ని గురించి హిందువులకు మాత్రం ఎవరూ చెప్పనక్కర లేదు. ఐక్యతకు బదులు వేర్పాటును హిందూమతం ప్రబోధిస్తుందనేది

అందరూ ఎరిగినదే. కలవకపోవడం,విడిపడి ఉండటం హిందువు అన్న వాడికి అర్థం. కులాన్ని, అంటరానితనాన్ని హిందూమతం సమర్థిస్తుందనటం దాని ఘనతను బహుశా మరుగు పరుస్తుంది. వేరు పరచటమే హిందూ మతం యొక్క నిజమైన ప్రతిభాపాటవం. ఇది వివాదం లేనివిషయం. ఎందుకంటే, కులం, అంటరానితనం దేనికి గుర్తుగా నిలబడతాయి? వేరుపర్చటానికే అన్నది విదితం. వేర్పాటుకు కులం ఒక మారుపేరు. ఇక అంటరానితనం, వర్గాన్నుంచి వర్గాన్ని విడదీసే తీవ్రరూపానికి సంకేతం. కులం, అంటరానితనం అన్నవి మృత్యువు తరువాత ఆత్మ ఉనికి వంటి సిద్ధాంతాలతో పోల్చదగ్గ అమాయిక సిద్ధాంతాలు కావనేది నిర్వివాదం. భూమి మీద తను జీవితగమనంలో ప్రతి హిందువూ బద్ధుడై ఉండవలసిన విధి విధానంలోని భాగాలు అవి. కులం, అంటరానితనం శుష్క సిద్ధాంతాలు కావు సరికదా హిందూ మతం విధించిన అగ్రగామ ఆచారాలు. కులం, అంటరానితనం సూత్రాలలో కేవలం హిందువులకు విశ్వాసం ఉంటే చాలదు, తన నిత్య నైమిత్తిక జీవితంలో అతడు వాటిని పాటించాలి. కులం, అంటరానితనం సిద్ధాంతాలతో హిందువులు, అస్పృశ్యులకు మధ్య హిందూమతం తెచ్చి పెట్టిన వేర్పాటు - అలనాడు అధీన వలస ప్రాంతాల విషయమై పోర్చుగీసు వారికి ప్రత్యర్థులకు మధ్య ఏర్పడ్డ వివాదంలో పోపు గీసిన ఊహామాత్రమైన విభజన రేఖ వంటిది కాదు. పాటించాలన్న నిర్బంధం లేకుండాపోడవు మాత్రం ఉండి వెడల్పు లేనటువంటి వర్ణరేఖ కూడా అది కాదు. విలక్షణత మాత్రం ఉండి వివక్షత లేని జాతి సదృశ రేఖ వంటిది కూడా కాదు. దీనికి లోతు, విస్తీర్ణం రెండూ ఉన్నాయి. యదార్థానికి హిందువులకు, అస్పృశ్యులకు మధ్యముళ్ళ తీగతో వేసిన కంచె అడ్డుగా ఉంది. అది కనపడని ఒక 'శుద్ధి' తాడు వంటిది. దానిని దాటడానికి అస్పృశ్యులు ఎన్నడూ అనుమతించబడరు, దాటే ఆశవారికి లేదు. సూత్రబద్ధంగా చెప్పాలంటే హిందూ మతం, సామాజిక సయోధ్య పొసగని సంగతులు. హిందూమతపు విశేషమైన ప్రతిభ ఏమంటే అది సామాజిక విభజనను నమ్ముతుంది. సామాజిక ఘర్షణకు అది మారు పేరు - పైగా సామాజికమైన వెలిని కూడా అది సృష్టిస్తుంది. హిందువులంతా ఏకంగా ఉండాలంటే హిందూమతానికి వాళ్ళు నీళ్ళొదలాలి. హిందూ మతాన్ని అతిక్రమించకుండా వాళ్ళు ఏకం కాలేరు. హిందువుల ఐక్యతకు మాతమే గొప్ప అడ్డంకి. సామాజిక సయోధ్యకు ఆధారమైన భావనను - మూలానికి చేరుకోవాలన్న తపనను హిందూమతం సృష్టించ లేదు. పైగా తద్విరుద్ధంగా విడిపోవాలన్న ఆతురతను హిందూమతం సృష్టించింది.

తాను చేస్తున్న వాదం తనకే వ్యతిరేక మవుతున్నదని కాంగ్రెస్ గ్రహిస్తున్నట్లులేదు. కాంగ్రెస్ చేస్తున్న జగడాన్ని బలపరచడం పోయి, అస్పృశ్యులు చేస్తున్నవాదం ఋజువు చేయడానికి అదే మిక్కిలి మేలైన, సమర్థవంతమైన వాదం అవుతున్నది. అస్పృశ్యులు హిందువులేనన్న ఉపపత్తి నుంచి ఏదైనా సిద్ధాంతం చేయాలంటే - అది సూత్రరీత్యాను, ఆచరణ రీత్యాను అస్పృశ్యులను హిందూ వృక్షానికి ఒక శాఖగా గుర్తించరాదని, వాళ్ళను హిందువుల నుంచి వెలివేసిన ప్రత్యేక వర్గంగా పరిగణించాలని వక్కాణిస్తున్నది.

అందుచేత అస్పృశ్యులు తామొక ప్రత్యేక వర్గమంటున్నపుడు ఏదో రాజకీయ లబ్ధికోసం ఒక కొత్త సిద్ధాంతాన్ని వారు కనిపెట్టినట్లు ఎవరూ నిందించలేరు. వాస్తవాలేమిటో, అవి స్వయంగా హిందూమతం యొక్క వారసత్వం ఎట్లా అయ్యాయో వాళ్ళు ఎత్తి చూపిస్తున్నారు. అస్పృశ్యులను ఒక ప్రత్యేక వర్గంగా గుర్తించడానికి నిరాకరించడంలో హిందూ మతాన్ని ఒక

ఆధారంగా కాంగ్రెస్ మనస్సాక్షిగా, విశ్వసనీయంగా ఉపయోగించుకో లేదు. ఒకవేళ అలా చేస్తే స్వార్థప్రయోజన ప్రేరితమై మాత్రమే చేయాలి. భారత జాతీయ జీవనంలో అస్పృశ్యులను హిందువుల నుంచి విలక్షణమూ, వేరు అయిన ప్రత్యేక వర్గంగా గుర్తించడం అంటే - వారికి హిందువులకూ మధ్య ప్రభుత్వ కార్య నిర్వాహక, శాసన, ఉద్యోగ పార్శ్వాలలో స్థానాల వాటాలు వేయవలసి ఉంటుందనీ ఆవిధంగా హిందువుల వాటా పరిమితమవుతుందనీ దానికి తెలుసు. హిందువులు అలవాటుగా కబళిస్తున్న అస్పృశ్యుల వాటాను హిందువులు వదులు కోవలసి రావడం కాంగ్రెస్‌కు ఇష్టం ఉండదు. భారత జాతీయ జీవనంలో అస్పృశ్యులను ప్రత్యేక వర్గంగా కాంగ్రెస్ గుర్తించక పోవడానికి నిజమైన కారణం యిది.

కాంగ్రెస్ రెండో వాదం ఏమిటంటే - అస్పృశ్యులకూ, హిందువులకూ మధ్య ఎడబాటును శాశ్వతం చేస్తుందన్న కారణంగా వారిని భారత జాతీయ జీవనంలో ప్రత్యేక వర్గంగా రాజకీయమైన గుర్తింపు నివ్వడం అనుమతించరాదని.

ఇది పరిశీలన యోగ్యమైన వాదన ఏమాత్రం కాదు. ఆ బాపతు వాటిల్లో యిది బహు దుర్బలమైనది. ఇంతకంటే మేలైనది కాంగ్రెస్ వద్ద ఏమీ లేదని యిది ఋజువు చేస్తున్నది. ఇంతకు ముందు చేసిన వాదనను వ్యతిరేకించడమే కాకుండా ఇది పూర్తిగా అపోహజనితమైనది. హిందువులకీ, అస్పృశ్యులకీ మధ్య నిజమైన ఎడం ఉండి, హిందువులు అస్పృశ్యులు ఎడల చూపే వివక్షా ప్రమాదం ఉంటే, అస్పృశ్యులకు తప్పక రాజకీయమైన గుర్తింపు ఉండాలి; హిందువుల దాష్టీకం నుంచి కాపాడు కోడానికి వారికి రాజకీయ రక్షణలు యివ్వాలి. వర్తమానపు దౌర్జన్యం నుంచి కాపాడుకునే సాధనాలను, యింతకంటే మెరుగైన భవిష్యత్తు అన్న ఆశ చూపించి నిరోధిం రాదు.

ఇక రెండో విషయం, హిందువులకు, అస్పృశ్యులకూ మధ్య సామాజిక సంధానంలో నమ్మకమున్న వాళ్ళు, అటువంటి సంధానాన్ని సాధ్యం చేసే మార్గాలను, పద్ధతులనూ అన్వేషించడంలో చురుకుగా నిమగ్నమైన వారు మాత్రమే ఈ వాదనను వాడుకో గలరు. అస్పృశ్యుల సామాజికము రాజకీయమూ అని కలబోసి కాంగ్రెస్‌వారు తరచూ అనటం వింటుంటాం. ఇది సామాజిక సమస్య అని కాంగ్రెస్ వారు మనస్ఫూర్తిగా అంటున్నారా అని గమనించవలసిన అంశం. అస్పృశ్యులతో రాజకీయాధికారం పంచుకునే పరిమాణాన్ని అరికట్టడానికి దీనినొక నెపంగా వాడుతున్నారా? సామాజిక సమస్య అని వాళ్లు మనస్ఫూర్తిగా అంటూంటే యిందులో వారి చిత్తశుద్ధికి రుజువేమిటి ? కాంగ్రెస్ వారు హిందువులలో సాంఘిక సంస్కరణను ప్రవేశపెడుతున్నారా ? సహపంక్తి భోజనాలకు, అంతర్వర్ణ వివాహాలకు అనుకూలంగా వారొక పవిత్ర పోరాటం సాగిస్తున్నారా? సాంఘిక సంస్కరణల రంగంలో కాంగ్రెస్ వారి చరిత్ర ఏమిటి ?

## III

తమ సమస్యను గురించి అస్పృశ్యులేమను కుంటున్నారో చెప్పుకోవడం కూడా మంచిది. బ్రిటిషు వారు వచ్చే దాకా తాము అంటరానివారుగా వుండడానికి తృప్తి పడి వూరుకున్నారు. హిందూ దైవం విధించి, హిందూ రాజ్యం అమలుచేసిన తమ కర్మ ఫలమది.

అందువల్ల దానినుంచి నిష్కృతి లేదు. అదృష్టమో దురదృష్టమో భారత దేశంలో తమ సైన్యానికి ఈస్టిండియా కంపెనీకి భటులు అవసరమయ్యారు. అస్పృశ్యులు తప్ప వారికెవరూ దొరకలేదు. కనీసం చరిత్ర మొదటి పాదంలో ఈస్టిండియా సైన్యంలో అస్పృశ్యులే వుండేవారు. ఇప్పుడు పోరాటేతర వర్గాలలో అస్పృశ్యులను లెక్కిస్తూ అందువల్ల సైన్యం నుంచి అస్పృశ్యులను తొలగించినప్పటికీ, అస్పృశ్యులతో కూడిన సైన్య సహాయతోనే బ్రిటిషువారు ఇండియాను జయించారు. ఈస్టిండియా కంపెనీ సైన్యంలో భారత సైనికులకీ, వారి ఆడ, మగ సంతానానికి నిర్బంధ విద్యా విధానం ఒకటి వుండేది. సైన్యంలో ప్రవేశానికి వీలున్న రోజులలో అస్పృశ్యులకు అబ్బిన విద్య యింతకు ముందు వారెన్నడూ ఎరగనటు వంటి లాభాన్ని చేకూర్చి పెట్టింది. ఒక కొత్త విలువ ఒక కొత్త దృష్టి అది వారికిచ్చింది. వారిని సంఘం చూస్తున్న చిన్న చూపు, తప్పించుకోలేని విధి విహితం కాదని, పూజారి వర్గం జిత్తులమారి కుతంత్రాలతో తమ ఆత్మగౌరవంపైన ఆపాదించిన కళంకమని వాళ్లు గ్రహించ సాగారు. మునుపెన్నడూ తామెరుగని విధంగా అవమాన భారంతో కృంగి పోయారు. ఎట్లాగయినా దాన్ని వదలించుకోవాలని కృతనిశ్చయులైనారు. మొదట్లో వాళ్లు కూడా తమది సాంఘిక సమస్య అనుకున్నారు. దాని పరిష్కారానికి సామాజిక మార్గాల వెంట పడి పెనుగులాడారు. ఇది అత్యంత సహజమైనటువంటి విషయం. ఎందుకంటే - అస్పృశ్యులకీ హిందువులకీ మధ్య సహపంక్తి, అంతర్వర్ణ వివాహ నిషేధాన్ని తమ సామాజిక న్యూనత యొక్క వెలుపలి చిహ్నంగా వాళ్లు చూశారు. తమ కళంకాన్ని తొలగించు కోవటానికి కావలసింది సమాన స్థాయిలో హిందువులతో సామాజిక సాంగత్యం ఏర్పరుచుకోవటం అని, తిరిగి యిది సహ పంక్తి, అంతర్వర్ణ వివాహాలకు వ్యతిరేకంగా వున్న నియమాల్ని రద్దు పరచటమని సహజంగానే వారు భావించారు. ఇంకోరకంగా చెప్పాలంటే - తమ బానిస స్థితిని గురించిన స్పృహ కలిగాక, కులవ్యవస్థను రద్దు చేసి హిందూ మతం పరిధిలోకి వచ్చే అన్ని వర్గాల మధ్య సాంఘిక సమానత్వాన్ని సాధించటం తమ విముక్తికి మొదటి కార్యక్రమంగా అస్పృశ్యులు చేపట్టారు.

దీనికి హిందువులలో ఒక వర్గం అస్పృశ్యులకు ఆప్తులుగా లభించారు. అస్పృశ్యుల్లాగానే హిందువులు కూడా బ్రిటిషు వారితో సంపర్కం వల్ల తమ సాంఘిక వ్యవస్థ చాలా లోప భూయిష్టమైందని, చాలా సాంఘిక దురన్యాయాలకు అది జన్మ స్థానమని వారు గ్రహించటం మొదలు పెట్టారు. వారుకూడా సాంఘిక సంస్కరణోద్యమాన్ని కొనసాగించాలని కోరారు. బెంగాల్‌లో యిది రాజా రామ మోహన్ రాయ్‌తో ప్రారంభమై దేశమంతా వ్యాపించింది - రాజకీయ సంస్కరణకు ముందు సాంఘిక సంస్కరణ అన్న నినాదంతో భారత సామాజిక సంస్కరణ సభ ఏర్పాటు కావడంతో యిది ఒక చరమదశకు వచ్చింది. అస్పృశ్యులు ఈ సాంఘిక సంస్కరణ సభకు అనుయాయులయ్యారు. ఒక బృందంగా దాని వెనుక నిలబడి దానికి పూర్తి మద్దత్తు తెలిపారు. ఈ సాంఘిక సంస్కరణ సభ అంతిమ శ్వాస విడిచి కాల గర్భంలో కలిసిపోయిందని అందరికీ తెలుసు. దీనినెవరు ఖతం చేశారు ? కాంగ్రెస్. " రాజకీయాలే ఆరంభం, రాజకీయాలే అంతం. " ప్రతి ఒక్కరికీ రాజకీయం, అందరి రాజకీయం వంటి నినాదాలు యిచ్చిన కాంగ్రెస్ సాంఘిక సంస్కరణ సభను తన వైఖరిగా భావించింది. రాజకీయ సంస్కరణలకు ముందే తప్పక సాంఘిక సంస్కరణ ఉండాలన్న సభవారి సిద్ధాంత సంయుక్తతను అది తోసి రాజన్నది. కాంగ్రెస్ వేదికనుంచి వ్యక్తిగతంగా కాంగ్రెస్ నాయకులు నిరంతరం రగుల్కొలిపిన అగ్ని జ్వాలల్లో సాంఘిక సంస్కరణల

సభ కాలి బూడిదైపోయింది. సాంఘిక సంస్కరణ ద్వారా తమకు ముక్తి దొరుకుతుందన్న ఆశ అస్పృశ్యులు వదులుకున్న తరువాత, స్వరక్షణార్థం రాజకీయ సాధనాల శరణు కోరటం వారికి తప్పనిసరైంది. ఇప్పుడు కాంగ్రెస్ వారు ఎదురు తిరిగి సమస్యను సాంఘికమనటం రెండు నాల్కల ధోరణి తప్ప వేరు కాదు.

అస్పృశ్యులది సాంఘిక సమస్య అనటం తప్పు. సవ్యమైన సాంఘిక సమస్యలకు ఉదాహరణ చెప్పాలంటే, కట్నాలు, విధవా పునర్వివాహం, మైనారిటీ తీరటం, వంటి వాటిని పేర్కొనాలి. కాని యిది అలాంటిది కాదు. కన్నెర్రచేస్తున్న మెజారిటీ వర్గం వారి నుంచి మైనారిటీ వర్గానికి స్వేచ్ఛనూ, సమానావకాశాలనూ సాధించే సమస్య ప్రధానంగా అది. ఆ మెజారిటీ వర్గమేమో అటువంటి స్వేచ్ఛనూ, సమానావకాశాలను లుప్తం చేయటంలో తన నమ్మకాలను వారిమీద రుద్దడంలో నమ్మించి కుట్రపన్నే వర్గం. ఈ దృష్ట్యా చూస్తే అస్పృశ్యులది ప్రాధమికంగా ఒక రాజకీయ సమస్య. ఒక వేళ వాదనకోసం అదొక సాంఘిక సమస్యేనని అనుకున్నా అస్పృశ్యుల భద్రత కోసం వారికి రాజకీయమైన గుర్తింపును, రక్షణలను కల్పించటం హిందువులతో వారి సామాజిక ఐక్యతను ఏ విధంగా అడ్డుకుంటుందో అర్థం చేసుకోవటం కష్టం. కావలసింది - అటువంటి సత్ఫలితాన్ని సాధించి పెట్టే శక్తులలో కదలిక తేవటం. తమ మనసులో ఒక ఖచ్చితమైన అభిప్రాయం లేకుండా కాంగ్రెస్ వారు వాదిస్తున్నట్టు కనపడుతున్నది. రాజకీయ సాంఘిక అంశాలమధ్య గల అంత సంబంధాన్ని గూర్చిన ఒక స్పష్టమైన అభిప్రాయం వారికి వున్నట్టు లేదు. ప్రత్యేక నియోజక వర్గాలను వ్యతిరేకించటం ఉమ్మడి నియోజక వర్గాలను ముద్దు చేయడం దీనికొక మంచి ఉదాహరణ. దీని సహేతుకతను పరిశీలించడం మంచిది. ఉమ్మడి నియోజక వర్గంలో హిందువు అస్పృశ్యుడికి వోటు వేస్తాడు. అస్పృశ్యుడు హిందువుకు వోటు వేస్తాడు. అది సామాజిక దృఢత్వానికి దోహద పడుతుంది. ఇక ప్రత్యేక నియోజక వర్గంలో హిందువు హిందువుకే వోటు వేస్తాడు, అస్పృశ్యుడు అస్పృశ్యుడికే వోటు వేస్తాడు. ఇది సాంఘిక సయోధ్యను అడ్డుకుంటుంది. ఐతే నియోజక వర్గాల సమస్యను అస్పృశ్యులు చూసే దృక్కోణం యిదికాదు. ఈ రెండింటిలో దేని వల్ల తమకిష్టుడైన అస్పృశ్యుణ్ని అస్పృశ్యులు ఎన్నుకోగలరు అన్నది వాళ్ల దృష్టి. కాంగ్రెస్ వాదనను నిశితంగా పరిశీలించాను. ఆ వాదనను పెద్దగా విస్తరించి గడిబిడి చేయదలుచు కోలేదు. కాంగ్రెస్ వాదప్రక్రియ పైకి సరైనదిగానే తోస్తుంది. ఐతే అది విషయాన్ని లోతుగా తరచి చూడదు. ఎన్నికలు ఐదేళ్లకొకసారి జరుగుతాయి. మిగతా మూడుసంవత్సరాలు దారుణంగా వేరువేరు జీవనాలు సాగిస్తూ ఏదో ఒక రోజున ఉమ్మడిగా వోటు వేసినంత మాత్రాన హిందువులు, అస్పృశ్యుల మధ్య సాంఘిక సయోధ్యకు ఎట్లా దోహదం జరుగుతుంది అని గట్టిగా అడగవలసి వుంటుంది. అదే విధంగా, ఐదేళ్ల కాలంలో ఒక్కరోజున విడిగా వోటు వేసినంత మాత్రాన ఎడబాటు యింకా తీవ్రతరం ఎట్లా అవుతుందో కూడా అడగ వలసి వుంటుంది. ఐక్యతను సాధించే ధ్యేయంతో పనిచేసేవారికి ఐదేళ్ళకొకరోజున వచ్చే ఈ వేర్వేరు వోటింగు పద్ధతి ఎట్లా ప్రతిబంధకమో ఆలోచించాలి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే అస్పృశ్యులకూ, హిందువులకూ మధ్య అంతర్వివాహాలను, సహపంక్తి భోజనాలను ప్రత్యేక నియోజక వర్గాలు ఎట్లా అడ్డుకుంటాయి? జన్మతః మతిమాలినవాడు మాత్రమే అట్లా అడ్డుకుంటాయని చెప్పగలడు. ఒక ప్రత్యేక వర్గంగా అస్పృశ్యులకు రాజకీయమైన గుర్తింపు యివ్వడం, వారికి రాజ్యాంగ రక్షణలు కల్పించడం హిందువులు వేర్పాటును అంతం చేయాలని చూస్తున్నా కూడా దానిని శాశ్వతం చేస్తుంది అనడం కేవలం పనితనం.

# IV

అస్పృశ్యులు కోరే రాజకీయ రక్షణలకు వ్యతిరేకంగా తక్షణ ప్రయోజనం కోసం చేసే కొన్ని యితర వాదనలు కూడా పరిశీలించవలసి వుంది. సాంఘిక ఛిద్రాలన్నవి ఒక్క భారత దేశంలోనే కాదు, అవి ఎక్కడపడితే అక్కడ, యూరప్ లోకూడా వున్నాయనడం అటువంటి వాటిల్లో ఒకటి. తమ రాజ్యాంగాలను రూపొందించడంలో యూరప్ ప్రజలు వాటిని లెక్క చేయలేదని వారంటారు. అయినప్పుడు ఇండియాలో వాటిని లెక్కలోకి తీసుకోవడం ఎందుకు ? ఇది స్థూలమైన సిద్ధాంతం. ఐతే దీనిని అస్పృశ్యుల కోరికను మరుగుపరచేటంతగా సాగదీయ వచ్చు. అందువల్ల యిది ఏవిధంగా అపసవ్యమో చెప్పదలిచాను.

నా వ్యాఖ్యలు చేసేముందు సిద్ధాంతానికి దానిని అలంబనగా వున్న వాదానికీ మధ్య వున్న సూక్ష్మ వ్యత్యాసాన్ని చూపి వాటిని ప్రత్యేకంగా చర్చించదలిచాను. ఒక కొంత మేరకు సిద్ధాంతం భేషైనదే. ప్రతి సమాజంలోనూ వర్గాలుంటాయన్నంతవరకూ దానితో పేచీ పడలేము. ఎందుకంటే యూరప్, అమెరికా సమాజాలలో కూడా భిన్న ఆశయాలకోసం భిన్న మార్గాలలో కలిసి చరించే బృందాలుంటాయి. భాషా బంధమో, రక్త సంబంధమో కట్టిపడవేసే జాతుల్లాగా కొన్ని వుంటాయి. హోదా అంతస్తుల ఆధారంగా విలక్షణ స్వభావంకల సాంఘిక వర్గాలు కొన్ని వుంటాయి. కొన్ని ప్రత్యేకమైన విశ్వాసాలను కలిగివుండే మతపరమైన సంఘాలు మిగితావి. ఇక ఆశయాలు వేరైనా ఎంతోకొంత అనుబంధం వుండి దృఢంగానో, దుర్బలంగానో కలిపి పనిచేసే అంతులేని వైవిధ్యం వున్న రాజకీయ పక్షాలు, పారిశ్రామిక సంస్థలు , నేర తత్వం కల ముఠాలు చెప్పనే అక్కరలేదు. కాని యూరప్‌లో, అమెరికాలో వున్న వర్గాలకు, బృందాలకు ఇండియాలో వున్న కులాలకు మధ్య వ్యత్యాసం లేదనేదాకా ఈ సిద్ధాంతం వెళితే అది అర్థంలేని అయోమయం మినహా మరేమీ కాదు. చూపులకు యూరప్‌లో వర్గాలు, భారతదేశంలో కులము వొకటిలాగే అనిపిస్తాయి కాని ప్రాధమికంగా అవి చాలా భిన్నమైనవి. ఇండియాలో కులాలకు వెలి, ఒంటరితనం అన్నవి విలక్షణంగా వేరుచేసిచూపే అంశాలు. ఈ అంశాలనిక్కడ ఏదో యధాలాపంగా కాక ఒక ధర్మంగా పాటిస్తారు. యూరప్, అమెమేరికాలోని బృంద, లేక వర్గవిధానంలో ఈ లక్షణాలు మచ్చుకైనా కాన రావు.

భారతదేశంలోని సాంఘిక వ్యవస్థ యూరపు అమెరికాల్లో వున్నదానికంటే భిన్నమైనందువల్ల అక్కడ యూరపు, అమెరికాలో తమ రాజ్యాంగాన్ని రచించుకునేటప్పుడు వారి సాంఘిక వ్యవస్థకు సంబంధించిన వాస్తవాలను గణనలోనికి తీసుకోనక్కరలేదు. అదే భారతదేశంలో కులం అంటరానితనాలను లెక్కలోకి తీసుకోకుండా వదిలివేయడం కుదరదు. యూరప్‌కు ఎందుకు అక్కరలేదో, భారత దేశానికి ఎందుకు తప్పనిసరో మరింత పరిపూర్ణ అవగాహన కోసం నేను కొంత వివరణ చేస్తా. బృందాలుగా ఏర్పడివున్న సమాజానికి ప్రమాదమేమంటే, ప్రతి బృందము తన "స్వార్థ ప్రయోజనా"లనబడే వాటిని కొన్నింటిని పెంపొందించుకుంటుంది. ఇట్లాంటి స్వార్థ ప్రయోజనాలవల్ల బయటి వారికి హానిని ఎదుర్కొనే అవసరం వున్నందువల్ల రాజ్యాంగ రక్షణలు కల్పించే సమస్య తలెత్తుతుంది. రాజకీయేతర సాధనాలతో అటువంటి హానిని ఎదుర్కొనే అవకాశముంటే రాజ్యాంగ రక్షణలు కల్పించే

అవశ్యకత వుండదు. ఇక రెండవ వైపున రాజకీయేతర సాధనాలు లేనప్పుడు రాజ్యాంగ సాధనాలు కల్పించి తీరాలి. తన స్వార్థ ప్రయోజనాలం వెంటబడే బృందం వల్ల జరిగే చెరుపును నివారించే అవకాశం యూరప్‌లో వుంది. భిన్న బృందాల మధ్య వేర్పాటుతనం ఒంటరితనం లేకపోవటం వల్ల ఈ అవకాశం వుంది. దీనివల్ల కలివిడిగా పూర్తిగా వీలుంటుంది. తన స్వార్థ ప్రయోజనాలకోసమే నిలబడి వాటినేదో సున్నితంగా, పవిత్రంగా ఎంచి కాపాడుకోవాలనే ప్రబలమైన బృంద ధోరణి పోయి దాని ఆశయ లక్ష్యాలకు కొంత వైశాల్యం, సామాజీకరణలకు వీలు కలుగుతుంది. యూరప్ లోని బృందాల మధ్య ఈ యిచ్చిపుచ్చుకునే ధోరణివల్ల ఒక సామాజిక చింతన, లక్ష్య సామరస్యం, ఐక్య ఆచరణగల సమాజం ఆవిర్భవిస్తుందని నమ్మకంగా చెప్పవచ్చు. కాని భారతదేశం విషయం యిందుకు పూర్తిగా భిన్నమైనది. ఇక్కడ కులం అన్నది ఒంటిగా వెలివేసినట్లుగా వుంటుంది. ఆశయ లక్ష్యాలలో సర్దుబాటుగాని, కలివిడిగాని వుండనేరవు. ఒక కులంగాని, కులాల సమూహంగాని వేరే కులాలకు వ్యతిరేకంగా తమ స్వంత ప్రయోజనాలనే పవిత్రంగా, అనుల్లంఘనీయంగా ఎల్లప్పుడూ భావిస్తుంటాయి. అవి కలిసి సహకరించుకున్నా స్వభావం మాత్రం మారదు. ఈ సహకార చర్యలు కేవలం యాంత్రికమే తప్ప సామాజికం కావు. మానసిక, బౌద్ధికస్థితుల ప్రమేయం లేకుండానే ఒక వ్యక్తి తనకు కావలసిన ఫలితాల కోసం యితరులను వాడుకుంటాడు. ఆజ్ఞలను యివ్వడం, పాటించటం చేస్తున్నందువల్ల పనులలో, ఫలితాలలోమార్పు వస్తుంది. కాని వారి తత్వాలలో మార్పు రాదు. అందుచేత భారత దేశంలో అగ్రకులాలు తమ ప్రయోజనాలకోసం బడుగు కులాలకు చేసే హానిని నివారించటానికి రాజ్యంగం రక్షణలను కల్పించి తీరాలి.

భారత కుల వ్యవస్థకు మరొక విలక్షణమైన గుణం వుండడం వల్ల భారత రాజ్యాంగం దానిని పరిగణలోనికి తీసుకుని దానివల్ల చెరుపు జరగకుండా కట్టుదిట్టం చేయాలి. ప్రతి సంఘంలోనూ బృందాలుంటాయి. కాని అన్ని చోట్లా ఆ బృందాల మధ్య పరస్పర సంబంధాలు ఒకేరకంగా వుండవన్నది గుర్తించాలి. ఒక సమాజంలో వున్న బృందాలు పరస్పరం కనబరచే దృక్పథం కేవలంగా సాంఘికేతరం అయి వుండవచ్చు. మరొక సమాజంలో అవి సంఘ వ్యతిరేకమై వుండవచ్చు. భిన్న బృందాల ప్రేరణ సాంఘికేతరమైన చోట రాజ్యాంగ రచనలో అవి లెక్కలోకి రావు. సాంఘికేతరమైన బృందం ప్రమాద హేతువు కాదు. మరొక బృందం ఎడల సంఘవ్యతిరేక ప్రేరణ కలిగి వుండి ప్రతి పరాయి బృందాన్ని శత్రువుగా పరిగణించే బృందాలున్నప్పుడు రాజ్యంగ రచనలో ఈ వాస్తవాన్ని పరిగణలోనికి తేవాలి. అట్లాంటి సంఘ వ్యతిరేక ప్రేరణకు గురైన బాధిత వర్గానికి సముచితమైన రక్షణలు కల్పించి భద్రత చేకూర్చాలి. భారత దేశపు కులాలు కేవలం సాంఘికేతరం కావు. తరచు అవి సంఘ వ్యతిరేకం. అస్పృశ్యలను హిందువులు చూసే తీరు విషయంలో యిది మరీ యదార్థం. అస్పృశ్యుల ఎడల హిందువులు ఎంత సంఘ వ్యతిరేకత కనపరుస్తారో తెలియడానికి కొద్ది వాస్తవాలు చాలు. ఉదాహరణకు ఒక బావినించి నీరు తెచ్చుకోడానికి హిందువులు అస్పృశ్యులను అనుమతించరు. అస్పృశ్యులు పాఠశాలల్లో ప్రవేశించటానికి హిందువులు అనుమతించరు. అస్పృశ్యులు బస్సులలో ప్రయాణించటానికి హిందువులు అనుమతించరు.

ఒకే రైలు పెట్టెలో ప్రయాణించడానికి హిందువులు అస్పృశ్యులను అనుమతించరు. అస్పృశ్యులు శుభ్రమైన బట్టలు వేసుకోవడానికి హిందువులు అనుమతించరు. అస్పృశ్యులు నగలు ధరించటం హిందువులు అనుమతించరు. తమ యిళ్ల కప్పులపైన పెంకులు వేసుకోవడానికి హిందువులు అస్పృశ్యులను అనుమతించరు. స్వంత భూమివున్న అస్పృశ్యులను హిందువులు సహించరు. అస్పృశ్యులు పశువులను పెంచడం హిందువులకు గిట్టదు. హిందువైనవాడు నిలబడి వున్నప్పుడు అస్పృశ్యుడు కూర్చుంటే వూరుకోడు. హిందువులలో ఎవరో కొద్దిమంది దుష్టులు కదాచిత్తుగా చేసే పనులు కావు యివి. అస్పృశ్యులకు వ్యతి॰కంగా హిందూ సమాజం కనపరచే సంఘువ్యతిరేక ధోరణికి శాశ్వత చైదాలు యివి[1]

ఈ విషయాన్ని యింకా పొడిగించడం అనవసరం. సిద్ధాంతం యావత్తు తప్పుల తడిక అంటే చాలు. రాజ్యాంగ రక్షణలు కోరుతున్న అస్పృశ్యులకు వ్యతిరేకంగా దీనినొక ఆధారంగా వాడటం వంచనాశిల్పంలో మిక్కిలి లజ్జాకరమైన శకలం.

## V

అప్పుడప్పుడు మరొక ఆషామాషీ వాదన కూడా వినవస్తుంది. అస్పృశ్యత అనేది అంతరిస్తున్న ఒక దృశ్యమని భారత జాతీయ జీవనంలో అస్పృశ్యులను ఒక ప్రత్యేకవర్గంగా గుర్తించడంవల్ల ప్రయోజనమేమీ లేదని ఈ వాదన సారాంశం. ప్రతిదీ అంతరించేదే, మానవ చరిత్రలో శాశ్వతమైనదంటూ ఏదీ లేదు. అస్పృశ్యత సమూలంగా అంతరించాక ఈ విషయం ఆలోచించవచ్చు. ఆ స్థితి వచ్చేవరకు ఈ వాదనను ఖాతరు చేయడం అనవసరం. అస్పృశ్యత అంతరించాలనే మనమందరం తప్పక ఆశిద్దాం. తాము అకుంఠితమైన ఆశావాదులమని గొప్పలు చెప్పుకునేవారు మనల్ని తప్పుదారి పట్టించకుండా జాగ్రత్త పడాలి. కుంగిపోయివున్న స్థితిలో వుల్లాస పరచటానికి ఆశావాది మంచి మిత్రుడే. కాని యదార్థాల విషయం వచ్చేసరికి నిత్యమూ అతడు సత్యవాది అయిన సాక్షికాదు.

ఇది అసలు వాదనే కాదు. కాని కొందరు దీని మోజులో పడవచ్చు. కనుక యిది ఎంత నిరర్థకమైనదో వెల్లడి చేయదలచాను. ఈ ప్రశ్న లేవనెత్తేవారు అస్పృశ్యత అంటే "నన్ను ముట్టుకోకు " అన్న తత్వానికి, సాంఘిక వివక్షత కరడుగట్టిన ఒక మానసిక దృక్పథానికి మధ్యగల వ్యత్యాసాన్ని కానరు. ఈ రెంటికీ చాలా తేడా వున్నది. అస్పృశ్యత నన్నుముట్టుకోకు తత్వంగా పట్టణాల్లో క్రమంగా దూరమవుతూ వుండవచ్చు. ఇది కూడా తగు మోతాదులో జరుగుతున్నదా అన్నది సందేహాస్పదమే. అస్పృశ్యులను వేరే గాట కట్టేయాలని చూసే హిందువుల బలమైన కోరికగా అస్పృశ్యత పట్టణాలనుంచిగాని, పల్లెలనుంచిగాని మన వూహకందే భవిష్యత్తులో అంతర్ధానం కాదని నేను నిశ్చయంగా చెప్పగలను. వేరే గాట కట్టేసే కామనగా అస్పృశ్యత అంతర్ధానం కాకపోవడమేకాదు,

1. వివరాలకు మాకు హిందువులేంచేశారు పేరున నా రాబోయే పుస్తకం చూడండి.

నన్నుముట్టుకోకు తత్వంగాకూడా అసంఖ్యాకమైన హిందువులు నివసిస్తున్న, ఇకముందుకూడా నివసించనున్న అసంఖ్యాకమైన గ్రామాలలో గుణించగల భవిష్యత్తులో అది అంతర్ధానం కాదు. రెండువేల సంవత్సరాలుగా మెలితిరిగిన మనిషి మనస్సును వూడదీసి రెండోవైపుగా బిగించడం సాధ్యంకాదు.

హిందూమతానికి అనుకూలురైన కొందరు హిందూమతం చాలా సహన శీలమైనదని అది దేనికైనా సరిపుచ్చుకుని దేనినైనా సంలీనం చేసుకుంటుందని అనటం నాకు బాగా తెలుసు. ఒక మతంలో వున్న యిలాంటి గుణాన్ని మనం గర్వించదగ్గ సలక్షణంగా చాలామంది భావిస్తారని నేననుకోను. పేడతిని జీర్ణంచేసుకునే శక్తిని సముపార్జించిన శిశువును గురించి గొప్పగా భావించలేము గదా! ఐతే అది వేరే విషయం. హిందూ మతం సర్దుబాటు చేసుకుంటుందనేది యదార్థమే. అక్బరు కాలం నాటి బ్రాహ్మణులు ఆయన రచించిన దిన్-ఇ-లాహి కి హిందూమతంలో స్థానం కల్పించడానికి హిందూ వేదాంతంలో ఏడవ దర్శనంగా దానిని ప్రస్తరింపచేయటానికి సాహిత్య గ్రంథంగా వెలువరించిన " అల్లా ఉపనిషత్తు" ఈ సర్దుబాటుకు శ్రేష్ఠమైన ఉదాహరణ. చాలా విషయాలను హిందూమతం తనలో యిముడ్చుకోవడం యదార్థం. గొడ్డుమాంసపు హిందూ మతం ఇంకా (ఖచ్చితంగా చెప్పాలంటే, తొలిదశలోని హిందూ మతానికి సరైన పేరైన బ్రాహ్మణీకం) బౌద్దమతపు అహింసా సిద్ధాంతాన్ని యిముడ్చుకొని శాకాహారపు మతంగా తయారైంది. హిందూ మతం ఏనాటికీ చేయలేకపోయిన ఒకేఒక్క సంగతి అస్పృశ్యుల సంలీనాన్ని సరిపుచ్చుకోకపోవడం లేదా అస్పృశ్యతావరోధాన్ని తొలగించుకొక పోవడం. అస్పృశ్యతా కళంకాన్ని తుడిచివేసే ప్రయత్నంలో గాంధీకి ముందే చాలామంది సంస్కర్తలు రంగంమీదికి వచ్చారు. కాని వారంతా ఓడిపోయారు. వారి ఓటమికి కారణం చాలా సులువైనదిగా నాకనిపిస్తున్నది. హిందువులకు అస్పృశ్యులగురించి భయపడవలసిందేమీ లేదు. అస్పృశ్యతా నిర్మూలనవల్ల వాళ్లకు ఒరిగిందేమీ లేదు. హిందూమతానికంటే బౌద్దమతానిది పైచేయి అవుతుందని భయపడి హిందువులు పశుమాంస భక్షణం త్యజించారు. అక్బరు ఒక కొత్త మతాన్ని స్థాపించడంలో సాయపడితే తమకు అనేక ప్రయోజనాలు ఒనగూడతాయి కనుక హిందువులు అల్లా ఉపనిషత్తును రాశారు. చక్రవర్తిని సంతోష పరచి గ్రంధకర్త ధనం ఆర్జించాడు. ఇస్లాము కంటే తక్కువ అణిచివేతను నియంతృత్వాన్ని హిందువులకు వాగ్దానం చేసిన ఒక కొత్త మతాన్ని స్థాపించడంలో సాయపడ్డాడు. అస్పృశ్యతా శాపాన్ని తుదముట్టించడానికి హిందువులు తక్షణం నడుంకట్టారని ఎదురుచూసే మిక్కిలి ఆశావహమైన అస్పృశ్యులకు ఈ రెండు పరిహారాల్లో ఒక్కటి కూడా లభ్యం కాదు.

హిందువులు భయపడవలసిందీ లాభపడేదీ లేకపోవడమే కాదు, అస్పృశ్యతానివారణవల్ల వాళ్లు నష్టపోయేది చాలావుంది. అస్పృశ్యతా వ్యవస్థ హిందువులకు ఒక బంగారు గని. ఒక యజమాని వర్గానికి అర్హమైన గర్వాతిశయాల్ని ప్రకటించుకోవడానికి, తమ విలాస వైభోగాలను సాగించు కోడానికి 240 మిలియన్ల హిందువులను సేవించే పరివారంగా 60 మిలియన్ల అస్పృశ్యులవసరం. తమ కింద తక్కువ చేసి చూసే ఒక బానిస వర్గం వుంటేగాని ఈ

సాగించుకోవడం సాధ్యపడదు. 60 మిలియన్ల అస్పృశ్యులను వెట్టి కార్మికులుగా, 240 మిలియన్ల హిందువులు వూడిగం చేయించుకోడానికి ఆ వ్యవస్థలో వీలున్నది. వాళ్లు పూర్తిగా దైన్య, నిస్సహాయస్థితిలో వుండడం వల్ల కేవలం నామమాత్రమైన భత్యానికి, ఒక్కొక్కపుడు అదీలేకుండా బలవంతంగా పనిచేయించుకోవచ్చు. హిందువులు చేయరాదని వారిమతం నిషేధించిన హేయమైన పాకీ పనిని 240 మిలియన్ల హిందువుల కొరకు చేయడానికి 60 మిలియన్ల అస్పృశ్యులు దొరికే వీలు ఆ వ్యవస్థలో వున్నది. ఈ పనిని హిందువులకోసం హిందువులు కానివారు చేయాలి. వాళ్లు అస్పృశ్యులేకావడం తప్పనిసరి. చిల్లర పనులలో నియోగించడానికి హిందువుల కొరకు అట్టేపెట్టకొన్న పై వుద్యోగాలకు పోటీ రాకుండా చేసుకునేందుకు 240 మిలియన్ల హిందువుల కొరకు 60 మిలియన్ల హిందువులకు, 60 మిలియన్ల అస్పృశ్యులు ఉండే వీలు ఆ వ్యవస్థలో వున్నది. ఆర్థిక మాంద్యపుసమయాల్లో ఒత్తిళ్లను తట్టుకునేందుకు, ఆర్థికవికాసపు వేళల్లో నిర్భీవభారంగాను 240 మిలియన్ల హిందువులకు 60 మిలియన్ల అస్పృశ్యులు వుండేవీలు ఆ వ్యవస్థలో వున్నది. అందువల్ల మాంద్యపు రోజుల్లో అస్పృశ్యుడుని మొదటగాను హిందువును ఆఖరున యింటికి పంపిస్తారు. వికాసపు రోజుల్లో హిందువును మొదటగాను, అస్పృశ్యుణ్ణి ఆఖరున కొలువులో పెడతారు.

చాలామంది అస్పృశ్యతను ఒక మత ధర్మంగా భావిస్తారు. అది నిజం. కాని దానిని కేవలం మతధర్మం మాత్రమే అనుకోడం పొరపాటు. అస్పృశ్యత మతధర్మాన్ని దాటిపోయింది. బానిసత్వం కంటే హీనమైన ఒక ఆర్థిక విధానంకూడా అది. బానిస విధానంలో ఏమైనా బానిసకింత తిండి, బట్ట, వసతి కల్పించి మంచి స్థితిలో వుంచవలసిన అగత్యం యజమానికి వుంటుంది. లేకపోతే బానిసకు మార్కెట్లో ధర పలకదు. కాని అస్పృశ్యతా వ్యవస్థలో అస్పృశ్యుణ్ణి పోషించే బాధ్యతను హిందువులు చేపట్టారు. బాధ్యతలేని దోపిడిని ఈ ఆర్థికవ్యవస్థ అనుమతిస్తుంది. అస్పృశ్యత నిష్కృతిలేని ఆర్థిక పరమైన ఒక దోపిడివిధానం మాత్రమే కాదు, అది నియంత్రణే లేని ఒక దోపిడి విధానం కూడా. దీనిని ఖండించేందుకు ఒక స్వతంత్రమైన ప్రజాభిప్రాయం లేదు, దానిని అదుపులో పెట్టేందుకు ఒక నిష్పాక్షికమైన పాలనా యంత్రాంగమూ లేదు. ప్రజాభిప్రాయానికి విన్నవించి ప్రయోజనం లేదు. ఉన్న ప్రజాభిప్రాయమంటూ హిందువులదే. వాళ్లే దొపిడీ వర్గం కనుక దోపిడికి అనుకూలంగానే వుంటారు. పోలీసు, న్యాయవ్యవస్థల నుంచి అదుపు వుండదు. కారణం సులభం. వారంతా హిందువులే కావడంవల్ల దోపిడీదారుల పక్షం వహిస్తారు.

అస్పృశ్యత చాలా శీఘ్రంగా అంతరించి పోతుందని నమ్మేవారు అది హిందువులకు కలిగిస్తున్న అర్థిక ప్రయోజనాలను గమనించడం లేదు. తనఅంటరానితనాన్ని వదిలించుకోడానికి అంటరానివాడు చేయగలిగింది పూజ్యం. తనేదో స్వయంగా చేసిన తప్పువల్ల అది పుట్టలేదు. అస్పృశ్యత అనేది హిందువు అన్నవాడి మానసిక దృక్పధం. అస్పృశ్యత అంతరించాలంటే హిందువుమారి తీరాలి. అతడు మారతాడా?

హిందువుకు అంతరాత్మ వుందా? ఒక నైతిక గ్లానికి వ్యతిరేకంగా అతను ధర్మాగ్రహం వ్యక్తం చేయడం ఎవరన్నా చూశారా? ఒకవేళ అస్పృశ్యతను నైతికతప్పిదంగా భావించేమేరకు

అతడు మారినా, దేవుడితో, మానవుడితో మన్నన నెరపేస్థితికి అతడు మేలుకున్నా, అతనికి అస్పృశ్యత మప్పే ఆర్థిక, సామాజిక ప్రయోజనాలను వదులుకోడానికి ఒప్పుకుంటాడా? హిందువుకు ఒక సున్నితమైన అంతరాత్మ వుందనిగాని, ఒకవేళ వుంటే అతనిలో అది నైతిక ఆగ్రహాన్ని పురికొల్పి తప్పిదాన్ని తుదముట్టించే ధర్మయుద్ధానికి అతన్ని తరుముతుందనిగాని మనం ఒక నిర్ణయానికి రావడం చరిత్ర సమర్థించదని నేను శంకిస్తున్నాను. ధర్మానికి, ధనాపేక్షకు ఘర్షణ ఏర్పడినప్పుడెప్పుడూ ధనాపేక్షే గెలుస్తుందని చరిత్ర చాటుతున్నది. తగుమాత్రం దౌర్జన్యంగా బలవంత పెడితేతప్ప స్వార్థపర శక్తులెన్నడూ యిష్టాపూర్వకంగా తమ ప్రయోజనాలను వదులుకోవు. ఎటువంటి దౌర్జన్యకర శక్తినైనా పురికొల్పగలిగే ఆశ అస్పృశ్యులకులేదు. చిందరవందరగా వున్న పేదలు వాళ్లు. వాళ్లు తలెత్తితే అణగద్రొక్కవచ్చు.

స్వరాజ్యం హిందువులను మరింత బలవంతులుగా, అస్పృశ్యులను మరింత నిస్సహాయులుగా చేస్తుందని ఈ పరిశీలనవల్ల తేలింది. హిందువులకు కలిగిస్తున్న ఆర్థిక ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకున్నపుడు-అస్పృశ్యతను అంతమొందించడం పోయి స్వరాజ్యం దాని ఆయుస్సును పెంచే అవకాశం పూర్తిగా వుంది. అస్పృశ్యత అంతర్ధనమవుతుందనడం అందువల్లనే పగటి కలలు కనడం మాత్రమే, పనిగట్టుకొని చెబుతున్న అసత్యం మాత్రమే. వర్తమానంలోని కఠోర సత్యాలను, నిరవధిక భవిష్యత్తులోకి అవి కొనసాగేవాస్తవాన్ని విస్మరించి రాజ్యాంగ రక్షణలు కావాలని అస్పృశ్యులు చేస్తున్న డిమాండ్లను పరిశీలించడంలో దీనిని గణనలోనికి తీసుకోకపోవడం గొప్పమూర్ఖమే కాకుండా నేరం కూడా అవుతుంది.

అనువాదం : సి.ధర్మారావు.

## అధ్యాయం - IX

# విదేశీయునికి వినతి

### బానిసల సృష్టించే నిరంకుశత్వానికి స్వేచ్ఛ ఇవ్వవద్దు

## I

కొన్ని అసాధారణ సందర్భాలలో తప్పించి, ఇండియా రాజకీయాలలో ఆసక్తిచూపించే విదేశీయులందరూ కాంగ్రెస్‌నే బలపరచడం సర్వ సాధారణమైన అనుభవం. ఇది దేశంలోని కొన్ని రాజకీయ పక్షాలను కలవరపరుస్తున్నది, బాధిస్తున్నది. ఇది ముసల్మానులకు ప్రాతినిధ్యం వహించే ముస్లిం లీగ్, ఇప్పుడు చైతన్యం చల్లబడినచట్లున్నా బాహ్మణేతరుల తరఫున ఇంకా మాట్లాడడానికి ఉబలాటపడే జస్టిస్ పార్టీ, అంటరానివారికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చెప్పుకునే అఖిల భారత అనుసూచిత కులాల సమాఖ్య, ఈ పక్షాలన్నీ విదేశీయుని అండదండల కోసం అభ్యర్థిస్తున్నవే. కాని ఆ పరాయివాడు వీరి మొర వినడానికి సిద్ధంగాలేడు. ఇండియాలోని మిగిలిన రాజకీయ పార్టీలను సమర్థించకుండా ఈ విదేశీయుడు కాంగ్రెస్‌నే ఎందుకు సమర్థిస్తాడు? తన ఈ వైఖరికి విదేశీయుడు రెండు కారణాలను సాధారణంగా చెప్పాడు. అంటరాని వారితోసహా భారతీయులందరి తరఫున మాట్లాడే కాంగ్రెస్ ఇండియా కంతటికి ప్రాతినిధ్యం వహించే వ్యవస్థ అనే తన నమ్మకమే దీనికి ఒక కారణంగా చెప్తాడు. అతని విశ్వాసంలో వాస్తవముందా? అటువంటి నమ్మకం కలగడానికి రెండు పరిస్థితులు ముఖ్యంగా దోహదం చేస్తున్నాయి.

ఇండియాలో కాంగ్రెస్ అనుకూలంగా ప్రచారం చేసే వార్తా వ్యవస్థ వ్యాప్తికి మొట్టమొదటి కారణం. ఇండియాలో వార్తా వ్యవస్థ కాంగ్రెస్‌కు వత్తాసుదారు. కాంగ్రెస్ ఎప్పుడూ

తప్పుచేయదనే పిడివాదాన్ని నమ్ముతుంది. కాంగ్రెస్ సిద్ధాంతానికి, పరువుకు సరిపడని ఏ వార్తకైనా ఎటువంటి ప్రచారమూ ఇవ్వకూడదనే సూత్రం ప్రకారం వ్యవహరిస్తుంది. అన్నింటికి ప్రాతినిధ్యం వహిస్తుందని ఈ కాంగ్రెస్ ఘోషణకు నిరంతరం ప్రచారం లభించటం ఇండియాలోని వార్తావ్యవస్థ వల్లే. కెంగ్రెస్ ఒక్కటే ఇండియాలో ప్రాతినిధ్యం వహించే వ్యవస్థని ఇంగ్లాండు, అమెరికాదేశాల ప్రజలకు తెలుసున్న ఏకైక విషయం.

రెండో పరిస్థితి: అంటరానివారిని కూడా కలుపుకుని ఇండియాకు ప్రాతినిధ్యం వహించే ఏకైక వ్యవస్థ కాంగ్రెసేనని బయట ప్రపంచం ఎందుకు నమ్ముతోందంటే కాంగ్రెస్ వాదం కాదని, అంటరానివారు తమ యదార్థ పరిస్థితిని వివరించుకునే ప్రచారం లేకపోవడమే అనాలి. అంటరాని వారి ఈ విఫలతకు అనేక వివరణలు ఉన్నాయి. వారిదంటూ ఒక వార్తా సంస్థ లేదు. కాంగ్రెస్ వార్తా సంస్థ వారికి మూసిన తలుపు వారికి కాస్త కూడా ప్రచారం ఇవ్వకుండా ఉండటానికి అది దృఢనిశ్చయంతో ఉంది. వారికి ఒక వార్తా సంస్థ ఏర్పడబోదు. ఏ వార్తా పత్రిక కూడా ప్రకటనల నుంచి ఆదాయం లేకుండా మనజాలదని తెలిసిన సంగతే. ప్రకటనల ఆదాయం వ్యాపారంనుంచే రాగలుగుతుంది. ఇండియాలోని వ్యాపారసంస్థలన్నీ పెద్దా చిన్నా కాంగ్రెస్ పరం. కాంగ్రెసేతర సంస్థను ఆదరించవు. ఇండియాలో ముఖ్యమైన వార్తా సంస్థ అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా. దీనిలో పనిచేసే ఉద్యోగులంతా మద్రాసు బ్రాహ్మణులే. నిజానికి ఇండియాలో వార్తావ్యవస్థ అంతావీరి చేతుల్లోనే వుంది. వీరంతా కాంగ్రెస్ అనుకూలుర తెలిసిందే. వీరు కాంగ్రెస్ వ్యతిరేకమైన విచారణకు ప్రచారం రానివ్వరు. ఈ పరిస్థితులు అంటరానివారి అదుపులో లేనివి. కాని వారి ప్రచారలోపానికి చాలావరకు కారణం వారిలో ప్రచారం చెయ్యడానికి మనో నిశ్చయం లేకపోవడమే. దేశావసరం బయటి ప్రపంచపు దృష్టిలో దెబ్బతీసేపని ఏది కూడదన్న దేశభక్తి భావమే ఈ మనోనిశ్చయలోపానికి దారితీస్తుంది. ఇండియాలోని రాజకీయాలకు రెండు విధాలైన దృక్పధాలున్నాయి. వీటిని విదేశీపరమైన రాజకీయాలుగాను, రాజ్యాంగపరమైన రాజకీయాలుగాను విడమర్చవచ్చు. ఇండియా విదేశీరాజకీయాలు బ్రిటిష్ సార్వభౌమత్వం నుంచి ఇండియాకు విముక్తి కల్పించేది కాగా ఇండియా రాజ్యాంగపు రాజకీయాలు స్వతంత్ర భారత రాజ్యాంగ స్వరూప స్వభావాల చుట్టూ పరిభ్రమిస్తాయి. నిజానికి ఇవి రెండు వేర్వేరు విషయాలు. భారత రాజకీయాల్లోని ఈ రెండు దృక్పధాలు వేరుచేయడానికి వీలున్నప్పటికి, అంటారాని వారిభయమేమిటంటే ఈ విషయంలో లెక్కలోకి వచ్చే విదేశీయుడు ఈ రెండిటిని విడమరచిచూసే శక్తి లేనివాడే కాకుండా, రాజ్యాంగ రాజకీయాలకు సంబంధించిన తగవులను భారతదేశపు విదేశీ రాజకీయాల అంతిమ లక్ష్యం గురించి కొట్లాటగా అపోహపడేదిగా ఉండవచ్చును. దీని మూలంగానే అంటరాని వారు కాంగ్రెస్ వారు చేస్తున్న ప్రచారాన్ని వ్యతిరేకించకుండా మౌనం వహించారు. తమకి వ్యతిరేకంగా జరుగుతున్న కాంగ్రెస్ ప్రచారాన్ని వ్యతిరేకించక పోవడం అంటరానివారి దేశభక్తికి గీటురాయిగా కాంగ్రెస్‌వారు వొప్పుకోరు. ఏది ఏమైనా నిజమేమిటంటే ప్రత్యక్ష ప్రతిఘటన తప్పించి, మౌనం వహించే ఉద్దేశమే, కాంగ్రెస్ అంటరానివారితో సహితం అందరికి ప్రాతినిధ్యం వహిస్తుందన్న సామాన్య అభిప్రాయానికి కారణ భూతమైంది.

విచారించతగ్గదైనా ఎప్పుడూ, కాంగ్రెస్ ప్రాతినిధ్యపు లక్షణాన్ని ఎన్నికల పరీక్షకు ్టనందువల్ల విదేశీయుడు ప్రచార ప్రభావితుడౌడం క్షమార్హం.

కాని ఈ విషయం 1937 లో జరిగిన ఎన్నికలలో పరీక్షకు పెట్టడం జరిగింది. ుయ పరిశీలనకు ఎన్నికల ఫలితాలు అందుబాటులో ఉండటంలో ప్రచారం పైన ఆధారపడిన ంగ్రెస్ ప్రాతినిధ్యపు లక్షణం మీద ఆధారపడి ఏ ఒక్కరూ నిర్ణయం తీసుకొనడానికి ులేకుండా పోయింది. సాధారణంగాను ప్రత్యేకంగాను, రెండు విధాలా ఈ ఎన్నికల ితాలు అంటరానివారి గురించి సూచించే దేమిటో ఈ పుస్తకం ముందు భాగంలో ంరించడం జరిగింది. కాంగ్రెస్ ప్రాతినిధ్యం గురించి పూర్వంలాగా కాకుండా విదేశీయులు ు ముందున్న నిజాల ఆధారంగా ఇప్పటికైనా కాంగ్రెసేతర పార్టీలు ముఖ్యంగా ంటరానివారు భారత రాజకీయాల విషయంలో వేరే అభిప్రాయం కలిగి ఉన్నారని, కాంగ్రెస్ చారాధార ప్రాతినిధ్యాన్ని నమ్మరని ఇప్పుడైనా అనుకోవచ్చు.

కాంగ్రెస్ భారత స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నదన్న నమ్మకమే విదేశీయుడు ంగ్రెస్‌కి తన సహకారం ఎందుకు అందిస్తున్నాడు అన్నదానికి రెండవ కారణం. పరాయి భుత్వం చేసిన చట్టాలను ఎదిరిస్తూ, పన్ను నిరాకరణ ఉద్యమం నడుపుతూ, జైలుకు ుతూ, ప్రభుత్వంతో సహాయనిరాకరణ ఉపదేశిస్తూ, పదవులను తిరస్కరిస్తూ, దేశ ్వతంత్ర్యం కోసంఇంకా అనేకవిధాల ఆత్మాహుతి చేసుకుంటూ బ్రిటీష్ ప్రభుత్వంతో ంఘర్షణ పడుతున్న కాంగ్రెస్‌ను అతను చూస్తాడు. మిగిలిన రాజకీయ పార్టీలన్ని వీటికి ారంగా ఉండటంకూడా అతడు చూస్తాడు. దీనిని బట్టి కాంగ్రెస్ వ్యవస్థ ఒక్కటే దేశ ్వతంత్ర్యానికి పాటుపడుతోందని ఊహించుకుంటాడు. స్వేచ్ఛ ప్రేమించేవాడు కాబట్టి ్వతంత్ర్య పోరాటం సాగించే వ్యవస్థకి చేయూత నివ్వాలని అనుకుంటాడు. మిగిలిన రాజకీయ ార్టీలన్నీ స్వాతంత్ర్య పోరాటంలో ఎందుకు చేరడంలేదో వేరే చోట నేను వివరించాను. వరి స్వాతంత్ర్యం కోసం కాంగ్రెస్ పోరాడుతున్నది? ఈ ప్రశ్న మరో అంశమై ఇక్కడ ప్పడానికి ప్రతిపాదిస్తున్నాను.

## II

స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న కాంగ్రెస్ పక్షం వహించేటప్పుడు విదేశీయుడు ఒక ేశ స్వాతంత్ర్యానికి ఆదేశంలో నివసిస్తున్న ప్రజాస్వాతంత్ర్యానికి మధ్య ఏమీ తేడా చూపించడు. ిక్కడ ఒకటి చెప్పక తప్పదు. ఈ వివేచన చూపించలేని విదేశీయుడు, అసలు విషయం ర్థంచేసుకోలేక పోవడమేకాక, తనను మోసపుచ్చటానికి కాకపోతే తప్పుదారి పట్టించడానికైనా ననంతతాను అవకాశం కలిగిస్తున్నాడు. ఎందుకంటే సమాజం, రాష్ట్రం, దేశం అనే పదాలు ునిర్దిష్టమైనవి కాకపోతే అవ్యవస్థితమైన అంశాలు 'దేశం' ఒకే పదమైనప్పటికి అనేక వర్గములని ర్థంచెప్పుకోటంలో అతిశయోక్తి, ఏమీలేదు. వేదాంతపరంగా ఒక దేశాన్ని ఒక సంపూర్ణ సముదాయంగా భావించవచ్చు. కాని సమాజ పరంగా దానిని వివిధ వర్గములుగా భావించక తప్పదు. వివిధ వర్గములకు, ప్రత్యేకించి దాశ్యబద్ధమైన వర్గములకు స్వాతంత్ర్యం సుస్థిరం చేసినప్పుడే కాని ఆదేశం నిజంగా స్వాతంత్ర్యం సంపాదించిందనడానికి వీలు లేదు. కాంగ్రెస్ దేశ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నది కాబట్టి అది ప్రజాస్వాతంత్ర్యంకోసం, అందునా

అడుగునున్నవారికన్నా అట్టడుగునున్న వారికోసం పోరాడుతోన్నదని సంతృప్తిపడటం తెలివి తక్కువ. ఎవరి స్వాతంత్ర్యం కోసం కాంగ్రెస్ పోరాడుతున్నదన్న ప్రశ్నతో పోలిస్తే, కాంగ్రెస్ అసలు స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నదా అన్న ప్రశ్నకు ఏమీ ప్రాముఖ్యత ఉండదు. ఇది ఉపయుక్తమైన, అవసరమైన మీమాంస. విషయపరిగ్రహణచేయక, నిజమేమిటో తెలిసికోకుండా కాంగ్రెస్‌కు వత్తాసివ్వడం స్వేచ్ఛను ప్రేమించే ఎవ్వరికైనా తప్పుగా ఉంటుంది. కాని కాంగ్రెస్ పక్షం వహించే విదేశీయుడు అటువంటి ప్రశ్న లేవనెత్తడానికైనా లెక్కచేయడు. అంత ముఖ్యమైన ప్రశ్నకు విదేశీయుడు ఎందుకు అనాసక్తంగా ఉన్నాడు? నా వివేచనా శక్తి మేరకు, ఈ అనాసక్తతను స్వయంపరిపాలన, ప్రజాస్వామ్యం అంటే పడమర (దేశాలలో) వున్న తప్పుడు భావమే కారణం. ఈ తప్పుడు భావమే భారత రాజకీయాలలో ఆసక్తి చూపించే విదేశీయుని ఆలోచనకు మూల పదార్థం.

స్వయం పరిపాలన సాధించడానికి, గ్రోటే చెప్పినట్లు రాజ్యాంగ పరమైన నైతిక సూత్రమే అవసరమని రాజకీయాల మీద పాశ్చాత్య రచయితలు సూత్రీకరించారు. రాజ్యాంగ పరమైన నైతిక సూత్రం అంటే అసంకల్పితమైన అలవాట్లవల్ల రాజ్యాంగ విధానానికి అత్యంత గౌరవం, ఈ విధానాలకి లోబడి, వాటి పరిధిలో వర్తిస్తూ ఉన్నదున్నట్టుగా చెప్పే అలవాటులో అధికారుల అధికారానికిలోబడి, నిర్ణీతమైన న్యాయసూత్రాలకి మాత్రమే కట్టుబడి ప్రవర్తిస్తూ, అధికారులు వారి ప్రజాకార్యములను విశృంఖలంగా విమర్శిస్తూ -- ప్రతిపౌరుని స్పష్టమైన ఆత్మ సైర్యంతో కూడుకొని పార్టీపోటిలోని తీవ్రతను అంగీకరిస్తూ, రాజ్యాంగ విధానాలు తనకెంత పవిత్రమైనవో ప్రత్యర్థి దృష్టిలో అంతకన్న తక్కువగాదని - ఏ ప్రజలలోనైనా ఈ అలవాట్లు ఆచరణలో ఉన్నట్లయితే అప్పుడు పాశ్చాత్యరాజకీయ రచయితల ప్రకారం స్వయం పరిపాలన నిజంగా ఉన్నట్లే. ఇంతకన్న ఎక్కువేమీ ఆలోచించవలసిన అవసరంలేదు. ఇదే విధంగా, ప్రజలచేత, ప్రజలయొక్క ప్రజలకోసం అనే ప్రజాస్వామ్య ఆదర్శం సాధించడానికి కావలసిందేమిటంటే వయోజన వోటు హక్కు ఏర్పాటు చేయటమని ప్రజాస్వామ్యం మీద రాసే పాశ్చాత్య రచయితలు నమ్ముతారు. వెనక్కిపిలుచు (రీకాల్స్) ప్రజాభిప్రాయం తెలిపే ఎన్నిక(ప్లెబిసైట్) చిన్న పార్లమెంటులు మొదలైన పద్ధతులు చెప్పబడతాయి. కొన్ని దేశాలలో వీటిని అమలు జరపడం జరిగింది. కాని చాలా దేశాలలో వయోజన వోటు హక్కు కన్న ఎక్కువ అవసరం లేదని భావించబడింది.

ఈ రెండు వూహలు తప్పని, పూర్తిగా తప్పుతోవ పట్టించేవని చెప్పడానికి నాకేవిధమైన సందేహములేదు. ప్రాజాస్వామ్య, స్వయంపరిపాలన ప్రతి చోట విఫలమయ్యాయంటే అది ఈ తప్పుడు భావనల వల్లనే. రాజ్యాంగపరమైన ప్రభుత్వం నడపాలంటే రాజ్యాంగ నియమ బద్ధమైన కట్టుబాట్లు అవసరం కావచ్చు. కాని రాజ్యాంగపరమైన ప్రభుత్వం నడపడం, ప్రజల స్వయంపరిపాలన ఒకటి కాదు. అలాగే రాచరికానికి ప్రతీకగా వయోజన వోటు హక్కు ద్వారా ప్రజాప్రభుత్వమేర్పరచ వచ్చుననే మాట తార్కిక అర్థం ప్రకారం ఒప్పుకోవచ్చుకాని, ప్రజలచే, ప్రజలకొరకనే ప్రజాస్వామ్య ప్రభుత్వం దానంతటదే తీసుకువస్తుందని చెప్పడానికి వీలులేదు.

ప్రజాస్వామ్యం స్వయంపరిపాలనలకు సంబంధించిన రాజకీయాలపై ఈపాశ్చాత్య రచయితల అభిప్రాయాలు అనేక కారణాల వల్ల తప్పు. మొదటగా ప్రతి దేశంలోను చారిత్రక కారణాలవల్ల పరిపాలించడానికే నోచుకున్న ఒక పాలకవరం ఉన్నదన్న ఎదురులేని సత్యాన్ని

వీరు విస్మరిస్తారు. వీరు పరిపాలిస్తారు వీరికి పలుకుబడి, అధికారం ఉన్న పదవులను అధిష్టించడానికి వయోజనవోటు హక్కు, రాజ్యాంగ సూత్రములు ఏ మాత్రం ప్రతిబంధకంకావు. పాలకవర్గపువారు సహజనాయకులు అనే పాలితవర్గం భావనవల్ల వారిని దాస్యవర్గం వారు స్వతసిద్ధంగానే ఎన్నుకుంటారు అన్న విషయాన్ని కూడా వీరు విస్మరిస్తారు. రెండవది, ఎక్కడైతే పాలకవర్గం పాలించడానికి తమ పలుకుబడిని నిలుపుకుంటారు అన్నభావన వుంటుందో అక్కడ, ప్రజాస్వామ్యం, స్వయంపరిపాలన నామమాత్రపు విధానాలు మాత్రమే అని భావించాల్సిందేగాని ప్రజాస్వామ్యం, స్వయంపరిపాలన నిజంగా ఉన్నాయి అనడానికి వీలులేదు. మూడవది, వయోజన వోటుహక్కు మీద ఆధారపడిన రాజ్యాంగం ఉన్నప్పుడుకాక పాలకవర్గం అధికారం చేజిక్కించుకోవటంలో ఓడినప్పుడే స్వయం పరిపాలన, ప్రజాస్వామ్యం నిజమౌతాయన్న విషయాన్ని వీరు విస్మరిస్తునట్లు కనపడుతోంది. నాలుగవది, కొన్ని దేశాలలో పాలక వర్గాన్ని సేవావర్గం అధికారంనుంచి కూలతోయడానికి వయోజన వోటు హక్కు మాత్రమే సరిపోయినప్పటికి మిగిలిన దేశాలలో పాలకవర్గం పాతుకుపోయి ఉండడంవల్ల అనేక వర్గాలకి వయోజనవోటుహక్కుతో పాటుకొన్ని రక్షణలుకూడా అవసరం అన్న నిజాన్ని కూడా వీరు నిస్మరిస్తున్నట్లు కనపడుతుంది. ఆఖరుగా, పాలకవర్గం అంటూ ఉన్న పరిస్థితులలో ప్రజాస్వామ్యం, స్వయంపరిపాలనా పథకం ముఖ్యంగా గమనించవలసిన విషయం ఏమిటంటే, పాలకవర్గం యొక్క సామాజిక దృక్పథం, తత్వాలపై ఆధారపడి ఉంటుందన్న విషయాన్ని వారు లెక్కచేయడం లేదన్నట్లు కనపడుతోంది. దీనికి కారణం పాలకవర్గం పాలించేశక్తిని చేజిక్కించుకోవటానికి పాలనావిధానాన్ని ఎంతకాలం అయితే తమ గుప్పిట్లో పెట్టుకుంటుందో అంతవరకు సేవకవర్గాల సంక్షేమం పాలకవర్గాల సామాజిక దృక్పథం, సామాజికస్పృహ జీవితతత్వాలపై ఆధారపడి ఉండటమే.

ప్రజాస్వామ్య స్వయంపరిపాలన స్వయం సంవర్ధకం కావాలనుకునే వాళ్లు ప్రజాస్వామ్యం స్వయం పరిపాలన ఎదుర్కొంటున్న కీలకమైన సమస్యలకు పాలకవర్గమేననే జ్ఞానం కలిగి ఉండటమే సురక్షితము, వాస్తవమైన మార్గము. స్వతంత్రదేశంలో స్వేచ్ఛాపాలకవర్గం సొత్తా లేక అది అందరికి అందుబాటులో ఉండేదా అనే విషయం తేల్చడంలో పైవిషయాన్ని విస్మరించడం ఒక మహాపరాధమే అవుతుంది. కాబట్టి నావుద్దేశంలో కాంగ్రెస్‌ని బలపరచాలని ఉద్దేశించే విధేశీయుడు అడగవలసింది కాంగ్రెస్ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నదా అనికాదు. అతడు అడగవలసింది ఎవరి స్వేచ్ఛకోసం కాంగ్రెస్ పోరాడుతోందని అని. ఇండియాలోని పాలక వర్గం స్వేచ్ఛకోసం అదిపోరాడుతున్నదా లేక భారత ప్రజలందరి స్వేచ్ఛకోసం పోరాడుతున్నదా? పాలక వర్గం స్వరాజ్యం కోసమే కాంగ్రెస్ పోరాడుతోందని అతను అనుకోకుంటే, ఇండియాలో పాలకవర్గం పాలించే సామర్ధ్యం కలిగి ఉన్నదా అని కాంగ్రెస్‌వారిని అడగాలి.

ఈ ప్రశ్నలకు కాంగ్రెస్‌వారు ఇవ్వవలసిన జవాబులు ఏమిటి? నాకైతే తెలియవు కాని ఈ ప్రశ్నలకు నేననుకున్న నిజమైన జవాబులేమిటో మాత్రం నేను ఇవ్వగలను.

# III

ముందుగా, ఇండియాలో పాలకవర్గం ఎవరు అన్నది తెలుసుకోటం మంచిది. ఇండియాలో పాలకవర్గం ముఖ్యంగా బ్రాహ్మణులతో కూడుకున్నది. తమకుతాముగా భూదేవులు (భూమిపైదేవుళ్ళు) గా ఒకప్పుడు వర్ణించకున్నాగాని ఈనాటి బ్రాహ్మణులు వారు పాలక వర్గానికి చెందుతారన్న ఆపాదనను (నిందను) కాదనడం విచిత్రంగా ఉంటుంది. ఇలా పిల్లిమొగ్గ లెయ్యడానికి కారణం ఏమైవుంటుంది? ఇది తమ వర్గహితం చూచుకోకుండా సర్వజనహితం పరిరక్షించాలని ప్రతి సమాజంలోని మేధావివర్గంపై మోపిన మానవాళి పవిత్ర ధర్మానికి నమ్మకద్రోహం చేశామని అపరాధ భావం అంతస్సాక్షి రేపుతోంటే నిలదీసే లోకంముందు నిలచే ధైర్యం లేకనేనా? లేక వారి నిరాడంబరత వల్లనా? ఇందులో ఏదినిజం అనేదాన్ని గురించి ఊహాగానం చేయడం మాని వేయవలసిన అవసరంలేదు.

బ్రాహ్మణులు ఒక పాలకవర్గం అనేది ఎంతమాత్రం ప్రశ్నించడానికి వీలుపడనిది. ఈ విషయంలో ఎవరైనా చేయడానికి రెండు పరీక్షలున్నాయి. మొదటిది ప్రజలకు వీరిగురించి ఉన్న భావన. రెండవది పరిపాలనా యంత్రాంగంపై వీరికి గలపట్టు. ఈ రెండు పరీక్షలకన్న నిశ్చయమైనవి వేరేలేవని నా ఉద్దేశం. మొదటిదాని గురించి ఏవిధమైన అనుమానం లేదు. ప్రజాభిప్రాయం ప్రకారం బ్రాహ్మడు పవిత్రుడు. పూర్వకాలంలో ఎంతఘోరం చేసినప్పటికి వానిని ఉరితీయటానికి వీలులేదు. పవిత్ర మానవుడుగా సేవక వర్గానికి లేని కొన్ని రక్షణలు, సదుపాయాలు వానికి ఉండేవి. కొత్త పంటకు వానికి హక్కు ఉండేది. 'సంబంధమ్' పెళ్లిపద్ధతి ఉన్న మలబారులో వాయరువంటి సేవక వర్గపువారు తమ స్త్రీలను బ్రాహ్మడు వలపుకత్తెలుగా ఉంచుకుంటే గొప్పగా భావించేవారు. రాజులుసైతం తమరాణులకు మొతటి రాత్రి గర్భాదానం చెయ్యవలసిందిగా బ్రాహ్మలను ఆహ్వానించేవారు. ఒకప్పుడు సేవకవర్గానికి చెందినఎవరైనా బ్రాహ్మణుల పాదపుబొటనవేలు కడిగిన నీళ్లను మొదటతాగి కాని భోజనం చేసేవారు కాదు. సర్ పి.సి.రే ఒకప్పుడు తన బాల్యానుభవాన్నిలా వర్ణించారు. చేతులలో నీళ్ల కప్పులుపట్టుకుని బ్రాహ్మడి రాకకోసం సేవక వర్గం, చిన్నపిల్లలు, వీధులలో బారులు తీసి నుంచొని బ్రాహ్మడి కాళ్లుకడిగిన నీళ్లకోసం ఎదురుచూసే తమతల్లితండ్రులకు అవి అందిస్తే ఆనీళ్లుతాగి వారు భోజనం చేసేవారు. సమాన హక్కులు కల్పించే ధర్మశాస్త్ర ప్రకారం ఈ హక్కులు, రక్షణలు, సదుపాయాలు బ్రిటిష్ హయాంలో రద్దయినాయి. అయినప్పటికి వాటి వల్ల వచ్చిన అవకాశాలు యింకా ఉన్నాయి. సేవకవర్గాల దృష్టిలో బ్రాహ్మడు యింకా యితరులకన్న అధికుడు, పవిత్రుడు, వారింకా దొర(లార్డ్) అని అర్థంవచ్చే'స్వామి' అనే పదంతో సంబోధిస్తారు.

ఇక రెండవ పరీక్ష సరితూగే మంచి ఫలితాల్నిస్తుంది. ఉదాహరణకు మద్రాసు ప్రెసిడెన్సినే తీసుకోండి. పట్టిక 17 (పుట చూడు) పరిశీలించండి. బ్రాహ్మణులు ఇతర కులాల మధ్య 1943లో గెజెటెడ్ ఉద్యోగాల పంపిణి ఈ పట్టిక చూపిస్తుంది.

ఇతర రాష్ట్రాలనుంచి వచ్చే ఇటువంటి భోగట్టాకూడా ఇదే విషయాన్ని బలపరుస్తుంది. కాని ఈ విషయం గురించి ఇంగా అవస్త పడనవసరం లేదు. బ్రాహ్మలు తాము పాలకవర్గానికి చెందినవారన్న విషయం ఒప్పుకున్నా లేకపోయినా, పరిపాలనా యంత్రాంగం వారి గుప్పిట్లో ఉన్న విషయం సేవావర్గాలు వారి ఉన్నతిని గుర్తించడం వంటివి ఈ అంశాన్ని నిర్ధారించడానికి సరిపోతాయి. తనకు వత్తాసు పలికినట్లయితే ఇతర వర్గాలను మిత్రకూటంగా కూడగట్టుకొని

# పట్టిక 17

| | సుమారు | జనాభా | 2,200 | | గెజిటెడ్ కాని సీట్లు | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| కులాలు | జనాభా లక్షల్లోసీట్ల | శాతం మొత్తం | గెజిటెడ్ | | భర్తీ శాతం 100 పైన మొత్తంసంఖ్య7,500 | | 35 పైన మొత్తంసీట్లు20,782 | |
| | | | | | భర్తీసంఖ్య | భర్తీచేసిన మొత్తం | భర్తీసంఖ్య | భర్తీచేసిన మొత్తం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| బ్రాహ్మణులు | 15 | 3 | 820 | 37 | 3,280 | 43.73 | 8,812 | 42.4 |
| క్రిస్టియన్లు | 20 | 4 | 190 | 9 | 750 | 10 | 1.655 | 8.0 |
| ముస్లింలు | 37 | 7 | 150 | 7 | 497 | 6.63 | 1.624 | 7.8 |
| డిప్రెస్డు క్లాసులు | 70 | 14 | 25 | 1.5 | 39 | .52 | 144 | .69 |
| బ్రాహ్మణేతరులు | | | | | | | | |
| ముందున్నబ్రాహ్మణేతరులు | 113 | 22 | 620 | 27 | 2,543 | 33.9 | 8.440 | 40.6 |
| వెనుకబడ్డ తరగతులు | 245 | 50 | 50 | 2 | | | | |
| ఆసియాఖండేతరులు | - | - | - | - | 372 | 5.0 | 83 | .4 |
| ఆంగ్లోఇండియన్లు | | | | | | | | |
| మిగిలిన వారు | _ | _ | _ | _ | 19 | .5 | 24 | .11 |

వారికి పాలకవర్గం ప్రతిపత్తి నివ్వడానికి బ్రాహ్మడు ఎప్పుడూ సిద్ధమే నని చరిత్ర చూపుతుంది. ప్రాచీన, మధ్య కాలంలో యోధవర్గానికి చెందిన క్షత్రియులతో కూటమిగట్టి వీరిద్దరు సామాన్య ప్రజలను పరిపాలించారు. బ్రాహ్మడు తన కలంతోను, క్షత్రియుడు తన కత్తితోను జనబాహుళ్యాన్ని అణగదొక్కారు. ఇప్పుడు బనియాలనే వైశ్యులతో కూటమిగట్టారు. క్షత్రియుల నుంచి వైశ్యులకు ఈ కూటమి మార్పిడి సహజమైనది. వాణిజ్యపరమైన ఈ రోజులలో కత్తికన్న విత్తం మిన్న. ఈ పార్టీమార్పుకు అదో కారణం. రాజకీయ యంత్రాంగం నడపడానికి గల ధనావసరం రెండవ కారణం. బనియాబు నుంచే డబ్బు వచ్చే అవకాశంవుంది. గాంధీ బనియాకాబట్టి బనియాలే ఎక్కువగా కాంగ్రెస్‌కు ఆర్థిక సహాయం చేస్తున్నారు. రాజకీయాలలో డబ్బుపెట్టుబడి పెట్టడంవల్ల లాబడి ఎక్కువగా ఉంటుంది అన్న విషయాన్ని అతడు గుర్తించడం వల్లకూడా ఈ ఆర్థిక సహాయం చేస్తున్నాడు. దీన్ని గురించి ఎవరికైనా అనుమానముంటే జూన్, 6, 1942లో గాంధీ లూయీఫిషర్‌కి[1] చెప్పిన విషయం చదవడం మంచిది. లూయీ ఫిషర్ రిపోర్టుచేశారు:-

వై .జి .క్రిష్ణమూర్తి రాసిన లైఫ్ ఆఫ్ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ (పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ జీవిత చరిత్ర) పీఠికలో పట్టాభి సీతారామయ్య పండిట్ నెహ్రూ ఎప్పుడూ తను బ్రాహ్మణ్ణి అన్న భావంతో వుండేవారని చెప్పాడు. ఇది పండిట్ నెహ్రూ కులం మీద నమ్మకం లేని సామ్యవాది (సోషలిస్టు) అని అభిప్రాయ పడేవారికి గొడ్డలి పెట్టువంటిది. కాని పట్టాభి సీతారామయ్య తనుచెప్తున్నదేమిటో తెలుసుకొని వుండాల్సింది. బ్రాహ్మణ్ణున్నని పండిట్ నెహ్రూ ఒక్కడు మాత్రమే భావించ లేదు. వాని సోదరి విజయలక్ష్మి పండిట్ కూడా తను బ్రాహ్మణ్ణి అని గర్వంగా ఉండేదనిపిస్తుంది. ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్ 1940 డిసెంబర్‌లో డిల్లీలో పెట్టినప్పుడు జనాభా లెక్కలప్పుడు ఎవరి మతం గురించి వారు చెప్పవలసి వుందా అన్న ప్రశ్న చర్చకు వచ్చింది. మతిపండిటి ఈ అభిప్రాయాన్ని వ్యతిరేకించింది. తను బ్రాహ్మణ మతానికి చెందినందుకు గర్వపడకుండా ఉండటానికి జనాభా లెక్కలప్పుడు తను బ్రాహ్మణి అని చెప్పడానికి ఎందుకు గర్వపడ కూడదో తనకి కారణం కనిపించడం లేదని చెప్పారు. చూడు 'రస్త్ రహబార్' (బాంబే గుజరాతి వారపత్రిక) 14 జనవరి 1945 సీరియల్ నంబరు XII - బె.యి. సంజన రాసిన 'సెన్స్ అండ్ నాన్ సెన్స్ ఇన్ పాలిటిక్స్'.

కాంగ్రెస్ గురించి చాలా ప్రశ్నలు అడగాలని - నేను ఆయనకు చెప్పాను. కాంగ్రెస్ పెద్ద వ్యాపారస్తుల చేతుల్లో ఉందని, బొంబాయిలోని పరిశ్రమల యజమానులు గాంధీకి వత్తాసు ఉండి ఆయన ఎంత డబ్బు అడిగితే అంత యిస్తున్నారని ఉన్నత పదవులలో వున్న బ్రిటిష్ అధికారులు "నాతో అన్నట్టు జ్ఞాపకం" అని ఆయనకు చెప్పాను. 'నొక్కిచెప్పిన ఈ' విషయాలు ఎంతవరకు నిజం, నేను అడిగాను"

"దురదృష్టం కొద్దీ అవన్నీ నిజం, ఆయన సులభంగా చెప్పాడు, కాంగ్రెస్ పని చేయడానికి తగినంత డబ్బులేదు. మేము ప్రతి సభ్యుడి దగ్గర నుంచి ఏడాదికి నాలుగు అణాలు (దాదాపు ఎనిమిది సెంట్లు) వసూలు చేద్దామని మొదట్లో అనుకున్నాము. దానితో పని నడుపుదామనుకున్నాము. కాని అది పని చేయలేదు"

1. గాంధీతో ఒక వారం (ఎ వీక్ విత్ గాంధీ,1943) 41 పేజి

"కాంగ్రెస్ ఆర్థిక పద్దు (బడ్జెట్)లో ఎంతభాగం ధనవంతులైన భారతీయులవల్ల భర్తీ చేయబడింది ?" నేను అడిగాను.

"'వాస్తవానికి, అదంతా ఆయన చెప్పారు ఉదాహరణకు ఈ ఆశ్రమంలో తక్కువ డబ్బు ఖర్చు పెడుతూ ఇంత కన్న బీదగా(పొదుపుగా) మేము బ్రతకవచ్చు. కానీ మేము అలా చేయం. డబ్బు ధనవంతులైన స్నేహితుల దగ్గరనుంచి వస్తుంది".

దీని కారణంగా, పాలక వర్గం నుంచి బనియాను తప్పించడం బ్రాహ్మడికి అసాధ్యం. నిజానికి, బనియాతోటి పనిచేయటానికి ఈఏర్పాటే కాకుండా సద్భావపూర్వకమైన మైత్రీ బంధాన్ని కూడా ఏర్పాటు చేసుకున్నాడు. దీని పర్యవసానమే ఈనాటి పాలకవర్గం పూర్వపు బ్రాహ్మణ - క్షత్రియ సంఘటన బదులు బ్రాహ్మణ - బనియా కూటమి అయ్యింది.

పాలకవర్గం ఉండటంతోటే కథాంతం కాదు గమనార్హమయిన విషయమేమిటంటే పాలకవర్గం తాము పాలకవర్గానికి చెందుతామని ఆధిక్యపు ఎరుకలో తామొక్కరే పరిలించటానికి నోచుకున్నామని భావిస్తారు. చనిపోయిన తిలక్ తాను బ్రాహ్మడినని, పాలకవర్గానికి చెందుతానని ఎప్పుడు మరచి పోలేకపోయారు. అదేవిధంగా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, వారి సోదరి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అని తెలియవస్తుంది. వల్లభాయ్ పటేల్ తానుపాలక వర్గానికి చెందుతాననే భావనకు అతీతుడు కాదు. స్వరాజ్య ఉద్యమపిత అని తిలక్‌కి పేరు. పండిట్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్ కాంగ్రెస్ ఉన్నతాధికార సంస్థ (కాంగ్రెస్ హైకమాండ్)లో మార్గదర్శక నాయకులు. తాము పాలకవర్గానికి చెందుతామన్న ఉద్దేశమే కాక వీరిలో కొంతమంది సేవక వర్గాల వారిని ఏహ్యాభావంతో చూడవలసిన మనుషులుగా చూస్తూ వారెప్పుడూ సేవకులుగానే ఉండాలని, అధికారం ఆశించరాదని భావిస్తారు. నిజంగా, అటువంటి, తమ అభిప్రాయాలను బాహాటంగా చాటి చెప్పడానికి వారు ఎప్పుడూ అవమానకరంగా భావించలేదు. పశ్చాత్తాపమైనా పడలేదు. 1918లో బ్రాహ్మణేతరులు, వెనకబడిన తరగతులవారు, విధానసభలో ప్రత్యేక ప్రాతినిధ్యం కావాలని ఆందోళన ప్రారంభించి నప్పుడు, షోలాపూర్‌లో ఏర్పాటయిన ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ తెలికలవారు, పుగాకు దుకాణం దారులు, చాకలి మొదలైన వారు బ్రాహ్మణేతరులు, వెనకబడ్డ తరగతులు అంటే ఆయన వర్ణన విధానసభలకి ఎందుకు వెడతామంటారో తనకర్థం కావటం లేదన్నాడు. ఆయన ఉద్దేశంలో వారిది చట్టబద్ధంగా ఉండే వ్యాపకమేగాని చట్టాలు చెయ్యడానికి వారు అధికారం ఆశించకూడదు. యుద్ధ ప్రయత్నంలో భారతీయులందరి సానుభూతి, అండదండలు పొందడానికి కేంద్ర ప్రభుత్వం తీసుకోవలసిన చర్యల గురించి చర్చించడానికి 1942లో లార్డ్ లిన్‌లిత్‌గో వివిధవర్గాలకు ప్రాతినిధ్యం వహించే 52 మంది భారత ప్రముఖులను ఆహ్వానించారు. ఆహ్వానితులలో షెడ్యూల్డు కులాలకు చెందిన సభ్యులు కూడా ఉన్నారు. వైస్రాయి అటువంటి జనాన్ని మూకుమ్మడిగా ఆహ్వానించాడన్న ఆలోచనను వల్లభాయ్ పటేల్ భరించలేక పోయాడు. ఈ సమావేశం అయిన వెంటనే వల్లభాయ్ పటేల్ ఒక ప్రసంగం చేస్తూ ఇట్లా చెప్పాడు [1]:-

1. సెన్స్ అండ్ నాన్‌సెన్సు ఇన్ పాలిటిక్స్‌లో సంజన చెప్పాడు.

"వైస్రాయ్ హిందూ మహాసభ నాయకులను కోసం పంపించారు, ఆయన ముస్లిమ్ లీగ్ నాయకుల కోసం పంపించారు, ఘూంచీస్ (తెలికలవారు) మోచీలు (చెప్పులుకుట్టేవారు), కోసం ఆయన పంపించారు."

వల్లభాయ్ పటేల్ తన సూటీ పోటు మాటలతో ఘూంచీస్, మోచీలనే ఉదహరించినా అతని ప్రసంగం పాలక వర్గానికి కాంగ్రెస్ ఉన్నతాధికార సభకు(హైకమాండ్) దేశపు సేవక వర్గాలంటే ఉన్న సర్వసామాన్యమైన న్యూనతాభావాల్ని సూచిస్తుంది. పాలకవర్గం, కాంగ్రెస్ ఉన్నతాధికార సభల ఈ వైఖరిఎన్నికల ప్రచారంలో జరిగిన సంఘటనల ఇంకా చిత్రీకరించ వచ్చును. ఇవి సుసంగతంగాను, ఎంతో బహిరంగం చేసేవిగాను ఉన్నాయి కాబట్టి వాటి గురించి ప్రత్యేకంగా ఉదహరించడం అవసరం.

శ్రీ గాంధీ కాంగ్రెసున 1919లో లోబరుచుకొన్నప్పటి నుంచి విధానసభలలోబహిష్కరణ ఒక ఆయుధంగా ఉపయోగించి తద్వారా బ్రిటిష్ ప్రభుత్వాన్ని స్వరాజ్యం ఇవ్వడానికి ఒప్పించాలని కాంగ్రెసు చూస్తుండేది. ఈ విధానం ప్రకారం, ఎన్నికలలో పాల్గొన రాదని నిర్ణయించినప్పుడల్లా కాంగ్రెస్ తన టికెట్పైన అభ్యర్థులను నిలపడానికి నిరాకరించడమే గాక ఎన్నికలలో స్వతంత్ర అభ్యర్థిగా ఏ హిందువయినా నిలబడితే వానికి వ్యతిరేకంగా కాంగ్రెస్ ప్రచారం చేసేది. ఈ విధానం మంచి చెడ్డల గురించి ఎవరూ పోట్లాడనవసరం లేదు. కాని, హిందువులు స్వతంత్ర అభ్యర్థి టికెట్ మీద నిలబడకుండా ఆపడానికి కాంగ్రెస్ ఉపయోగించిన ప్రక్రియ ఏమిటి? విధాన పరిషత్తులను వెక్కిరింత వ్యవస్థలుగా మార్చే పద్ధతులు అవలంబించటం జరిగింది. దీని ప్రకారం విధాన పరిషత్తులకి ఎవరు వెడతారు? మంగళ్ళు, చెప్పులుకుట్టేవారు, వీధులు తుడిచేవాళ్ళు, అని రాసున్న అట్టలు పట్టుకొని కాంగ్రెస్ అనేక రాష్ట్రాల్లో వూరేగింపులు జరిపేది. ఈ వూరేగింపులలో నినాదంలో భాగంగా ఒకరు ప్రశ్న వేసేవారు. గుంపంతా కలసి పైనినాదంలో రెండవ భాగాన్ని జవాబుగా బదులు పలికేవారు. ఎప్పుడైనా ఈపద్ధతులు వ్యక్తులను ఎలక్షన్‌లలో నిలబడకుండా చేయటానికి సరిపోవనుకున్నప్పుడు కాంగ్రెస్ వారు ఇంకా కఠిన మైన పద్ధతులు అవలంభించడానికి నిశ్చయించేది. గౌరవనీయులైన వ్యక్తులు ఎవరూ కూడా మంగలివారు, చెప్పులుకుట్టేవారు, వీధులు తుడిచేవాళ్ళతో కలిసి విధానపరిషత్తులలో కూర్చోవాలని వారు విధి అనుకుంటే ఎన్నికలలో నించోడానికి వొప్పకోరు. అనే నమ్మకంతో, కాంగ్రెస్‌వారు ఈ ఏహ్యాభావంతో చూచే కులాలకు చెందిన అభ్యర్థుల నిలబెట్టి వారిని ఎన్నిక చేయించేవారు. కాంగ్రెస్ యొక్క ఈ జుగుప్సాకరమైన ప్రవర్తనను చిత్రించే కొన్నిటిని ఉదహరించవచ్చు. 1920 ఎన్నికలలో మధ్య రాష్ట్రాల సెంట్రల్ ప్రావిన్సెస్ విధాన పరిషత్తుకు కాంగ్రెస్ ఒక చెప్పులు కుట్టేవానిని[1] ఎన్నుకుంది. 1930 ఎన్నికలలో మధ్యరాష్ట్రాల సెంట్రల్ ప్రావిన్సెస్ విధానపరిషత్తుకు ఇద్దరుచెప్పులుకుట్టే[2]వారిని, ఒకపాలవాడిని[3], ఒకమంగలిని[4], పంజాబ్‌లో వీధులు తుడిచేవాడిని[5] వారు ఎన్నుకున్నారు. 1934లో కేంద్ర విధానపరిషత్తుకు ఒక కుమ్మరిని[6] ఎన్నుకున్నది. ఇదంతా పాత పురాణం అని చెప్పవచ్చు. 1943లో అంధేరి-బొంబాయి శివారు పురపాలక

1. ఫగువా రోహిదాస్
2. గురుగోసాయిన్ ఆగమ్‌దాస్, బలరాజ్ జైస్వర్
3. చున్ను
4. అర్జున్ లాల్
5. బన్సిలాల్ చౌధరి
6. భగత్‌చాంది మల్‌గోలా

సంఘం ఎన్నికలలో ఏం జరిగిందో చెప్పి అటువంటి అభిప్రాయాన్ని నన్ను సరిచేయనీయండి. పురపాలక సంఘాన్ని కించపరచేందుకు కాంగ్రెస్ ఒక మంగలిని నిలబెట్టింది.

ఎంత ఘోరం? ఐర్లాండులోని సిన్‌ఫైనలు బ్రిటిష్ విధానసభను పార్లమెంటును బహిష్కరించారు. కాని వారు తమ పనినెరవేర్చుకోడానికి తమ స్వదేశీయులనే అంతఘోరంగా ఉపయోగించుకున్నారా? విధానపరిషత్తును బహిష్కరించడానికి 1930లో జరిగిన ఆందోళన ముఖ్యంగా ఆసక్తి కరం. ఈ సంఘటనలు జరిగిన 1930లో రాష్ట్రీయ విధాన పరిషత్తు ఎన్నికలు 1930లో గాంధీయొక్క ఉప్పుసత్యాగ్రహ ఆందోళన ఏకకాలంలో జరిగాయి. నేను విశ్వసిస్తాను, 'కాంగ్రెస్ భవిష్యత్' అధికార చరిత్రకారుడు డా.పట్టాభి సీతారామయ్య ఈ విధంగా చెయ్యలేక పోయాడు. చరిత్ర కారుడు, గాంధీ ఎట్లా రాజప్రతినిధి (వైస్‌రాయ్) ఇర్విన్‌కి తాఖీదు (నోటీసు) ఇవ్వదలచి, ఫలానా తారీఖు లోపల తీర్చవలసిందిగా ఒక కోర్కెల పత్రాన్ని సమర్పిస్తూ, రాజప్రతినిధి ఇందులో వైఫల్యమైనప్పుడు గాంధీ ఎట్లా శాలనోల్లంఘన ఉద్యమం ప్రారంభించడానికి నిర్ణయించాడో, గాంధీతన తాఖీదు పట్టుకెళ్లడానికి ఎట్లా ఒక అంగ్లేయుణ్ణి ఎన్నుకున్నాడో, తనదాడికి, లక్ష్యసిద్ధికి ఎట్లా ఉప్పుశాసనాన్ని ఎంచుకున్నాడో, తన యుద్ధభూమిగా దండిని ఎలా నిర్ణయించుకున్నాడో, తనను తానే ఉద్యమాగ్రంలో నిలవడానికి ఏ విధంగా నిర్ణయించుకున్నాడో, అతడు ఎట్లా తను అహ్మదాబాదు ఆశ్రమమంనుంచి వైభవోపేతంగా, సంప్రదాయ బద్ధంగా యాత్రకు బయలు దేరాడో అహ్మదాబాద్‌లోని స్త్రీలు బయటకు వచ్చి ఏ విధంగా హారతులిచ్చి, తిలకందిద్దుతూ విజయాన్ని కాంక్షించారో, గుజరాత్ ఒక్కటీభారత్‌కు స్వరాజ్యంను తెస్తుందని ఎట్లా హామీ ఇచ్చారో స్వరాజ్యం సముపార్జించే వరకూ అహ్మదాబాద్‌కు తిరిగి రానని ఎట్లా చాటి చెప్పాడో అవన్నీ చరిత్ర గ్రస్తం చేస్తూ, ఒక పక్క కాంగ్రెస్ వారితో జనసామాన్యం పేరునవారి కోసం స్వరాజ్యం సాధించడానికి పోరాడుతున్నామని చెపుతూ మరొక పక్క అదేసంవత్సరం, అదేజన సామాన్యాన్ని, త్యజించి, తప్పించుకోవలసిన దయనీయమైన వస్తువులుగా బహిరంగంగా ప్రదర్శిస్తూ ఘోర అత్యాచారం చేస్తున్న విషయం కూడా గ్రంథస్తం చేయడంలో విఫలం కాకూడదు.

ఇండియాలో సేవక వర్గాల గురించి పాలకవర్గాల మనస్తత్వం అటువంటిది.

## IV

ఇటువంటి పాలకవర్గం కింద సేవకవర్గాల గతి ఏమౌతుంది. స్వరాజ్యం వచ్చినప్పుడు సేవక వర్గాల వారికి అరచేతిలో వైకుంఠం చూపిస్తానని కాంగ్రెస్ వాగ్దానం చేస్తోంది. కాంగ్రెస్ జనసామాన్యం గురించి మాట్లాడుతుంది. పాలకవర్గాలు సేవకవర్గాలను దాస్య శృంఖలాలో బంధించినట్లు వారి గురించి నిజం చెప్పవలసింది. విప్లవాత్మకమైన మార్పులు తీసుకు రావాలను కుంటోందని అది చెప్తోంది. కాని దానికి కావలసిన అధికారం లేదు. అందుకోసం స్వరాజ్యం వచ్చేవరకు ఆగాలని చెప్తుంది. ఇలాంటి అదుపు అపులేని ప్రసంగాలే బేలైన విదేశీయుణ్ణి మోసం చేస్తున్నాయి. ఈ ప్రకటన వెనక ఉన్న డాబు, దర్పం వదిలేసి, ఇండియా కనక సర్వస్వతంత్ర ప్రజాస్వామ్యం అయితే నిజంగా ఏమౌతుందని ఎవరయినా అడగవచ్చు? ఒక విషయం మాత్రం నిజం. స్వరాజ్యమనే మంత్రదండంలో పాలకవర్గం మాయం కాదు.

అది యధాతథంగా ఉంటుంది బ్రిటిష్ సార్వభౌమాధికారపు మడత నుంచి బయటపడి అది శక్తిసామర్థ్యాలను మరింత పెంచుకుంటుంది. ప్రతిదేశపు పాలక వర్గం వలెనే అధికారం చేజిక్కించుకుంటుంది. క్లుప్తంగా చెప్పాలంటే స్వరాజ్యం ప్రజల చేత ప్రభుత్వం కాదుకాని అది పాలకవర్గం చేత నడపబడే ప్రభుత్వమౌతుంది. ప్రజాప్రభుత్వం కానప్పుడు పాలకవర్గం ఎలా మలుచుకోదలుచు కుంటే అలావుంటుంది ప్రజలకోసం ప్రభుత్వం.

స్వతంత్రసార్వభౌమ దేశంగా ఇండియా అవతరించినప్పుడు పాలకవర్గం ఏంచేస్తుంది? వాళ్ళు కౌలుదారీ చట్టాన్ని సంస్కరించడానికి పూనుకుంటారని, పరిశ్రమల చట్టాన్ని విస్తరిస్తారని, ప్రాథమిక విద్యను పెంపొందిస్తారని, మద్యనిషేధం ప్రవేశపెడతారని, చరఖా ఆడించడం ప్రజలకు నేర్పుతారని, రోడ్లు, కాలువలు వేస్తారని, రూపాయి విలువ పెంచుతారని, తూనికలు, కొలతలు నియమబద్ధంచేస్తారని, ఆసుపత్రులు తెరుస్తారని, సేవకవర్గాల పరిస్థితులు మెరుగు పరచడానికి అనేక చర్యలు తీసుకుంటారని కొందరు ఆశించవచ్చు. అటువంటి పథకం గురించి సేవకవర్గాల నుంచి ఎవరూ కూడా తక్కువగా ఉత్సాహపడనవసరం లేదు. ప్రథమంగా అంత గొప్పతనం ఏమీలేదు. ప్రస్తుత ప్రపంచంలో సమాజాన్ని నాగరికంగా ఉంచడానికి కావలసిన సంస్కరణను ఏపాలకవర్గం ఉపేక్షించదు. పాలకవర్గం ఇండియాలో ముందుకువచ్చి అంతంత మాత్రమయిన సాంఘిక ఉజ్జీవన కార్యక్రమాలయినా చేపడతారని నామట్టుకు నేను అనుకోను. కాంగ్రెస్ బ్రిటిష్ ప్రభుత్వ వ్యవస్థకన్న మేలైనదని చూపించే ఉద్దేశమే కాంగ్రెస్ అటువంటి కార్యక్రమం చేపట్టడానికి ఉద్యుక్తం చేసిందని చాలా మంది మరచిపోవచ్చు. కాని ప్రభుత్వ వ్యవస్థని రూపులేకుండా చేసినప్పుడు సామాన్యప్రజల జీవనసరళిని మెరుగు పరచటానికి అదే ప్రేరణ ఉంటుందా? ఈ విషయం మీద నేను చాలా అనుమాన పడుతుంటాను. అదే కాకుండా సాంఘిక ఉద్దీపనే స్వరాజ్యం సర్వస్వమా? సేవావర్గాల తరఫున మాట్లాడుతూ, సర్వస్వతంత్ర సార్వభౌమ భారతదేశంలో జీవిత జిజ్ఞాసగా, సాంఘిక కట్టుబాటుగా బ్రాహ్మణత్వం సర్వనాశనం కావాలని వారు కోరుకుంటారని నాకే అనుమానం లేదు. ఇంకా నేనుచెప్పాలంటే సేవకవర్గాలు సాంఘిక ఉద్దీపన లెక్క చేయరు. క్రూరమైన సామాజిక వ్యవస్థవల్ల భరిస్తున్న అవమానం అమర్యాదలతో పోల్చిచూస్తే లేమి, బీదరికం వీరికి ఏమంత కష్టమయినవి కావు. వీరడిగే దేమిటంటే పరువు ప్రతిష్ట కాని రొట్టెకాదు. కాబట్టి ఇక్కడి ప్రశ్న ఏమిటంటే పాలకవర్గాలు దేశం యంత్రాంగాన్ని స్వాధీన పరుచుకున్న తరవాత సమాజ ఉద్దీపన కార్యక్రమం నుంచి వేరైన సాంఘిక సంస్కరణల కార్యక్రమం చేపడతారా?

ఇండియాకు స్వేచ్ఛ, సార్వభౌమత్వం వచ్చి వుంటే కాంగ్రెస్ అద్భుతాలు చేయకలిగి వుండేదనే కాంగ్రెస్‌వారి ప్రకటన ఉత్త ప్రచారం కాకుండా నిజంగా దాని అభిలాష అని అనుకొన్నా, ఎవరైనా తను అనుకున్నది చేయడానికి అధికారం కన్నవేరే ఏమీ అవసరం లేదన్న ఊహ మీద సాగుతుంది. కాంగ్రెస్ వారి ప్రకటన ఇటువంటి నమ్మకం జాలి కలిగించేదే కాకుండా నిజానికి అది చాలా ప్రమాదకరమైన భ్రమ. ఇటువంటి భ్రమలో ఉండేవారు, ఎంత సంపూర్ణ సార్వభౌమత్వానికైనా కొన్ని ముఖ్యమైన హద్దులున్నాయన్నది మరచి పోతుంటారు. మనసుకు హత్తుకుపోయే భాషలో డైసీకన్నా ఎవరూ కూడా ఈ పరిమితులను వివరించలేదు. ఆయనదైన "లా ఆఫ్ ది కాన్స్టిట్యూషన్" లో ఇలా చెపుతారు:-

"ఏ సార్వభౌముడైనా, అందునా ప్రత్యేక పార్లమెంటు, వాస్తవంగా అధికారం చెలాయించడం రెండు హద్దుల వల్ల అదుపు అపుల్లో ఉంటుంది. వీటిల్లో ఒకటి బాహ్యామైన హద్దు. ఇంకొకటి అంతర్గతమైనది.

తన ప్రజలు లేక వారిలో ఎక్కువమంది అవిధేయత చూపిస్తారు లేక తన శాసనాలకు ఎదురు తిరగడానికి ఆస్కారం వున్నా, నిశ్చయంగా ఎదురు తిరిగినా, సార్వభౌమ అధికారానికి పరిమితి ఏర్పడుతుంది.

"ఎంత నిరంకుశ రాచరికాలకైనా ఇటు వంటి పరిమితి వుంటుంది. న్యాయ పదార్ధప్రకారం రోమను రాజులేక, 18 వ శతాబ్దపు మధ్య కాలంలో ఫ్రాన్సు రాజు (నేటి రష్యా దేశపు జార్ లాగ) సార్వభౌముడు అన్న దానికి ఖచ్చితమైన ఉదాహరణ. వానికి సంపూర్ణ శాసనాధికారం వుంది. అతని శాసనం శిరోధార్యం. ఆశాసనాన్ని ఉపసంహారించే మరో శక్తి ఆరాజ్యంలో లేదు. కాని తిరుగులేని సార్వభౌముడు, ఎవరయినా వుంటే, తన ఇష్టం వచ్చినట్లు ఏశాసనాన్ని బడితే ఆశాసనాన్ని చేయగలడు లేక మార్చగలడు అనుకోవడం తప్పు అవుతుంది.

"నియంత అధికారం, చెప్పాలంటే, తన ప్రజలు కాని వారిలో ఒక భాగం కాని తన ఆజ్ఞలను పాటించడానికి ఎంత వరుకు సంసిద్ధులై ఉన్నారన్న దానిమీద ఆధారపడి ఉంటుంది ఈ అజ్ఞానువర్తిత్వం ఎప్పుడూ కూడా నిజానికి మితంగా ఉండాలి. చాలా ప్రఖ్యాతమైన చరిత్ర సత్యాల ద్వారా ఈ విషయం చూపించడం జరిగింది. తొలి సీజర్లు ఎవ్వరూ కూడా రోమను ప్రపంచపు ప్రార్ధనామూల వ్యవస్థలను తమ యిష్టం వచ్చినట్లు మట్టుబెట్టలేదు. మహమ్మదీయ మతాన్ని సుల్తాను తుడిచి వేయ లేక పోయాడు. పద్నాలుగవ లూయీ తన అధికారోన్నతి తోనే నాంస్టెస్ శాసనాన్ని (ఈడిక్ట్ ఆఫ్ నాన్టేస్)తిరగ తోడ తలచాడు. కాని రెండవ జేమ్సుని రోమన్ కేథలిక్ వ్యవస్థ ఔన్నత్యాన్ని వ్యాపించ కుండా చేసిన కారణాల లాంటి కారణాల వల్లనే ప్రొటెస్టంటు మతానికి పట్టం కట్టడానికి అతను అసాధ్యంగా గుర్తించేవాడు. నియంత శక్తి విషయంలో లేక రాజ్యాంగ పరిషత్తు అధికారం విషయంలో ఏది సత్యమో అది పార్లమెంటు సార్వభౌమాధికారం విషయంలో ప్రత్యేకంగా నిజం. స్కాట్లెండులో ఎపిస్కోపల్ చర్చిని చట్టబద్ధంగా పార్లమెంటు స్థాపించవచ్చు. ఏ చట్టోల్లంఘనం లేకుడా సింహాసన వారసత్వాన్ని మార్చవచ్చును లేకపోతే రాచరికాన్నే రద్దు చెయ్యవచ్చు, కాని ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో బ్రిటిష్ పార్లమెంటు ఇట్లాంటివేమీ చెయ్యదని అందరికీ తెలుసు. చట్టబద్ధమైన ప్రతి విషయంలోను ఈశాసనం వల్ల విస్తృతమైన ప్రతిఘటన వస్తుంది. ఇది నిజానికి పార్లమెంటరీ వ్యవస్థ శక్తికి మించినది.

* * *

"సార్వభౌమత్వం చలాయించటానికి అంతర్ పరిమితి సార్వభౌమ శక్తి యొక్క స్వభావస్వరూపాలనుంచి పుట్టుకొస్తుంది. నియంత కూడా తన స్వభావాన్ని అధికారాన్ని చెలాయిస్తాడు. అతను మసలుతున్న పరిస్థితులను బట్టి అతని నడవడిక మలచబడుతుంది. ఈ పరిస్థితుల క్రింద ఆ కాలపు నీతి నియమాలు, అతన్ని పరిసర సమాజం కూడా కలిసి ఉంచాయి. సుల్తానుకు చేతకాకనే లేకపోతే ముస్లిం ప్రపంచం మతం మార్చి ఉండేవాడు. అతను అల్లా చేయగలిగి ఉండినట్లయితే మహమ్మదీయుల రాజు మహ్మద్ మతం

మట్టుబెట్టకోరుకోడం చాలా అసంమంజసంగా ఉండేది, సుల్తాను అధికారం మీది అవరోధం బాహ్య పరిమితి అంత దృఢమైనది. పోపు ఈ సంస్కరణ ఎందు చెయ్యలేదని, ప్రజలు అప్పుడప్పుడు చచ్చు ప్రశ్నలు వేస్తుంటారు. విప్లవవాది పోప్ అయ్యేటటువంటి మనిషి కాదని పోప్ అయిన మనిషి విప్లవాదికావాలనే కోర్కె లేదనేదే దీనికి సరైన జవాబు.

డైసీ చెప్పిన నిజాన్ని ఎవ్వరూ కాదని చెప్ప లేరు. డైసీ చెప్పినట్లు సార్వభౌమత్వపు లోపలి, బయటి పరిమితులలా పాలక వర్గం ఏమి చేసేది సార్వభౌమత్వపు స్థాయిమీద అంతగా ఆధారపడక పోవచ్చు. ఈ రెండిట్లోను, బాహ్య పరిమితుల వల్ల మంచి చెయ్య లేక పోతే పాలక వర్గాల వారిని ఎవ్వరూ తప్పు పట్టనవసరం లేదు. బయిటి అవరోధాలు పురోగతికి అడ్డుకట్ట వేస్తాయన్న భయం అనవసరమైన అనుమానాలను కలిగించక్కర లేదు. ఎందుకంటే, బయటి అవరోధాల కన్నా పాలకవర్గం లోపలి నిరోధాలే ఎక్కువ నిర్ణయించే శక్తి కలిగి ఉంటాయి. బయటి అవరోధాలకన్నా పాలకవర్గ లోపలి అడ్డంకుల పైనే అభివృద్ధి ఎక్కవగా ఆధారపడి వుంటుంది. లోపలి అడ్డంకులను నిర్ణయించే కారణాలు ఏమిటి? స్థూల దృష్టి, సంప్రదాయాలు, స్వలాభపరులు, పాలక వర్గాల సమాజ జిజ్ఞాసలనుంచి అంతరత అవరోధాలు పుట్టుకు వస్తాయి. కాంగ్రెస్ సేవా వర్గాల వారికి చెయ్యబోయేదాన్ని నమ్మే ముందర పాలకవర్గం స్థూల దృష్టి యేమిటి? దాని సంప్రదాయాలు ఏమిటి? సమాజ జిజ్ఞాస ఏమిటి? అనడగడం అతడు ఒక అంశంగా చేసుకో వాలని విదేశీయుణ్ని హెచ్చరించడమే ఈ చర్చ యొక్క ముఖ్యోద్దేశం.

బ్రాహ్మలను ముందర తీసుకుందాం. హిందూ జనాభాలో అంతా కలిసి ఎనభై శాతం వరకు ఉన్న సేవావర్గాలవారికి (శూద్రులు, అంటరాని వారు) వీరు చారిత్రకంగా ద్వేషా పూరితులైన శత్రువులు. ఇండియాలోని సేవావర్గాలకు చెందిన సామాన్యుడు ఈ రోజు యింత పడిపోయి, యింత దిగజారి పోయి, ఏవిధమైన ఆశ, పైకి రావాలనే తపన లేకుండా పోయాడంటే అది పూర్తిగా బ్రాహ్మలు వారి జిజ్ఞాసవల్లనే. ఈ బ్రాహ్మణత్వ మూలసూత్రాలు అయిదు. 1. వివిధ వర్గాల మధ్య అంతస్తు వారీ అసమానత; (2) శూద్రులను, అంటరానివారిని పూర్తిగా నిరాయుధుల్ని చేయటం; (3) శూద్రులు, అంటారానివారి చదువుసంధ్యల మీద పూర్తి నిషేధం; (4) అధికారం, పలుకుబడి ఉన్న పదవులను శూద్రులు, అంటరానివారు అధిష్టించడం నిషేధం; (5) శూద్రులు, అంటరానివారు ఆస్థిపాస్తులు సంపాయించడం మీద ఆన (6) ఆడవారిని పూర్తిగా నొక్కిపెట్టి అణచి వేయడం. అసమానత బ్రాహ్మణత్వానికి అధికార సిద్ధాంతం, సమానత్వం ఆశించే క్రింది వర్గాలను అణగ తొక్కడం వారిచేత గొప్పగా భావించబడే, జాలనేది లేకుండా పవిత్ర కర్తవ్యంగా సాగించబడేది. కొన్ని దేశాలున్నాయి. వాటిలో చదువు కొద్దిమందికి తప్పించి వ్యాపించలేదు. కాని ఇండియాలో మాత్రం మేధావి వర్గమైన బ్రాహ్మణులు విద్యను తమ గుత్త సొత్తుగా అనుకోకుండా క్రింది తరగతుల వారు చదువు నేర్చుకోడం నేరంగా ప్రకటించారు. ఈ నేరానికి నాలుక కోసేయడం , నేరస్తుని చెవులలో కరగించిన సీసం పోయడం వంటి శిక్ష వేయవచ్చు. ఇండియాలో బ్రిటిష్ వాసులు ప్రజలను మూకుమ్మడిగా నిరాయుధులను, నిర్వీర్యులను చేసి పరిపాలిస్తున్నారని కాంగ్రెస్ రాజకీయవాదులు మొత్తుకుంటారు. కాని శూద్రుల్ని, అంటరానివారిని నిస్సహాయుల్ని, నిరాయుధుల్ని నిర్వీర్యుల్ని చేయాలనే న్యాయ సూత్రాన్ని బ్రాహ్మలు ప్రకటించారని వారు మర్చిపోతారు. శూద్రులను, అంటరానివారిని నిరాయుధులుగా ఉంచాలని వారెంత

నమ్ముతారంటే, తమ సదుపాయాల్ని రక్షించుకోవటానికి తప్ప తాము మాత్రం ఆయుధాల్ని ధరించవచ్చు అని న్యాయ సూత్రాన్ని మాత్రం వర్తించేలా సవరించి, శూద్రులు, అంటరానివారికి దాని తీవ్రతలో సడలింపు లేకుండా నిషేధాన్ని యథాతథంగా ఉంచారు. ఇండియా లోని అనేక మంది ప్రజలు చావచచ్చి నిర్వీర్యులై మగతనం లేకుండా కనిపిస్తున్నారంటే, అది వారిని అనేకయుగాలుగా మూకుమ్మడి నిరాయుధీకరణకు గురిచేసిన బ్రాహ్మణ ప్రజ్ఞతవల్లే. బ్రాహ్మడు అండదండలు ఇవ్వని ఏ సమాజపు చెడు, సాంఘిక నేరము ఈనాడు లేవు. మనిషికి మనిషి చూపించే అమానుషత్వం, కులతత్వం, అంటరానితనం,దగ్గరకు రానీయక పోవడం చూడనీయక పోవడం వంటివి కాని మతం కాని అమానుషచర్యలు మాత్రమే దాని మతం అనుకోటం తప్పదు. ఎందుకంటే ఆడవాళ్ళు గురైన ఘోరఘాతుకాలు ప్రపంచం ఏ భాగంలో కూడా ఆడవాళ్ళు గురి కాని ఘోరకృత్యాలకు బ్రాహ్మడు వత్తాసు యిచ్చాడు. విధవలు సతులుగా బతికుండగానే కాల్చివేయబడ్డారు. విధవ బ్రతికుండగానే కాల్చివేసే సతికి బ్రాహ్మలు పూర్తి మద్దతు యిచ్చారు. మళ్ళీ పెళ్ళిచేసుకోడానికి విధవలకి వీలులేదు. బ్రాహ్మడు ఈ సిద్ధాంతాన్ని సమర్థించాడు. ఆడపిల్లలకు ఎనిమిదో ఏడు రాకుండానే పెళ్ళి చేయవలసి ఉండేది. ఆమె పెద్దమనిషి అయినా కాకపోయినా మగడు ఆమెననుభవించడానికి హక్కు కలిగి ఉండేవాడు. ఈ సిద్ధాంతానికి బ్రాహ్మడు గట్టి మద్దత్తును ఇచ్చేవాడు. శూద్రులకు అంటరానివారికి, ఆడవారికి ధర్మశాస్త్ర కర్తలుగా బ్రాహ్మణుల చరిత్ర, ప్రపంచంలోని ప్రాంతముల మేధావివర్గాల చరిత్రలన్నిటినికన్న నల్లనైనది. ఎందుకంటే, తనదేశపు విద్యాహీనులను నిరంతర అజ్ఞానం బీదరికంలో ఉంచే, జిజ్ఞాసను సృష్టించడానికి ఇండియాలో బ్రాహ్మలు తమ మేధస్సును వ్యభిచరించినంతగా మరే ఇతర మేధావివర్గము చేయలేదు. తమ పూర్వులు ప్రతిపాదించిన ఈ బ్రాహ్మణ జిజ్ఞాసను ప్రతి బ్రాహ్మడు ఈనాడు నమ్ముతాడు. హిందూ సమాజములో అతడు పరాయివాడు. నీగ్రోలకు తెల్లవాడు లేదా యూదీమతేరానికి (జెంటిల్) యూదులు, ఫ్రెంచివారికి జర్మను ఎంత పరాయివారో బ్రాహ్మడు శూద్రులకి, అంటారానివారికి అంత పరాయివాడు. అతనికీ క్రింది తరగతుల శూద్రులు, అంటరానివారి మధ్య నిజమైన అగాధమున్నది. వారికి పరాయివాడే కాకుండా, విరోధి వారికి సంబంధించి నంతవరకు పాపభీతికి తావేలేదు. న్యాయానికి విలువేలేదు.

బనియాలు ఘోరమైన దోపిడి వర్గం అన్నది చారిత్రక సత్యం. అతనిలోని ధనదాహం సంస్కృతివల్ల కాని పాప భయంచేతకాని క్షాళితం కాదు. అంటువ్యాధులు ప్రబలినప్పుడు లాభంపొందే కాటికాపరి లాంటి వాడు. కాటికాపరికి బనియాకి మధ్యన ఒకే ఒక తేడా వుంది. బనియాలాగ కాటికాపరి అంటువ్యాధులు సృష్టించడు. అతడు తన డబ్బును ఉత్పత్తికి ఉపయోగించడు. ఉత్పత్తికి పనికిరాని పనులకు అప్పిచ్చి పేదరికం బాగా పెరగడానికి దానిని ఉపయోగించడు. మను ధర్మం చెప్పినట్లు వడ్డీ వ్యాపారం అతని వృత్తి. అది న్యాయమైనది ధర్మబద్ధ మైనదిగా అతను అనుకుంటాడు. వ్యాజ్యాలను తన కనుకూలంగా తీర్పు చెప్పేందుకు తయారుగావున్న బ్రాహ్మణ న్యాయాధిపతి సహకారాలతో తన వ్యాపారం సాగిస్తున్నాడు. వడ్డీ, వడ్డీ పైన వడ్డీ, చక్రవడ్డీ లెక్కలతో ఎన్నో కుటుంబాలను తన వలలో వేసుకుంటాడు. అప్పుతీర్చే కొద్దీ ఋణగ్రస్తుడు అప్పులో కూరుకు పోతాడు. మనసే లేనప్పుడు మోసం అంతకన్నా లేదు. అటువంటి వాడు ఎంతటి దగా కైనా వెనుదీయడు. దేశం అతని ఉక్కు పిడికిలిలో, బిగిసింది. బీద, బిక్కి నిరక్షరకుక్షి, దేశం మొత్తం బనియాకి తాకట్టైపోయింది.

క్లుప్తంగా బ్రాహ్మడు మనసుని బనియా శరీరాన్ని బందీ చేస్తారు. పాలకవర్గపు తోడు దొంగలు లిద్దరూ దోచుకున్నది పంచుకుంటారు. భారతదేశపు పాలకవర్గం దూరదృష్టి, సంప్రదాయం, సాంఘిక జిజ్ఞాస తెలుసున్న ఎవరైనా ఇప్పుడున్న ఇండియా కన్న కాంగ్రెస్ పాలనలో సర్వస్వతంత్ర భారతదేశం వేరుగా ఉంటుందని నమ్మగలరా?

## V

సేవావర్గాల పక్షపాతి, రక్షకులు అని చెప్పుకునే కాంగ్రెస్ చెప్పింది నిజంగానే నమ్మితే పాలకవర్గపు శక్తిని చిత్తు చేయడానికి కాంగ్రెస్ ఏమి చేసింది, చూపించాల్సినదిగా అడగవలసి వుంటుంది. 1937 ఎన్నికలలో కాంగ్రెస్ అఖండవిజయం సాధించిందని ఇంటికప్పుల మీదకెక్కి మరీ చాటారు. ఈ అతిశయోక్తిని విస్మరించి న్యాయంగా ఒక ప్రశ్న అడగవచ్చు. నిజమే కాంగ్రెసే విజయం సాధించిది. కాని భారతీయులలో ఏవర్గంలో ఈ విజయచిహ్నాన్ని మోసింది? దురదృష్టం కొద్దీ ఇండియాలో ఏన్యాయ శాస్త్రవేత్త డాడీ రాసిన పార్లమెంటరీ మాన్యూవల్‌కు ప్రతిగా ఇంకా రాయలేదు. అంచేత కాంగ్రెస్ టికెట్ మీద ప్రతినిధి మండలికి నెగ్గిన అభ్యర్థుల కులం, వృత్తి, చదువు, సంస్కారం మొదలైన తబ్సీళ్ళు సరిగ్గా తెలుసుకోటం కష్టం. విషయ ప్రాముఖ్యతను బట్టి రాష్ట్రీయ విధాన పరిషత్తుకు 1937లో కాంగ్రెస్ టికెట్ పైన ఎన్నికైన వారి పైచెప్పిన తబ్సీళ్లు సంగ్రహించడానికి ప్రయత్నిద్దామని నేనాలోచించాను. ప్రతి మెంబరు గురించిన సరైన వివరాలు సేకరించడంలో నేనంత కృతకృత్యుణ్ణి కాలేకపోయాను. ఏ వర్గానికి చెందని వారుగా చాలా మందిని వదిలి వేయవలసి వచ్చింది.

పట్టిక 18

**కులాల వారీగా రాష్ట్రాల విధాన పరిషత్తులకు**

**ఎన్నికైన కాంగ్రెస్ సభ్యులు**

| రాష్ట్రము | బ్రాహ్మలు | బ్రాహ్మణేతరులు | అనుసూచిత కులాలు | ఎటూచెప్పనివి | మొత్తం |
|---|---|---|---|---|---|
| అస్సాం | 6 | 21 | 1 | 5 | 33 |
| బెంగాల్ | 15 | 27 | 6 | 6 | 54 |
| బీహారు | 31 | 39 | 16 | 12 | 78 |
| సి.పి | 28 | 35 | 7 | 0 | 70 |
| మద్రాసు | 38 | 90 | 26 | 5 | 159 |
| ఒరిస్సా | 11 | 20 | 5 | 0 | 36 |
| యునైటెడ్ ప్రోవిన్సెస్ | 39 | 54 | 16 | 24 | 133 |

## పట్టి 19

### వృత్తుల బట్టి రాష్ట్రాల విధాన పరిషత్తులలోని కాంగ్రెస్ సభ్యుల వర్గీకరణ

| రాష్ట్రాలు | ప్లీడర్లు | వైద్యులు | భూస్వాములు | వ్యాపారస్థులు | ప్రభుత్వేతర అధికారులు | వడ్డీ వ్యాపారస్థులు | నిల్ | ఎటూ చెప్పని వారు | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అస్సాం | 16 | 2 | 2 | 1 | లేరు | లేరు | 3 | 9 | 33 |
| బెంగాల్ | 9 | 2 | 16 | 5 | 2 | లేరు | 16 | 4 | 54 |
| బీహార్ | 14 | 4 | 56 | 6 | 3 | లేరు | 1 | 14 | 98 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 20 | 2 | 25 | 10 | లేరు | లేరు | 8 | 5 | 70 |
| మద్రాసు | 52 | 2 | 45 | 18 | 2 | 1 | 3 | 36 | 15 |
| ఒరిస్సా | 8 | 1 | 17 | 4 | 4 | 1 | 1 | | 36 |

# పట్టీ 20

## కాంగ్రెస్ రాష్ట్రాలలో మంత్రివర్గాల కూర్పు

| రాష్ట్రాలు | మొత్తం కేబినేట్ మంత్రుల సంఖ్య | మొత్తం హిందేతరులసంఖ్య | మంత్రి వర్గంలో హిందూ మంత్రులు | | | | ప్రధాన మంత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| | | | మొత్తం | బ్రాహ్మలు | బ్రాహ్మణేతరులు | అనుసంచిత కులాల వారు | |
| అస్సామ్ | 8 | 3 | 5 | ? | ? | నిల్ | నిల్ |
| బీహార్ | 4 | 1 | 3 | ? | ? | 1 | 1 |
| బొంబాయి | 7 | 2 | 5 | 3 | 2 | నిల్ | నిల్ |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 5 | 1 | 4 | 3 | 1 | నిల్ | నిల్ |
| మద్రాసు | 9 | 2 | 7 | 3 | 3 | 1 | 1 |
| ఒరిస్సా | 3 | నిల్ | 3 | ? | ? | ? | ? |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 6 | 2 | 4 | 4 | నిల్ | నిల్ | నిల్ |

ఈ పట్టీ మే 1939 లో ఉన్న దాన్ని చూపిస్తుంది. 'ఇండియన్ ఇన్ఫర్మేషన్ జూలై 15, 1939 లో రాసిన ప్రకారం ప్రశ్నార్థకము బ్రాహ్మణ బ్రాహ్మణేతరుడా అన్నది తెలియనట్లు సూచిస్తుంది.

**పట్టి 21**

**కాంగ్రెస్ రాష్ట్రాలలో పార్లమెంటరీ కార్యదర్శులవర్గీకరణ**

| రాష్ట్రము | మొత్తం పార్లమెంటరీ కార్యదర్శుల సంఖ్య | మొత్తం హిందేతర పార్లమెంటరీ కార్యదర్శులు | హిందూ పార్లమెంటరీ కార్యదర్శులు | | | |
|---|---|---|---|---|---|---|
| | | | మొత్తం | బ్రాహ్మలు | బ్రాహ్మణేతరులు | అనుసూచిత కులములు |
| అస్సాం | నిల్ | నిల్ | నిల్ | నిల్ | నిల్ | నిల్ |
| బీహార్ | 8 | నిల్ | 8 | 2 | 5 | 1 |
| బొంబాయి | 6 | నిల్ | 6 | 1 | 5 | నిల్ |
| సెంట్రల్ ప్రోవిసెస్ | నిల్ | నిల్ | నిల్ | నిల్ | నిల్ | నిల్ |
| మద్రాసు | 8 | 1 | 7 | 3 | 4 | 1 |
| ఒరిస్సా | 3 | నిల్ | 3 | | | నిల్ |
| యునైటెడ్ ప్రోవిసెస్ | 12 | 1 | 1 | 2 | 8 | 1 |

'ఇండియన్ ఇన్ఫర్మేషన్ జులై 15 1939 నుండి ఉటంకించబడింది.

ప్రశ్నార్థకము బ్రాహ్మడు బ్రాహ్మణేతరుడు అన్నది తెలియదని సూచిస్తుంది.

విద్యా ప్రమాణాల ప్రకారం బ్రాహ్మణ బ్రాహ్మణేతర కాంగ్రెస్ వారి వర్గీకరణ

| రాష్ట్రాల విధాన పరిషత్తులు | కులం | మొత్తం | పట్టభద్రులు | పట్టభద్రులు కాని వారు | మెట్రిక్యులేషన్ | నిరక్షరాస్యులు | ఏమీ తెలీదు |
|---|---|---|---|---|---|---|---|
| అస్సాం | బ్రాహ్మణ | 6 | 1 | నిల్ | నిల్ | నిల్ | నిల్ |
| | బ్రాహ్మణేతర | 15 | 2 | నిల్ | నిల్ | 1 | 9 |
| ంగాలు | బ్రాహ్మణ | 15 | 14 | 1 | నిల్ | నిల్ | నిల్ |
| | బ్రాహ్మణేతర | 27 | 21 | 4 | నిల్ | 1 | 7 |
| | అనుసూచిత కులములు | 6 | 3 | నిల్ | 1 | 2 | నిల్ |
| | బ్రాహ్మణ | 31 | 11 | 5 | 8 | 4 | 3 |
| హారు | బ్రాహ్మణేతర | 39 | 23 | 4 | 3 | 8 | 13 |
| | అనుసూచిత కులములు | నిల్ | 1 | 1 | 4 | 10 | నిల్ |
| ంట్రల్ ప్రోవిన్సెస్ | బ్రాహ్మణ | 39 | 15 | నిల్ | 2 | 9 | 1 |
| | బ్రాహ్మణేతర | 54 | 15 | నిల్ | 2 | 17 | నిల్ |
| | అనుసూచిత కులముల | నిల్ | 1 | నిల్ | - | 6 | 13 |
| ద్రాసు | బ్రాహ్మణ | 38 | 16 | 2 | 3 | 4 | 61 |
| | బ్రాహ్మణేతర | 90 | 31 | 3 | 1 | 7 | - |
| రిస్సా | అనుసూచిత కులములు | 26 | 1 | 1 | 1 | 14 | - |
| | వెనకబడిన వర్గము | నిల్ | 1 | నిల్ | నిల్ | నిల్ | 1 |
| | బ్రాహ్మణ | 11 | 6 | 1 | నిల్ | 3 | 1 |
| | బ్రాహ్మణేతర | 20 | 7 | 3 | 2 | 7 | - |
| | అనుసూచిత కులములు | 5 | నిల్ | నిల్ | నిల్ | 5 | నిల్ |

కాని నేను సేకరించిన సమాచారం వరకు కాంగ్రెస్ విజయాన్ని తేటతెల్లంచేసి భారతీయుల స్వేచ్ఛా సౌఖ్యాలకు దాని వల్ల ఒరిగిందేమిటో చూపిస్తుంది. రాష్ట్రీయ విధాన పరిషత్తులకు కాంగ్రెస్ టికెట్ మీద ఎన్నికైన బ్రాహ్మణ, బ్రాహ్మణేతర, అనుసూచితకులాలకు చెందిన అభ్యర్థుల వంతు వారి సంఖ్యా వివరాలు పట్టిక 18 చూపుతుంది.

మొత్తం హిందూ జనాభాలో బ్రాహ్మల నిష్పత్తి ఎంత తక్కువో తెలియనివారు బ్రాహ్మలు సాధించిన ప్రతినిధుల సంఖ్య ప్రాముఖ్యత తెలుసుకోలేరు. కాని తెలుసున్నవారు బ్రాహ్మలు తమ జనాభా నిష్పత్తి కన్న ఎంతో ఎక్కువ ప్రాతినిధ్యం సంపాదించారని తెలుసుకుంటారు.

ధనిక వర్గాలకి చెందిన బనియాలు, వ్యాపారస్తులు, భూస్వాములకు కాంగ్రెస్ ఎంత ప్రాతినిధ్యం ఇచ్చింది? బనియాలు, వ్యాపారస్తులు, భూస్వాములు ఎంతమంది కాంగ్రెస్ టికెట్ మీద ఎన్నికయింది పట్టిక 19 చూపిస్తుంది.

ఇందులో కూడా బనియాలు, వ్యాపారస్తులు, భూస్వాములు కాంగ్రెస్ టికెట్ మీద సంపాదించిన ప్రాతినిధ్యం చాలా ఎక్కువ. పాలకవర్గానికి వ్యతిరేకంగా పోరాడటానికి బదులు కాంగ్రెస్ నిజానికి పాలకవర్గానికి అధికారం హస్తగతం చేసుకోడానికి సాయపడిందనడానికి సందేహం ఏమైనా వుందా? ఎన్నికలలో కాంగ్రెస్ విజయం గురించి బయటి విషయం మరొక్కటుంది. ఇది కాంగ్రెస్ మంత్రివర్గాల నిర్మాణం గురించి[1].

పట్టిక 20, 21 లు కాంగ్రెస్ ఆధిక్యం సాధించిన రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాలలో బ్రాహ్మల స్థానాలని చూపిస్తాయి.

హిందూ రాష్ట్రాలన్నిటిలోను బ్రాహ్మలు ప్రధానమంత్రులు. హిందూ రాష్ట్రాలన్నిటిలోను హిందువేతరులను మినహాయిస్తే మంత్రివర్గాలు బ్రాహ్మలలో నిండిపోయాయి. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్వరాష్ట్రమైన సంయుక్త రాష్ట్రాల (యునైటెడ్ ప్రోవిన్సెస్) లో ఇది స్పష్టంగా కనిపిస్తుంది.

ఇండియాలో బ్రాహ్మలు పాలకవర్గం అన్నదానికి ఇంకా ఏమైనా సందేహముందా? కాంగ్రెస్ స్వతంత్ర పోరాటం పాలకవర్గం స్వతంత్రానికేనన్న దాంట్లో ఏమైనా సందేహముందా? కాంగ్రెస్సే పాలకవర్గం పాలకవర్గమే కాంగ్రెస్ అన్నదాంట్లో ఏమైనా అనుమానముందా? రాష్ట్రీయ స్వయం పరిపాలనా రూపంలో 1937లో స్వరాజ్యం వచ్చినప్పుడు అధికారం, పలుకుబడి ఉన్న స్థానాల్లో కాంగ్రెస్ పాలకవర్గాన్ని కూర్చోబెట్టిందనడానికి ఏమైనా సందేహముందా?

నిజం చెప్పాలంటే, పాలకవర్గాన్ని అధికారం, పలుకుబడి ఉన్నపదవుల్లో కూర్చోబెట్టిందనడం చాలా తగ్గించి చెప్పినట్లవుతుంది. కాంగ్రెస్ దానికన్ని ఘనకార్యమే చేసింది. ఇక్కడ కూడా, ఫలితం ఎంత ఆశ్చర్యకరమైన దంటే చూస్తేనే కాని ఈ కాంగ్రెస్ ఏం చేసింది ప్రజలు నమ్మరు.

---

1. ఇండియన్ ఇన్ఫర్మేషన్, జులై 15, 1939

ఈ పట్టిక మే 1939లో వున్నదానిని చూపిస్తుంది. ఇండియన్ ఇన్ఫర్మేషన్ జూలై 1939లో రాసిన ప్రకారం ప్రశ్నార్థకం బ్రాహ్మడా బ్రాహ్మణేతరుడా అన్నది తెలియనట్లు సూచిస్తుంది.

అభ్యర్థుల ఎంపికలో కాంగ్రెస్ ఒక ప్రత్యేక విధానం అవలంబించింది. బ్రాహ్మణ అభ్యర్థుల ఎంపిక విద్యాధిక్యతను బట్టి చేసేవారు. బ్రాహ్మణేతర, అనుసూచితకులాల అభ్యర్థులు విషయంలో విద్యాహీనత ఎక్కువగా వున్నవారికి ప్రాముఖ్యం యిచ్చేవారు. దీని గురించి ఎవరికైనా అనుమానం వుంటే, పట్టిక 22లో సంక్షిప్తం చేసిన విషయాలు గమనించండి.

బ్రాహ్మణేతరులు అనుసూచితకులాల అభ్యర్థుల్లోకన్న బ్రాహ్మల్లో పట్టభద్రులు కానివారికన్న పట్టభద్రుల సంఖ్యచాలా ఎక్కువ అన్నది తేటతెల్లం. పట్టభద్రులు కాని వారి సంఖ్యలోవున్న భేదం అసలు విషయం బయటపెట్టదు. నిర్దిష్టంగా చెప్పాలంటే బ్రాహ్మణ పట్టభద్రులందరూ రాటుతేలిన రాజకీయవేత్తలు కాగా బ్రాహ్మణేతరులు పట్టభద్రులైన రెండవ తరగతి రాజకీయ వాదులు. విద్యాధికులైన బ్రాహ్మలనే కాంగ్రెస్ ఎందుకు ఎంపికచేసింది? బ్రాహ్మణేతరులు, అనుసూచిత కులాల్లో తక్కువ విద్యార్హతలు కలిగినవారినే తన అభ్యర్థులుగా కాంగ్రెస్ ఎందుకు ఎంచుకుంది. ఈ ప్రశ్నకి ఒకేఒక సమాధానం ఉందని నా ఉద్దేశం. కాంగ్రెస్‌లోని బ్రాహ్మణేతరులు ప్రభుత్వం ఏర్పాటు చెయ్యకుండా చేయడానికే. పాలకవర్గం దృష్టిలోచదువుకున్న వాడికన్న చదువులేని బ్రాహ్మణేతరుడు రెండు విధాల పనికివస్తాడు. కాబట్టి కాంగ్రెస్ చదువురాని బ్రాహ్మణేతరుణ్ని ఎంపిక చెయ్యాలని చేసినట్టు కనబడుతుంది. మొదటి విషయం: తనని ఎంపిక చేసినందుకు చదువుకున్న వాడికన్న చదువుకోని శూద్రుడు తనను ఎన్నికచేయించినందుకు కాంగ్రెస్ అధిష్టానవర్గానికి ఎక్కువ విధేయుడై ఉంటాడు. కాంగ్రెస్‌లో వున్న చదువుకున్న శూద్రులు పాలకవర్గం ఏర్పాటు చేసిన ప్రభుత్వానికి "ప్రత్యామ్నాయంగా" ప్రభుత్వం ఏర్పాటు చేద్దామనుకున్నప్పుడు వారితో చేతులు కలిపి పాలకవర్గపు ప్రభుత్వానికి ఎదురు తిరగడని. రెండవది, ఎక్కువమంది పట్టభద్రులు కానివారిని కొత్తగా పట్టభద్రులైన వారిని కాని ఎంపికచేసింది ఎందుకంటే పాలకవర్గపు ప్రభుత్వానికి ప్రత్యామ్నాయంగా సమర్థవంతమైన ప్రభుత్వాన్ని శూద్రులు ఏర్పాటు చేయకుండా చెయ్యడానికి. కాంగ్రెస్ తమను ఎలా మోసం చేసింది కాంగ్రెస్‌లో ఉన్న శూద్రులకు తెలియదు. తమను కాంగ్రెస్‌లోకి తీసుకుని పాలకవర్గాన్ని శాశ్వతంగా అధికారం పలుకుబడివున్న స్థానాల్లో ఉంచడానికి కాంగ్రెస్ ఎట్లా రహస్యంగా ప్రయత్నిస్తోందో కూడా వారికి తెలియదు.

## VI

ఇప్పుడు మనం వున్న కఠిన పరిస్థితులలాంటి క్లిష్ట పరిస్థితిలో ఇతర దేశాలున్నప్పుడు ఆదేశాలలో పాలకవర్గం అవలంబించిన వైఖరిని ఇండియాలో పాలకవర్గం అనుసరిస్తున్న వైఖరితో పోల్చి చూడడం సరియైన అవగాహనకు తోడ్పతుంది. ఫ్రాన్స్‌లో విప్లవం వచ్చి

సమానత్వం కోరినప్పుడు, పాలకవర్గం స్వచ్ఛందంగా ముందుకు వచ్చి తన హక్కులన్ని వదులు కొని ప్రజాస్వామ్యంలో కలిసి పోవడానికి సిద్ధపడింది. స్టేట్స్ జనరల్ ఆదేశించినప్పుడు జరిగినదాన్ని బట్టి ఈ విషయం తేటతెల్లమవుతుంది. కామన్స్‌కి 600 ప్రతినిధులు వస్తే క్లెర్జీ (ఫాదరులు) నోబుల్స్(అధిపతులు) ఒక్కొక్కరు 300 చొప్పున ఎన్నికయ్యారు. 1200 సభ్యులు ఎలా కూర్చొని, చర్చించి, వోటు చేస్తారో అన్న దాని మీద ప్రశ్న వచ్చింది. మూడు వర్గాలు(ఎస్టేట్సు) ఉమ్మడిగా ఒకేసభ(ఛాంబరు)లో కూర్చుని తలకొకవోటు వెయ్యాలని కామన్స్ పట్టుబట్టారు. క్లెర్జీ, నోబుల్స్ దీనికి ఒప్పుకోవడం అసంభవం. ఒప్పుకుంటే చాలా విలువైన పూర్వపు సదుపాయాలను వదులుకోవలసి వుంటుంది. అయినప్పటికి వాళ్లలో చాలామంది కామన్స్ కోరినదానికి ఒప్పుకున్నారు. స్వేచ్ఛ, సమానత్వం, సోదర భావం ఆధారంగా ఫ్రాన్స్‌కి రాజ్యాంగం ఇచ్చారు. 1870 నుంచి 1870 వరకు జపాన్ ప్రజలు జమీందారి వ్యవస్థనుంచి ఆధునిక దేశంగా పరివర్తన చెందిన కాలం యిది. ఆ కాలంలో జపాన్‌లోని పాలకవర్గం వైఖరి ఫ్రాన్స్‌లోని పాలకవర్గం వైఖరికన్న ఎక్కువ దేశభక్తి పూరితమైంది. జపాన్ చరిత్ర[1] చదివిన విద్యార్థులకు తెలిసినట్లు జపాన్ సమాజంలో నాలుగు వర్గాలు వుండేవి. (1) దామియోస్, (2) సామురాయ్, (3) హెమిన లేక సామాన'(4) ఏతా లేక ఒకరిపైన ఒకరు అసమానతల బట్టి వర్గీకరించబడిన బహిష్కృతజాతులు, అనేక వేల సంఖ్యలోనున్న ఏతాల అట్టడుగున ఉండేవారు. 25/30 మిలియన్ల జనాభా వున్న హెమిన్‌లు ఏతాపై వర్గంలో ఉన్నాయి. హెమిన్ జీవితాలతో చెలగాడే హక్కుగల సమురాయ్ వారిపై వర్గంవారు. వీరిజనాభా దాదాపు 2 లక్షలు. 300 జనాభా మాత్రమే వుండి మిగిలిన మూడు వర్గాలపైన అధికారం వున్న దామియాస్ లేక జమీందారి సామంతులు (ఫ్యూడల్ బేరన్స్) అందరికన్నా ఉన్నత స్థానం లేక శిఖరాగ్రాన్ని అధిష్ఠించివుండే వారు. ఈ వర్గ నిర్మాణ హక్కులు కలిగి ఉన్న జమిందారి వ్యవస్థను సమాన పౌర హక్కులు గల ఆధునిక దేశంగా మార్చడం అసాధ్యమని దామియోస్, సమురాయ్ తెలుసుకున్నారు. దానిలో దేశ జాతీయ సమైక్యతకు అడ్డుపడకుండావుండడానికి దామియోస్ తమకున్న ప్రత్యేక హక్కులను సదుపాయాలను వదులుకొని సామాన్య ప్రజలలో కలిసి పోడానికి ముందుకు వచ్చారు. మార్చి 5 వ తారీఖు 1869 లో తమ సార్వభౌమునికి సమర్పించిన మహజరులో యిలా చెప్పారు[2].

" మేము నివసించే ప్రదేశం మహారాజుది. మేము తినే తిండి మహారాజు" మనుషులు పండిస్తారు. అలాంటి పరిస్థితులలో ఆస్తి పాస్తులు మా స్వంతమని ఎలా అనగలం? మాకున్న ఆస్తిని మా సేవకుల్ని (సామురాయ్,సామాన్య ప్రజని) కూడా మీకు భక్తి ప్రపత్తులతో సమర్పించు కుంటున్నాం. వీరిలో సన్మానార్హుల్ని సన్మానించమని, అనర్హుల్ని శిక్షించమని మహారాజుకి మా వేడికోలు. ఉపవర్గాలు (గోత్రాల వంటివి) వారి భూములుమార్చి, పునర్వ్యవస్థీకరిస్తూ రాజాజ్ఞలు జారీ చేయవలెను. పౌర హక్కుల చట్టం, నేర నిరోధక చట్టములను, దుస్తులు మొదలుకొని యుద్ధ పరికరముల తయారీ వరకు అన్నీ వున్న సైనిక

1. రోమాన్స్ ఆఫ్ జపాన్ సైజేమ్స్ ఎ.బి. స్కెరర్
2. ఐ బిడ్, పుట 233

శాసనము మహా రాజా వారినుంచి జారీ చేయవలసినది. పెద్ద, చిన్న రాజ్యానికి సంబంధించిన అన్నివిషయాలు రాజా వారికే విన్నవించాలి."

ఈ విషయంలో ఇండియాలోని పాలకవర్గానికి జపాన్ పాలకవర్గానికీ ఏమైనా పోలిక వుందా? ఈ రెండు ఒకదానికొకటి పూర్తిగా వ్యతిరేకం. ఇండియా లోని పాలకవర్గం భారతస్వేచ్ఛా పీఠంముందు ఎటువంటి ఆత్మార్పణ చేసుకోడానికి సిద్ధంగా లేదు. ఇండియాలోని పాలకవర్గం తనకున్న సదుపాయాలను దేశభక్తి పరంగా వదులు కోవడానికి బదులు సంరక్షించుకోడానికి దేశభక్తిని దుర్వినియోగం చేస్తోంది. విధాన పరిషత్తుల్లో, మంత్రిత్వ శాఖలలో, ప్రభుత్వోద్యోగాల్లో సేవకవర్గం ప్రత్యేక కేటాయింపు కోరినప్పుడు అది దేశ సమైక్యతకు ముప్పని పాలకవర్గం గందరగోళం సృష్టిస్తుంది. పాలకవర్గంలో కొందరు[1] సేవావర్గాల వారి అభ్యర్థన అనుచితంగాను వేళాకోళంగాను వుందనే భావం కలిగించడానికి వ్యంగ్య(లాంపూనింగ్) వక్రీకరణం (పారడీలు) కూడా రాశారు. ఈ వక్రీకరణాల అన్నింటిలోకి ముచ్చటైనది కొత్తగా ఆస్ట్రేలియాలో ఇండియన్ హైకమీషనర్‌గా నియమితులైన ఆర్.పి.పరాంజపె రాసిన దొకటి. పరాంజపె అంతటి నిష్పక్షపాతి (లిబరల్) కూడా అటువంటి అభిప్రాయం వ్యక్తం చేయడానికి కారణాలు అర్థంచేసుకోడం కష్టం.

---

1. ఆర్.పి. పరాంజపె రాసిన వక్రీకరణ భవిష్యత్తులోకి తొంగి చూపు"( ఎ పీప్ ఇంటుది ఫ్యూచర్) అనే శీర్షిక కింద మే, 1926 "గుజరాత్ పంచ్" పత్రికలో ప్రచురితం అయ్యింది. పాలక వర్గం సభ్యుల రాతలకు మచ్చుతునకగా ఇది చదవడం మంచిది. కులనిబంధన (కమ్యూనల్ రిజర్వేషన్) సూత్ర పరంగా జరిగిన కొన్నిసంఘటనల ఊహాగానం ఆధారంగా రాసిన వ్యంగ్యం అది. ఆ పత్రిక సులభంగా దొరకదు కాబట్టి దానిని ఇక్కడ ఊటంకిస్తున్నాను.:-

భవిష్యత్తులోకి ఒక తొంగి చూపు

(ఏ పీప్ ఇంటు ది ఫ్యూచర్)

ఇండియా ప్రభుత్వం మీద రాయల్ కమీషన్ నివేదిక, 1930

1930-50 ల మధ్య విడుదలైన కమీషన్స్ నివేదికలు, పోలీస్ రికార్డులు న్యాయ విచారణలు, సభా కార్యకలాపాలు పరిపాలన నివేదికలు మొదలైన వాటినుంచి ఎత్తి తీయబడిన విభాగాలు. ఇవి గుజరాతి పంచ్ చదువరుల కోసం ప్రచురించబడ్డాయి.

ఇండియాలోని బహుళజాతుల తరుపున ఇచ్చిన మహాజరులను చాలా క్షుణ్ణంగాపరిశీలించాలి. క్రితం జనాభా లెక్కలు ఆధారంగా తీసుకొని మాముందరుంచిన వాదనలకు కొంతవరకు మాత్రమే సంతృప్తినివ్వగలం. ఎందుకంటే, అనేకజాతుల కులాల జనాభా అందరికీ వర్తించే కొలతకు రావు కాబట్టి దేశంలోని ప్రతివ్యక్తికి ప్రభుత్వ యంత్రాంగంలో ఏదో ఒక స్థానం కల్పిస్తేనేగాని ఈ సమస్యకుఅందరికి సంతృప్తి నిచ్చే సరియైన పరిష్కారం కనుక్కోలేము. 2375 ను రాజ్యాంగపు మూల సంఖ్య గా మేము తీసుకుంటాం. మా నివేదికకు జతపర్చిన సూచీ (షెడ్యూలు) లో చూపించినట్టు ఈ సంఖ్యను జాతుల, కులాలభాగాల వారీగా విభజన చేశాం. ప్రతి జాతి, కులము వాదన దానికి సరిపోయినసంఖ్య ప్రకారము ఇక ముందునుంచి గుర్తించ బడుతుంది. నిజానికి దేశంలో అన్ని నియామకాలు, సంస్థలలో సభ్యత్వం, ఆమాటకొస్తే దేశంలోని ప్రతి అంశంవీలున్నప్పుడల్లా సూచీ (షెడ్యూలు)లోని సంఖ్య ప్రమాణం గా చేయడంజరుగుతుంది.

ఈ ప్రశ్నలకు వచ్చే సరైన జవాబులు గురించి ఏ అనుమానం వుండదు. వర్గ లక్షణాలు ఎప్పుడూ విస్మరించరాదు. మనిషి యంత్రం మాత్రం కాదు. అతడు మానవమాత్రుడు. కొందరంటే యిష్టం, మరి కొందరంటే అయిష్టభావంతో ఉంటాడు. ఇది మహామహుల విషయంలో కూడా నిజం. అతను కూడా వర్గ యిష్టాయిష్టాలు కలవాడుగా ఉంటాడు. ఈ విషయాలోచన ప్రకారం పాలకవర్గానికి చెందిన మహావ్యక్తి కూడా సేవావర్గాల వారిపట్ల మహా దుర్మార్గుడుగా మారవచ్చు. పాలకవర్గాల, సేవావర్గాల వైఖరుల మధ్య వున్నతేడా ఒక దేశస్తునికి మరొక దేశస్తునికి మధ్య వైఖరిలో తేడాలాంటిదే. సేవావర్గాల కోర్కెలను పరిహసించేటప్పుడు ఇండియాలో పాలకవర్గం సేవావర్గాల మధ్యనున్న తేడా ఫ్రెంచివారు, జర్మనుల మధ్య, తురుష్కులు, గ్రీకులు మధ్య లేక పోలెండువారు, జ్యూల మధ్య నున్న తేడా వంటిదే నన్న విషయం పాలకవర్గం మర్చిపోతున్నట్లున్నది. రెండు దేశాల ప్రభుత్వాలు ఒకే రకం మేధావులతో కూడుకొన్నవైనా ఒకరు మరొకరి ప్రభుత్వాన్ని భరించరన్నదానికి కారణాలు మాత్రం రెండు సందర్భాలలోనూ ఒకటే.

---

ఒక్కొక్క జాతి కులము సభ్యులలో ప్రతి 5 గురికి ఒకరు చొప్పున,రాజ ప్రతినిధి (వైస్‌రాయ్) కార్యాచరణ సమితి (ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్) లో 475మంది సభ్యులుంటారు. ప్రతి జాతి కులము తనకు చెందిన మొత్తం సభ్యులవాటా 5 యేళ్ళలో పూర్తయ్యేట్లు ఏడాదికి ముగ్గురు చొప్పున పదవిలోవుంటారు. ప్రతి హైకోర్టులోను 125 మంది జడ్జీలు వుంటారు. ఈ పద్ధతిప్రకారం ప్రతి వర్గానికి తనకు రావలసిన వాటా ప్రకారం19 యేళ్ళకొకసారి అవకాశం వచ్చి నప్పటికి ఒకో జడ్జి ఒక యేడాది పదవిలోఉంటాడు. అందరి వాటాలు సరిగ్గా కుదిరేటట్లు ఇదే పద్ధతిన మిగిలిన నియామకాలన్నీ నిర్ణయించ బడతాయి.

# I

ఈ సభ్యత్వంలో అన్ని సంస్థలు సరిగా పనిచేయడానికి వీలుగా ఇప్పుడున్న ప్రభుత్వభవనాలన్నీ అవసరంకొద్ది కూలగొట్టి సరిపడే కొలతలతో మళ్ళీకట్టాలి.

# II

*(ఇండియా ప్రభుత్వ ప్రకటన, 1932)*

ఇండియా ప్రభుత్వ చట్టం, 1931 లోని నిబంధనల ప్రకారం ఘనత వహించిన(హిజ్ మెజస్టీ) మహారాజు వారు ఇక్కడ ఉదహరించిన 475 పెద్దలను మహారాజప్రతినిధి (గవర్నర్ జనరల్) కార్యాచారణ సమితి సభ్యులుగా నియమించుటకుదయతో అంగీకరించిరి:

267. మటారిన్ రామ్ దిన్ (కులం మంగలి) ఆరోగ్య శాఖ లో శస్త్ర చికిత్సా విభాగసభ్యునిగా.

372. అల్లా బక్స్ పీర్ బక్స్ (మహమ్మదీయుడు ఒంటెలు తోలేవాడు) సైన్యంలోఒంటెల బిడారి శాఖ సభ్యునిగా

433. రామస్వామి (కులం ఆంధ్రా వీధులు వూడ్చేవాడు) ప్రజావసర పనుల శాఖరోడ్లు శుభ్రపరిచే విభాగం సభ్యుడుగా.

437. జన్నాధభట్టాచార్య (కులీన బ్రాహ్మణ పురోహితుడు) అభిలేఖ శాఖ(రిజిస్ట్రేషన్ డిపార్ట్‌మెంట్) లో గృహ విభాగపు సభ్యుడుగా

పాలకవర్గం (సేవావర్గం) కోర్కెను వెక్కిరించేప్పుడు ఏ పద్ధతిలో తమ శక్తిని ఎలా పెంచుకున్నారన్నది కూడా మర్చిపోతారు. వారి మనుస్మృతిని వారే చదివి చూస్తే వారు అధికారం చేజిక్కించుకోడానికి అనుసరించిన పదతులన్నీ కూడా పరంజపే చెప్పిన ఊహా జనిత పద్ధతుల వంటివే. ఒకసారి మనుస్మృతి తిరగేస్తే,పాలకవర్గంలో ప్రముఖులైన మార్గదర్శక మైన బ్రాహ్మలు తెలివి తేటలలో కాకుండా-తెలివితేటలు ఏ ఒక్కరి సొత్తూ కాదు కాబట్టి-శుద్ధ కులతత్వంతోటే సాధించారు. మనుస్మృతి సూత్రం ప్రకారం, రాజపురోహితుడు, మహామంత్రి, ప్రధాన న్యాయాధికారి, ఉన్నత న్యాయస్థానలలో న్యాయాధికారి పదవులు, దర్బారు మంత్రి పదవులు బ్రాహ్మలకోసమే ప్రత్యేకించబడ్డాయి. మహాసేనాధిపతి పదవి,

---

## IV

(*స్థానిక సంస్థలకు వుత్తరం,* 1934)

ఇండియా ప్రభుత్వం పూర్తిగా ఒప్పుకున్న విధాన మండలి ఆమోదించిన శాసనంప్రకారం, ఇక నుంచి ప్రతి ప్రభుత్వనియామకం అభ్యర్థి అర్హతను బట్టి కాకజాతి కుల ప్రాతిపదికపైన ఏర్పాటైన వంతుల వారీ (రొటేషన్) పద్ధతి ప్రకారంజరగాలని ఇందు మూలంగా తెలియ పరచడానికి నేను ఆజ్ఞానువర్తిని.

## V

(*బొంబాయి ప్రభుత్వ రాజ పత్రం (గెజెట్) లో ప్రకటన,* 1934)

బొంబాయి ప్రభుత్వం డిశంబరు నెలలో ఇక్కడ ఉదాహరించిన నియామకాలుచేస్తారు. ప్రభుత్వ ఉత్తర్వు సంఖ్య, నవంబరు 30,1934తేదీ లో సూచించినవంతుల (రొటేషన్) ప్రకారం అభ్యర్థులు ఉద్యోగాలకి ఎదురుగా చూపించినకులానికి చెందివుండాలి.

1. చీఫ్ ఇంజనీరు, నీటి పారుదల (సింధ్), కుమ్మ్రి(కుమ్మరి)ఉత్తర కెనరా

2. సంస్కృతం లో ఆచార్యుడు, ఎలిఫిన్‌స్టన్ కాలేజి, బొంబాయి;బలూచిపఠాన్,సింధ్

3. ఘనత వహించిన (హిజ్ఎక్సలెన్సీ)వారి అంగ రక్షక అధికారి (కమాండెంట్) : మార్వాడి, ఉత్తర గుజరాత్

4. ప్రభుత్వ వాస్తు శిల్ప సలహాదారు :వడ్డరి (తిరుగుబోతు జిప్సి) దక్కన్

5 సంచాలకుడు, ఇస్లాం సంస్కృతి: కర్హాడ బ్రాహ్మడు

6. శరీర నిర్మాణ శాస్త్రంలో ఆచార్యుడు : మహమ్మదీయ కటిక వాడు (గ్రాంట్ వైద్య విద్యా కాలేజి)

7. పర్యవేక్షకుడు, ఎర్వాడకారాగారం : ఘంటి చోర్

8. మధ్యనిషేధం కార్యకర్తలు -2 : ధరాల (కైరా జిల్లా భిల్)(పంచ్ మహల్స్)

బ్రాహ్మలకోసం ప్రత్యేకించక పోయినా బ్రాహ్మడు దానికి తగిన మనిషని సూచించబడింది. అన్ని ముఖ్యమైన పదవులు బ్రాహ్మలకే కేటాయించడంలో మంత్రివర్గ పదవులన్నీ బ్రాహ్మలకే ప్రత్యేకించ బడతాయన్నది చెప్పక చెపుతుంది. ఇదే అంతా కాదు. లాభం, అధికారం వున్న పదవులను మాత్రమే తన వర్గానికి ప్రత్యేకించుకొని బ్రాహ్మడు సంతృప్తి పడలేదు. పదవులు ప్రత్యేకించుకోవడం ఒకటే చాలదని అతనికి తెలుసు. తనతోసమానార్హతలు సంపాదించి బ్రాహ్మణేతర కులాలనుంచి ప్రత్యర్థులు పుట్టుకు వచ్చి ఆందోళన చేసి కేటాయింపుల పద్ధతిని నాశనం చేయకుండా చేయాలని అతనికి తెలుసు. దేశంలోని కార్యాచరణ ఉద్యోగాలన్నింటిని బ్రాహ్మలకు ప్రత్యేకించడమే కాకుండా, విద్యపై గుత్తాధికారాన్ని బ్రాహ్మలకు కట్టబెడుతూ ఒక నియమం చేశారు. ఇంతకు ముందే తెలిపినట్లు న్యాయసూత్రాలు శూద్రులు అంటే హిందూ సమాజంలో తక్కువస్థాయికి చెందిన కులాల వారు, చదువు నేర్చుకోడం నేరంగా ప్రకటించాయి.

---

## VI

(హైకోర్టు దావామీద ఒక నివేదిక, 1935)

ఎ.బి. (కులం తెలి) తన తండ్రి నిద్రపోతుండగా ఘోరంగా హత్య చేశాడని నేరంమోపడమైనది. ముద్దాయికి వ్యతిరేకంగా న్యాయాధిపతి విషయ సంగ్రహంచెయ్యగా న్యాయనిర్ణయ సంఘం(జూరీ)ముద్దాయి నేరం చేసినట్టుఅభిప్రాయపడింది. తన నిర్ణయం తెలిపే ముందర న్యాయాధికారి ముద్దాయితరఫు న్యాయవాది చెప్పుకునేదేమైనా వుందా అని అడిగాడు. న్యాయవాదిబొమత్జీ తను తీర్పు ఒప్పుకుంటున్నట్టు చెప్పాడు. కాని చట్ట ప్రకారం మరణశిక్ష వేయడం మాట అలావుంచి, అసలు ఎటువంటి శిక్షా వెయ్యడానికి వీలు లేదనిచెప్పాడు. ఎందుకంటే, ఈ సంవత్సరం ఇద్దరిమరణ శిక్ష కలుపుకొని ఏడుగురుతెలీలను దోషులుగా నిర్ణయించి శిక్షవేశారు. ఇండియా ప్రభుత్వ చట్ట ప్రకారం తెలీలు తమకోటా పూర్తి చేయగా మిగిలిన జాతులు కులాలు తమ వాటా శిక్షలు ఇంకాపొందలేదు. ఘనత వహించిన న్యాయాధీశుడు ముద్దాయి తరఫు న్యాయవాదివాదన ఒప్పుకుని నిందితుణ్ణి విడుదల చేశాడు.

## VII

("*ఇండియన్ డైలీ మెయిలో* 1936 *ఒక వార్త*)

అన్నాజి రామచంద్ర (**చితపవన్ బ్రాహ్మడు**) తనకు దొరికిన వారినల్లా కత్తితోపొడుస్తూ పూనా వీధుల్లో తిరుగుతూ కనిపించాడు. మాజిస్ట్రేటు ముందుహాజరు పరిచినప్పుడు, ఈ మధ్యనే అతన్ని పిచ్చాసు పత్రినుంచి వదిలి వేసినట్లు పోలీసులు చెప్పారు. అన్నాజి ప్రమాదకరమైన పిచ్చివాడు మూడుసంవత్సరాలు ఆసుపత్రిలో ఉన్నట్లు ఆసుపత్రి కార్యనిర్వాహకుడు తనవాంజ్మూలంలో చెప్పాడు. కాని చిత్ పవన్‌లకు కోటావుంది. పైగా మిగిలినజాతులు/కులములకు చెందిన వారు ఆ ఏడాది కోటా పూర్తిచేయలేదు. దానిలోతను ఈ ప్రశ్నలకు వచ్చే సరైన జవాబులు గురించి ఏ అనుమానం వుండదు. వర్గ లక్షణాలు ఎప్పుడూ విస్మరించరాదు. మనిషి యంత్రం మాత్రం కాదు. అతడు మానవమాత్రుడు. కొందరంటే యిష్టం, మరి కొందరంటే అయిష్టభావంతో ఉంటాడు. ఇది మహామహుల విషయంలో కూడా నిజం. అతను కూడా వర్గ యిష్టాయిష్టాలు కలవాడుగా ఉంటాడు. ఈ విషయాలోచన ప్రకారం పాలకవర్గానికి చెందిన మహావ్యక్తి కూడా సేవా వర్గాల వారి పట్ల

చితపవన్ లకు పక్షపాతం చూపించకుండా అతనిని ఏ మాత్రం (ఆసుపత్రిలో)ఉంచుకో లేక పోయాడు. కాబట్టి వైద్య శాఖ ఉత్తర్వు ప్రకారం అతనిని వదిలివేశాడు. మేజిస్ట్రేటు అన్నాజి విడుదలకు ఉత్తర్వులు జారీ చేశాడు.

ఈ నియమోల్లంఘనం చేసిన నేరస్తుని నాలుక కోసేయడం, చెవులలో కరగించిన సీసం పోయడం వంటి క్రూరమైన, అమానుషమైన శిక్షలు వేయడం జరిగేది. కాంగ్రెస్ వారు ఇటువంటి ప్రత్యేకమైన హక్కులు ఇప్పుడు లేవని చెప్పి తప్పుకోడానికి వీల్లేదు. ప్రత్యేక హక్కులు, సదుపాయాలు పోయినా, శతాబ్దాల తరబడి వాటిని అనుభవించినందు వల్ల వచ్చిన లాభం ఉండిపోయిందని వారు ఒప్పుకోవాలి. శ్రేష్ఠత కోరడం కోసం బ్రాహ్మలు ఇంత

## V

(*బొంబాయి రాష్ట్ర కారాగారాల పరిపాలన నివేదిక* 1937 *నుంచి ఒక భాగం*)

ఎంతో జాగ్రత్త పడ్డప్పటికి కారాగారం లోని ఖైదీల సంఖ్య ప్రతి జాతి/కులాలుకేటాయించిన కోటాకు అనుగుణంగా లేదు. ఈ వ్యత్యాసాన్ని అవకతవకలనుసరిచేసే వుద్దేశ్యంతో పర్యవేక్షకుడు ప్రభుత్వసూచన కోసం అడిగాడు.

ప్రభుత్వ తీర్మానం: ఇన్స్పెక్టర్ జనరలు విధి నిర్వాహణలో చూపినకర్తవ్యలోపాన్ని ప్రభుత్వం తీవ్రంగా పరిగణిస్తోంది. ఆయా కారాగారాలకుకేటాయించిన కోటాను పూరించడానికి గాను అదుపు లోకి తీసుకోవడానికికావాల్సిన తక్షణ చర్యలు తీసుకోవాలి. అందుకు తగినంత మందిని పట్టుకోలేకపోతే, సమాన సంఖ్యలో కారాగారంలోని ఖైదీలను వదిలి వేసి సంఖ్య అలానేఉండేలా చూడాలి.

## IX

(*విధాన సభ ఉత్తర్వులు* : 1940)

చెన్నప్ప అడిగారు. పాళి ఎం.ఏ. పరీక్ష రాసిన విద్యార్థుల జాబితాలో మాంగగరూడి అభ్యర్థుల సంఖ్య సరైన కోటా ప్రకారం లేదన్న విషయం ప్రభుత్వగమనికలోకి వచ్చిందా?

గౌ!!దాము ప్రాఫ్(విద్యమంత్రి) మాంగ్-గరూడి అభ్యర్థులెవరూ పరీక్షకు కట్టలేదని విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు నివేదించారు చెన్నప్ప: మాంగ్-గరూడిఅభ్యర్థి దొరికే వరకు ఈ పరీక్ష ఆపడానికి ప్రభుత్వం సుముఖంగా ఉందా? ప్రభుత్వ ఉత్తర్వులను విశ్వవిద్యాలయం ధిక్కరిస్తే విశ్వవిద్యాలయానికిచ్చేధన సహాయాన్ని ఆపివేసి విశ్వవిద్యాలయ చట్టాన్ని సవరించడానికి ప్రభుత్వంతయారుగా వుందా?

గౌ. మంత్రి: సలహాను సుముఖంగా పరిశీలించడానికి ప్రభుత్వం సిద్ధంగావుంది(హర్షామోదం)

## X

( *ది టైమ్స్ ఆఫ్ ఇండియా నుండి ఒక వార్త,* 1942)

శస్త్రచికిత్సానంతరం జె.జె. హాస్పిటల్, బొంబాయి లో రాంజి సోను మరణంవిషయంలో దర్యాప్తు చెయ్యడానికి పట్టణ దుర్మరణ విచారణాధికారి(కారోనర్)..... ఒక సాయంత్రం హటాత్తుగా పిలిచారు. డా. తానూ పాండవ్ (కులంమంగలి) తను శస్త్ర చికిత్స చేసినట్లు వాఙ్మూలంయిచ్చాడు. పొత్తికడుపులోనున్న కురుపు కోద్దామని అనుకున్నాడు. కాని అతని కత్తి గుండెల్లోగుచ్చుకొని రోగి మరణించాడు. ఇది వరకెప్పుడైనా యిటువంటి శస్త్రచికిత్సచేశావా అని అడిగినప్పుడు, తన కులం వంతు ప్రకారం ఒక రోజు ముందుమాత్రమే తనని ఆసుపత్రి ముఖ్య శస్త్ర చికిత్సకుడు(ప్రిన్స్పల్ సర్జన్) గానియమించారని చెప్పాడు. మంగలి కత్తి తప్పించి తనిదవరకెప్పుడు శస్త్రపరికరాన్ని వాడలేదని చెప్పాడు. దుస్సాహసం వల్ల చావు సంభవించినదనిన్యాయ నిర్ణాయక సంఘం (జూరీ)తన నిర్ణయం ప్రకటించింది.

కన్నా ఘోరమైన కులతత్వ పూరిత నియమాలను ఆధారంగా చేసుకొన్నప్పుడు, కాంగ్రెస్‌వారు సేవావర్గాల వారి కోర్కెలను కులతత్వమని తోసి పుచ్చడానికి ఖచ్చితంగా వీలులేదు. ఈ రోజు సేవావర్గాల వారు ప్రత్యేక రక్షణల కోసం పోరాడవలసి వచ్చిందంటే దానికి కారణం బ్రాహ్మలు తమ ప్రత్యేక హక్కులను నిలుపుకోడానికి సేవావర్గాలవారు చదువుకోవడం ఆస్తి సంపాదించడం నేరమని న్యాయ సూత్రాలు వల్లించినందుకే. నిజంగా సేవావర్గాలవారు అడుగుతున్నవి బ్రాహ్మలు తమ స్వలాభం కోసం, ఆధిక్యాన్ని పెంపొందించడం కోసం చేసిన తప్పులో సగంమాత్రం కూడా ఉండదు.

ముందు చెప్పిన దాని దృష్ట్యా, పాలకవర్గం నడిపించే స్వాతంత్ర్య పోరాటం సేవావర్గాల దృష్టిలో బూటకపు సంఘర్షణ కాకపోయినా స్వార్థపరమైనదని మాత్రం అనక తప్పదు. ఇండియా లో పాలకవర్గం అవస్థపడుతున్నది. సేవావర్గాలవారిని స్వేచ్ఛగా పరిపాలించే స్వాతంత్ర్యం కోసం మాత్రమే. అదికోరుకునేది జన సామాన్యాన్ని పరిపాలించడానికి అధిపతి జాతికి స్వేచ్ఛ. సామాన్యమానవుణ్ణి పరిపాలించడానికి మానవాతీతుడుకి స్వేచ్ఛ కావాలి అనే నాజి లేక నియంత సిద్ధాంతమే యిది.

## VIII

భారత రాజకీయాలలో ఏది ఏమిటి అన్నది తెలుసుకుని వాటినించి పుట్టే సమస్యలకు పరిష్కారం సూచించాలనుకునే విదేశీయుడు భారత రాజకీయాల మూలసూత్రాలను తెలుసుకోవాలి. వాటి పూర్తి అవగాహనలో విఫలుడైనప్పుడు. అతడు నడిసముద్రంలో చుక్కాని లేని నావలా వుంటాడు. తనని వశం లేక వశీకరణంచేసిన పక్షానికి ఆట వస్తువు కాక మరేం కాడు. భారత రాజకీయాల మూలసూత్రాలు : (1) సేవావర్గాల వారిగురించి పాలక వర్గం జిజ్ఞాస, దృక్పథం (2) పాలకవర్గానికి కాంగ్రెసుతో వున్న సంబంధం (3) రాజ్యాంగ రక్షణకోసం సేవావర్గాల రాజకీయ కోర్కెల మూలకారణం.

మొదటిదాని విషయంలో విదేశీయుడు ఒక అభిప్రాయానికి రావటానికి సరిపడినంతా అప్పుడే చెప్పడం జరిగింది. యదార్థాలలో నేను తయారు చెయ్యడానికి ప్రయత్నించిన పరిశోధనా వ్యాసంగాన్ని సులభతరంగా కూడా చెప్పవచ్చు. పాలకవర్గం సేవలు చేసే సేవావర్గం వుండకుండా భిన్నతరహా సర్వస్వతంత్ర భారత దేశం ఆవిర్భవించడానికి పాలకవర్గం అధికార పరిధి అధిగమించి, ప్రభుత్వం చేజిక్కించుకోవటానికి దాని వాళ్లదోపిడి అధికారానికి హద్దులేర్పరచడాని కవసరమైన రక్షణలు పొందు పరచిన రాజ్యాంగం రచన చెయ్యడ మొక్కటే మార్గ మని అది చెపుతుంది. అంటరానివారు కోరుతున్నదిదే. కాంగ్రెస్ ప్రతిఘటిస్తున్నది యిదే. కాంగ్రెస్‌కి, అంటరానివారికి మధ్య తగాదా అంతా కూడా రాజ్యాంగ రక్షణల గురించే. ఇక్కడ విషయం యిది. భారత రాజ్యాంగం అనుసూచిత కులాల రక్షణలతో కూడి వుండాలా, లేకుండా వుండాలా? విదేశీయుడు యిది అసలు విషయమని తెలిసికోడు. కాంగ్రెస్ ఆపాదించుకునే ప్రాతినిధ్యపు లక్షణము ఈ సందర్భంలో పూర్తిగా అసంగతమని కూడా అతను అనుకోడు. కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహించే వ్యవస్థే కావచ్చు, కాని అనుసూచిత కులాల వారికి రాజ్యాంగపరమైన రక్షణలు వుండాలా లేదా అని దాని గురించి నిర్ణయం తీసుకోడానికి దాని కేమీ సంబంధం లేదు. ఈ విషయంమీద నిర్ణయం తీసుకోడంలో కాంగ్రెస్ ప్రాతినిధ్యపు

లక్షణం అసంగతం. అవసరం మీద ఆధారపడి వుంది. ఈ విషయానికి అనుగుణమైన ప్రశ్న వాళ్లడుగుతున్న రక్షణలు అనుసూచిత జాతుల వారికి అవసరమా? కాంగ్రెస్ ప్రాతినిధ్యపు వ్యవస్థ అన్నది ప్రాతిపదికగా విదేశీయుడు అనుసూచిత జాతులకు విరుద్ధంగా కాంగ్రెస్‌ను సమర్థించడం సమంజసంకాదు. కాని తమకు రక్షణలు కావలసిన అవసరం నిరూపించుకోవలసిందిగా అనుసూచిత జాతులను విదేశీయుడు అడగడం మాత్రం సవ్యమే. పాలకవర్గం ఉనికి ఒక్కటే చాలదని చెప్పటంలో కూడా అతడు సమర్థనీయుడే. వారింకా నిరూపించుకోవలసిన విషయం కూడా వుంది. అదేమిటంటే ఇండియాలో పాలకవర్గం బాగా పాతుకున్న కుతంత్రపు పుట్ట కాబట్టి వయోజన వోటు హక్కు తాకిడికి లొంగిపోదు. అటువంటి స్థిరమైన అభిప్రాయం కలిగి వుండటం సమంజసం. దానిని ఎదిరించి నిలవడానికి అనుసూచిత కులాల వారు తయారుగా వున్నారు. ఇది ఎందుకంటే అనుమానమేమీ లేకుండా, ప్రపంచంలోని యితర దేశాలలోలా కాకుండా ఇండియాలో పాలకవర్గం వేరేస్థానాన్ని కలిగి ఉంది. పాలక వర్గాలకి ఇతరులకి మధ్య ఇతర దేశాలలో మహా ఉంటే ఒక చిన్న గీత (హైఫెన్) వుండేది. ఇండియాలో రెండు వర్గాల మధ్యఒక అగాధం (బార్) వుంది. చిన్న గీత (హైఫెన్) కొద్ది బాటు ఎడం మాత్రం చూపిస్తుంది. కాని 'అగాధం'(బార్) అవసరాలు, దయా దాక్షిణ్యాలు విడిపడిపోయి పూర్తిగా తెగిపోయిన సంబంధాలను సూచిస్తుంది. మిగతా దేశాల్లో, పాలకవర్గానికి చెందని యితరులను తమ వర్గస్థాయి వారు అందుకోగానే పాలకవర్గంలో క్రమంగా సమ్మిళితం చేసుకొనే పద్ధతి వుంది. ఇండియాలో పాలకవర్గం ఒక రక్షిత వ్యవస్థ. అందులో పుట్టినవారికి తప్పించి మిగిలినవారికి ఆవ్యవస్థలో స్థానం లేదు. ఈ వ్యత్యాసం చాల ముఖ్యమైనది. పాలక వర్గం రక్షిత వ్యవస్థయినప్పుడు, సంస్కృతి సంప్రదాయం సాంఘిక జిజ్ఞాస, సాంఘిక దృక్పథం ఛిద్రం కాకుండా వుంటాయి. యజమానీ, నౌకరు ప్రత్యేకహక్కులున్నవారు లేనివారు మధ్య సంబంధాలు కరడుగట్టి రంగుమారకుండా వుండిపోతాయి. పాలకవర్గం రక్షిత వ్యవస్థ కాకుండా సామాజిక స్పందన కలిగి ఇతరులతో ఇచ్చిపుచ్చుకొనే సంబంధాలు వున్నట్లయితే పాలకవర్గాన్ని ఎక్కువ సరళం చేసి దాని జిజ్ఞాసలో సమాజ వ్యతిరేకత తగ్గించి మానసిక స్వలీనం (మెంటల్ అస్సిమిలేషన్) వృద్ధి చేసి వుండేది. ఈ తారతమ్యాల వెనుకనున్న మర్మం ఆకళించు కున్నాక వయోజన వోటు హక్కు ఇతరదేశాలలో కొంతవరకు పగ్గంపట్టి లాగివుంచినా ఇండియాలో మాత్రం అదే ఫలితాన్నివ్వదని అర్థం చేసుకోవాలి. దీని పర్యవసానంగా, ఇండియాలో ప్రజాస్వామ్యాన్ని రక్షించేందుకు ఆతురుతో అధికంగా రక్షణలు కావాలని కోరుతున్న అంటరాని వారు పాలకవర్గబంధంలో స్వతంత్ర భారతాన్ని వుంచాలనే వుద్దేశంలో ఈ రక్షణలను వ్యతిరేకిస్తున్న కాంగ్రెస్ కన్న తమ మద్దతుకు ఎక్కువ యోగ్యమైనవారని తెలుసుకోవాలి.

రెండవ యోచనకి సంబంధమున్న యదార్థాలను కూడా విడమర్చి చెప్పడం జరిగింది. ఈ వాస్తవ విషయాల ఆధారంగా అతడు (విదేశీయుడు)కాంగ్రెస్‌కి పాలకవర్గానికి మధ్యన ఎంతగాఢ సంబంధమున్నది చూడాలి. ఇండియాలో పాలకవర్గం ఎందుకు కాంగ్రెస్‌కు తనకుతానై మార్గదర్శకంగా వుంటోంది, అదిఎందుకు అందరిని కాంగ్రెస్ పరిధిలోకి లాగడానికి శాయశక్తులా పాటుపడుతోంది అన్నదివారు వివరిస్తారు. క్లుప్తంగా చెప్పాలంటే, వర్గ సిద్ధాంతం, వర్గ ప్రయోజనాలు, వర్గవిషయాలు, వర్గపోరాటాల ఆధారంగా చేసిన రాజకీయప్రచారం దానికి చావుబాజా వాయిస్తుందని పాలకవర్గానికి బాగా తెలుసు. సేవావర్గాలను పక్కదారి పట్టించి తెలివి తక్కువవాళ్లను చేయాలంటే వారి మనోదౌర్బల్యాధారమైన దేశాభిమానం, దేశసమైక్యత

నినాదాల మోత ఒక్కటే ధృఢమైన మార్గమని దానికి తెలుసు. పాలకవర్గాల స్వలాభాన్ని పరిరక్షించేది కాంగ్రెస్ ఏకైక వేదికని అది గుర్తించుతుంది. పాలకవర్గానికి సరిపడని ధనికులు, పేదవారు, బ్రాహ్మలు బ్రాహ్మణేతరులు, భూస్వామి కౌలుదారు, ఋణదాత ఋణగ్రహీత వీరివర్గవైరం గురించి అందరూ మాట్లాడేది వేవీ సార్థకంగా నిషేధించాలంటే అది కాంగ్రెస్ వేదికే. ఇదే పాలకవర్గం కోరుకునే, వారిక్షేమానికి ఆధారమైన దేశాభిమానాన్ని, దేశసమైక్యతను బోధించటానికి కట్టుబడివుండటమే కాకుండా దేశాభిమానానికి విరుద్ధమైన ఏ సిద్ధాంతాన్నైనా తన వేదికమీద చర్చించడం నిషేధిస్తుంది కాంగ్రెస్.

ఈ రెండు విషయాలు అవగాహనైతే మూడవ విషయం సేవావర్గాల రాజకీయ కోర్కెల మూలకారణాం అర్థం చేసుకోడానికి విదేశీయుడు యేమీ కష్టపడడు.

సేవావర్గాలు కోరే రక్షణలు, నిజానికి, పాలకవర్గాల అధికారంపైన నియంత్రణలు మాత్రమే. యూరోపుదేశాలలో కూడా సమాజంలోని కొన్ని వర్గాల అధికారంపైన నియంత్రణల కోసం పట్టుదలవుంది. ఉత్పత్తిదారుడు, పంపిణీదారులు, వడ్డీవ్యాపారస్తులు భూస్వాములపైన నియంత్రణ వుంది. ఇండియాలో కన్న యెక్కువగా ఒకేతీరు వున్నసమాజాలు కలిగి వ్యాపారాలలో తదాత్మ్యంవున్న దేశాలలోనే కొన్నివర్గాల అధికారాలపైన నియంత్రణలకు ఒప్పుకుంటే, విదేశీయుడు విషయ గ్రహణం చేయడం కష్టం కాదు. పాలకవర్గాలచేతుల్లో రాజకీయాధికారం పడకుండా అడ్డుకోటానికి సరిపడా తప్పించి రక్షణలు రాజ్యాంగాన్ని సాంఘిక వ్యవస్థలకు ఏమంత ఎక్కువగా సమన్వయ పరచవు.

విదేశీయుడు ఇక్కడ చెప్పిన విషయాలతో ఏకీభవించకపోతే, సవివరంగా సోదాహరణంగా ఇంత ఖర్చు జరిపిన తరవాత అతడు కాంగ్రెస్ ప్రచారానికి మరొక పక్కైనా వున్నదన్న నిజాన్నైనా వొప్పుకోడం ఏమంత కష్టం కాదనుకుంటా.ఇన్ని అంశాలు అంకెలు పరిశీలించిన తరవాత కూడా, కాంగ్రెస్ అభిప్రాయంతోఏకీభవించనివారి పట్ల సౌమ్యమైన నిష్పక్షపాత వైఖరి అవలంబించక పోతే అది విదేశీయుని శీలం ప్రవర్తన మీద చాలా విచారకరమైన వ్యాఖ్య అవుతుంది.

## IX

ఇండియా రాజకీయాల గురించి విదేశీయుని అభిప్రాయం ఒక విధంగా విషాదకరం కూడా. దీన్ని గురించి చెప్పకుండా వుండడం అసాధ్యం. ఇండియా రాజకీయాల్లో ఆసక్తి చూపించే విదేశీయుల్ని మూడు వర్గాలుగా విభజించవచ్చు. మొదటి వర్గానికి ఇండియా రాజకీయాలను విభజించే సాంఘిక చీలికల గురించి తెలుసు అధిక సంఖ్యాక వర్గం అల్పసంఖ్యాక వర్గం, హిందువులు అంటరానివారు ఇలా చాలా చీలికలు వున్నాయి. రాజ్యాంగానుసారం దేశపురోభివృద్ధికి దారితీసేందుకు వీలుగా రాజ్యాంగ రక్షణలు కల్పించి ఈ వర్గవిభేదాలకు చీలికలు పరిష్కారం కనుక్కోవడం వారి ముఖ్యోద్దేశం కాదు. కాగా ఈ చీలికలు ఆసరాగా రాజ్యాంగ పురోగమనం ఆపడమే వారి వుద్దేశం. రెండవ వర్గం వారికి ఈ వర్గ విభేదాలు, చీలికలతో ఏమీ పనిలేదు. అల్పసంఖ్యాక వర్గాల వారికి అంటరానివారికి ఏమైనా వీరు వీసమెత్తులెక్కచేయరు. రక్షణల గురించి పట్టించుకోకుండా కాంగ్రెస్ కోరిందల్లా

సమర్ధించడానికి ఉవ్విళ్ళూరుతారు. ఇక మూడవర్గం ఇండియాకు వచ్చే విదేశీయాత్రికులు, వీరు వీలుంటే భారత రాజకీయాలను అమాంతం మింగేటట్లు తెలుసు కుందామని చూస్తారు. ఈ మూడు రకాలవారు కూడా ప్రమాద కరమైన వాళ్ళే. భారత ప్రజల అంతిమ ప్రయోజనం దృష్ట్యా మూడవవర్గం వీరందరిలోకి చాలా ప్రమాదకరమైనది. గుంపుల్లో పెద్దగుంపులో కలిసి గందరగోళం చెయ్యిఅని పిక్‌విక్ మహాశయుడు శ్యామ్‌వెల్లర్ కిచ్చిన సలహా సామ్యంలా ఇండియా రాజకీయాల్లోని నిజానిజాలు తెలీక కాంగ్రెస్‌ని సమర్థించే విదేశీయాత్రికులు వుండడం చాలా వరకు అర్థం చేసుకోవచ్చు. కాని అందర్నీ అన్నిటికన్న చికాకు పెట్టే దేమిటంటే అణగద్రొక్కబడిన వారి సమస్యలను ఎక్కువగ సమర్థించే బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకుల, యూరోపు అమెరికాల్లోని విప్లవ వామపక్షాల ప్రాతినిధ్యం వహించే పెద్దలైన లాస్కి, కింగ్స్లే మార్టిన్, బ్రెల్స్‌ఫోరు, అమెరికాలోని నేషన్, ఇంగ్లాడులోని న్యూస్టేట్స్‌మన్ వంటి పత్రికల సంపాదకుల వైఖరి. వీరందరూ కాంగ్రెస్‌ని ఎలా సమర్థిస్తున్నారన్నది ఏ ఒక్కరి అవగాహనకు అందని విషయం. కాంగ్రెస్ అంటేనే పాలకవర్గం పాలకవర్గం అంటే కాంగ్రెస్ అన్నది వాళ్ళకి తెలీదా? ఇండియాలో పాలకవర్గం అంటే బ్రాహ్మణ - బనియా సంఘటనన్నది వీళ్ళకి తెలీదా? కాంగ్రెస్ కార్యక్రమం రూపొందించడంలో యేపాత్ర లేకుండా గుడ్డిగా కాంగ్రెస్‌ను ఆకర్షిస్తోందని కూడా వీళ్ళకి తెలీదా? సుల్తాన్ ఇస్లామ్‌ని ఎందుకు నిషేధించలేక పోయాడో, పోప్‌కేథాలిసిసమ్‌ని ఎందుకు కాదనలేక పోయాడో అదే కారణాల వల్ల ఇండియాలో పాలకవర్గం బ్రాహ్మణత్వం విధ్వంసానికి ఉత్తర్వు చెయ్యలేదు. పాలకవర్గం యధాతధంగా వున్నంతకాలం, బ్రాహ్మలు వారి అంతటికులాల ఆధిక్యాన్ని ఉపదేశించి, శూద్రులు అంటరానివారి అణచివేత భ్రష్టుపట్టించటం పవిత్ర జాతీయ కర్తవ్యం జిజ్ఞాసగా ఇండియా స్వతంత్ర మైనప్పటికి వుంటుందా? ఇండియాలో పాలకవర్గం భారత ప్రజలలో భాగం కాదని, ప్రజలవల్ల కలుషితమౌతామన్న భావనతో వారినించి పూర్తిగా వేరైపోయి, తనకుతనే ఏకాకై పోవడం నమ్మిన విషయం వారికి తెలియదా? బ్రాహ్మణ వేదాంతంతో ప్రాభావితమైన వారి మొదడులో వారి సమాజానికి వెలుపలున్నవారికి విరుద్ధమైన ప్రయోజనాలు ఆలోచనలవల్ల తనకాలరాసిన సేవా వర్గాలలోనున్న సజీవ శక్తుల పట్ల దయకలిగి వుండదు. వారి కోర్కెలతో, బాధలతో, ఆర్తితో ప్రభావితం కాదు. వారి ఆశలకు ఆశయాలకు విరోధి. వారి విద్యాభివృద్ధికి పైపదవులు అలంకరించడం ఏమీ యిష్టంవుండదు. వారి మర్యాద స్వాభిమానం పెంచే ఏపనైనా అయిష్టమని కూడా వీరికి తెలీదా? ఇండియా స్వరాజ్‌తో 60 మిలియన్ల అంటరానివారి భవిష్యత్తు ముడిపడి వుందని వారికి తెలీదా? బ్రిటిష్ లేబరుపార్టీ నాయకులు, అణగ త్రొక్కబడిన వారిని ప్రభావిత పరుస్తూ స్వేచ్ఛా ప్రజాస్వామ్యాల మీద రచనలు చేసే కింగ్స్లే మార్టిన్,బ్రెల్స్‌ఫోర్డు, లాస్కిలకు ఈ విషయాలు తెలీదనడం అసంభవం. అయినాకానివారెప్పుడు ఇండియా గురించి రాసినా కాని అది కాంగ్రెస్‌కు మద్దతు యివ్వడానికి మాత్రమే రాస్తారు. విప్లవకారులకు, ప్రజాస్వామ్య వాదులకు ఎక్కువ ప్రీతిపాత్రమైన అంటరానివారి సమస్యలను వారు చాలా చాలా అరుదుగా చర్చిస్తున్నట్లు కనబడుతుంది. కాంగ్రెస్ కార్యకలాపాలు మాత్రమే వారిఏకైక ధ్యేయం కావటం, ఇండియా జాతీయ జీవనంలో మిగిలిన వారి పాత్ర వారిని అంతగా ఆకట్టుకోక పోవడం ఇవన్నీ కూడా వారు ఎంతవరకు తప్పుతోవ పట్టించబడ్డారు అన్న విషయాన్ని తేటతెల్లం చేస్తాయి. కాంగ్రెస్ నిజంగా రాజకీయ ప్రజాస్వామ్యానికి పాటుపడుతోంటే, వారు కాంగ్రెస్‌కి యిస్తోన్నమద్దతు అర్థం చేసుకోవచ్చు. ప్రతివారికి తెలిసున్నట్లు కాంగ్రెస్ దేశస్వేచ్ఛకోసమే పోరాడుతోంది కాని రాజకీయ ప్రజాస్వామ్యం

సాధించడానికి మాత్రం కాదు. ఇండియాలో రాజకీయ ప్రజాస్వామ్యం కోసం పోరాడుతున్న అంటరానివారి పార్టీ రాజ్యాంగ పరమైన రక్షణలు కల్పిస్తే తప్ప స్వేచ్ఛకోసం కాంగ్రెస్ సాగిస్తున్న పోరాటం విజయవంతమైతే అది బలహీనులను అణగతొక్కే బలవంతుల, శక్తిపరుల విజయం కాగలదని వారి భయం. వీరు మాత్రమే అతి వాదనాయకుల అండదండలు పొందతగినవారు. కాని వీరి సహాయ సహకారాల కోసం ఆఖరికి వారి ఆదరం కనపర్చే సౌంజ్ఞ కోసం వీరు యింతకాలం ఎదురు చూస్తున్నారు. కాంగ్రెస్ వెనకనుండి నడిపిస్తున్న శక్తుల గురించి తెలుసుకోడాని కూడా, ఐరోపా అమెరికాలోని యీ అతివాదులు వామపక్షాలవారు ప్రయత్నించలేదు. తెలిసో తెలియకో అసలు పట్టించుకోకనో ఎవరికి తెలీదు, కాని ఈ వామపక్ష వేతలు, అతివాద నాయకులు, పెట్టుబడిదార్లు భూస్వాములు వడ్డీవ్యాపారస్తులు ప్రగతినిరోధకుల వల్లనడుస్తున్న కాంగ్రెస్‌కు, గుడ్డిగా ప్రశ్నేలేకుండా సమర్ధిస్తున్నది. కాంగ్రెస్ తన చర్యలను స్వాతంత్ర్య పోరాటంగా అద్భుత పదజాలంతో వర్ణించు కోటం మూలంగానే నన్నది నిశ్చయం. స్వేచ్ఛకోసం జరిగిన అన్ని పోరాటాలు సమాన నైతిక ప్రాతిపదిక మీద జరగలేదు. దీనికి కారణం చాలా సామాన్యమైంది. ఈ స్వతంత్ర పోరాటాలకు ప్రేరేపణలు, అవసరాలు ఎప్పుడూ ఒకే తరహావి కాకపోటమే. ఇంగ్లీషు చరిత్ర నుంచి కొద్దిపాటి ఉదాహరణలు తీసుకుంటే మాగ్నా కార్టా రచనకి మూలకాలణమైన జాన్‌కి వ్యతిరేకంగా జరిగిన బేరన్ల తిరుగుబాటుని స్వాతంత్ర పోరాటంగా పరిగణించవచ్చును. తార్కికంగా స్వాతంత్ర పోరాటంగా వర్ణించ వచ్చు కాబట్టి "లెవెల్లర్స్ రెబిలియన్" లేక పేజెంట్సు రివోల్ట్ ఇన్ ఇంగ్లీష్ హిస్టరి"కి యిచ్చిన సమర్ధనే దీనికి కూడా యే ప్రజాస్వామ్యవాదైనా యివ్వగలడా? అలా చేయడం స్వేచ్ఛ కోసం కూసే తప్పుడుకూతకి తందాన పాడటమే అవుతుంది. జీవించడానికే స్వేచ్ఛ అణగతొక్కడానికే స్వాతంత్ర్యం అన్న వాటికి మద్య నున్న తేడా తెలియడానికి సరి పడినంత తెలివిలేని వర్గాలు అటువంటి నడవడిక కనబర్చినట్లయితే క్షమార్హం కాని అతివాద వామపక్షాలకు నాయకత్వం వహించే లాస్కి, కింగ్స్‌లే మార్టిన్, బ్రెల్స్‌ఫోర్డు, లూయిఫిషర్ ప్రజాస్వామ్య వ్యవస్థ పరి రక్షకులుగా ప్రఖ్యాతిచెందిన తదితరులు ఈ విషయం లో క్షమార్హులుకాదు. నిజమైన ప్రజాస్వామ్యాల్నినిలిచే ఇండియన్ పార్టీలను వీరు ఎందుకు సమర్ధించరని నిలదీసి అడిగితే వారు మరొక ఎదురు ప్రశ్నతో ఈ ఆక్షేపణకు సమాధానం చెపుతారని వినికిడి. అటువంటి పార్టీలేమైనా ఇండియాలో వున్నాయా? అటువంటి పార్టీలు వున్నాయని నొక్కివక్కాణిస్తే వారు ఎదురు తిరిగి ఆ పార్టీ లేవుంటే ఇండియాలోని పత్రికలువారి కార్యకలాపాలు గురించి ఎందుకు రాయరు? ఇండియాలో పత్రికా వ్యవస్థ కాంగ్రెస్ వార్తా వ్యవస్థని చెపితే, వారు ఎదురడుగుతారు. ఇంగ్లీషు పేపర్ల పత్రికా ప్రతినిధులు ఎందుకు ఈ సమాచారాన్ని రాయరు?

ఈ విదేశీ పత్రికా విలేఖరుల నుంచి అంతకన్న ఎక్కువ ఎందులకు అపేక్షించరాదో నేను చూపించాను. ఇండియాలో **విదేశీ** వార్తా సంస్థలు భారత వార్తా వ్యవస్థకన్నా ఏ విధంగానూ మంచివికావు. నిజానికి అవి అంతకన్న మంచిగా వుండలేదు కూడా. విదేశీ పత్రికా విలేఖరులు అని చెప్పబడే వాళ్ళు ఇండియాలో ఉన్నారు. చాలా ఎక్కువ మంది వీళ్ళు భారతీయులే. ఏ కొద్ది మందో విదేశీయులు. ఇండియన్లని విదేశీ పత్రికా విలేఖరులుగా ఎంపిక చేసేటప్పుడు వారు ఎప్పుడూ, కాంగ్రెస్ వారుగా వుండేటట్టు చూసి మరీ నియమించారు. విదేశీయులైన విదేశీ పత్రికా విలేఖరులు రెండు వర్గాలుగా వుంటారు. వారు అమెరికన్లు అయితే బ్రిటిష్ వ్యతిరేకులు కాబట్టి కాంగ్రెస్ అనుకూలురు. పిచ్చిగా బ్రిటిష్ వ్యతిరేకిగాని ఏ రాజకీయ పార్టీ అయినా వారికి ఆసక్తి వుండదు. 1941-42లో ఇండియాలో పెదెతున

వచ్చిన అమెరికన్ యుద్ధవిలేఖరులకు మిగిలిన రాజకీయ పార్టీల గురించి వారికి ఆసక్తి కలిగించే మాటటుంచి, కాంగ్రెస్ ఒక్కటే పార్టీ కాదన్న మాట నమ్మించడమే గగనమైపోతోందని కాంగ్రెస్‌కి చెందని వారు చెప్తారు. వారికి జ్ఞానోదయం అయ్యేసరికి చాలా కాలం పట్టింది. అదయిన తర్వాత వారు కాంగ్రెస్‌ను అసాధ్యమైన వ్యక్తులు నడిపిస్తున్న వ్యవస్థగానైనా తిట్టారు లేక పోతే మొత్తం ఇండియన్ రాజకీయాలంటే ఆసక్తికోల్పోయారు. మిగిలిన రాజకీయ పార్టీల విషయంలో వారేమి ఆసక్తి చూపించలేదు. వారి అభిప్రాయాలను అర్థం చేసుకోడానికి కూడా ఎప్పుడూ ప్రయత్నించలేదు. బ్రిటిష్ విదేశీ విలేఖరుల విషయంలో కూడా పరిస్థితి ఏమంత మెరుగ్గా లేదు. వారు కూడా అన్నిటి కన్నా ముందర బ్రిటిష్ వ్యతిరేక రాజకీయాలంటేనే ఎక్కువ సుముఖత చూపిస్తున్నారు. ప్రజాస్వామ్యం సురక్షితంగా వుండే స్వేచ్ఛా భారతాన్ని కోరే ముఖ్యంగా ఇండియన్ రాజకీయపార్టీలంటే వారికి ఏవిధమైన ఆసక్తిలేదు. దీని వల్ల ఇండియన్ వార్తావ్యవస్థ చేసినట్లే విదేశీవార్తా వ్యవస్థ కూడా ఒకే రకమైన వార్తలను ప్రసారం చేస్తుంది. ఈ కారణాలు అతివాదులకు దృగ్గోచరం కానివి కాదు. విలేఖరులున్నా లేకపోయినా నిజమైన ప్రజాస్వామ్యం అన్ని చోట్లా విలసిల్లడానికి మిగతా ప్రాంతాలలోవున్న అతివాదులతో సంబంధం పెట్టుకోవడం వారి బాధ్యతకాదా? ఇంగ్లాండు అమెరికాల్లోని అతివాదులు ఏ వర్గానికి తమ సహాయ సహకారాలు అందించాలన్న విషయం మరచిపోవడం చాలా దురదృష్టకరం. ప్రపంచాన్ని మోసగించడానికి పొగ మంచుతెర కప్పడానికి స్వేచ్ఛనే ఒకనినాదంగా దురుపయోగించే ఇండియన్ టోరీలకు వీరు ప్రచార ప్రతినిధిగా వ్యవహరిస్తున్నారు.

స్వేచ్ఛ అందరికి భద్రమైన సోత్తేకాని ప్రజాస్వామ్య స్వయం పరిపాలన ఇండియాలో నిజం కావని గ్రహించి వీరు ఎంత త్వరగా కాంగ్రెస్ సృష్టించిన పొగమంచు నుంచి ఎంత బయట పడితే వారికి, ఇండియాలోని ప్రజలందరికి కూడా అంతమంచిది. కాని నిజా నిజాలతో ఉద్దేశంతో సంబంధం లేకుండా ఖాళీనినాదం ఆధారంగా అదే పనిగా కాంగ్రెస్‌ను గుడ్డిగా బలపరుస్తుంటే వారు భారతదేశానికి స్నేహితులు కాకపోగా భారత ప్రజాసామాన్య స్వేచ్ఛకి బద్ధవైరులవుతారనడానికి నాకు ఏ విధమైన సందేహం వుండదు. నియంత అణచివేత నుంచి విముక్తి కోరే దళితుల సమస్యకి అణచివుంచిన నియంత తను అణగతొక్కే హక్కును మళ్ళీ పొందడానికి స్వేచ్ఛ కోరేసమస్యకి మధ్యనున్న తేడా వీరు గమనించక పోవడం చాలా విచారకరం. ఇండియాకి స్వాతంత్ర్యంతెచ్చే తొందరలో కాంగ్రెస్‌ని సమర్థించడం ద్వారా ఇండాయాను, ప్రజాస్వామ్యాన్ని భద్రమైనదిగా చెయ్యకపోగా తన నిరంకుశత్వాన్ని విచ్చలవిడిగా ఆచరించడానికివీలుగా నియంతను విముక్తుని చేస్తున్నారన్న విషయం అర్థం చేసుకోడానికి వారికి సమయంలేదు. కాంగ్రెస్‌ని సమర్థించడమంటే బానిసత్వం చెయ్యడానికి నియంతృత్వానికి స్వేచ్ఛ యివ్వడమేనని చెప్పడం అవసరమా?

X - X - X

అధ్యాయం X

# అంటరానివారు ఏం అంటున్నారు?

## గాంధీ గురించి జాగ్రత్త

గాంధీ వారి రక్షకుడని అంటరానివారికి నూరి పొయ్యడానికి కాంగ్రెస్‌వారు ఎప్పుడూ సందేహించరు. గాంధీ నిజమైన రక్షకుడని ఇండియా అంతటా ఆయనొక్కడే అంటరానివారి నిజమైన రక్షకుడని వారిని ఒప్పించడానికి ముందుకురుకుతుంటారు. దీనికి తార్కాణమడిగినప్పుడు, అంటరానివారి కోసంఆమరణ నిరాహార దీక్ష పట్టడానికి శపథం చేసిన వాడు గాంధీ వొక్కడేనని మరెవ్వరూ లేరని వారు అంటరానివారికి చెప్తుంటారు. పూనా ఒప్పందం కింద ఏమైనా రాజకీయ హక్కులు అంటరానివారికి వచ్చివుంటే అవి గాంధి ప్రయత్నం వల్లనేనని ఏ విధమైన పశ్చాత్తాపం నిజంగా లేకుండా వారు అంటరానివారికి చెప్తారు. ఇటువంటి ప్రచారానికి ఒక మచ్చుతునకగా ఏప్రిల్ 12, 1945లో డిప్రెస్సడ్ క్లాస్ లీగ్ ఆధ్వర్యంలో పెషావర్‌లో జరిగిన సమావేశంలో రాయ్‌బహదూర్ మెహర్ చంద్ ఖన్నా చెప్పినట్లు రాసిన[1] దానిని నేను నిర్దేశిస్తాను

"మహాత్మాగాంధి మీకు మహోత్కృష్టమైన స్నేహితుడు. ఆయన మీకోసంనిరాహార దీక్ష కూడా పట్టి పూనా ఒప్పందం కుదుర్చుకు వచ్చాడు. దానికింద మీకు వోటు హక్కు కలిగించి స్థానిక సంస్థలలోను విధానపరిషత్తులలోను ప్రాతినిధ్యం ఇవ్వబడింది. నాకు తెలుసు మీలో కొందరు డా.అంబేడ్కర్ వెనక పరుగిడుతున్నారని. ఆయన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల

---

1 ఫ్రీ ప్రెస్ జర్నల్ తారీఖు 14.4.45

సృష్టి ఇండియాను విభజించి పాలించే ప్రభుత్వం పట్టు గట్టిపరచడానికి ఆయన మిమ్మల్ని వుపయోగించు కుంటాడు. మీ బాగుకోరి మీకు నేను మనవి చేసేదేమిటంటే నిజమైన స్నేహితునికి స్వయంప్రకటిత నాయకునికి మధ్య భేదం తెలుసుకోమని."

నేను రాయ్ బహదూర్ మెహర్ చంద్ ఖన్నా ప్రకటన నిర్దేశించానంటే ఆయన విలువ ఇవ్వ వలసినంత మనిషని కాదు. భారత రాజకీయాలలో ఈయనకన్న పెద్దతుంటరి నేరస్తుడు ఉండటానికి వీలు లేదు కాబట్టి. (మరీ పూర్వం కాకుండా) 1944లో ఒక ఏడాది కాలంలో ఆయన మూడు పాత్రలు విజయవంతంగా ఆడేశాడు. హిందూమహాసభ కార్యదర్శిగా మొదలెట్టాడు, బ్రిటిష్ సామ్రాజ్య వాదతొత్తుగా మారాడు, బ్రిటిష్ అమెరికన్ ప్రజలకు ఇండియా యుద్ధ ప్రయత్నం గురించి తెలియచెప్పాడానికి విదేశాలకు వెళ్ళాడు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ఇప్పుడు కాంగ్రెస్ ప్రతినిధిగా వున్నాడు. రాయ్‌బహదూర్ ఖన్నాలాంటి మనిషి అభిప్రాయం, డైడెక్ బాషలో చెప్పాలంటే, ఎంతగానో మారిపోతూ, అప్పుడే మొదలవుతూ, ఎంతో కాలం స్థిరంగా వుండకుండా, ఒక చంద్ర ప్రదక్షిణ కాలం(పక్షం)లో ఎవరైతే రసాయనాల వ్యాపారి, ఫిడేలుగాడు, రాజనీతిజ్ఞుడు, హాస్యగాడో వాడు తృణీకరించ వలసినవాడు. నేను వానిని నిర్దేశిస్తే అది మహాత్మా గాంధీ స్నేహితులు అంటరాని వారిని మోసపుచ్చడానికి ఎటువంటి ప్రచారం[1] చేస్తున్నారన్నది చూపడానికి మాత్రమే.

ఇటువంటి అబద్ధాన్ని నమ్మడానికి ఎంతమంది అంటరానివారు తయారుగా వుంటారో నాకు తెలీదు. కాని నాజీలు ఇంత మాత్రం రుజువు చేసారని నేననుకుంటా. అది ఒక పెద్ద అబద్ధమయితే సామాన్య మానవుని మేధస్సుతో పరిశీలించడానికి మించిన దైనప్పుడు దానిని పదేపదే అదేపనిగా పునశ్చరణం చేసినప్పుడు, ఆ అబద్ధం నిజంగా ఒప్పుకునే అవకాశాలు చాలా వున్నాయి. నిజంగా దాన్ని ఒప్పుకోనప్పుడు ప్రచారం పాలబడ్డ దౌర్భాగ్యులపైబడ పెరుగుతూ వారి మెతక తనం మీద నెగ్గవచ్చు. కాబట్టి అంటరానివారి ఉద్యమంలో గాంధీ పాత్రను తూర్పారబడుతూ అంటరానివారు అటు వంటి ప్రచారానికి బలి కాకుండా హెచ్చరించ వలసిన అవసరం నాకుంది.

# I

గాంధీ పహించిన పాత్ర గురించి పరిశీలించేటప్పుడు అంటరానితనం ఒక దుష్టాచారమని గాంధీ మొట్టమొదటి సారిగా ఎప్పుడు గుర్తించాడు అన్న విషయంలో గాంధీ స్వయంగా సూటిగా ఇచ్చిన వాఙ్మూలమే వుంది. 14-15 ఏప్రిల్ 1921న అహ్మదాబాద్‌లో సప్రెస్సెడ్ క్లాసెస్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడుగా ఇచ్చిన ఉపన్యాసంలో గాంధీ చెప్పాడు:-

---

1 ప్రొ. ఎ. ఆర్. వాడియా అనే పార్శి పెద్ద మనిషి చేసే ప్రచారం ఇటువంటి దానికి మరో వుదాహరణ సెన్స్ అండ్ నాన్ సెన్స్ ఇన్ పాలిటిక్స్ అనే శీర్షిక కింద రాస్ట్ రహబార్ 29 అక్టోబర్ 1941 నుంచి 15 ఏప్రిల్ 1945 వరకు బొంబాయి నుంచి ప్రచురించిన ఒక గుజరాత్ వార పత్రికలో వ్యాసపరంపరలో ప్రొఫెసర్. వాడియా అభిప్రాయాలను విమర్శనాత్మకంగా సమీక్షిస్తూ బట్టబయలు చేసారు.

"ఈ ఆలోచన నాకు పన్నెండేళ్లు కూడా లేనప్పుడు వచ్చింది. ఉఖా అనే పాకీవాడు మా ఇంట్లో పాకీ దొడ్డి తుడవడానికి వచ్చేవాడు. వానిని ముట్టుకోడం ఎందుకు తప్పు, వానిని ముట్టుకోడం నిషిద్ధం ఎందుకని చాలా సార్లు మా అమ్మని అడుగుతూ వుంటాను. ఉఖాని పొరపాటున నేను ముట్టుకుంటే నన్ను ప్రక్షాళన చేసుకోమనేవారు. నేను చెప్పినట్లు చేసేవాడ్ని. మతపరంగా అంటరాని తనం నిర్దేశించ బడలేదని అలా చెయ్యడం అసంభవమని నేను నవ్వుతూ అసమ్మతి తెలిపేవాడ్ని. తల్లి తండ్రుల గౌరవానికి అనుకూలంగా వున్నంత వరకూ నేను చాలా నమ్రతగా చెప్పిన పని చేసే పిల్లవాడ్ని. ఈవిషయంలో తల్లి తండ్రులతో నాకు తగవులు జరుగుతూ వుండేవి. ఉఖాని ముట్టుకోడం పాపం అనుకోడం ఆమె తప్పని మా అమ్మకి చెప్పాను.

"బడిలో వున్నప్పుడు చాలా సార్లు అంటరానివారిని ముట్టుకుంటూ వుండేవాడిని. ఈ విషయం నా తల్లి తండ్రులనుంచి ఎప్పుడూ దాచి పెట్టలేదు కాబట్టి పాప ప్రక్షాళనానికి దగ్గర దారిగా దారిన పోయే తురకవాని నిముట్టుకుంటే అంటరానివానిని అంటినందువల్ల వచ్చిన అంటు మరొకరిని ముట్టుకోడం వల్ల ఒకదాన్ని మరొకటి తిప్పికొట్టి రద్దు చేస్తుందని మా అమ్మచెప్పేది. మా అమ్మఅంటే వున్న గౌరవం కొద్దీ తరచు నేనలా చేస్తూ వుండేవాడిని కాని అది మతపరమైన ఆచారంగా ఎప్పుడూ ఆచరించ లేదు. కొంత కాలం తర్వాత మేము పోర్ బందరుకు మకాం మార్చాం. ఇక్కడ నేను మొట్టమొదటి సారిగా సంస్కృతంతో సంపర్కంలోకి వచ్చాను. నన్ను ఇంకా ఇంగ్లీషు బడిలో వేయలేదు. నా సోదరుడ్ని నన్ను ఒక బ్రాహ్మడికి అప్పజెప్పడం అయింది. ఆయన 'రామరక్ష' "విష్ణుపుంజారీ" చెప్పేవారు. 'జలే విష్ణుః'స్థలే విష్ణుః (భగవంతుడు నీళ్ళలో వున్నాడు, భగవంతుడు భూమిలో వున్నాడు) అన్న పవిత్ర పదాలు ఇప్పటికి కూడా నాకు జ్ఞాపకం. తల్లి వంటి ఒక ముసలామె దగ్గరలో నివసిస్తూ వుండేది. నేనప్పుడు చాలా పిరికిగా వుండేవాడ్ని.. దీపాలు ఆరిపోయినప్పుడూ, చీకట్లో దెయ్యాల్ని భూతాల్ని ఊహిస్తూ వుండేవాడ్ని. నా భయం పోగొట్టడానికి నేను భయపడినప్పుడు రామరక్ష పుస్తకం వల్లించాలని ముసలామె చెపుతూండేది. అప్పుడు చెడుభూతాలన్నీ పారిపోతాయి. దానివల్ల మంచి జరిగిందనే ఆలోచనతో నేనట్లానే చేసా. అంటరానివారిని ముట్టుకోటం పాపం అని సూచిస్తూ రామరక్ష పుస్తకంలో ఎక్కడా వున్నట్లు నేననుకోలేదు. అప్పుడుదాని అర్థం నేను అవగాహన చేసుకోలేదు. లేకపోతే అసంపూర్తిగా నేనా అర్థం చేసుకునుండాలి. అన్నిభూతాల్ని నాశనం చెయ్యగల రామరక్ష మీద నాకు నమ్మకం వుందికాని అంటరానివారిని ముట్టుకుంటే వచ్చే భయాన్ని అది ప్రోత్సహిస్తుందని నమ్మను.

"రామాయణాన్ని మా ఇంట్లో రోజూ పారాయణ చేసేవారు. లాధా మహరాజ్ అనే బ్రాహ్మడు దాన్ని చదివేవాడు. ఆయన కుష్టు రోగంతొ బాధపడేవాడు. నిత్యం రామాయణం పారాయణ చేస్తే కుష్టు రోగం కుదురుతుందని ఆయన నమ్మేవాడు. నిజానికి ఆయనకది తగ్గిపోయింది. నాలో నేను అనుకొనే వాణ్ణి "రామాయణంలో ఏవిధంగా"ఇప్పుడు ఎవరైతే అంటరానివాడుగా భావిస్తున్నారో వాడు రాముణ్ణి తన నావలో గంగ మీద తీసుకెళ్ళాడు. అటువంటప్పుడు వారు అపవిత్ర జీవులు కాబట్టి అంటరానివారు అనే అభిప్రాయానికి సమర్థన ఎలా వీలవుతుంది? మనం దేవుణ్ణి పవిత్రుల్ని చేసేవాడు మొదలైన సర్వనామాలతో వర్ణించేటప్పుడు హిందువుగా పుట్టిన ఎవరైనా అపవిత్రుడుగా అంటరానివాడుగా భావించడం

పాపం అవుతుంది. అలా చేయడం మహాపాపిష్టిపని. అది మహాపాపమని పదేపదే చెప్పడానికి నేనెప్పుడూ వెనకాడలేదు. నాకు పన్నెండేళ్ళ వయసప్పుడే ఇది కరడుగట్టిన అభిప్రాయంగా ఏర్పడిందని నేనననుం. కాని అంటరానితనం పాపం అని నేననుకున్నది మాత్రం చెప్పగలను నేనీ కథ వైష్ణవులు సనాతన హిందువులకోసం చెప్తున్నాను.

అంటరాని తనం పాపమని సనాతన కాలంలో అది కూడా పన్నెండేళ్ళ లేత వయసులో గాంధి యోచించటం అనుమానం లేకుండా చాలా ఉత్కంఠ కలిగించే విషయం. అయినప్పటికి ఈ శబ్బర నిర్మూలించడానికి గాంధీ ఏం చేశాడు అని అంటారానివారు తెలుసుకుందామని అనుకుంటున్నారు. టాగోర్ అండ్ కంపెని మద్రాసువారు 1922లో ప్రకటించిన యంగ్ ఇండియాలో గాంధీ జీవిత చరిత్ర గురెంచిన రాసిన నోటు నుంచి ఆయన ప్రజావ్యాసంగం మొదలు పెట్టినప్పటినుంచి చేపట్టిన ముఖ్య కార్యక్రమాలను చూపించడాని ఉటంకిస్తున్నాను. ఆ నోటులో ఇలా వుంది:-

"మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధి అక్టోబరు 2, 1869 జన్మించాడు. కులం బనియా, పోర్‌బందరు, రాజ్‌కోటు తదితర కథియవార్ రాజ్యాలకు దివానైన కరంచంద్ గాంధీ కొడుకు. కథవాడే ఉన్నత పాఠశాలలో చదువుకున్నాడు. తరవాతలండన్ యూనివర్సిటీ ఇన్నర్ టెంపుల్ లోను చదివాడు. లండన్ నుంచి తిరిగివచ్చిన తరువాత బొంబాయి హైకోర్టులో న్యాయవాదిగా పేరు నమోదు చేసుకున్నాడు. న్యాయవర్గం మీద నేటాల్ ఆ తరవాత ట్రాన్స్‌వాల్ వెళ్ళాడు. నేటాల్ సుప్రీమ్ కోర్టులో న్యాయవాదిగా నమోదయ్యాడు. అక్కడ వుండడానికి నిర్ణయించుకున్నాడు. 1894లో నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ స్థాపించాడు. **1985**లో ఇండియాకు తిరిగివచ్చాడు. నేటాల్, ట్రాన్స్‌వాల్ ఇండియన్ల తరపున అలజడి. దర్బాన్‌కు తిరిగి వచ్చాడు. అక్కడ కాలు పెట్టగానే పోకిరి మూకల దాడికి గురై కొంచెంలో చావు తప్పించుకున్నాడు.1899 ఆంగ్లో- బోయర్ యుద్ధంలో ఇండియన్ అంబులెన్స్ కోర్ నడిపాడు. ఆరోగ్యం తిరిగి పొందడానికి 1901లో ఇండియాకి తిరిగి వచ్చాడు. దక్షిణాఫ్రికా ఇండియన్ల సమస్యసను చాంబర్లే ముందర వుంచే ఇండియన్ ప్రతినిధి వర్గం నాయకత్వం వహించడానికి తిరిగి దక్షిణాఫ్రికాకు వచ్చాడు. ట్రాన్స్‌వాల్ సుప్రీం కోర్టులో వకీలుగా పేరు నమోదుచేసుకున్నాడు. ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ ఇండియన్ ఎసోషియేషన్ స్థాపించి దాని గౌరవ కార్యదర్శి, ముఖ్య న్యాయసలహాదారుగాను ఉన్నాడు. 1903లో' ఇండియన్ ఒపీనియన్' 'ఫినిక్స్' సెటిల్ మెంట్ స్థాపించాడు. 1906లో స్థానిక విప్లవంలో స్ట్రెచర్ బేరర్ కోర్‌ను నడిపించాడు. 1906లో ఏంటి ఏషియాటిక్ ఏక్ట్‌కి వ్యతిరేకంగా ఆందోళన. ఆ చట్టం రద్దు చేయడానికి ఇంగ్లాండుకు ప్రతినిధివర్గం. చట్టానికి వ్యతిరేకంగా ప్రతిఘటనోద్యమం (పాసివ్‌రెసిస్టెన్స్) జనరల్ స్మట్స్‌కి గాంధీకి మధ్యన చర్చలు, రాజీ చట్టాన్నిరద్దు చేయడానికి చేసిన వాగ్దానాన్ని స్మట్స్ తరవాత కాదనడం మళ్ళీ ప్రతిఘటనోద్యమం ప్రారంభం. చట్టాన్ని వ్యతిరేకించి నందుకు రెండు సార్లు చెరసాల.ఇండియన్ల సమస్య బ్రిటిష్ ప్రజలముందు వుంచడానికి 1909లో మళ్ళీ ఇంగ్లాండు వెళ్ళాడు. 1911లో తాత్కాలిక ఒప్పందం. గోఖలే దక్షిణాఫ్రికా సందర్శన 1911 ఒప్పందాన్ని ప్రభుత్వం నెరవేర్చక పోవడంతో ప్రతిఘటనోద్యమ పునరుద్ధరణ నిర్వహించాడు. 1914లో ఆఖరి పరిష్కారం, ఇంగ్లాండు సందర్శన. **1914**లో ఒక ఇండియన్ అంబులెన్స్ కోర్‌స్థాపన".

ఈ జీవిత చరిత్ర నోటు నుంచి ఒక విషయం తేట తెల్లం. గాంధీ ప్రజాజీవితం 1894లో నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ స్థాపించినప్పటి నుంచి మొదలయింది. 1894నుంచి 1915 వరకు ఆయన దక్షిణాఫ్రికాలో ఉన్నాడు. ఈ సమయంలో ఆయన అంటరానివారి గురించి ఆలోచించలేదు. కనీసం వారి బాగురించేనా ఆయన విచారించలేదు. 1915లో గాంధీ ఇండియాకు తిరిగి వచ్చాడు అప్పుడు ఆయన అంటరానివారి సమస్య తీసుకున్నారా? మళ్ళీ నన్ను ఆజీవిత చరిత్ర నోటునుంచి తీసి రాయనీయండి అది ఇలా వుంది:-

"1915లో ఇండియాకి తిరిగివచ్చాడు, అహ్మదాబాద్‌లో సత్యాగ్రహ ఆశ్రమం స్థాపించాడు. 1917 చంపరాన్ కార్మిక సమస్యల ఒడంబడిక, కైరాకరువు, 1918లో అహ్మదాబాద్ పరిశ్రమలో సమ్మె, 1918 నియామకాల వుద్యమం (రిక్రూట్‌మెంట్ కాంపెయిన్)లో పాల్గొనెను, 1919లో రౌలట్ చట్టం వ్యతిరేకంగా ఆందోళన సత్యాగ్రహం ఉద్యమం ప్రారంభం, ఢిల్లీ వెడుతోంటే దారిలో కోసీ దగ్గర నిర్బంధించి వెనక్కి బొంబాయి పంపడం, 1919లో పంజాబ్‌లో అశాంతి అధికార రాక్షసకృత్యాలు. పంజాబ్ రాక్షసకృత్యాల గురించి కాంగ్రెస్ విచారణ సంఘం సభ్యుడుగా నియమింప బడెను. ఖిలాఫట్ ఆందోళనలో పాల్గొన్నాడు. 1920లో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం; మే 1921లో లార్డ్ రీడింగ్‌తో ముఖాముఖిచర్చ; 1921 కాంగ్రెస్ సమావేశాలకు కాంగ్రెస్ ఏకైక కార్యనిర్వహకాధికారిగా నియామకం; ఫిబ్రవరి 1922 లో శాసనోల్లంఘనోద్యమ కార్యక్రమం; చౌరీచౌరాదొమ్మి కారణంగా ఫిబ్రవరి 1922లో శాసనోల్లంఘనోద్యమ విరమణ; మార్చి 10, 1922లో నిర్బంధం విచారణ ఆ తర్వాత ఆరేళ్ళ సామాన్య కారాగార శిక్ష.

ఈ నోటు సరైనది కాదని చెప్పక చెపుతోంది. మహాత్మా గాంధీ జీవితంలోని బాగా తెలిసున్న కొన్ని ఘట్టాలను అది విస్మరించింది. దానిని పూర్తి చేయడానికి ఈ క్రింది విషయాలను చేర్చాలి:-

"బ్రిటిష్ సామ్రాజ్యతత్వం నుంచి విముక్తి చేయడానికి 1919లో ఇండియాను అఫ్ఘాన్ ఆక్రమణకు సుముఖతను వెల్లడించాడు. 1920లో బార్డోలాయ్ నిర్మాణాత్మక కృషిపథకాన్ని దేశం ముందుంచాడు; 1921లో దేశం స్వరాజ్యం సాధించడానికి తిలక్ స్వరాజ్ నిధి (ఫండ్) ప్రారంభించి కోటి ఇరవై ఐదు లక్షల రూపాయలు సేకరించాడు."

ఈ ఐదు ఏళ్ళలోను, కాంగ్రెస్‌ను- బ్రిటిష్ సామ్రాజ్యతత్వాన్ని ఎదుర్కొని ఒకఊపు ఊపే యుద్ధ యంత్రంగా సరిపడే ఒక విప్లవ వ్యవస్థగా రూపొందిచడంలో నిమగ్నమైపోయాడు. ముస్లిమ్‌లను కాంగ్రెస్‌లో చేర్చడానికి ఖిలాఫత్ ఉద్యమ హేతువును చేపట్టాడు. ఖిలాఫత్ ఉద్యమానికి హిందువుల అండదండలు సమకూర్చడానికి తను చాలా పాటుపడ్డాడు.

ఈ సమయంలో అంటరాని వారి గురించి గాంధి ఏం చేశాడు? బార్డోలీ పథకం గురించి కాంగ్రెస్ వారు సాధారణంగా చెప్తారనుకోండి. నిజమే బార్డోలాలీ పథకంలో అంటరానివారి అభివృద్ధి ఒక అంశమే. కాని ఇక్కడ ముఖ్యమైన దేమంటే దానికేమైనది అని. కుదించి [1]కథ చెప్పాలంటే బార్డోలీ పథకం అంటరాని తనం నిర్మూలించే పథకం కాదు.

1వివరాలకు అధ్యాయం ii చూడండి

డిస్రేలి నిర్వచించినట్లు పూర్వ వ్యవస్థల ఆధునీకరణల కలగూరగంపైన అభివృద్ధిపథకం. ఈ పథకం అంటరాని తనాన్ని బాహాటంగా గుర్తించి అంటరానివారికి ప్రత్యేక బావులు పాఠశాలలు ఏర్పాటు చెయ్యడం తప్పించి ఈ పథకం యింకేమీ చెయ్యలేదు. పథక రచనకు వుద్దేశించిన ఉపసంఘం అంటరానివారి గురించి ఏవిధమైన ఆసక్తి చూపని సభ్యులతో నిండివుంది. వారిలో కొందరు వీరికి వ్యతిరేకంగా కూడా వున్నారు. అంటరానివారికి ఉపయోగించేదేదైనా చేద్దామని ఉత్సాహం కనబరచిన ఏకైక ఉపసంఘ సభ్యుడు స్వామి శ్రద్ధానంద బలవంతంగా రాజీనామా ఇవ్వవలసి వచ్చింది.

కమిటీ పని నడపడానికి కేటాయించిన నిధులు కూడా అంతంత మాత్రమే. ఒక్క మీటింగు కూడా జరపకుండానే కమిటీ రద్దుచేయబడింది. అంటరానివారి అభివృద్ధిపని హిందూ మహాసభ చేయడానికి బాగా తగిన పనిగా నిర్ణయించడమైంది. బార్డోలీ పథకంలో అంటరాని వారికి సంబంధించిన పనిమీద గాంధీ ఏమీ శ్రద్ధ చూపించలేదు. అంటరానివారికి పెద్దెత్తున ఏ పనిచేయడానికి వారికి యిష్టం లేదని తెలిసి కూడా, స్వామి శ్రద్ధానందని బలపరచడానికి బదులుగా నిరోధకులను, స్వామి శ్రద్ధానంద వ్యతిరేకులను బలపరిచాడు. బార్డోలీ పథకం ప్రకారం 1921లో గాంధీ చేసిందాన్ని గురించి అంతమాత్రం చాలు.

1922 తర్వాత గాంధీ ఏమి చేసాడు? ఇంతక్రితం జీవిత చరిత్రకు సంబంధించిన నోటు తీసిన ప్రచురణ 1922ది. ఈ జీవిత చరిత్రనోటు ఈనాటి వరకు తీసుకురావడానికి ఈ క్రింది చేర్పులు చెయ్యడం అవసరం:-

"1924లో ఖైదు నుంచి విడుదల చేయబడెను. తను లేనప్పుడు విధాన సభప్రవేశం లేక నిర్మాణాత్మక పథకం అన్న వైరుధ్యంపై కొట్లాటకు దిగిన కాంగ్రెస్‌లోని రెండు వర్గాలకు ఒప్పందం కుదిర్చాడు; 1929లో సంపూర్ణస్వరాజ్యం ఇండియా రాజకీయ లక్ష్యంగా చాటాడు. 1930లో శాసనోల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాడు; 1931 లో సర్వపక్ష సమావేశంలో కాంగ్రెస్‌కు ప్రాతినిధ్యం వహించడానికి లండన్ వెళ్ళాడు. 1932 జైలు శిక్ష ఘనత వహించిన సార్వభౌములవారి ప్రభుత్వపు కులమత ప్రాతిపదిక తీర్పు (కమ్యూనల్‌ఎవార్డు)కు వ్యతిరేకంగా ఆమరణ నిరాహారదీక్ష ప్రకటించాడు. పూనాఒప్పందానికి ఒడంబడి తన ప్రాణాన్ని రక్షించుకున్నాడు. 1933లో అంటరానివారి దేవాలయ ప్రవేశానికి ఒక ఉద్యమం రూపొందించాడు. హరిజన సేవక సంఘ్‌ని స్థాపించారు.1944 కాంగ్రెస్ సభ్యత్వం విరమణ; 1942 క్విట్ ఇండియా ఉద్యమ వ్యూహం పన్ని జైలు పాలయ్యాడు; 1934 లార్డ్ వేవెల్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు. 8 ఆగష్టు 1942 తీర్మానం వివరిస్తూ ప్రకటనలు చెయ్యడంలో గడిపెను; 1945 కస్తూరిబా నిధితో తలమునకలు".

అంటరాని తనం నిర్మూలన ఉద్యమం తీవ్రతరం చేయడానికి దానిని మరింత పటిష్టం చేయడానికి 1924 సంవత్సరం గాంధికి మరొక అవకాశం ఇచ్చింది. అప్పుడు గాంధి ఏం చేశాడు?

కాంగ్రెస్ రాజకీయాల చరిత్రలో 1922, 1944 మధ్యనున్న ఏళ్ళు ఒకప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. సహాయ నిరాకరణోద్యమ పథకం సెప్టెంబర్ 1920 కలకత్తాలో ఏర్పాటు

చేసిన ప్రత్యేక సమావేశంలో కాంగ్రెస్ ఆమోదించింది. ఐదు రకాలైన సుప్రసిద్ధ బహిష్కరణలు ఈ కార్యక్రమంలోపొందు పరచబడ్డాయి. విధాన పరిషత్తుల బహిష్కరణ, విదేశీ బట్ట బహిష్కరణ, మొదలైనవి. కొద్ది మంది పేర్లు మాత్రమే మచ్చుకి చెప్పడానికి బిపిన్ చంద్రపాల్, సి.ఆర్.దాస్, లాలా లజపతిరాయ్ వంటి మేధావి వర్గాల నాయకులు వ్యతిరేకించినప్పటికి సహాయ నిరాకరణపైన తీర్మానం ఆమోదించబడింది. ప్రతీ ఏటా పెట్టే కాంగ్రెస్ వార్షిక సమావేశం నాగపూర్‌లో డిసెంబరు 1920లో పెట్టడం జరిగింది. సహాయనిరాకరణ మీద తీర్మానం మళ్ళీ చర్చకు వచ్చింది. వింతగా ఉండవచ్చుగాని అదే ప్రతిపాదన సి.ఆర్.దాస్[1] ప్రతిపాదించగా లాలాలజపతిరాయ్ బలపరచగా ఆమోదించబడింది. పర్యవసానంగా 1921లో సహాయనిరాకరణలు కోకొల్లలు. 19 మార్చి1922న గాంధీ తిరుగుబాటు ప్రబోధించినందుకు విచారణ జరిపాక 6 ఏళ్ళు కారాగార శిక్ష పడింది. వెంటనే గాంధీని జైలు కటకటాల వెనక్కితోసారు. సి.ఆర్.దాస్ కోల్పోయిన తన తుల్యతను తిరిగి పొందినట్లున్నాడు. విధానపరిషత్తుల బహిష్కరణ ఎత్తివేయడానికి ఒక ఉద్యమాన్ని మొదలెట్టాడు. ఈ విషయంలో ఆయనతో విఠల్‌భాయ్ పటేల్, పండిట్ మోతీలాల్ నెహ్రూ, పండిట్ మాలవ్యా కలిసారు. ఈ ప్రతిపాదనకు గాంధీ అనుయాయులు ఎదురు తిరిగారు. కలకత్తా ఆమోదించి నాగపూర్‌లో మరోసారి ఖాయం చేసిన సహాయ నిరాకరణోద్యమ తీర్మానం నుంచి ఒక్క అక్షరం కూడా మార్చడానికి ఒప్పుకోలేదు. 1924 అనారోగ్యకారణంగా గాంధీ కారాగారం నుంచి శిక్షాకాలం పూర్తి కాకుండానే విడుదలయ్యాడు. ఆయన విడుదలయ్యే సరికి విధానసభ బహిష్కరణ విషయం మీద కాంగ్రెస్ రెండు పోరాట వర్గాలుగా చీలిపోడం గాంధి చూసాడు.

ఈ తగవు చాలా కృద్ధమైంది. రెండు వర్గాలు ఒకరి మీద ఒకరు దుమ్మెత్తి పోసుకునేవారు. తగువు అలాగే కొనసాగితే కాంగ్రెసును బలహీనపరుస్తుందని గాంధీకి తెలుసు. సామరస్యం సాధిద్దామనుకోనేవాడు. ఏవర్గంకూడా దిగిరావడానికి ఒప్పుకోడం లేదు. పరస్పర విరుద్ధమైన ప్రకటనలు వచ్చాయి. ఆఖరికి రెండు వర్గాల మధ్య సామరస్యం కుదర్చడానికి గాంధికొన్ని ప్రతిపాదనలు చేశాడు. రెండు వాటిని ఆమోదించాయి. రెండు వర్గాలను సంతృప్తి పరచడమే ఆప్రతిపాదనల ముఖ్యోద్దేశం. విధాన సభ ప్రవేశానికి అనుకూల వర్గాన్ని సంతుష్టిపరచడానికి విధాన సభ ప్రవేశం కాంగ్రెస్ న్యాయసమ్మతమైన కార్యమని గుర్తించాలని సభా ప్రవేశానికి ప్రతికూలురు దీని మీద వ్యతిరేక ప్రచారం చెయ్యడం మానుకోవాలని సూచించాడు. సభ ప్రవేశ వ్యతిరేక వర్గాన్ని సంతృప్తిపరచడానికి కొత్త తరహా వోటు హక్కులను కాంగ్రెసు ఒప్పుకోవాలని గాంధి ఇలా ప్రతిపాదించాడు. (i) నాలుగణాల కాంగ్రెస్ సభ్యత్వం బదులు స్వహస్తంతోవడికిన 2000 గజాల నూలు దారంగా వుండాలి. ఇది చెయ్యనప్పుడు స్వయంకృతాపరాధంగా తన సభ్యత్వాన్ని వదులుకోవలసి వుంటుందని ఒక

1 కాంగ్రెస్ అధికార ఇతిహాస రచయిత పట్టాభి సీతారామయ్య చెప్పినప్పటికి కూడా ఇలా ఉంది: " సి.ఆర్.దాస్ కలకత్తాలో చేసినదాన్ని తారుమారు చేయడానికి తూర్పు బెంగాల్ అస్సాం ల నుంచి 250 మంది ప్రతినిధుల ముఠాని తీసుకు వచ్చాడు. వారి రాక పోకల ఖర్చు భరించాడు. తన జేబునుంచి 36000 రూపాయలు ఖర్చు పెట్టాడు ఆయన మనుషులకు ఆయన వ్యతిరేకి జితేంద్రనాథ్ బెనర్జీ మనుషులకి మధ్యన ఒక చిన్న తగాదాకూడా జరిగింది" కాంగ్రెస్ ఇతిహాసము పేజి 347

అపరాధపు షరతు పెట్టబడింది. (ii) ఐదు బహిష్కరణలు విదేశీ వస్త్రాలు, ప్రభుత్వన్యాయస్థానాలు, పాఠశాలలు కళాశాలలు, బిరుదులు పాటించడం కాంగ్రెస్ వ్యవస్థలో స్థానం పొందడానికి అర్హతగా భావించాలి. ఏ వ్యక్తి అయితే బహిష్కరణ సిద్ధాంతాన్ని నమ్మకుండా తను వ్యక్తిగతంగా పాటించడో అటువంటి వానిని అభ్యర్థిత్వానికి అనర్హుడుగా భావించాలి.

గాంధీకి అంటరానితనం వ్యతిరేకోద్యమం ప్రవచించడానికి ఇక్కడ ఒకమహత్తరమైన అవకాశం వుంది. హిందూగాని కాంగ్రెస్ సభ్యత్వం పొందగోరితే అతడు అంటరానితనాన్ని ఆచరించడం లేదని రుజువు పరచవలసి ఉంటుంది.దానికి తార్కాణంగా అంటరానివానిని ఒకణ్ణి తన ఇంట్లో పనికి పెట్టుకున్నట్లు చూపించడం తప్ప మరే నిదర్శనం చూపడానికి వీల్లేదు. పెద్దకులాల హిందువులు తమ ఇళ్ళల్లో ఒకరిని పనివాళ్ళని పెట్టుకుంటారు కాబట్టి ఇటువంటి నిబంధన ఏమంత అనాచరణీయం కాదు. నూలు వడకడం బహిష్కరణాలను కాంగ్రెస్ సభ్యత్వపు అర్హతలుగా గాంధి హిందువులచేత ఒప్పించినప్పుడు హిందువుల ఇళ్ళలో అంటరానివారిని పనికి పెట్టుకోడం కూడా కాంగ్రెస్ సభ్యత్వానికి అర్హతగా అతడు ఒప్పించగలిగి ఉండేవాడు. కాని గాంధి అదిచేయలేదు.

1924 తర్వాత 1930 వరకు పూర్తిగా ఖాళీవుంది. అంటరాని తనాన్ని నిర్మూలించడానికి ఎటువంటి చర్యలు తీసుకున్నట్లు గాంధి కనిపించడు. ఈకాలంలో అంటరానివారికి పనికి వచ్చే ఏకార్యక్రమంలోను అతను స్వయంగాఆసక్తి చూపించలేదు. గాంధీ స్తబ్దంగా ఉండిపోగా అంటరానివారు సత్యాగ్రహం అనే ఉద్యమాన్ని లేవదీశారు. సార్వజనిక బావుల నుంచి నీళ్ళు తెచ్చుకోడం, మందిర ప్రవేశంపై తమహక్కును ఏర్పాటు చేకోడం దీని ముఖ్యోద్దేశం. బొంబాయి రాష్ట్రంలో కోలాబాజిల్లా మహద్‌లో వున్న చౌదర్ చెరువు దగ్గర జరిగిన సత్యాగ్రహం అంటరాని వారు ప్రజాసరస్సుల నుంచి నీరు తీసుకోడానికితమ హక్కును నిరూపించుకోడానికి ఏర్పాటయింది. బొంబాయి రాష్ట్రంలో నాసిక్ జిల్లా నాసిక్‌లో వున్న కాలారాయ్ మందిరం దగ్గర జరిగిన సత్యాగ్రహం అంటరానివారికి హిందూమందిరాలలో ప్రవేశానికి వున్న హక్కును నిరూపించుకోడానికి నిర్దేశించింది. చిన్న చిన్న సత్యాగ్రహాలు ఇంకా చాలాజరిగాయి. అయితే అంటరానివారి ప్రయత్నాలు వారి ప్రత్యర్థులు కులహిందువుల ప్రయత్నాలన్నీ కేంద్రీకృతమైనవి కాబట్టి ఈ రెండూ ముఖ్యమైనవి. వీటి గడబిడ కోలాహలం, ఇండియా అంతటా వినిపించింది. వేలాది అంటరాని వారి స్త్రీలు పురుషులు ఈ సత్యాగ్రహాలలో పాల్గొన్నారు. అంటరానివారి స్త్రీ, పురుషుల్ని కులహిందువులు అనేక విధాల అవమాన పరిచి హింసించారు. చాలా మందికి దెబ్బలు తగిలాయి. శాంతి భద్రతలకు ముప్పయిందని కొందరిని జైల్లో పెట్టారు. ఈ సత్యాగ్రహం ఉద్యమం ఆరేళ్ళు నడిచింది. నాసిక్ జిల్లా మోలాలో 1935లో జరిగిన సమావేశంలో దీనిని ఆపివేయడం జరిగింది. ఈ సమావేశంలో హిందువు మూర్ఖ పట్టుదల మూలంగా అంటరానివారు హిందూమతం నుంచి బయటికి రావటానికి నిర్ణయించడం జరిగింది. ఈ సత్యాగ్రహోద్యమం అనుమానం లేకుండా కాంగ్రెస్‌కి సంబంధం లేకుండా జరిగింది. అది అంటరానివారిచేత నడపబడింది. అంటరాని నాయకత్వం క్రింద నడిచింది. అంటరానివారి ఆర్థిక వనరులతోనే జరిగింది. అయినప్పటికి అంటరానివారు గాంధీ నైతిక మద్దతు వస్తుందన్న ఆశలేకుండా లేరు. నిజానికి వారికి అది రావడానికి చాలా మంచి కారణం కూడావుంది. ప్రత్యర్థుల హృదయం బాధ ద్వారా కరగించడానికి ఉద్దేసించబడి

బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా స్వరాజ్య సముపార్జనకు కాంగ్రెస్ ప్రయోగించడానికి నాయకత్వం వహించిన గాంధీ ఈ సత్యాగ్రహాన్ని రూపొందించాడు. ప్రజా బావుల్లోంచి నీరు తీసుకోడానికి హిందూ పూజా మందిరాల్లోకి ప్రవేశంపై తమకుగల హక్కును స్థాపించే ఉద్దేశంతో హిందువులకి వ్యతిరేకంగా నడిచినవారి సత్యాగ్రహానికి సహజంగానే అంటరానివారు మద్దతు ఆశించారు. అయినప్పటికీ సత్యాగ్రహానికి గాంధీ తన మద్దతునివ్వలేదు. మద్దతునివ్వక పోవడమే కాకుండా దానిని చాలా కఠిన పదజాలంతో ఖండించారు.

ఈ సందర్భంగా మానవాక్రమాలను నిర్ణించే రెండు నూతనాస్త్రాల గురించి చెప్పవలసి వుంటుంది. వీటిని రూపొందించడానికి క్రమపరచడానికి గాంధీ కీర్తి తెచ్చుకున్నాడు. రాజకీయాధర్మాలను నిర్మూలించడానికి గాంధీ బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చాలాసార్లు సత్యాగ్రహాస్త్రాన్ని ప్రయోగించాడు. అయితే అంటరానివారిని హిందువులకు వ్యతిరేకంగా గాంధీ ఎప్పుడూ ఈ సత్యాగ్రహాస్త్రాన్ని ప్రయోగించలేదు. నిరాహారదీక్ష గాంధీ మరో అస్త్రం. గాంధీచేసినవి 21 నిరాహారదీక్షలున్నాయని చెప్పబడుతోంది. కొన్ని హిందువుల ముస్లిముల సఖ్యతకోసం చేశాడు. ఆయన ఆశ్రమవాసుల దోషపరిహారం కోసం చాలాసార్లు చేశాడంటారు. పట్వర్ధన్ అనే ఖైదీకి ఆయన అడిగినప్పటికి జైలులో పాకీ పని ఇవ్వకుండా ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వుకు వ్యతిరేకంగా చేసిన ఉపవాసం ఒకటి. ఈ 21 ఉపవాసాల్లో ఒక్కటి కూడా అంటరాని తనాన్ని నిర్మూలించడానికి పట్టలేదు. ఇవి చాలా ముఖ్యమైన విషయాలు.

1930లో సర్వసభ్య సమావేశం రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్సు జరిగింది. 1931 లో గాంధీ సమావేశం[1] చర్చల్లో పాల్గొన్నారు. ఇండియా స్వయంపరిపాలన కోసం రాజ్యాంగ రచన చేసే ముఖ్యమైన పనికోసం ఈ సమావేశం ఏర్పాటైంది. ఇండియా స్వయంపరిపాలక దేశం అయితే ఆ ప్రభుత్వం ప్రజల ప్రభుత్వమై, ప్రజల చేత ఎన్నుకోబడి ప్రజలకోసం పరిపాలించాలని ఏకగ్రీవంగా తీర్మానించడమైంది. ఎప్పుడైతే ప్రభుత్వం నిజంగా ప్రజలచేత ఎన్నుకున్నదౌతుందో అప్పుడే అది ప్రజాప్రభుత్వమై ప్రజలకోసం ప్రభుత్వమౌతుందని ప్రతి ఒక్కరు ఒప్పుకున్నారు.

దేశంలో అనేక జాతులు, అధిక సంఖ్యాకులు, అల్పసంఖ్యాకులుగా విభజించబడి సాంఘిక అసమానతలే కాకుండా పరస్పర సాంఘిక వ్యతిరేకతలు కూడా కలిగివున్నప్పుడు ప్రజలచేత ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఎట్లాగా అన్నదే సమస్య. ఈ పరిస్థితుల దృష్ట్యా విధాన సభ, కార్యనిర్వాహణ వర్గాలను కులమత ప్రాతినిధ్యాల ప్రకారం ఏర్పాటు చేస్తే తప్ప ప్రజలచేత ప్రభుత్వం అన్నది ఇండియాలో సాధ్యం కాదన్నది ఒప్పేసుకున్నదే. ఈ సభలో అంటరానివారి సమస్య చాలా జటిలమైంది. అది ఒక కొత్త రూపం ధరించింది. ప్రశ్న ఇది: అంటరానివారిని హిందువులు ఎలావున్నవారిని అలాగే హిందువుల దయాదాక్షిణ్యాలకు వదిలి వేయాలా లేక కుల ప్రాతినిధ్య పద్ధతి మీద వారిని వారు రక్షించుకోడానికి ఒక విధానాన్ని ఏర్పాటు చేయాలా? అంటరానివారు హిందువుల దయాదాక్షిణ్యాలకు వదిలి వేయడాన్ని చాలా గట్టిగా వ్యతిరేకించి మిగిలిన అల్పసంఖ్యాక వర్గాలకు ఇచ్చిన రక్షణలు తమకు కూడా కల్పించాలని కోరారు. అంటరానివారి వాదాన్ని అందరూ అంగీకరించారు. అది సమంజసము తార్కికమైనది. హిందువులకి అంటరానివారికి

1 వివరాలకు చూడు అధ్యాయం iii

మధ్య నున్న వ్యత్యాసంతో పోలిస్తే హిందువులకి ముస్లిములకి, హిందువులకి, సిక్కులకి, హిందువులకి క్రైస్తవులకి మధ్యనున్న తేడా నామమాత్రమేనని వారు వాదించారు. అది అన్నింటికన్న పెద్దది, లోతైనది. హిందువులకి, ముస్లిమ్‌లకి మధ్యనున్న వ్యత్యాసం మతసంబంధమైనది. అది సాంఘికం కాదు. హిందువులకు అంటరానివారి మధ్యనున్నది మతపరమైనది, సాంఘికమైనది కూడా. హిందూ ముస్లిమ్ వ్యత్యాసం వల్ల వచ్చే ప్రతిరోధం ముస్లిమ్‌ల రాజకీయ వినాశనం తేలేదు. ఎందుకంటే హిందువులకి ముస్లిమ్‌లకి మధ్యవున్న సంబంధం యజమాని సేవక సంబంధం కాదు కాబట్టి. అది మిత్ర భేదము వంటిది. దీనికి వ్యతిరేకంగా హిందువులకి అంటరానివారికి మధ్యనున్న తేడా యజమాని సేవకుడి బంధం మీద ఏర్పడింది కాబట్టి అది అంటరానివారి రాజకీయ వినాశనం సూచిస్తుంది. అంటరానివారికి హిందువులకి మధ్యనున్న సాంఘిక ప్రక్రియ ద్వారా అధిగమించడానికి తరతరాలుగా ప్రయత్నాలు జరిగాయని అంటరానివారు వాదించారు. అవన్నీ విఫలమైనాయి. అవి విజయవంతమౌతాయని కూడా ఆశలేదు. అధిక సంఖ్యాక హిందువులకు అధికారం అప్పజెప్పబడబోతోంది కాబట్టి ముస్లిమ్‌లు మిగిలిన అల్పసంఖ్యాక వర్గాల వారికి ఇచ్చిన రాజకీయ రక్షణలకంటే అధికంగా ఇవ్వడానికి వీలు పడకపోతే వారికిచ్చిన రక్షణల వంటివైనా వీరికివ్వాలి.

తన సహాయ సహకారాలు అందించడం అంటరానివారికి తన దయా దాక్షిణ్యాలు చూపించడానికి గాంధీకి ఇది ఒక మంచి అవకాశం. హిందువుల నిరంకుశత్వాన్ని అణచివేతను ఎదుర్కోడానికి ఆ విధంగా వారి శక్తిని ఇనుమడింప చేయవచ్చు. తన సానుభూతి చూపడానికి బదులు గాంధి తనశక్తి కొద్ది వారిని ఓడించడానికి ప్రయత్నించాడు. అంటరానివారిని ఏకాకుల్ని చెయ్యడానికి ముస్లిమ్‌లతో ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. మసల్మానులను తనవైపు తిప్పుకోటంలో విఫలమౌడంతో ముస్లిమ్‌లు ఇతర అల్పసంఖ్యాకవర్గాలకు ఇచ్చిన రాజకీయ రక్షణలను అంటరానివారికి కూడా ఇచ్చిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని వాటిని ఉపసంహరించడానికి బలవంతం చేయడంకోసం అతడు ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించాడు. ఉపవాసం విఫలమై అంటరానివారి రాజకీయ రక్షణలను ఒప్పుకున్న పూనా ఒడంబడిక మీద సంతకం చేయడానికి గాంధీ వంచబడినప్పుడు కాంగ్రెస్ వారిని తప్పుడు ఎన్నికల ఎత్తుగడలను అవలంబించడానికి పురిగొల్పి వారికిచ్చిన రక్షణలను నిష్ఫలం చేయడం ద్వారా తన కక్ష తీర్చుకున్నాడు.

1933 లో గాంధీ రెండు ఉద్యమాలను చేపట్టాడు. మొదటిది దేవాలయ ప్రవేశఉద్యమం.[1] ఈ రెండు కార్యక్రమాల అమలుకు తనే స్వయంగా బాధ్యత వహించాడు. ఒకటి గురవాయూర్ దేవాలయం తెరవడం. రెండవది కేంద్ర విధానమండలిలో రంగయ్యర్ ప్రవేశ పెట్టిన దేవాలయ ప్రవేశ బిల్లు ఆమోదింప చేయడం.

గురవాయూరు దేవాలయం ధర్మకర్త ఫలానా తారీఖు లోపుల దేవాలయాన్ని అంటరాని వారికి తెరవకపోతే గాంధీ తను ఆమరణ నిరాహార దీక్ష పడతానని చెప్పాడు. గురువాయూరు

1 వివరాలకు అధ్యాయం iv చూడు.

గుడి ఇంకా అంటరానివారికి మూసే వుంది కాని గాంధీ మాత్రం నిరాహార దీక్ష పడతానన్న ప్రతిజ్ఞ చెల్లించుకోలేదు. ఆశ్చర్యకరమైంది ఏమిటంటే ఆయన ప్రతిన పట్టి ఇప్పటికి పదమూడేళ్ళైనప్పటికి అంటరాని వారికి దేవాలయం తెరిచి పెట్టడానికి ఇంత వరకూ ఏమీ చేయలేదు. దేవాలయ ప్రవేశబిల్లు ప్రవేశ పెట్టటానికి అనుమతి కోసం గవర్నర్ జనరల్ ని గాంధీ చాలా బలవంతం చేశాడు. ఈ బిల్లును కేంద్ర విధాన పరిషత్తులో ఆమోదించేటట్లు చూడ్డానికి కంకణం కట్టుకున్న కాంగ్రెస్ పార్టీ ఆ బిల్లు హిందువులకు కోపకారణం అవుతుందన్న కారణంగా పరిశీలక సంఘానికి పంపడానికి వచ్చినప్పుడు కాంగ్రెస్ దానిని సమర్థించడానికి నిరాకరించింది. కాంగ్రెస్‌గాని ఆబిల్లును సమర్థిస్తే రాబోయే ఎన్నికలలో హిందువులు కక్ష తీర్చుకోడానికి దానిని ఓడిస్తారని కూడా భయపడింది. రంగయ్యారు మనస్తాపం కలిగేట్లు ఆయన కర్మకు ఆయన్ను వదలి బిల్లు కాలదోషం పట్టడానికి కారకులయ్యారు. గాంధీ దీన్ని పట్టించుకోలేదు. ఆయన కాంగ్రెస్ చేసిన పనిని సమర్థించే వరకుకూడా పోయాడు.

ఇండియా అంతా శాఖలతో 1933లో హరిజన సేవక్ సంఘం[1] స్థాపించడం గాంధీ లేవదీసిన మరొక ఉద్యమం. ఈ సంఘం స్థాపించడానికి వెనక మూడు ప్రేరణలు ఉన్నాయి. అంటరానివారిపట్ల హిందువులకి సరిపడినంత ఉదార స్వభావం వుండి వారి పురోభివృద్ధికి విరివిగా చందాలు ఇవ్వడం ద్వారా ఇది నిరూపించుకోవడం మొదటి ప్రేరణ. దైనందిన జీవితంలో వచ్చే కష్టాలలో ఆదుకొని అంటరానివారికి సేవ చేయడం రెండవ ప్రేరణ రాజకీయ విషయంలో హిందువులనుంచి వేర్పాటు తనం చూపిస్తున్న అంటరాని వారికి వారిపట్ల నమ్మకం కలిగించడం మూడవ ప్రేరణ. ఈ మూడు లక్ష్యాలలో ఏది కూడా నెరవేర లేదు.

ఆరంభ శూరత్వంలో సంఘానికి ఎనిమిది లక్షల రూపాయలు వరకు హిందువులు చందావేసారు. కాని ఇది సాధారణ రాజకీయ ప్రయోజనాల కోసం కోట్ల కొద్దీ రూపాయలు ఇచ్చిన దానితో పోలిస్తే చాలా తక్కువ. దాని తరువాత అవి ఎండిపోయాయి. ప్రభుత్వ గ్రాంట్లమీద, గాంధీ సంతకం అమ్మకాల వల్ల వచ్చిన డబ్బుమీద, అంటరానివారి పట్ల నిజమైన ప్రేమ లేక పోయినా గాంధీని సంతృప్తి పరిస్తే లాభం వుందని భావించే కొందరు భాగ్యవంతులైన వ్యాపారస్తులు సంఘానికిచ్చే చందాల మీద సంఘం ఇప్పుడు తన ఆర్థికసహాయానికి ఆధారపడుతోంది. ప్రతి ఏడాది సంఘ శాఖలు మూత పడుతున్నాయి. ఈ సంఘం ఎంత వేగంతో కుంచించుకు పోతోందంటే కొద్ది కాలంలోనే దాని పరిధంతామాయమై కేంద్ర బిందువు మాత్రం మిగిలి పోతుంది. సంఘ మంటే హిందువులు ఆసక్తి కోల్పోయారన్నది ఒక్కటే ఈ గాంధేయ కార్యక్రమం గురించి విచారించవలసిన అంశం కాదు. ఎవరి బాగుకోసం ఈ సంఘం ప్రారంభించబడిందో ఆ అంటరానివారి సద్భావ సహకారాన్ని కూడా ఈ సంఘం పొందలేక పోయింది. ఇది అనేక కారణాల వల్ల జరిగింది. సంఘం కార్యక్రమం చాలా నిష్ప్రయోజనంగా ఉండిపోయింది. అది ఏ ఒక్కరి కల్పనా శక్తి ని ఆకట్టుకో లేకపోయింది. అది అంటరాని వారి శీఘ్రావసరాలను తీర్చే సహాయ సహకారాలను ఉపేక్షిస్తుంది. నిర్వహణ మండలి నుంచి సంఘం అంటరానివారిని కఠినంగా నిర్బిస్తుంది. అంటరాని వారు బిచ్చగాళ్ళ

1 వివరాలకు అధ్యాయం v చూడు.

కన్నా ఏమీ ఎక్కువ కాదు దానధర్మాలు పట్టే సామాన్యులు. దీని పర్యవసానమేమిటంటే అంటరాని వారు సంఘం గురించి ఏమీ పట్టించుకోరు. కుతంత్ర బుద్ధితో హిందువులు స్థాపించిన బాహ్య వ్యవస్థగా అంటరానివారు దాన్ని చూస్తారు. సంఘాన్ని హిందువులు అంటరాని వారి మధ్య నిజమైన సేతువులా మలిచేందుకు గాంధీకి ఇక్కడ చక్కని అవకాశం వుంది. దాని కార్యక్రమాలను మెరుగు పరచి అంటరానివారిని దాని పనిలో భాగస్వాములు చేయడం ద్వారా ఆయన దానిని శక్తివంతమైన సంస్థగా తీర్చిదిద్దవచ్చు. ఇటువంటివేమి గాంధీ చెయ్యలేదు. సంఘాన్ని ఆయన నీరుకారి పోనిచ్చాడు. అది సొంతంగా చనిపోతుంది. గాంధీ జీవిత కాలంలోనే అది నశించి పోవచ్చు.

గాంధీ అస్పృశ్యతా నివారణోద్యమం, ఆయన వాక్కులు, ఆయన చేతల ఈ సర్వేక్షణ చదువరిని గాభరా చేసి ఆశ్చర్య చకితుణ్ణి చేసినా అంత ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. చదువరి కొంచెం తమాయించి తన అనుమాన నివృత్తి కోసం ఈ క్రింది పొందుపరచిన రీతిలో కొన్ని ప్రశ్నలు అడిగితే ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు:

(1) 1921లో తిలక్ స్వరాజ్ నిధి కోసం గాంధీ 1 కోటి 35 లక్షల రూపాయలు సేకరించారు. అంటరానితనం పోతేనేగాని స్వరాజ్యం సాధించేది లేదని గాంధీపట్టు పట్టారు. అంటరానివారికోసం చాలా కొద్ది మొత్తం, 43000 రూపాయలు మాత్రమే కేటాయించినప్పుడు గాంధీ ఎందుకు నిరసన తెలపలేదు?

(2) 1922లో బార్డోలి నిర్మాణాత్మక కార్యక్రమం తయారయింది. అంటరానివారి అభివృద్ధి అందులో ముఖ్యాంశం వివరాలు తయారు చెయ్యడానికి ఒక సంఘాన్ని వేశారు. ఈ సంఘం ఎప్పుడూ పని చేయలేదు. అది రద్దు చేయడం జరిగింది. అంటరానివారి అభివృద్ధిని నిర్మాణాత్మక పథకంలో ఒక అంశంగా తీసివేయబడింది. సంఘం పని ఖర్చుల నిమిత్తం 500 రూపాయలు మాత్రం కేటాయించారు. కాంగ్రెస్ కార్యనిర్వాహక సంఘం ఈ కమిటీకి చూపిన సవతి తల్లిప్రేమ, బానిస భావానికి వ్యతిరేకంగా గాంధీ తన నిరసన తెలపలేదు. ఎందుకని? ఈ సంఘానికి అధిక నిధుల కేటాయింపుకోసం కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గంలో పోట్లాడుతున్న స్వామి శ్రద్ధానందకు గాంధీ ఎందుకని మద్దతు ఇవ్వలేదు? సంఘం రద్దుకు వ్యతిరేకంగా గాంధీ ఎందుకు నిరసన తెలపలేదు? ఇంకొక సంఘాన్ని గాంధీ ఎందుకు నియమించలేదు? అంటరానివారి కార్యక్రమానికి ఏప్రాముఖ్యం లేదన్నట్లు ఆయన దానిని వదిలి వేయడాన్ని ఎలా అనుమతించారు?

(3) తన స్వరాజ్య ఉద్యమం మొదలు పెట్టీపెట్టగానే స్వరాజ్యసాధనకు ముమ్ముందుగా అయిదు నిబంధనల మీద గాంధీ పట్టు బట్టారు: (i) హిందు-ముస్లిం ఐక్యత; (ii)అస్పృశ్యతా నివారణ, (iii) చేతితో వడికి నేసిన ఖాదీ అందరూ ధరించడం(iv) సంపూర్ణ అహింస. (v) పూర్తి సహాయ నిరాకరణ. గాంధీ ఈ నియమాలను విధించడమే కాకుండా స్వరాజ్య సాధనే వుండదని ఇండియన్లకి స్పష్టంగా చెప్పారు. 1922 లో హిందూ-ముస్లిమ్ ఐక్యత కోసం ఆయన ఉపవాసం చేశారు. 1924 లో కాంగ్రెస్ సభ్యత్వార్హతకి చేతితో వడికిన నూలు తయారు చెయ్యడం విధించారు. 1924 లో కాని ఆ తర్వాత కాని అస్పృశ్యతను పాటించకుండా వుండటం కాంగ్రెస్ సభ్యత్వార్హతగా ఆయన ఎందుకు నిర్ణయించ లేదు?

(4) తనకు చాలా ఇష్టమైన అనేక విషయాలను సాధించడానికి గాంధీ చాలాసార్లు నిరాహార దీక్ష పట్టారు. అంటరానివారి సమస్య గురించి ఒక్కసారైనా ఉపవాసం ఎందుకు చెయ్యలేదు?

(5) స్వరాజ్య సాధనకు తప్పులు సరిదిద్దడానికి గాంధీ సత్యాగ్రహాస్త్రాన్ని రూపొందించారు. హిందువుల చేత బావుల వాడకం, దేవాలయం ఇతర ప్రదేశాలకు ప్రవేశం నిరాకరించబడిన అంటరానివారి తరఫున వారికి ప్రవేశం సాధించడానికి గాంధీ ఒక్క సారైనా హిందువులకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేయలే దెందుకని?

(6) గాంధీ పథం అనుసరిస్తూ 1929 నుంచి బావుల వాడకం దేవాలయ ప్రవేశం కోసం హిందువులకు వ్యతిరేకంగా అంటరాని వారు సత్యాగ్రహం మొదలు పెట్టారు. గాంధీ వారి సత్యాగ్రహాన్ని ఎందుకు నిరసించారు?

(7) జామొరిన్ అంటరాని వారికి గురవాయూరు దేవాలయ ప్రవేశం కల్పించకపోతే తను నిరాహార దీక్ష పడతానని గాంధీ ప్రకటించారు. దేవాలయ ప్రవేశం కల్పించలేదు. గాంధీ ఎందుకని ఉపవాస దీక్ష పట్టలేదు?

(8) 1932లో కేంద్ర శాసన మండలిలో కాంగ్రెస్ పార్టీ తరఫున రంగా అయ్యర్ దేవాలయ ప్రవేశ బిల్లు ప్రవేశ పెట్టడానికి గవర్నరు జనరలు అనుమతించక పోతే తీవ్ర పరిణామాలు వస్తాయని బ్రిటిషు ప్రభుత్వాన్ని గాంధీ బెదిరించారు. కేంద్ర శాసన మండలికి తాజాగా ఎన్నికలు ప్రకటించగానే ఆ బిల్లుకి తమ మద్దతును కాంగ్రెస్ పార్టీ ఉపసంహరించుకోవడంతో రంగఅయ్యర్ దానిని వదులుకోవలసి వచ్చింది. గాంధీకి దేవాలయ ప్రవేశం గురించి నిజాయతీ ఉంటే కాంగ్రెస్‌పార్టీ చర్యను ఆయన ఎందుకు బలపరచారు? ఏది ఎక్కువ ముఖ్యం - అంటరానివారి దేవాలయ ప్రవేశమా లేక కాంగ్రెస్ ఎన్నికలలో గెలవడమా?

(9) అంటరానివారి యిబ్బంది వారికి పౌరహక్కులు లేక పోవడంలో లేదని గాంధీకి తెలుసు. అంటరానివారు వాటిని వినియోగ పరుచుకుంటే తీవ్రపరిణామాలు వస్తాయని బెదిరిస్తూ హిందువులు చేసే కుట్రలోనే వారి యిబ్బంది ఉంది. అంటరానివారికి నిజంగా సహాయం చేసే పద్ధతి యేమంటే వారి పౌరహక్కులు రక్షించడానికి ఒక సంస్థను యేర్పాటు చేయడమే. అంటరాని వారిపై చెయ్యి చేసుకునే హిందువులను, అంటరానివారు తమ పౌర హక్కులను అనుభవించు కోకుండా చేసే హిందువులను శిక్షించడానికి చర్య తీసుకోవడం ఆసంస్థ విధి అయి ఉండాలి. అంటరాని వారికి నిజమైన సహాయం చేయడం అంటే అదే అవుతుంది. గాంధీ హరిజన సేవక సంఘం ధ్యేయాల్లో దీన్ని ఎందుకు చేర్చలేదు?

(10) గాంధీ రంగంలోకి ప్రవేశించక పూర్వం అంటరాని వారి సముద్ధరణకు కులహిందువులు దళిత వర్గ మిషన్ సంఘం ఏర్పాటు చేశారు. దానికి హిందువులుచందా లిచ్చారు. అయినప్పటికి ఆ సొసైటీ వ్యవహారాలు హిందువులు అంటరానివారు సభ్యులుగా ఉన్న సంయుక్త బోర్డులు నిర్వహించేవి. హరిజన సేవకసంఘం నుండి అంటరాని వారిని గాంధీ ఎందుకు వేరు చేశారు?

(11) గాంధీ అంటరానివారి నిజమైన స్నేహితుడైతే వారి రక్షణకు రాజకీయ రక్షణలే సరైన మార్గం అని తేల్చుకోడంకోసం వారికే ఎందుకు వదిలి పెట్టలేదు? కులప్రాతిపదిక తీర్పు ద్వారా అంటరానివారికి లభించే హక్కులు పోగొట్టడానికి గాంధీ ఆమరణ నిరాహార దీక్ష అనే ప్రయోగానికి ఎందుకు తల పడ్డారు?

(12) పూనా ఒడంబడిక ఆమోదించిన తరువాత గాంధీ అంటరానివారికి కేటాయించిన స్థానాలలో హిందువుల చేతిలో కీలు బొమ్మలు కావడానికి సిద్ధపడిన వారినేఎన్నిక చేయడం ద్వారా అంటరానివారి రాజకీయాలను కలుషితం చేయ వద్దని కాంగ్రెసుకు చెప్పడం ద్వారా అంటరాని వారి నమ్మకాన్ని ఎందుకు నిలబెట్టుకోలేదు?

(13) పూనా ఒడంబడిక ఆమోదించిన తరువాత గాంధీ పెద్ద మనుషుల ఒప్పందానికి కట్టుబడి కాంగ్రెసు మంత్రి వర్గాలలో అంటరానివారిని చేర్చుకోవాలని కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి ఎందుకు చెప్పలేదు?

(14) సి.పి. లో కాంగ్రెసు మంత్రి వర్గంలో అగ్నిభోజ్‌ని, ఆయన అను సూచికకులానికి చెందినవారైన ఖరేశ్రీ నియమించడాన్ని గాంధీ ఎందుకు ఆక్షేపించారు? అనుసూచితకులానికి చెందిన వ్యక్తులలో అటువంటి అత్యాశ సృష్టించడానికి తానువ్యతిరేకినని గాంధీ అన్నారా?

## II

గాంధీ యివ్వగల సమాధాన మేముంది? గాంధీ మిత్రులు యివ్వగల సమాధానం యేమిటి? గాంధీ అంటరాని తనంపై చేసిన దండయాత్రలో చాలా మెలికలూ తిరుగుళ్ళూ, పరస్పర విరుద్ధాలూ అసంగతులూ, దాడులూ, లొంగిపోవడాలూ, పురోగమనాలూ, తిరోగమనాలూ ఎన్నో ఉన్న ఫలితంగా మొత్తం దండయాత్ర అర్థంకాని మర్మంలా ఉంటుంది. దాని ప్రయోజనం గురించి అతి తక్కువ మంది నమ్ముతారు. దాని వెనుక నిజాయతీ లేదని చాలామంది అభిప్రాయం. కాబట్టి కొంత వివరణ అవసరం. పాఠకునికి గాంధీ ధ్యేయాలూ పద్ధతులూ స్పష్టంగా అర్థం కావడం కంటె గాంధీకి చిత్తశుద్ధి కలవాడు నిజాయితీ పరుడు అని పేరున్నందుకు ఆపేరు నిల బెట్టుకోడానికైనా గాంధీ, ఆయన మిత్రులూ యింతకు ముందు వేసిన ప్రశ్నలలోని అంశాలకు సమాధానాలివ్వాల్సి ఉంటుంది.

ఈ ప్రశ్నలకు గాంధీ, ఆయన స్నేహితులూ యివ్వగల సమాధానాలు ఆసక్తికరంగా ఉంటాయనడంలో సందేహం లేదు. ఈ ప్రశ్నల్లో ఆసక్తిగల వాళ్ళందరూ సహజంగా వాటికోసం ఎదురు చూస్తుంటారు. ఇతరు లెవరూ సమాధానాలూహించి వ్యవహరించడం చాలదు. వారి పద్ధతిలో వారు సమాధానం రూపొందించడానికి వారికి కావలసినంత వ్యవధి తీసుకోవచ్చు. ఈలోగా అంటరానితనంపై దండయాత్ర గురించి యేమి అనదలచారో ఎవరైనా అడగవచ్చు. అంటరాని తనంపై గాంధీ దండయాత్ర గురించి అంటరాని వారి అభిప్రాయం చెప్పడం కష్టం కాదు.

అంటరానివారు గాంధీ చిత్తశుద్ధితో ఉన్నాడని అనుకుంటారా? సమాధానం వ్యతిరేకంగానే ఉంటుంది. గాంధీ చిత్తశుద్ధితో ప్రవర్తిస్తున్నాడని వారనుకోరు. వాళ్లిలా

అనుకుంటారు? 1921లో దేశం యావత్తునూ బార్డోలీ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికి మేల్కొలిపిన సమయంలో ఆ కార్యక్రమంలో అంటరాని తనవ్యతిరేకతకు సంబంధించిన అంశం పట్ల యేమీ పట్టనట్లున్న గాంధీ చిత్తశుద్ధి కలవాడని వాళ్ళెలా అనుకుంటారు? ఒక కోటి యిరవై అయిదులక్షల రూపాయలు స్వరాజ్య నిధిలో నుండి కేవలం 43 వేల రూపాయలు మాత్రమే అంటరానితన నిర్మూలనకు కేటాయించగా యింత వరకు ఉపేక్షించిన సమస్యపట్ల అంతటి పిసినిగొట్టు వైఖరికి పిసరంతైనా నిరసన తెలపని వానికి చిత్తశుద్ధి ఉందని వారెలా అనుకుంటారు? 1924లో అంటరానితనాన్ని నిర్మూలించాలని హిందువులను శాసించే అధికారమూ అవకాశమూ ఉన్నప్పటికీ ఆవిధంగా చేయని వానికి చిత్తశుద్ధి ఉందని వారెలా అనుకుంటారు? అటువంటి చర్య వలన మూడు ప్రయోజనాలు సమ కూరేవి కాంగ్రెసువారి జాతీయతను పరీక్షించడానికి పనికి వచ్చేది. అంటరానితనాన్ని నిర్మూలించడానికి పనికి వచ్చేది. దానితో గాంధీ అంటరానితనం చెడ్డదనీ, పాపమని హిందూ మతానికి మాయని మచ్చని చెప్పే మాటలు నిజాయితీగా చెప్పినవని ఆయన నిజాయతీ రుజువయ్యేది. గాంధీ ఎందుకు అలా చేయలేదు? గాంధీకి అంటరానితన నిర్మూలన కంటేనూలు వడకడం వ్యాప్తి చేయడానికే ఎక్కువ మక్కువ ఉందని దీని వలన తెలియడం లేదా? గాంధీ కార్యక్రమంలో అంటరాని తనం నిర్మూలన, అణుమాత్ర భాగమనీ ఆఖరి భాగం కూడా కాదనీ దీనివల్ల తెలియడం లేదా? అంటరానితనం హిందూ మతంమీద మచ్చనీ అంటరానితనాన్ని నిర్మూలించకపోతే స్వరాజ్యం లేనే లేదనీ గాంధీ చేసిన ప్రకటనలు పసలేని వట్టి మాటలనీ వాటి వెనుక నిజాయితీ లేదనీ దీనివల్ల తెలియడం లేదా? గురువాయూర్ గుడి తలుపులు అంటరాని. వారికోసం తెరవకపోతే నిరాహార దీక్ష పూనడానికి ప్రతిన చేసి గుడి తలుపులు మూసివుంచినప్పటికీ ఉపవాస దీక్ష పూనని గాంధీ చిత్తశుద్ధిని వారెలా నమ్మగలరు? దేవాలయ ప్రవేశ బిల్లును ప్రవేశపెట్టిన చేసిదాని విరమణలో పాలు పంచుకునే మనిషి చిత్తశుద్ధిని వారెలా నమ్మగలరు? అంటరాని వారికి గుడి తలుపులు తెరిపించేట్లు చేయడానికి అన్ని విధాలా ప్రయత్నం చేయ వలసి ఉండగా అంటరానివారిని రానివ్వని గుడిలో తాను ప్రవేశించనని ప్రకటన చేయడంతో సంతృప్తి పడే మనిషి నిజాయితీని వారెలా నమ్మగలరు? ప్రతి సమస్యా పరిష్కారం కోసం నిరాహార దీక్షపూనడానికి సిద్ధంగా ఉంటూ అంటరానివారి కోర్కెల సాధన కోసం ఉపవాసంచేయని మనిషి నిజాయితీని వారెలా నమ్మగలరు? ప్రతిదాని కోసం ప్రతి వారికి వ్యతిరేకంగా సత్యాగ్రహం చేయడానికి తయారవుతూ అంటరానివారి కోసం హిందువులకు వ్యతిరేకంగా సత్యాగ్రహం చేయని మనిషి చిత్తశుద్ధిని వారెలా నమ్మగలరు? అంటరానితనం ఎంత పాపిష్టిదో అంటూ ధర్మపన్నాలు చెప్పడంతప్ప మరేమి చెయ్యని మనిషి చిత్తశుద్ధిని వాళ్ళెలా నమ్మాలి?

వారు గాంధీ నిజాయితీపరుడనీ నమ్మకస్తుడనీ అనుకుంటున్నారా? దానికి సమాధానంగా వారు గాంధీ నిజాయతీని, అమాయకత్వాన్నీ నమ్మడం లేదనే చెప్పాల్సి వస్తుంది. గాంధీ స్వరాజ్యోద్యమ ప్రచారం మొదట్లో అంటరాని వారిని బ్రిటిషు వారికి మద్దత్తు యివ్వవద్దన్నారు. వారు క్రైస్తవ మతంలో గాని మరేయితర మతంలో గాని చేరవద్దన్నారు. హిందూమతంలోనే వారికి ముక్తి దొరుకుతుందని చెప్పారు. స్వరాజ్యానికి అత్యవసరమైన ముందు షరతుగా అంటరానితనాన్ని నిర్మూలించాలని హిందువులకు చెప్పారు. అయినా 1921లో తిలక్ స్వరాజ్యనిధి నుండి వారి ప్రయోజనం కోసం చాలా తక్కువ ధనాన్ని కేటాయించినపుడుగాని,

అంటరానివారి సముద్ధరణ కోసం ప్రణాళిక రచించడానికి ఏర్పడిన కమిటీని అర్ధాంతరంగా రద్దు చేసినపుడు గాని నిరసనగా గాంధీ ఒక్కమాట కూడా చెప్పలేదు.

గాంధీ దగ్గర తిలక్ స్వరాజ్య నిధికి చెందిన 1 కోటి 25 లక్షల రూపాయలుండేవి. అంటరానివారి సముద్ధరణ కోసం సమృద్ధిగా నిధులు కేటాయించాలని గాంధీ ఎందుకు పట్టు పట్టలేదు? గాంధీ అంటరానివారి సమస్యపట్ల పూర్తిగా ఉపేక్షతో ఉన్నారనడంలో సందేహం యేమీ లేదు. తన ఉపేక్షాభావానికి గాంధీ యిచ్చిన వివరణే ఆశ్చర్యకరంగా ఉంది. తాను స్వరాజ్య సంపాదనకు ఉద్యమ నిర్మాణంలో నిమగ్నుడై ఉండడం చేత అంటరానివారి సమస్యలు పట్టించుకోడానికి కాలం మిగలలేదన్నారు. ఈ వివరణ గాంధీ బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కలేదు కాని అంటరానివారి సమస్యపట్ల తన ఉపేక్షాభావానికి నైతిక సమర్ధన యిచ్చుకున్నారు. అంటరానివారి సమస్యలు విడిచి మొత్తం ఇండియా రాజకీయ సమస్యకే పూర్తిగా అంకితమై పోవటంతో యేమీ తప్పులేదనే వైఖరి అవలంబించారు. దీనికి కారణం యిది:- మొత్తం ప్రజాశ్రేయస్సులో అందులో ఒకభాగమైన వారి శ్రేయస్సు కూడా యిమిడి ఉందన్నారు. అంతేకాక హిందువులే బ్రిటిషు వారికి బానిసలు కనుక బానిసలు బానిసలకి స్వేచ్ఛ ప్రసాదించలేరన్నారు. 'బానిసలకు బానిసలు' 'మొత్తంలో భాగంగా చేరి ఉంది అనే పాటల పొందిక మెచ్చుకోడానికి వీలైన తర్కంగా కనిపిస్తాయి. అయినా వాటిలో నిజం దేశ సంపద పెరిగింది కాబట్టి ప్రతి ఒక్కరీ సంపద పెరిగింది'. అనే సిద్ధాంతంలో ఉన్నంత నిజమే ఉంది. కాని యిక్కడ మనం గాంధీ తర్కశాస్త్ర ప్రావీణ్యత గురించి ఆలోచించడం లేదు. ఆయన నిజాయతీని పరీక్షిస్తున్నాం. బాధ్యతను సాకు చెప్పి తప్పించుకుని తృప్తిపడే మనిషి నిజాయతీని నమ్మగలమా? గాంధీ అంటరానివారి ఉద్ధారకుడు అని వారు నమ్మగలరా?

అంటరానివారికి, ముస్లిములకు, సిక్కులకు రాజ్యాంగ రక్షణలు కల్పించే విషయంలో ఆయన వైఖరి విశ్లేషించినట్లయితే గాంధీ నిజాయితీపరుడని, చిత్తశుద్ధికలవాడని వారు ఎలా అనుకోగలరు?

రాజ్యాంగబద్ధమైన రక్షణలు కల్పించే విషయంలో అనుసూచిత కులాలకు అల్పసంఖ్యాకులకు మధ్య భేదము చూపించడాన్ని మరోవాదంతో సమర్ధించేవారు. ముస్లిములను సిక్కులను గుర్తించడానికి చారిత్రక కారణాలున్నాయనీ అందుచేత గుర్తించక తప్పదం లేదనేదే ఈ వాదన. ఆ కారణాలు ఏమిటో ఆయన ఎప్పుడూ వివరించలేదు. పాతకాలంలో పాలకవంశాలకు చెందినవారు అనే కారణం తప్ప మరొకటి కాదు. గాంధీ అటువంటి అవివేకపు, అప్రజాస్వామిక వాదనలకు లొంగకుండా అన్నిరకాల అల్పసంఖ్యాకులను సమానంగా చూస్తానని తర్కవిరుద్ధమైన, అప్రస్తుతమైన వాదనలకు విలువ యివ్వననీ గట్టిగా చెప్పి ఉండవలసింది. అయినా లొంగిపోయారు. ఫరవాలేదు. ప్రశ్న యిది: అటువంటి వాదనను అంగీకరించడం వల్ల ఏవిధంగా గాంధీ అనుసూచిత కులాల కోర్కెను వ్యతిరేకించగలరు? చారిత్రక కారణాలకు తప్ప తాను మరే కారణానికీ బద్ధుడుకాడని గాంధీ ఎందుకనుకున్నారు? ముస్లిముల విషయంలోనూ సిక్కుల విషయంలోనూ చారిత్రక కారణాలు నిర్ణయాన్ని రూపొందించగలిగితే అంటరానివారి విషయంలో నైతిక కారణాలు నిర్ణయాన్ని రూపొందించగలవని గాంధీ ఎందుకనుకోలేదు? అసలు విషయమేమిటంటే చారిత్రక కారణాలు అనే వాదన బూటక వాదన. అది వాదనే కాదు, అంటరానివారి కోర్కెలను మన్నించక పోవడానికి అదొక సాకు మాత్రమే.

అధిక సంఖ్యాకులు అల్పసంఖ్యాకులు మధ్య సమస్యను ఆయన ఎదుర్కొన్నప్పుడు గాంధీ ఎన్నడూ లేనంతగా విసుక్కున్నారు. దానిని మరచిపోడంకాని, ఉపేక్షచేయడంకాని ఆయనకు యిష్టం. కాని పరిస్థితులు ఆయనను మరచిపోనియ్యవు, ఉపేక్ష చెయ్యనియ్యవు. ఆ సమస్యతో ఆయన తలపడవలసిందే. ఇంతకు ముందు అంటే 21 అక్టోబరు 1939 నాడు హరిజన్‌పత్రికలో "అధిక సంఖ్యాకులు అనే కట్టుకథ" శీర్షిక క్రింద సంపాదకీయం రాస్తూ దీనిని చర్చించారు. ఆ వ్యాసం నిండా విషమే. ఈ ప్రశ్నను తరచు వేసే వారిని పరిహసించడానికి ఆయన వెనుకాడలేదు. ఆ వ్యాసంలో ఆయన ముస్లిములు అల్పసంఖ్యాకులనేది గట్టిగా నిరాకరించారు. సిక్కులు అల్పసంఖ్యాకులనేది ఒప్పుకోలేదు. భారతీయ క్రైస్తవులు అల్పసంఖ్యాకులనేది అంగీకరించలేదు. 'దళిత జాతులు' అనే సాంకేతికార్థంలో వారు అల్పసంఖ్యాకులు కారని సంఖ్యార్థంలో మాత్రమే వారు అల్పసంఖ్యాకులంటే వారసలే అల్పసంఖ్యాకులు కారనీ ఆయన వాదన. వారు అల్పసంఖ్యాకులనే వాదనను ఆయన కాదనగలరా? గాంధీ గారి సొంత మాటలచే నన్ను ఉటంకించనీయండి. గాంధీ అన్నారు:-

"భారతదేశం స్వతంత్రం అయితే వారి హక్కులకు ప్రమాదం వాటిల్లిన వారే అల్పసంఖ్యాకులు అనే అర్థంలో నిజమైన అల్పసంఖ్యాకులు లేరని చెప్పడానికి ప్రయత్నించాను. దళితవర్గాలను మినహాయిస్తే, తమను తాము రక్షించుకోలేని అల్పసంఖ్యాకులెవరూ లేరు."

హిందూ సమాజపు అధిక సంఖ్యాకులు పాలించే స్వతంత్ర భారత దేశంలో తమను తాము రక్షించుకోలేరనే నిజమైన అర్థంలో అనుసూచితకులాల వారు అల్పసంఖ్యాకులని గాంధీ అంగీకరించారు. లోలోపల ఇంతగట్టి విశ్వాసం ఉన్నప్పటికీ అంటరానివారికి రాజకీయ రక్షణలు యివ్వకూడదని గట్టిగా పట్టుదల వహించారు. అటువంటి మనిషిని నిజాయితీ పరుడిగా చిత్తశుద్ధి కలవానిగా అంటరానివారు ఎలా అంగీకరించగలరు?

అఖిలపక్ష సమావేశం (రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్సు) లో అంటరానివారి రాజకీయ రక్షణల కోర్కెను గాంధీ వ్యతిరేకించారు. అంటరానివారి లక్ష్యాన్ని వమ్ము చేయడానికి ఆయన చేయగలిగిందంతా చేశారు. వారి వాదనలోని బలాన్ని తగ్గించి వారిని వేరుచేయడానికి, ముస్లిముల పద్నాలుగు కోర్కెల్ని అంగీకరించడం ద్వారా ముస్లిములను బుట్టలో వేసుకోడానికి ప్రయత్నించారు. అల్పసంఖ్యాకుల ఉపకమిటి సమావేశంలో గాంధీ అన్నారు, "కమిటీ అనుమతిస్తే అంటరానివారి కోర్కెను వ్యతిరేకించడానికి నేనెవర్ని?" కమిటీ నిర్ణయాన్ని వమ్ముచేయడానికి ముస్లిములు అంటరానివారి కోర్కెకు మద్దతును ఉపసంహరిస్తే జిన్నా రూపొందించిన పద్నాలుగు అంశాలను పూర్తిగా బలపరచడానికి బేరం పెట్టడంలో గాంధీ తప్పుచేశారు!! అతని పన్నాగం చాలాచమత్కారమైనది. ముసల్మానులకు ఆయన చాల కష్టమైన ఎంపిక సమస్య పెట్టారు. వారికి 14 అంశాలు కావాలంటే అంటరానివారి కోర్కెకు తమ మద్దతు ఉపసంహరించాలి, అంటరానివారి కోర్కెను బలపరిస్తే వారి 14 అంశాలను వదులుకోవాలి. చివరకు గాంధీ పన్నాగం విఫలమయింది. ముసల్మానులు వారి 14అంశాలు పోగొట్టుకొన లేదు; అంటరానివారు పరాజయం పొందనూలేదు. కాని యీ ఉదంతం గాంధీ నమ్మకద్రోహానికి సాక్ష్యంగా మిగిలి పోతుంది. చేసిన వాగ్దానాన్ని భంగం చేయడానికి నేరప్రోత్సాహకాన్నిచ్చిన మనిషి ప్రవర్తనను, స్నేహితుడా అని పిలచి వెన్నుపోటు పొడవడానికి 'నమ్మకద్రోహం' అనే పదాన్ని మించిన సూటీముంది? అటువంటి మనిషిని అంటరాని వారు నిజాయితీ పరుడనీ నిష్కపటుడనీ ఎలా అనగలరు?

గాంధీ కుల మత సమస్య కమ్యూనల్ క్వొశ్చన్‌కు పరిష్కారాన్ని బ్రిటిష్ ప్రధానమంత్రి మధ్యవర్తిత్వానికి వదలి పెట్టారు అంటరాని వారిని ఓడించడానికి గాంధీ ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ సార్వభౌముల ప్రభుత్వం అంటరానివారి రాజకీయ కోర్కెలను అంగీకరించింది. మధ్యవర్తి నిర్ణయానికి గాంధీ కట్టుబడి ఉండితీరాలి. కాని గాంధీ దాన్ని ధిక్కరించారు, ఆమరణ నిరాహారదీక్ష పట్టడంద్వారా దాన్ని తిరస్కరించారు. గాంధీ తన ఆమరణ నిరాహార దీక్ష ద్వారా భారతదేశాన్ని, బయట ప్రపంచాన్ని కదిలించారు. క్రొత్త రాజ్యాంగం కింద అంటరానివారికి రక్షణలు యివ్వాలని బ్రిటిష్ ప్రధానమంత్రి యిచ్చిన తీర్పును బలవంతంగా ఉపసంహరించేట్లు చేయడమే. ఆ నిరాహారదీక్ష లక్ష్యం గాంధీ శిష్యులలో ఒకరు ఆ ఉపవాసాన్ని ఇతిహాసంగా అభివర్ణించారు. దానిని ఎందుకు ఇతిహాసంగా వర్ణించాలో అర్థం చేసుకోడం సులభంకాదు. అందులో వీరోచితం యేమీలేదు. అది వీరత్వానికి వ్యతిరేకం. అది దుష్ట సాహసము, (తెగింపు,బరితెగింపు). అంటరానివారూ బ్రిటిషు ప్రభుత్వమూ ఆమరణ నిరాహారదీక్ష బెదిరింపుతో వణికి పోయి తన కోర్కె ముందు లొంగిపోతారని గాంధీ నమ్మడంచేతనే ఉపవాసం ఆరంభించారు. ఇరువురు ఆయన బుకాయింపు బండారాన్ని బయటపెట్టడానికి సిద్ధపడ్డారు, నిజానికి బయట పెట్టారు కూడా.

గాంధీ తన టక్కుటమారం శ్రుతి మించిందని గ్రహించగానే ఆయన శూరత్వము మాయమయింది. అంటరానివారికిచ్చిన రక్షణలు పూర్తిగా ఉపసంహరించి హక్కులు, లేకుండా గుర్తింపు లేకుండా నిస్సహాయ స్థితిలోకి నెట్టివేసే వరకు ఆమరణ నిరాహారదీక్ష వహిస్తానని ప్రారంభించిన మనిషి దీనంగా" నా ప్రాణం మీ చేతుల్లో ఉంది, నన్ను రక్షించరా?" అని మొర పెట్టుకున్నారు. పూనా ఒడంబడిక ప్రధానమంత్రి తీర్పును ఆయన కోరినట్లు రద్దుచేయకుండా మరొక రకమైన రాజ్యాంగ రక్షణలు యిస్తున్నప్పటికీ గాంధీ పూనా ఒడంబడిక మీద సంతకం చేయడానికి ఆతురత చూపడం ఆ శూరుడు తన ధైర్యాన్ని కోల్పోయాడనీ తన పరువునీ ప్రాణాన్నీ కాపాడుకోడానికి ఆతుర పడుతున్నాడనడానికి బలమైన సాక్ష్యం.

ఆ ఉపవాసంలో ఘనత యేమీ లేదు. అది అసహ్యమైన, రోత పుట్టించే చర్య. ఆ ఉపవాసం అంటరాని వారి మేలుకోసం కాదు. అది వారికి వ్యతిరేకంగా జరిగింది. ప్రధానమంత్రి తీర్పు ప్రకారం వారి చేతికి వచ్చిన రాజ్యాంగ రక్షణల్ని వదులుకుని హిందువుల దయా దాక్షిణ్యాల మీద బ్రతకడానికి ఒప్పుకోవాలని, నిస్సహాయుల మీద అతిదుష్ట రూపంలో ప్రయోగించిన బలాత్కారమది. అది నీచమైన పాపిష్టి చర్య. రాజకీయ రక్షణలు అంటరానివారికి హానికరమని గాంధీ నిష్కపటంగా నమ్మారని ప్రజలంటారు. కాని అంటరానివారి రాజకీయ కోర్కెలను ఎదిరించిన మనిషి, వారిని ఓడించడానికి ముస్లిములను ఉపయోగించడానికి సిద్ధపడినవాడు, ఆమరణ నిరాహార దీక్ష పూనిన వాడు అటువంటి నిజాయితీ పరుడు నిష్కపటి అయినవాడు చివరకు వ్యతిరేకించి లాభంలేదని, వ్యతిరేకత ఫలించదని తెలిసిన మీదట–ఎందుకంటే పూనా ఒప్పందానికి కులమత తీర్పుకి మధ్య తేడా యేమీలేదు-అవే కోర్కెలను, ఆ నిజాయితీ పరుడు, నిష్కపటి వాటివల్ల యేమీ హానిలేదని ఎలా అంగీకరించగలిగారు?

అంటరానివారు గాంధీని హితునిగా స్నేహితునిగా చూడగలరా? దానికి సమాధానం వ్యతిరేకమే. వాళ్లు ఆయన్ని స్నేహితునిగా చూడలేరు. ఎలా చూడగలరు? అంటరానివారి సమస్య సామాజిక సమస్య అని గాంధీ నిజంగానే నమ్ముతూ ఉండవచ్చు. వారు ఆయన్ను

తమ స్నేహితునిగా ఎలా భావించగలరు? కులం చెక్కుచెదరకుండా ఉంచుతూనే అంటరానితనాన్ని నిర్మూలిద్దామనుకుంటున్నారు. అంటరానితనం కులానికి తోకలాంటాదనీ, కులం నశించనిదే అంటరానితనం పోదనేది సుస్పష్టం కాగా ఆయనను స్నేహితునిగా ఎలాచూడగలరు? సామాజిక ప్రక్రియల ద్వారానే అంటరానివారి సమస్యలను పరిష్కరించ వచ్చునని గాంధీ నిష్కపటంగా నమ్ముతూఉండవచ్చు. రాజకీయ ప్రక్రియలు సామాజిక ప్రక్రియల ఫలితాలను ఏ మాత్రం వమ్ముచేయక పోగా సమస్య పరిష్కారాన్ని త్వరిత పరచడానికి ఉపయోగిస్తాయని అందరూ అంగీకరిస్తుండగా రాజకీయ ప్రక్రియల పట్ల అతి మూర్ఖవైరముతో పిచ్చిగా ఎదిరిస్తున్న మనిషిని వారెలా స్నేహితుడనుకోగలరు? రాజ్యంలోని అంటరానివారు రాజకీయ అధికార పదవులలో ఉండడంలో నమ్మకం లేనప్పుడు ఆయనను తమ స్నేహితునిగా వారెలా పరిగణిస్తారు? రాజకీయ రక్షణల గురించిన వివాదంలో గాంధీ ఈ దిగువ తెలిపిన మార్గాలలో దేన్నయినా అనుసరించ వుండి వుండేవారు. అంటరానివారి పరిరక్షకుడిగా నిలచి ఉండాల్సింది. అంటరానివారు రక్షణలుకోరే వరకు ఆగకుండా తసంతట తాను వాటిని ప్రతిపాదించి వుండాల్సింది. కనీసంవారు కోరినప్పుడైనా వాటిని అంగీకరించి వుండాల్సింది. వాటిని ఆయన ప్రతిపాదించడమే కాక వాటి కోసం పోరాడాల్సిఉంది. నిజమైన పరిరక్షకునికి, వారు అంటరానివారి రాజ్యంలో శాసన సభ్యులుగా, కార్యనిర్వాహకవర్గ మంత్రులుగా యితర ఉన్నత పదవుల నాక్రమించేటట్లు చేసే నిబంధనలు చూసినప్పుడు కలిగే ఆనందం కంటే ఎక్కువ ఆనందం మరెలా కలుగుతుంది? నిశ్చయంగా గాంధీ అంటరానివారి పరిరక్షకుడైతే అటువంటి నిబంధనల కోసమే ఆయన పోరాడ వలసింది. రెండవది. అంటరానివారి పరిరక్షకుడుగా ఆయన ఉండదలచుకోక వారి స్నేహితుడుగానైనా ఉండాల్సింది. తన నైతిక, భౌతిక మద్దతుతో వారికి సహాయం చేసి వుండాల్సింది. మూడవది పాత్ర నిర్వహించడం యిష్టం లేకపోతే, తరువాత ఆయన చేయాల్సింది అంటరానివారి పట్ల సానుభూతి ప్రకటనలకు అనుగుణంగా వారి స్నేహితుడుగానైనా వుండి తీరాల్సింది-- అంటే పోరాటానికి నిరాకరించినా వారి రక్షణ కోసం కోర్కెలను ఆమోదించేలా చేయించడానికి అన్నివిధాలా సహాయం చేయడానికి సిద్ధంగా ఉండాల్సింది. సహాయక తటస్థత కాకపోతే ఖచ్చితమైన తటస్థత అవలంబించి అఖిల పక్ష సభ యివ్వడానికి సిద్ధంగా వుంటే రక్షణలను ఆమోదింప చేసుకోండి నేను సహాయమూ చేయను అడ్డంగా నిలబడను అని అంటరానివారికి చెప్పి వుండాల్సింది. ఈ నిదానమైన ఆలోచనల్ని విడచిపెట్టి గాంధీ అంటరానివారి శత్రువుగా బాహాటంగా బయటికి వచ్చారు. అంటరానివారు అటువంటి మనిషిని తమ స్నేహితునిగానూ, హితునిగాను ఎలా [illegible]గలరు

## III

గాంధీ అంటరానితన వ్యతిరేక ప్రచారోద్యమం విఫల మయిందనడం వితండవాదానికి అతీతమయింది. కాంగ్రెసు పత్రికలు సైతం దీన్ని ఒప్పుకున్నాయి. వాటిలో కొన్నింటి నేను ఉటంకిస్తాను.

17 ఆగష్టు 1939 నాడు బొంబాయి శాసనసభలో అనుసూచిత కులానికి చెందిన సభ్యుడు . బి.కె. గైక్వాడ్ బొంబాయి రాష్ట్రంలో 1932 అంటే గాంధీ దేవాలయప్రవేశ ఉద్యమం ప్రారంభించిన నాటి నుంచి ఎన్ని దేవాలయాలు అంటరానివారి కోసం తెరచి

ఉంచారని ప్రశ్నవేశారు. కాంగ్రెసు మంత్రి యిచ్చిన అంకెల ప్రకారం తెరచి ఉంచిన దేవాలయాల మొత్తం సంఖ్య 142 వాటిలో 121 దేవాలయాలు దారి ప్రక్కన ఉన్నవి, వాటికి యజమానిలేడు, వాటిని ఎవరూ చూడడంలేదు, వాటిని ఆరాధనా స్థలాలుగా ఎవరూ ఉపయోగించడంలేదు. ఇంకొక విషయం బయటపడింది. గుజరాత్‌లో గాంధీ సొంత జిల్లాలో ఒక్కదేవాలయం కూడా అంటరానివారికి తెరవలేదు.

10 మార్చి 1940 నాడు గాంధీ గుజరాతీ పత్రిక అయిన హరిజన బంధు యిలావ్రాసింది:

" పాఠశాలల్లో ప్రవేశానికి సంబంధించి హరిజనుల అంటరానితనం గుజరాతులో కొనసాగుతున్నంత మరెక్కడా జరగడం లేదు."[1]

బాంబే క్రానికల్ 27 ఆగష్టు 1940 తేదీగల పత్రికలో హరిజన సేవక్ సంఘ్ యొక్క నెలవారీ ఉత్తరంలో కొంత భాగం ప్రచురించింది. అదిలా ఉంది:

"అహమ్మదాబాదు జిల్లాలో గోధావికి చెందిన హరిజనులు వారి పిల్లలను స్థానిక బోర్డు పాఠశాలకు పంపినందుకు కుల హిందువులు వారిని హింసించిన ఫలితంగా తుదకు 42 హరిజన కుటుంబాలు ఆ ప్రాంతం వదలి సానంద్ తాలూకా పట్టణానికి వలస వెళ్లారు"

27 ఆగష్టు 1943 తేదీనాడు బొంబాయి రాష్ట్రంలో ఠాణాలో నివశిస్తున్న అంటరానివారి నాయకుడూ ఠాణా మునిసిపాలిటీ ఉపాధ్యక్షుడూ అయిన .ఎం.ఎం.నందాగాంవ్‌కర్‌కు ఒక హిందూ హోటలులో టీ యివ్వం పొమ్మన్నారు. బొంబాయి క్రానికల్ ఈ సంఘటన మీద తన 28 ఆగష్టు 1943 లో యిలా రాసింది.

"1932లో గాంధీజీ ఉపవాస దీక్ష పూనినపుడు గబాగబా కొన్ని దేవాలయాలను హోటళ్లను హరిజన ప్రవేశానికి తెరచి వుంచాలని తహతహ పడ్డారు. దేవాలయ ప్రవేశానికి హోటళ్ల ప్రవేశానికి సంబంధించి యిప్పుడు జరుగుతున్న పరిస్థితి యించుమించు పూర్వంలాగే వుంది. అయినా చాలా మంది అంటరానితనం వ్యతిరేక కార్యకర్తలు ఈ ప్రతిబంధకాల పట్ల తృప్తి పడిపోతున్న వైఖరి అవలంబిస్తూ ప్రాపకం యిచ్చే ధోరణిలో 'హరిజనోద్ధరణ మొదట జరగడం' గురించి ప్రస్తావిస్తూ హరిజనులు మొదట పరిశుభ్రంగా ఉండడం ఎప్పుడు నేర్చుకుంటే వారి పౌర ప్రతిబంధకాలు వాటంతటవే తొలగి పోతాయంటున్నారు. ఇది కంపుకొట్టే అసందర్భ ప్రలాపం."

జనవరి 1944లో కాన్పూరులో జరిగిన అఖిల భారత అనుసూచిత కూలాల ఫెడరేషన్ సమావేశాల గురించి 4 ఫిబ్రవరి 1944 తేదీన వ్రాస్తూ బొంబాయి క్రానికల్ యిలా అన్నది:

"హిందూ సమాజం యింకా జడత్వంతో ఉండడం వల్ల కులమూ అంటరాని తనమూ చెక్కు చెదరకుండా నిలచిపోయాయి. కానీ, చాలమంది హిందూ నాయకులు..... స్వార్థపరులైన కొంతమంది బ్రిటిషు వారి ప్రచారం వల్ల తప్పుదారిన పడిహిందూ సంస్కృతే యింకా నిలచి

1. సంజనా విరచిత "సెన్స్ అండ్ నాన్ సెన్స్ యిన్ పాలిటిక్స్" నుండి ఉటంకించబడినది.

వున్నందు కుల వ్యవస్థలో యేదో కనరాని సుగుణం ఉందని యింకా వాదిస్తున్నారు. సుగుణమే లేకపోతే శతాబ్దాల ఆఘాతాలను తట్టుకొని వుండేది కాదని వారు వాదిస్తున్నారు. గాంధీజీ, యితర సంస్కర్తలు పనిచేసినప్పటికీ, అంటరానితనం ఆగకుండా కొనసాగుతూనే వుంది. గ్రామాలలో విలయతాండవం చేస్తోంది. బొంబాయివంటి నగరంలో కూడా వూడ్చేవాడు పాకీవాడు ఎంత పరిశుభ్రంగా దుస్తులు ధరించినప్పటికీ కుల హిందూ రెస్టారెంటులో కనీసం ఇరానీ రెస్టారెంటులోకి కూడా టీ తాగడానికి రానివ్వరు."

గాంధీ అంటరానితన విరోధ ప్రచారం విఫలమయిందని అంటరానివారెప్పుడూ అంటారు. 25 సంవత్సరాల శ్రమ తరువాత హోటళ్లు మూసేవున్నాయి, నూతులు మూసే వున్నాయి, దేవాలయాలు మూసే వున్నాయి, భారతదేశంలో ముఖ్యంగా గుజరాతులో - పాఠశాలలు కూడా మూసివున్నాయి.

కాబట్టి వివిధ పత్రికల నుండి యింత వరకు పేర్కొన్న భాగాలు ఛాలా ఆహ్వానించదగిన సాక్ష్యాలు, ఎందుకంటే ఆ పత్రికలు కాంగ్రెసు పత్రికలు. ఈ అంశం మీద అంటరానివారు చెబుతూ వచ్చిన విషయాన్నే వారు బలపరచారు. కనుక యింక చెప్పవలసిందేమీ లేదు, ఒక ప్రశ్నవేయడం తప్ప.

గాంధీ ఎందుకు విఫలమయ్యారు? నా అభిప్రాయం ప్రకారం ఆయన విఫలమవడానికి మూడు కారణాలున్నాయి.

మొదటికారణం అంటరానితనాన్ని తీసివేయాలని ఆయన ఏ హిందువులకైతే విజ్ఞప్తి చేశారో ఆ హిందువులు స్పందించలేదు. ఎందుకలా జరిగింది? ఒక మనిషి ఉపయోగించే మాటలకు వాటి ప్రభావాలకూ తగిన నిష్పత్తి ఉండదనేది సాధారణ అనుభవం. అతడు చెప్పే ధోరణి గురించి వినేవాని మీదపడే మంచి ముద్రను లేక చెడు ముద్ర బట్టి అతడు చెప్పేమాటలు అనేక రెట్లు ప్రభావం కలుగ చేయడమో లేక యేమీ ప్రభావం లేక నశించడమో జరుగుతుంది. గాంధీ బోధనలు హిందువుల్ని ఎందుకు కదిలించలేక పోయాయి? ప్రార్థన తరువాత చేసే బోధల్ని కాస్సేపు విని తరువాత హాస్య సంగీత నాటకాలకు పోతారో అంతకంటె ఎక్కువ ప్రభావం దానికి ఎందుకు లేదో తెలుసుకోవడానికి అది ఆధారం అవుతుంది. తప్పు పూర్తిగా హిందూ ప్రజలదే కాదు. తప్పు గాంధీదే. గాంధీ కీర్తి మహాత్మగానూ, రాజకీయ స్వేచ్ఛకు అగ్రదూతగాను నిర్మాణం అయిందికాని ఆధ్యాత్మిక నాయకునిగా మాత్రం కాదు. గాంధీ ఉద్దేశాలు యేమైనా ఆయన్ని స్వరాజ్య కార్యకర్త గానే ప్రజలు చూశారు. ఆయన అంటరానితన వ్యతిరేకోద్యమాన్ని కేవలం ఒక వేల వెర్రి (ఫ్యాడ్) గానూ ప్రక్క ప్రదర్శనగాను చూశారు. అందుకనే హిందువులు అతడిచ్చిన రాజకీయ పిలుపు అంటే స్పందించారు గాని సామాజిక మత పరమైన ఉపదేశాలను ఎప్పుడూ లెక్కచేయలేదు. అందుకని ఆయన అంటరానితన వ్యతిరేకోద్య వేగగతి మందమై శూన్యమైపోయింది. గాంధీ రాజకీయ చెప్పులను మాత్రమే తయారు చేసేవాడు. ఆపనిలోనే ఉండిపోవలసింది. సామాజిక సమస్యలను పరిష్కరించ గలననిఆయన అనుకున్నారు. అదొక పొరపాటు. రాజకీయ నాయకుడు ఆపనికి తగడు. గాంధీ బోధనలు పని చేస్తాయని అంటరానివారికి చూపిన ఆశలు విఫలమయ్యాయి.

రెండవ కారణం గాంధీ అంటరానితన వ్యతిరేక కార్యక్రమ విజయానికి హిందువులతో ఎరోధం పెట్టుకోవడం అవసరమైనా ఆయన హిందువులతో విరోధం పెట్టుకోదలచుకో లేదు, కొన్ని ఉదాహరణలు గాంధీ మనస్తత్వానికి అద్దం పడతాయి. అంటరానివారి కోసం గాంధీ నిజాయతీని నిష్కాపట్యాన్ని ఆయన స్నేహితులు మెచ్చుకుని గాంధీ ఒక్కడే అంటరాని తన నిర్మూలన యొక్క అవసరం గురించి హిందువులకు నిరంతరం బోధిస్తారు కాబట్టి అయన నిజాయితీని అంటరానివారు నమ్మాలను కుంటారు. ఒక టన్ను బోధన కంటె ఒక ఔన్సు ఆచరణ మేలు అనే సామెతను వారు మరచారు. అంటరానితనం నిర్మూలించడం అవసరం అని హిందువులకు ప్రచారం చేయడం కంటె దాని గురించి సత్యాగ్రహోద్యమం గాని ఉపవాస దీక్షగాని అడగలేక పోయారు. అటువంటి వివరణ కోసం వారు అడిగి వుంటే గాంధీ ఎందుకు అంటరానితనం మీద వట్టి బోధనలతో సంతృప్తి చెందుతారో తెలిసిపోయేది. బోధనలు దాటి గాంధీ ఎందుకు వెళ్లరో మొట్టమొదటిసారిగా[1] 1929లో అంటరానివారికి అర్థమయింది. అంటరానివారు దేవాలయ ప్రవేశం చేయడానికీ, ఉమ్మడి బావులనుండి నీరు తెచ్చుకోడానికీ పౌరహక్కులకోసం హిందువుల మీద అంటరానివారు సత్యాగ్రహం చేసినపుడు సత్యాగ్రహం అన్యాయాలను సరిచేయడానికి గాంధీ ఉపయోగించే ఆయుధమే కాబట్టి గాంధీ ఆశీర్వచనాలు లభిస్తాయని వారు ఆశించారు. మద్దతుకోసం గాంధీని ప్రాధేయపడగా హిందువులకు వ్యతిరేకంగా సత్యాగ్రహాన్ని వాడినందుకు గర్హించారు. దానితో వారు ఆశ్చర్యంలో మునిగి పోయారు. గాంధీ చెప్పిన వాదన చాలా చతురతతో కూడి వుంది. సత్యాగ్రహం పరదేశీయులకు వ్యతిరేకంగా మాత్రమే వాడాలని ఆయన చెప్పారు; తమ సజాతీయుల మీద గాని తమదేశీయుల మీదగాని వాడకూడదు, అంటరానివారికి హిందువులు సజాతీయులు దేశీయులు కనుక సత్యాగ్రహ నియమాల ప్రకారం హిందువుల మీద సత్యాగ్రహాయుధాన్ని ప్రయోగించ కూడదన్నారు!!

అమోఘం నుండి హాస్యాస్పదం వరకు యేమి పతనము! దీని మూలంగా గాంధీ సత్యాగ్రహాన్ని అర్థం కాని మాటగా తయారు చేశారు. గాంధీ ఎందుకిలా చేశారు? హిందువులకు ఆగ్రహం చికాకు కలిగించడానికి ఆయన కిష్టంలేదు కనుకనే అలాచేశారు.

రెండవ సాక్ష్యంగా కవిత సంఘటన చెబుతాను. కవిత గుజరాతులోని అహమ్మదాబాదు జిల్లాలో ఒక గ్రామం. 1935లో ఆ గ్రామంలోని అంటరానివారు ఆ గ్రామ పాఠశాలకు హిందువుల పిల్లలతో పాటు తమ పిల్లల్ని కూడా రానివ్వాలని హిందువుల్ని కోరారు. ఈ 'ఘోరచర్య'కు హిందువులు ఆగ్రహావేశంతో పూర్తిగా సామాజిక వెలిని ప్రకటించారు. ఈ బహిష్కరణకు సంబంధించి జోక్యం చేసుకోవాలని కవితా వెళ్లిన .ఎ.వి. ఠక్కర్ నివేదించారు. ఆయన కథ యిలా ఉంది:-

"10 వ తేదీనాడు ఎసోసియేటెడ్ ప్రెస్ కవితలోని కుల హిందువులు హరిజన బాలురను కవితా గ్రామ పాఠశాలలోకి చేర్చుకోడానికి అంగీకరించారనీ సుహృద్భావంతో వ్యవహారం పరిష్కారం అయిందనీ ప్రకటించింది. 13వ తేదీనాడు అహ్మదాబాదు హరిజన

1 1924 లో వైకోం దగ్గర తిరువాన్కూరులో పబ్లికరోడ్డు అంటరానివారికి అనుమతించాలని జరిపిన సత్యాగ్రహంలో సత్యాగ్రహులకు సిక్కులు ఒక వంటశాలను ప్రారంభిస్తే గాంధీ అభ్యంతరం తెలిపాడు అప్పుడు గాంధీ చెప్పిన కారణం అంత బాహాటంగా లేదు.

సేవక సంఘ కార్యదర్శి దీనిని ఒక ప్రకటనలో **ఖండించా**రు. హరిజనులు తమ పిల్లలను ఆ బడికి పంపకూడదని (**లోపాయికారీగా మూజువాణీగా**) అంగీకరించారని ఆయన చెప్పారు. ఆ అంగీకారం యిష్టంతో తమంతటతాముగా **యివ్వ**లేదు. కుల హిందువులు ఆ గ్రామంలో గరాసియాలు బీద హరిజనుల్ని -- నేతపనివారు, **చర్మ**కారకులు సుమారు వంద కుటుంబాల వార్ని సాంఘిక బహిష్కరణతో బెదిరించారు. **ఆ** కుటుంబాల వారికి వ్యవసాయ కూలీ దొరకలేదు, వారి పశువుల్ని బీళ్లలో మేయకుండా చేశారు, వారి పిల్లలకి మజ్జిగ లేకుండా చేశారు. అంతేకాదు యిక ముందెప్పుడూ వారి పిల్లల్ని మళ్లీ బడిలో చేర్పించడానిని ఆయనా యితరులూ ప్రయత్నించబోరని మహాదేవునిమీద హరిజన నాయకుని చేత ఒట్టుపెట్టించారు. పరిష్కారం అయిందన్నది ఆ రకంగా అయింది.

"కాని 10వ తారీకున నివేదించిన బూటకం పరిష్కారం జరిగి హరిజనులు పూర్తిగా లొంగిపోయిన తరవాత కూడా 19వ తారీకు వరకు బహిష్కారం తొలగించలేదు. నేత పనివారికి 22 వరకు తొలగించలేదు. చర్మకారులకు సంబంధించి అంతకు ముందే తొలగించారు. దానికి కారణం వాళ్ల చచ్చిన జంతువుల పీనుగుల్ని వాళ్లు తీసిపారేయలేక గరాసియాలు చర్మకారులతో అంతకు ముందే సమాధాన పడ్డారు. చేసిన దుర్మార్గపు పనులు చాలదన్నట్లు హరిజనుల నూతిలో 15వ తేదీన ఒకసారి, మళ్లీ 19వ తేదీన కిరసనాయిలు పోశారు. ఆ బీద హరిజనులు యువరాజుల్లాంటి గరాసియా పిల్లలతో సమంగా తమ పిల్లల్ని కూర్చోపెట్టడానికి పంపినందుకు వారిమీద ఎంత భయంకరమైన ఘాతుకానికి ఒడిగట్టారో ఊహించవచ్చు.

"నేను గరాసియాల నాయకులతో 22వ తేదీ ఉదయం మాట్లాడాను. ధేడ్ల పిల్లలూ చమార్ల పిల్లలూ తమ సొంత పిల్లల సరసన కూర్చోవడం అనే భావాన్నే వారు సహించలేరని చెప్పారు. నేను 23న తేదీనాడు పరిస్థితి చక్కపరుస్తారేమోననే ఆశతో అహమ్మదాబాదు జిల్లా మేజిస్ట్రేటును కలిశాను కాని ఫలితం లేకపోయింది.

"ఆ విధంగా హరిజన బాలురు గ్రామ పాఠశాల నుండి నిషేదించ బడ్డారు. అయినా వారికి ఎవరూ సహాయం చేయలేదు. దీని వల్ల హరిజనులు నిరాశ చెంది అందరూ కలిసి వేరే గ్రామానికి వలస పోదామనుకుంటున్నారు."

ఈ నివేదిక గాంధీకి సమర్పించ బడింది. గాంధీ యేమి చేశారు? కవిత గ్రామహరిజనులకు ఈ క్రింద పేర్కొనబడిన సలహాను గాంధీ [1] యిచ్చారు.

"స్వయం సహాయంలాంటి సహాయమే లేదు. తమకు తాము సహాయంచేసుకునే వారికి దేవుడు సహాయం చేస్తాడు. కవిత గ్రామధూళిని దులిపేస్కోవాలని (అంటే ఆ గ్రామం విడిచి పోవాలని) హరిజనులు తీసుకున్న నిర్ణయాన్ని అమలు జరిపితే వారు ఆనందంగా ఉండడమే కాక ఆ విధంగా చూడబడిన వారికి మార్గం చూపించిన వారవుతారు. ఉద్యోగం కోసం జనం వలస పోతున్నపుడు, ఆత్మగౌరవాన్ని వెతుక్కోడానికి మరెంతగా వలస పోవాలి?

---

1 హరిజన్, 5 అక్టోబర్, 1935

నిరాదరణ చూపించిన కవిత గ్రామాన్ని విడిచే బీద కుటుంబాలకు హరిజన శ్రేయోభిలాషులు సహాయం చేస్తారని ఆశిస్తున్నాను."

అంటరానివారు కవిత గ్రామాన్ని ఖాళీచేయాలని వారికి సలహాయిచ్చారు. కాని కవిత గ్రామ హిందువులను శిక్షింప చేసి హరిజనుల హక్కులను నిలబెట్టాలని శ్రీ థక్కర్‌కు ఎందుకు సలహా యివ్వలేదు? ఆయన అంటరానివారిని ఉద్ధరించడానికి వీలైతే ఉద్ధరిస్తారు గాని హిందువులకు ఆగ్రహం తెప్పించి మట్టుకు కాదనేది స్పష్టం. అలాంటి మనిషి అంటరానివారి అభ్యుదయానికి ఏం చెయ్యగలడు? హిందువుల పట్ల మంచిగా వుండాలని గాంధీ ఆతృతగా ఉన్నారని యిదంతా స్పష్టం చేస్తోంది. అందుకే ఆయన హిందువులకు వ్యతిరేకంగా చేసే సత్యాగ్రహాన్ని వ్యతిరేకిస్తున్నారు. అంటరానివారి రాజకీయ కోర్కెల్ని అందుకే ఆయన వ్యతిరేకిస్తున్నారు. ఆ కోర్కెలు హిందువులకు వ్యతిరేకంగా ఉద్దేశించినవని ఆయన నమ్ముతున్నాడు కనుకనే అంటరానివారి రాజకీయ కోర్కెల్ని వ్యతిరేకిస్తున్నారు. ఆయన హిందువుల పట్ల మంచిగా ఉండాలని ఎంత ఆతృతగా ఉన్నారంటే అ మంచి అంటరానివారి పట్ల నిష్ప్రజనం అయినా ఆయన లెక్కచేయరు. అందుకని అంటరానితనం నిర్మూలించడానికి గాంధీ కార్యక్రమం కేవలం మాటలు, మాటలు, మాటలు. అందుకనే వాటి వెనుక కార్యశీలత లేదు.

మూడవ కారణం అంటరానివారు సంఘటితులై బలం పుంజుకోవడం గాంధీ కోరడం లేదు. అలా వారు బలవంతులై హిందువులను వదిలి స్వతంత్రులై హిందువుల గౌరవస్థానాన్ని బలహీన పరుస్తారేమోనని ఆయన భయం. ఇది హరిజన సేవక సంఘం యొక్క కార్యకలాపాల ద్వారా తేట తెల్లం చేయవచ్చును. తమ హిందూ యజమానుల పట్ల అంటరానివారిలో బానిస మనస్తత్వం సృష్టించడమే ఆ సంఘం యొక్క సంపూర్ణ ధ్యేయం. సంఘాన్ని ఏ కోణం నుంచి పరీక్షించినా దాని ప్రధానోద్దేశం బానిస మనస్తత్వం సృష్టించడమే అని స్పష్టంగా కనిపిస్తుంది.

సంఘం కార్యక్రమాలు భాగవత పురాణంలో (ఇది భారతానికి తోక లాంటి గ్రంథం) వర్ణించిన రాక్షసి పూతన జ్ఞాపకం వచ్చేలా చేస్తున్నాయి. కృష్ణుడి చేతిలో తనకు చావు రాసి పెట్టుందని ఆకాశవాణి చెప్పగా మధుర రాజు కంసుడు కృష్ణున్ని చంపాలను కుంటాడు. కృష్ణుడు పుట్టాడని తెలిసిన కంసుడు శిశువుగా ఉన్న కృష్ణున్ని చంపాలని పూతనను పంపిస్తాడు. పూతన అందమైన సుందరి రూపం ధరించి కృష్ణుడి పెంపుడు తల్లి యశోద దగ్గరకు వెళ్లి అంతకుముందే తన స్తనాలకు విషం పూసుకోని కృష్ణుడుకి పాలదాదిగా పని యివ్వాలని కోరుతుంది. అలా అయితే కృష్ణున్ని చంపడానికి అవకాశం దొరుకుతుందను కుంటుంది. తక్కిన కథ చెప్పడం అనవసరం. ఇందులో ముఖ్యాంశం యేమిటంటే పైకి చెప్పే ఉద్దేశమే అసలు ఉద్దేశం ఎల్లప్పుడూ కానక్కరలేదని, పాలదాది హంతకి కావచ్చునని. పూతన కృష్ణునికి ఎలాంటిదో అంటరానివారికి సంఘం అలాంటిది. సంఘం సేవ చేస్తాననే మిషతో అంటరాని వారిలో స్వాతంత్ర్యోత్సాహాన్ని చంపడానికి బయలుదేరింది. అంటరానివారు వారి ఆందోళన తొలి రోజులలో సహృదయులైన హిందువుల నాయకత్వం యొక్క అసరా తీసుకున్నారు. సర్వ పక్ష సమావేశం(రౌండు టేబుల్ కాన్ఫరెన్సు) కాలం నాటికి అంటరాని వారు పూర్తిగా స్వావలంబకులు, స్వతంత్రులు అయినారు. ఇక వారు హిందువుల దయా దాక్షిణ్యాలతో సంతృప్తి చెందరు. వారు తమ హక్కుగా చెప్పేదే కోరాదు. అంటరానివారిలో స్వతంత్ర్య

భావనోత్సాహాన్ని చంపేయడానికే గాంధీ హరిజన సేవక సంఘాన్ని ప్రారంభిచారనడంలో సందేహం లేదు. హరిజన సేవక సంఘం కొన్ని అల్ప సేవలు చేసి కృతజ్ఞులైన అంటరానివారి గుంపును చేర దీసింది. గాంధీ, హిందువులు అంటరాని వారి రక్షకులని వారిచేత ప్రచారం చేయించారు. డానియల్ ఓకానెల్ అనే ఐరిష్ నాయకుడు ఒకప్పుడిలా చెప్పారు. తన ఆత్మగౌరవం కోల్పోయేటంత కృతజ్ఞతతో ఏ మగాడు వుండలేదు. తన శీలాన్ని పోగొట్టుకొనేటంత కృతజ్ఞతతో ఏ స్త్రీ కూడా వుండలేదు. ఏ దేశమూ తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయేటంత కృతజ్ఞతతో ఉండలేదు. అంటరానివారు అమాయకులు వారు ఎంత అమాయకులంటే హరిజన సేవక్ సంఘ్ చేసే సేవ ఖరీదు అంటరానివారి స్వతంత్రమేనని గ్రహించ లేనంత అమాయకులు. గాంధీకి సరిగ్గా యిదే కావాలి.

హరిజన సేవక సంఘం నిర్వహించే హాస్టళ్ళలో అంటరాని విద్యార్థులకు ఆ సంఘం చేసే సహాయం దాని కార్యకలాపాలలోని అతి దుష్టమైన భాగం. ఈ అంటరాని విద్యార్థులు మహాభారతం లోని భీష్ముడు, కచుడు అనే ఇద్దరు ముఖ్యమైన పాత్రల్ని నాకు గుర్తుకు తెస్తున్నారు. పాండవుల పక్షాన న్యాయం వుందనీ కౌరవులది అన్యాయం అనీ భీష్ముడు గొప్పగా ప్రకటిస్తాడు. అయినా యుద్ధం చేశాడు. ఆయన ప్రవర్తనను సమర్ధించుకోవాలని అడిగినప్పుడు కౌరవుల తిండి తిన్నందుకు వారి తరఫున యద్ధం చేశానని చెప్పడానికి సిగ్గుపడలేదు. కచుడు దేవతలకు చెందిన వాడు. దేవతలకు రాక్షసులకు మధ్య యుద్ధం జరిగించి. రాక్షసుల గురువుకి మృత సంజీవని అనే మంత్రం తెలియడం చేత చనిపోయిన రాక్షసుల్ని మళ్ళీ బ్రతికిస్తూండేవాడు. దేవతల గురువుకి ఆ మంత్రం తెలియక పోవడంవల్ల చనిపోయిన దేవతల్ని బ్రతికించ జాలనందువల్ల దేవతలు ఓడి పోయేవారు. దేవతలు ఒక పధకం వేశారు ఎలాగైనా ఆ మంత్రం నేర్చుకుని తిరిగి రావలసిందని కచుణ్ణి రాక్షస గురువు దగ్గరకు పంపారు. మొదట్లో కచుడు నెగ్గలేదు. చివరకు రాక్షస గురువు కూతురైన దేవయానితో ఆమె తనకు మంత్రం అబ్బేటట్లు సహాయం చేస్తే ఆమెని పెళ్లి చేసుకుంటానని ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఒప్పందంలో దేవయాని తన వంతు పని పూర్తిచేసింది. కాని కచుడు ఒప్పందం ప్రకారం తాను చేయాల్సినది చేయడానికి నిరాకరిస్తూ ఆమె కిచ్చిన మాటకంటె తనజాతి శ్రేయస్సు ఎక్కువ ముఖ్యము అన్నాడు.

నా అభిప్రాయంలో కచుడు, భీష్ముడు యిద్దరూ నైతికంగా దిగ జారిన పాత్రలే. తాత్కాలికంగా తమ స్వార్థ ప్రయోజనాలు చూసుకోవడం కంటె మరే ధ్యేయామూలేని వారు కనుక నైతికంగా దిగజారిన పాత్రలంటాను. హరిజన వసతి గృహాలలోని విద్యార్థులు భీష్మునిలాగా కచునిలాగా కూడా ప్రవర్తించారు. వారు వసతి గృహాలలో వున్నంత కాలం గాంధీనీ కాంగ్రెసునూ తెగపొగుడ్తూ భీష్మపాత్ర నిర్వహిస్తారు వసతిగృహాల నుంచి బయటికి వచ్చిన తరువాత గాంధీని కాంగ్రెస్‌ను తెగడుతూ కచునిపాత్ర నిర్వహిస్తారు. ఇది చూసి నాకు చాల బాధ కలుగుతుంది. ఈ నైతిక పతనం కంటే అధమమైనదేమీ అంటరానివారికి సంభవించదు. అంటరానివారికి ఆయన హరిజన సేవక సంఘం చేసిన గొప్ప అపకారం యిది. అదివారి శీలాన్ని ధ్వంసం చేసింది. ఇలాగే జరగాలని గాంధీ వాంఛించారు.

నాలుగవ ఉదాహరణ తీసుకోండి: సంఘము కుల హిందువులు నడుపుతున్నారు. ఆ సంస్థను అంటరానివారికి అప్పగించాలనీ అంటరానివారే దానిని నిర్వహించాలనీ అడిగిన అంటరానివారున్నారు. పరిపాలనా బోర్డులో అంటరానివారి ప్రాతినిధ్యం ఉండాలని మరికొందరు

కోరారు. ఈరెండింటిలో ఏదీ చేయనని గాంధీ నిర్మొగమాటంగా చెప్పారు. దానికి గాంధీ చెప్పిన కారణాలను మించిన కారణాలను ఎంతటి జిత్తులమారి వాడుకూడా చెప్పలేడు. గాంధీ చెప్పిన మొదటి వాదనయిలా వుంది. హిందువులు అంటరాని తనం పాటించిన పాపానికి పరిహారంగా శిక్ష అనుభవించవలసి ఉంది. కాబట్టి శిక్ష అనుభవించ వలసింది హిందువులు అందుచేత సంఘ్‌ని నడపడంలో అంటరానివారికి స్థానంలేదు. రెండవ వాదనగా గాంధీ తాను వసూలు చెసిన ధనం యిచ్చినవారు హిందువులేగాని అంటరానివారు యివ్వలేదు కాబట్టి పరిపాలనాసంస్థలో అంటరానివారుండడానికి హక్కులేదు. గాంధీ నిరాకరంచడం సహించవచ్చును గాని ఆయన వాదనలు చాల అవమానకరంగా వున్నాయి, మర్యాదస్తుడైన అంటరానివారెవరైనా సంఘంతో తెగతెంపులు చేసుకుంటే క్షమించాలి. హరిజన సేవక సంఘం ఒక ధర్మకర్తల సంస్థనీ హరిజనులు దాని క్రింద లబ్ధిదారులనీ (ట్రస్టు)ఎవరైనా అనుకుంటారు. న్యాయశాస్త్రం ఎరిగిన ఏ ముగ్గురుని అడిగినా ఒప్పుకుంటారు, ధర్మసంస్థ యొక్క ధ్యేయాలు ఉద్దేశాలు, నిధులూ ఉద్దేశాలు సరిగా నెరవేర్చారో లేదో తెలుసుకునే సర్వహక్కులు లబ్ధిదారులకుంది. నమ్మక ద్రోహం చేసిన ఏధర్మకర్తనైనా తొలగించే హక్కుసైతం లబ్ధిదారులకుంది. ఈ ప్రాతిపదిక మీద నిర్వహణ బోర్డులో అంటరానివారికి ప్రాతినిధ్యం వుండాలనే కోరికను నిరాకరించడం అసాధ్యం. కోరికను కాదనడానికి వీల్లేదు. ఈ పరిస్థితిని అంగీకరించాలని గాంధీకి లేదు. ఆత్మగౌరవం గల అంటరానివాడు నక్కవినయాలు చేయడం యిష్టంలేనివాడు, క్రొత్తవాళ్ల దయాళుత్వం ముందు అంటరానివారి భవిష్యత్తును పణంగా ఒడ్డడంలో నమ్మకం లేనివాడు గాంధీతో పేచీపెట్టుకోడు. అతడిలా అనడానికి సిద్ధపడతాడు, నీచత్వమే సుగుణం అయితే గాంధీ తర్కం అమోఘం దాని వల్ల వచ్చేలాభాన్ని ఆయన్నే పొందనీయండి. అయితే అంటరానివారు సంఘాన్ని బహిష్కరిస్తే వాళ్లని ఆయన నిందించకూడదు. అంతే.

అంటరానివారిని సంఘాన్ని నిర్వహించు కోనీయక పోవడానికి అసలు కారణాలు కానేరవు. అసలు కారణాలు వేరే వున్నాయి. మొదటిది సంఘాన్ని అంటరానివారికి అప్పగిస్తే గాంధీకి కాంగ్రెస్‌కి అంటరానివారిని అదుపుచేసే సాధనం వుండదు. అంటరానివారు హిందువుల మీద ఆధారపడడం మానేస్తారు. రెండవది అంటరానివారు స్వతంత్రులైన తరువాత హిందువులకు కృతజ్ఞులై వుండడం ఆగిపోతుంది. గాంధీ సంఘాన్ని స్థాపించిన ధ్యేయాలకు ఉద్దేశాలకు యీ పర్యవసానాలుంటాయి. అతడు అంటరానివారిలో మిషన్ కాంపౌండ్ మనస్తత్వాన్ని సృష్టిద్దామనుకుంటున్నాడు. అందుకనే గాంధీ సంఘం మీద నియంత్రణ సంఘ నిర్వహణ అంటరానివారికి అప్పచెప్పదలచుకోవడం లేదు. అంటరానివారిని దాస్యవిముక్తి చేయాలనే నిష్కల్మషమైన కోరికకి దీనికి ఎక్కడైనా పొంతన వుందా? గాంధీని అంటరానివారి దాస్యవిమోచకుడు అనడానికి వీలవుతుందా ? అంటరానివారిని హిందువుల క్రింద దాస్యం నుండి విముక్తుల్ని చేయడంలో కంటే హిందువుల కొంగుకు కట్టేయడానికి ఉచ్చులు బిగించడానికే గాంధీకి ఎక్కువ ఆతృత ఉందని దీనివల్ల తెలియడంలేదా?

ఈ కారణాలవల్ల గాంధీ అంటరానితనవ్యతిరేకోద్యమం విఫలమయింది

# IV

సారాంశంగా, అంటరానివారు పోగొట్టుకొన్న మానవత్వపు హక్కు దస్తావేజులు వారికి యివ్వగలిగారా? లేదనేది స్పష్టం. ఆ దస్తావేజులు హిందువుల దగ్గరవున్నాయి. వాటిని అంటరానివారు తిరిగి సంపాదించు కోడానికి గాంధీ సహాయం చెయ్యలేదు. పైగా, వారి దారిలో అన్ని అడ్డంకులూ పెట్టారు. మానవత్వపు హక్కుదస్తావేజులు అనగా హిందువుల కింద వారి దాస్యవిముక్తి రాజకీయ అధికారం ద్వారానే సంపాదించుకోవాలిగాని మరే విధంగాను సాధ్యంగాదని అంటరానివారు భావిస్తున్నారు. మరో ప్రక్క గాంధీ ఆయన బోధనలు హిందువుల దయా దానాలు ఉత్సాహం అంటరానివారి జబ్బులన్నింటికీ సర్వరోగనివారిణి అని నమ్ముతున్నారు. హిందువుల నిరంతర దానప్రవాహం మీదా వారి ఉత్సాహం మీదా అంటరానివారు నమ్మి ఆధారపడతారా? విస్మృతమైన దానం గురించి మాట్లాడ తగును. పగతీర్చుకునే ఉత్సాహం మీద నిర్మాణం చేయతగును. హిందువుల కక్కుర్తి, దయమీదా ఉత్సాహంమీదా ఆధారపడమని అంటరానివారి స్నేహితుడెవరు చెబుతారు? గత రెండువేల సంవత్సరాలుగా అంటరానివారి రక్తాన్ని పీల్చి వారిని విరిచేసి అన్నివాధాలా వారిని కాలికింద రాచిరంపాన పెడుతూ వచ్చారు. ఈ రెండువేల సంవత్సరాలలోను హిందువులు అంటరానివారికి ఏ మాత్రం దానం చేశారు? కేవలం ఎనిమిది లక్షలు, అదికూడా గాంధీ స్వయంగా భిక్షాపాత్ర(ముష్టిచిప్ప) పట్టుకుని దేశమంతా తిరిగితే వచ్చింది!!! తన కార్యక్రమాన్ని పరిక్షకు పెట్టిన తరువాత గాంధీ అంటరానివారి విమోచనం రాజకీయాధికారంలోనే వుందని అంటరానివారి కోర్కెను ఒప్పకోడానికి యిష్టపడాల్సివుంది. ఈ కోర్కెలోని న్యాయం ఎంత స్పష్టంగా వుందంటే సామాన్య వివేకంగల ఏ మనిషైనా అంటరానివారి చేతిలో కార్యనిర్వాహణాధికారం ఒక సంవత్సరం ఉంచితే మొత్తం బోధనా ప్రచార సన్యాసులు ఒక శతాబ్దంలో చేస్తారని నమ్మగలిగిన దానికంటే ఎక్కువగా చేయకలరని అర్థం చేసుకోగలడు. కాని అంటరానివారికి రాజకీయాధికారం యివ్వడం అంటేనే గాంధీకి ద్వేషం. గాంధీ సామాజిక ప్రక్రియలు పూర్తిగా విఫలమయినప్పటికి అంటరానివారి విముక్తికి రాజకీయ ప్రక్రియలు నిరాకరించిన గాంధీని చూచి "బాబోయ్, గాంధీ పట్ల జాగ్రత్త!" అని వారు ఎందుకనకూడదు?

ఈ సందర్భంలో అమెరికా అధ్యక్షుడు లింకన్[1] దేశసమైక్యతా, బానిసత్వమూ అనే సమస్యలపై అవలంబించిన వైఖరి ఎవరికైనా జ్ఞప్తికి వస్తుంది. 1862లో హురేస్ గ్రిలీకి అధ్యక్షుడు లింకన్‌కి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో బాగా బయల్పడింది.

అధ్యక్షుడు లింకన్‌కు "ఇరవై మిలియనుల జనం ప్రార్థన" అనే మకుటంతో వ్రాసిన ఉత్తరంలో గ్రీలీ యిలా అన్నారు"

"ఈ విశాల భూభాగం మీద, అధ్యక్ష మహాశయా, సమైక్యతా ధ్యేయాన్నికాపాడాలని నిస్వార్థ, దృఢ సంకల్పం కలిగిన, తెలివైన యే రక్షకుడైనా తిరుగుబాటును అణచివేద్దామని ప్రయత్నం చేయడమూ అదేసమయంలో దానిని రగుల్కొల్పిన కారణం (అంటే బానిసత్వం)

1. అబ్రహాం లింకన్ రచనలు వాల్యూం XI పుటలు xii, xiii

సమర్థిద్దామనే ప్రయత్నాలూ అసందర్భమూ విపరీతమూ నిష్ఫలమూ అని భావించేవాడు లేడు"

దీనికి అధ్యక్షుడు లింకన్ యిచ్చిన సమాధానం ఇది.

"బానిసత్వాన్ని పదిలంగా ఉంచనిదే దేశ సమైక్యతని రక్షించబోము అని ఎవరైనా అంటే నేను వారితో ఏకీభవించను.

"నాకు అన్నిటికంటే ప్రధాన ధ్యేయం దేశ సమైక్యతను కాపాడడమే కాని బానిసత్వాన్ని కొనసాగించడమూ కాదు, నిర్మూలించడమూ కాదు.

"దేశ సమైక్యతను ఏ ఒక్క బానిసనూ విముక్తిచేయకుండా రక్షించగలిగితే అలా చేస్తాను. బానిసలందరికీ విముక్తి కలిగించడం ద్వారా దేశసమైక్యతను కాపాడగలిగితే అలా చేస్తాను. కొంతమందికి విముక్తికలిగించి తక్కిన వాళ్ళని బానిసత్వంలోనే ఉంచడం ద్వారా దేశసమైక్యతను కాపాడ గలిగితే అలా కూడాచేస్తాను".

ఇవి నీగ్రో బానిసత్వం గురించీ దానికి దేశసమైక్యతతో ఉన్న సంబంధంగురించీ అధ్యక్షుడు లింకన్ యొక్క అభిప్రాయాలు. నీగ్రోల విమోచకుడు అని కీర్తిగడించిన ఆయన మీద అవి క్రొత్త వెలుతురును ప్రసరింప చేస్తున్నాయి. వాస్తవానికి ఆయన నీగ్రోల దాస్యవిముక్తిని అనివార్య అవసరంగా ఎన్నడూ నమ్మలేదు. ప్రఖ్యాతి చెందిన గెట్టిస్బర్గు వక్తగా ప్రజల యొక్క, ప్రజలచేత, ప్రజలకోసం ప్రభుత్వంగా వర్ణించి కీర్తిగడించిన అతడు ఆ వాక్యం వల్ల ప్రజలను తెల్లవారిచేత తెల్లవారి ప్రభుత్వంగా పరిణమించి సమైక్యత నిలిస్తేఅతనికి అభ్యంతరం వుండేది కాదు. స్వరాజ్యం పట్లా అంటరానివారిపట్లా గాంధీ వైఖరి నీగ్రోలు, దేశసమైక్యత అనే రెండు సమస్యల పట్ల అధ్యక్షుడు లింకన్ వైఖరిని చాలా వరకు పోలి వుంది. అధ్యక్షుడు లింకన్ సమైక్యతను కోరినట్లే గాంధీ స్వరాజ్యాన్ని కోరాడు. కాని హిందూమత నిర్మాణ విచ్ఛిత్తికి (అంటరానివారి రాజకీయ విముక్తికి అర్థం అదే) దారితీసే స్వరాజ్యం గాంధీకి అక్కరలేదు, లింకన్ సమైక్యతకు నీగ్రోలస్వేచ్ఛ అవసరం లేకపోతే అతడు వారికి స్వేచ్ఛ యివ్వదలచుకోలేనట్లే, సహజంగా గాంధీకి అధ్యక్షుడు లింకన్‌కి ఒక తేడా వుంది. దేశసమైక్యతకు నీగ్రోలకు స్వేచ్ఛనివ్వడం అవసరం అయితే వారికి స్వేచ్ఛ యివ్వడానికి లింకన్ సిద్ధపడ్డాడు. గాంధీ వైఖరి దానికి పూర్తిగా భిన్నంగా వుంది. స్వరాజ్యం సంపాదించడానికి అంటరానివారికి రాజకీయ విముక్తి ప్రసాదించడం అత్యవసరం. అయినప్పటికీ గాంధీ అందుకు సిద్ధంగాలేడు. స్వరాజ్యం కోసం అంటరానివారికి రాజకీయ స్వేచ్ఛ యివ్వటం అనే ఖరీదు చెల్లించవలసి వస్తే స్వరాజ్యం నశించనీ అనేది గాంధీ వైఖరి.

కొంతమంది అంటరానివారు యిదంతా గతించినగతానికి చెందినదనీ గాంధీ పూనా ఒప్పందం ఆమోదించాడు కనుక అంటరానివారి రాజకీయ కోర్కెలను కాదనలేడు అనీ పూనా ఒప్పందం ఆమోదించిన గాంధీ అంటరానివారు భారత జాతీయ జీవనంలో వేరుగా ఉన్న మూలకమని అంగీకరించనట్లేననే అభిప్రాయంతో ఉండవచ్చు. ఇది పూర్తిగా అపార్థం, పూనా ఒప్పందం తరువాత గాంధీ దృక్పథం యేమీ మారలేదని నమ్మడానికి ఆధారాలున్నాయి. అంటరానివారు రాజకీయ రక్షణలు కావాలనే కోరిక పట్ల సర్వ పక్ష సమావేశం(**roundtable**

**conference)**లోనూ పూనా ఒప్పందం ముందరా ఏ వైఖరి అవలంబించారో తరువాత కూడా అదే వైఖరి అవలంబిస్తున్నారనడానికి ఆధారాలున్నాయి. ఈ ఆధారాల పునాది యీ నిజం మీద వుంది:-

1940లో బ్రిటిష్ ప్రభుత్వం అంటరానివారు భారత జాతీయ జీవనంలో ప్రత్యేక మూలకమనీ రాజ్యాంగానికి వారి సమ్మతి తప్పనిసరి అని ప్రకటించినప్పుడు గాంధీ ఒక నిరసనతో బయటపడ్డారు. వైస్రాయి లిన్‌లిత్‌గో ప్రభువు అంటరానివారిని వేరే మూలకమని చెబుతూ రాజ్యాంగానికి వారి సమ్మతి తప్పదు అన్నప్పుడు, గాంధీ యిలా అన్నారు [1]:-

"వైస్రాయి, తరువాత శక్రెటరీ ఆఫ్ స్టేటు కాంగ్రెస్‌కు

సంస్థాన యువరాజులతోను, ముస్లిం లీగుతోను చివరకు అనుసూచిత తరగతులతో కూడా ఒప్పందం కుదరక పోవడాన్ని స్వతంత్రానికి భారత దేశానికి కల హక్కును బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించక పోవడానికి ఒక ఆటంకంగా చూపించడం కాంగ్రెసుకు ప్రజలకు కూడా అన్యాయం కంటె ఎక్కువ అన్యాయం అని నేను భావించాను".

* * *

"వివాదంలో అనుసూచిత తరగతులను ప్రవేశ పెట్టడం బ్రిటిష్ ప్రభుత్వ వాదన యొక్క అవాస్తవికతను ద్విగుణీకృతంగా (రెండింతలుగా) అవాస్తవం చేసింది. ఇవి కాంగ్రెసువారి ప్రత్యేక బాధ్యత అని వారి ప్రయోజనాలను కాపాడడానికి బ్రిటిష్ ప్రభుత్వంకు కంటె కాంగ్రెస్‌కు చాలా ఎక్కువ సామర్థ్యంకలదనీ వారికి తెలుసు. అంతేకాని కుల హిందూ సమాజము ఎన్ని కులాలుగా విభజించబడి వుందో అనుసూచిత తరగతులు కూడా అలాగే విభజించబడివుంది. ఒక్క అనుసూచిత తరగతికి చెందిన సభ్యుడు కూడా అసంఖ్యాకమైన కులాలకు వాస్తవంగా ప్రాతినిధ్యం వహించలేడు."

గాంధీ చేసిన వాదన పిల్లచేష్టలా వుంది. అనుసూచిత తరగతులకు వైస్రాయి యిచ్చిన స్థానానికి వ్యతిరేకంగా చెప్పాలనే తొందరలో గాంధీ ఒకవిషయం మరచిపోయారు. అనుసూచిత తరగతులు ఎన్నోకులాలుగా విభజించబడ్డం వల్ల యే ఒక్కకులమూ అందరిని ప్రాతినిధ్యం వహించలేకపోతే ముస్లిములు సంగతి క్రైస్తవుల సంగతీ అంతకంటే ఏవిధంగానూ భిన్నంగాలేదు. ముసిములు మూడు వర్గాలుగా విభజించబడ్డారు. 1) సున్నీలు 2) షియాలు 3) మోమిన్లు. వీరిలో ప్రతి ఒక్క విభాగంలో ఎన్నో కులాలున్నాయి. వారిలో ఒకరితో ఒకరు కలిసి భోజనం చేస్తారుగాని అంతర్వివాహం చేసుకోరు. భారతీయ క్రైస్తవులు 1)కేథ లిక్కులు 2) ప్రోటస్టెంటులుగా విభజించబడ్డారు. మళ్లీ కేథలిక్కులు 1) కుల క్రైస్తవులు 2) కులేతర క్రైస్తవులు అని విభజించబడ్డారు. కేథలిక్కులు ప్రోటెస్టెంటులు రెండు శాఖలకీ అంతర్వివాహం

1 హరిజన్, 13 అక్టోబరు, 1940 తేది

# అధ్యాయం XI

# గాంధీతత్వం

## అంటరానివారి అంతం

## I

ఇంతవరకు భారతీయులు భారత సామాజిక ఆర్థిక జీవన పునర్నిర్మాణం గురించి మాట్లాడేటప్పుడు వ్యక్తిస్వేచ్ఛావాద - సమిష్టి వాదాల మధ్య సంఘర్షణగానో, పెట్టుబడిదారీ విధాన సమాజవాద విధానాల మధ్య సంఘర్షణగానో సాంప్రదాయకవాద తీవ్రవాదాల మధ్య సంఘర్షణగానో ఆయాపదజాలాన్ని ఉపయోగిస్తూవచ్చారు. కాని ఇటీవలనే ఒక కొత్త 'ఇజం' (తత్వం) భారత దిక్చక్రంలోకి వచ్చింది. దానిపేరు గాంధీతత్వం. (గాంధీఇజం) గాంధీతత్వం అనేదేమీ లేదని యీ మధ్యనే గాంధీ చెప్పిన మాట నిజమే. ఇది సాధారణంగా గాంధీ కనపరిచే నిరాడంబరత లాంటిదే తప్ప మరేమీ కాదు. గాంధీతత్వం మంటూ లేదని అది రుజువు చేయలేదు. గాంధీతత్వం అనే శీర్షికతో ఎన్నో పుస్తకాలు వెలువడినప్పటికీ గాంధీ యేమాత్రం నిరసన తెలుపలేదు. భారత దేశంలోనూ బయట కూడా అది ప్రజల ఊహాశక్తిని ఆకట్టుకుంది. కొంతమందికి దానిలో యెంత గట్టినమ్మకం ఉందంటే మార్క్సిజానికి అదొకటే ప్రత్యామ్నాయంగా చూపించడానికి జంకరు.

ఇంతకు ముందు పుటలలో చెప్పిన విషయాలను చదివిన గాంధేయులు ఈవిధంగా అడగవచ్చు. అంటరానివారు ఏం చేయాలని గాంధీ ఆశించారో ఆ విధముగా గాంధీ చేసివుండక పోవచ్చు కాని అంటరానివారికి గాంధీతత్వం యేమీ ఆశచూపలేదా? గాంధీ అంటరానివారి కోసం అడపాతడపా నెమ్మదిగా తీసుకున్న చర్యలనే నేను జ్ఞాపికం పెట్టుకున్నానుగాని, బలమైన దీర్ఘసూత్రాలను మరిచిపోయానని నా మీద నింద వేయవచ్చు. దీర్ఘసూత్రాలు వల్లెవేస్తూ స్వల్పచర్య తీసుకొనిన వానిని ఎప్పటికైనా అతని దీర్ఘసూత్రాలలోవలి బలం అతని చేత ఒకప్పుడు చేయగలదవే ఆశతో అతనిని క్షమించవచ్చునని నేను అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాను. వస్తుతః గాంధీ తత్వమే అధ్యయనం చేయడానికి ఆసక్తికరమైన విషయము. గాంధీ గురించి చర్చించిన తరువాత గాంధీతత్వం గురించి చర్చించడం విసుగ్గా ఉంటుంది. కనుక గాంధీతత్వం గురించి అంటరానివారి గురించి చర్చించకుండా వదిలేయాలని నాకు మొదట అనిపిస్తుంది. కాని అదేసమయంలో నేనలా చర్చించకపోవడం తాలూకు ఫలితం చాల దురదృష్టకరం కావచ్చు. నేను గాంధీ గురించి ఎంతగా బట్టబయలు చేసినప్పటికీ గాంధేయులు అంటరానివారి సమస్యను పరిష్కరించడంలో విఫలం అయినప్పటికీ, అంటరానివారి ముక్తి గాంధీతత్వంలోనే ఉందని ప్రచారంకొనసాగించగలరు. అటువంటి ప్రచారానికి తావివ్వకూడదనే కారణం చేతనే నామొదటి అయిష్టతను అధిగమించి గాంధీతత్వం గురించి చర్చించడానికి పూనుకుంటాను.

## II

గాంధీతత్వం అంటే ఏమిటి? అది దేనికోసం నిలుస్తుంది? ఆర్థిక సమస్యగురించి అది చెప్పేదేమిటి? సామాజిక సమస్యగురించి అది చెప్పేదేమిటి?

కొంతమంది గాంధేయులు కేవలం ఊహాజనితమైన భావనతో గాంధీతత్వాన్ని సృష్టించారని మొట్టమెదట చెప్పాల్సి ఉంది. ఈ భావన ప్రకారం గాంధీతత్వం అంటే గ్రామానికి మరలిపోవడం గ్రామాన్ని స్వయం సమృద్ధం చేయడం అని అర్థం. అది గాంధీతత్వాన్ని కేవలం ప్రాంతీయ తత్వమంత సామాన్య విషయంగా కనపరుస్తుంది. గాంధీతత్వం సామాన్యము కాదు, అమాయకం కూడా కాదు. ప్రాంతీయతత్వంలో కంటే గాంధీతత్వంలో ఎక్కువే ఉంది. దానిలో ప్రాంతీయత్వం ఒకపాటి ప్రాముఖ్యత లేనిభాగం. దానిలో ఒక సామాజిక తత్వం ఉంది, ఒక ఆర్థికతత్వం ఉంది. గాంధీతత్వంలో ఆర్థిక సామాజిక తత్వాలను లెక్కపెట్టక పోవడం గాంధీత్వం గురించి అసత్యంగా చిత్రించటమే అవుతుంది. గాంధీతత్వం గురించి వాస్తవంగా చిత్రించి చూపడమే మొదటి అవసరం.

సామాజిక సమస్యపై గాంధీ భోదనలేమిటో మొదట చూడాలి. భారత దేశంలోప్రధాన సమస్య అయిన కులవ్యవస్థ మీద గాంధీ అభిప్రాయాలు 'నవజీవన్' అనే గుజరాతీ పత్రికలో 1921-22లో ఆయన వివరంగా చెప్పాడు.

ఆ వ్యాసాన్ని[1] గుజరాతీలో వ్రాశాడు. దాని ఆంగ్లానువాదం ఆయన మాటలలోనే ఈ ంవ నిస్తున్నాను.

ంధీ యిలా అంటున్నాడు:-

"1. హిందూసమాజం యింతవరకు నిలబడ గలిగిందంటే దానికి కారణం కులవ్యవస్థ ంద అది స్థాపిచబడటమేనని నేను నమ్ము తున్నాను.

"2. స్వరాజ్య బీజాలు కులవ్యవస్థలో గోచరిస్తాయి. ఒకసైనిక విభాగంలో వివిధశాఖల ంటివి, వివిధ కులాలు, ప్రతి విభాగము మొత్తం వ్యవస్థశ్రేయస్సు కోసం పని చేస్తుంది.

"3. కులవ్యవస్థను సృష్టించ గలిగిన సమాజానికి అనితరసాధ్యమైన వ్యవస్థీకరణ క్తి ఉంటుందనవచ్చు.

"4. ప్రాథమిక విద్యను వ్యాప్తి చేయడానికి కులానికి సద్యోసాధనాలున్నాయి. ప్రతికులం ఆ కులానికి చెందిన పిల్లల విద్యకు బాధ్యత వహించవచ్చు.

కులానికి రాజకీయ ప్రాతిపదిక ఉంది. ఒక ప్రాతినిధ్య సంస్థకు అది ఎలక్టోరేటుగా పనిచేయవచ్చు. అదేకులానికి చెందినవారి మధ్య తగాదాలు వచ్చినపుడు తగవుతీర్చే న్యాయనిర్ణేతలను ఎన్నుకోవడం ద్వారా కులం న్యాయసంబంధమైన పని చేస్తుంది. ప్రతికులం ఒకసేనా విభాగాన్ని తయారు చేసుకోవాలని నిర్దేశించడం ద్వారా ఒక రక్షక దళాన్ని తయారుచేయడం కులంద్వారా సులభమవుతుంది.

"5. జాతీయ సమైక్యతను పెంపొందించడానికి వర్ణాంతర వివాహాలు అవసరంలేదని నేను నమ్ముతున్నాను. కలిసి భోజనం చేయడం స్నేహాన్ని సృష్టించుతుందనేది అనుభవానికి విరుద్ధం. ఇదే నిజమైతే యూరపులో యుద్ధమే ఉండేదికాదు. ఆహారం తీసుకోవడం దొడ్డికి వెళ్ళడం ఈపనులుగుప్తంగా చేయాలి. ఉన్నతేడాఅల్లా దొడ్డికి వెళ్లిన తరువాత శాంతి లభిస్తుంది, భోజనం చేయడం వల్ల ఆయాసంగా ఉంటుంది. దొడ్డికి వెళ్లడం ఎలా గుప్తంగా చేస్తామో భోజనం చేయడం కూడా గుప్తంగానే చేయాలి.

"6. భారత దేశంలో అన్నదమ్ముల పిల్లలు ఒకరి నొకరు పెళ్లిచేసుకోరు. ఒకరినొకరు పెళ్లిచేసుకోనంతమాత్రాన వారు ప్రేమించడం మానేస్తారా? వైష్ణవులలో చాలమంది స్త్రీలు ఎంత ఛాందసులంటే కుటుంబ సభ్యులతోనైనా వారుకలసి తినరు. అందరూ త్రాగే కుండనుంచి నీళ్లు కూడా వారు త్రాగరు. వారికి ప్రేమలేదా? వివిధ కులాల మధ్య వివాహాలు జరగనంత మాత్రాన వివిధకులాలవారు కలిసి తిననంత మాత్రాన కులవ్యవస్థ చెడ్డది అనకూడదు.

"7. నియంత్రణకు మరోపేరు కులం. కులం ఆనందించడానికి ఒక పరిమితి పెడుతుంది. వ్యక్తిని తన ఆనందం కోసం కుల కట్టుబాట్లను దాటనియ్యదు కులం. వర్ణాంతర సహపంక్తి భోజనాలను వర్ణాంతర వివాహాలనూ కూడదని కులం పట్టుపట్టడంలోని అర్థం యిదే.

1. దాన్ని గాంధీ శిక్షణ అనే పరంపరలో రెండవ సంపుటిలో 18వ నంబరుగా పునర్ముద్రణ చేశారు.

"8. కులవ్యవస్థను నిర్మూలించి పాశ్చాత్య యూరపు సమాజ పద్ధతిని అనుసరించడం అంటే హిందువులు కులవ్యవస్థకు ఆత్మ అయిన వంశపారంపర్యవృత్తి సూత్రాన్ని వదులుకోవడం అన్నమాట. వంశపారంపర్యసూత్రం సనాతనం. దాన్ని మార్చడం అంటే క్రమరాహిత్యాన్ని సృష్టించడమే. నాజీవితమంతా బ్రాహ్మణున్ని బ్రాహ్మణుదని పిలువలేకపోతే బ్రాహ్మణునితో నాకు ప్రయోజనంలేదు. ప్రతిరోజూ బ్రాహ్మణుని శూద్రునిగా శూద్రుని బ్రాహ్మణునిగా మారుస్తూపోతే అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడుతుంది.

"9. కులవ్యవస్థ సమాజంలోని సహజక్రమం. భారత దేశంలో దానికి మతంపూత పూశారు. ఇతర దేశాలలో కుల వ్యవస్థను సరిగా అర్థంచేసుకోక పోవడం కారణంగా అక్కడ అది వదులుబాటుగావున్న పర్యవసానంగా కులవ్యవస్థనుంచి భారతదేశం పొందినంత లాభాన్ని వారు పొందలేక పోయారు.

నావి ఈ అభిప్రాయాలు కావడం చేత కులవ్యవస్థను వాశనం చేయాలని కంకణం కట్టుకున్న వారందరినీ నేను వ్యతిరేకిస్తున్నాను."

1922 సంవత్సరంలో గాంధీ కులవ్యవస్థను బలపరిచారు. ఈ విచారణను కొనసాగించుకుంటూపోతే 1925 లో గాంధీ కులవ్యవస్థను ఒక మాదిరిగా విమర్శించడం కనిపిస్తుంది. 1925 సంవత్సరం ఫిబ్రవరి 3వ తేదీనాడు గాంధీ చెప్పింది ఇది:-

"నిగ్రహాన్ని నిలబెడుతుంది కాబట్టి నేను కులానికి మద్దతు యిచ్చాను. కాని యిప్పుడు కులం నిగ్రహం అనే అర్థంలో లేదు. దాని యిప్పటి అర్థం పరిమితులు అని. కాని పరిమితి అనగానే గొలుసువంటిది. అది బంధిస్తుంది. ఇప్పుడున్న రూపంలో కులాలలో చెప్పిన నియమాలకు విరుద్ధంగా ఉన్నాయి. కులాల సంఖ్య అనంతం, వర్ణాంతర వివాహాలు నిషేధించబడినవి. ఇది ఉన్నతస్థితి కాదు. ఇది పతనస్థితి."

పరిష్కారమార్గం ఏమిటనే ప్రశ్నకు సమాధానంగా గాంధీ యిలా అన్నారు :-

"చిన్న కులాలన్నీ ఒక పెద్ద కులంగా కలిసి రూపొందాలని అటువంటి పెద్దవి నాలుగు కులాలుంటే పురాతన చాతుర్వర్ణ్య వ్యవస్థ మళ్లీ ఏర్పరచుకోవచ్చు".

సంక్షిప్తంగా 1925లో గాంధీ వర్ణవ్యవస్థను అంగీకరించాడు.

ప్రాచీన భారత దేశంలోని పాత వర్ణవ్యవస్థ సమాజాన్ని నాలుగు రకాలుగా విభజించింది. 1) విద్యయే వృత్తిగాగల బ్రాహ్మణులు, 2) యుద్ధమే వృత్తిగాగల క్షత్రియులు, 3) వర్తకం వృత్తిగా గల వైశ్యులు 4) ఇతర కులాలకు సేవచేయడమే వృత్తిగాగల శూద్రులు. గాంధీ చెబుతున్న సనాతన ఛాందస హిందువులపాత్ర వర్ణవ్యవస్థయేనా? గాంధీ తనవర్ణవ్యవస్థను యీ క్రింది పదజాలంతో వర్ణించారు.[1]

"1. వర్ణవ్యవస్థలోని విభాగములకు ఆధారం పుట్టుక అని నేను నమ్ముతున్నాను.

1. ఈ భాగాల్ని ఈ విషయంపై గాంధీ వ్రాసిన వ్యాసం వర్ణవ్యవస్థ అనే గుజరాతీ గ్రంథంలో పునర్ముద్రించిన దాని నుండి గ్రహించబడింది. ఆ పుస్తకంలో గాంధీ గుజరాతీలో వ్రాసిన రచనలున్నాయి.

"2. వర్ణవ్యవస్థలో శూద్రుడు విద్య నార్జించాలను కున్నా ఎదురుదాడి చెయడం రక్షించుకోవడం వంటి సైనిక విన్యాసాలతో కూడిన కళను నేర్వాలన్నా ఆటంకపరిచేది యేదీలేదు. దానికి విరుద్ధముగా క్షత్రియుడు సేవచేయాలన్నా వర్ణవ్యవస్థ ఆటంకం కాదు. శూద్రుడు విద్యమూలంగా జీవనోపాధి గడించరాదనే వర్ణవ్యవస్థ శాసిస్తుంది. అదే విధముగ క్షత్రియుడు సేవచేసి ఉపాధి గడించకూడదు. (అట్లే బ్రాహ్మణుడు యుద్ధకళ కాని వర్తకం గాని నేర్చుకోవచ్చు. కాని దాని ద్వారా జీవనోపాధి గడించకూడదు. అట్లే వైశ్యుడు యుద్ధకళ నేర్చుకోవచ్చు గాని జీవనోపాధికి దానిని వినియోగించరాదు).

"3. వర్ణవ్యవస్థని జీవనోపాధి ఆర్జించే విధానంతో ముడిపడి ఉంది. ఒక వర్ణానికి చెందిన వ్యక్తి వేరొక వర్ణానికి చెందిన కళను అభ్యసించడంలో హాని యేమీలేదు. కాని జీవనోపాధిని గడించడానికి వంశ పారంపర్యంగా తాతముత్తాతల వృత్తినే చేపట్టాలి.

"4. పోటీని వర్గపోరాటాన్ని వర్గయుద్ధాన్ని జరగనీయ కుండా చూడడమే వర్ణవ్యవస లక్ష్యం, వర్ణవ్యవస్థ వ్యక్తుల విధులను వృత్తులను నిర్ధేశిస్తుంది కాబట్టి నేను వర్ణవ్యవస్థను విశ్వసిస్తాను.

"5. వర్ణ అనగా మనిషి పుట్టకముందే అతని వృత్తిని నిర్ణయించడం.

"6. వర్ణవ్యవస్థలో యేమనిషికీ వృత్తిని ఎన్నుకునే హక్కులేదు. అతని వృత్తి వారసత్వం ద్వారా నిర్ణయం అవుతుంది."

ఆర్థిక జీవన క్షేత్రం వైపు మరలితే గాంధీ రెండు ఆదర్శాలకోసం నిలబడతారు. వీటిలో ఒకటి యంత్రాలపట్ల అతని వ్యతిరేకత. 1921 సంవత్సరం లోనే ఆయన యంత్రాల పట్ల అతని అయిష్టత వెడల గ్రక్కారు. యంగ్ ఇండియాలో 19 జనవరి, 1921నాడు వ్రాస్తూ గాంధీ యిలా అన్నారు.

"నేను అభ్యుదయ గడియారపు ముల్లుని వెనక్కు తిప్పదలస్తున్నానా? మిల్లులకు బదులుగ చేత్తోవడకడాన్ని, చేనేతనూ తీసుకురాదలచానా? రైల్వేకు బదులుగ నాటుబండి తేదలచానా? నేను యంత్రాలన్నిటినీ పూర్తిగా నాశనం చేయాలను కుంటున్నానా? ఈ ప్రశ్నలు నన్ను కొంతమంది పాత్రికేయులు ప్రజలూ అడిగారు. నా జవాబు యిది, "యంత్రాలు మాయమైతే నేను ఏడవను.అదేదో మహావిపత్తుగా అనుకోను." యంత్రాల పట్ల ఆయన వ్యతిరేకత ఆయన చర్ఖాను విగ్రహస్థాయికి తీసుకొని పోవడంలోను చేతితో వడకాలనీ చేనేత చేయాలనీ విధించడంలోనూ ఆయనకు యంత్రాలపట్ల వ్యతిరేకత బాగా కనిపిస్తుంది. యంత్రాలపట్ల యీ వ్యతిరేకత ఆయనకు చరఖా అంటే ప్రేమా, యివి తలవని తలంపులుగా కలిగినవికావు. ఇది తత్వానికి చెందిన విషయం. 8 జనవరి 1925 నాడు జరిగిన కథియవాడ్ రాజకీయ సమావేశంలో అధ్యక్షోపన్యాసం యిస్తూ గాంధీ యీతత్వాన్ని వివరించారు. గాంధీ చెప్పినది యిది.

"అనంతంగా అనేకంగా విజృంభించిన నిర్జీవమైన యంత్రాలను ఆరాధించడంలో జాతులు అలసిపోయాయి. సజీవమైన యంత్రాలను అనగా మన శరీరాలను తప్పుపట్టేలా చేస్తూ నాశనం చేసుకుంటూ వాటి స్థానంలో నిర్జీవమైన యంత్రాలను నెలకొల్పడానికి ప్రయత్నిస్తున్నాం. శరీరంచేత పూర్తిగా పనిచేయించుకోవాలని దేవుని శాసనం. దానిని ఉపేక్షించే

సాహసం మనం చేయకూడదు. వడికే చక్రం శరీరయజ్ఞానికి, శుభప్రదమైన చిహ్నం. ఈబలిచేయనిదే భుజించేవాడు దొంగతిండి తిన్నవాడవుతాడు. ఈ బలిని మానేసి మనం దేశద్రోహులమయ్యాం, అదృష్టలక్ష్మి ముఖం మీద దభాల్న తలుపు మూసేశాం."

గాంధీ రచించిన హింద్ స్వరాజ్ అనే చిన్న పుస్తకాన్ని చదివిన ఎవరికైనా గాంధీ ఆధునిక నాగరికతకు వ్యతిరేకి అని తెలుస్తుంది. ఆ పుస్తకం మొదట 1908లో ప్రచురించబడింది. కాని ఆయన ఆదర్శాలలో మార్పులేదు. 1921లో వ్రాస్తూ గాంధీ యిలా అన్నారు.[1]

"ఆ చిన్నపుస్తకం 'ఆధునిక నాగరికతను' తీవ్రంగా గర్హించింది. అది 1908 వ్రాయబడింది. ఈనాడు నా విశ్వాసం అంతకంటే ఎక్కువ గాఢంగా ఉంది. భారతదేశం 'ఆధునిక నాగరితక'ను విసర్జిస్తే దానివలన లాభమే పొందుతుందని నేననుకుంటాను".

గాంధీ అభిప్రాయంలో "పాశ్చాత్య నాగరికత సైతాను సృష్టి."[2]

గాంధీ రెండవ ఆదర్శమేమనగా యజమానులకు కార్మికులకు భూస్వాములకు కౌలుదారులకు మధ్యగల సంబంధాలలో వర్గపోరాటం తొలగించాలనీ వర్గయుద్ధం పూర్తిగా పోవాలనీ అంటారు. యజమానులకు పనివారికి మధ్య ఉండవలసిన సంబంధాలను గురించి గాంధీ ఒక వ్యాసం వ్రాశారు. అది 8 జూన్ 1921 తేదీగల నవజీవన్ లో ప్రచురించబడింది. దానిలో నుండి కొంత భాగం యీ దిగువ ఉంది:-

"భారతదేశం ముందు రెండు బాటలున్నాయి 'బలమే న్యాయం' అనే పాశ్చాత్య సూత్రాన్ని ప్రవేశపెట్టడమైనా చేయాలి, లేదా సత్యము మాత్రమే జయిస్తుందని, సత్యం ప్రమాదం ఎరుగనిదనీ, బలవంతులకూ బలహీనులకూ న్యాయం పొందే హక్కు సమానంగా ఉందనీ చెప్పే ప్రాచీన ధర్మాన్నైనా పాటించాలి. ఎంపికలో శ్రామిక వర్గంతో ఆరంభం కావాలి. శ్రామికులు దౌర్జన్యంద్వారా వారివేతనంలో పెంపుదల తెచ్చుకోవాలా? అది సాధ్యమైనప్పటికివారి హక్కులు ఎంత న్యాయమైనప్పటికి వారు దౌర్జన్యానికి యేమాత్రం పాల్పడలేరు. హక్కులను సాధించడానికి దౌర్జన్యం ప్రయోగించడం. సులభమైన మార్గం అనిపించవచ్చు కాని చివరికది కంటక ప్రాయంగా తేలవచ్చు. కత్తితో బ్రతికేవారికి కత్తితోనే చావక తప్పదు. ఈదేవాడు మునిగి చావడం తరచు జరుగుతుంది. యూరపు వైపు చూడండి. అక్కడ ఎవరూ ఆనందముగా ఉండడంలేదు, దానికి కారణం ఏ ఒక్కరూ సంతృప్తిచెందగ పోవడమే. కార్మికుడు పెట్టుబడిదారు నినమ్మడు, పెట్టుబడిదారునికి కార్మికునిలో విశ్వాసంలేదు. ఇద్దరికీ ఒకరకమైన శక్తి, బలం ఉన్నాయి కాని ఎద్దులకు సైతం శక్తి ఉంటుంది. అవి విషాదాంతం వరకు పోరాడతాయి. ప్రతి కదలికా అభివృద్ధికాదు. యూరపు ప్రజలు పురోగమిస్తున్నారని నమ్మడానికి హేతువులేదు. వారికి సంపద ఉన్నంత మాత్రాన వారికి నైతిక లేక ఆధ్యాత్మిక సద్గుణాలున్నాయని కాదు."

"అయితే ఏం చేద్దాం? బొంబాయిలోని కార్మికులు చక్కని వైఖరి అవలంబించారు. నేను అన్ని విషయాలు తెలుసుకునే స్థితిలో లేను. కాని వారు యింతకంటే మెరుగ్గా

1.. యంగ్ ఇండియా, 26 జనవరి, 1921.

2. ధర్మ మంథన్, 65వ పుట

పోరాడగలరని మాత్రం నేను గ్రహించగలిగాను. మిల్లుయజమానిదే పూర్తిగా తప్పు కావచ్చు. పెట్టుబడికి శ్రమకు మధ్యజరిగే పోరాటంలో సాధారణంగా పెట్టుబడిదార్లు అపోహాలకు గురవుతారు. కాని శ్రమ తన బలాన్ని గ్రహించినప్పుడు అది పెట్టుబడి కంటే నిరంకుశం అవుతుందని నాకు తెలుసును."

శ్రామికులకు పెట్టుబడిదారులకున్నంత తెలివి తేటలుంటే శ్రామికులు శాసించినట్లు మిల్లు యజమానులు వినవలసివచ్చేది. కాని శ్రామికులకు అంతటి తెలివి ఎన్నటికీ రాదు అనేది స్పష్టం. ఒకవేళ వస్తే శ్రామికులు శ్రామికులు కాకుండా వారే యజమానులై ఉండేవారు. పెట్టుబడిదారులు వారి ధనశక్తి మీదనే పోరాడరు. వారికి తెలివితేటలూ యుక్తీ ఉన్నాయి.

"మన ముందున్న ప్రశ్నయిది. శ్రామికులు యిప్పటివారి స్థితి కంటే మెరుగ్గా ఒకానొక చైతన్యాన్ని పొంది వుంటే వారి కర్తవ్యం ఎలా ఉంటుంది? వారి సంఖ్యాబలం మీద లేక పశుబలం మీద లేక దౌర్జన్యం మీద వారు ఆధారపడుతూంటే అది ఆత్మహత్యా సదృశమే అవుతుంది. అలా కాక, శుద్ధమైన న్యాయం మీద వారు ఆధారపడి న్యాయం పొందడానికి కష్టాలు పడితే వారు విజయం సాధించడమే కాకుండా వారి యజమాన్లను సంస్కరించిన వారవుతారు, పరిశ్రమలు అభివృద్ధి చేసిన వారవుతారు. అప్పుడు యజమానీ కార్మికులూ ఒక కుటుంబ సభ్యుల వలె జీవిస్తారు."

మరొక సందర్భంలో అదే యితివృత్తాన్ని గురించి చెబుతూ గాంధీ యిలా అన్నారు[1].

"ఇంతకు పూర్వం కూడా వేరే విధంగా ఉండేది కాదు. ఇండియా చరిత్ర పెట్టుబడికి శక్తికి మధ్య సత్సంబంధాలు చెడిన అంశంగా ఎన్నడూ లేదు".

కార్మికులు తమ ఆర్థిక స్థితిని మెరుగు పరచుకోడానికి వారి చేతిలోని ఆయుధమైన సమ్మె గురించి గాంధీ అభిప్రాయాలు గమనార్హం. గాంధీ యిలా అంటున్నారు:-[2]

"కాబట్టి, విజయవంతమైన సమ్మెలను నిర్వహించిన వాడ్ని అవడం చేత, ఈ పుటలలో యిది వరకే చెప్పిన సూక్తులను సమ్మె నాయకులకు మార్గదర్శకంగా ఉండడానికి వీలుగా మళ్ళీ చెబుతున్నాను."

1. వాస్తవమైన కష్టం ఉండనిదే సమ్మె తలపెట్ట రాదు.

2. సమ్మె కాలంలో తాము పొదుపు చేసిన డబ్బు నుండి బ్రతకలేకపోతే, వడకుట, నేయుట ద్వారా తాత్కాలిక భృతి సంపాదించలేక పోతే సమ్మె తలపెట్ట రాదు. ప్రజల చందాల మీద గానీ ఇతర దానాల మీద గానీ సమ్మెదారులు ఎన్నడూ ఆధారపడకూడదు.

3. సమ్మె చేయడం ప్రారంభించక ముందే సమ్మె దారులు మార్చడానికి వీలులేని కనీస కోర్కెను నిర్ణయించాలి.

"సమ్మెదారులకు బదులుగా నియమించడానికి వీలుగా కార్మికులుంటే సమ్మెదారులు కోర్కెలు ఎంత న్యాయమైనవైనా, సమ్మెదారులు ఎంతకాలం నిలబడగ్గలిగినా సమ్మె విఫలం

1 యంగ్ ఇండియా, ఫిబ్రవరి 23, 1922

2. యంగ్ ఇండియా. 11 ఆగసు 1921. క్రింద గీతలు మాతృకలో లేవు

కావచ్చు. తనకు బదులుగా ఎవరినైనా నియమించడానికి వీలున్నపుడు వివేకి అయినవాడు వేతనాలు పెంచడానికి, లేక యితర సదుపాయాలు పెంచడానికి సమ్మె చేయడు. కాని మానవ ప్రేమ గలవాడు లేక దేశాభిమాని తన పొరుగు వాని దుఃఖము తనదిగా భావించాలి, భాగం పంచుకోదలచిన వాడు గిరాకీ కంటే సరఫరా అధికంగా ఉన్నప్పటికీ సమ్మె చేస్తాడు. నేను వర్ణించినటువంటి పౌర సమ్మెలో బెదిరించడాలు, కవ్వించడాలు వంటి దౌర్జన్యానికి తావు లేదని వేరే చెప్పవలసిన అవసరం లేదు..... నేను చెప్పిన పరీక్షల ప్రకారం చూస్తే సమ్మెదారుల స్నేహితులు వారి సహాయం కోసం కాంగ్రెసును కాని మరి యే యితర ప్రజానిధిని గాని అర్థించరనేది స్పష్టం. వారు ధనసహాయం తీసుకున్నారనే అంశం వరకు సమ్మెదారుల సానుభూతి విలువతగ్గి పోతుంది. సానుభూతి సమ్మె యొక్క సుగుణం, సానుభూతిపరులు అనుభవించిన యిబ్బందిలోను లేక భరించిన నష్టంలోను ఉంటుంది."

భూస్వాములు కౌలుదారుల మధ్య సంబంధం గురించి గాంధీ యు.పి.లో భూస్వాములపై తిరుగబడిన కౌలుదారులకు యిచ్చిన సూచనలలో ఆయన అభిప్రాయాలు వివరంగా ఉన్నాయి. అవి 18 మే, 1921 తేదీ యంగ్ ఇండియాలో, ప్రచురింపబడినవి. గాంధీ ఇలా అన్నారు: యు.పి. ప్రభుత్వం ప్రజల్ని బెదిరించడంలో ఔచిత్యం మీరినప్పటికి కిసాన్లు కూడా వారికి క్రొత్తగా లభించిన స్వేచ్ఛను వివేకవంతంగా ఉపయోగించుకోవడం లేదు. చాలా జమీందారీలలో వారు హద్దు మీరుతున్నారనీ, చట్టాన్ని చేతిలోకి తీసుకున్నారనీ వారు చెప్పినట్లు చేయని వారిపట్ల అసహనంతో ప్రవర్తించారనీ అంటున్నారు. సాంఘిక బహిష్కారాన్ని వారు దుర్వినియోగం చేసి దానిని దౌర్జన్య సాధనంగా మార్చేస్తున్నారు. వారు జమీందారులకు నీటి సరఫరా ఆపేశారు. క్షురకర్మ మొదలగు చెల్లింపుసేవలను కూడా ఆపేశారు. చివరకు వారికి యివ్వవలసిన అద్దె కూడా ఆపేశారు. కిసాన్ ఉద్యమం సహాయ నిరాకరణం నుండి స్ఫూర్తినీ వేగాన్నీ పుంజుకుంది కానీ అది సహాయ నిరాకరణకు లోబడి ఉండాలి కానీ దాని కంటె భిన్నంగా స్వతంత్రించి ఉండలేదు. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నుల్ని చెల్లించ కూడదని అటువంటిది అవసరమైనపుడు కిసాన్లకు సలహా యివ్వడానికైనా సంకోచించముకాని సహాయ నిరాకరణలో యేదశలోనైనా జమీందార్లకు వారికి రావలసిన అద్దెపోగొట్టుకొనేలా చేయడం జరగదు. కిసాన్ ఉద్యమం కిసాన్ల హోదా మెరుగు పరచడానికీ కిసాన్లకు జమీందార్లకూ మధ్య గల సంబంధాలు మెరుగు పరచడానికీ పరిమితం కావాలి. జమీందారులతో కిసాన్స్ చేసుకున్న వ్రాతపూర్వకమైన లేక మూజువాణీ ఒప్పందంలో ఉన్న షరతుల ప్రకారం నడచుకోవాలని కిసాన్లకు సలహా యివ్వాలి. ఒక ఆచారంగాని వ్రాత మూలకమైన ఒప్పందం దుష్టమైనదైతే ఆ చెడుగును తీసివేయడానికి వారు దౌర్జన్యం ఉపయోగించ కూడదు. జమీందారుకు ముందుగా చెప్పకుండా ఏమీ చేయకూడదు. ప్రతి సందర్భంలోను జమీందార్లతో స్నేహపూర్వకమైన చర్చ జరగాలి. పరిష్కారం సాధించడానికి ప్రయత్నం జరగాలి."

శ్రీ గాంధీ ఆస్తి గల వర్గానికి హాని కలిగించ దలచుకోలేదు. వారికి వ్యతిరేకంగా ప్రచారం చేయడాన్ని కూడా ఆయన వ్యతిరేకిస్తాడు. ఆర్థిక సమానత్వం పట్ల ఆయనకు ప్రగాఢ కాంక్షలేదు. ఆస్తి గల వర్గం గురించి ఈ మధ్య గాంధీ చెబుతూ బంగారు గుడ్లను

క్రింది గీతలు మాతృకలో లేవు. కిసాన్ అనగా కౌలుదారు జమీందారు అనగా భూస్వాము

పెట్టే కోడి పెట్టను తాను నాశనం చేయదలచలేదన్నారు. యజమానులకూ కార్మికులకూ మధ్య, ధనవంతులకూ పేద వారికీ మధ్య, భూస్వాములకూ కౌలుదార్లకూ మధ్య మిల్లు యజమానులకూ శ్రామికులకూ మధ్య వచ్చే సంఘర్షణకు ఆయన పరిష్కారం చాలా సరళమైనది. యజమానులు తమ ఆస్తులను వదులు కోనవసరం లేదు. వారు చేయవలసిందల్లా తాము పేద వారి తరపున ధర్మకర్తల మని ప్రకటించడమే. అయితే సహజంగా ఆ ధర్మకర్తృత్వం వారి యిష్టాను సారంగానే ఉంటుంది. కేవలం ఆధ్యాత్మిక విధి మాత్రమే దానికి ఉంటుంది.

## III

ఆర్థిక రుగ్మతలకు గాంధేయ విశ్లేషణలో ఏమైనా క్రొత్తదనం ఉందా? గాంధేయ అర్థశాస్త్రము పటిష్టమైనదా? సామాన్య మానవునికి దళితులకు దానిలో యేమైనా ఆశ కనిపిస్తుందా? వానికి అది మెరుగైన జీవితాన్ని, ఆనంద జీవితాన్ని, సంస్కృతిని, స్వేచ్ఛా జీవితాన్ని, అనగా లేమి నుండి స్వేచ్ఛ మాత్రమే కాదు, లేవడానికి స్వేచ్ఛ, అతని సామర్థ్యానికి తగినట్లు పూర్తిగా ఎదిగే స్వేచ్ఛనిస్తుందని వాగ్దానం చేస్తుందా?

ఆర్థిక రుగ్మతలకు గాంధేయ విశ్లేషణలు అది ఆ రుగ్మతలన్నీ యంత్రాలకు దానిమీద నిర్మించిన నాగరికతకు ఆపాదించడంలో క్రొత్త యేమీ లేదు. యంత్రాలు ఆధునిక నాగరికతా నిర్వాహణనూ నియంత్రణనూ కొద్ది మంది చేతులలో కేంద్రీకృతం కావడానికి తోడ్పడుతాయనీ, బ్యాంకింగు పరపతి సౌకర్యాలతో అన్ని సామాన్లు, వాళ్ళ గుడిసెలకు వేల మైళ్ళ దూరంగా ఉన్న పరిశ్రమలను పోషించడానికి కోట్ల జనం రక్తం పీల్చేసే కర్మాగారాలను, మిల్లులను అతితక్కువ మంది చేతిలోకి బదిలీ చేయడానికి వీలు కలుగుతుందనీ, యంత్రాలూ, ఆధునిక నాగరికతా యదార్థాలలో కంటే ఎక్కువగా చావులకూ వికలాంగులకూ కారణాలవుతాయనీ పెద్ద నగరాలు వాటి పొగతో, దుర్గంధంతో, మురికితో, గొడవలతో, మురికివాడలకు, పడుపు వృత్తితో అసహజ జీవనంతో రోగాలకు కారణం అవుతాయనీ యంత్రాలకూ ఆధునిక నాగరికతకూ వ్యతిరేకంగా చెప్పేవాదనలన్నీ పాతవీ బాగా నలిగిపోయినవీ, వాటిలో క్రొత్త యేమీ లేదు. గాంధీతత్వం కేవలం రూసో, రస్కిన్, టాల్స్టాయ్ వారి వాదనలలో చెప్పిన అభిప్రాయాలనే మళ్ళీ చెబుతున్నది.

గాంధీతత్వం యొక్క మౌలిక భావాలు ఆదిమాలు. గాంధీతత్వం ప్రకృతికి మరలిపోవడం, జంతు జీవితానికి తిరోగమించడం. వాటికన్నా ఒకే ఒక సుగుణం నిరాడంబరత్వం. వాటివల్ల ఆకర్షితులయ్యే నిరాడంబర సేన ఎప్పుడూ ఉంటుంది. కాబట్టి అటువంటి భావాలు చావవు, వాటిని ప్రచారం చేసే నిరాడంబర జీవి ఉండనే ఉంటాడు. అయితే మనుష్యులకు స్వాభావికంగా ఉండే ఆచరణ సాధ్యమైన సహజాతాలు_ఇవెన్నడూ పొరపాటుగా ఉండవు _ ఆ భావాలు నిష్ఫలమనీ అభ్యుదయాన్ని అన్వేషించే సమాజం వాటిని తిరస్కరిస్తుందనీ చెప్పడంలో సందేహం లేదు.

గాంధీతత్వంలోని అర్థశాస్త్ర సూత్రాలు హేత్వాభాసాలు. యంత్రాలూ ఆధునిక నాగరికతా ఎన్నో అనర్థాలను కలిగించాయనే అంగీకరించవచ్చు. కాని ఈ అనర్థాలు వాటికి వ్యతిరేక వాదనలు కాజాలవు. కారణం అనర్థాలు యంత్రాల వల్ల, ఆధునిక నాగరికత వల్లా కలుగలేదు. వ్యక్తిగత ఆస్తినీ వ్యక్తిగత లాభార్జన కోసం ప్రాకులాడడాన్ని పవిత్రమైన విషయాలుగా మార్చే తప్పుడుసామాజిక వ్యవస్థీకరణ వల్లనే ఆ అనర్థాలు వచ్చాయి. యంత్రాలూ నాగరికతా అందరికీ లాభకారిగా ఉండకపోతే యంత్రాలనూ నాగరికతనూ తిట్టి పొయ్యడం పరిష్కారం కాదు. ఏ కొద్ది మందో లాభాన్ని కాజెయ్యకుండా అందరికీ లభించేటట్లు సమాజాన్ని వ్యవస్థీకరించడమే దానికి పరిష్కారం.

గాంధీతత్వంలో సామాన్య మానవునికి ఆశలేదు. అది మనిషిని జంతువుగానే చూస్తుంది. కాని అంతకంటే ఎక్కువగా చూడదు. మనిషికి జంతువులాగే శరీరతత్వము ఆహార, సంతానోత్పత్తి మొదలగు పనులలో జంతువును పోలి ఉన్నమాట నిజమే. కాని యివి మనిషికి ప్రత్యేకంగా ఉన్న ప్రక్రియలు కావు. మనిషికి ప్రత్యేకంగా ఉన్న లక్షణం హేతు బద్ధంగా ఆలోచించడం. దీని వలన మనిషి పరిశీలించి, ధ్యానించి, ఆలోచించి, అధ్యయనము చేసి విశ్వ సౌందర్యాలను కనిపెట్టి తన జీవితాన్ని ఉదాత్తం చేసుకుని తన జీవితంలోని జంతు లక్షణాలను అదుపులో ఉంచుకుంటాడు. చలించే ఉనికిలో ఆ విధంగా మనిషి ఉన్నతమైన స్థానం ఆక్రమిస్తాడు. ఇది నిజమైతే దీని వలన వచ్చే నిర్ణయం ఏమిటి? శరీరానికి సంబంధించిన ఆకలి వగైరాలు తీరడంతో జంతు ధ్యేయం చేరినప్పటికి అతని మనస్సును పూర్తిగా వికసింప చేసుకోనిదే మానవ చరమధ్యేయం చేరినట్లు కాదు. సంక్షిప్తంగా చెప్పాలంటే మనిషినీ మృగాన్నీ వేరు చేసేది సంస్కృతి. మృగానికి సంస్కృతి సాధ్యం కాదు. కాని మనిషికి అది చాలా అవసరం. అందుచేత కేవలం శారీరక అవసరాల తృప్తి పరచడంతో ఆగిపోక సాంస్కృతిక జీవనం గడపడం ప్రతిమనిషికీ సాధ్యం అయ్యేటట్లు చేయడమే మానవ ధ్యేయం కావాలి. ఇది ఎలా జరగగలదు?

సమాజానికీ వ్యక్తికీ కూడా కేవలం జీవించడానికీ. ప్రయోజనకరంగా జీవించడానికీ మధ్య పెద్ద అఖాతం ఉంది. ప్రయోజనకరంగా జీవించాలంటే అసలు జీవించడం అంటూ మొదలు ఉండాలి. కేవలం బ్రతకడానికి బ్రతుక్కి కావలసినవి సంపాదించుకోవడానికి వ్యయం అయే కాలమూ శక్తీ మనిషిలా సాంస్కృతిక జీవనం గడపడానికి జరిగే కార్యక్రమాలకు వినియోగించ వలసిన వాటిలో తగ్గిపోతుంది. అయితే మరి సాంస్కృతిక జీవితం సాధ్యం అయేలా చేయడం ఎలా? తగినంత తీరిక ఉంటే గాని అది సాధ్యం కాదు. తీరిక ఉన్నప్పుడే వ్యక్తి సాంస్కృతిక జీవనం గడపడానికి సాధ్యమవుతుంది. ప్రతి వ్యక్తికీ తీరిక ప్రసాదించడం ఎలా అన్నదే సమాజాన్ని ఎదుర్కొంటున్న సమస్యలలో కెల్ల మేటి సమస్య. తీరిక అనగా ఏమిటి? తీరిక అనగా జీవించడానికి అవసరమైన శారీరక అవసరాన్ని తృప్తిపరచడానికి తీసుకొనే శ్రమనూ కష్టాన్నీ తగ్గించడం. తీరిక సాధ్యం అయ్యేటట్లు చేయడం ఎలా? మానవుని అవసరాలు తీర్చడానికి కావలసిన సరుకులను తయారు చేయడంలోని కష్టాన్ని తగ్గించడానికి సాధనాల్ని కనిపెడితేతప్ప తీరిక అసాధ్యం. అటువంటి కష్టాన్ని తగ్గించేది ఏది? యంత్రం మనిషి స్థానాన్ని ఆక్రమించినపుడే అది సాధ్యం. తీరికను కలిగించే సాధనం మరేదీ లేదు. ఈ విధంగా యంత్రాలూ ఆధునిక నాగరికతా మానవుని మృగజీవనాన్నుంచి విముక్తి కలిగించడానికీ సాంస్కృతిక జీవనం సాధ్యమయ్యేటట్లు చేసే తీరికను ప్రసాదించడానికీ

తప్పని సరిగా అవసరమవుతాయి. యంత్రాలను ఆధునిక నాగరికతనూ ఈసడించే వారికి వాటి ప్రయోజనం తెలియదు. మానవ సమాజం చివరకు ఏది సాధించడానికి ప్రయత్నం చేయాలో కూడా వారికి తెలియదు.

ప్రజాస్వామ్యాన్ని, ఆదర్శంగా స్వీకరించని సమాజానికి గాంధీతత్వం బాగా సరిపోవచ్చు. ప్రజాస్వామ్యంలో నమ్మకం లేని సమాజం యంత్రాలపట్ల యంత్రాలపై ఆధారపడిన నాగరికత పట్ల నిర్లిప్తవైఖరిని అవలంబించవచ్చు. ప్రజాస్వామ్యంలో నమ్మకం లేని వారు కొంత మందికే తీరికా సంస్కృతీ ఉండి అధిక సంఖ్యాకులకు నిరంతర శ్రమా ఉండే పరిస్థితితో తృప్తి పడవచ్చు.

కాని ప్రజాస్వామ్య సమాజం ప్రతి పౌరునికి తీరికా, సంస్కృతీ లభించేటట్లు చూడాలి. ఈ విశ్లేషణ సరియైనదైతే ప్రజాస్వామిక సమాజం యొక్క నినాదం 'యంత్రాలు, మరిన్ని యంత్రాలు, నాగరికత మరింత నాగరికత' అని ఉండాలి. గాంధీతత్వంలో సామాన్య మానవుడు అతి తక్కువ ప్రతిఫలానికి నిరంతరం శ్రమిస్తూ, మృగంగానే మిగిలి పోవాలి. గాంధీతత్వం 'ప్రకృతికి మరలిపో' అనే పిలుపు అర్థం మళ్ళీ నగ్నత్వానికి మరలిపో, దుఃఖమయ జీవనానికి మరలిపో, పేదరికానికి మరలిపో, అనేక మంది ప్రజలకు అజ్ఞానస్థితికి మరలిపో అని.

జీవితాన్ని సమాజం యొక్క వేర్వేరు పనులుగా విభజించడం వేర్వేరు వర్గాలుగా విభజించడం పూర్తిగా తుడిచి వేయ లేక పోవచ్చు. ఎన్నో ఆర్థిక సామాజిక మార్పులు వచ్చినప్పటికి చట్టరీత్యా సేద్యబానిసత్వం, చట్టరీత్యా బానిసత్వం రద్దు చేసినప్పటికీ, ప్రజాస్వామ్య భావం వ్యాప్తి చెందినప్పటికీ, శాస్త్రీయవిజ్ఞానం పెరగడంతో, పుస్తకాల ద్వారా పత్రికల ద్వారా ప్రయాణం ద్వారా పాఠశాలలలోను, కర్మాగారాలలోనూ ఒకరితో ఒకరు అభిప్రాయాలను పంచుకోవడం ద్వారా విద్యావ్యాప్తి జరగడంతో సమాజంలో విద్యావంతులైన వారివర్గమూ, అజ్ఞానంగా ఉన్న వారి వర్గమూ, తీరికగల వారి వర్గమూ, శ్రమించేవారి వర్గమూ అనే అంతరం ఎప్పుడూ ఉంటుందేమో.

కాని గాంధీతత్వం కేవలం భావనాత్మకమైన వర్గభేదాలతో తృప్తి చెందలేదు. వర్గ నిర్మాణం కొనసాగి తీరాలని గాంధీతత్వం పట్టుపడుతోంది. సమాజం యొక్క వర్గ నిర్మితిని ఆదాయ నిర్మితిని పవిత్రమైనదిగా చూస్తుంది. దాని ఫలితంగా ధనవంతులూ, పేదవారు అనే విభేదాలు, ఎగువ వారు దిగువ వారు, యజమానులు కార్మికులు అనే భేదాలు సామాజిక వ్యవస్థలో శాశ్వత భాగాలుగా పరిగణించడం అవి కూడా పవిత్రమైన ఏర్పాటు అని భావించడం జరుగుతోంది. సామాజిక పర్యవసానాల దృష్ట్యా యింత కంటే వినాశకరమైనది మరొకటి లేదు. మనోవైజ్ఞానికంగా వర్గ నిర్మితి ఫలితంగా కదిలే ప్రభావాలు రెండు వర్గాలకూ హానికరంగా ఉంటాయి. ప్రత్యేకాధికారాలు కలిగిన వారూ పాలితులూ కలుసుకునే ఉమ్మడి స్థలం లేదు. అంతర్ద్రవాభిస్వతి (ఎండోస్మాసిస్) లేదు. జీవితాశలనూ, అనుభవాలనూ కలబోసి పంచుకోవడాలు లేవు. పాలిత వర్గానికి ఈ ఏర్పాటుచేసే సామాజిక నైతిక హాని వాస్తవమైనదీ ప్రత్యక్షమైనదీ. వారిని బానిసలుగా చేసే విద్యనిస్తుంది, బానిస మనస్తత్వం ఏర్పడే మానసిక సంకీర్ణతను సృష్టిస్తుంది. ప్రత్యేకాధికారాలున్న వర్గాన్ని ప్రభావితం చేసే అంశాలు కూడ అంతేవాస్తవమైనవి. వర్గ నిర్మితి మూలంగా ఏర్పడే ఏకాంత వాసము ఒంటెత్తుతనము

అధికార వర్గంలో ముఠాకు ఉండే సంఘ వ్యతిరేక భావాన్ని సృష్టిస్తుంది. తన సొంత ప్రయోజనం ఏదో ఉందనే భావం ఏర్పడి దానిని రక్షించుకోవడమే తమ కర్తవ్యమనీ రాజ్యప్రయోజనాలను కాదని అయినా రక్షించుకోవాలనే పట్టుదల యేర్పడుతుంది. దాని వలన వారి సంస్కృతి నిర్వీర్యమై వారి కళ ఆడంబరమై వారి సంపద ప్రకాశవంతమై వారి మర్యాదలు సున్నితములైనవీ అగును. ఆచరణలో వర్గనిర్మితిలో ఒక ప్రక్క క్రౌర్యము, ఆడంబరము, గర్వము, పొగరుబోతు తనము, స్వార్థము మొదలైనవి ఉండగా మరొక ప్రక్క భద్రతారాహిత్యము, పేదరికము, నైచ్యము, స్వేచ్ఛను ఆత్మ విశ్వాసమును, హుందా తనమును ఆత్మ గౌరవమును పోగొట్టుకొనడం ఉంటాయి. ప్రజాస్వామిక సమాజం అటువంటి ఫలితాల పట్ల నిర్లిప్తంగా ఉండలేదు. కాని గాంధీతత్వము ఈ పర్యవసానాల గురించి పట్టించుకోదు. గాంధీతత్వం కేవలం వర్గభేదాలతో తృప్తి చెందదు. అంటేచాలదు. గాంధీతత్వం కేవలం వర్గ నిర్మితిని విశ్వసిస్తుందంటే చాలదు. గాంధీతత్వం అంతకంటే మించిన వాటి కోసం నిలుస్తుంది. గాంధీతత్వం కోరేది రంగు వెలిసిన నిస్సారమైన భావనామాత్రమైన చచ్చిన, అస్థిపంజరమైన వర్గనిర్మితి కాదు. సజీవమైన విశ్వాసముగా పని చేసే వర్గ నిర్మితిని అది కోరుతుంది. దీనిలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఎందుకంటే గాంధీతత్వంలో వర్గ నిర్మితి కేవలం అకస్మాత్తుగా ఏర్పడినది కాదు. అది దాని అధికారిక సిద్ధాంతం.

పేదవారి ధర్మకర్తలుగా ధనిక వర్గం ఆస్తులు కలిగి ఉంటారని గాంధీతత్వం బోధిస్తున్న భావం దానిలోని అతి హాస్యాస్పదమైన విషయం. దీని గురించి ఎవరైనా చెప్పగలిగిందల్లా యిది: ఈ సిద్ధాంతాన్ని మరెవరైనా ప్రవచించి ఉంటే వాడు జీవిత సత్యాలు ఎరుగని పరమ మూర్ఖుడని వానిని చూసి నవ్వి పోతారు. తీరని ధన దాహంతో, అణగారని దురహంకారంతో కోట్లాది కష్టజీవులకు ఈ లోకాన్ని కన్నీటిలోయగా మార్చిన ఆస్తి కలిగిన వర్గం కాస్త నైతిక యుద్ధ సామాగ్రి మోతాదు వారికి వర్గ నిర్మితి సేవక వర్గం పై యిచ్చిన సర్వాధికారాన్ని దుర్వినియోగం చేయాలనే దుష్ట ప్రలోభానికి లోను కాకుండా చేయగలుగుతుందని చెప్పి సేవక వర్గాన్ని మోసం చేస్తున్నాడంటారు.

గాంధీతత్వం యొక్క సామాజిక ఆదర్శం కులము లేక వర్ణము. ఈ రెండింటిలో యేది దాని ఆదర్శమో చెప్పడం కష్టం. కాని ప్రజాస్వామ్యం గాంధీతత్వం యొక్క సామాజిక ఆదర్శం కాదనడంలో సందేహం లేదు. పోలికకు వర్ణాన్ని తీసుకున్నా కులాన్ని తీసుకున్నా రెండూ మౌలికంగా ప్రజాస్వామ్యానికి విరుద్ధాలే. గాంధీతత్వం కుల వ్యవస్థకు అనుకూలంగా చెప్పే వాదాలు బలమైనవీ నిజాయితీతో కూడినవి అయితే కొంత నయంగా ఉండేది. కాని ఆయన కులవ్యవస్థకు అనుకూలంగా చెప్పే వాదనలు అయోమయ వాక్చాతుర్యముతో కూడి ఉన్నాయి. కులానికి అనుకూలంగా గాంధీ వాదనలు పరిశీలిస్తే అవి బుద్ధిహీనంగా కాకపోతే కేవలం పైకి సబబుగా కనిపించేవిగా ఉంటాయి. ఈ అధ్యాయంలో ఇంతకు ముందు చెప్పిన వాదనలను సంక్షిప్తంగా పరిశీలిద్దాం.

ఈ మూడు వాదనలలో మొదటిది జాలి కొలుపుతుంది. ఇతర సమాజాలు చస్తుండడమో లేక పూర్తిగా అదృశ్యమై పోవడమో జరగ్గా హిందూ సమాజం మాత్రం నిలదొక్కుకుంది అనే వాదన అభినందనీయం మాత్రం కాదు. అదింకా బ్రతికి ఉందంటే కులం వల్ల కాదు, కాని [illegible] ఆక్రమించిన విదేశీయులు వారిని పూర్తిగా చంపేయడం అవసరం అనుకోక

భూమికి ముఖ్యం. బేషరతుగా లొంగిపోయి కూడా బ్రతకవచ్చు. పిరికి పందలా తిరోగమించి కూడా బ్రతకవచ్చు. పోరాడి బ్రతక వచ్చు. హిందువులు ఏ భూమిక మీద బ్రతికి ఉన్నారు. వారు పోరాడి శత్రువుల్ని జయించి బ్రతికారనగలిగితే గాంధీ కులవ్యవస్థకు ఆపాదించిన సుగుణాన్ని అంగీకరించవచ్చు. హిందువుల చరిత్ర దాసోహం యొక్క చరిత్ర - పూర్తిగా దాసోహం అనే చరిత్ర, ఇతరులు లొంగిపోయారనేది నిజమే కాని వారి లొంగుబాటు తరువాత విదేశ పాలనపై తిరుగుబాటు జరిగింది. దండయాత్ర చేసిన విదేశీ ముందర హిందువులు ఎన్నడూ నిలువ లేక పోవడమే కాదు, విదేశీ కాడిని విసరి అవతల పారవేయడానికి తిరుగుబాటును కూడా నిర్వహించ లేక పోయారు. పైపెచ్చు హిందువులు బానిసత్వాన్ని సుఖప్రదం చేసుకోవాలని ప్రయత్నించారు. దీని మీద అట్నుంచి వాదించ వచ్చు, అంటే హిందువుల ఈ దౌర్భాగ్య స్థితికి పూర్తి కారణం కుల వ్యవస్థే అని.

నాలుగవ పేరాలోని వాదనలో కొంత బలం ఉన్నట్లు కనిపించవచ్చు. కాని విద్యావ్యాప్తికి తగాదాలు తీర్చడానికి కులం ఒకటే తగిన యంత్రాంగం అనడానికి వీలు లేదు. అటువంటి పనులు చేయడానికి బహుశా కులం అధమ సాధనమేమో అనిపిస్తుంది. కులాన్ని సులభంగా ప్రభావితం చేయవచ్చు. అవినీతికి పాల్పడేట్లు చేయవచ్చు. ఇతర దేశాలలో కులాలు లేకపోయినా అటువంటి పనులు ఇండియాలో కంటే మెరుగ్గా చేస్తూ వచ్చారు. సైన్య సమీకరణకు కులాన్ని ఆధారం చేయడం అనే భావన పిచ్చి ఊహ లాంటిది. కులవృత్తి సిద్ధాంతంలో యిది ఆలోచించడానికి కూడా వీలు లేనిది. ఆయన సొంత రాష్ట్రమైన గుజరాతులో ఏ ఒక్క కులమూ సైనిక దళాన్ని సమీకరించ లేదన్న విషయం గాంధీకి తెలుసును. ప్రస్తుత ప్రపంచ యుద్ధంలో అది సమీకరించలేదు. గత ప్రపంచ యుద్ధంలో కూడా గాంధీ బ్రిటీషు సామ్రాజ్యవాదుల సైనిక సమీకరణ దళారిగా గుజరాతులో పర్యటించినపుడు కూడా అది సమీకరించలేదు. వాస్తవానికి రక్షణ కోసం సేనలోకి జనాన్ని సమీకరించడం కులవృత్తి సిద్ధాంతాన్ని వదలు కోవడం కాబట్టి అసంభవం.

5,6 పేరాలలో ఉన్న వాదనలు బుద్ధి హీనంగానూ పరమ అసహ్యంగానూ ఉన్నాయి. 5వ పేరాలోని వాదన అసలు మంచి వాదనే కాదు. కుటుంబ సభ్యులలో అంతర వివాహం లేక పోయినా ఒకరిపై మరొకరికి ప్రేమాభిమానాలుంటాయి. కాబట్టి కుటుంబం ఆదర్శ విభాగం అనుకోవడం కలిసి భుజించక పోయినా పరస్పర ప్రేమాభిమానాలున్న మాట కూడా నిజమని ఒప్పుకోవచ్చు. ఇదంతా దేనిని రుజువు చేస్తుంది? సౌభ్రాతృత్వము సాధించడానికి కులాంతర వివాహాలు, కలిసి భోజనం చేయడాలు అవసరం కాదని మాత్రం అదిరుజువు చేయడం లేదు. అది రుజువు చేసినది ఏమిటి? సౌభ్రాతృత్వం కొనసాగడానికి కుటుంబ బంధం యొక్క చైతన్యం వంటి యితర సాధనాలుకూడా ఉన్నాయి, కులాంతర వివాహాలు సహపంక్తి భోజనాలు అవసరం లేదు. కాని ఎక్కడైతే - ఉదాహరణకు కుల వ్యవస్థలో లేనట్లు - అను సంధాన శక్తిఉండదో అక్కడ కులాంతర వివాహాలు సహపంక్తి భోజనాలూ తప్పని సరిగా అవసరమనేది నిరాకరించ లేము.

కుటుంబానికీ కులానికీ మధ్య పోలిక లేదు. కుటుంబంలో అందరినీ కలిపే యితర శక్తులుండగా కులంలో వివిధ కులాలను కలిపేటటువంటి ఇతర శక్తులు లేవు కనుక కులాంతర పంక్తి భోజనాలు, కులాంతర వివాహాలు అవసరమవుతాయి. ఎవరైతే కులాంతర సహపంక్తి భోజనాలను కులాంతర వివాహాలనూ నిషేధించాలనే వారు. ఆ సమస్యను సాపేక్ష

విలువలుగా చూశారు. నిరపేక్ష విలువలకు సంబంధించిన సమస్యగా దానిని వారెప్పుడూ ఉన్నతంగా పరిగణించలేదు. ఆ విధంగా చేయడం గాంధీ ఆరంభించారు. సహపంక్తి భోజనాలు చెడ్డవి, వాటికి మంచి చేసే శక్తి ఉన్నప్పటికి సహ పంక్తి భోజనాలు చేయకూడదు, ఎందువల్ల? ఎందుకంటే భోజనం చేయడం మురికి పని, దొడ్డికి వెళ్ళినంత మురికిపని అనా? కుల వ్యవస్థను ఇతరులు కూడా బలపరచారు. కాని యిటువంటి అసాధారణమైన వాదన యింతటి అసహ్యాకరంగా అదర గొట్టే వాదన చూడడం నాకు యిదే మొదటి సారి. ఛాందసులు కూడా," మమ్మల్ని గాంధీ నుండి రక్షించండి" అనవచ్చు, గాంధీ ఎంత గొప్ప వీర హిందువో దాని వల్ల తెలుస్తోంది.చాలా ఛాందస హిందువులలో అతి ఛాందసమైన హిందువును కూడా గాంధీ మించారు. అది గుహలలో నివసించే మనిషి చేసే వాదన అంటే చాలదు. నిజంగా అది పిచ్చి మనిషి చేసే వాదన.

నైతిక బలం పుంజుకోవడం దృష్ట్యా చూస్తే 7 వ పేరాలో కులానికి అనుకూలంగా చెప్పిన వాదనలకు ఏమీ విలువ లేదు. మగవాడు తన కామవాంఛను తన కులానికి చెందని స్త్రీ ద్వారా తీర్చుకో కూడదని కులవ్యవస్థ నిస్సందేహంగా నిషేధించింది. తన కులానికి చెందని వాని ఇంట్లో వండిన తిండి ద్వారా తన ఆకలి తీర్చుకోరాదని కుల వ్యవస్థ నిస్సందేహంగా నిషేధించింది. నిషేధాలు హేతుబద్ధమైనవా అర్థవంతమైనవా అనేది చూడకుండా వాటిని పాటించడమే నీతి అనుకుంటే కుల వ్యవస్థను ఒక రకమైన నీతి పద్ధతి అని అంగీకరించవచ్చు. కానిఈ సులభమైన నిషేధాలకంటే హెచ్చు తూకంగల స్వైరతలను హిందూమతం అనుమతిస్తోందని గాంధీ గ్రహించడం లేదు. ఎందుకంటే మగవాడు తన కులానికి చెందిన వందమందిని పెండ్లాడినా లేక వంద మంది పడుపుకత్తెల్ని ఉంచుకున్నా హిందూ మతం ఏ నిషేధమూ చేయడం లేదు. తన కులం వాళ్ళతో ఎంత అతిగా ఉన్నప్పటికీ అది ఆపదు.

8 వ పేరాలోని వాదన సమస్యాయాచనలా ఉంది. (అనగా ఏది బుజావుచేయవలసి ఉందో దానినే ఆధారం చేసుకుని వాదించడం) . వంశపారంపర్య వృత్తి పద్ధతి మంచిది కావచ్చు, మంచిది కాక పోవచ్చు. మరి కొంత మందికి నచ్చక పోవచ్చు. దానినొక అధికారిక సిద్ధాంత స్థాయికి ఎత్తడం ఎందుకు? నిర్బంధం చేయడం ఎందుకు? యూరపులో అది అధికారిక సిద్ధాంతం కాదు, నిర్బంధం కాదు. అది వ్యక్తి యిష్టానికి వదలి పెట్టబడింది. చాలా మంది పూర్వీకుల వృత్తిని అనుసరిస్తారు, కొందరు అనుసరించరు. స్వయం నిర్ణయ పద్ధతి కంటే బలవంత పద్ధతి బాగా పని చేసిందని ఎవరు చెప్పగలరు? భారత దేశంలోని ప్రజల ఆర్థికస్థితిని యూరపులోని ప్రజల ఆర్థిక స్థితితో పోల్చడం ఏదైనా మార్గదర్శకంగా ఉంటే ఈ కారణం వల్లనే కుల వ్యవస్థను బలపరిచే హేతుమానస ప్రజలు చాలా తక్కువ మంది ఉంటారు. వృత్తులు మారుతున్నకొద్ది వాటిని వర్ణించే పేర్లు మార్పు...లో ఉందని చెబుతున్న కష్టం కృతకమైనది. ఒక వృత్తిచేస్తున్న వారికి పేరు పెట్టడం అవసరం అనుకోవడంలో నుండే ఈ కష్టం వస్తోంది. వర్ణాలు తెలిపే ఈ పేర్లు అనవసరం కనుక వాటిని విరమించినా వచ్చే కష్టం మేమీ లేదు. అంతేకాక ఈనాడు ఇండియాలో జరుగుతున్నదేమిటి? మనుష్యులు చేస్తున్న వృత్తుల ప్రకారం వారి వర్ణ నామాలున్నవా? బ్రాహ్మణుడు జోళ్ళు అమ్ముతున్నాడు. అతనిని చర్మకారుడు అని పిలువనందువల్ల ఎవరూ కలవర పడరు. ఒక చర్మకారుడు ఒక రాష్ట్రంలో ఉద్యోగి అవుతాడు. అతనిని బ్రాహ్మణుడు

అని పిలవనంత మాత్రాన ఎవరూ కలవరపడరు. ఆ వాదన అంతా ఒక తప్పుడు అవగాహన మీద ఆధార పడింది. సమాజానికి సేవ చేస్తున్న వాని వర్గనామం కంటే వాని సేవలు సమాజానికి ఎక్కువ ముఖ్యం.

కుల వ్యవస్థకు అనుకూలంగా 9వ పేరాలో చెప్పిన చివర వాదన యింతరవరకు నేను విన్న వాటిలో అత్యాశ్చర్యకరంగా ఉంది. చరిత్ర దృష్ట్యా అది అబద్ధం. మనుస్మృతి గురించి కొంతైనా తెలిసిన వారు ఎవరూ కుల వ్యవస్థ గురించి సహజవ్యవస్థ అనరు. మనుస్మృతి ఏమి చూపిస్తుంది? కుల వ్యవస్థ శిక్షా భయం ద్వారా న్యాయసమ్మతమైనదిగా చలామణి అవుతున్నదని చూపిస్తుంది. అదిచావకుండా మిగిలి ఉండడానికి **కారణాలు**: 1 ప్రజలు ఆయుధాలు ధరించకుండా చేయడం 2 ప్రజలకు విద్యాహక్కు **నిరాకరించడం** 3 ప్రజలకు ఆస్తి హక్కును నిరాకరించడం. కులవ్యవస్థ సహజమైనది కాక పోవడమే కాదు, అది వాస్తవానికి పాలక వర్గం సేవక వర్గం మీద బలవంతంగా రుద్దిన వ్యవస్థ.

గాంధీ కులవ్యవస్థ నుండి వర్ణ వ్యవస్థకు మారినంత మాత్రాన ఆయన ప్రజాస్వామ్యానికి వ్యతిరేకి అనే అభియోగం కాస్తంతైనా మారదు. మొదటిది, వర్ణభావం కులభావానికి తండ్రి లాంటిది. కులభావం విషపూరితం అవడానికి కారణం వర్ణభావం గరళం లాంటిది కావడమే. రెండూ దుష్టభావాలే కనుక వర్ణాన్ని నమ్మినా కులాన్ని నమ్మినా తేడా లేదు. బౌద్ధులు వర్ణభావాన్ని నమ్మలేదు. కనుక వారు దాన్ని నిర్దాక్షిణ్యంగా విమర్శించారు. ఛాందసులు లేక సనాతన వైదిక హిందువులు హేతు బద్ధముగా వర్ణ వ్యవస్థకు అనుకూలంగా ఏమీ చెప్పలేక పోయారు. వేదాల అధికారం మీద వర్ణ వ్యవస్థ నిర్మించబడింది. వేదాలలో పొరపాటుండదు కాబట్టి వర్ణవ్యవస్థలో పొరపాటుండదు అని మాత్రమే వారు చెప్ప గలిగారు. బౌద్ధుల హేతువాదం ముందు వర్ణవ్యవస్థను రక్షించడానికి వారు చెప్పిన వాదము చాలదు. వర్ణ వ్యవస్థ నిలబడడానికి కారణం భగవద్గీత. గీత వర్ణవ్యవస్థ మనుష్యుని అంతర్గతంగా ఉన్న సహజ గుణాలపై ఆధారపడిందని దానికి వేదాంత పరమైన పునాది యిచ్చింది. వర్ణభావాన్ని పటిష్టం చేయడానికి దానికీ ఊతం యివ్వడానికీ భగవద్గీత సాంఖ్య వేదాంతాన్ని ప్రయోగించింది. దాంతో యేమీ అర్థం లేకుండా నాశనం కాబోయే వర్ణ భావానికి కొంత అర్థం వచ్చినట్లయింది. సహజ గుణాలు అని సబబుగా కనిపించే ప్రాతిపదిక మీద వర్ణ వ్యవస్థను నిలబెట్టడం వల్ల మళ్ళీ దానికి ప్రాణం పోసి భగవద్గీత తాను చేయ గలిగినంత హాని చేసింది.

భగవద్గీత చెప్పిన వర్ణ వ్యవస్థలో కనీసం రెండు సుగుణాలున్నాయి. అది పుట్టుక మీద ఆధార పడిందని చెప్పలేదు. ప్రతి మనిషి వర్ణము అతని సహజగుణం మీద ఆధార పడి ఉంటుందని ప్రత్యేకంగా చెప్పింది. తండ్రి చేసిన వృత్తినే కొడుకు చేయాలని అది చెప్పలేదు. ఒక వ్యక్తి యొక్క వృత్తి అతని సహజగుణాల మీద ఆధారపడి ఉంటుంది. అంటే తండ్రి సహజ గుణాల మీద తండ్రి వృత్తి ఆధారపడి ఉంటుంది. కొడుకు సహజ గుణాల మీద కొడుకు వృత్తి ఆధారపడి ఉంటుంది. కాని గాంధీ వర్ణ వ్యవస్థకి క్రొత్త వ్యాఖ్యానం చేశారు. దానిని గుర్తు పట్టడానికి వీలు లేకుండా మార్చేశారు. సనాతన వ్యాఖ్యానం క్రింద కులం అంటే పుట్టుక, కులవృత్తి కాని వర్ణం అంటే కాదు. గాంధీ తన యిష్టాను సారంగా 'వర్ణ' అనేదానికి క్రొత్త వ్యాఖ్యానం చేశారు. గాంధీ అభిప్రాయంలో వర్ణం పుట్టుక**తో** నిర్ణయం అవుతుంది. ఒక వర్ణం యొక్క వృత్తి వంశపారం పర్యం అవుతుంది. అంటే కులానికి మారు పేరు వరం అయింది. గాంధీ కులం నుండి వర్ణానికి మార్చడం క్రొత్త

విప్లవాత్మక సిద్ధాంతం ఏమీ కాదు. గాంధీ అఖండమైన తెలివి తేటలన్నీ ఎప్పుడూ పిల్ల దయ్యం (elf) తెలివి తేటలు వంటివి, పిల్ల దయ్యానికున్న మారు వేషం లేకపోయినా దానికున్న వయసుకు మించిన తెలివి తేటలున్నాయి. పిల్ల దయ్యం మాదిరిగానే ఆయన కూడా ఎదగడు. కులతత్వం కంటే మించి ఎదగడు.

గాంధీ అప్పుడప్పుడు సామాజిక ఆర్థిక విషయాల మీద తానేదో ఎర్రబారినట్లు (అంటే కమ్యూనిష్టు అయినట్లు) మాట్లాడతారు. గాంధీని అధ్యయనం చేసిన వారెవరూ ఆయన అడపాదడపా ప్రజాస్వామ్యానికి అనుకూలంగాను పెట్టుబడి దారీ విధానానికి వ్యతిరేకంగానూ మాట్లాడినంత మాత్రాన మోస పోరు. గాంధీతత్వం ఏ అర్థంలోనూ విప్లవాత్మక సిద్ధాంతం కాదు. అది కరడు కట్టిన సంప్రదాయ పక్షవాదము (కన్సర్వేటిజం). ఇండియాకు సంబంధించినంత వరకు అది ప్రతిక్రియా వాదము, 'పాత కాలానికి పోదాం' అని ఎలుగెత్తి పిలిచే నినాదం తన ధ్వజం మీద వ్రాసుకుంది. ఇండియా యొక్క చనిపోయిన గతాన్ని చస్తున్న గతాన్ని పునర్జీవింప చేయడమే గాంధీతత్వం యొక్క ధ్యేయం.

గాంధీతత్వం విరోధాభాసం వంటిది. అది విదేశీ పాలన నుండి స్వతంత్రం సంపాదించడం కోసం అది నిలుస్తుంది. అంటే ఇప్పుడు దేశంలో ఉన్న రాజకీయ నిర్మాణాన్ని నాశనం చేయడం అన్న మాట. అదే సమయంలో వంశ పారంపర్యత ఆధారంగా ఒక వర్గం మరొక వర్గం మీద పెత్తనం చలాయిస్తూ శాశ్వతంగా అది కొనసాగాలంటే ప్రస్తుత సామాజిక నిర్మితి చెక్కు చెదరకుండా కొనసాగాలంటుంది. ఈ పరస్పర విరుద్ధ స్థితిని ఎలా వివరించాలి?

స్వరాజ్య ఉద్యమానికి హిందువులు, సనాతనులు కాని అధునాతనులు కాని అందరి హృదయపూర్వక సహకారాన్ని సమీకరించటానికి గాంధీ పన్నిన వ్యూహంలో ఇదొక భాగమా? అదే నిజమైతే గాంధీ తత్వాన్ని నిజాయితి నిష్కపటమైనది అనగలమా? అదలా ఉండనీయండీ, గాంధీతత్వం యొక్క రెండు లక్షణాలు స్పష్టంగా బయట పడుతున్నప్పటికీ ఎవరూ గమనించడం లేదు. ఆలక్షణాలు గాంధీతత్వం మార్క్సిజం కంటే ఆమోద యోగ్యంగా ఉందనిపిస్తున్నట్లున్నవా అనేది వేరే విషయం. కాని ఆ లక్షణాలు గాంధీతత్వం మార్క్సిజం కంటే ఎలా వేరుగా ఉందో చూడడానికి సహాయకారిగా ఉన్నాయి కాబట్టి వాటిని చూడడం మంచిది.

గాంధీతత్వం యొక్క మొదటి ప్రత్యేక లక్షణం ఏమిటంటే అది కలవారి ఆస్తిపాస్తులు చెక్కు చెదర కుండా వారు ఉంచుకోవడానికీ, లేని వారికి వారు పొందడానికి హక్కున్న దానిని కూడా పొందకుండా చేయడానికీ దాని తత్వం సహాయపడుతుంది. సమ్మెలపట్ల గాంధీ వైఖరి, కులం పట్ల గాంధీ గౌరవం, పేద వారి తరపున వారి మేలు కోసం ధనవంతులు ధర్మకర్తృత్వం వహిస్తారనే సిద్ధాంతమూ పరిశీలించిన వారెవరూ యిది గాంధీతత్వం యొక్క పర్యవసానమంటే కాదన లేరు. ఇది కావాలని లెక్క ప్రకారం చేసినదా లేక ప్రమాద వశాన జరిగిందా అనేది చర్చనీయాంశము. కాని ఒకటి మాత్రం నిజం. గాంధీతత్వం తీరిక కలిగిన ధనికవర్గానికి చెందిన వేదాంతంగా మిగిలింది.

గాంధీతత్వం యొక్క రెండవ ప్రత్యేక లక్షణం ప్రజల దురదృష్టాలను అదృష్టాలుగా చిత్రించి మోసం చేయడం. ఈ వాక్యం యొక్క నిజం నిరూపించడానికి ఒకటి రెండు ఉదాహరణలు చాలును.

హిందూ పవిత్ర శాసనాలు, శూద్రులు (నాలుగవ తరగతికి చెందిన హిందువులు) ఐశ్వర్యం సంపాదించ కూడదని వారిని శిక్షించింది. ప్రపంచంలో మరెక్కడా లేని బలవంతపు పేదరికం అది. గాంధీతత్వం ఏమి చేస్తుంది? ఆ నిషేధాన్ని తొలగించదు. ఆస్తిని వదులుకునే ధైర్యం ఉన్నందుకు అది శూద్రుని ఆశీర్వదిస్తుంది!! గాంధీగారి మాటలనే ఉటంకించడం మంచిది. అవి యిలా ఉన్నాయి[1].

"మత ధర్మంగా (ఉన్నత కులాల వారిని) సేవిస్తూ ఏ ఆస్తినీ సంపాదించకుండా,సంపాదించాలనే దురాశ కూడా లేని శూద్రుడు వేయి ప్రణామాలకు అర్హుడు. ..... దేవతలే వాని మీద పూలవర్షం కురిపిస్తారు."

గాంధీతత్వం పాకీ వాని పట్ల అవలంబించే వైఖరి. దీనికి మరొక ఉదాహరణ.హిందువుల పవిత్ర శాసనం ప్రకారం పాకీ వాని సంతానం పాకీ పని చేసుకునే బ్రతకాలి. హిందూమతంలో పాకీ పని ఎంపిక చేసుకునే వృత్తి కాదు, బలప్రయోగంతో కూడిన విషయం, గాంధీతత్వం ఏమి చేస్తుంది? సమాజానికి చేసే అత్యున్నత సేవగా ప్రస్తుతించి ఈ పద్ధతిని శాశ్వతంగా కొనసాగించాలని చూస్తోంది!! గాంధీని ఉటంకించనియ్యండి. అంటరాని వారి సమావేశాధ్యక్షునిగా గాంధీ ఇలా అన్నారు[2].

"నాకు మోక్షం అక్కర లేదు. నాకు మళ్ళీ జన్మయెత్తాలని లేదు. కాని నేను మళ్ళీ జన్మించ వలసి వస్తే నేను అంటరానివాని గానే పుట్టాలి. అలా అయితే వారి దుఃఖాలను, బాధలను వారికి జరిగే అవమానాలను వారితో పాటు అనుభవించి నన్నూ వారినీ ఆ దిక్కుమాలిన స్థితి నుంచి విముక్తి చేయడానికి కృషి చేయగలుగుతాను.

అందుకని నేను మళ్ళీ పుట్టవలసి వస్తే బ్రాహ్మణునిగా కాక క్షత్రియునిగా కాక, వైశ్యునిగా కాక, శూద్రునిగా కాక అతి శూద్రునిగా పుట్టించ మని దేవుని ప్రార్థించాను.....

"నాకు పాకీ పని చెయ్యడం యిష్టం. నా ఆశ్రమంలో 18 సంవత్సరాల బ్రాహ్మణ యువకుడు ఆశ్రమ పాకీ పనివారికి పరిశుభ్రత నేర్పడానికి పాకీ పని చేస్తున్నాడు. ఆ యువకుడు సంస్కర్త కాడు. అతడు ఛాందసంలో పుట్టి పెరిగాడు." కాని పరిపూర్ణమైన పాకీ పని నేర్చుకుంటేగాని తాను సాధించిన యితర విద్యలన్నీ అసంపూర్ణాలనీ ఆశ్రమ పాకీ వాడు తన పనిబాగా చేయాలంటే తాను చేసి చూపించాలనీ అతడు భావించాడు.

"మీరు హిందూ సమాజాన్ని శుభ్రపరుస్తున్నారని గమనించండి."

ఒక వర్గం మరొక వర్గం మీద కావాలని విధించిన దురాచారాన్ని శాశ్వతంగా కొనసాగించడానికి గాంధీతత్వం చేసిన ఈ ప్రయత్నం కంటే దుష్టచారానికి మరొక ఘోరమైన ఉదాహరణ ఉందా?

గాంధీతత్వం పేదరిక నిబంధన కేవలం శూద్రునికే కాక అందరికీ బోధించి ఉంటే అది పొరపాటు భావం అని చెప్పడం కంటే అధమం ఏమీ లేదు. కాని యిది ఒక వర్గానికి

1. ' వర్ణవ్యవస్థ' 51వ పుట నుండి
2. 'యంగ్ ఇండియా', 27 ఏప్రిలు, 1921.

మంచిదని బోధించడం ఎందుకు? వాని యిష్టానికి వదిలేస్తే అంగీకరించని పనిని యిష్టపడి చేసేలా చేయడానికి మానవదోషాలైన గర్వానికి అహంకారానికీ నివేదించాలా? బ్రాహ్మణులు పాకీ పని చేసినా హిందూ శాస్త్రాలు హిందూభావాలు పాకీ వానిగా పుట్టిన వానిని పెట్టే యిబ్బందులు అతనికి ఉండవు అని స్పష్టంగా ఉన్నపుడు అలాంటపుడు బ్రాహ్మణులు కూడా పాకీ పనిచేయడానికి సిద్ధంగా ఉన్నాడని చెప్పడం వల్ల ప్రయోజనం ఏమిటి? ఎందుకంటే ఇండియాలో మనిషి పనిచేత పాకీపని వాడు కాడు. అతడు పాకీపని చేసినా చేయకపోయినా పుట్టుక చేతనే పాకీవాడు అవుతాడు. పాకీ పని చేయడానికి ఇష్టం లేనివారిని ఆ పని చేయడానికి ప్రేరేపించే నిమిత్తం పాకీపని గొప్పవృత్తి అని బోధించి ఉంటే ఎవరైనా అర్థం చేసుకోగలిగే వారు.

కాని పాకీ వాని చేత ఆ పని వదల కుండా చేయించడానికి, ఆ పని గొప్పదని చెబుతూ వాడు సిగ్గు పడవలసిన అవసరం లేదని చెబుతూ వాని గర్వానికీ అహంకారానికీ ఎందుకు నివేదించాలి?[1] శూద్రునికే పేదరికం మంచిదని ఇంకెవరికీ కాదని బోధించడం, పాకీ పని అంటరాని వారికే మంచిదని యింకెవరికీ కాదని బోధించడం ఆ నికృష్టమైన పని జీవితోద్దేశ్యంగా ఎంచుకొనేటట్లు చేయడానికి వారి అహంకారానికి నచ్చేటట్లు చెప్పడం ఈ నిస్సహాయ వర్గాల మీద దౌర్జన్యమే అవుతుంది, క్రూరమైన ఎగతాళి అవుతుంది. ఈ సందర్భంలో గాంధీ 'తత్వం' ను పోలిన మరో 'తత్వాన్ని' నిరాకరిస్తూ వోల్టర్ చెప్పిన మాటలు గుర్తుకొస్తాయి" అయ్యో! కొంత మంది బాధ పడడం వల్ల యితరులకు ఆనందం చేకూరుతుందనీ అందరికీ మేలు జరుగుతుందనీ చెప్పడం ఎంత వెటకారం (ఎగతాళి)! చస్తూన్న మనిషికి అతని కుళ్ళుతున్న శరీరం నుండి వేలాది పురుగులు పుడతాయని చెప్పినందువల్ల అతనికేం ఊరట కలుగుతుంది?"

విమర్శ అటుంచి, ఎవరికైతే అన్యాయం జరుగుతుందో ఆ అన్యాయాన్నే వాళ్ళ ప్రత్యేక హక్కులా చిత్రించే శిల్పం గాంధీతత్వానిది. తప్పుడు విశ్వాసాలను నూరిపోయడానికీ అబద్ధపు భద్రత కలిగించడానికీ ప్రజలను జోకొట్టడానికీ మతాన్ని నల్లమందులా పూర్తిగా వినియోగించిన 'తత్వం' యేదైనా ఉంటే అదే గాంధీతత్వం. షేక్స్పియరు బాణీలో యిలా చెప్పవచ్చు: "బూటకమా! చాతుర్యమా! నీ పేరు గాంధీతత్వం."

## IV

అటువంటిది గాంధీతత్వం. గాంధీతత్వం అంటే ఏమిటో తెలుసుకున్న తరువాత, "గాంధీ తత్వమే దేశ శాసనమైతే దాని క్రింద అంటరాని వారి అదృష్టం ఎలా ఉంటుంది?" అనే ప్రశ్నకు బదులివ్వడానికి ఎక్కువగా ఆలోచించవలసిన అవసరంలేదు. అట్టడుగు హిందువుతో అతని స్థితితో పోలిస్తే అతని స్థితి ఎలా ఉంటుంది? గాంధేయ సమాజ స్థితి వస్తే అతని స్థితి ఎలా ఉంటుందో చూపించడానికి చాలినంత యింత వరకు చెప్పబడింది.

---

1. ఇండియాలో కొన్ని రాష్ట్రాలలో పాకీవాడు పాకీపని చేయనంటే అది నేరంగా పరిగణించి శిక్షించడానికి శాసనాలున్నాయి.

హక్కులు పోగొట్టుకున్న తరగతికి అట్టడుగు హిందువూ అంటరాని వాడూ చెందుతారు అన్నంతవరకు అంటరాని వాని స్థితి మెరుగ్గా ఉండదు. ఒకప్పుడు అంతకంటే హీనంగా కూడా ఉండవచ్చు. కారణం, ఇండియాలో కుల హిందువులలో అట్టడుగున ఉన్నవాడు - అదివాసి కొండజాతి మనిషి కూడా - అతడు ఆర్థికంగా విద్యాపరంగా ఎక్కువ స్థితిలో లేకపోయినా అంటరాని వారి కంటే గొప్పవారు. అతడు అంటరాని వారి కంటే గొప్పవానిగా భావిస్తాడని కాదు. అతడు అంటరాని వారి కంటే తాను గొప్పవాడనని చెబితే హిందూ సమాజం ఆమోదిస్తుంది. కాబట్టి అంటరానివాడు ఇప్పటి దుస్థితినే యికముందు కూడా అనుభవిస్తూ ఉంటాడు. అంటే సమృద్ధి దినాలలో అతనిని చివరగా పనిలో పెట్టుకుంటారు మాంద్య దినాలలో అతనినే మొట్ట మొదట పనిలో నుండి తీసి వేస్తారు.

ఈ దుర్దశను వారికి తొలిగించడానికి గాంధీతత్వం ఏం చేస్తోంది?. గాంధీతత్వం అంటరానితనాన్ని తొలగించాలని చెప్పుకుంటోంది. గాంధీతత్వం యొక్కగొప్ప సుగుణం ఇదేనని అందరూ కీర్తిస్తున్నారు. కాని వాస్తవ జీవితంలో ఎంతవరకు ఈ సుగుణం కనిపిస్తోందిॽ గాంధీతత్వంలో అతి గొప్ప విషయంగా చెపుతున్న ఈ అంటరానితన వ్యతిరేకత విలువను అంచనా కట్టడానికి అంటరానితనము పోగొట్టడానికి గాంధీ కార్యక్రమం యొక్క పరిధిని పూర్తిగా అవగాహన చేసుకోవడం అవసరం, హిందువులు అంటరాని వారిని తాకడానికి సంకోచించరు అని మాత్రమేనా దాని అర్థంॽ అంటరాని వారికి విద్యను పొందే హక్కుపై నిషేధం తొలగిందని దాని అర్థమాॽ ఈ రెండు ప్రశ్నలను విడివిడిగా పరిశీలించడం మంచిది.

మొదటి ప్రశ్న తీసుకుందాం. అంటరాని వారిని తాకిన తరువాత హిందువు స్నానం చేయకూడదని గాంధీ అన లేదు. మైలను శుద్ధి చేసుకోవడానికి స్నానం చేయడం అభ్యంతర పెట్టకపోతే అంటరాని వారిని తాకినంతనే అంటరానితనం ఎలా మాయమవుతుందో తెలుసుకోవడం కష్టం, ముట్టుకుంటే మైల పడడం స్నానం చేస్తే శుద్ధి కావడం అనే భావం కేంద్రంగా కలది అంటరానితనం. అంటరానితనం పోగొట్టడం అంటే హిందువులతో సామాజికంగా కలుపుతున్నారాॽ అంటరానితనం పోయినంత మాత్రాన కులాంతర వివాహాలు కులాంతర సహపంక్తిభోజనాలు జరుగుతాయని కాదు అని గాంధీ చాలా స్పష్టంగా చెప్పారు. గాంధీ అంటరానితన వ్యతిరేకత అర్థం అంటరాని వారిని అతి శూద్రులుగ అనడానికి బదులుగా శూద్రులు అంటారు. అందులో అంతకు మించి యేమీ లేదు. పాత శూద్రులు ఈ కొత్త శూద్రుల్ని స్వీకరిస్తార్లా స్వీకరించరా అనే ప్రశ్న గాంధీ పరిగణించ లేదు. అంటరానితనం పోయినంత మాత్రాన వారిని శూద్రులు తమలో చేర్చుకోరనే విషయం బహుశా గాంధీ ఎరుగును. ఆ కారణం వల్లనే అంటరానివారికి గాంధీ స్వయంగా ఒక క్రొత్త పేరిచ్చినారు. కాబోయే నిజాన్ని ఈ క్రొత్త పేరు నమోదు చేస్తుంది. అంటరానివారిని హరిజనులని పిలవడంతో గాంధీ ఒకే రాయితో రెండు పిట్టల్ని కొట్టారు. అంటరానివారిని శూద్రులు తమలో చేర్చుకోవడం సాధ్యం కాదని చూపించారు.

---

1. 'యంగ్ ఇండియా', . 5 ఫిబ్రవరి 1925.

ఈ క్రొత్త పేరు పెట్టడంతో చేర్చుకోవడానికి విరుగుడుగా పని చేసి అది సాధ్యంకాకుండా చేసింది.

ఇక రెండవ ప్రశ్నకు సంబంధించి అంటరాని వారు విద్యాభ్యాసం చేయడం మీద పాత నిషేధాన్ని తొలగించి వారు చదువుకుని విద్యనూ జ్ఞానాన్ని పొందడానికి అనుమతించిన మాట నిజమే. గాంధీతత్వం క్రింద అంటరానివారు న్యాయశాస్త్రం అధ్యయనం చేయవచ్చు, వైద్య శాస్త్రం అధ్యయనం చేయవచ్చు, ఇంజనీరింగు చదవచ్చు వారికిష్టం అయిన దేదైనా చదవచ్చు. అంతవరకు బాగానే ఉంది. కాని అంటరానివాడు తన విద్యనూ జ్ఞానాన్నీ ఉపయోగించే స్వేచ్ఛ వానికి ఉందా? వారికి వృత్తిని ఎంచుకునే హక్కుందా? వారు డాక్టరో, లాయరో, ఇంజనీరో అయ్యే హక్కుందా? ఈ ప్రశ్నలన్నింటికీ గాంధీతత్వం గట్టిగా 'లేదు'[1] అని చెబుతుంది. అంటరాని వారు వారి కులవృత్తులు చేయాలి. అవి అపరిశుభ్రంగా ఉంటాయనడం జవాబు కాదు. అవి కుల వృత్తులు కాక పూర్వం బల ప్రయోగం జరిగిందనడం ఎవరూ పట్టించుకోరు. గాంధీతత్వం వాదన ఏమిటంటే ఒకసారి నిర్ణయం అయింది కాబట్టి అది తప్పు నిర్ణయం అయినా శాశ్వత నిర్ణయమే. గాంధీతత్వం క్రింద అంటరానివారు శాశ్వతంగా పాకీ వాళ్ళుగా ఉండి పోతారు. ఇంతకంటే ఛాందస పద్ధతి అయిన అంటరానితనాన్నే అంటరానివారు కోరుకుంటారనడంలో సందేహం లేదు. హిందూశాస్త్రాలు అంటరానివారి మీద అజ్ఞాన స్థితిని రుద్దినందువల్ల పాకీపని సహించడానికి వారికి వీలయింది. కాని విద్యావంతుడైన అంటరానివానిని పాకీపని చేయాలని గాంధీతత్వం అనడం క్రూరత్వం తప్ప మరేమీ కాదు. గాంధీతత్వం చూపిన కటాక్షం ఘోర శాపం అయింది. గాంధీతత్వంలోని అస్పృశ్యతా విరోధము కేవలం బూటకం. దానిలో పస లేదు.

## V

అంటరానివారి చివర ముక్తికి బాటగా వారు స్వీకరించ గలిగింది గాంధీ తత్వంలో యింకా ఏముంది? అంటరాని వారికి వ్యతిరేకంగా తలపెట్టిన బూటకపు ప్రచారం మినహాయిస్తే హిందూతత్వం యొక్క వీర రూపమైన సనాతనతత్వం యొక్క మరొక రూపమే గాంధీతత్వం. సనాతన హిందూత్వంలో లేని ఏ విషయం గాంధీతత్వంలో ఉంది? హిందూమతంలో కులం ఉంది, గాంధీతత్వంలో కులం ఉంది. హిందూమతం కులవృత్తిని పారంపర్యంగా నమ్ముతుంది. గాంధీతత్వంలో కూడా ఉంది. హిందూమతం కర్మ సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. గాంధీతత్వం కూడా అదే పని చేస్తుంది. హిందూ మతం భగవంతుని అవతారాలను విశ్వసిస్తుంది. గాంధీతత్వం కూడా అదే పని చేస్తుంది. హిందూ మతం విగ్రహాలను విశ్వసిస్తుంది.[2] గాంధీతత్వం కూడా అదే పని చేస్తుంది. గాంధీతత్వం చేసిందల్లా హిందూ మతం పిడివాదాలకు తాత్విక సమర్థన యివ్వడమే. మోటుగానూ, క్రూరంగానూ కనిపించే కట్టుబాటుతో కూడిన వ్యవస్థ అనే అర్థంలో బోడిది (బట్టతలది). దాని ఉపరితలాన్ని నునుపు చేసే తాత్విక అంశాలను గాంధీతత్వం అందించి చూడడానికి కాస్త అందంగాను గౌరవప్రదంగాను ఆకర్షణీయంగా కూడా కనిపించేట్లు మార్చేసి అలంకరించింది. హిందూ మతం యొక్క నగ్న సత్యాన్ని కప్పడానికి గాంధీతత్వం ప్రతిపాదించిన వేదాంతం ఏమిటి?

1. ఈ విషయం మీద గాంధీ అభిప్రాయాలు పుటలలో చూడవచ్చు.
2. గాంధీ విశ్వాసాలు యంగ్ ఇండియా 6 అక్టోబరు 1921 ప్రచురణలోవివరించబడ్డాయి హిందుస్తాన్ టైమ్స్, 15 ఏప్రిలు, 1945

ఆ తత్వం అంతా సంక్షిప్తంగా చెప్పవచ్చు. ఈ తత్వం చెబుతున్నది "హిందూమతంలో ఉన్నదంతా ప్రజాశ్రేయస్సుకు అవసరమైనది". వోల్టేర్ రచించిన కాండిడేతో బాగా పరిచయం ఉన్నవాళ్ళు దానిలోని మాస్టర్ పాంజిలాస్ తత్వాన్ని గుర్తించగలరు. దానిని వోల్టేర్ చేసిన వెక్కిరింపు కూడా జ్ఞాపకానికి వస్తుంది. సహజంగా హిందువులు గాంధీతత్వం విని ఆనందించారు. అది వారికి సరిపోయింది. వాళ్ళ ప్రయోజనాలకు అనుగుణంగా ఉంది. ప్రొఫెసర్ రాధాకృష్ణన్ - నిజంగా మనస్ఫూర్తిగా చెప్పారో లేక యిచ్చకాలాడుతూ చెప్పారో యిప్పుడు విచారించడం అనవసరం - ప్రొఫెసర్ రాధాకృష్ణన్ గాంధీని"భూమి మీద దేవుడు" అని వర్ణించేంత వరకు వెళ్ళారు. అంటరానివారు దీని అర్థం ఏమని అనుకుంటారు? వారికిలా అర్థమవుతుంది. "ఆయన భారత దేశాన్ని చూచి అంతా బాగుంది హిందువులు కుల ధర్మం పాటిస్తున్నంత కాలం అంతా ఇకముందు కూడా బాగా ఉంటుంది. అంటూ ఏమీ మార్చలేదు. బాధాసర్పదష్టులైన వారికిలా చెప్పాడు. "నేను కులధర్మాన్ని నెరవేర్చడానికి వచ్చాను. దానిని హీన పరచడానికి నేను కాస్తంతైనా, పిసరంతైనా అనుమతించను."

గాంధీతత్వం అంటరానివారికి ఏమి ఆశ చూపించగలదు? అంటరాని వారికది వాస్తవమైన చిత్రహింసల గది. వేదాల పవిత్రతా అమోఘత్వమూ, హృదయంలేని కర్మసిద్ధాంతమూ, పుట్టుకతోనే హోదా నిర్ణయించే మతిలేని సిద్ధాంతమూ, హిందూ మతం అంటరానివారికి విరుద్ధంగా తయారు చేసిన నిజమైన చిత్రహింసల ఆయుధాలు. అంటరాని వారి జీవితాన్ని ఛిన్నాభిన్నంచేసి, ధ్వంసం చేసి నాశనము చేసిన ఆ ఆయుధాలింకా చెక్కు చెదరకుండా, వన్నెతరగకుండా గాంధీతత్వం హృదయంలో ఉన్నాయి. గాంధీతత్వం స్వర్గమని చిత్రహింసల గది కాదని అంటరానివారు ఎలాచెప్పగలరు? అంటరాని వారికి ఒకే ఒక ప్రతిక్రియ: గాంధీతత్వం నుండి పారిపోవడమే.

నేనింత వరకు చెప్పినది పాతరకం గాంధీతత్వానికి వర్తిస్తుందని గాంధీవాదులు అనవచ్చు. ఒక క్రొత్తరకం గాంధీతత్వం, కులం లేని గాంధీతత్వం ఉంది. ఈ మధ్య గాంధీ కులానికి కాలదోషం పట్టిందనీ ఇప్పటి కాలానిదిదని యిచ్చిన ప్రకటన[1], గురించి సూచన యిది. గాంధీ ప్రకటనతో సంస్కర్తలు సంతోషించారు. హిందువుల మీద బ్రహ్మాండమైన ప్రభావం కలిగిన గాంధీ అంతటివాడు సామాజిక ప్రతిచర్య వాదిగా నాశనకారి పాత్ర వహించిన తరువాత, కులతత్వ నాయకుడిగా నిలచిన తరువాత, ఆలోచించని హిందువులకు న్యాయాన్యాయముల మధ్య విచక్షణ చూపని వాదనలతో వారిని మోసగించి మూర్ఖులను చేసిన తరువాత, ఈ అభిప్రాయ ఉపసంహరణ చేశాడంటే ఎవరు సంతోషించ కుండా ఉండగలరు? కాని యిది నిజంగా సంతోషించి గంతేయ వలసిన విషయమా? ఇది గాంధీతత్వ స్వభావాన్ని మార్చుతుందా? ఇది గాంధీతత్వాన్ని మునపటికంటే మెరుగైనదీ క్రొత్త 'తత్వంగా' చేస్తుందా? గాంధీ అభిప్రాయ ఉపసంహరహణతో ఉబ్బితబ్బిబ్బవుతున్న వారు రెండు విషయాలను మరిచిపోతున్నారు. మొదటి విషయం గాంధీ చెప్పిందల్లా కులానికి కాలదోషం

[1]. హిందుస్తాన్ టైమ్స్, 15 ఏప్రిల్, 1945

పట్టిందని మాత్రమే. అది దుష్టమైనదని ఆయన చెప్పలేదు. అది దుష్టభావం కలిగినదని చెప్పలేదు. గాంధీ కులానికి అనుకూలుడు కాడని అర్థం చేసుకోవచ్చును. కాని గాంధీ వర్ణవ్యవస్థకు వ్యతిరేకి అని చెప్పుకోలేదు. మరి గాంధీ వర్ణవ్యవస్థ ఏమిటి? అది కుల వ్యవస్థకు మరో పేరు మాత్రమే. దానిలో కులవ్యవస్థ యొక్క అధమ లక్షణాలన్నీ ఉన్నాయి.

గాంధీ ప్రకటన అర్థం గాంధీతత్వంలో మౌలిక మార్పేదీ వచ్చిందని కాదు. దానివల్ల గాంధీతత్వం అంటరాని వారికి ఆమోదయోగ్యం కాదు. అంటరాని వారు యింకా ఈ విధంగా అనడానికి సబబుంది. " ఓ మంచి దేవా! (ఓరి! దేవుడా!) మా రక్షకుడు ఈ గాంధీయేనా?

# అనుబంధం I

## అంటరాని వారి కోసం బార్డోలీ కార్యక్రమంపై శ్రద్ధానంద్

అంటరాని వారి సముద్ధరణకు ఒక పథకం రచించడానికి 1922లో నియమించబడిన కాంగ్రెసు ఉపసమితి మీద స్వామి శ్రద్ధానంద్‌కు కాంగ్రెసు జనరల్ సెక్రటరీ పండిత్ మోతీలాల్ నెహ్రూకు మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు

### 1 స్వామీజీ ఉత్తరం

జనరల్ సెక్రటరీ,
అఖిల భారత కాంగ్రెసు కమిటీ,
మకాం, ఢిల్లీ

అంటరానితనం మీద వర్కింగ్ కమిటీ, అఖిల భారత కాంగ్రెసు కమిటీ చేసిన తీర్మానాలు పొందుపరుస్తూ మీరు వ్రాసిన 331, 332 నంబర్లు గల ఉత్తరాలు అందాయి. కృతజ్ఞతలు. కమిటీ పాసు చేసిన అన్ని విషయాలూ అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానంలో యిప్పటి పద జాలంలో కనిపించడం లేదని బాధగా ఉంది.

విషయాలు యివి: నేను ఈ క్రింది ఉత్తరాన్ని అప్పటి జనరల్ సెక్రటరీ అయిన విఠల్ భాయ్ పటేల్‌కు 23 మే 1922 నాడు వ్రాశాను. అది దేశంలో అన్ని పత్రికలలోను ప్రచురించబడింది.

'నా ప్రియమైన పటేల్,

కాంగ్రెసు కార్యక్రమంలో మొట్టమొదటి అంశంగా మహాత్మాజీ ఒకప్పుడు అస్పృశ్యతా నివారణను ఉంచేవారు. (చూడండి యంగ్ ఇండియా 25 మే 1921). ఇప్పుడు దళిత జాతుల ఉద్ధరణ సమస్య ఒక మూలకు నెట్టబడిందని కనిపిస్తోంది. మనలోని మంచి కార్యకర్తలు ఖాదీ వైపు ఆకర్షింపబడి దాని కోసం విరివిగా డబ్బు కేటాయించబడగా, బలమైన ఉపసమితి జాతీయ విద్య చూడడానికి ఏర్పాటు చేయగా, దాని నిధులకోసం ప్రత్యేక విజ్ఞాపన చేయ తలపెట్టబడుతుండగా యివన్నీ జరుగుతుంటే అంటరాని తనాన్ని పోగొట్టడానికి అహ్మదాబాదు, అహమ్మద్ నగర్, మదరాసులకు చిన్న మొత్తాలు దానం చేసి ఆ సమస్యను బీరువాలో పెట్టారు. ఆరు కోట్ల అధిక సంఖ్యాకులుగా ఉన్న మన సోదరులను మనపైకి ఉద్యోగిబృందం ఉసి కొల్పగా మన ఖాదీ పథకం కూడా పూర్తిగా జయప్రదం కాదు అని

నాఅభిప్రాయం. ఈ ప్రక్క మన దళిత సోదరులు ఖాదీని విడిచి చౌకగా ఉన్న విదేశీ బట్టల్ని కొంటున్నారని మన వర్కింగ్ కమిటీ సభ్యులకు బహుశా తెలియదు. వచ్చే జూన్ నెలలో లక్నోలో జరుగబోయే సమావేశంలో ఈ క్రింది తీర్మానాన్ని ప్రవేశ పెట్టదలచాను. దళిత జాతులని పిలువ బడుతున్న వారి గురించి చేసిన తీర్మానాన్ని అమలు జరపడానికి ముగ్గురు ఆలిండియా కాంగ్రెసు కమిటీ సభ్యులతో ఒక ఉప కమిటీని వేయాలనీ, అయిదు లక్షల రూపాయల సొమ్ము ప్రచార కార్యక్రమానికై కేటాయించాలని, భవిష్యత్తులో నిధులకోసం వచ్చే దరఖాస్తులన్నిటిని ఆ ఉప సంఘానికే నివేదించాలని తీర్మానం ప్రవేశ పెట్టాలని ఆలోచిస్తున్నాను. నాప్రతిపాదనకు కార్యవర్గ సభ్యులు ఇలా సవరించారు:

ఆ కార్యవర్గం స్వామిశ్రద్ధానంద, శ్రీమతి సరోజినీనాయుడు, జి.బి.దేశ్‌ముఖ్, ఐ.కె.యాజ్ఞిక్‌లతో ఒక ఉప సంఘాన్ని నియమిస్తోంది. వీరు దేశమంతటా అస్పృశ్యులన బడే ప్రజల జీవన స్థితి గతుల్ని మెరుగుపరచడానికి తీసుకోవాల్సిన చర్యల్ని గురించిన ఒక పథకాన్ని తయారుచేసి, తరువాత కార్యవర్గసమావేశంలో తమ ప్రతిపాదనల్ని సమర్పిస్తారు. ప్రస్తుతానికి ఈ ఉప సంఘ కార్యక్రమాల కోసం నిధిని 2 లక్షల రూపాయల దాకా పెంచడానికి కూడా తీర్మానించడమయింది."

పటేల్ కార్యవర్గ తీర్మానాన్ని యధాతథంగా అంగీకరించమని నన్నడిగారు. నేను నిరాకరకరిస్తూ 2లక్షల బదులు 5లక్షల గ్రాంటు కావాలని కోరాను. ఆ ఐదులక్షల్లో ఒక లక్షను అఖిల భారత కాంగ్రెస్ కమిటీ కేటాయించవచ్చని ఒకనియమం పెడుతూ తక్కిన ధనం కోసం విజ్ఞప్తి చేయాలని కూడా సూచించారు.

రాజగోపాలాచార్యులు కార్యవర్గం తంపున ఒక ప్రతిపాదన చేశారు. కాంగ్రెస్ నిధుల నుంచి ఇప్పుడే ఎంత ధనం కేటాయించాలో నిర్దేశించటానికన్నా ఉపసంఘం వారి పథకాలు కార్యవర్గం ఆమోదాన్ని పొందినపుడు ఆ కార్యవర్గంవారే తాము భరించ గలిగి నంత ధనాన్ని అప్పటికప్పుడే విడుదల చేయాలని తీర్మానం చెయ్యడం మంచిదని ఆయన ప్రతిపాదన. ఆయన అన్న మాటలు జ్ఞాపకం లేవు కాని ఆయన మాటలకు అర్థం మాత్రం నాకు తెలిసినంత వరకు ఇంతే.

దీనిపై గొడవ ప్రారంభమైంది. అఖిల భారత కాంగ్రెస్ కమిటీ దగ్గర ఎంత ధనం ఉందో ప్రకటించాలని అన్ని వైపుల నుంచీ ఒత్తిడి మొదలైంది. అధ్యక్షుడు నన్ను పక్కకు పిలిపించి రహస్యంగా కాంగ్రెస్‌కి రొక్కం చాలా తక్కువగా ఉందని చెబుతూ, బయటి వారు, గూఢాచారులు చేరి ఉన్న ఈ సభలో ఈ రహస్యాన్ని బయట పెడితే కాంగ్రెస్ ఉద్యమం దెబ్బతింటుందని అన్నారు. ఈ మాట మీద నేను రాజగోపాలాచారి గారు ప్రతిపాదించిన ఆ సవరణను ఒప్పుకున్నాను. అప్పటికీ నన్ను సమర్థించిన వారు, సహాయకులుగా నిలిచే వ్యక్తులు ఈ ప్రతిపాదనను నిరసిస్తూనే ఉన్నారు. అది కాదు కాని నాకు ఆశ్చర్యం కల్గించేదేమిటంటే పత్రికల్లో అసోసియేటెడ్ ప్రెస్ వారి ప్రకటన ప్రకారం కేవలం రాజగోపాలాచారి గారి సవరణ మాత్రం ప్రచురింపబడటం.

పై తీర్మానం ఆమోదింపబడిన తరువాత కొంతమంది సభ్యులు ఉప సంఘానికి ఒక సమన్వయ కర్తను నియమించాలని సూచించారు. చాలామంది నా పేరును ప్రతిపాదించారు కూడా. అప్పుడు సాధారణ కార్యదర్శిగా ఉండిన విఠల్ భాయ్‌పటేల్ లేచి నుంచొని ఇలా

అన్నారు: "స్వామి శ్రద్ధానంద గారి పేరు మొదట ఉండడం వల్ల సహజంగా ఆయనే సమన్వయ కర్తగా వ్యవహరిస్తారు. దీనికి ప్రత్యేకమైన తీర్మానమంటూ ఏదీ అక్కర లేదు."

ఇది జరిగాక దేశంలోని అన్ని భాగాల నుంచీ ఆయా ప్రాంతాల్లో ఉన్న అస్పృశ్యతను గురించి సభ్యులు వివరాలు పంపించడం మొదలు పెట్టారు. ఆయా ప్రాంతాల్ని సందర్శించమని కూడా ఒత్తిడి చేశారు. అలాగే చేస్తానని నేను కొందరికి అంగీకారం కూడా తెలిపాను. కాని చేతిలో కొంత డబ్బైనా లేకుండా పనిమొదలు పెట్టడం కష్టమని గుర్తించాను. కార్యవర్గం అలహాబాదు'ఇండిపెడెంటు' పత్రిక కోసం 25000/- రూపాయలు విడుదల చేయటానికి అంగీకరించినట్టు: ఢిల్లీలోని ఉర్దూపత్రిక 'కాంగ్రెస్' కోసం 10000/- రూపాయల మంజూరు కోసం హకీం అజ్మల్ ఖాన్, డా.అన్సారీలు దరఖాస్తు పంపినట్టు నాకు తెలిసింది. అంచేత ఈ పరిస్థితుల్లో కాంగ్రెస్‌ను అధిక ధనంకోసం ఒత్తిడిచెయ్యటం బాగుండదని ఆలోచించి అస్పృశ్యతా ఉపసంఘానికి 1000 /- రూపాయలు అడ్వాన్సుగా ప్రాథమిక మైన ఖర్చుల కోసం కావాలని కాంగ్రెస్ అధ్యక్షునికి ఉత్తరం రాశాను.

ఇదంతా అయ్యాక వచ్చిన మీ ఉత్తరం సంఖ్య 331 లోని ఈ తీర్మానం చాలా వింతగా ఉంది.

"దళిత వర్గాల వారి అభ్యున్నతి కోసం ఏర్పడ్డ ఉపసంఘానికి అడ్వాన్సు కావాలంటూ స్వామిశ్రద్ధానందగారు 1922 జూన్ 8న రాసిన ఉత్తరాన్నిచదవటమయింది. గంగాధరరావు బి.దేశపాండేగారిని ఈ ఉపసంఘానికి సమన్వయకర్తగా నియమించడానికి తీర్మానించడమయింది. వీలైనంత తొందరలో ఉపసంఘ సమావేశం జరపాలని ఆయన్ని కోరడానికి, స్వామిశ్రద్ధానందగారి ఉత్తరాన్ని ఆ ఉపసంఘానికి పంపడానికి తీర్మానించడమయింది."

ఇందులో వివరించటానికి ఇంకేం లేదు. నా మొదటి ఉత్తరం అందిందని ధ్రువపడ్డ తరువాత నేను హరిద్వారం నుంచి 1922 జూన్ మూడవ తేదీన కింది ఉత్తరాన్ని రాశాను.

ప్రియమైన పటేల్...

నేను ఎల్లుండి హరిద్వారం నుంచి బయలుదేరి లక్నోకు జూన్ 6వ తేదీ చేరుతాను. దళితవర్గాల గురించి ఇటీవల నేను అత్యంత బాధననుభవిస్తున్నానని మీకు ఈ పాటికీ తెలిసే ఉంటుంది. పంజాబ్ రాష్ట్రంలో కూడా నిర్మాణాత్మక కార్యక్రమాలలో ఈ విషయాన్ని గురించి సరైన శ్రద్ధ చూపలేదని గుర్తించాను. ఉత్తర ప్రదేశ్‌లో ఈ పని ఇంకా ఘోరంగా ఉంది. కానీ ఇంతకన్నా ఒక క్లిష్ట పరిస్థితి మన ముందుంది.

"బార్డోలీ కార్యక్రమానికి సంబంధించిన నోట్‌లో నాల్గవ అంశం కింద వర్గ వివక్ష గాఢంగా పాతుకుపోయిన చోట్లలో కాంగ్రెస్ నిధులతో అస్పృశ్యుల కోసం వేరుగా బావులు, పాఠశాలలు ఏర్పాటు చేయాలని సూచించబడింది. ఇలా చేయడంలో ఒకలోపముంది. వర్గ పక్షపాతం ఉన్న కార్యకర్తల చేత కాని, ఆరికంగా బలం లేని వారిచేత కాని, ఈ విషయం కారణంగా అస్పృశ్యులు ఉమ్మడి బావులలో నీరు చేదుకొనేలా ప్రేరేపించ లేకపోతాం. బిస్నూరు జిల్లాలో ఇలాంటి అడ్డంకులు లేవని, అందరూ ఒకే బావిలో నీరు చేదుకొంటున్నారని తెలిసింది. పైన సూచించిన నోట్‌లోని తీర్మానం వల్ల కొన్ని ప్రాంతాలలో మరో కొత్త రకమైన వివక్ష మొదలవుతోంది. అంబాలాకాంట్, లూథియానా, బాల్‌లా, లాహోర్, అమృత్ సర్, జాందియాలల్లో నేను ఇటీవల పర్యటించినపుడు అస్పృశ్యులకున్న అవరోధాలను తొలగించే

ప్రశ్న విస్మరింపబడ్డట్టు గుర్తించాను. ఢిల్లీలోనూ, చుట్టుప్రక్కల ప్రాంతాల్లోనూ కాంగ్రెస్‌కన్నా నా అధ్యక్షతతో పని చేస్తున్న దళితోద్ధార్ సభే మెరుగ్గా పని చేస్తోంది. అందుచేత పైన సూచించిన నాల్గవ అంశాన్ని సరైన రీతిలో సవరించక పోతే కాంగ్రెస్ దళితోద్ధార కార్యక్రమంలోని అతిప్రధాన ఉద్దేశ్యమే దెబ్బతింటుంది.

అంచేత దయచేసి ఈ క్రింది విషయాన్ని కాంగ్రెస్ అధ్యక్షుల సమక్షంలో ఉంచి వారంగీకరిస్తే అఖిల భారత కాంగ్రెస్ కమిటీ తరువాత కలుసుకున్నపుడు నేను ఈప్రతిపాదన చేయదలచుకొన్నాను.

"బార్డోలీ తీర్మానంలోని నాల్గవ అంశం క్రింద ఇచ్చిన వివరణను క్రింది విధంగా మార్చాలని కోరుతున్నాను - "దళిత వర్గాల వారి డిమాండ్లను వెనువెంటనే చేపట్టాలి. అవి ఏవంటే:

(అ) ఇతర పౌరులతో పాటు వాళ్ళు కూడా ఒకే చాప మీద కూర్చోవడానికి అనుమతించాలి.

(ఆ) ఉమ్మడి బావుల నుంచి నీళ్ళు చేదుకొనే హక్కు వారికి సంక్రమించాలి.

(ఇ) వారి పిల్లలకు జాతీయ పాఠశాలల్లోను, కళాశాలల్లోనూ ప్రవేశం లభించాలి. ఇతర ఉన్నత వర్గాల వారి పిల్లలతో పాటు వారు కూడా స్వేచ్ఛగా కలిసి మెలిసి ఉండే అవకాశం రావాలి.

ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సభ్యులకు ఈ అంశానికి ఎంత ప్రాధాన్యం ఉందో వివరించదలిచాను. ఉన్నత కులాల వాళ్ళ నిరంకుశత్వం పై అణగారిన ప్రజలు ప్రత్యక్షంగా తిరుగుబాటు చేసిన సందర్భాలు కూడా నాకు తెలుసు. వీరి డిమాండ్లను అంగీకరించకపోతే వీరు కూడా ఎలాగో ఈ బ్యూరోక్యాట్రిక్ యంత్రాగంతో ఒకలా ఇష్టం లేకపోయినా రాజీ పడతారు.

లక్నోలో జూన్ ఏడవ తేదీన జరిగిన ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సభలో నాతొలి ప్రతి పాదనలను అంగీకరించిన తరువాత నేను సవరించి తయారు చేసిన బార్డోలీ కార్యక్రమం (నాల్గవ అంశం) సభ ముందు పెట్టమని పటేల్‌ని కోరాను. ఈ అంశాన్ని ఉప సంఘానికి నివేదిస్తామని వర్కింగ్ కమిటీని బలవంత పెట్టవద్దని ఆయన అన్నారు. కానీ అస్పృశ్యతా ఉపసంఘానికి నా ప్రతిపాదన పంపిఉంటే కనీసం నాకు కాపీ అయినా రావాలి కాదా! ఇంత వరకూ నాకు రాలేదు.

అస్పృశ్యత అనే ప్రశ్న ఢిల్లీలోనూ చుట్టుపక్కలా చాలా తీవ్ర సమస్యగాఉంది. దాన్ని తక్షణమే నేను ఎదుర్కోవాలి. కాని ఈ ఉపసంఘం అప్పటి కప్పుడు ఏ చర్యను చేపట్ట జాలదు. వర్కింగ్ కమిటీ దేశంలోని రాజకీయ పరిస్థితులను బాగా అంచనా వేసి కాని కాంగ్రెస్ పక్షాన అస్పృశ్యతా నివారణ కోసం ఏ కార్యక్రమాలు చేపట్టదు. ఈ పరిస్థితుల్లో ఉప సంఘానికి నేను ఏ విధంగానూ ఉపయోగపడను. అందుచేత నా సభ్యత్వానికి రాజీనామా సమర్పిస్తున్నానని మనవి చేస్తున్నాను.

ఇట్లు

ఢిల్లీ, జనవరి 30.

తమ విధేయుడు

శ్రద్ధానంద సన్యాసి

## 2. కార్యదర్శి జవాబు

ప్రియమైన స్వామిజీ!

మీరు జూన్ 3వ తేదీ రాసిన ఉత్తరం ఆ నెల 30వ తేదీ అందింది. వర్కింగ్ కమిటీ 18వ తేదీన ఒక తీర్మానం చేస్తూ దళిత వర్గాల ఉపసంఘం నుండి మీ రాజీనామాను ఉపసంహరించుకోవాలని, అందుకోసమని మీకు కొన్ని వాస్తవాలను వివరించాలని నాకు ఆదేశాలు పంపారు.

మీకు తెలిసినట్టుగానే నేను జైలు నుంచి విడుదల కాక మునుపు జరిగిన వాస్తవాల గురించి నాకేమీ తెలియదు. కానీ జూన్ 10వ తేదీన జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో నేను ఉన్నాను. ఆ సభలోనే దేశపాండేను ఉపసంఘానికి సమన్వయకర్తగా ఉంటాడన్న విషయంపట్ల ఒక అవగాహన ఉన్నట్టు అప్పుడెవరూ చెప్పలేదు. డబ్బునివ్వటానికి కావలసిన లాంఛనాలు పూర్తి చేయటం కోసమే ఆ తీర్మానం ప్రతి పాదించినట్టుగా అనిపించింది. ఉపసంఘం తీర్మానం మేరకే ఖర్చుకు సంబంధించిన డబ్బును విడుదల చేయటం ముఖ్యమని అందరూ భావించారు. దేశ్ పాండేను సమన్వయకర్తగా నియమించారు. ప్రారంభంలోని ఖర్చుల కోసం 500 రూపాయలు కేటాయించడానికి సభ్యులు అనుమతించారు. తరువాత పంపిన తీర్మానంలో ఈ 500 రూపాయల ప్రసక్తి పొరపాటున ఎలాగో తొలగించబడింది. అందుచేత పది వేల రూపాయలు కేటాయించకపోవటం కార్యవర్గానికి ఇష్టం లేకపోవటం వల్ల జరిగింది కాదని, ఇంతవరకు నేను వివరించిన దాన్ని బట్టి మీరు గుర్తించ గలుగుతారు. మీ ఉపసంఘం చేయదలచిన పని ప్రాముఖ్యాన్ని తక్కువ అంచనా వేయటం కాని, మీరిచ్చిన విలువైన సలహాలను విస్మరించటం కాని కార్యవర్గం ఎప్పుడూ ఊహించనైనా ఊహించలేదు. క్రిందటి సారి కార్యవర్గం సమావేశమైనప్పుడు మీ ఉత్తరాన్ని చూశాక వెంటనే ఆ 500 రూపాయల విషయం చేర్చాలని తీర్మానించారు. ఉపసంఘంలో గాఢమైన అనుభవం, అస్పృశ్యతా సమస్యతో పరిచయం ఉన్న మీ వంటి వారి భాగస్వామ్యం లేక పోవటం చాలా దురదృష్టకరంగా ఉండబోతుంది. అంచేత ప్రజల ఆశయాలను దృష్టిలో ఉంచుకొని మీ రాజీనామా విషయం పునరాలోచించి అలహాబాదులోని నా కార్యాలయానికి మీ రాజీనామా ఉపసంహార విషయం వెనువెంటనే తంతి ద్వారా తెలుపగోరుతున్నాను. మీ ఉపసంఘం చేసిన తీర్మానాలు కార్యవర్గంచేత సముచితమైన రీతిలో స్వీకరింపబడతాయని నేను ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరమే లేదు.

ప్రత్యేక బావులు, పాఠశాలలకు సంబంధించి మీ తీర్మానంలో సూచించిన ప్రత్యామ్నాయ సూచనలను మీ ఉపసంఘం వారు సిఫారస్ చేసి పంపిస్తే కార్యవర్గం దాన్ని ఆమోదించటం సమంజసంగా ఉంటుంది.

అలహాబాదులోని 'ఇండిపెండెంటు'కు, ఢిల్లీలోని 'కాంగ్రెస్'కు నిధులు విడుదల చేయటం గురించి మీరు అపార్థం చేసుకున్నారని నాకు అనిపిస్తుంది. ఈ విషయంలో రెండు మాటలు "ఇండిపెండెంట్" పత్రిక విషయం కొత్తగా చేసిందేమీ కాదు. ఉత్తర ప్రదేశ్ ప్రావిన్షియల్ కమిటీ జాతీయ పత్రికల కోసం 25000/-రూపాయల నిధిని కోరింది. అది

ఆమోదింపబడింది. దాని కనుగుణంగా 'ఇండిపెండెంట్' పత్రికకు డబ్బులిచ్చారు. 'కాంగ్రెస్' పత్రిక ఋణం కోసం పెట్టిన దరఖాస్తును తిరస్కరించారు.

బొంబాయి
జులై 23, 1922

ఇట్లు

తమ విధేయుడు

మోతీలాల్ నెహ్రూ

## 3. స్వామీజీ సమాధానం

ప్రియమైన పండిట్ మోతీలాల్ జీ

మీరు బొంబాయి నుండి జులై 23న రాసిన ఉత్తరం అందింది. ఉపసంఘం నుంచి నా రాజీనామా విషయం ప్రస్తావించారు. నన్ను క్షమించాలి. నేను ఈ విషయంలో ఏ మాత్రం పునరాలోచించలేను - ఎందుకంటే నా మొదటి ఉత్తరంలోని వాస్తవాలనే మీరు విస్మరించారు కాబట్టి.

(1) ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ నిధుల నుంచి కనీసం ఒక లక్ష రూపాయలైనా కేటాయించాలని నేను రాజగోపాలాచారి గారిని అడిగానో లేదో దయచేసి కనుక్కోండి. ఆయన అలాగేననే తాత్పర్యం ప... ఉపసంఘం తమ కార్యాచరణ పథకాన్ని సమర్పించగానే, కార్యవర్గం నేను కోరినట్టుగానే నిధులు కేటాయిస్తుందని, సవరణ ప్రతిపాదించారో లేదో కూడా కావలిస్తే కనుక్కోండి. ఆమాట మీద నేను ఆయన సవరణను అంగీకరించానన్న వాస్తవాన్ని కూడా స్పష్టం చేసుకోండి. అధ్యక్షులు నన్ను పక్కకు పిలిచి కాంగ్రెస్‌కు నిధులు లేవని చెప్పగానే నేనలా అంగీకరించానన్న విషయాన్ని కూడా ధ్రువపరచుకోండి. ఇది వాస్తవమైతే ప్రతిపాదనతో పాటు సవరణ కూడా ఎందుకు ప్రకటింపబడ లేదు?

(2) ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ ఉపసంఘానికి నన్ను సమన్వయకర్తగా ఉండమని కోరినప్పుడు విఠల్‌భాయ్ జె. పటేల్ 'శ్రద్ధానంద స్వామి పేరు తొలుత ఉంది కాబట్టి సహజంగా ఆయనే సమన్వయ కర్తగా ఉంటారని, దీనికోసం ఏ తీర్మానమూ అక్కరలేదని అన్నారో లేదో మీరు కనుక్కొన్నారా? డా.అన్సారీ గారి ద్వారా జూన్ 17న నేను ఉపసంఘానికి సమన్వయ కర్తగా నియమింపబడినట్టు తెలిసింది. డా. అన్సారీ గారు మీ దగ్గరే ఉన్నారు. వారినే అడిగి ఈ విషయాన్ని కనుక్కోండి. పటేల్ ఈ విషయాల్ని ఇంకా మరిచి ఉండరని నమ్ముతాను.

(3) అస్పృశ్యులకు సంబంధించి ఇక్కడ తక్షణమే కార్యక్రమాలు చేపట్టాల్సిఉంది. అందుచేత ఏ కారణం చేతకాని ఇక ఆలస్యం చేయటం నేను చెయ్యలేని పని. కనుక

దయచేసి తరువాతి కార్యవర్గ సమావేశంలో నా రాజీనామా ఆమోదించండి. అలా చేస్తే అస్పృశ్యతా నివారణ కోసం నా పథకం ప్రకారం పని చేసుకొనే స్వేచ్ఛ నాకుంటుంది. గత జులైలోనే ఈ తీర్మానానికి నేను వచ్చాను. అమృతసర్, మయాన్వాలీ జైళ్ళలోనూ, నా అనుభవం, ఇతరులు చెప్పిన దాన్ని బట్టి బ్రహ్మచర్యాశ్రమం ప్రాచీన ఆర్యుల పద్ధతిలో మరల పునరుద్ధరింపబడితే తప్ప, అస్పృశ్యతా శాపాన్ని భారతీయ సమాజం నుంచి పూర్తిగా తొలగిస్తేతప్ప, కాంగ్రెస్ వారు కాని, ఆ సంస్థ నుండి పుట్టిన దేశభక్తి సంఘాలు కానీ, స్వరాజ్యం కోసం చేసే ప్రయత్నాలు ఏవీ ఫలించ బోవు. జాతీయ ఆత్మదర్శనంలేకుండా, పౌరుషమైన బ్రతుకు, స్వరాజ్యం లేకుండా సిద్ధించవు. కాబట్టి సన్యాసిగా నేను గ్రహించాల్సిన పవిత్ర బాధ్యత ఉంది-అదే బ్రహ్మచర్యాన్ని జాతీయ సమైక్యతను సాధించటం.

మీ
విశ్వసనీయుడు
ఢిల్లీ జులై 23, 1922 శ్రద్ధానంద సన్యాసి

## అనుబంధం II

# దళిత వర్గాల వారికి రాజకీయ భద్రతలు

*డా. భీమరావు ఆర్. అంబేద్కర్ మరియు రావ్ బహద్దర్ ఆర్. శ్రీనివాసన్ దళితవర్గాల ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం 'రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సు' (ఆర్.టి.సి.)కు సమర్పించిన అనుబంధ విజ్ఞప్తి.*

గత సంవత్సరం సమర్పించిన వినతి పత్రంలో స్వతంత్ర భారత రాజ్యాంగంలో దళిత వర్గాల సంరక్షణ కోసం ఎలాంటి రాజకీయ భద్రతలుండాలన్న ప్రశ్నకు సంబంధించి మేం చేసిన చర్చ మైనారిటీస్ సబ్‌కమిటీ వారి రిపోర్టులో మూడవ అనుబంధంగా ప్రచురింపబడింది. అప్పుడు దళిత వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండాలన్నాం. కాని ఆ ప్రాతినిధ్యం ఎలా ఉండాలో చర్చించలేదు. ఆ ప్రశ్న పుట్టకమునుపే మైనారిటీస్ సబ్‌కమిటీ చర్చలు ముగిసి పోయాయి. అందుకే ఈ అదనమైన విజ్ఞప్తిని జతచేస్తున్నాం. మైనారిటీల ఉప సంఘం కనీసం ఈ ఏడాదయినా ఈ ప్రశ్నను గురించి ఆలోచించేటప్పుడు అవసరమైన వివరాలన్నీ అందుబాటులో ఉండాలన్న దృష్టితోనే ఈ విషయాన్ని చర్చిస్తున్నాం.

## 1 ప్రత్యేక ప్రాతినిధ్య వ్యాప్తి

అ) ప్రాంతీయ శాసన సభల్లో ప్రత్యేక ప్రాతినిధ్యం :-

1 బెంగాలు, మధ్యపరగణాలు, అస్సాం, బీహార్, ఒరస్సా, పంజాబ్ మరియు సంయుక్త పరగణాల్లో సైమన్ కమీషన్, మరియు ఇండియన్ సెంట్రల్ కమిటీలు పరిగణించే జనసంఖ్యా వివరాలకు తగిన నిష్పత్తిలో దళిత ప్రజల ప్రాతినిధ్యం ఉండాలి.

2 మదరాసు రాష్ట్రంలో ఈ వర్గాల ప్రజలకు 22 శాతం ప్రాతినిధ్యం ఉండాలి.

3. బొంబాయి రాష్ట్రంలో :

అ) సింధ్ ప్రాంతం బొంబాయి రాష్ట్రంలో భాగంగా ఉండటమే సంభవిస్తే 16 శాతం ఉండాలి.

ఆ) అలాకాకుండా సింధ్ వేరుపడితే బొంబాయి ప్రెసిడెన్సీలోని ముస్లింలతో సమానమైన ప్రాతినిధ్యాన్ని పొందుతారు-ఎందుకంటే వారి జనసంఖ్య సరిసమానం కాబట్టి.

ఆ) ఫెడరల్ అసెంబ్లీ ప్రత్యేక ప్రాతినిధ్యం.

ఫెడరల్ అసెంబ్లీ (ఈనాటి పార్లమెంటు) లోని రెండు సభలలోనూ ఇండియా మొత్తం మీద వారి సంఖ్యా బలాన్ని బట్టి ప్రాతినిధ్యం ఉండాలి.

(1)రిజర్వేషన్లు

శాసన సభల్లో క్రింది విధమైన నిష్పత్తిలో ప్రాతినిధ్యం ఉండాలని మేము కోరుకుంటున్నాం.

(1) అణగారిన వర్గాల జనసంఖ్య విషయంలో సైమన్ కమీషను (సంపుటం1, పుట 40) మరియు ఇండియన్ సెంట్రల్ కమిటీ (రిపోర్టు పుట-44) వారిచ్చిన సంఖ్యాబలాన్ని ఆధారంగా సీట్ల పంపకం చేయవచ్చు.

(2) ఇక ఫెడరల్ లెజిస్లేచర్ అంటే మొత్తం భారత దేశమని మేం అర్థం చేసుకొంటున్నాం. అయినప్పుడు భిన్న రాష్ట్రాలలోను, కేంద్రపాలిత ప్రాంతాలలోనూ, పరిగణనకు రాని టెరిటరీలలోనూ, గవర్నర్ల ప్రావిన్సులలోనూ ఉన్న మొత్తం జనసంఖ్య ఆధారంగా రెండు సభల్లోనూ వీరి ప్రాధాన్యాన్ని నిర్ణయించాలి.

(3) బ్రిటిష్ ఇండియాలో పాలనా విభాగాలు ఎలా ఉన్నాయో స్వతంత్ర భారతంలో కూడా మేం అలాగే ఉండబోతాయని కూడా ఊహిస్తున్నాం.

కానీ కొన్ని రాజకీయ పార్టీలు బెదిరిస్తున్నట్లు ఇప్పటి జనసంఖ్యా వివరాలు తప్పని గుర్తింపబడి కొత్తగా సేకరించిన వివరాల ప్రకారం దళితప్రజలకు తక్కువ నిష్పత్తి సూచింపబడితే లేదా పాలనా విభాగాలను మార్చితే, తద్వారా ఇప్పటి జనసంఖ్యాబలం తగ్గితే, దళిత వర్గాలు తమ ప్రాతినిధ్య శాతాన్ని పెంచుకోవటానికీ, ఆధారమైన విలువను

(ధియిటేజ్) డిమాండ్ చేయటానికి హక్కును కలిగి ఉండాలి. అలాగే ఒక సమయం ఆల్ ఇండియా ఫెడరేషన్ అంటూ ఒకటి ఏర్పడకపోతే అప్పటి సంఖ్యాబలం నిష్పత్తిని బట్టి ఉభయసభల్లోనూ ప్రాతినిధ్యం పొందటానికి వాళ్ళు సిద్ధంగా ఉంటారు.

(2) ప్రాతినిధ్య విధానం

1) దళిత వర్గాలకు చెందిన వారు రాష్ట్ర కేంద్ర శాసనసభలకు ప్రతినిధులను తమతమ కోసమే ప్రత్యేకించిన నియోజక వర్గాలలో తమ వోట్ల ద్వారానే ఎన్నుకొంటారు.

కేంద్రశాసన సభలో ఎగువ సభకు సంబంధించి పరోక్ష పద్ధతిలో రాష్ట్రశాసన సభల నుంచి ప్రతినిధుల్ని ఎన్నుకోవటమే పద్ధతి అయితే దళితవర్గాల వారు ఎగువ సభలో తమ ప్రాతినిధ్యానికి సంబంధించిన హక్కును వదులుకోవలసి వస్తుంది. కానీ అక్కడ కూడా తమ సీట్లకోటాను పరిరక్షించటానికి ప్రత్యామ్నాయమైన ఏర్పాటు చూపించగలిగినట్లయితేనే ఇలా అంగీకరించవలసి ఉంటుంది.

(2) ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా కాని, కొన్ని సీట్లను కేటాయించటం ద్వారా కాని ఈ వర్గాల వారికి ప్రత్యేక నియోజక వర్గాలు లేకుండా చేయటాన్ని అంగీకరించకూడదు. కానీ క్రింది నియమాలు పాటించబడ్డప్పుడు ప్రత్యామ్నాయ ఏర్పాట్లను పరిశీలించవచ్చు.

(అ)శాసనసభల్లో అధిక సంఖ్యాకులైన ప్రతినిధుల డిమాండు మేరకు వోటర్ల రెఫరెండం జరిగే దళిత వర్గాల సంఖ్యాబలమే అధికంగా ఉన్నప్పుడు,

(ఆ) 20 సంవత్సరాలు గడిచే వరకు ఇలాంటి రెఫరెండం పద్ధతిని ఉపయోగించరాదు. యువకులందరికీ వోటుహక్కు వచ్చిన తరువాతనే రెఫరెండం అనుసరణీయం.

(3) దళిత వర్గాల నిర్వచన ఆవశ్యకత

దళిత వర్గాల ప్రాతినిధ్యం అన్న అంశం ఇంతవరకు చాలా దుర్వినియోగం చేయబడింది. ఈ వర్గానికి చెందని వారు కూడా ప్రాంతీయ శాసనసభల్లో సభ్యులయ్యారు. అంతేకాదు, దళిత వర్గాల ప్రతినిధులుగా కూడా నియామకం పొందిన సందర్భాలకు కొరతేం లేదు. ఇది ఎలా జరిగిందంటే దళిత ప్రజల ప్రతినిధుల్ని నామినేట్ చేసే అధికారం గవర్నర్లకిచ్చారు. దళత వర్గాల నుంచే ప్రతినిధుల్ని నియమించాలన్న ఆదేశాలు ఆయనకు లేక పోవటంవల్ల ఇలాజరిగింది. కొత్త రాజ్యాంగం ప్రకారం ఎన్నిక ద్వారా ప్రతినిధులు వస్తారు తప్ప నామినేషన్ పద్ధతితో కాదు కాబట్టి ఇలా దురుపయోగం చెయ్యడానికి తావుండదు. అయినా భవిష్యత్తులో వీరి ప్రత్యేక ప్రాతినిధ్యం దెబ్బతినే అవకాశమే లేకుండా ఉండాలని మేము రెండు ప్రతిపాదనలు చేస్తున్నాం.

1 దళిత వర్గ ప్రజలు తమకు ప్రత్యేకించిన నియోజక వర్గాల ద్వారా ఎన్నికయ్యే అవకాశం మాత్రమే కాకుండా తమ జాతి మనుష్యులనే ప్రతినిధులుగా పంపే అవకాశం ఉండాలి.

2 ప్రతి ప్రాంతంలోను అణగారిన వర్గమంటే ఏమిటో నిక్కచ్చిగా నిర్వచించాలి. అస్పృశ్యతకు గురైన జాతుల జనుల్ని మాత్రమే ఈ వర్గం క్రింద పరిగణించాలి. ఎన్నికల ప్రయోజనం కోసం తయారుచేసిన షెడ్యూళ్ళలో వారు ఆ పేర్లతో పరిగణింపబడి ఉండాలి.

(4) పేరు

దళితవర్గం'అనే పేరు విషయంగా చాలా అభ్యంతరాలున్నాయి. ఈ వర్గాలకు చెందిన సభ్యులు మరి ఇతరులు ఈ పేరు సమగ్రంగా అర్థద్యోతకం కాదంటారు. ఇది ఈ ప్రజల్ని వన్నె తక్కువగా అంచనా వేస్తుంది. తక్కువ తనాన్ని సూచిస్తుంది. అందుచేత భవిష్యత్తులో రాజ్యాంగ నిర్మాణం చేసేటప్పుడు ఈపేరును అఫిషియల్ ప్రయోజనాల కోసం మార్చేసే ప్రమాదం కూడాఉంది. అందువల్ల వాళ్ళకు హిందూ వర్ణేతరులని కాని, ప్రొటెస్టెంట్ హిందువులని కాని, హిందూసంప్రదాయేతరులనిగాని మరి అలాంటి ఏ ఇతర పదంచేతగాని సూచించటం మంచిది. అంతేకాని 'దళిత వర్గాలు' అనే మాట సమంజసంగా లేదు. కాని ఏదో ఒకపేరు చేతనే పిలవాలి అని చెప్పే అధికారం మాకు లేదు. మావి సూచనలు మాత్రమే. బాగా వివరించగలిగితే దళిత వర్గాలవారే తమకనుకూలమైన ఒక పదాన్ని ఎన్నుకోవటానికి వెనుదీయరు.

ఈ విజ్ఞప్తిలో మేము చేసిన డిమాండ్లకు మద్దతుగా దేశం మొత్తం మీద భిన్నదళిత వర్గాల వారి నుంచీ టెలిగ్రాములు వచ్చాయి.

నవంబరు 4,1931

## అనుబంధం III
# మైనారిటీల ఒప్పందం

*ముస్లిములు, అణగారిన వర్గాలు, భారతీయ క్రైస్తవులు, ఆంగ్లో ఇండియనులు, మరియు యూరోపియనులు జాతి సమస్యా పరిష్కారానికి చేసిన సూచనలు:*

### మైనారిటీ జాతుల క్లెయిములు

1 ఒకవ్యక్తి పుట్టిన వంశం, మతం, కులం లేదా తెగల నాధారంగా పబ్లిక్ ఉద్యోగాల విషయంలోకాని, రాజకీయాధికార గౌరవాల్లో కాని పౌరహక్కులననుభవించటంలో కాని, వ్యాపార లావాదేవీల్లోకాని సంబోధన పద్ధతుల్లో కాని వివక్షను చూపించరాదు.

2 ఏ జాతి పట్లయినా వివక్షతో వారి జాతి ప్రయోజనాలను దెబ్బతీసే చట్టాలను చేయకుండా చట్టబద్ధమైన భద్రతలను రాజ్యాంగంలోనే చేర్చాలి.

3. పౌరజీవితానికి, నైతిక వర్తనకు భంగం కాని రీతిలో ఏజాతి వాళ్ళయినా తమతమ విశ్వాసాలలో పూజావిధానాలలో ప్రచారంతో సంస్థలుగా ఏర్పడి తమతమ విద్యాసంస్కృతుల్ని అభ్యసిస్తూ మనగలిగే మత స్వాతంత్ర్యం ఉండాలి. ఆయా మనుష్యుల మత విశ్వాసాల్ని బట్టి వారికి ఏ విధమైన పౌరహక్కులు, అవకాశాలు తప్పిపోరాదు. అంతేకాదు ఆ కారణంగా ఏ అపరాధ రుసుమూ చెల్లించాల్సిన నిబంధన ఉండకూడదు.

4. తమ తమ సొంత ఖర్చులతో ధర్మనిధుల్ని మత, సామాజిక సంస్థలను, పాఠశాలలు, ఇతర విద్యా సంస్థలను స్థాపించు కోవటానికి, నడుపు కోవటానికి, నియంత్రించు కోవటానికి, తద్వారా తమ మతాన్ని ఆ పరిధిలో వృద్ధి చేసుకోనటానికి అవకాశం ఉండాలి.

5. ఇలాగే మైనారిటీ తెగల మత సాంస్కృతిక వ్యక్తిగత న్యాయాలను, విద్యాభివృద్ధిని, భాషను, ధర్మనిధి సంస్థలను, చట్టబద్ధంగా రక్షించే అవకాశం రాజ్యాంగంలో ఉండాలి. వారికి ప్రభుత్వం, మరి ఇతర స్వపరిపాలన సంస్థలు ఇచ్చే గ్రాంట్ ఇన్ ఎయిడ్ సముచిత రీతిలో అందేలా చూడాలి.

6. పౌరహక్కుల్ని సంపూర్ణంగా అనుభవించటం న్యాయబద్ధంగా శిక్షార్హం కాని రీతిలో చట్టం చెయ్యటం ద్వారా కాని, చట్టంలో ఉన్న అంశాలను తగు రీతిగా సవరించి కాని, ప్రజలందరికీ పౌరహక్కులు అనుభవించే అవకాశాన్ని కలిగించాలి.

7. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మంత్రి మండలుల్లో ముస్లిములు, ఇతర మైనారిటీలు తగినంత సంఖ్యలో ఉండే పద్ధతిని చట్టబద్ధం చేయాలి.

8. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో మైనారిటీ తెగల సంరక్షణకు, వారి సంక్షేమాభివృద్ధికి ప్రత్యేకమైన శాఖలు ఉండాలి.

9. శాసనసభల్లో నామినేషన్ ద్వారా కాని, ఎన్నిక ద్వారా కాని ఏ జాతులు ప్రాతినిధ్యం పొందుతాయో, అవి ప్రత్యేకమైన నియోజక వర్గాల ద్వారా అన్ని శాసనసభల్లోనూ ప్రాతినిధ్యం కలిగి ఉండాలి. అంతేకాదు, అనుబంధంలో చూపినదానికంటె తక్కువ నిష్పత్తిలో ఏ పరిస్థితులలోనూ మైనారిటీగా మార్చకూడదు. వీరితో సమానులుగానూ పరిగణించరాదు. కానీ 10 ఏళ్ళు గడిచిన తరువాత పంజాబ్, బెంగాలుల్లోని ముస్లింలు (ఇతర ప్రాంతాలలోనిమైనారిటీలు) - ఉమ్మడి నియోజకవర్గాలను కాని లేదా అలాంటి నియోజక వర్గాలలో కొన్ని సీట్లను కాని ఆయా తెగల ఒప్పుదలతో అంగీకరించవచ్చు. అలాగే పది ఏళ్ళ తరువాత కేంద్ర శాసనసభలలో కూడా ఏమైనారిటీ తెగవారైనా ఉమ్మడి నియోజకవర్గాలనుకాని, లేక అందులో కొన్నిసీట్లను కాని అంగీకరించవచ్చు. దళిత వర్గాలకు సంబంధించి ఉమ్మడి నియోజకవర్గాలు లేదా సీట్ల రిజర్వేషన్ ప్రసక్తే లేదు. 20 ఏళ్లవరకు ప్రత్యేకనియోజక వర్గాలు కొనసాగాలి. ఈ వర్గంలోని ప్రజలందరికీ ఓటు హక్కు సిద్ధించేంతవరకు ఇదే పరిస్థితి కొనసాగాలి.

10.ప్రతి రాష్ట్రంలోనూ కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన ఒక పబ్లిక్ సర్వీస్ కమీషను ఏర్పడాలి. పబ్లిక్ సర్వీసులలోకి (అంటే ప్రభుత్వ ఉద్యోగాల్లోకి) ఈ కమీషన్ ద్వారానే అన్ని జాతులకూ, నైపుణ్యాన్ని విద్యార్హతను బట్టి ఉద్యోగాలు కేటాయించాలి. గవర్నర్ జనరల్ ద్వారా కాని గవర్నర్ ద్వారా కాని నామినేట్ చేయదగిన ఉద్యోగాలు ఏవయినా ఉంటే

అవితప్ప తక్కిన అన్ని ఉద్యోగనియామకాలు కమీషన్ ద్వారా జరగాలి. గవర్నర్ జనరల్‌కు, గవర్నర్లకు ఉద్యోగ నియామకాలకు సంబంధించి అందించే ఆదేశ సూత్రాలలో ఈ విధానాన్ని జతచేసి అప్పుడప్పుడు ఉద్యోగాలలో భిన్న జాతుల నిష్పత్తి ఎలా ఉండాలో సమీక్షిస్తూ పోవాలి.

11 తమ మతాన్ని మత సంబంధమైన సాంఘికాచారాన్ని దెబ్బకొట్టే బిల్లును ప్రవేశపెట్టినపుడు ఒక జాతికి చెందిన 2/3 వంతు సభ్యులుగాని, ప్రాథమికహక్కులకు భంగం వాటిల్లినపుడు 1/3 వంతు సభ్యులుకాని నిరసన తెలిపితే బిల్లు పాసయిన ఒక నెల లోపల శాసనసభ అధ్యక్షునికి తమ నిరసనను వ్యక్తం చేయవచ్చు. దానిపై ఆయన గవర్నర్‌కు కాని, గవర్నర్ జనరల్‌కుకాని తమ సిఫారస్ తెలిపి ఆ బిల్లు ఒక సంవత్సరం వరకు అమల్లోకి రాకుండా నిలుపుదల చేయవచ్చు. ఆ తరువాత ఆ బిల్లును మరల శాసనసభలో చర్చకు తీసుకురావచ్చు. మరలాకూడా ఆ బిల్లును మార్చటానికి, సవరించటానికి సభ ఇష్ట పడకపోతే గవర్నర్ కాని గవర్నర్ జనరల్ కాని తన వైయక్తికమైన అధికారంతో దాన్ని ఆపుదల చెయ్యవచ్చుకూడా. ఎప్పుడంటే మైనారిటీ వర్గాలకు చెందిన ఏ ఇద్దరు సభ్యులైన తమ ప్రాథమిక హక్కులకు భంగం వాటిల్లిందని సుప్రీంకోర్టులో సవాలు చేస్తే చాలు. అలాంటి అభ్యంతరం లేకపోతే ఆ బిల్లును పాస్ చేయవచ్చు.

## ముస్లిముల ప్రత్యేక క్లెయిములు

(అ) వాయవ్య సరిహద్దు ప్రాంతం (కాశ్మీర్) ప్రత్యేకంగా గవర్నర్ పాలిత ప్రాంతంగా ఉండాలి. ప్రాంతీయశాసన సభలు ఏర్పాటు చేసినపుడు మొత్తం స్థానాలసంఖ్యలో 10 శాతం కన్నా ఎక్కువ నామినేషన్‌ల ద్వారా ఉండరాదు.

(ఆ) బ్రిటిష్ ఇండియాలోని ఇతర పరగణాల్లాగానే బొంబాయి ప్రెసిడిన్సీ నుంచి 'సింధ్' ను వేరు చేయాలి. గవర్నర్ పాలిత ప్రాంతంలో ఉండాలి.

(ఇ) కేంద్ర శాసనసభలో మొత్తం స్థానాలలో 1/3 వంతు ముస్లింలకు కేటాయించాలి. అనుబంధంలో చూపిన నిష్పత్తి కంటె ఎన్నడూ తక్కువ కారాదు.

## దళిత వర్గాల ప్రత్యేక క్లెయిములు

(అ) అస్పృశ్యతా కారణంగా దేశంలోని ఏ పౌరుడూ పౌరహక్కుల్ని కోల్పోయేంత వివక్షను కాని, అసమర్థత కాని, కీడును కాని, శిక్షను కాని, పొందే ఆచారవ్యవహారాలను నిష్ప్రయోజకమైనవిగా రాజ్యాంగం స్పష్టం చేయాలి.

(ఆ) పోలీసు మిలిటరీ సర్వీసులను, ప్రభుత్వోద్యోగావకాశాలు కల్పించే విషయంలో ఉదారంగా ప్రవర్తించాలి.

(ఇ) పంజాబులో ఉన్న 'లాండ్ ఏలియనేషన్ యాక్టు' వీరికి కూడా వర్తించాలి.

(ఈ) వివక్షతోగాని, నిర్లక్ష్యంతో కాని ఏ అధికారయినా ప్రవర్తించినపుడు, దానికి వ్యతిరేకంగా గవర్నరుకో, గనర్నర్ జనరల్‌కో విన్నపం చేసుకునే హక్కుండాలి.

(ఉ) అనుబంధంలో చూపించిన మేరకు తక్కువ కాకుండా ప్రాతినిధ్యముండాలి.

## ఆంగ్లో ఇండియనుల క్లెయిములు

1. ఉప సంఘం (8 ఉద్యోగాలు) ఇంత వరకే అంగీకరించిన క్లెయిములను ఉదారంగా వ్యాఖ్యానించారు. ఈ జాతి వారికి ఉన్న ప్రత్యేక స్థానాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వోద్యోగాలలో వారికి విశిష్టమైన పరిగణాన ఉండాలి. తగు మాత్రం జీవన ప్రమాణంలో బ్రతికే అవకాశం కల్పించాలి.

2. తమ జాతికి సంబంధించిన విద్యా సంస్థలను అంటే యురోపియన్ విద్యను ప్రచారం చేసుకోవటానికి, పరిపాలించు కోవటానికి హక్కుండాలి. కాని, ఆ శాఖ మంత్రి అధీనంలోనే వీరు ప్రవర్తిస్తారు.

ఇప్పుడున్న నిధులలో నుండే ఉదారంగా గ్రాంట్ ఇన్ ఎయిడ్ స్కాలర్‌షిప్పులు మంజూరు చేయాలి.

3. ఇండియాలో ఇతర జాతుల్లాగానే వీళ్ళకు కూడా న్యాయపరమైన హక్కుండాలి. తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకునే హక్కుండాలి.

## యూరోపియనుల క్లెయిములు

1. ఇండియాలో పుట్టిన వారి లాగానే పారిశ్రామిక వ్యాపార రంగాల్లో సమానంగా పాల్గొనే హక్కు, అవకాశం ఉండాలి.

2. నేర విచారణల్లో ఇప్పుడున్న హక్కులు అలాగే కొనసాగాలి. గవర్నర్ జనరల్ ఆమోదం లేకుండా చట్టం ద్వారా కాని, బిల్లుల ద్వారా కాని ఈపరిస్థితిని సవరించటమో మార్చటమో చేయకూడదు.

దీనికి అంగీకరించిన వారు :

హిస్ హైనెస్ ది ఆగాఖాన్ (ముస్లిములు)

డా. అంబెద్కర్ (దళిత వర్గాలు)

రాయ్ బహద్దూర్ పన్నీర్ సెల్వం (ఇండియన్ క్రిస్టియన్లు)

సర్ హెన్రీ గిడ్నీ (ఆంగ్లో ఇండియన్లు)

సర్ హ్యూబర్ట్ కార్ (యురోపియన్లు)

## అనుబంధం: శాసనసభలలో ప్రాతినిధ్యం

బ్రాకెట్లలో ఉన్న అంకెలు = 1931 జనసంఖ్య వివరాలనాధారంగా : సైమన్‌రిపోర్టు నాధారంగా దళితవర్గాల శాతాలు గణింపబడ్డాయి

| | సభా బలం | సవర్ణ | హిందూ దళిత | మొత్తం | ముస్లింలు | క్రిస్టియన్లు | సిక్కులు | ఆంగ్లో ఇండియన్లు | గిరిజనులు మొ. | యూరోపియనులు | రిమార్కులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కేంద్రం అఖిల ఇండియాలోనిభారత (1931) పైసభ | 200 | (47.5) 101 | (19)* 20 | (66.5) 121 | (21.5) 67 | 1 | 6 | 1 | – | 4 | * గర్తు బ్రిటిష్ గవర్నర్ ప్రావిన్స్‌లోని శాతం |
| క్రిందిసభ | 300 | 123 | 45 | 168 | 100 | 7 | 10 | 3 | - | 12 | |
| అస్సాం | *100 | (48.9) 38 | (13.4) 13 | (62.3) 51 | (34.8) 35 | 3 | - | 1 | - | 10 | * ఈ సంఖ్యలో గిరిజనుల |
| బెంగాలు | 200 | (18.3) 38 | (24.7) 35 | (43) 73 | (54.9) 102 | 2 | - | 3 | - | 20 | |
| బీహారు &ఒరిస్సా | 100 | (67.8) 51 | (14.5) 14 | (82.3) 65 | (11.3) 25 | 1 | - | 1 | 3 | 5 | |
| బొంబాయి | 200 | (68) 88 | (8) 28 | (76) 116 | (20) 66 | 2 | - | 3 | - | 13 | సింధ్ వేరయితేబొంబాయి లోని ముస్లింలకు ఎన్.ఎఫ్.డబ్ల్యు.పిలోని హిందువులకులాగా వెయిటేజ్‌ఉంటుంది. |
| మధ్యపరగణాలు | 100 | (63.1) 58 | (23.7) 20 | (85.8) 78 | (44) 15 | 1 | - | 2 | 2 | 2 | |
| మద్రాసు | 200 | (71.3) 102 | (15.4) 40 | (86.7) 142 | (7.1) 30 | (3.7) 14 | - | 4 | 2 | 8 | |
| పంజాబు | 100 | (15.1) 14 | (13.5) 10 | (28.6) 24 | (56.5) 51 | 1.5 | (13) 20 | 1.5 | - | 2 | |
| సంయుక్త పరగణాలు | 100 | (58.1) 44 | (26.4) 20 | (84.5) 64 | (14.8) 30 | 1 | - | 2 | - | 3 | |

సింధ్ & ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి.. ముస్లింలు మైనారిటీలుగా ఉన్న పరగణాల్లో వారికి ఎలాంటి వెయిటేజ్ ఉంటుందో, అలాంటిదే సింధ్‌లో హిందువులను ఎన్.డబ్ల్యు.ఎఫ్.పిలో హిందువులకు మైనారిటీలకు ఉంటుంది.

# అనుబంధం IV

## గాంధీ ఉపవాసంపై బి.ఆర్. అంబేద్కర్ ప్రకటన

*రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌లో అస్పృశ్యుల రాజ్యాంగ పరమైన భద్రతల విషయంగా గాంధీ ధోరణిపై ప్రకటన* : సెప్టెంబరు 19,1932

ఇటీవల పత్రికలలో ప్రచురింపబడిన మహాత్మా గాంధీ, సర్ శామ్యూల్ హోర్ మరియు ప్రధాన మంత్రుల చర్చల్లో బ్రిటిష్ ప్రభుత్వం తనకు తానుగా కాని, ప్రజాభిప్రాయాన్ని మన్నించి కాని, దళితవర్గాలకు ప్రత్యేక నియోజక వర్గాలను కేటాయించే పథకానికి సంబంధించిన ఆలోచనను మార్చుకునేదాక తాను అమరణ నిరాహార దీక్ష చేస్తానని మహాత్ముడు ప్రకటించడం నాకు వింత గొలిపింది. మహాత్ముని ఈ ఆత్మహింస ప్రతిజ్ఞ వల్ల నేను ఎలాంటి అనివార్యమైన సంకటపరిస్థితిలో చిక్కుకున్నానో సులభంగా ఊహించవచ్చు.

రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సులో జాతి సమస్య అన్నది అతి చిన్న సమస్య అని గాంధి అన్నారు. అలాంటి ఆయనే ఈ విషయంగా తన ప్రాణం బలిపెట్టడానికి సిద్ధపడటం ఎందుకన్నది నా అవగాహనకు అందటంలేదు. గాంధీ ఆలోచన ప్రకారం చెబితే భారతీయ రాజ్యాంగం అనే గ్రంథానికి జాతి సమస్య ఒక అనుబంధమే తప్ప ప్రధానమైన అధ్యాయం కాదు. ఇదే మాట మీద నిక్కచ్చిగా నిలబడి ఆర్.టి.సి. చర్చల్లో ఆయన స్వాతంత్ర్యం కోసం పోరాడి ఉంటే చాలా సమంజసంగా ఉండేది. కాని దళితవర్గాలకు సంబంధించిన ఈ చిన్నవిషయం మీద ఆయన ఆత్మ హింసకు పాల్పడటమే మనకు బాధ గొలిపే వింత. దళిత వర్గాలకు మాత్రమే కాకుండా, ఇండియన్ క్రిస్టియన్‌లకు, ఆంగ్లోఇండియన్‌లకు, యూరోపియనులకు, మహమ్మదీయులకు, సిక్కులకు కూడా ఇలా ప్రత్యేక నియోజక వర్గాలు మంజూరు చేశారు. అంతేకాదు భూస్వాములకు, శ్రామికులకు, వ్యాపారస్తులకు కూడా ఇలా కేటాయించారు. గాంధీ మహమ్మదీయులకు, సిక్కులకు తప్ప మరెవ్వరికీ ప్రత్యేక నియోజకవర్గాలు ఉండరాదని తమ నిరసన వ్యక్తంచేసి ఉన్నారుకూడా. వారిలో కూడా ఒక్క దళితవర్గాలకు తప్ప తక్కిన వారికి ప్రత్యేక నియోజక వర్గాలు ఇచ్చినా నష్టం లేదన్న ధోరణిలో ఆయన వ్యవహరిస్తున్నారు.

దళితవర్గాలకు ప్రత్యేక నియోజకవర్గాలనిస్తే ఏమవుతుందో! అనే విషయంగా గాంధీ పడే భయాలన్నీ ఒట్టి ఊహలు. మహమ్మదీయులకు, సిక్కులకు ప్రత్యేక నియోజక వర్గాలిచ్చినపుడు ముక్కలుకాని హిందూ సమాజం దళితవర్గాలకిస్తే ముక్కలవుతుందా? ఇతర వర్గాలకిచ్చినా దేశం ముక్కలు కాబోదా! అన్న స్పృహ ఆయనకు కల్గటం లేదు.

స్వతంత్ర రాజ్యాంగంలో అధికుల నిరంకుశత్వం నుంచి తమను తాము రక్షించుకోవటానికి రాజకీయమైన హక్కును కావాల్సిన వర్గం ఏదైనా ఉందంటే అది దళిత

ప్రజానీకమేనని చాలామంది గుర్తించారు. జీవనపోరాటంలో తన్ను తాను కాపాడుకోలేని వర్గం నిస్సందేహంగా ఇదే. ఏ మతానికైతే వారు బంధింపబడి ఉన్నారో ఆ మతం వారికి ఒక గౌరవస్థానం కల్పించడానికి బదులు, అసలు సాధారణ సంపర్కానికి కూడా తమని కుష్ఠు వారిలాగా ఒక ముద్ర వేసింది. ఆర్థికపరంగా ఈ వర్గం ఉన్నత జాతి హిందువుల మీద ఆధారపడే తిండిగింజలుసంపాదించుకోవాల్సిన స్థితిలో వుంది. వారికి స్వతంత్రమైన మరో బ్రతుకు మార్గంలేదు. సాంఘిక వివక్ష అన్ని ద్వారాలను మూసివేయకపోయినా తరతరాలనుంచి హిందూసమాజం దళిత ప్రజల జీవన ప్రమాణాలలో ఉన్నతస్థితికి రాకుండా వీలైన ప్రతి ద్వారానికీ గొళ్ళెం పెడుతూనే వచ్చింది. మరొక విషయం చెబితే అతిశయోక్తి కాదు. ఉన్నత జాతి హిందువులు తమలోతాము ఎన్ని విభేదాలలో ఉన్నా దళిత ప్రజలు సంఖ్యలో తక్కువైనా, ఎక్కడోవిసిరేసినట్టు పడి ఉన్నా, ఎదురు తిరిగితే మాత్రం నిర్దాక్షిణ్యంగా అణచి పారవేయటానికి - అందరూ కలిసి కుట్ర పన్నుతారు.

ఈ పరిస్థితులలో సహజంగా ఆలోచించే ఎవరైనా నిరంకుశత్వాన్ని ఎదిరించి పోరాడాల్సిన ఈ నిర్భాగ్య జాతి విజయం పొందాలంటే కొంతయినా అధికారంలో భాగమివ్వటం ద్వారానే, అది తన్ను తాను రక్షించుకోగలదనీ, అది చాలా అత్యావశ్యకమైన కార్యమని గుర్తించ గలుగుతారు.

దళిత వర్గాల శ్రేయోభిలాషి ఎవడైనా ఉంటే వాడు కొత్త రాజ్యాంగం ప్రకారం వారికి వీలైనంత రాజకీయాధికారం సిద్ధించడానికి కొసదాకా పోరాడుతాడని నేను విశ్వసిస్తాను. కాని మహాత్ముని ఆలోచనారీతులు వింతగా ఉన్నాయి. నా అవగాహనకు ఏమాత్రం అంతుచిక్కటం లేదు. వారికి లభించే ఈ వాలీవాలని రాజకీయావకాశాన్ని కూడా చేకూర్చడానికి గాంధీజీ ప్రయత్నించటం లేదు. పైగా చేతికి వచ్చిన ఈ చిన్న అవకాశాన్ని కూడా తన ప్రాణం అడ్డుపెట్టడంద్వారా జారిపోవటానికి అవకాశం ఇస్తున్నారు. మహాత్ముడు ఇలా చెయ్యటం ఇది మొదటిసారి కాదు. చాలా కాలం క్రితం మైనారిటీల ఒప్పందం జరిగింది. మహాత్ముడు ముస్లింలతోనూ, కాంగ్రెస్‌తోనూ ఒక ఒప్పందానికి వచ్చాడు. ముస్లింలు కోరిన 14 కోరికల్ని అంగీకరించాడు. ఫలితంగా ముస్లింలు తనతో చేతులు కలిపి నేను (అంబేద్కర్) దళిత వర్గాల పక్షాల కోరిన కోర్కెలను నిరోధించటంలో సహకరించాలని కోరాడు.

ముస్లిం ప్రతినిధుల గొప్పతనం ఏమిటంటే అలాంటి వెన్నుపోటు పనికి అంగీకరించకపోవటం. అలా చేయటం వల్ల దళితవర్గాలను రక్షించటమే కాకుండా తామూ గాంధీ కలిస్తే ఏ సంక్షోభం తలెత్తేదో దాన్నుంచి తమ్ముతామే రక్షించుకొన్నారు.

గాంధీ ఇలా దళితవర్గాల విషయంలో ఎందుకు కఠినంగా వ్యవహరిస్తున్నారో నాకర్థంకావటం లేదు. కమ్యూనల్ అవార్డు (అంటే ప్రత్యేక నియోజకవర్గాలనుకేటాయించటం) వల్ల హిందూజాతి నుండి దళితవర్గాలు వేరై పోతాయని ఆయన అంటారు. దీనికి భిన్నంగా డా.మూన్జే అనే హిందూ మత ప్రచారకుడు, తీవ్రవాది వాదిస్తున్నారు. లండన్ నుంచి తిరిగి వచ్చాక ఆయన ఇస్తున్న ఉపన్యాసాల్లో ఇలా చేయటం వల్ల హిందువులకు దళితవర్గాలకు మధ్య ఏచీలికా రాదంటున్నారు. అంతేకాదు దళితవర్గాలను హిందువులనుండి రాజకీయంగావేరు చేయటంలో నాకంటే ఆయనే ఘనవిజయం సాధించినట్టు చెప్పుకొంటుంటారు. కమ్యూనల్ అవార్డు విషయాన్ని ఆయన వ్యాఖ్యానించిన తీరు సరిగానే ఉందికాని, దీనికంతా బాధ్యుడన్న పేరు

డా.మూన్జేకే చెందుతుందన్న విషయం నేను నిర్ధారించి చెప్పలేను. అంచేత జాతివాది అయిన డా.మూన్జేకన్నా, భిన్నంగా జాతివాది కానటువంటివాడు, దేశవాది అయిన మహాత్మా గాంధీ కమ్యూనల్ అవార్డు విషయంలో ఇలా చెప్పటమే ఆశ్చర్యకరంగా ఉంది. ఇలాచేయటంవల్ల చీలిక రాదని డా.మూన్జే చెబుతుండగా మహాత్మా గాంధీ ఆ మాటతో తృప్తిపడాలి.

నా దృష్టిలో కమ్యూనల్ అవార్డులకే కాకుండా దళితవర్గాల హిందువులకు చెందిన రావ్ బహద్దుర్ రాజా, శ్రీ బాలు లేక శ్రీ గోవై మొదలైన వారికి కూడా సంతృప్తిని కల్గిస్తుంది. వీరు ఉమ్మడి నియోజక వర్గాలను కోరుకుంటున్నారు. రాజా అంసెంబ్లీలో ఈ విషయంగా చేసిన ప్రకటనలు నాలో చాలా ఉత్సుకతను కల్గించాయి. ఆయన ఉమ్మడి నియోజక వర్గాల విషయంగా అతి తీవ్రంగా వాదిస్తారు. హిందువుల నిరంకుశత్వాన్ని భయంకరంగా విమర్శిస్తారు. ఇలాచేయటంలో ఆయన ఆర్.టి.సి.కి దూరంగా ఉంచ బడ్డాడన్నది హేతువో, లేకతనలో నిజాయితీగా వచ్చిన ఆలోచనా పరిణామం కారణమో నేను చర్చించబోను. కమ్యూనల్ అవార్డు విషయంగా రాజా మాటిమాటికి చెబుతున్న విమర్శలు రెండు: (1) జనసంఖ్యా నాధారంగా చూస్తే దళితవర్గాలకు రావాల్సిన దానికన్నా తక్కువ సీట్లు వచ్చాయి. (2) మరో అంశం– దళితవర్గాలు హైందవ ధర్మం నుంచి వేరు చేయబడ్డాయి.

మొదటి అంశం విషయంలో వారి బాధతో నేనూ ఏకీభవిస్తాను. కాని ఆర్.టి.సి.లో దళితవర్గాల తరపున పాల్గొన్న ప్రతినిధులు తమ హక్కులను అమ్ముకున్నారని రావ్ బహద్దూర్ అంటేమాత్రం ఆయన ఇండియన్ సెంట్రల్ కమిటీ సభ్యుడిగా ఉంటూ ఏం చేశారో చెప్పాల్సి వస్తుంది. ఆ కమిటీ రిపోర్టులో దళితవర్గాలకు కేటాయించిన సీట్లు ఇలా ఉన్నాయి:

| | | | |
|---|---|---|---|
| మద్రాసులో | 150 | 10 | |
| బొంబాయిలో | 14 | 8 | |
| బెంగాలులో | 200 | 8 | |
| ఉత్తర్ ప్రదేశ్‌లో | 182 | 8 | |
| పంజాబులో | 150 | 6 | |
| బీహార్ & ఒరిస్సాల్లో | 150 | 6 | |
| సెంట్రల్ పరగణాలలో | 125 | 8 | |
| అస్సాంలో | 75 | 9 | (దళితులతో పాటు ఆదివాసులకు కలిపి) |

ఈ పట్టికను పరిశీలిస్తే జనసంఖ్యా నిష్పత్తిని బట్టి సీట్ల కేటాయింపు జరగలేదని నేను విమర్శించ బూనటంలేదు. కాని ఇలా చెయ్యటంవల్ల దళితవర్గాలకు అతితీవ్రమైన అల్ప ప్రాతినిధ్యం వచ్చిందని మాత్రం చెప్పటంలో సందేహంలేదు. ఈ పంపకానికి రాజా కూడా బాధ్యులే. కమ్యూనల్ అవార్డును విమర్శిస్తూ ఇతరుల్ని నిందించే ముందు ఎలాంటి ధిక్కారమూ తెలపకుండా ఇలా సీట్ల తగ్గింపు విషయమై ఎలా అంగీకరించారో ఒకసారి మరలా గుర్తుకు

తెచ్చుకోవటం మంచిది. ప్రాతినిధ్యానికి జనసంఖ్యే ప్రాతిపదిక అయితే, దాని ఆధారంగా సీట్లు కోరటం జన్మహక్కయితే, దీనిద్వారా మాత్రమే వారికి రాజకీయ భద్రత కల్పించగలమన్నది సత్యమే అయితే, రాజా ఆ కమిటీ సభ్యులుగా ఉండికూడా, చెప్పగలిగిన అవకాశం ఉన్నా ఎందుకు గట్టిగా కూర్చోలేదు?

ఇక కమ్యూనల్ అవార్డు వల్ల ఉన్నత హిందువులలో దళితవర్గాలు వేరుపడతాయన్న వాదాన్ని నేనంగీకరించలేదు. రాజాకి ప్రత్యేక నియోజక వర్గాలపట్ల హృదయపూర్వకమైన అభ్యంతరమే ఉంటే అలాంటి నియోజకవర్గాలలో అభ్యర్థిగా నుంచోమని ఆయన్ని ఎవరూ బలవంత పెట్టరు. ఆయన సాధారణ నియోజకవర్గంలో అభ్యర్థిగానూ నిలబడవచ్చు, వోటూ వేయవచ్చు. ఆ అవకాశం ఉంది. ఆయన అలాగే చేయవచ్చు. రాజా ఉన్నత వర్గాల హిందువుల హృదయాల్లో దళితవర్గాల పట్ల సంపూర్ణమైన మార్పు వచ్చిందని దళితప్రజలకు హామీఇస్తూ గొంతు చించుకొని అరుస్తున్నారు. దళితవర్గాలు ఆయన మాటల్ని నమ్మి ఆయన్ని సాధారణ నియోజక వర్గంలో ఎన్నుకోవటంలేదు. కాని అలాచేసి ఉంటే ఉన్నత హిందువులకు దళితవర్గాలపై ఎంత అభిమానం ఉందో నిరూపించే అవకాశం ఆయనకుండేది. అలాగే రాజా వారిలో తమ విశ్వాసాన్ని నిరూపించుకునే అవకాశం ఉండేది.

అందుచేత కమ్యూనల్ అవార్డు నా దృష్టిలో అటు ప్రత్యేక నియోజకవర్గాలు కోరేవారికి, ఇటు ఉమ్మడి నియోజకవర్గాలు కోరేవారికి ఇరువురికీ సంతృప్తికరంగానే ఉంది. ఈ అర్థంలో ఇది ఒక రాజీమార్గం. దీన్ని యథాతథంగా అంగీకరించాలి. మహాత్ముడికి సంబంధించినంత వరకు ఆయన ఏం కోరుకుంటున్నాడో నాకు తెలియటంలేదు. ప్రత్యేక నియోజకవర్గాలకు ఆయన వ్యతిరేకే తప్ప, ఉమ్మడి నియోజకవర్గాలకు, సీట్ల రిజర్వేషనుకు కాదని ఒక భావన ఉంది, కాని ఇది చాలా పెద్ద పొరపాటు. ఇవ్వాళ ఆయన అభిప్రాయాలు ఎలాఉన్నా, లండన్ లో ఉన్నపుడు ఆయన ఈ పద్ధతికే వ్యతిరేకం. సాధారణ నియోజకవర్గాలలో వోటు హక్కున్న ఇతర జనులలాగానే వీరుకూడా వోటు చేయాలన్నదే తప్పా దళిత ప్రజలకు ఏవిధమైన ప్రాతినిధ్యం శాసనసభల్లో ఇవ్వడానికి ఆయన సుముఖంగా ఉండేవాడు కాదు. ప్రారంభంలో ఆయన అభిప్రాయం ఇదే. ఆర్.టి.సి. పూర్తవుతుండగా ఒక పథకాన్ని నాతో చెప్పారు. దాన్ని అంగీకరించడానికి తనకిష్టమేనని కూడా చెప్పారు. ఆపథకం సాంప్రదాయికంగా ఉందే తప్ప రాజ్యాంగం అంగీకరించేది కాదు. ఎలెక్టొరల్'లో దళితవర్గాలకు ఒక సీటైనా కేటాయించాలని కూడా అందులోలేదు.

ఆ స్కీమ్ క్రింది విధంగా ఉంది :-

దళితవర్గాలకు చెందిన అభ్యర్థులు ఉన్నత హిందువులతో పాటుగా సాధారణ నియోజక వర్గాలలో పాల్గొనవచ్చు. దళితవర్గాలకు చెందిన అభ్యర్థి ఓడిపోతే తాను అస్పృశ్యుడు కావటం వల్లనే ఓడిపోయానని ఎలెక్షన్ పిటిషన్ పెట్టి తీర్పును తెచ్చుకో గలిగితే అప్పుడు గెలిచిన ఆ హిందూ సభ్యులచేత మహాత్ముడు రాజీనామా చేయించి వారి పదవులు ఖాళీ అయ్యేలా ప్రయత్నిస్తాడట. మళ్ళా ఎన్నిక జరుగుతుంది. దళితవర్గానికి చెందిన అభ్యర్థి మరలా తన అదృష్టాన్ని పరీక్షించుకోవచ్చు. మరలా ఓడిపోయాడనుకోండి. మరలా కోర్టు నుండి అదే తీర్పు తెచ్చుకోవాలి. ఈ వాస్తవాల్ని నేనెందుకు బయట పెడుతున్నానంటే ఉమ్మడి నియోజకవర్గాలు, సీట్ల రిజర్వేషన్ పద్ధతి మహాత్ముడికి తృప్తి కల్గిస్తాయని కొందరభిప్రాయ

పడుతున్నారు కాబట్టి. ఇంతవరకు చెప్పినదాన్నిబట్టి ఈ ప్రశ్నను గురించి చర్చించటం నిష్ప్రయోజనం అని, ఆయన (మహాత్ముడు) వాస్తవంగా, ఏ పద్ధతులు అభిలషిస్తాడో స్పష్టంగా చెప్పేవరకు ఈపరిస్థితి ఇంతే.

మహాత్ముడిచ్చే భరోసాలను నేనంగీకరించను. ఆయన కాని కాంగ్రెస్ కాని అవసరమైన కార్యాన్ని సాధిస్తుందని నేననుకోను. నా జాతి ప్రజల రక్షణలాంటి అతిముఖ్యమైన ప్రశ్నను కొన్ని సంప్రదాయాలకు, అవగాహనలకు వదిలిపెట్టలేను. మహాత్ముడు శాశ్వతుడుకాడు. అలాగే కాంగ్రెస్ కూడా. అది దుష్టశక్తి కాదనుకున్నా శాశ్వతమైన శక్తి కాదుకదా! ఇండియాలో చాలామంది మహాత్ములు పుట్టారు. వారందరూ అస్పృశ్యతను తొలిగించి దళిత వర్గ ప్రజల్ని ఉన్నతులుగా చేసి హైందవ జీవన స్రవంతిలో కల్పటానికి ఏకైక ధ్యేయంతో ప్రయత్నం చేసిన వారే. కాని వారందరూ విఫలులయ్యారు. మహాత్ములు పుట్టారు. మహాత్ములు పోయారు. కాని అస్పృశ్యులు మాత్రం అస్పృశ్యులుగానే మిగిలిపోయారు.

సంస్కరణ ఉద్యమాల వేగం నాకు బాగా తెలుసు. సంక్లిష్ట పరిస్థితులు వచ్చినపుడు హిందూసంస్కార వాదులు ఎలా ప్రవర్తిస్తారో, దేన్ని విశ్వసిస్తారో కూడా నాకు తెలుసు. మహద్‌లోను, నాసిక్ లోను ఘర్షణలు జరిగినపుడు సంస్కారవాదులు ఎలా ప్రవర్తించారో చూశాక, దళితవర్గాల శ్రేయోభిలాషి ఎవడూ దళితవర్గాల ఉద్ధరణను అలాంటి క్రూరుల భుజాలమీద పడవేయటానికి ఇష్టపడడు. అపాయమే సంభవిస్తే సంస్కారవాదులు తాము వల్లించే సూత్రాలకైనా తిలోదకాలు ఇస్తారుకాని, తమవారిని మాత్రం నొప్పించరు. ఇలాంటి సంస్కారవంతుల వల్ల లాభమేమిటి?

కనుక, నా జాతి ప్రజల సంరక్షణ కోసం చట్టపరమైన భద్రత కావాలని నేను నొక్కి చెప్పక తప్పటంలేదు. గాంధీ గారికి కమ్యూనల్ అవార్డు నచ్చకపోతే దళితవర్గాలను రక్షించటానికి ఇంత కన్నా మంచి మార్గం ఇంకోదాన్ని సూచించనీయండి.

మహాత్ముడు తాను చేయజూస్తున్న అతితీవ్రమైన ఆత్మాహుతి కార్యక్రమం నుంచి బయట పడతాడని ఆశిస్తున్నాను. ప్రత్యేక నియోజకవర్గాలు కావాలని కోరినంత మాత్రంలో హిందూసమాజానికి మేము ఏ అపాయమూ తలపెట్టడంలేదు. మా తలరాతల్ని మార్చి పారవేయ గలిగిన ఉన్నత హిందువుల తీయటి కోరికల నుంచి బయటపడి సంపూర్ణంగా స్వతంత్రంగా బ్రతికటం కోసమే ప్రత్యేక నియోజకవర్గాలను కోరుకుంటున్నాను. మహాత్ముడిలాగానే మాక్కూడా తప్పుచేసి దిద్దుకొనే అవకాశం ఉంది. మాకున్న ఆహక్కును మహాత్ముడు అపహరించకూడదని విశ్వసిస్తున్నాం. ఇంతకన్నా మరో ఉన్నత ప్రయోజనం కోసం ఆయన ఆమరణ నిరాహారదీక్ష చెయ్యటం మంచిది. హిందూ మహమ్మదీయుల మధ్యకాని, హిందువులకు దళితలకు నడుమకాని, జరిగిన సంఘర్షణల మీదకాని, ఏదో ఒక జాతీయ సమస్య మీద కాని, మహాత్ముడు ఈ తీవ్రమైన నిర్ణయం తీసుకొని ఉంటే అందులో ఔచిత్యం ఉండేది. ఇలా చేయటంవల్ల దళితవర్గాల దౌర్భాగ్యం ఏమీ మారదు. ఇందులో సందేహం లేదు. ఆయనకు తెలుసో తెలీదో కాని, మహాత్ముడిలా చేస్తే ఆయన అనుయాయులు దేశం మొత్తం మీద దళిత ప్రజలపై తిరగబడి బీభత్సం సృష్టించటం తప్ప మరే లాభమూ ఉండదు.

ఇలాంటి సంఘర్షణల వల్ల దళిత ప్రజలు హిందూమతానికి దూరం కాదలిస్తే, హిందూ మతంలోకి వారి నాకర్షించే ప్రయత్నం కూడా విజయవంతం కాదు. మీకు హిందూమతం కావాలా! లేక రాజకీయాధికారమా' అని మహాత్ముడు దళితుల్ని ప్రశ్నిస్తే వాళ్ళు అధికారాన్నే కోరి ఆ విధంగానైనా మహాత్ముణ్ణి ఈ ఆత్మ హింసనుంచి తప్పిస్తారు. గాంధీ నెమ్మదిగా ఈ విషయాలు ఆలోచిస్తే ఆయన నిరాహారదీక్ష ద్వారా విజయం సాధించాలని కోరుకుంటారని నేననుకోను. ఇంత కన్నా ముఖ్యవిషయం ఏమిటంటే మహాత్ముడు ఛాందసులను, అనియంత్రితశక్తులను బయటికి వచ్చేలా చేస్తున్నారు. హిందూవులకు దళితులకు మధ్యవైరస్ఫూర్తిని, ద్వేషాన్ని అధికం చేస్తున్నారు. ఇలాచేస్తే ఈ ఇరువర్గాల మధ్య అగాధం మరింత పెరుగుతుంది. ఆర్.టి.సి.లో నేను గాంధీగారిని వ్యతిరేకించినపుడు దేశమంతటా నామీద తీవ్రమైన వ్యతిరేక నినాదాలు వచ్చాయి. నన్ను దేశద్రోహిగా జాతీయ ప్రయోజనాల్ని భగ్నంచేసే కుట్రదారుగా ముద్రవెయ్యటానికి నేషనలిస్ట్ ప్రెస్ కుట్ర చేసింది. నావైపు నుంచి వార్త లేవీ ప్రసారం కాకుండా చేసి నా పక్షానికి వ్యతిరేకంగా ప్రచారం ఉధృతంచేసి మేముజరిపే సభల గురించి అతిశయోక్తితోకూడిన రిపోర్టులను ఇచ్చి నన్ను కుంగదీయాలని ప్రయత్నంచేశారు. అసలు జరగని సభల గురించి కూడా రిపోర్టులు వచ్చాయి. దళితవర్గ నాయకులలో విభేదాలు సృష్టించడానికి వెండి తూటాలను*' స్వేచ్ఛగా వాడారు. కొన్ని ఘర్షణలు జరిగి హింస కూడా చోటు చేసుకుంది.

ఇలాంటి పరిస్థితి మళ్ళా ఉధృతంగా రాకుండా ఉండాలంటే దేవుడి సాక్షిగా చెబుతున్నాను ఆయన తన నిర్ణయాన్ని పునరాలోచించు కోవటం మంచిది. ఇలా చేయటం ద్వారా చాలా దుష్ఫలితాలను ఆయన నివారించ గలుగుతారు. ఇదంతా మహాత్ముడు కావాలని కోరుకుంటాడని నేను భావించడంలేదు. కాని ఈ కోరికను ఆయన విరమించుకోకపోతే పగలు తర్వాత రాత్రి ఎలా తప్పదో అలానే నేను ముందు వివరించిన పరిణామాలు కూడా ఆయన కోరకపోయినా జరుగుతాయి.

ఈ ప్రకటనను ముగించే ముందు ఈ సమస్య ఇంతటితో పూర్తయి పోయిందని నేను చెప్పగలిగినా, ఇప్పటికి కూడా గాంధీగారి ప్రణాళికను పరిశీలించడానికి నేను సిద్ధంగానే ఉన్నానని ప్రజలకు హామీ ఇవ్వదలుస్తున్నాను. ఏమైనా మహాత్ముడు ఆయన జీవితానికి, నా ప్రజల హక్కుకు నడుమ ఏది కోరుకుంటావో నిర్ణయించుకో అనే పరిస్థితిలోకి నన్ను నెట్టరని నేను నమ్ముతున్నాను. అంతేకాని నాజాతి వాళ్ళను చేతులు కాళ్ళు కట్టివేసి ఉన్నత హిందువుల దగ్గర తరతరాలు పడి ఉండమని అప్పగించటానికి నేను ఎప్పటికీ ఒప్పుకోను.

బి.ఆర్.అంబేద్కర్

* Silver bullets అని డా. అంబేద్కర్ గారి ప్రయోగం

## అనుబంధం V

# తిరువాన్‌కూరులో ఆలయప్రవేశం

హిజ్ హైనెస్ తిరువాన్‌కూరు మహారాజా వారు 1936 నవంబరు 12న ఒక ఉత్తరువు ప్రకటించారు. ఇది అస్పృశ్యులకు ఆలయప్రవేశాన్ని అనుమతిస్తూ ప్రభుత్వంచేసిన శాసనం. దీని పాఠం ఇలా ఉంది. " మన మతంలోని సత్యాన్ని న్యాయాన్నిగుర్తించి సంపూర్ణంగా సంతృప్తిపొంది, భగవంతుని పర్యవేక్షణలో అతనిసర్వవేతృత చేత, దయాగుణం చేతనే మన మతం నడుస్తున్నదని గుర్తిస్తూశతాబ్దాల చరిత్రలో అది ఎప్పటికప్పుడు మారుతున్న కాలంలోని అవసరాన్నిబట్టి సర్దుబాటు పొందుతూవచ్చిందని కూడా గుర్తిస్తూ, హిందూధర్మసానుభూతిని విముక్తి మార్గాన్ని పోగొట్టుకోరాదన్న దృష్టితో మాచేతకాని,మా ప్రభుత్వంచేతకాని పరిపాలింప బడుతున్న ఆలయాల్లో, ఆలయపవిత్రతను, ఆచారపద్ధతులను ఆయా విధులననుసరించి జరుపుకోవటానికి, అభ్యంతరం లేని విధంగా హిందువైన ప్రతి వాడూ గుడిలో పూజచేసుకోవటానికి, ఎలాంటి అభ్యంతరమూ ఉండకూడదని మేం ప్రకటిస్తున్నాం, అనుశాసిస్తున్నాం, విధిస్తున్నాం".

కాంగ్రెస్‌వారు గాంధీ, దీన్ని కొండంతలు చేశారు. హైందవ ప్రపంచంలో ఒక గొప్పవివేక జ్యోతి ఉద్భవించిందనటానికి నిదర్శనమైన దూత వాక్యంగా దీన్నిపరిగణిస్తున్నారు. ఇది అంత సత్యమని నాకనిపించటంలేదు. దీనికి అవతలివైపుకొన్ని వాస్తవాలున్నాయి. వాటిని మనసులో ఉంచుకొనే ఈ విషయాన్నిచూడాలి. ఈ ప్రకటన తిరువాన్కూరు మహారాజా వారు తమపేరిట జారీచేశారు. కాని తెరవెనుక ఉండి ఈ పని చేయించిన శక్తి అతని ప్రధాన మంత్రి సర్.సి.పి.రామస్వామి అయ్యర్. మనం అర్థం చేసుకోవలసింది అతని ఉద్దేశ్యాలనే.1932లో సర్.సి.పి.రామస్వామి అయ్యర్ తిరువాన్కూర్ క్కూడా ప్రధాన మంత్రి గావ్యవహరిస్తున్నారు. 1932లో గురువాయూర్ ఆలయంలో అస్పృశ్యులకు ఆలయప్రవేశ విషయంగా గాంధీ వివాదాన్ని లేపగా సర్.సియపి.రామస్వామి అయ్యర్ఆవివాదంలో ఆలయప్రవేశానికి వ్యతిరేకంగా వాదించిన వారి పక్షంలో ఉన్నారు. ఆ వివాదం జరుగుతున్న రోజుల్లో సర్ సి.పి. రామస్వామి అయ్యర్ ఒక పత్రికా ప్రకటన చేశారు[1]. ఆ ప్రకటనలో ఇలా అన్నారు:

"కులాల నియమాలను నేను పాటించను. ఆలయ పూజా విధానం విషయంలోప్రస్తుత పద్ధతి నియమాలు భగవంతుని అనుశాసనాలన్న అభిప్రాయం బయటికి చెప్పక పోయినా చాలా మందిలో గాఢంగా ఉంది. పరస్పర సహకారంతోనే ఈ సమస్యను శాశ్వతంగా

1. టైమ్స్ ఆఫ్ ఇండియా : నవంబరు 10, 1932

పరిష్కరించవచ్చు. ఇందుకోసం మత సాంఘిక నాయకుల్లో ప్రస్తుత స్థితి పట్ల, వాస్తవాల పట్ల, హిందూజాతి సమగ్రతా పరిరక్షణ పట్ల ఒక కొత్త జాగృతి రావాలి. అప్పుడే ఇది సాధ్యం.

ఈ ప్రయోజనాన్ని సాధించటానికి మెరపు ఉపాయాలు (షాక్ ట్రిక్స్) పనికి రావు. ప్రత్యక్ష చర్యతీసుకొంటే రాజకీయాలలో కన్నా భయంకరంగా నాశనాన్ని చూస్తాం. నేను ఈ విషయంలో దురదృష్టవశంగా గాంధీ అభిప్రాయాలను ఒప్పుకోలేక పోతున్నాము. ఆయన అన్నట్లు గుడిలో ప్రవేశం సహపంక్తి భోజనంతో సంబంధం లేనిది కాదు. డా. అంబేద్కర్ చెబుతున్నట్లు దళితవర్గాల సామాజిక ఆర్థిక అభివృద్ధి మనం త్వరితంగానూ, ఆలస్యం కాకుండా చేయాల్సిన పని అని నేనూ ఒప్పుకుంటాను."

ఈ ప్రకటన చూస్తే 1933లో ఈ సమస్య పట్ల ఆయనలో ఆధ్యాత్మిక చింత లేవీలేనట్టుగా తెలుస్తున్నది. 1933లో ఒక భిన్నమైన దృష్టి కోణాన్ని ఆయన ఏ కారణం చేత గ్రహించాడు? 1936లో తిరువాన్కూరులో ఏ సంఘటన జరిగి ఆయనలో ఈ అభిప్రాయ పరిణామం వచ్చింది? అదే సంవత్సరం (1936) తిరువాన్కూరులో 'ఎజవ' జాతి వారు ఒక సభ జరిపారన్న విషయం గుర్తుకు తెచ్చుకోవాలి. విద్య, ఆర్థిక రంగాలలో ఆ జాతి వారు బాగా బలపడ్డారు. రాష్ట్రంలో తమ సాంఘిక, మత, దుస్థితులపై చాలాకాలం నుంచి తమ అభిప్రాయాలు బాగా బయటికి చెప్పగలిగిన వారు కూడా. 'ఎజవ' తెగ వారు హిందూమతం లోనే ఉండాలా! వేరే ఏదైనా మతాన్ని స్వీకరించాలా! అనే విషయంగా చర్చించటమే ఆ సభఉద్దేశం[1]. ఈ 'ఎజవ'లు చాలా పెద్ద జాతి. ఇంత పెద్ద జాతి వారు జారిపోతే హిందూమతానికి చాలా పెద్ద దెబ్బ. ఈ సభ ఈ అపాయాన్ని ధ్రువీకరించింది.

మహారాజా చేసిన ఈ ప్రకటన ఈ అపాయం జరగకుండా చూడటం కోసమని చెబితే అతిశయోక్తి కాదు. ఇది సత్యమే అయితే ఈ ప్రకటన వెనుక తత్త్వ చింతన ఏమీ లేదని స్పష్టమవుతోంది. సర్. సి. పి. రామస్వామి అయ్యర్ ఒక వాస్తవిక క్రియకు తాత్త్వికమైన రంగును పులమటంలో తనదైన ఒక శైలి ఉన్నవారు. హిందూ 'లా' ప్రకారం బ్రాహ్మణుడు ఎంత తప్పు చేసినా అతడికి మరణ శిక్ష లేదు. ఇది బ్రాహ్మణులందరికీ వర్తిస్తుంది. ఇటీవల తిరువాన్కూరు స్టేట్‌లో అయ్యర్‌గారు మరణ శిక్షను రద్దు చేసి ఒక గొప్ప మానవీయ సంస్కారాన్ని సాధించిన ఘనతను పొందారు. అసలీ రద్దును ప్రకటించడంలో అసలు రహస్యం బ్రాహ్మణుడిని శిరచ్ఛేదం పాలు కాకుండా కాపాడటం కోసమేనని తేలింది. న్యాయం ముందు అందరూ సమానులైతే బ్రాహ్మణుడికీ శిక్ష పడాల్సి వస్తుంది కదా!

ఈ ప్రకటన వాస్తవాలను ఎంత వరకు మార్చింది! ఎంత వరకు ఇది నాటకంగా ఉంది! - ఈ విషయాన్ని చూద్దాం. తిరువాన్‌కూరులో వాస్తవాలు లభించవు కాబట్టి మనం వాటిని సాధించటం కష్టం. మద్రాసు శాసనసభలో మలబార్ టెంపుల్ ఎంట్రీ బిల్ మీద చర్చ జరుగుతున్నపుడు తిరువాన్కూరుకు సంబంధించిన కొన్ని వాస్తవాలను సర్. టి. పన్నీర్ సెల్వం పేర్కొన్నారు. అవి నిజమైతే ఈ ప్రకటన బట్టి బూటకమని తేలి పోతుంది.

1. ఇయోలా'లో 1935లో నా అధ్యక్షతన జరిగిన సభలో తీసుకున్న నిర్ణయం దీనికి ప్రేరణ.

సర్. టి. పన్నీర్‌సెల్వం ఇలా అన్నారు:

"ప్రీమియర్ తిరువాన్‌కూరు లోని ఆలయాల్లో ప్రవేశ విషయంగా సమర్థిస్తూ చేస్తున్న వాదాలలో ఒకటి అస్పృశ్యులకు ఆలయాల్లో ప్రవేశం కల్పించటం మహారాజు సార్వభౌమాధికారం కల్గిన వాడు. కాబట్టి ఆజ్ఞ ద్వారా అలా ప్రకటించ గలిగాడు. ఇంత వరకు బాగుంది. ఆ ఆజ్ఞ అక్కడ ఎలా పని చేస్తోంది? ఆయనకు వచ్చిన ఫిర్యాదును బట్టి తొలి రోజులలో పెల్లుబికిన ఉత్సాహంతో కొంత మంది హరిజనులు గుళ్ళకు పోవటం మొదలు పెట్టారు. దానితో అంతకు ముందు గుడికి వెళ్తూ ఉండిన వారందరూ ఒక్కుమ్మడిగా ఆగి పోయారు. ఈవిషయం తెలిసి ఈ కొత్త విధానం నిజంగా విజయవంతమైందా లేదా కనుగొనమని ఆయన ప్రభుత్వాన్ని కోరారు."

ఈ బిల్లును మూడో మారు చదివాక సర్. టి. పన్నీర్ సెల్వం చాలామందిని దిగ్భ్రాంతి, కల్గించే ఒక విషయాన్ని తెలిపారు:

"వ్యక్తులకు సంబంధించిన ఆలయాల్లో ఉదాహరణకు పెద్ద మహారాణిగారి సొంత ఆలయాల్లో రాజాజ్ఞ మినహాయింప బడిందన్న విషయం నిజమేనాకాదా! మహారాజా కనుగొమ్మన్నారు. అలాగే పెద్ద మహారాణి కూతురు పెళ్ళిసమయంలో అపవిత్రతను తొలగించే సంప్రోక్షణ కార్యక్రమం కూడా చేపట్టాల్సి వచ్చిందట. ఈ సంప్రోక్షణే జరిగి ఉంటే రాజ ప్రకటన ఏమైనట్టు?"

ఈ వాస్తవాలను తప్పని సర్. సి. పి. రామస్వామి అయ్యర్ కాని రాజగోపాలాచారి కానీ వాదించలేదు. స్పష్టంగా ఇవి సత్యాలే. అయినపుడు వాటినిగురించి వాదించటం ఎలాగా? తిరుగు లేని ఈ వాస్తవాల నేపథ్యంలో 'మలబార్ ఆలయ ప్రవేశ' ప్రకటనను గురించి ఎంత తక్కువ చెప్పకుంటే అంత బాగుంటుంది.

తిరువాన్‌కూరులో సంఘ సంస్కారానికి సంబంధించిన అంశాల్లో తానే సర్వమూ అయింది,. ఒక్క ఆలయ ప్రవేశం మాత్రమేనా! ఆలయ ప్రవేశం మాత్రమే చాలనుకుంటే మత పరంగా సర్వ సమానత్వం వచ్చినట్టేనా! ఉదాహరణకు దేవాదాయ శాఖను అస్పృశ్యుల చేతిలోనో శూద్రుల చేతిలోనో ఉంచుతారా? ఈప్రకటన జారీ అయి తొమ్మిదేళ్ళయింది. కాని తిరువాన్‌కూరులో మత విషయంగా ప్రజాస్వామ్యం ఏర్పడడానికి ఎలాంటి ప్రయత్నమూ జరుగలేదు.

ఆలయ ప్రవేశాన్ని కోరినందుకు అస్పృశ్యులు మూల్యం చెల్లించాల్సి వచ్చిందా! - నేను స్పష్టంగా సమాధానం చెప్పలేను కాని 'అఖిల తిరువాన్‌కూరు పులయర్,చర్మర్, ఐక్య మహా సంఘానికి చెందిన నారాయణ స్వామి నాకు రాసిన ఉత్తరాన్ని యథాతథంగా ఉంచుతున్నాను. అది 1938 నవంబరు 24న రాసింది.

మకాం: మయ్యనాడ్
క్విలాన్: 24-11-1938.

డా. అంబేద్కర్ గారికి
బొంబాయి

ఆర్యా!

నేను క్రింది వాస్తవాలను మీకు తెలిపి మీ విలువైన సలహాను పొందాలన్న సంతోషంతో ఈ ఉత్తరం రాస్తున్నాను. తిరునాన్కూరు రాష్ట్రంలోని హరిజన నాయకుడిగా మా రాష్ట్రంలోని హరిజనులు పడుతున్న బాధలను మీకు తెలవటం మా విధ్యుక్త ధర్మంగా భావిస్తున్నాం.

1. హిజ్ హైనెస్ మహారాజా వారు జారీ చేసిన ఆలయ ప్రవేశ ప్రకటన నిజంగా హరిజనులకు వరమే. కాని, హరిజనులు అన్ని సామాజిక రుగ్మతలు అనుభవిస్తున్నారు. కానీ ఒక ఆలయ ప్రవేశానికి మాత్రం నోచుకోలేక పోయారు. హరిజనుల స్థితి మెరుగు పరచటానికి ప్రభుత్వం ఎలాంటి చర్యా తీసుకోవటంలేదు.

2. రాష్ట్రంలో ఉన్న 15లక్షల మంది హరిజనులలో కొంత మంది డిగ్రీ చదివినవాళ్ళు , ఒక ఆరుగురు అండర్ గ్రాడ్యుయేట్లు, 50 మంది స్కూలు ఫైనల్ చదివిన వాళ్ళు, 200 పై చిలుకు ప్రాంతీయ భాషా సర్టిఫికేట్లు కలిగిన వాళ్ళు ఉన్నారు. ప్రభుత్వం ఒక పబ్లిక్ సర్వీస్ కమిషన్ పెట్టినా హరిజనులకిస్తున్న ఉద్యోగాలు మాత్రం చాలా తక్కువ. అన్ని ఉద్యోగాలూ సవర్ణులకే (అగ్రహిందువులకే) పోతున్నాయి. ఒక హరిజనుడికి ఉద్యోగం అంటూ ఇస్తే అది కూడా రెండు వారాల పాటే. పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఉద్యోగ నియమాల్ని బట్టి ఒక సంవత్సరం తరువాతనే దరఖాస్తుదారు అప్లికేషన్ ఉంచాలి. ఇలా ఉంటే సవర్ణుడినైతే ఒక సంవత్సరమో అంతకన్నా అధికంగానో ఉంచుతారు. అసెంబ్లీ ముందు నియామకాల పట్టిక పెట్టినపుడు మాత్రం కుల ప్రాతిపదికపైనే ఉద్యోగులు పంచినట్టు కనిపిస్తుంది. కాని హరిజనుల కందరికీ కలిపి ఇచ్చే ఉద్యోగ కాలం మొత్తం కేవలం ఒక సవర్ణుడికిచ్చే ఉద్యోగ కాలంతో సమానం. ఈ విధమైన మోసం ఆ కమిషన్‌లోని అధికారులు చేస్తున్నది. అలా పబ్లిక్ సర్వీస్ కమిషన్ సవర్ణుల ఉమ్మడి ఆస్తి అయిపోయింది. దీని ద్వారా ఏ హరిజనుడూ బాగు పడటం లేదు.

3. కొన్నేళ్ళ క్రితం హిజ్ హైనెస్ మహారాజా వారు ప్రతి హరిజనుడికి నివాసంకోసం మూడు ఎకరాలను ఇవ్వాలని ఒక ప్రకటన చేశారు. రాజోద్యోగులంతా సవర్ణీయులే. అందుచేత వారికి ఈ ఆజ్ఞను కార్యరూపంలోకి తీసుకు రావటం ఇష్టం లేదు. ప్రభుత్వం వారు కూడా గ్రామాలకు సమీపంలో ఉన్న బీడు భూముల్ని పశువుల్ని మేపు కోవటం కోసం సిద్ధంగా ఉన్నా హరిజనులకు మాత్రం కొంచెం కూడా భూమి రాలేదు. ఇప్పటికి కూడా సవర్ణీయుల ఆవరణంలోనే బ్రతుకుతూ హరిజనులు అనేక విధాలైన కష్టాలను అనుభవిస్తున్నారు. ఎంతో విశాలమైన భూమి 'రిజర్వ్'లో ఉన్నా నేల కోసం హరిజనులు పెట్టిన దరఖాస్తుల్ని మాత్రం

ఎవరూ పట్టించు కోవటం లేదు. వాళ్ళ గోడు వినే నాథుడే లేడు. ఈ భూముల్లో చాలా వంతులు సవర్ణీయుల అనుభవంలో ఉంటున్నాయి.

4. ప్రతి సంవత్సరమూ అసెంబ్లీ ఎన్నికలలో హరిజన కులం నుంచీ ఒకర్ని ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. వారిని ఎన్నుకొన్నది అసెంబ్లీ ముందు హరిజనుల సమస్యల్ని నివేదించటం కోసమే అయినా వారు మాత్రం ప్రభుత్వ యంత్రాంగంలో భాగమై పోతున్నారు. అంటే సవర్ణీయులైన అధికారుల చేతుల్లో స్వలాభం కోసం కీలు బొమ్మల్లా ప్రవర్తిస్తున్నారు. అలా హరిజనుల బాధలు ఏ విధంగానూ పరిష్కారానికి నోచుకోవటం లేదు.

5. తిరువాన్‌కూరులో హరిజనులందరూ అటు ఇళ్ళ ఆవరణల్లోనూ, అటుపొలాల్లోనూ కాయకష్టం చేసి బ్రతికే వాళ్ళే. సవర్ణీయులకు వాళ్ళు పనివారుగా జీవిస్తుంటారు. సవర్ణీయులు వాళ్ళను పశువుల్లాగా చూస్తారు. పశువులతో సమానంగా ప్రవర్తిస్తారు. వారిని రక్షించే దిక్కే లేదు. రాష్ట్రమంతటా హరిజనుడికి కూలీ ఒక అణా ఇస్తారు. గుడిలో ప్రవేశం కలిగించినా కూడా సామాజిక రుగ్మతలలో ఏం మార్పు రాలేదు. తిరువాన్‌కూరు రాష్ట్రంలో భిన్నప్రాంతాలలో కర్మాగారాల్లో పని చేసేవారు కానీ, రాష్ట్రంలో అధికారులుగా ఉన్నవారు కానీ, ఉద్యోగులు కానీ, అంతా సవర్ణీయులే. వీరంతా ఇప్పుడు బాధ్యతాయుతమైన ప్రభుత్వం కోసం గొడవ చేస్తున్నారు. కాని తిరువాన్‌కూరు రాష్ట్రంలో జరుగుతున్న ఘర్షణ కేవలం సవర్ణీయులదే. తద్వారా ప్రభుత్వంలో ఉద్యోగాలలోనూ, ఫ్యాక్టరీలలోనూ హరిజనులు లేకుండా చేయాలన్నదే వారి ధ్యేయం. ఇంకా ఎక్కువ జీతాలు కావాలని ఎక్కువ అనుకూలాలు ఉండాలని కోరుకుంటున్నారు. కాని హరిజన శ్రామికుల పట్లమాత్రం అతి తక్కువ శ్రద్ధ చూపెడుతున్నారు. వీళ్ళ సమ్మెలతో, ఘర్షణలతో తిరునాన్‌కూరు ప్రజలు పిచ్చెత్తి పోతున్నారు. ఒక హరిజన పని వాడి జీవన ప్రమాణం కన్నా కార్మికుని జీవన ప్రమాణం మూడు రెట్లు నయంగా ఉంది.

6. బతకడానికి సరైన మార్గాలు లేక తినటానికి తిండి లేక ఉపవాసాలు చేసి చేసి హరిజనుల పిల్లలు తలలు వేడెక్కి పోవటం చేతనే వాళ్ళు పాఠశాలల్లోచదువుల్లో వెనక బడి ఉంటారు. పరీక్షలలో తప్పుతారు. ఈ ప్రకటనకు ముందు ఆరు సంవత్సరాల దాకా ఉన్నత పాఠశాలల్లో 'కన్సెషన్' ఉండేది. ఇప్పుడుదాన్ని మూడేళ్ళకు తగ్గించారు. అందుకే చాలా మంది విద్యార్థులు ఒక సారి ఫేలయి పోగానే చదువు మానేస్తున్నారు.

7. దళిత వర్గాలకు ప్రభుత్వం ఒక శాఖ కేటాయించింది. దానికి సంరక్షకుడుగా -అంటే వెనుకబడిన జాతుల సంరక్షకుడుగా - . సి. డి. దామోదరం ఉంటున్నారు. ప్రతి సంవత్సరం ఈ శాఖ కోసం ఎంతో పెద్ద మొత్తం జారీ అవుతున్నా సంవత్సరాంతంలో 2/3 వ వంతు ధనం ఆయనకున్న అత్యధిక న్యాయ బుద్ధి చేత నిరుపయోగంగా త్రిప్పి పంపబడుతోంది. ఆ ధనాన్ని ఖర్చు పెట్టె మార్గమే కనిపించటం లేదని ఆయన ప్రభుత్వానికి నివేదికలు పంపేవాడు. దళితవర్గాల కోసం కేటాయించిన డబ్బుల్లో 95 శాతం సిబ్బంది జీతాలకే సరి పోతుంది. వారందరూ సవర్ణీయులే. తక్కిన 5 శాతం మాత్రమే దళిత వర్గాలకు చెందుతోంది. ప్రభుత్వం వారు తిరునాన్కూరు రాష్ట్రంలో మూడు ప్రాంతాలలో కాలనీలు నిర్మించాలను కొంటున్నారు. వీటికి అధికారులందరూ సవర్ణీయులే. నా దృష్టిలో ఈ పథకం విజయవంతం కాదు. ఎంచేతనంటే ఈ విషయంలో ప్రభుత్వానికి శ్రద్ధలేదు. హరిజనుల

కోసం తిరువాన్కూరు రాష్ట్రం ఒక అణా ఖర్చు పెడుతుండగా కొచ్చిన్ రాష్ట్రం ఒకే రూపాయి ఖర్చు పడుతోంది. ఇది చాలా విచారకరమైన సంగతి.

8. తిరువాన్‌కూరు రాష్ట్రంలోని అధిక సంఖ్యాకులు 'ది స్టేట్ కాంగ్రెస్' అనే సంస్థ క్రింద బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఒకటి కావాలని గట్టిగా పోరాడుతున్నారు. రాష్ట్రంలోని నాలుగు ప్రధాన జాతులైన నాయర్, ముస్లిం, క్రిష్టియన్, ఎజవ అన్న జాతుల వాళ్ళు ఈ ప్రసిద్ధ సంస్థకు నాయకులుగా ఉంటున్నారు. థాను పిళ్ళై ఈ సంస్థకు అధ్యక్షులు. ఆయన ఒక ప్రకటనలో దళితవర్గాలకు ప్రత్యేక రాయితీలుంటాయని ప్రకటించారు. దళిత వర్గాల నాయకులందరూ 'స్టేట్ కాంగ్రెస్' ధోరణి ఎలా ఉండ బోతుందో అని ఎదురుచూస్తున్నారు. ప్రస్తుతం అర్థమవుతున్న విషయమేమిటంటే ఈ నాయకులు చేసే ప్రకటనల్లో సత్యం లేదని-

9. నాయకులు దళితవర్గాల విషయంగా నిర్లక్ష్యం చూపారన్నది స్పష్టంగా నాకు తెలుస్తోంది. 'స్టేట్ కాంగ్రెస్' జాతీయ సూత్రాలకు ఆధారంగా ప్రారంభించబడి కడకు ఈనాడు కుల సంస్థగా మారి పోయింది. ఉపన్యాసాలలో కాని ప్రకటనల్లో కాని, వ్యాసాలలో కాని ఈ నాయకులు పై నాలుగు కులాలను ప్రస్తావిస్తారు తప్ప మా జాతిని గురించిన ఆలోచన కూడా వీరికి రాదు. తిరున్కూరులోని నాయకులు ఇలాగే ఉంటే బాధ్యతాయుతమైన ప్రభుత్వం వచ్చాక దళితుల పరిస్థితి ఇంకా దయనీయంగా ఉండబోతుంది. ఎందుకంటే ప్రభుత్వమంతా పై నాలుగు కులాల గుప్పెట్లో ఉండడం చేత దళితవర్గాల హక్కుల్నీ అవకాశాల్నీ వాళ్ళు పూర్తిగా మింగేస్తారు. 'స్టేట్ కాంగ్రెస్' కార్యవర్గం సభల్లో 2/3వ వంతుల కాలం 'అలెప్పీ'లోని కొబ్బెర పీచు కర్మాగారంలోని కార్మికులు చేసిన సమ్మె మీదనే జరిగిపోయింది. అంతే కాని అనేక సమస్యలు ఎదుర్కొంటున్న హరిజన కార్మికుల కష్టాలను గురించి మాత్రం ఆ సభలో ప్రస్తావించిన వారెవరూ లేరు. దీనికి కారణం ఏమిటంటే ఫ్యాక్టరీలోని కార్మికులందరూ సవర్ణీయులు కావటమే. ఇక బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలని కోరుకోవటం ఒక విధంగా హరిజన వ్యతిరేకోద్యమమే. స్టేట్ కాంగ్రెస్‌లోని ప్రతి నాయకుడూ సవర్ణీయుల పరిస్థితుల్ని బాగు చేయాలన్న ఉద్దేశం ఉన్నవాడే. ఈ ప్రధాన కులాల వారందరిలోనూ ఏదో ఒక కొంత స్వార్థదృష్టి ఉంది. దళితవర్గాలను తమ అభివృద్ధి కోసం బలి పెట్టడానికి కూడా వాళ్ళు సిద్ధ పడతారు.

10. ఈ రాష్ట్రంలో దళిత వర్గాల స్థితిగతులు ఇలా ఉన్నాయి. మా హక్కుల్ని సంపాదించుకోవటానికి, సుస్థిరం చేసుకోవటానికి ఏ పద్ధతులను అవలంభించమంటారో ఈ సందర్భంలో దయతో మీ సలహాను అందించాలని వినయంగా కోరుతున్నాను. మీ బదులు కోసం ఎదురు చూస్తున్నాను.

ఇబ్బంది కల్గిస్తున్నందుకు క్షమించండి.

మీ విశ్వసనీయుడు,
శ్రీ నారాయణ స్వామి

ఆలయ ప్రవేశ పథకం ప్రయోజనం చివరకు అస్పృశ్యుల చట్టబద్ధమైన హక్కుల్ని హరించటమే అయితే ఈ ఉద్యమం ఆధ్యాత్మికమైన నేపథ్యం కల్గిందికాదు సరి కదా! మీదు మిక్కిలి చాలా దుర్మార్గమయింది కూడా. నిజాయితీ పరులందరూ అస్పృశ్యులను ఈ విషయం పట్ల జాగ్రత్తగా ఉండమని ప్రబోధించటం విధిగా భావించాలి.

# అనుబంధం VI

# అస్పృశ్యుల్ని ప్రత్యేకంగా గుర్తించటం

*భారత రాజ్యాంగంలో అస్పృశ్యుల చింతను గురించి బ్రిటిష్ ప్రభుత్వంవారి తీర్మానాలు.*

## ఉపోద్ఘాతం

గాంధీ గారి ప్రశ్నకు సమాధానంగా లార్డ్ వేవెల్ 1944 ఆగష్టు 15వ తేదీ ఒక సమాధానమిస్తూ భారతీయ జాతీయ జీవనంలో అస్పృశ్యులు ప్రత్యేకమైన వర్గమని అంచేత నూతన రాజ్యాంగానికి వారి సమ్మతి అవసరమని, భారతీయుల చేతుల్లోకి అధికారం మార్చటానికి ముందే జరగాలని అన్నారు. దీనిపై పత్రికల్లో తీవ్రమైన విమర్శ వచ్చింది. అప్పుడు వైస్రాయిలు, ఎస్టేట్ కార్యదర్శులు కొన్ని తీర్మానాలు ప్రతి పాదించారు. ఈ నేపథ్యంలో వాటిని ఇప్పుడు చూద్దాం. లార్డ్‌క్రిప్స్ చేసిన ప్రతి పాదనల్లో షెడ్యూల్డ్ కులాలను ఒక ప్రత్యేక వర్గంగా పేర్కొక పోవడం, వారి సమ్మతి అవసరమని ప్రకటించక పోవడం ఈ విమర్శకంతా మూలం. కాని మనం జాగ్రత్తగా గుర్తించాల్సింది ఏమంటే క్రిప్స్ చేసిన ప్రతిపాదనలు జాతి పరంగా మత పరంగా అల్ప సంఖ్యాకులుగా ఉన్నవారి విషయమే తప్ప, షెడ్యూల్డ్ కులాల వాళ్ళు, అటు జాతి పరంగా కాని, మత పరంగా కాని, అల్ప సంఖ్యాకులు కారని విమర్శిస్తున్నారు.

ఈ విమర్శ ఎంత అజ్ఞానంతో కూడి ఉందో చూడండి! నిజంగా షెడ్యూల్డ్ కులాలు మతపరంగా అల్పసంఖ్యాకులు. అస్పృశ్యత అనే మూఢ నమ్మకం చేత హిందూ మతం షెడ్యూల్డ్ కులాలను ప్రధాన హిందూ వ్యవస్థ నుంచి వేరు చేశారు. ఈ వేర్పాటు హిందూ ముస్లింలకు, సిక్కులకు, హిందూ క్రిస్టియన్లకు నడుమ ఉన్న దూరం కన్నా చాలా వాస్తవికమైంది. చాలా విశాలమైంది కూడా. జనులను వేరు చేయటానికి ఏకాంతంలో ఉంచటానికి ఇంతకన్నా మంచి పద్ధతి ఎక్కడా ఉండదు. షెడ్యుల్డ్ కులాల రాజకీయ హక్కులను నిరాకరించే అసూయాబుద్ధిచే ప్రేరేపింపబడిన వాళ్ళే ఇలాంటి మిష చూపెడతారు. ఇది ఒక ఇంద్ర జాలం. లేనిదాన్ని ఉన్నదానిగా భ్రమింప చెయ్యటం. లార్డ్ లేవెల్ ప్రకటనను అదేదో సంప్రదాయ భంగకరమైన కొత్త ఆలోచనగా అనుకున్న వారు ఘనత వహించిన బ్రిటిష్ ప్రభుత్వం వారు రాజ్యాధికారాన్ని భారతీయుల చేతుల్లోకి పెట్టాలన్న ఆలోచన పుట్టినప్పటి నుంచి షెడ్యూల్డ్ కులాల విషయంగా ఏ ధోరణి కల్గిఉన్నారో అది సంపూర్ణంగా మర్చి పోతున్నారు. 1917లో మాంటేగు ఛేమ్సు ఫర్డు నివేదికలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఏర్పాటు చేయాలని ప్రతిపాదించినప్పటి నుంచి బ్రిటిష్ ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాల వారి స్థితి రాజ్యాంగ సూత్రాల ద్వారా భద్రమైనదని నమ్మకం. పుట్టిన తర్వాతనే భారతీయ హస్తాలలోకి అధికారాన్ని ఏర్పాటు చేయాలని గట్టి నిర్ణయంతో ఉంది. 1917నుండి 41వరకు స్టేట్ కార్యదర్శులు, వైస్రాయిలు చేసిన చాలా ప్రకటనల్లో కొన్నిటిని తరువాతి పుటల్లో ప్రదర్శిస్తాం. దీన్ని బట్టి షెడ్యూల్డ్ కులాలను భారతీయ జాతీయ జీవనంలో ప్రత్యేక వర్గంగా

పరిగణించటం కాని, నూతనరాజ్యాంగంలో వారి సమ్మతి అవసరమని కాని చెప్పటం కొత్త ప్రతిపాదనలు కావని తెలుస్తున్నది. క్రిప్స్ ప్రతిపాదనలు అమల్లోకి రాక ముందే స్టేట్ కార్యదర్శి, వైస్రాయి - అనగా బాధ్యత కల్గిన ప్రభుత్వ ప్రతినిధులే ఈ రెండు ప్రకటనలు చేశారు. ముఖ్యంగా ఆగష్టు 14న అమెరీ చేసిన ప్రకటన, అదే సంవత్సరం జనవరి 10 తేదీ లార్డ్ లిన్‌లిత్‌గో చేసిన ప్రకటన ముఖ్యంగా గమనించ దగ్గవి. ఈ ప్రకటనలు చదివితే షెడ్యూల్డ్ కులాల వారు రాజకీయ హక్కుల కోసం చేస్తున్న క్లెయిముల్ని వ్యతిరేకించే వారు మూర్ఖంగా కార్పణ్య బుద్ధితో ఇలా చేస్తున్నారని స్పష్టమౌతుంది.

(1)

*మాంటేగు ఛేమ్స్‌ఫర్డ్‌లు భారత రాజ్యాంగ సంస్కరణ మీద సమర్పించిన నివేదికలోని ఒక భాగం - 1917.*

(155) ..... రైతుకు రాజకీయ శిక్షణ ఇవ్వటం తొందరగా జరిగేపని కాదు. అది చాలా క్లిష్టమైన ప్రక్రియ. అది పూర్తి అయ్యే దాకా అతనికి కన్నా బలవంతులు, బుద్ధిమంతులు, తనను ఎలా అణచి వేస్తున్నారో తెలియ చెప్పాలి. అతడు తన బాగోగులను తానే చూసుకోలగలడన్న నమ్మకం కాని, చట్ట సభలు అతని పట్ల శ్రద్ధ చూపగలవని కాని స్పష్టంగా తెలిసే వరకు అధికారాన్ని మనమే ఉంచుకొని అతన్ని రక్షించాలి. దళితవర్గాల విషయమూ అంతే. వారు ప్రాతినిధ్యం వహించటానికి కావలసిన అత్యుత్తమమైన ఏర్పాట్లను చేయటంలో ఉద్దేశం వారు ఆత్మరక్షణా పాఠాన్ని చక్కగా నేర్చుకో గలుగుతారనటమే తప్ప. వారి ఆశయాలు విఫలమౌతున్నాయని కాని, సాధారణ ప్రగతిలో వారికి భాగస్వామ్యం లేదని కాని తెలిసినపుడు వారికి సహాయం చేసే అవకాశాల్ని మన చేతుల్లోనే ఉంచుకొని తీరాలి.

* * *

(2)

*సౌత్‌బరో కమిటీ వోటు హక్కు మీద పంపిన నివేదికపై భారత ప్రభుత్వం 1919 ఏప్రిల్ 23న పంపిన 5వ డిస్పాచ్ నుంచి కొంతభాగం*

13 . కమిటీ అభిప్రాయం ప్రకారం నాన్ అఫిషియల్ నామినేషన్ పద్ధతిలో చూపదగ్గవని సూచించిన అంశాలను మేము విశ్లేషించాం. (చూ. పట్టిక)

మొత్తం మీద ఈ ప్రతిపాదనలను అంగీకరిస్తున్నాం. కాని ఒక కులం విషయంలో కమిటీ చూపించిన దాని కన్నా ఎక్కువ శ్రద్ధ చూపించాల్సిన అవసరం ఉంది. భారత రాజ్యాంగ సంస్కరణల నివేదిక దళితవర్గాల సమస్యల్ని గుర్తించి వాటిని మన్నన చేస్తానని ప్రతిజ్ఞ చేసింది.: " వారి ప్రాతినిధ్యం కోసం మేము ఎలాంటి ఉత్తమ వ్యవస్థ ఏర్పాటు చేయాలో అది చేయాలని మా సంకల్పం ". కమిటీ నివేదికలో 'హిందువులు ఇతరులు' అనే అంశం క్రింద చెప్పిన కులాలను భిన్ననామాలతో నిర్వచించినా వారందరూ కలిసి ఒక

| ప్రావిన్స్ పేరు | దళిత వర్గాలు | ఆంగ్లో ఇండియన్లు | ఇండియన్ క్రిస్టియన్లు | శ్రామికులు | వదలబడిన చోట్లు | మిలిటరీ వారి కోసం | ప్లాంటింగ్ మైనింగ్ తప్ప ఇతర పరిశ్రమలకు | ఆదివాసులు | డొమిసైల్డ్ బెంగాలీలు | ఇతరులు | మొత్తం | సభ్యత్వ శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| మద్రాసు | 2 | - | - | - | 2 | - | - | - | - | 2 | 6 | 5 |
| బొంబాయి | - | 1 | 1 | 1 | - | - | - | - | - | 2 | 6 | 5 |
| బెంగాలు | 1 | - | 1 | 1 | - | - | - | - | - | 22 | 5 | 4 |
| సంయుక్త పరగణాలు | 1 | 1 | 1 | - | - | - | - | - | - | 2 | 5 | 4 |
| పంజాబు | - | 2* | 1 | - | - | 1 | - | - | - | 2 | 6 | 7 |
| బీహారు ఒరిస్సా | 1 | 1 | 1 | 1 | - | - | 1 | 1 | 1 | 2 | 9 | 9 |
| మధ్య పరగణాలు | 1 | 1* | - | - | 2 | - | - | - | - | 1 | 5 | 7 |
| అస్సాము | - | 1* | 1 | 1 | 1 | - | - | - | - | 1 | 5 | 9 |
| మొత్తం | 7 | 7 | 6 | 4 | 5 | 1 | 1 | 1 | 1 | 14 | 47 | |

* ఆంగ్లో ఇండియన్లు మరియు యూరోపియన్లు

| | జనాభా మొత్తం మిలియన్లలో | దళితవర్గాల మొత్తం జనాభా మిలియన్లలో | సీట్ల మొత్తం | దళితవర్గాలకు కేటాయించిన సీట్లు |
|---|---|---|---|---|
| మద్రాసు | 39.8 | 6.3 | 120 | 2 |
| బొంబాయి | 19.5 | .6 | 113 | 1 |
| బెంగాలు | 45.0 | 9.9 | 127 | 1 |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 47.0 | 10.1 | 120 | 1 |
| పంజాబు | 19.5 | 1.7 | 85 | - |
| బీహార్ ఊ ఒరిస్సా | 32.4 | 9.3 | 100 | 1 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 12.2 | 3.7 | 72 | 1 |
| అస్సాం | 6.0 | 0.3 | 54 | - |
| మొత్తం | 221.4 | 41.9 | 791 | 7 |

వర్గం మనుష్యులు అవుతున్నారు. వారిని బాహ్యులుగా ఉంచటంలోని తీవ్రతలోని తేడాలే తప్ప వీళ్ళందరూ మద్రాస్ ప్రెసిడెన్సీలోని పంచముల్లాగా ఆలయ ప్రవేశ భాగ్యం ఉన్న వారి కంటే భిన్నులైన వారే. మొత్తం జనాభాలో 1/5 వంతు ఉన్న వీరిని మార్లే మింటో కౌన్సిళ్ళలో ప్రతినిధులుగా గుర్తించ లేదు. కమిటీ నివేదికలో దళితవర్గాల ప్రసక్తి రెండు చోట్ల ఉంది. సంతృప్తి కరమైన నియోజక వర్గాలు లేనపుడు వారిని నామినేషన్ ద్వారా ఎన్నుకొన్నామని వివరించటమే దాని ప్రయోజనం. ఈ ప్రజల స్థితిగతుల్ని గురించి కాని, తమను తాము రక్షించుకోగల సామర్థ్యాన్ని గురించి కాని చర్చించదు. ఇంతే కాకుండా నామినేషన్ ప్రకారం వారికి ఏ పరిణామంలో ప్రాతినిధ్యం ఉండాలన్న విషయం కూడా వివరించదు.

రిపోర్టులోని 24వ పేరా నామినేట్ చేసే సీట్ల సంఖ్యపై ఉన్న నియంత్రణకు సామంజస్యం చూపిస్తుంది. కాని ఈ పరిమితి దళిత వర్గాలకు సంబంధించిందా కాదా అనే విషయం స్పష్టంగా అర్థం కావటం లేదు. ఈ కులానికి వాళ్ళు సూచించే ప్రాతినిధ్య విధానం పుట 301 లోని రెండవ పట్టిక ప్రకారంగా ఉంటుంది

ఈ సంఖ్యల్ని చూస్తేనే అర్థం అయిపోతుంది. దీనికి వివరణ అక్కర లేదు. బ్రిటిష్ ఇండియాలోని 1/5 వ వంతు జనసంఖ్యకు 8000 వేల సీట్లు మాత్రం సూచించబడ్డాయి. అన్ని కౌన్సిళ్ళలోనూ కలిపి అధికార వర్గంలో 1/6 వ వంతు దళితవర్గాల సమస్యల్ని గురించి పట్టించుకోవచ్చుని చెప్పవచ్చు. కానీ ఈ సంస్కరణ నివేదికలో ఈ విధమైన ఏర్పాటు పట్ల దృష్టి ఉన్నట్టు కాని నాకనిపించటం లేదు. దళిత వర్గీయులు ఆత్మరక్షణా పాఠాలు నేర్చుకోవాలని ఈ నివేదికలంటున్నాయి. 60, 70మంది సవర్ణ హిందువులున్న సభలో దళితకులానికి చెందిన ఒకణ్ణి చేర్చుకొని ఈ ఫలితాన్ని ఆశించడం కేవలం ఊహే అవుతుంది. 151, 152, 154, 155 పేరాలలో చెప్పిన సూత్రాలను సార్థకం చేసుకోవాలంటే సంఘ బహిష్కృతులను చాలా ఉదార స్వభావంతో మనం మన్నన చెయ్యటం నేర్చుకోవాలి. ప్రతి కౌన్సిల్లోనూ దళిత వర్గాలకు చెందినసభ్యులు సముచిత సంఖ్యలో ఉండాలి. ఇలా చేస్తే వాళ్ళలో సామూహిక క్రియాచైతన్యం ఏర్పడటానికి అవకాశం ఉందని మేం భావిస్తున్నాం. మద్రాసు రాష్ట్రంలో 6, సంయుక్త పరగణాలు, బీహారు, ఒరిస్సాల్లో 4, మధ్య పరగణాలు, బొంబాయిలో 2, ఇతరత్రా 1- సీట్లను కేటాయించాలని మేం సూచిస్తున్నాం. ఈ అంశాలలో కమిటీ రిపోర్టును సవరించాల్సిన అవసరం ఉందని మేం అభిప్రాయపడుతున్నాం.

* * *

## (3)

*ఇండియా స్టేట్ సెక్రటరీ అయిన లార్డ్ బిర్కెన్ హెడ్, స్టాట్యూటరీ కమీషన్ ఏర్పాటయినప్పుడు హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో 1927 మార్చి 30న చేసిన ప్రసంగం నుంచి ఒక భాగం.*

...ఉదాహరణకు దళిత కులాల విషయం ప్రస్తావిస్తాను. భారత దేశంలో అత్యధికమైన జన సంఖ్య గల వారు వీరే - అంటే దాదాపు 60 మిలియన్ల మంది దళిత కులాలకు చెందిన వారున్నారు. మనం చూస్తున్న ఇతర జాతుల సంఖ్యకన్నా ఇది అధికమే. వారి స్థితి మరీ అంత భయంకరంగానూ, బాధాకరంగానూ లేకపోయినా వారి జీవితంలో ఇంకా కొంత భయంకర బాధాకర లక్షణాలు ఉన్నాయి. వాళ్ళకు సామాజికంగా ఎవరితోనూ ఏ సంపర్కమూ ఉండదు. వీళ్ళను తక్కువగా చూసే వ్యక్తిపై దళితుల నీడ పడితే ఆ దినం వారికి దుర్దినమే (సూర్యుడు ఉండి లేనట్టే). అందరూ చేదుకునే బావి వద్ద వాళ్ళు నీళ్ళు తాగటానికి వీలులేదు. ఎన్నో మైళ్ళు పడి లేచి నడచి తమ దప్పికను తీర్చుకోవాల్సిందే. ఇంతకన్నా విషాదకరమైన విషయమేమిటంటే తరతరాల నుంచి వారికి 'అస్పృశ్యులు' అని పేరుండటం. ఆ పేరుతోనే వీరందరికీ పరిచయం. ఇండియాలో వీళ్ళు 60 మిలియన్లు (6 కోట్లు) ఉన్నారు. ఈ కమీషన్‌లో ఆ కులానికి చెందినఒక సభ్యుణ్ణి తీసుకుంటే ఎలా ఉంటుంది? తీసుకోనా! నేనే కాదు ప్రజాస్వామ్యదేశంలో ఎవడు కూడా ఎవరెంత బలవంత పెట్టినా ఈ జాతికి చెందిన సభ్యుడులేకుండా కమీషన్‌ని ఏర్పాటు చేయటం జరగదు. అప్పుడే ఆ కమీషన్‌లో 'మిక్సెడ్ జ్యూరీ' ఉంటుంది. అందుచేత ఈ అంశం అన్నిటి కన్నా ప్రధానం.

* * *

**(4)**

*సైమన్ కమీషన్ నివేదిక సంపుటి 2 నుండి కొన్ని భాగాలు*

* * *

78....... ఇక ఏ ఇతర ప్రాంతంలోనూ దళిత కులాలకు చెందిన ఓటు హక్కుఉన్న జనాల సంఖ్యను సేకరించటం సాధ్యం కాలేదు. వోటు హక్కు వయస్సును బాగా తగ్గిస్తే కూడా దళిత కులాల వోటర్ల సంఖ్య పెరుగుతుందేమో కాని సాధారణ నియోజకవర్గాలలో వాళ్ళకు ఏ ప్రత్యేకమైన అవకాశాలను కల్గించక పోతే వాళ్ళు తమ ప్రతినిధుల్ని గెలిపించుకునే అవకాశం ఉంటుందన్న నమ్మకం కుదరటం లేదు. కాలం గడవగా దళిత జాతుల అభివృద్ధి రాజకీయ పరిస్థితులచేత ఏర్పడే అవకాశం మీదనే ఆధారపడి ఉన్నంత వరకు ఇతర రంగాలలో వీళ్ళు తగినంత ప్రాధాన్యాన్ని పొంది వీళ్ళ సహకారం ఇతరులకు అవసరమై వీళ్ళ అవసరాన్ని వాళ్ళు తీర్చే అవకాశాన్ని బట్టి ఉంటుంది.

80 ...... అందుచేత మేము వారి పూర్తి జన సంఖ్య నిష్పత్తి మీద ఆధారపడి సీట్లను కేటాయించడాన్ని మేము సిఫారస్ చేయటం లేదు. మేము సూచించిన సూచిక ప్రకారం రిజర్వేషన్ ప్రకారం ప్రాతినిధ్యం ఇస్తే దళిత కులాలకు చెందిన ఎం. ఎల్. సి.ల సంఖ్య బాగా పెరుగుతుంది. వాళ్ళకున్న పేదరికానికి తోడు విద్యలేకపోవడం వల్ల తగిన శక్తి సామర్థ్యాలున్న సభ్యులు సముచిత సంఖ్యలో ఒక్కసారిగా ప్రతినిధులుగా ఎన్నికౌతున్నారన్నది సందేహమే. దీనికంటే మంచిపద్ధతి ఏమిటంటే విద్యావంతులైన

ప్రతినిధులు కొద్ది మందైనా చాలు–వాళ్ళు తమ కుల సమస్యల్ని శక్తి వంతంగా నివేదించ గలుగుతారు. ఏ ప్రభావమూ చూపలేని సభ్యులు చాలా మంది ఉన్నా వాళ్ళు ఉన్నత కులాల వాళ్ళకు బానిసలుగా ప్రవర్తించే అవకాశమే ఎక్కువగా ఉంది. వివిధ రకాల ప్రతినిధులకు సీట్లను కేటాయించే విషయంగా జరుగుతున్న ఇప్పటి పంపకాల పద్ధతి కూడా శాశ్వతమైందేం కాదు. దాన్ని మార్చే అవకాశం కూడా ఉండాలి. ఇప్పుడు మేంచేస్తున్న ప్రతిపాదన ప్రస్తుతానికి సరిపోతుంది. ఎందుకంటె అభిప్రాయాల ప్రాతినిధ్యం కోసం సీట్లను రిజర్వు చేసే ఈ పద్ధతి వల్ల ఇలా రిజర్వ్ చేయని ఇతర సీట్లు సంపాదించే అవకాశం కూడా ఉంది కాబట్టి ప్రాతినిధ్యం పెరుగుతుంది.

* * *

## (5)

*సైమన్ కమీషను సూచించిన పద్ధతిలో రాజ్యాంగ సంస్కరణల కోసం ప్రభుత్వం పంపిన డిస్పాచ్ నుండి ఒక భాగం*

35. దళిత వర్గాల ప్రాతినిధ్యం – కమిషన్ దళిత వర్గాల ప్రాతినిధ్యం కోసం చేసిన సూచనలు ప్రాంతీయ ప్రభుత్వాల చేత చాలా విమర్శింపబడ్డాయి. దళితవర్గాలు అంటే ఏమిటో ప్రతి ప్రాంతానికి చెందిన ఒక నిర్వచనాన్ని చేపట్టటంలో ఉన్న ఇబ్బంది చేతనే ఏ పథకం ద్వారా వీరి ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని సూచింపదలచినా ఒక నామినేషన్ పద్ధతి ద్వారా తప్ప మరో పద్ధతి ద్వారా సాధ్యం కాక పోతుంది. కాని కమీషన్ ప్రతిపాదనలు కారణంగా దళిత వర్గాల తరఫున ఎన్నికల్లో నిలబడే అభ్యర్థుల్ని ధ్రువీకరించే ఒక ఇబ్బంది కరమైన బాధ్యత గవర్నర్ మీద పడుతోంది. కమీషన్ సూచించే ప్రాతినిధ్య నిష్పత్తి అంటే జనసంఖ్యలో 3/4 వంతు (మొత్తం జనసంఖ్య 4లో 3వంతులు దళిత వర్గీయులుండాలన్నమాట) అనటం కూడా ఎక్కువ మోతాదనిపిస్తుంది. సంయుక్త పరగణాల ప్రభుత్వం లెక్క వేసిన దాన్ని బట్టి కమీషన్ చెప్పినప్రకారం చేస్తే ఇప్పుడు నామినేట్ చేయబడుతున్న ఒక వ్యక్తి స్థానంలో 40మందికి తక్కువ లేకుండా శాసన సభకు వస్తారు. వోటు హక్కును నిర్ణయించే సంఘం (ప్రాంచైజ్ కమిటీ) జాగ్రత్తగా ఈ సమస్యను గురించి విచారించటం మంచిది. ఈ దశలో మా కోరిక ఏమిటంటే దళితవర్గాల ప్రాతినిధ్యం సముచితమైన పద్ధతిలో ఆచరణ యోగ్యంగా ఉండాలన్నదే. ఈ కులంలోనే అభిప్రాయభేదాలు, కొన్ని ఉన్నా ఇటీవల సమావేశంలో దళితవర్గీయులందరూ కలిసి తమకు ప్రత్యేక నియోజక వర్గాలలో నమ్మకముందని మరలా స్పష్టం చేశారు.

* * *

## (6)

*లాథియన్ కమిటీ వోటు హక్కు కు సంబంధించి ఏర్పరచిన మార్గ దర్శక సూత్రాలనుండి ఒక భాగం:*

3. ఇండియాలో భిన్న ప్రాంతాలలో ఉన్న జన సంఖ్యలో కేవలం 3 శాతం మాత్రమే వోటు హక్కు కలిగి ఉన్నారు. వీరు ఎన్నుకోగా ప్రాంతీయ చట్టసభలకు ప్రతినిధులు వెళ్తున్నారు. ఇలా అతి నియత మైన వోటు హక్కు ఉండటం వల్ల సమాజంలోని అతి ముఖ్యమైన పెద్ద తెగలకు కూడా చట్టసభల్లో ప్రతినిధులు లేరు. బాధ్యతాయుతమైన ఫెడరల్ ప్రభుత్వాన్ని కొన్ని పరిమితులలో భద్రతలతో ఏర్పాటు చేయటానికి బ్రిటిష్ ప్రభుత్వం సూత్రాత్మకంగా అంగీకరించింది. భిన్న గవర్నర్లు పరిపాలించే ప్రాంతాలు బాధ్యతాయుతమైన పరిపాలనా భాగాలుగా ఉంటాయి. వాటికి అత్యధిక స్వాతంత్ర్యం ఉంటుంది. వారి వారి చట్టాలను వారి పరిమితుల్లో అమలు చేసుకోవటానికి బయటి నుంచీ ఎవరి జోక్యమూ ఉండదు. ఎవరూ ఇలా చేయాలని విధించే వారుండరు. ఈ పరిస్థితులలో శాసన సభల్లో నియోజక వర్గాల పరిధిని విస్తరింప చేయాల్సిన అవసరం ఉంది. ప్రజలకు వారే బాధ్యత వహిస్తారు. కాబట్టి ప్రజా ప్రతినిధులు ప్రజలలోని జన సామాన్యానికి ప్రాతినిధ్యం వహించాలి. సమాజంలో ఏ ముఖ్యమైన కులానికి గాని, తెగకు గాని ప్రాతినిధ్యం లేకుండా పోకూడదు. తమ అవసరాలను, అభిప్రాయాలను ప్రకటించే అవకాశం అందరికీ ఉండాలి.

6. సదస్సులో అనేక సందర్భాలలో జరిగిన చర్చల్ని బట్టి నూతన రాజ్యాంగం దళిత వర్గీయుల సముచిత ప్రాతినిధ్యం కోసం తగిన అవకాశాన్ని చూపించాలి. నామినేషన్ ద్వారా ప్రతినిధిని నియమిస్తూ పోవడం ఇక సముచితమైన పద్ధతికాదు. మీ అందరికీ తెలిసినట్టే దళితవర్గీయులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఉండాలా వద్దా అన్న విషయంగా అభిప్రాయభేదముంది. మీ కమిటీ ఈ విషయాన్ని గురించి విచారించి సాధారణ నియోజక వర్గాల వోటు హక్కు పరిధిని ఏ విధంగా పెంచితే దళితులకు కూడా వోటు హక్కు సిద్ధిస్తుందో సూచించండి. దాన్ని ఆధారంగా ఈ సమస్యను పరిష్కరిస్తాము. అంతే కాకుండా క్రమంగా దళితులు అధిక సంఖ్యల్లో, విలక్షణమైన వర్గంగా నివసిస్తున్న ప్రాంతాల్లోకానీ, సాధారణంగా కానీ, వారి కోసం ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉందా లేదా స్పష్టం చేయండి. అంతేగాదు వోటు హక్కుపరిధిని విస్తరించే పద్ధతి పై విషయాలు సేకరించి తద్వారా దళితులకు ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటు చేసే అవకాశాలను గురించి కూడా విచారించి ఈ సమస్యను పరిష్కరించండి.

* * *

## (7)

*హిజ్ ఎక్సెలెన్సీ లార్డ్ లిన్‌లిత్‌గో (వైస్రాయి, మరియు భారత గవర్నర్ జనరల్) 1939 అక్టోబరు 17న చేసిన ప్రకటనలో ఒక భాగం.*

"అదలా ఉంచండి. బ్రిటిష్ ప్రభుత్వం వారు భవిష్యత్తులో ఫెడరల్ గవర్నమెంట్‌ని ఇంతకు ముందు నేను ప్రస్తావించిన సెక్రటరీ అప్పటి సందర్భాలను బట్టి 1935నాటి చట్టంలోని ప్లాన్ వివరాలు సముచితంగా ఉంటాయా లేదా అనే విషయాన్ని పునర్విచారణ

చేయాల్సి ఉంటుంది. బ్రిటిష్ ప్రభుత్వం వారి నియామకం మేరకు నేను అధికారికంగా చెప్పదగిన విషయమేమిటంటే యుద్ధం ముగిసిన తర్వాత భారత దేశంలోని భిన్న కులాల ప్రతినిధులను, రాజకీయ పక్షాలను, భిన్న ప్రాంతాలలోను, ప్రభువులతోనూ సంప్రదించి వారి సహాయ సహకారాలతో ఏమి సవరణలు మార్పులు అవసరమౌతాయో వాటిని చేసి పథకం సిద్ధం చేయాలని అభిలషిస్తోంది.

* * *

## (8)

*భారతదేశపు సెక్రటరీ ఆఫ్ స్టేట్ అయిన లార్డ్ జెట్‌లాండ్ 1939 నవంబరు 7న హౌజ్ ఆఫ్ లార్డ్స్‌లో చేసిన ప్రకటన నుండి ఒక భాగం.*

దేశంలో అల్ప సంఖ్యాక వర్గాలైన అనేక జాతులు, మతాలు ఉన్నా కాంగ్రెస్‌వారు భారతీయులు తమకు తాము ఏర్పరచుకునే రాజ్యాంగం ద్వారానే మైనారిటీల హక్కులను, వారికి అభిమతమయ్యే పద్ధతిలో సాధించటానికి పట్టుబట్టి ఉన్నట్టు మొదటి నుంచీ ప్రకటిస్తున్నారు. ఇప్పుడు అలాగే వాదిస్తున్నారు.

బ్రిటీష్ ప్రభుత్వం వారు ఈ అభిప్రాయాన్ని అంగీకరించలేక పోతున్నారు. భారతదేశంలో బ్రిటిష్ వారికున్న శతాబ్దాల సంబంధం కారణంగా వారి భవిష్యత్ ప్రభుత్వం రూపొందించే విషయంలో ఏ బాధ్యతా లేకుండా గవర్నర్ అన్ని పార్టీల ప్రతినిధులతో కలిసి చేసిన చర్యల ఫలితంగా కాంగ్రెస్ కోరుకున్నట్టు బ్రిటిష్ ప్రభుత్వం ఉనికే లేకుండా రాజ్యాంగం తయారు చేయాలన్న వారి ప్రకటన భారతీయుల్లో అత్యధిక సంఖ్యాకులకు అంగీకార్యం కాదని కూడా నిస్సందేహంగా నిరూపితమైంది.

* * *

## (9)

*హిజ్ హైనెస్ లార్డ్ లిన్‌లిత్‌గో, వైస్రాయి మరియు గవర్నర్ జనరల్, బొంబాయిలోని ఓరియంటల్ క్లబ్‌లో 1940 జనవరి 10న చేసిన ఉపన్యాసం నుండి ఒక భాగం.*

భారతదేశ సమైక్యత దృష్ట్యా భిన్న రాష్ట్రాలను ఏదో ఒక రాజ్యాంగ ప్రణాళికలోకి చేర్చే విషయాన్ని మనం మరవ కూడదు. ఇది సమైక్యత కోసం చాలా అవసరమైన పని.

ఇక మైనారిటీలు చాలా కాలంగా పట్టుబట్టి చేస్తున్న కొన్ని క్లెయిములున్నాయి.

నేను వాటిలో రెండింటిని ప్రస్తావిస్తాను-గొప్పదైన ముస్లిం మైనారిటీ, షెడ్యూల్డ్ కులాల-మైనారిటీలకు మునుపటి కాలంలో ఇచ్చిన కొన్ని హామీలున్నాయి-వాటి స్థితిని రక్షించాలన్నది ఒక లక్ష్యం. రెండెవది ఆ హామీలను గౌరవించాలన్నది.

## (10)

*భారతీయ స్టేట్ సెక్రటరీ అయిన రైట్ ఆనరబుల్ ఎల్. ఎస్. ఎమరీ కామన్స్ సభలో 1940 ఆగస్టు 14న చేసిన ప్రసంగం నుండి ఒక భాగం.*

కాంగ్రెస్ నాయకులు . . . . . ఒక గొప్ప సంస్థను నియమించారు. ఇండియాలో చాలా ప్రతిభావంతమైన రాజకీయ యంత్రాంగంలోనిదే . . . . . కాని, ఒక అంశం ఏమిటంటే కాంగ్రెస్ వారే ప్రకటించేటట్లు, భారత దేశంలోని జాతీయ జీవనానికి సంబంధించిన అన్ని ప్రధానాంశాల్ని గురించి వారు మాట్లాడ గలిగి ఉంటే, అందులో విజయం సాధించి ఉంటే, వారి డిమాండ్లు ఎంత తీవ్రమైనవే అయినా మన పరిస్థితి ఈనాడు ఇంత క్లిష్టంగా ఉండేది కాదు. బ్రిటిష్ ఇండియాలో సంఖ్యాపరంగాచూస్తే వీరిదే అతి పెద్దదైన ఏకైక పక్షం. కాని ఈ విశేషం చేత ఇండియా పక్షాన వీరు మాట్లాడటానికి ప్రయత్నిస్తే ఇండియాలోని సంక్లిష్ట జాతీయ జీవనంలోని అతిముఖ్యమైన వర్గాలే వీరిని ఖండిస్తున్నాయి. ఈ వర్గాలు తాము సంఖ్యాపరంగా అల్ప సంఖ్యాపరులుగా పరిగణింపబడకూడదని ఏ విధమైన భావిరాజ్యాంగంలోనైనా ప్రత్యేకమైన భాగస్వామ్యం ఉన్నవిగా పరిగణింపబడాలని తమ హక్కును ధ్రువీకరిస్తున్నాయి. ఇలాంటి వర్గాలలో అతి ముఖ్యమైనది పెద్దది ముస్లిం వర్గం. భిన్న ప్రాంతాలలో జరిగే ఎన్నికల్లో మెజారిటీ ద్వారా ఏర్పడే రాజ్యాంగసభ తయారు చేసే రాజ్యాంగంలో తమకు ఎలాంటి సంబంధమూ లేదంటున్నారు. ఏ విధమైన రాజ్యాంగ చర్చల్లోనైనా సరే - సంఖ్యాపరమైన మెజారిటీతో సంబంధం లేకుండా ప్రత్యేక వర్గంగా తమను గుర్తించాలని - అది తమ హక్కని ప్రకటిస్తున్నారు. షెడ్యూల్డ్ కులాలనబడే వర్గానికి కూడా ఇదే వర్తిస్తుంది. గాంధీ నీతిని గురించి శ్రద్ధతో ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నా వారు కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహించే హిందూ వర్గానికి బాహ్యులుగానే ఉన్నామని భావిస్తున్నారు.

* * *

## (11)

*రైట్ ఆనరబుల్ ఎల్. ఎస్. ఎమరీ కామన్సు సభలో 1941 ఏప్రిల్ 23న చేసిన ప్రసంగం నుంచి ఒక భాగం.*

"రెండు ప్రధన అంశాలు బైటబడ్డాయి. ఆ రెండంశాల మీదా బ్రిటిష్ ప్రభుత్వం తమ అభిప్రాయాన్ని స్పష్టం చేయదలుస్తోంది. మొదటిది భవిష్యత్ రాజ్యాంగంలో అల్పసంఖ్యాక వర్గలకు సంబంధించింది. .... భారతదేశంలో శాంతి సంక్షేమాల దృష్ట్యా జాతీయ జీవితంలోని అతి పెద్ద ప్రభావవంతమైన వర్గాలు ప్రత్యేకంగా వ్యతిరేకించే ఏ వ్యవస్థ చేతుల్లో తమబాధ్యతల్ని నైనా అప్పజెప్పడం బ్రిటిష్ ప్రభుత్వానికి ఊహలో ఇష్టముండదని చెప్పాల్సిన పనిలేదు. అలాంటి ప్రభుత్వానిక ఇలాంటి వర్గాలు అణగి ఉండే క్లిష్ట పరిస్థితికి ప్రభుత్వం వారు బాధ్యులు కాజాలరు."

# అనుబంధం VII

# అల్పసంఖ్యాకులకు వెయిటేజ్

*మాంటేగ్ ఛేమ్స్ఫర్డ్ మరియు సైమన్ కమీషన్లు వెయిటేజ్ పంపిణీలో ఉండే అసమస్థితిని గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలు*

(1)

## మాంటీగ్ ఛేమ్స్ఫర్డ్ నివేదిక

*మాంటేగు ఛేమ్స్ఫర్డ్ నివేదికలో భారత రాజ్యాంగ సంస్కరణల విషయంగా ఉన్న భాగం*

* * *

163. మైనారిటీల ప్రాతినిధ్యం

ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాలు ఎన్నిక ద్వారా ప్రాతినిధ్యం పొందాలని ప్రతిపాదిస్తున్నారు. అంటే దీని భావం మహమ్మదీయులకే సంబంధించిన ప్రత్యేక ఎన్నికల వ్యవస్థ ఉండాలని సూచించటమన్నమాట. కాని వాళ్ళు సాధారణ నియోజక వర్గాలలో, తమ ప్రత్యేక నియోజక వర్గాలలో – రెండింటిలోనూ ఓటు వేయటం ఇక మీదట ఉండదన్న మాట. మహమ్మదీయుల కిచ్చిన ఈ రాయితీని పంజాబులోని సిక్కుల వంటి కొన్ని ఇతర జాతులకు వర్తింప చేయకుండా ఉండటంలోని క్లేశాన్ని గురించి మేము ఇంకొక చోట ప్రస్తావించాము. ఈ పథకాన్ని తయారు చేసిన వారు భిన్నప్రాంతాలలో ప్రత్యేక ముస్లిం నియోజక వర్గాల కోసం కొన్ని సీట్లను కేటాయించే విషయం అంగీకరించారు అంతే కాకుండా ఏ నిష్పత్తిలో ఆ సీట్ల పంపకం ఉండాలో కూడా ప్రతిపాదించారు. సంప్రదింపుల ద్వారా కాకుండా మరి ఏ ఇతర ప్రమాణాల మీద ఆధారపడి ఈ సీట్ల నిష్పత్తిని ప్రతిపాదిస్తున్నారో మాకు తెలీదు. మహమ్మదీయులు అత్యధికంగా ఉన్న ప్రాంతాలలో కూడా – అంటే అన్ని ప్రాంతాలలోనూ ప్రత్యేక నియోజక వర్గాలను కోరుతున్నారు. సంఖ్యాపరంగా తక్కువగా ఉన్నచోట్ల సంఖ్యాబలం కన్నా అధికంగా కాని, ఇప్పటి కంటే ఎక్కువగా కాని ప్రాతినిధ్యం కావాలంటున్నారు. అదే సమయంలో దాదాపు అన్ని ముస్లిం సంఘాలు ఈ సంఖ్యను ఇంకా పెంచాలని అర్థిస్తూ మాకు విజ్ఞప్తుల చేశాయి. ఈ విధంగా అవకాశం కలిగించే స్థితిని ఎవరైనా అభ్యంతర పెట్టడానికి అవకాశం ఉంది. ఏదైనా జాతి తరువాత ప్రత్యేక నియోజకవర్గం కావాలని అడిగితే ముస్లిం

ఇతరుల సీట్ల నుంచి తగ్గించి ఇవ్వాలా లేక ముస్లింలు, ముస్లిం ఇతరులు ఈ ఇరువర్గాల సీట్ల నుండి ఒక పద్ధతిలో తగ్గించి ఇవ్వాలా అన్న విషయంగా హిందూ ముస్లింలలో ఏకాభిప్రాయం లేదు. మేము మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని ఇవ్వడానికే అంగీకరిస్తాము. ఇలా చేయటానికి కారణాలు తర్వాత వివరిస్తాం. మహమ్మదీయులు సాధారణ ప్రత్యేక నియోజక వర్గాలలో రెండింటిలోనూ ఓటు వేసే పద్ధతి ఉండరాదని మేము కూడా అంగీకరిస్తున్నాం. ఇప్పుడున్న ఏర్పాట్ల విషయంలో సవరణలు చేయటానికి ముస్లిం లీగ్ అంగీకరించటాన్ని ఆహ్వానిస్తున్నాం.

(2)

*ఇండియన్ స్టాట్యూటరీ కమిషన్ వారి రిపోర్టు 2వ సంపుటి నుండి ఒక భాగం*

***

### మహమ్మదీయుల సీట్ల సంఖ్య

పేరా 85. భిన్న ప్రాంతాలలోని కౌన్సిళ్ళలో మహమ్మదీయుల కోసం ప్రత్యేకించాల్సిన సీట్ల నిష్పత్తి విషయం ఇప్పుడు చూద్దాం. లక్నో ఒప్పందం ప్రకారంగా ప్రతి ప్రాంతంలోనూ ముస్లింలకు సీట్ల కేటాయింపు విషయంగా హిందూ ముస్లిముల నడుమ ఒక ఒప్పందం కుదిరింది. ప్రస్తుతమున్న భిన్న శాసన సభల్లో ఆ నియమాల ప్రకారం సీట్లు కేటాయిస్తున్నారు. ఇంతకుముందు 70వ పేరాలో చెప్పినట్టు పై ఒప్పందం ఇరువర్గాలకు ఈనాడు అంగీకార్యంగా లేదు. ఇరు వర్గాలు తమ తమ వాదాలు చేస్తున్నాయి. ఈ రెండువర్గాలు కలిసి ఒక సర్దుబాటుకు రావటానికి పునః ప్రయత్నం జరుగుతున్నదని భావిస్తున్నాం. ఒప్పందం లేనప్పుడు ఆయా ప్రత్యేక నియోజక వర్గాలు వారికుంటాయన్న ఊహ మీద ఆధారపడి మరింకెవరైనా ఒక సిరయానికి రావలసి ఉంటుంది. ఈ విషయంలో మా అభిప్రాయం ఏమిటంటే, ఎనిమిది[1] పరగణాలలోనూ ఆరింటా ముస్లింలు ఉన్న స్థితి చూస్తే బలహీనులుగానూ ఉన్నారు; అల్పసంఖ్యాకులుగానూ ఉన్నారు. అందుచేత ఈ పరగణాలలో ప్రస్తుతం అనుసరిస్తున్న వెయిటేజ్ స్కేల్‌ని అలాగే ఉంచవచ్చు. సాధారణ నియోజక వర్గాలలో (యూరోపియన్ సాధారణ నియోజక వరాలల్గో తప్ప) ఇప్పటి లాగానే మహమ్మదీయులకు కేటాయించే సీట్ల నిష్పత్తిని నిర్ధారించవచ్చు. కాని ఇప్పుడున్న దాని కన్నా అధికమైన ప్రాతినిధ్య సంబంధమైన హామీ కావాలని ఒక వాదన చేస్తున్నారు. (చూ. పేరా. 70 మరియు అధ్యాయాంతంలోని అనుబంధం VII). ఈ ఆరు ప్రాంతాలలోని ముస్లింలకు ఇచ్చే ప్రాతినిధ్య విషయంలో పూర్తి భద్రత కావాలని బెంగాల్, పంజాబ్‌లలో ఈవర్గానికి కేటాయించే ప్రత్యేక నియోజకవర్గాల సీట్ల సంఖ్య వారి జన సంఖ్య నిష్పత్తికి అనుగుణంగా ఉండాలని అంటున్నారు. దీని ద్వారా మహమ్మదీయులకు బెంగాలు, పంజాబు రాష్ట్రాలలో సాధారణ నియోజకవర్గాలలో నిర్దిష్టమైన,

1. ఇక్కడ బర్మా ప్రశ్న తలెత్తదు.

మార్చడానికి వీలులేని మెజారిటీ సీట్లు లభిస్తాయి. మేమంతా దూరం పోలేము. ఈ యిరు వర్గాల మధ్య సాధారణమైన ఒప్పందం ఏదీ లేకుండా ఈ ఆరు ప్రాంతాలలో వెయిటేజీని కొనసాగిస్తూ బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో మరి అంత దూరం పోయి సీట్లు పెంచడం - ఈ రెండూ ఒకదానితో ఒకటి కుదిరే పనులు కావు.

ఇలా మహమ్మదీయులు ఈనాడు ఆరు ప్రాంతాలలోనూ అనుభవిస్తున్న వెయిటేజీతోపాటు హిందూ-సిక్కు వ్యతిరేకత ఉన్న పంజాబ్ బెంగాల్ రాష్ట్రాలలో తప్పనిసరిగా ముస్లిం మెజారిటీ ఉండాలని కోరుకోవటం ఆ సీట్లపై మళ్ళీ అపీల్ ఉండకూడదని (ఆ సంఖ్య మారకూడదని) కోరటం సమంజసంగా లేదు. అలా కాకుండా బెంగాలులో ప్రత్యేక నియోజకవర్గాలు రద్దు చేయాలని ఒప్పందం కుదిరి ప్రతి జాతి వారు ఆయా ప్రాంతంలోని ఉమ్మడి నియోజకవర్గాల ద్వారానే తమకు దక్కిన సీట్లను పొందాలని తీర్మానం జరిగినా, వాళ్ళు అల్పసంఖ్యాకులుగా ఉన్న ఆరు పరగణాలలో మాత్రం వారికి చూపిన వెయిటేజీని వారికి లేకుండా చేయ కూడదు. ఇదే విధంగా పంజాబ్‌లోని ముస్లింలు, సిక్కులు, హిందువులు ఉమ్మడి నియోజకవర్గాల ద్వారానే ఎన్నికలను ఎదుర్కోనడానికి సిద్ధపడినా అప్పుడు కూడా మహమ్మదీయులకు ఆ ఆరు పరగణాలలో మాత్రం ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా లభించే జన సంఖ్యాపరమైన సీట్ల నిష్పత్తిని కాపాడటం కోసం మనం సిద్ధంగా ఉండాలి.

ఈ చివరి సూచన ఎందుకు చేస్తున్నామంటే ఈ రెండు పద్ధతులలో ముస్లింలు ఏదో ఒకటి ఎన్నుకునే అవకాశాన్ని ఇవ్వటం కోసమే. వీలైనంత వరకు ప్రత్యేక నియోజకవర్గాల వ్యాప్తిని తగ్గించాలన్నది మా ధ్యేయం. అలాగే మరో పద్ధతినికూడా ప్రయోజనాత్మకమైన ప్రయత్నంగా చేయటం కోసమే ఇలా ఇతర పద్ధతులన్నింటిని పరిశీలిస్తున్నాం.

* * *

## అనుబంధం VIII

# క్రిప్స్ ప్రతిపాదనలు

*భారతీయ నాయకులతో చర్చల కోసం తయారు చేసిన ముసాయిదా తీర్మానం*

ఈ క్రింద ప్రస్తావించబడే తీర్మానాలు బ్రిటిష్ వార్ కాబినేట్ తయారు చేసినవి. భారతీయ నాయకులతో చర్చల కోసం సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ఈ ప్రతిపాదనలు తెచ్చారు. చర్చలు జరుగుతున్నాయి. ఈ తీర్మానాలు అమలులోకి వస్తాయా రావా అన్నది తరువాత తెలుస్తుంది.

బ్రిటిష్ ప్రభుత్వం ఈ దేశంలోనూ ఇండియాలోనూ ఇండియా భవిష్యత్తు గురించి ఇచ్చిన హామీలను పూర్తి చేసే విషయంగా బయట పడుతున్న ఆందోళనను దృష్టిలో పెట్టుకొని వీలైనంత త్వరగా భారతీయులకు స్వపరిపాలన ఇవ్వటానికి అవలంబించాల్సిన పద్ధతుల్ని గురించి కొన్ని నిర్దిష్టమైన, స్పష్టమైన నియమాలను విధించ దలచుకుంది. దీని ప్రధాన ఉద్దేశ్యం 'యునైటెడ్ కింగ్‌డమ్'కు సంబంధించిన ఒక ప్రత్యేక రాజ్యంగా ఒక కొత్త ఇండియన్ యూనియన్‌ను స్థాపించటం. ఇండియా మరి ఇంకా ఇతర రాజ్యాలు కలసి బ్రిటిష్ కిరీటానికి ఉమ్మడి మిత్రరాజ్యాలుగా వ్యవహరిస్తాయి. ఇవన్నీ సరి సమానమైన దేశాలు. ఆంతరంగిక బాహ్య వ్యవస్థలో ఏ విధమైన అప్రాధాన్యాన్ని కల్గినవి కావు.

అందుచేత ప్రభుత్వం ఈ క్రింది ప్రకటన చేస్తున్నది: (అ) ప్రస్తుతమున్న ప్రతికూల పరిస్థితులు మారిన తక్షణమే ఈ క్రింద చెప్పబడే పద్ధతిలో ఇండియాలో ఎన్నికల ద్వారా ఒక పాలనా వ్యవస్థను ఏర్పరచే పని మొదలవుతుంది. ఇండియాకు ఒక కొత్త రాజ్యాంగాన్ని నిర్మించే బాధ్యత వారిపైనే ఉంటుంది.

(ఆ) క్రింద చూపిన విధంగా భిన్న భారతీయ రాష్ట్రాలు రాజ్యాంగ నిర్మాణ యంత్రాంగంలో భాగస్వామ్యాన్ని పొందటానికి అవకాశం కల్పించ బడుతుంది.

(ఇ) ఆ విధంగా తయారైన రాజ్యాంగాన్ని కొన్ని నియామాలకు లోబడి అంగీకరించటానికి, అమలు పరచటానికి సంసిద్ధంగా ఉంది.

ఆ నియమాలు ఏవంటే :

(i) కొత్త రాజ్యాంగాన్ని బ్రిటిష్ ఇండియాలోని ఏ పరగణా అయినా అంగీకరించకపోతే ప్రస్తుత రాజ్యాంగ స్థితిలోనే ఉండే హక్కు కలిగి ఉండాలి. తరువాత ఎప్పుడైనా నూతన రాజ్యాంగంలో చేరదలిస్తే దానికీ అవకాశం కల్పించాలి.

అలాగా చేరటానికి ఇష్టంలేని పరగణాలలో బ్రిటిష్ ప్రభుత్వం ఒక కొత్త రాజ్యాంగం ఏర్పరచే విషయంగా కూడా సంసిద్ధంగా ఉంటుంది. అలాంటి వాటికి కూడా భారతీయ నూత్న రాజ్యాంగంలో సమాన స్థాయి ఉంటుంది. ఇప్పుడు చెప్పబోయే పద్ధతిలోనే వారి రాజ్యాంగమూ సంసిద్ధం చేయబడుతుంది.

(ii) రెండో నియమం - బ్రిటిష్ ప్రభుత్వానికి, రాజ్యాంగ నిర్మాణ యంత్రాంగానికి నడుమ ఒక ఒప్పందం జరగటం. బ్రిటిష్ వారి నుండి భారతీయులకు పూర్తిగా అధికారం మార్పిడి చెందటంలో ప్రసక్తమయ్యే సర్వాంశాలు ఈ ఒప్పందంలో చేర్చబడుతాయి. బ్రిటిష్ ప్రభుత్వం తరపున భిన్న కుల మతాల అల్ప సంఖ్యాకుల రక్షణ కోసమని హామీలిచ్చే విషయంగా అవకాశం కల్పించటం జరుగుతుంది. కాని ఇండియన్ యూనియన్ భవిష్యత్తులో బ్రిటిష్ కామన్‌వెల్త్‌కు సంబంధించిన ఏ ఇతర దేశంలోనైనా ఎలాంటి సంబంధం కల్గి ఉండాలన్న విషయంగా ఉన్న భారతదేశం 'హక్కు'ను ఏ విధంగానూ నియంత్రించదు.

ఏ భారతీయ రాష్ట్రమయినా కొత్తరాజ్యాంగ విషయంగా విధేయంగా ఉండదలచుకున్నా లేకపోయినా, ఈ ఒప్పందంలోని ఏర్పాట్ల విషయంగా తగు సవరణల నిమిత్తం చర్చలవసరమవుతాయి. ఆ కొత్త సందర్భాన్ని బట్టి నిర్ణయం తీసుకోవాల్సి ఉంటుంది.

(ఈ) రాజ్యాంగ నిర్మాణ యంత్రాంగానికి ఇప్పుడున్న క్లిష్ట పరిస్థితులు సమసిపోక మునుపే ఈ క్రింది విధంగా ఏర్పాటు చేయాలి. అయితే ప్రధాన జాతులకు చెందిన నాయకుల అభిప్రాయాలు దీనికి సుముఖంగా ఉండాలి. ప్రాంతీయ ఎన్నికల ఫలితాలు తెలియగానే ఇప్పుడున్న ప్రతికూల పరిస్థితులు మారిన తరువాత ప్రాంతీయ శాసన సభల్లోని క్రింది సభలోని సభ్యులంతా కలిసి ఒక ఎలెక్టొరల్ కాలేజీగా ఏర్పడి రాజ్యాంగ రచనా సంఘాన్ని నిష్పత్తి ప్రాతినిధ్య పద్ధతిలో ఎన్నుకుంటారు. ఈ సంఘంలో సభ్యుల సంఖ్య మొత్తం ఎలెక్టొరల్ కాలేజీలోని సంఖ్యలో 1/10వంతుగా ఉంటుంది. ఇలాగే భారతీయ రాష్ట్రాలు కూడా బ్రిటీష్ ఇండియాలోని బ్రిటీష్ ఇండియన్ మెంబర్లలాగానే అధికారాలు కల్గిన తమ ప్రతినిధుల్ని తమ తమ జన సంఖ్యల నాధారంగా నియమిస్తారు.

(ఉ) ఇండియా ఈనాడు ఎదుర్కొంటున్న ఈ విపత్కర పరిస్థితుల్లోనూ కొత్త రాజ్యాంగం ఏర్పాటయ్యే దాకా, బ్రిటిష్ ప్రభుత్వం వారే ఇండియా రక్షణకు సంబంధించిన నియంత్రణను, మార్గదర్శకత్వాన్ని ప్రపంచ యుద్ధ యత్నాలలో భాగంగా తప్పని సరిగా భరించాలి. కాని ఇండియాకు సంబంధిచిన సైనిక, నైతిక, భౌతిక వనరుల్ని పూర్తిగా కూడగట్టి వ్యవస్థీకృతం చేసే బాధ్యత కొత్తగా ఏర్పడబోయే భారత ప్రభుత్వానిది. ఈ విషయంలో ప్రజల సహకారాన్ని వారు పొందవలసి ఉంటుంది. ప్రధాన వర్గాలకు చెందిన భారతీయ నాయకులను ఆయా జాతీయ కామన్‌వెల్త్ మరియు యునైటెడ్ నేషన్స్‌లోని సలహా సంఘాలలో వెను వెంటనే ప్రభావవంతమైన భాగస్వామ్యం తీసుకురావాలని కోరుకుంటూ ఆహ్వానిస్తోంది. ఈ విధంగా భవిష్యత్తులో భారతదేశ స్వాతంత్ర్యాన్ని అవసరమైన అతి ప్రధాన మైన కార్యాన్ని నిర్వహించటంలో తమ నిర్మాణాత్మకమైన మరుకైన కృషిని అందించటానికి అవకాశం కల్గిస్తోంది.

## అనుబంధం IX

# క్రిప్స్ ప్రతిపాదనలపై అభ్యంతరాలు

*క్రిప్స్ ప్రతిపాదనలు అస్పృశ్యులకు ఎలా అన్యాయం చేస్తాయో చూపించే బి.ఆర్. అంబేద్కర్ గారి ప్రకటన*

బ్రిటిష్ ప్రభుత్వం ఎలాంటి **'volte face'** కి గురైందో వార్ కాబినేట్ ప్రతిపాదనలు నిరూపిస్తున్నాయి. ఈ ప్రతిపాదనలు మైనారిటీ హక్కుల కోసం జరుపుతున్న దాడిగా వారు ప్రకటించినా బలవంతులు జయించే హక్కును సంపూర్ణంగా వదలి పెడుతున్నామనటానికి తార్కాణాలుగా కనిపిస్తున్నాయి. ఇది మ్యూనిచ్ మనస్తత్వం. ఇతరుల్ని బలి చేసి తమను తాము రక్షించుకోవటం దీని సారాంశం. ఈ ప్రతిపాదనల్లో స్పష్టంగా ఈ మనస్తత్వామే బయట పడుతోంది. బ్రిటిష్ ప్రభుత్వం భారతీయ రాజ్యాంగ పురోభివృద్ధికి సంబంధించిన

ప్రతిపాదనల్ని ఆహ్వానించక పోవటం ద్వారా సర్ స్టాఫర్డ్ క్రిప్స్ మిషన్ విఫలమయ్యేలా చేసినందుకు అమెరికనులు, ఆంగ్లేయులు, కలత చెందారని తెలిసింది. అమెరికనులు బాధ పడితే క్షమించగలం. కాని ఆంగ్లేయులు, సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ఈ విషయాన్ని గురించి ఇంకా బాగా అర్థం చేసుకోగలరు. ఈనాడు అత్యుత్తమమైన ప్రతిపాదనలుగా బ్రిటీష్ ప్రభుత్వం వేటిని పంపిందో అదే ప్రభుత్వం అదే ప్రతిపాదనల్ని కొన్ని నెలల క్రితం ఎందుకూ పనికి రానివిగా తృణీకరించి తోసిపుచ్చిన విషయం ఎవరూ పూర్తిగా అర్థం చేసుకున్నట్టు లేదు. ఈ విషయం తెలిసిన వారు రాజ్యాంగ అభివృద్ధి కార్యక్రమంలో బ్రిటీష్ ప్రభుత్వం వారు ఇలా ఉన్నట్టుండి వైరుధ్యాలతో మొదలు పెట్టిన ఈ ప్రతిపాదనలు చాలా హేయంగా ఉన్నాయని చెప్పక తప్పదు. ఈ ప్రతిపాదనల్లో మూడు భాగాలున్నాయి. బారతీయ రాజ్యాంగాన్ని తయారు చేసే హక్కు గల ఒక రాజ్యాంగ రచనాసభ ఉండాలి. ఈ సభలో అత్యధికులు ఎలా నిర్ణయించటానికి అభిలషిస్తారో అలా రాజ్యాంగాన్ని తయారు చేసే పూర్తి హక్కు వారికుండాలి.

(2) ఈ కొత్త రాజ్యాంగం ఇండియాలోని ఇప్పటి పరగణాలన్నింటిని తనలో చేర్చుకోదు. ఎవరు చేరగోరుతారో వారినే చేర్చుకుంటుంది. చేరగోరటమో, బయట ఉండడమో వారికి సంబంధిచిన హక్కుగా వదలి వేశారు. ఇలా చెయ్యటానికి ప్లెబిసైట్ ( ప్రజాభిప్రాయ సేకరణ) నిర్వహించాలని, అత్యధికుల అభిప్రాయం ప్రకారం ఈ విషయాన్ని నిర్ణయించవచ్చని సూచించారు.

(3) రాజ్యాంగ రచనా సభ బ్రిటిష్ ప్రభుత్వంతో ఒక ఒప్పందం చేసుకోవాలి. ఈ ఒప్పందంలో అల్పసంఖ్యాకవర్గాలకు చెందిన తెగల, మతాల, సంరక్షణ, భద్రతల విషయం ప్రస్తావించ బడాలి. ఈ విధమైన ఒప్పందంపై సంతకం జరిగాక బ్రిటిష్ ప్రభుత్వం తన సార్వభౌమ అధికారాన్ని వదులు కొంటుంది. రాజ్యాంగ రచనాసభ తయాదు చేసిన నూతన రాజ్యాంగం అమల్లోకి వస్తుంది.

బ్రిటిష్ ప్రభుత్వం వారి కార్యాచరణ పథకం సంక్షిప్తంగా ఇది :

రాజ్యాంగ రచనా సభకు సంబంధిచిన ప్రతిపాదన కొత్తదేం కాదు. యుద్ధం మొదలైనపుడే కాంగ్రెస్ వాళ్ళు ఈ ప్రతిపాదన చేశారు. ముఖ్యమైన విషయం ఏమిటంటే బ్రిటీష్ ప్రభుత్వం అప్పట్లో ఈ ప్రతిపాదనను త్రోసి పుచ్చటం. రాజ్యాంగ రచనాసభ విషయంగా కామన్స్ సభలో 1940 ఆగష్టు 14న ఎమరీ చెప్పిందిదే..కాంగ్రెస్ నాయకులు ఒక గొప్ప సంస్థను స్థాపించారు. ఇండియాలో చాలా ప్రతిభావంతమైన రాజకీయ యంత్రాంగమిదే .....కానీ ఒక అంశం ఏమిటంటే కాంగ్రెస్ వారే ప్రకటించేటట్లు, భారతదేశంలోని జాతీయ జీవనానికి సంబంధించిన అన్ని ప్రధానాంశాల్ని గురించి వారు మాట్లాడ గలిగి ఉంటే, అందులో విజయం సాధించి ఉంటే, వారి డిమాండ్లు ఎంత తీవ్రమైనవే అయినా మన పరిస్థితి ఈనాడు ఇంత క్లిష్టంగా ఉండేది కాదు. బ్రిటిష్ ఇండియాలో సంఖ్యాపరంగా చూస్తే వీరిదే. అతి పెద్దదైన ఏకైక పక్షం. కాని ఈ విశేషణం చేత ఇండియా పక్షాన వీరు మాట్లాడాలని ప్రయత్నిస్తే ఇండియాలోని సంక్లిష్ట జాతీయ జీవనంలోని అతి ముఖ్యమైన వర్గాలే వీరిని ఖండిస్తున్నాయి. ఈ వర్గాలు తాము సంఖ్యాపరంగా అల్ప సంఖ్యాకులుగా పరిగణింపబడకూడదని, ఏ విధమైన భావి రాజ్యాంగంలోనైనా ప్రత్యేకమైన

భాగస్వామ్యం ఉన్నవిగా పరిగణింపబడాలని తమ హక్కును ధ్రువీకరిస్తున్నాయి. ఇలాంటి వర్గాలలో అతిముఖ్యమైనది పెద్దదైన ముస్లిం వర్గం. భిన్న ప్రాంతాల్లో జరిగే ఎన్నికల్లో మెజారిటీ ద్వారా ఏర్పడే రాజ్యాంగ సభ తయారు చేసే రాజ్యాంగంలో తమకు ఎలాంటి సంబంధమూ లేదంటున్నారు. ఏ విధమైన రాజ్యాంగ చర్యలోనైనా సరే, సంఖ్యాపరమైన మెజారిటీతో సంబంధం లేకుండా ప్రత్యేకవర్గంగా తమను గుర్తించాలని - అది తమ హక్కనీ ప్రకటిస్తున్నారు. షెడ్యూల్డ్ కులాలనబడే వర్గానికి కూడా ఇదే వర్తిస్తుంది. గాంధీ వీరిని గురించి శ్రద్ధతో ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నా వారు కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహించే హిందూవర్ణానికి బాహ్యులుగానే ఉన్నామని భావిస్తున్నారు.

బ్రిటీష్ ప్రభుత్వం తరపున వైస్రాయి 1941 ఆగస్టు 8న చేసిన ప్రకటనను వివరిస్తూ ఎమరి పై విషయం చెప్పారు. వైస్రాయి గారి వాక్యాలివి "ఇప్పుడురెండు విషయాలు బయటపడ్డాయి. ఆ రెండంశాల మీద బ్రిటిష్ ప్రభుత్వం తమ అభిప్రాయాన్ని స్పష్టం చేయదలుస్తోంది. మొదటిది- భారత రాజ్యాంగంలో అల్పసంఖ్యాకులకు సంబంధించిది . . . భారత దేశంలో శాంతి సంక్షేమాల దృష్ట్యా జాతీయ జీవితంలోని అతి పెద్ద ప్రభావవంతమైన వర్గాలు ప్రత్యక్షంగా వ్యతిరేకించే ఏ వ్యవస్థ చేతుల్లోనూ తమ బాధ్యతలు అప్పగించటం బ్రిటిష్ ప్రభుత్వానికి ఊహలో కూడా ఇష్టముండదన్నది చెప్పాల్సిన పని లేదు. అలాంటి ప్రభుత్వానికి ఇలాంటి వర్గాలు అణగి ఉండే క్లిష్ట పరిస్థితికి ప్రభుత్వం వారు బాధ్యులు కాజాలరు".

మళ్ళీ ఎమరి రాజ్యాంగ రచనాసభ కోసం కాంగ్రెస్ వారు చేస్తున్న డిమాండును ప్రస్తావించి తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేశారు:

"భారతీయ భవిష్యద్రాజ్యాంగాన్ని భారతీయుల నిర్మించుకోవాలి. ఈ పని చేయాల్సింది బ్రిటిష్ ప్రభుత్వం కాదు. అది మౌలికంగా భారతీయ పరిస్థితులకు అనుగుణంగా భారతీయుల అవసరాలు తీర్చేదిగా ఉండాలి. ఆ రాజ్యాంగం, దాన్నితయారు చేసే సభ, రెండూ భారతీయ జాతీయ జీవనంలోని ప్రధాన వర్గాల మధ్యఏర్పడే ఒప్పందం ఫలితంగా ఏర్పాటు కావాలి.".

రాజ్యాంగ సభ పట్ల బ్రిటిష్ ప్రభుత్వం వారి అభిప్రాయాలు, చేసిన ప్రమాణాలు ఇవి. ఈనాడు అవి అన్నీ అంగీకరంచ బడ్డాయి. ఇక పాకిస్తాన్ విషయంగా వచ్చిన డిమాండు ముస్లిం లీగ్ మొదలు పెట్టింది. బ్రిటిష్ ప్రభుత్వం ఈ డిమాండును కూడా తోసి పుచ్చింది. ఎమరీ కామన్స్ సభలో 1949 ఆగస్టు 1న చెప్పిన విషయం ఇదే.

"కాంగ్రెస్ రాజ్యమో హిందూ రాజ్యమో కావాలన్న డిమాండుకి ప్రతిక్రియగా ముస్లిం వర్గాల నుంచి మరో డిమాండు పుట్టింది. హిందూ దేశాన్ని హిందూ ముస్లీం ప్రాంతాలుగా విడగొట్టాలని ఆ డిమాండు. అలాంటి పథకం ఆచరణలోకి తీసుకురావటంలో ఎన్ని అసంఖ్యాకమైన అభ్యంతరాలు, మడత పేచీలు ఉన్నాయో నేను చెప్పాల్సిన పనే లేదు. ఇలా చేయడం వల్ల శాశ్వతమైన మైనారిటీ సమస్య చిన్న చిన్న ప్రాంతాలకు మారుతుంది తప్ప సమస్య మాత్రం పరిష్కారం కాదు.

"మళ్ళీ .1941 ఏప్రిల్ 23న కామన్స్ సభలో ఈ సమస్యను ప్రస్తావించారు. పాకిస్తాన్‌ని వేరు చేయడమనే పథకంలోని సమస్యల్ని గురించి నేను చర్చించటం లేదు.

18వ శతాబ్దిలో భారతీయ చరిత్రలో జరిగిన ఘోరమైన సంఘటనల్నికూడా పునశ్చరణ చేయటం లేదు. మన కళ్ళ ముందే బ్రిటిష్ దేశాలు ఏ భయంకరమైన అనుభవాల్ని పొందుతున్నాయో చెప్పాల్సిన పని లేదు. భారత దేశంలోని ప్రధానమైన సమైక్యతను ఇతర ప్రపంచంతో సంబంధించినంత వరకు - ముక్కలుచేయటానికి ప్రయత్నిస్తే వచ్చే భయంకరమైన అపాయాలను గురించి చెప్పటానికి పై సంఘటనలు చాలు. మరీ మాట్లాడితే భారత దేశానికి మనం చేశామని గర్వించదగ్గ గొప్పదనం. మన మిచ్చిన సమైక్యత తప్ప మరొకటి ఏముంది?

ఒక సంవత్సరం క్రితం రాజ్యాంగ సభ పట్ల, పాకిస్తాన్ పట్ల బ్రిటిష్ ప్రభుత్వం అభిప్రాయాలు ఇవి. వీటిని గమనిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. రాజ్యాంగ రచనాసభ విషయం కాంగ్రెస్‌ను అధిగమించటానికి, పాకిస్తాన్ ప్రతిపాదన విషయం ముస్లిం లీగ్‌ను అధిగమించడనికి. ఈ ప్రతిపాదనలు దళిత వర్గాల సమస్యల్ని ఎలా చూస్తాయి? ఒక్క మాటలో చెబితే దళిత వర్గాల చేతులు కాళ్ళు కట్టేసి హిందూ సవర్ణుల చేతుల్లో పెట్టడమే. ఈ ప్రతిపాదనలు వాళ్ళ కోరిగించేదేమి లేదు. రొట్టె ముక్కకు బదులు చేతుల్లో రాయిపడేస్తున్నారు. రాజ్యాంగ రచనాసభను ఏర్పరచటం దళిత వర్గాలను దగాచెయ్యటమే. ఇక రాజ్యాంగ సభలో దళిత వర్గాల స్థానం ఎలా ఉండబోతుందో నిస్సందేహంగా చెప్పవచ్చు. రాజ్యాంగ సభ వారి రాజకీయ కార్యక్రమం ఎలాఉంటుందో కూడా ఊహించవచ్చును. రాజ్యాంగ సభలో దళిత వర్గాల ప్రతినిధులే లేకపోవచ్చు - ఎందుకంటే ఈ ప్రతి పాదనల్లో కులాల వారీగా ప్రాతినిధ్య పరిమాణం నిర్దేశింపక పోవటంచేత. ఒక సమయం ఉన్నా ఆ సభ్యులు స్వేచ్ఛగా స్వతంత్రంగా, నిర్ణయాత్మకంగా వోటు చేసే అధికారముండదు. మొదటిదేమిటంటే దళిత వర్గాల ప్రతి నిధులు చాలా అల్ప సంఖ్యలో ఉండబోతారు. రెండవది రాజ్యాంగ సభ నిర్ణయాలు సభ్యులందరి చేత ఏక గ్రీవంగా ఆమోదింపబడాలన్న నియమం లేదు. రాజ్యాంగపరంగా ఎంత ప్రాధాన్యమున్న అంశాన్నయినా సరే మెజారిటీ వోటుతో నిర్ణయించవచ్చు. అందుచేత ఈ వ్యవస్థలో దళిత వర్గీయుల మాట లెక్కకు రాదన్నది స్పష్టం. మూడవ విషయం ఏమిటంటే - బ్రిటిష్ ప్రభుత్వం పంపిన ప్రతిపాదనల్లోని నియమాల మేరకు ఇప్పటి పద్ధతిలో జన సంఖ్యను బట్టి రాజ్యాంగ సభకు ప్రతినిధుల్ని పంపటం వల్ల హిందూ సవర్ణీయులే దళిత వర్గీయుల ప్రతినిధుల్ని నామినేట్‌చేసే అధికారం కల్గి ఉండటం వల్ల అలాంటి దళిత ప్రతినిధులు హిందూ సవర్ణీయుల చేతుల్లో సాధనాలుగా మాత్రమే ఉంటారు. ఇక నాల్గో అంశం - రాజ్యాంగరచనా సభలో అందరూ కాంగ్రెస్ వారే ఉంటారు. మెజారిటీ కలిగిన పార్టీకాబట్టి తన కార్యక్రమాన్ని అది నిర్వహించుకో గలుగుతుంది. గాంధీగారు దళితజనుల సామాజికాభ్యున్నతిని గురించి ఎన్ని మాటలు చెప్పినా ఆయన మాత్రం రాజ్యాంగ ప్రకారం భారతీయ జాతీయ జీవనంలో ఒక ప్రత్యేక విలక్షణ వర్గంగా దళితులకు గుర్తింపు ఇవ్వటానికి సంపూర్ణంగా వ్యతిరేకే. పరిస్థితి ఇలా ఉంది కాబట్టి రాజ్యాంగ రచనాసభలో ప్రధాన పక్షమైన కారణంగా దళిత వర్గాలకు ఇప్పటి రాజ్యాంగం ప్రకారం ఉన్న రాజకీయ భద్రతలను పూర్తిగా అణచిపెట్టడమే వారి కార్యక్రమమౌతుంది. రాజ్యాంగ సభ ఉద్దేశాలను గుర్తించిన వారెవరైనా ఈ ప్రతిపాదనల ద్వారా బ్రిటిష్ ప్రభుత్వం వారు దళిత వర్గాలను తోడేళ్ళ పాలు చేసిందని ఒప్పుకుంటారు. దళిత వర్గాలకు రాజ్యాంగ భద్రతను నిరాకరించే రాజ్యాంగ సభ ఉండగా బ్రిటిష్ ప్రభుత్వం ఈ ప్రతిపాదనల ద్వారా దళిత వర్గాల ప్రయోజనాన్ని పరిరక్షించటం కోసం రాజ్యాంగ సభతో ఒప్పందం కుదుర్చుకునే

జాగ్రత్త పడింది. ఐరిష్ వివాదాన్ని పరిష్కరించుకోవటానికి బ్రిటిష్ ప్రభుత్వం చేసుకున్న ఒప్పందం లాంటిదే ఇది కూడా. ఈ ఒప్పందం ప్రకారం ఏయే విధమైన రాజకీయ భద్రతలు కల్పిస్తారో ఈ సంధి ప్రతిపాదనల్లో ఎక్కడా స్పష్టంగా లేదు. ఇది చాలా ముఖ్యమైన అంశం. ఈ అంశంలో బ్రిటిష్ ప్రభుత్వ అభిప్రాయానికి దళిత వర్గీయుల అభిప్రాయానికి - రాజకీయ భద్రతల స్వభావ విషయంగానూ, సంఖ్య విషయంలోనూ, పద్ధతుల విషయంగానూ తేడా ఉండవచ్చు. దీనితో సమానమైన మరో ప్రశ్న ఒప్పందం ద్వారా దళితులకు ఒరిగేదేమిటని? ఈ ఒప్పందం రాజ్యాంగ సభ తయారు చేసే కొత్త రాజ్యాంగంలో భాగమవుతుందా? అప్పుడు ఒప్పందానికి వ్యతిరేకంగా ఉన్న ఏ రాజ్యాంగంలో అంశమయినా నిష్ప్రయోజనమవుతుంది. లేక ఈ ఒప్పందం భారతీయ జాతీయ ప్రభుత్వానికి బ్రిటిష్ ప్రభుత్వానికి మధ్య వ్యాపార ఒప్పందం లాంటి సాధారణమైన మొదటి రకందైతే అది భారతీయ ప్రభుత్వానుమతి ఉన్న న్యాయపరమైన ఆదేశమవుతుంది. అలా కాకుండా వ్యాపార ఒప్పందమే అయితే అది న్యాయ పరమైన అనుమతి లేని కారణంగా ఆదేశం కాబోదు. అది కేవలం రాజకీయమైన అనుమతి కల్గి ఉంటుంది. జాతీయ ప్రభుత్వం చేత నియమింపబడ్డ రాజ్యాంగాన్ని ఒక ఒప్పందం అధిగమించి ప్రవర్తించటం కుదరని పని. ఐరిష్ స్వతంత్ర రాష్ట్రమైనా దానికి స్వతంత్ర రాజ్య ప్రతిపత్తి రాలేదు. అందుకే ఇలాంటి అనుమతులన్నీ రాజకీయమైన మంజూర్లు మాత్రమే అవుతాయి. అలాంటి అనుమతి ప్రభుత్వ స్థితిని బట్టి ప్రజాభిప్రాయాన్ని బట్టి ఉండవలసి వస్తుంది. ఈ వాస్తవం తెలిశాక రెండు ప్రశ్నలు పుడతాయి : 1. ఈ ఒప్పందం ఒడంబడికలు కార్యరూపం దాల్చటానికి బ్రిటిష్ ప్రభుత్వం ఏం చేసింది? 2. భారతీయ జాతీయ ప్రభుత్వాలు అదే పద్ధతి ద్వారా ఒప్పందం నియమాలకు బద్ధంగా ఉండేలా చేయగలదా?

మొదటి ప్రశ్నకు సమాధానం - రెండు పద్ధతులలో ఒప్పందం అమలు జరిగేలా చూడవచ్చు - బలం ఉపయోగించి; వ్యాపార యుద్ధం ప్రకటించి. ఇక మిలిటరీ బలం దగ్గరి కొచ్చేటప్పటికి భారతీయ సైన్యం వారికి అందుబాటులో ఉండదు. అదికొత్త జాతీయ ప్రభుత్వం చేతిలో ఉండదు. అందుచేత బ్రిటిష్ ప్రభుత్వం చేతిలో బల ప్రయోగం చేయగల సాధనం ఉండదు. ఇక బ్రిటిష్ ప్రభుత్వం తన సొంత సైన్యాన్ని పంపించి జాతీయ ప్రభుత్వం చేత ఈ ఒప్పందం అమలు అయ్యేలా చేస్తుందని నమ్మడం అసాధ్యం. మరి ఈ విషయంలో వ్యాపార యుద్ధం కూడా సాధ్యం కాదు. అది ఆత్మహత్యలాంటి పద్ధతి. ఐరిష్ స్వతంత్ర రాష్ట్రంలో జరిపిన యుద్ధంలో భూముల వార్షిక ఆదాయాలను రాబట్టుకోవటం కోసం చేసిన ప్రయత్నం విఫలమైంది. దుకాణదారులతో నిండిన దేశమది. తమకు లాభమే అయినా గౌరవప్రదమే అయినా డబ్బు విషయంలో రాజీ పడదు. అందుచేత ఈఒప్పందం కేవలం ఒక శూన్యసంధి. వట్టి హాస్యాస్పదమైన విషయం దీనివల్ల దళిత వర్గాలకు ఏం ఒరగదు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ ప్రతిపాదనల్ని భారతీయులు ఆహ్వానిస్తారని పంపింది. కానీ అటు బ్రిటిష్ ప్రభుత్వం కాని, ఇటు సర్ స్టాఫర్డ్ క్రిప్స్ కాని, కొన్ని నెలల క్రితమే ఈ ప్రతిపాదనల్ని అతి నీచంగా తిరస్కరించారు. అవే ప్రతిపాదనల్ని భారతీయులకు ఎందుకు ప్రసాదిస్తున్నారో ఏమాత్రం వివరించ లేదు. ఒక సంవత్సరం క్రితం బ్రిటిష్ ప్రభుత్వం రాజ్యాంగ సభను అనుమతింపబోమని అన్నది - ఎందుకంటే అది మైనారిటీలను నిర్బంధం చేయటం అవుతుంది కాబట్టి. కానీ ఈనాడు ఇండియాను విభాగీకరించడానికి వారు సంసిద్ధంగా ఉన్నారు. ఇంత విశాల సామ్రాజ్య ప్రభుత్వం సూత్రజ్ఞానాన్నే కోల్పోతే ఎలా? దీనికి ఒకే వివరణ ఉంది. యుద్ధం కారణంగా బ్రిటిష్ ప్రభుత్వం ఉపద్రవాలకు చిక్కి ఇలాంటి నిర్ణయాలు

తీసుకుంటోందని చెప్పాల్సి వస్తుంది. బలం నశించటం వల్లనే ఇలాంటి ప్రతిపాదనలు పుడుతున్నాయి. కాంగ్రెస్, ముస్లిం లీగ్‌లు ఎలాంటి డిమాండ్లు చేస్తున్నాయో, వాళ్ళకు ఎలాంటి రాయితీలు ఈ ప్రతిపాదనల ద్వారా లభిస్తున్నాయో గమనిస్తే బ్రిటిష్ ప్రభుత్వం ఎలాంటి గొప్ప సంక్షోభంలో చిక్కుకుందో అర్థమవుతుంది. కాంగ్రెస్ కేవలం మెజారిటీ వోటునాధారంగా రాజ్యాంగ సవరణ ఏర్పరచాలని కోరింది. మరోవైపు బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెస్ చేసిన ఈ డిమాండు వల్ల మైనారిటీలకు కలిగే ఇబ్బందులకు తాము బాధ్యులం కామని వైస్రాయి ప్రకటించటం చేత వార్ధాలో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో ఈ క్రింది తీర్మానం కాంగ్రెస్ ఆమోదించింది:

"కాంగ్రెస్ ఎప్పుడూ ఏ మైనారిటీ వాళ్ళనూ బాధించాలని ఆలోచించ లేదు. బ్రిటిష్ ప్రభుత్వం వారినీ అడగ లేదు. పద్ధతి ప్రకారం ఎన్నికైన రాజ్యాంగ రచనాసంఘం ద్వారా మెజారిటీ ఓటు పద్ధతిలో రాజ్యాంగ నిర్ణయం చేయటం ఒక్కటే మేం ఆశించింది. దీన్ని మైనారిటీలను చిక్కుల్లో పెట్టే విషయంగా అపార్థం చేసుకోవటం ఎక్కువగా వ్యాఖ్యానించటం చింతించదగ్గ విషయమే. భారతీయుల అభివృద్ధికి అల్పసంఖ్యాకుల సమస్యను ఒక దుస్తరమైన అడ్డుగా తయారుచేశారు.".

వర్కింగ్ కమిటీ ఇంకా ఇలా అంది :

"కాంగ్రెస్ వారు మైనారిటీల హక్కులను మైనారిటీ వర్గ ప్రతినిధులతో ఒప్పందం ద్వారా సమగ్రంగా రక్షించాలని ఎప్పుడో ప్రతిపాదించింది".

దీని అర్థం ఏమిటంటే మైనారిటీలకు సంబంధించిన హక్కుల విషయం నిర్ణయం తీసుకోవటం. రాజ్యాంగ సభ పరిధి క్రిందికి రావాలని కాంగ్రెస్ వారు కూడా కోరలేదని, బ్రిటిష్ ప్రభుత్వం ఈ మైనారిటీల సమస్యను మైనారిటీ వోటు ద్వారా పరిష్కరించే అదనపు హక్కును ఎలాగూ వారికి ఇచ్చే ఉంది. పాకిస్తాన్ విషయంలో కూడా ఇదే ధోరణి కనిపిస్తోంది. పాకిస్తాన్ వెనువెంటనే ఏర్పడిపోవాలని ముస్లిం లీగ్ కోరలేదు. వారు కోరిందల్లా తదుపరి రాజ్యాంగ సవరణ జరిగినపుడు ముస్లింలు పాకిస్తాన్ కావాలని కోరినపుడు వారినెవరూ అడ్డుపెట్టకూడదని మాత్రమే. ఈ ప్రతిపాదనలు ఒక అడుగు ముందుకు వెళ్ళి ముస్లిం లీగ్‌కు పాకిస్తాన్‌ను సృష్టించుకొనే అవకాశాన్ని కల్పించింది. ఇవి రాజ్యాంగ పరమైన ప్రతిపాదనలు. వీటి ప్రయోజనం ఇండియాను సంపూర్ణంగా యుద్ధానికి సిద్ధం చేయటం. దీనిలో హిందువులు, ముస్లింలు, అణగారిన వర్గాలు, సిక్కులు హృదయపూర్వకంగా భాగస్వామ్యం వహించాలి. కానీ సర్‌స్టాఫర్డ్ క్రిప్స్ తానే సొంతంగా చేస్తున్నారో లేదా దీనికి బ్రిటిష్ ప్రభుత్వం వారి అనుమతి ఉందో కాని మేజర్ పార్టీలని, మైనర్ పార్టీలని ఒక భేదాన్నిపరిగణిస్తున్నారు. ఎవరి సమ్మతి అవసరమో, వాళ్ళు పెద్ద పార్టీల వారు. చిన్నపార్టీలతో సలహా సంప్రదింపులు మాత్రం చాలు. ఇదొక కొత్త భేద పరిగణన.బ్రిటిష్ ప్రభుత్వం కాని, వైస్రాయి కానీ తమ ముందటి ప్రకటనల్లో ఇలాంటి భేదాన్ని పరిశీలించలేదు. వారు చెప్పిందల్లా "భారతీయ జాతీయ జీవనంలోని ముఖ్య వర్గాల అనుమతి కావాలని" మాత్రమే. దళిత వర్గాలకు సంబంధించినంత వరకు వారిని ముస్లింల కన్నా తక్కువ స్థాయిలో పరిగణించిన ప్రకటనను నేనెక్కడా చూడలేదు. 1941, జనవరి 10వ తేదీన బొంబాయిలోవైస్రాయి చేసిన

ప్రసంగం* నుంచి ఉదహరిస్తాను. ఇందులో ఆయన దళితవర్గాలను ముస్లింలతో సమానంగా పరిగణించారు.

"మైనారిటీల గాఢమైన కోరికలున్నాయి. వీటి కోసం వారు చాలాకాలం నుండి పట్టుబట్టి ఉన్నారు. నేను వాటిలో రెండింటిని ప్రస్తావిస్తాను- గొప్పదైన ముస్లిం మైనారిటీ ఒకటి, షెడ్యూల్డ్ కులాలు రెండవది - మైనారిటీలకు మునుపటి కాలంలో ఇచ్చిన హామీలున్నాయి. వాటి స్థితిని రక్షించాలన్నది ఒక లక్ష్యం. రెండవది ఆ హామీలను గౌరవించటం".

ఇలాంటి అసూయజనకమైన భేద పరిగణన కావాలని కోరుకోవటం, ఈ వివక్ష ద్వారా తక్కువగా చేయబడిన మైనారిటీల విశ్వాసానికి ద్రోహం చేయటమే.సంపూర్ణ యుద్ధానికి సంబంధించిన రాజ్యాంగం దృష్ట్యా దేశంలో ఇది ద్వేషాన్ని, అవిధేయతను తప్పని సరిగా కలగచేస్తుంది. ఈ ప్రయత్నంలో తమను బహుశా ఇంతకు ముందే వదిలి పెట్టడానికి సిద్ధంగా ఉన్న వారి స్నేహాన్ని పొందాలో లేక తమ నిజమైన స్నేహితుల్ని పోగొట్టుకోవాలో బ్రిటిష్ వారే నిర్ణయించుకోవాలి. ఈ ప్రతిపాదనలు బ్రిటిష్ ప్రభుత్వ పక్షంగా ఉన్నట్టుండి 'Volte face'ని నిరూపిస్తున్నాయి. ఒకప్పుడు మైనారిటీల హక్కులను హరించేవిగా తిరస్కరించిన ప్రతిపాదనలనే మళ్ళీ చేయటం బలాన్ని ఎదిరించే హక్కును సంపూర్ణంగా త్యాగం చెయ్యటమే. దీన్నే నేను మ్యూనిచ్ మనస్తత్వమని ముందే అన్నాను. బ్రిటిష్ ప్రభుత్వానికి నా సలహా ఏమిటంటే వారు తమ ప్రతిపాదనలను ఉపసంహరించుకోవాలి. వాళ్ళు న్యాయం కోసం, సత్యం కోసం తామిచ్చిన మాట నిలబెట్టుకోవటం కోసం పోరాడే శక్తి లేని వాళ్ళే అయితే తప్పనిసరిగా సంధి చేసుకోవల్సిందే. కనీసం దాని ద్వారా వాళ్ళు తమ గౌరవాన్నయినా కాపాడుకోగలుగుతారు.

* ఇది అనుబంధం VIలో 9వ అంశంగా ముందు చెప్పబడింది. 1940 సంవత్సరం అని అక్కడుంది - అనువాదకుడు.

## అనుబంధం X

# లార్డ్ వేవెల్ గాంధీల నడుమ ఉత్తర ప్రత్యుత్తరాలు, 1944

*1 వైస్రాయికి గాంధీ ఉత్తరం జులై 15, 1944*

ప్రియ మిత్రునికి,

'న్యూస్ క్రానికల్'కి చెందిన గెల్డర్ ఇచ్చిన నా ప్రకటనలను భారతీయ పత్రికలలో మీరు చూసి ఉంటారు. నేను పత్రిక వారితో చెప్పినట్టు ఆ ప్రకటనలు తప్పని సరిగా మీకు చూపబడాలనే ఉద్దేశించారు. కాని గెల్డర్ నిస్సందేహంగా మంచి ఉద్దేశ్యంతోనే నా ముఖాముఖికి

చాలా ముందుగానే మంచి ప్రచారం ఇచ్చేశాడు. అంచేత నన్ను క్షమించాలి. ఒక రకంగా ఇలాప్రకటన పొందటంకూడా మంచిదే. నాతో జరిపిన ఇంటర్వ్యూని మీరు చూసి నేను మీకు 1944 జూన్17వ తేదీ రాసిన ఉత్తరంలోని ఒక కోరికను సమ్మతించినా అది మేలే కదా!

మీ
(సం.) ఎం.కె. గాంధీ.

2. *గాంధీకి వైస్రాయి సమాధానం 22జులై 1944.*

ప్రియమైన గాంధీ, జులై 15వ నాడు మీరు రాసిన ఉత్తరానికి కృతజ్ఞతలు. గెల్డర్‌తో మీరు చేసిన ప్రకటనలు, తరువాత మీరు వాటికి ఇచ్చిన వివరణలు నేను చూశాను. వాటిని గురించి నేను ఉపయుక్తమైన ఏ వ్యాఖ్యానమూ చేయగలనని అనుకోవటం లేదు. నేను గత ఉత్తరంలో రాసినట్లు నిర్దిష్టమైన, నిర్మాణాత్మకమైన ఒప పథకాన్ని సూచించండి. దాన్ని నేను సంతోషంగా పరిశీలిస్తాను. ఇప్పుడు మరలా ఆ విషయం గుర్తు చేస్తున్నాను.

మీ విధేయుడు
(సం) వేవెల్

3. *వైస్రాయికి గాంధీ ఉత్తరం 27జులై 1944*

ప్రియమిత్రుడికి,

మీరు 22న రాసిన ఉత్తరం చేరి నేను చాలా నిరాశకు గురైనాను. కానీ నాకు నిరాశతో పని చేయటం బాగా అలవాటైపోయింది. మీరడిగిన నిర్దిష్ట ప్రతిపాదన ఇదిగో చూడండి.

మారిన పరిస్థితుల దృష్ట్యా 1942 ఆగష్టులో చేసిన తీర్మానం ప్రకారం సామూహిక పౌరధిక్కారం జరపటం కుదరదని నేను వర్కింగ్ కమిటీకి సలహా ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నాను. కాంగ్రెస్ యుద్ధ ప్రయత్నంలో సహకరించాలని కూడా చెబుతాను. కాని తక్షణమే స్వాతంత్ర్యం ప్రకటించాలి. కేంద్ర శాసన సభకు బాధ్యత వహించే జాతీయ ప్రభుత్వం ఏర్పడాలి. కానీ యుద్ధం జరిగే కాలంలో సైనిక చర్యలు యథాపూర్వంగానే జరగాలి తప్ప, ఏ విధమైన ఆర్థిక భారమూ ఇండియా మీద పెట్టకూడదు. బ్రిటిష్ ప్రభుత్వం ఏదైనా రాజీ చేసుకోదలిస్తే అది స్నేహ పూర్వకమైన చర్చలతో జరగాలే తప్ప ఉత్తర ప్రత్యుత్తరాలతో కాదు. కానీ నేను మాత్రం ఎప్పుడూ మీ చేతుల్లోనే ఉంటాను. గౌరవప్రదమైన రాజీ కుదురుతుందన్న అట్టి స్వల్ప నమ్మకం మిగిలి ఉండేదాక నేను ఇదే విధంగా మీ భవనం తలుపులు తడుతూనే ఉంటాను.

పై విషయం రాసిన తరువాత లార్డ్స్ సభలో లార్డ్ మన్‌స్టర్ చేసిన ప్రసంగం చదివాను. వారి ఉపన్యాస సారాంశం దాదాపు నాప్రతిపాదనకు తుల్యంగా ఉంటుంది. ఈ సారాంశం ఆధారంగా పరస్పర మైత్రీచర్చలు జరగటానికి వీలుంది.

ఉంటాను
మీ విధేయుడు
(సం) ఎం. కె. గాంధీ

4. *గాంధీకి వైస్రాయి సమాధానం* 15 *ఆగస్టు* 1944

ప్రియమైన గాంధీ,

జులై 27న మీరు రాసిన ఉత్తరానికి ధన్యవాదాలు. మీ ప్రతిపాదనలు ఇవి.

(i) వర్కింగ్ కమిటీకి మీరు ఈ సలహాలివ్వటానికి అంగీకరించారు :-

(అ) మారిన పరిస్థితుల దృష్ట్యా 1942 ఆగస్టులో తీసుకున్న తీర్మానం ప్రకారం సామూహిక పౌర ధిక్కారం జరపటం కుదరని పని.

(ఆ) కాంగ్రెస్ యుద్ధ ప్రయత్నంలో సంపూర్ణంగా సహకరిస్తుంది, కాని

(ii) బ్రిటిష్ ప్రభుత్వం ; (అ) తక్షణమే భారత దేశానికి స్వాతంత్ర్యం ప్రకటించాలి. (ఆ) కేంద్ర శాసన సభకు బాధ్యత వహించే ప్రభుత్వం ఏర్పడాలి. కానీ యుద్ధం జరిగే సమయంలో సైనిక చర్య కోసం జరిగే ఖర్చును యథాపూర్వంగానే భరించాలి. ఆ ఆర్థిక భారాన్ని ఇండియాపైన మోపకూడదు.

భారతీయ సమస్యపై ఏదో ఒక విధమైన రాజీ కుదుర్చుకోవాలని బ్రిటిష్ ప్రభుత్వం చాలా ఆసక్తిగా ఉంది. కానీ మీరు పంపిన ఇలాంటి ప్రతిపాదనలు బ్రిటిష్ ప్రభుత్వానికి చర్యల నిమిత్తం ఏ మాత్రమూ అంగీకార్యాలు కావు. ఎమరీ కామన్స్ సభలో గత జులై 28న చేసిన ప్రకటన మీరు చదివి ఉంటే ఈ విషయం మీకు అర్థమై ఉంటుంది. మౌలానా అబుల్ కలామ్ ఆజాద్, సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌కి 1942 ఆగస్టులో సమర్పించిన ప్రతిపాదనలాగానే ఇవి కూడా ఉన్నవి. ప్రభుత్వం వారు వాటిని తిరస్కరించటానికి ఏ కారణాలున్నాయో, వీటిని తిరస్కరించటానికి కూడా అవే కారణాలున్నాయి.

(iii) ఈ కారణాలన్నిటినీ తడవకుండానే ఆ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం స్పష్టం చేసిన విషయాన్ని గుర్తు చేస్తున్నారు. (ఆ) ఈ ప్రతికూల పరిస్థితులు మారిన తరువాత భారతియ జాతీయ జీవితంలోని ప్రధాన వర్గాలందరి సమ్మతిపైన ఒక రాజ్యాంగం ఏర్పరచుకున్న తరువాతే ప్రభుత్వంవారు అవసరమైన సంధి షరతులకు కావలసిన సంప్రదింపులు జరిపిన తరువాత సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వటానికి అంగీకరిస్తున్నారు. ఈ క్లిష్ట పరిస్థితులున్న సమయంలో రాజ్యాంగంలో ఉన్నట్టుండి మార్పుతెచ్చి కేంద్ర శాసన సభకు మాత్రమే బాధ్యత వహించే 'జాతీయ ప్రభుత్వాన్ని' మీరు సూచించినట్టుగా ఏర్పాటు చెయ్యటం అసాధ్యమైన పని.

ఈ నియమాలను విధించటంలో ఉద్దేశం భిన్న తెగల, మతాల, అల్పసంఖ్యాక వర్గాల ఆశయాలను పరిరక్షించటం విషయంలో తమ బాధ్యతను నిర్వర్తించటం. భారతీయ రాష్ట్రాలకు ఒప్పందపరంగా తమ న్యాయం చేకూర్చి సహకరించటం.

(iv) ఈ నియమాలకు లోబడి మధ్యంతర ప్రభుత్వాన్ని నడపడానికి భారతీయ నాయకులను బ్రిటిష్ ప్రభుత్వం ఆహ్వానించింది. ఆ మధ్యంతర ప్రభుత్వం కూడా ఇప్పుడున్న రాజ్యాంగ పరిధిలోనే పని చేస్తుంది. ఒక విషయం స్పష్టం చేయాలి. యుద్ధం పూర్తి అయ్యేదాకా రక్షణకు సైనిక చర్యలకు అయ్యే ఖర్చు ఇతర బాధ్యతల నుంచి వేరు చేయటం కుదరని పని. ఈ ప్రతికూల పరిస్థితులు సద్దుమణిగిన తరువాత కొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చే

దాకా బ్రిటిష్ ప్రభుత్వం మరియు గవర్నర్ జనరల్ మొత్తం రంగం మీద అంతటా తమ బాధ్యతను అలాగే ఉంచుకోవాల్సిన అవసరం ఉంది. ఇక యుద్ధం ఖర్చులో ఇండియా ఎంత భాగం భరించాలి అనే విషయం అటు బ్రిటిష్ ప్రభుత్వమూ, ఇటు భారత ప్రభుత్వమూ కలిసి తీసుకోవలసిన నిర్ణయం. ప్రస్తుతమున్న ఆర్థిక పరమైన ఏర్పాట్లను ఒకరితో ఒకరు చర్చల ద్వారా పునఃప్రారంభించుకోవచ్చు.

(v) ప్రస్తుతమున్న పరిస్థితుల్ని మీరు చెబుతున్న పరిస్థితిని చర్చిస్తే ఏ ప్రయోజనమూ ఉండదు. కానీ హిందూ, ముస్లిం ఇతర ముఖ్యమైన మైనారిటీల నాయకులు ప్రస్తుత రాజ్యాంగంలో భాగమై పని చేసే మధ్యంతర ప్రభుత్వానికి సహకరించటానికి ఇష్టపడితే ఈ విషయంలో కొంత ముందుకు పోవచ్చు. ఇలాంటి ఆపద్ధర్మ ప్రభుత్వం విజయవంతం కావాలంటే అంతకు ముందు హిందువులకు, ముస్లింలకు, ఇతర వర్గాలకు నడుమ భవిష్యత్ రాజ్యాంగం ఎలాఉండాలన్న విషయంగా ఒక ఒప్పందం కుదరాలి. ఈ ఒప్పందం భారతీయులకు మాత్రమే సంబంధించిన విషయం.

భారతీయ నాయకులు ఇప్పుడున్న దానికన్నా ఇంకా సన్నిహితంగా సంఘటితమైతే తప్ప నేను మీకేమైనా సహాయం చేయగలుగుతానా అన్నది సందేహాస్పదమే. మైనారిటీల సమస్యలు అంత సులభమైనవి కావని మీకు కూడా నేను గుర్తు చేస్తున్నాను. అవి వాస్తవికమైన సమస్యలు. పరస్పర అవగాహనతో, అంగీకారంతో, సహనంతో మాత్రమే ఆ సమస్యల్ని పరిష్కరించగలం.

(vi) ఈ ప్రతికూల పరిస్థితుల తర్వాత కూడా మధ్యంతర ప్రభుత్వం ఎంత కాలం ఉండబోతుందన్న ప్రశ్నకు సమాధానం 'కొత్త రాజ్యాంగాన్ని ఎంత వేగంగా తయారు చేస్తే అంత కాలం' - అని. రాజ్యాంగ విషయంలో సహకరించటానికి భారతీయ నాయకులంతా ఒప్పుకోగానే రాజ్యాంగ రచనా విషయంగా ప్రాథమికమైన పని ఎందుకు మొదలు పెట్టరో నాకు తెలియటం లేదు. రాజ్యాంగరచనా పద్ధతి విషయంగా ఒక నిజమైన ఒప్పందం కుదిరితే యుద్ధం ముగిశాక బ్రిటిష్ ప్రభుత్వంతో సంధి ప్రయత్నాలు చేసుకోవటానకి, తుది నిర్ణయాలు తీసుకోవటాకి కాలం వ్యర్థం చేయాల్సిన అవసరమే ఉండదు. ఆ విషయంలో కూడా భారతీయ నాయకులదే ప్రధాన బాధ్యత.

మీ విధేయుడు
(సం) వేవెల్

## అనుబంధం XI

# షెడ్యూల్డ్ కులాల రాజకీయ డిమాండ్లు

*మద్రాసులో రావు బహదూర్ ఎన్. శివరాజ్, బి.ఎ,బి.యల్, ఎం.ఎల్.ఎ గారి అధ్యక్షతలో 1944 సెప్టెంబరు 23న అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్యవర్గ సమావేశం కొత్త రాజ్యాంగంలో అస్పృశ్యుల పరిరక్షణ విషయంగా చేసిన తీర్మానాలు.*

## తీర్మానం సంఖ్య 1

*విషయం: షెడ్యూల్డ్ కులాలను ప్రత్యేక వర్గంగా గుర్తించటం.*

ఘనత వహించిన వైస్రాయి వారు 1944 ఆగస్టు 15 న గాంధీ గారికి రాసిన లేఖలో షెడ్యూల్డ్ కులాలు భారత జాతీయ జీవనంలో ముఖ్యమైన ప్రత్యేకవర్గమని, నూతన భారతీయ రాజ్యాంగానికి షెడ్యూల్డ్ కులాల అనుమతి వచ్చిన తర్వాతనే భారతీయులకు రాజ్యాధికారం ఇవ్వటం జరుగుతుందనటం అంతకుమునుపు క్రిప్స్ ప్రతిపాదనల్లో చెప్పిందానికన్నా భిన్నంగా ఉందని భారతీయ పత్రికారంగంలో ఒక వర్గం ఆరోపణ చేయటాన్ని అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య గుర్తించింది. ఈ ప్రచారం పట్ల తమ అసహనాన్ని కమిటీ వ్యక్తం చేయకుండా ఉండలేక పోతోంది. ఈ సందర్భంలో స్పష్టమైన రీతిలో నొక్కి చెప్పదలచిన అంశం షెడ్యూల్డ్ కులాలు ఒక విలక్షణమైన ప్రత్యేక వర్గమని, భారతీయ జీవనంలో వారిది విశిష్టస్థానమని. సిక్కులకన్నా, ముస్లింలకన్నా వీరి పట్లనే వాస్తవంగా మతపరమైన అల్ప సంఖ్యాక వర్గ లక్షణం సరిపోతోంది. క్రిప్స్ ప్రతిపాదనల్లో ఉన్న అర్థ పరిధిలోనే సమన్వయిస్తుంది. లార్డ్ వేవెల్ గాంధీకి ఏం రాశారో దానినే బ్రిటిష్ ప్రభుత్వం చాలా కాలంగా చెబుతోంది. దాదాపు 1917లో వచ్చిన మాంటేగ్ ఛేమ్స్‌ఫర్డ్ రిపోర్టులోనే ఈ విషయం ఉంది.అప్పుడే భారతీయ రాజకీయ పరిణామానికి బాధ్యత కలిగిన ప్రభుత్వ స్థాపనే ధ్యేయమని ప్రకటించింది. దానిపై బ్రిటిష్ ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకమైన ప్రాతినిధ్యం ఇస్తూ రౌండ్ టేబుల్ సమావేశంలోనూ, జాయింట్ పార్లమెంటరీ సమావేశంలోనూ తీర్మానం చేసింది.

ఫలితంగా 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా' యాక్ట్ ప్రకారంగా 1935లో షెడ్యూల్డ్ కులాలకు హిందువుల కన్నా భిన్నమైన అల్ప సంఖ్యాక వర్గంగా గుర్తించారు. అందుచేత కొన్ని పత్రికలు చేస్తున్న ఈ అసత్య ప్రచారం కేవలం అసూయతో కూడిందని ప్రభుత్వం నిస్సంశయంగా ప్రకటిస్తోంది. ఇది బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయానికి వ్యతిరేకం కాదని, షెడ్యూల్డ్ కులాల విరోధులు పన్నిన పన్నాగమని, షెడ్యూల్డ్ కులాల న్యాయపరమైన హక్కులను కాలరాయటమే ఈ ప్రచార ప్రయోజనమని ప్రకటిస్తోంది. అంతేగాక భారతీయ నాయకులను ముఖ్యంగా హిందూ నాయకులను ఈ విషయాన్ని గుర్తించి, హిందువులకు, షెడ్యూల్డ్ కులాలకు నడుమ శాంతి స్నేహాలు కలిపించి భారత రాజకీయ ధ్యేయం తొందరగా నెరవేరేటట్టు ప్రయత్నించాలని పిలుపు నిస్తోంది.

## తీర్మానం సంఖ్య 2

*విషయ: షెడ్యూల్డ్ కులాల పట్ల రాజ్యాం<sup></sup>గం గురించి బ్రిటిష్ ప్రభుత్వం వారి ప్రకటన.*

అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్యవర్గ సంఘం బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ప్రకటనను ఇటీవల వైస్రాయిగారు పునరుద్ఘాటిస్తూ భారతీయల చేతుల్లోని అధికారాన్ని మార్చటానికి అత్యవసర నియమంగా స్వతంత్ర భారత రాజ్యాంగానికి ఇతర వర్గాల అనుమతితో

పాటు షెడ్యూల్డ్ కులాల అనుమతి కూడా పొందాలని చెప్పడాన్ని ఆహ్వానిస్తోంది. సమయంలో కాంగ్రెస్ మరియు ఇతర పక్షాల ధోరణిని పరిగణించాలని కూడా బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరుతోంది. ఈ రాజకీయ పక్షాలు బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ఈ ప్రకటనను నిజంగా తమను గౌరవించే ఉద్దేశంతో చేసిన ప్రకటనగా కాకుండా కేవలం అధికారాన్ని చేతులు మార్చటాన్ని తాత్కాలికంగా ఆపి వాయిదా వేయటం కోసమే అని భావిస్తున్నారు. బహుశా అత్యధిక సంఖ్యాకులైన పెద్ద వర్గాల వారు షెడ్యూల్డ్ కులాలతో ఒక ఒప్పందానికి రావటానికి ఇష్టపడక పోవటానికి ఇదే కారణం. ఈ ఆరోపణ నిరాధారమైందని భావిస్తూ కార్యవర్గ సంఘం బ్రిటిష్ ప్రభుత్వాన్ని అలాంటి అనుమానాలకు అవకాశం ఇవ్వవద్దని ప్రార్థిస్తూ తాము అన్నివేళల్లో, అన్ని సందర్భాల్లో బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటనకు మద్దతుగా నిలుస్తామని స్పష్టం చేస్తోంది.

## తీర్మానం సంఖ్య 3

*విషయం: రాజకీయ భద్రతల స్వభావం.*

కార్యవర్గం క్రింది నియమాలు లేకపోతే ఏ రాజ్యాంగమైనా షెడ్యూల్డ్ కులాలకు అంగీకార్యం కాబోదని ప్రకటిస్తోంది.

(అ) షెడ్యూల్డ్ కులాల అంగీకారం ఉండాలి.

(ఆ) ఆ రాజ్యాంగం షెడ్యూల్డ్ కులాలను ఒక ప్రత్యేకమైన విలక్షణ వర్గంగా గుర్తించాలి.

(ఇ) క్రింది ప్రయోజనాల్ని సాధించటానికి అవకాశాలు రాజ్యాంగంలో ఉండాలి.

(i) ప్రాంతీయ శాసన ప్రభుత్వాలు బడ్జెట్లలో షెడ్యూల్డ్ కులాల వారి సెకండరీ, యూనివర్సిటీ, మరియు ముందు చదువులకు ఒక నిర్దిష్టమైన మొత్తాన్ని కేటాయించాలి.

(ii) ప్రభుత్వ భూములకు సెటిల్ మెంట్ కమిషన్ ద్వారా షెడ్యూల్డ్ కులాల సెటిల్‌మెంట్స్ కోసం రిజర్వు చేయాలి.

(iii) షెడ్యూల్డ్ కులాల అవసరాన్ని బట్టి, సంఖ్యను బట్టి, ప్రాముఖ్యాన్ని బట్టి క్రింది రంగాలలో ప్రాతినిధ్యం ఉండాలి.

1. శాసన సభల్లో 2. పాలనా యంత్రాంగంలో 3. మున్సిపాలిటీలు, స్వపరిపాలనాసంస్థల్లో 4. ప్రభుత్వ ఉద్యోగాలలో 5. పబ్లిక్ సర్వీస్ కమిషనులో

(iv) పై అవకాశాలను శాసన సభ పరిధిలోకి రాని ప్రాథమిక హక్కులుగా గుర్తించాలి. శాసన సభ కానీ, ఎగ్జిక్యూటివ్ కానీ ఈ హక్కులను సవరించడానికో, మార్చడానికో, నిరాకరించడానికో అవకాశం ఉండరాదు.

(v) 1935 నాటి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టులోని 166వ అధికరణం (సెక్షను) ఆధారంగా నియమించే ఆడిటర్ జనరల్ స్థాయికి సమానమైన స్థాయిగల ఆఫీసర్లను నియమించాలి. ఫెడరల్ కోర్టు జడ్జిని ఏ ఆధారాల మీద, ఏ పద్ధతిలో తొలిగిస్తారో, అదే

పద్ధతిలో ఆ ఆఫీసరును తొలగించ గలిగి ఉండాలి. ప్రాథమి కహక్కుల పరిరక్షణ ఎలా జరుగుతోందో ఆ అవకాశాలను ఆ ఉద్యోగి నివేదించాలి.

## తీర్మానం సంఖ్య 4

*విషయం : జాతుల సమస్య పరిష్కారం*

అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్య వర్గం జాతుల సమస్య పరిష్కార విషయంగా చాలా ఆసక్తితో ఉన్న మాట నిజమే అయినా గాంధీ జిన్నాల నడుమ హిందూ ముస్లింల మధ్య సమస్య పరిష్కారం చేసుకోవటానికి జరుగుతున్న రహస్య సంప్రదింపుల్ని గురించి పట్టించుకోదు కాబట్టి ఇలాంటి ఒప్పందం అపాయకరం. ఇతర వర్గాల్లో తమ ఆశయాల్ని దెబ్బతీసే రీతిలో కపటమైన రహస్య ఒప్పందం చేసుకున్నారన్న భావనను సృష్టిస్తుంది కాబట్టి అపాయకరం. దేశ సామాన్య ప్రయోజనాలకు కూడా ఇది అపాయకరమే -ఎందుకంటే ఇతర జాతులన్నిటి నుంచి ఒక వర్గాన్ని వేరు చేసి వారి రక్షణకు అవసరం లేని అవకాశాల్ని కల్పించటం, అది కూడా వారి 'ఆత్మ గౌరవం' ప్రాతిపదికగా చేయటం తద్వారా ఇతర వర్గాలకన్నా చిన్న స్థాయి వారికి కల్పించి దేశంలో పౌరసత్వ సమానత్వం లేకుండా చేయటం అన్యాయం - కనుక చింతించదగింది. సామాజిక జీవితంలో రహస్యంగా పనులు చేయటాన్ని వ్యతిరేకిస్తామని మాటి మాటికి ప్రకటించిన గాంధీ, హిందూ, ముస్లిం ఒప్పందం విషయంలో తానే ఇలాంటి రహస్య యంత్రాంగం నడపటం పట్ల కార్యవర్గం విస్మయం చెందుతోంది. కనుక జాతుల సమస్యను పరిష్కరించటానికి అన్నివర్గాలకు భద్రతను. సమానమైన మన్ననను కలిగించ గల పద్ధతి ఏమిటంటే ప్రతి వర్గమూ ఇతర వర్గాల ప్రతినిధులతో కలిసి బహిరంగంగా చర్చలు జరపటం ఒక్కటేనని తమ గాఢమైన విశ్వాసమని కార్య వర్గం ప్రకటిస్తోంది.

## తీర్మానం సంఖ్య 5

*విషయం : రాజ్యాంగ సవరణ*

అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్యవర్గం ఇప్పటి రాజ్యాంగం మైనారిటీల ప్రాతినిధ్యానికి సంబంధించినంత వరకు అర్థవంతమైన మార్గనిర్దేశక సూత్రాలనాధారంగా రూపొందింది కాదని అభిప్రాయపడుతున్నది. ఇప్పుడున్న పద్ధతిని పరిశీలిస్తే కొంత మంది మైనారిటీలకు కనీసం వారి జనసంఖ్యా నిష్పత్తి మేరకు కూడా ప్రాతినిధ్యం లేకపోగా చారిత్రకంగా సైనిక ప్రాధాన్యం ఉన్నదన్న నెపంతో కొన్ని మైనారిటీలకు వారి జనసంఖ్యా నిష్పత్తికన్నా అధికమైన ప్రాధాన్యం ఇచ్చారు. ఇలా కొన్ని వేల జాతుల క్లెయిములను గుర్తించి వారికి గుర్తింపు నివ్వటం ఇతర మైనారిటీల ఆశయాలను దెబ్బతీస్తుంది. అంతేకాకుండా భారతీయుల ధ్యేయమైన సామాజిక రాజకీయ ప్రజాస్వామ్య భావనతో ఇది సమన్వయించదు. కనుక ఇది క్షమించరానిది. ఈ సందర్భంగా మాంటేగు ఛేమ్స్‌ఫర్డ్ నివేదకలోనూ, సైమన్

కమీషన్ నివేదికలోనూ ఇలా కొంతమంది మైనారిటీలకు అధిక ప్రాధాన్యం ఇచ్చే చూపే తప్పుని ఖండించటాన్ని కమిటీ గుర్తు చేస్తోంది. ఇండియాలో భవిష్యత్తులో రాబోయే రాజ్యాంగం సర్వస్వతంత్రమైన భారత సామ్రాజ్యానికి కాబట్టి మైనారిటీలకు సంబంధించిన నింబంధనలను సవరించాలని తద్వారా మైనారిటీలందరికీ సమానమైన పరిగణన లభించేలా ఉండాలని డిమాండు చేస్తోంది.

## తీర్మానం సంఖ్య 6

*విషయం: శాసన సభల్లోనూ, అధికార రంగంలోనూ ప్రాతినిధ్యం*

..... కార్యవర్గం ఒక జాతికి మరో జాతికీ ఏ విధమైన వివక్షను చూపటాన్ని షెడ్యూల్డ్ కులాలు సహించబోవని ఖరాఖండిగా నొక్కి వక్కాణిస్తోంది. ప్రాంతీయ కేంద్రీయ శాసన సభల్లో మరియు అధికారరంగంలో ముస్లిం వర్గానికి ఏ ప్రాతిపధికమేరకు ఏ పద్ధతిలో ప్రాతినిధ్యం ఇస్తారో అదే విధంగా తమకు కూడా సీట్ల కేటాయింపు ఉండాలన్న హక్కును మరలా నొక్కిచెబుతున్నాయి.

## తీర్మానం సంఖ్య 7

*విషయం: నియోజక వర్గాలు*

గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ ప్రకారంగా గతంలో జరిగిన ఎన్నికల్లో వచ్చిన అనుభవం దృష్టిలో ఉమ్మడి నియోజకవర్గాల పద్ధతి చేత షెడ్యూల్డ్ కులాల వాళ్ళు నిజమైన ప్రభావవంతులైన తమ ప్రతినిధుల్ని శాసన సభకు పంపుకోలేక పోయారు. అత్యధికులైన హిందువులు తామే షెడ్యూల్డ్ కులాల ప్రతినిధుల్ని నామినేట్ చేసే హక్కును పొందారు. అలా నామినేట్ చేయబడిన ప్రతినిధులు హిందువుల చేతిలో పనిముట్లుగా ఉపయోగ పడటానికి అంగీకరించిన వారే. కనుక ఉమ్మడి నియోజకవర్గాలను, సీట్ల రిజర్వేషన్ల పద్ధతిని వెంటనే రద్దు చేయాలని ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటు చేయాలని డిమాండు చేస్తోంది.

## తీర్మానం సంఖ్య 8

*విషయం: అధికారం ప్రభుత్వం రంగ నిర్మాణం .*

...... ఇండియాలో సంపద, ఆస్తి, వ్యాపారం, పరిశ్రమలు మాత్రమే కాకుండా రాజ్యపాలనా వ్యవస్థ మొత్తం మెజారిటీ జాతి చేతిలోనే ఉంది. పాలనా యంత్రాంగంలో పదవులన్నీ వారి గుత్తాధిపత్యంలో ఉంది. ఈ విషయాన్ని గుర్తిస్తూ కార్యవర్గం ఇది అపాయకరమైన స్థితి అని దీని ద్వారా మైనారిటీ జాతుల్లో పెద్ద భయాందోళనలు చెల

రేగుతాయని, ఈ పరిస్థితులన్నీ కలిసి మెజారిటీ వర్గాలకు సంపూర్ణమైన బలం ఏర్పడి మైనారిటీల గొంతు నులిమి వేయ గల శక్తి లభిస్తుందని భావిస్తోంది. దీనికి తోడుగా 1935నాటి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ ప్రకారం పాలనా యంత్రాంగం ఏర్పరచటానికి చేసిన రాజ్యాంగ నిబంధనలననుసరించి మైనారిటీల కోరికతో నిమిత్తం లేకుండానే మెజారిటీలు ప్రభుత్వాన్ని ఏర్పరచుకో వచ్చునన్న నియమం ఈ భయాన్నిమరింత బిగుసుకునేలా చేస్తోంది. మరొక పద్ధతి లేక పార్లమెంటరీ వ్యవస్థతోటి ప్రభుత్వాన్ని ఒప్పుకోవలసి వస్తే మెజారిటీ జాతులకే పాలానాధికారాన్ని కట్టబట్టి పార్లమెంటరీ కాబినేట్ పద్ధతిని షెడ్యూల్డ్ కులాల కార్య వర్గం నిస్సందేహంగా వ్యతిరేకిస్తుంది. ఎందుకంటే ఈ పద్ధతి వల్ల మెజారిటీ జాతులబలం పెరిగి పోతుంది. అది ఇప్పుడే ఉక్కుచట్టం లాంటి పాలనా యంత్రాంగాన్ని సృష్టించి మైనారిటీలకు భయకారణంగా ఉంది. అందువల్ల పార్లమెంట్ కాబినేట్వ్యవస్థ భారతీయ పరిస్థితులకు సరిపోదని మైనారిటీల కోరికలను దృష్టిలో ఉంచుకొని వారికి మంచి భద్రత కలిగించే విధంగా మరో భిన్నమైన పాలనా యంత్రాంగం ఉన్న ప్రభుత్వం ఏర్పడాలని కమిటీ ఒక నిర్ణయానికి వచ్చింది.

క్రింది పద్ధతిలో రాష్ట్రాలలోనూ, కేంద్రంలోనూ పాలనా యంత్రాంగం ఏర్పడాలని కమిటీ పట్టుబడుతోంది.

(i) రాజ్యాంగంలో సూచించిన ప్రకారం సాధారణ జాతుల నుండి, మైనారిటీల నుండి నిష్పత్తి క్రమంలో మంత్రులతో ప్రధాన మంత్రులతో పాలక వర్గం ఏర్పడాలి.

(ii) ప్రధాన మంత్రి మరియు సాధారణ జాతుల నుంచి ఎన్నుకోబడిన మంత్రులు మొత్తం సభ అంతటి చేత 'సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోటు' ద్వారా ఎన్నుకోబడాలి.

(iii) ఇక మైనారిటీ కమ్యూనిటీలకు ప్రాతినిధ్యం వహించే మంత్రులు ఆయా భిన్నజాతుల ప్రతినిధుల చేత 'సింగిల్ ట్రాన్స్ఫరబుల్' వోటు పద్ధతిలో ఎన్నుకోబడాలి.

(iv) పాలక వర్గానికి చెందిన సభ్యులు శాసన సభాసభ్యులై ఉండాలి. వారేప్రశ్నలకు సమాధానాలు చెబుతారు. వోటు వేస్తారు. చర్చల్లో పాల్గొంటారు.

(v) పాలక వర్గంలో ఏదైనా ఖాళీ ఏర్పడితే ఆయా ఉద్యోగాల మౌలిక నియామక సూత్రాలను బట్టి భర్తీ చేయాలి.

(vi) శాసన సభ పదవీ కాలం ఎంత ఉంటుందో పాలక వర్గం పదవీ కాలం కూడా అంతే ఉండాలి - (అది ముగియగానే ఇది కూడా పూర్తవ్వాలి).

## తీర్మానం సంఖ్య 9

*విషయం: పబ్లిక్ ఉద్యోగాలు*

మనుష్యుల మీద ఆధార పడకుండా కొన్ని న్యాయ సూత్రాల మీదే ఆధారపడ్డ ప్రభుత్వాన్ని ఏర్పచగోరటం వాంఛనీయమే అయినా ప్రభుత్వాన్ని ఎలా ఏర్పాటు చేసినా

అది మనుష్యుల ప్రభుత్వమే కావాలన్న విషయాన్ని మరువ కూడదు. ఇదిలా ఉండగా ఒక ప్రభుత్వం సఫలీకృతమైన ప్రభుత్వమా కాదా అన్నది కాకుండా అది మంచిదా చెడ్డదా అన్న ప్రశ్న కాని, ప్రజాపాలన ఎంత వరకు రాజకీయ పక్షాతీతంగా, నిష్పక్షపాతంగా ఉందన్న విషయంగానీ, న్యాయ పాలకులుగా నియమింప బడిన వారి ఉత్సాహాన్ని బట్టి,దృష్టిని బట్టి, న్యాయవృద్ధిని బట్టి ఉంటుంది. కాబట్టి కుల స్పృహతో, సంకుచిత బుద్ధితో ధార్మిక చింతన లేని మనుషులతో కూడి ఉన్న ప్రస్తుతపాలనాంగం చేతిలో షెడ్యూల్డ్ కులాల వారు ఎన్నటికీ రక్షణను కానీ, న్యాయాన్ని కానీ, సానుభూతిని కానీ పొందలేరు. వారికి షెడ్యూల్డ్ కులాల పై ద్వేషం, తక్కువ చూపు మాత్రమే ఉన్నాయని స్పష్టమై పోయింది. కనుకషెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్య వర్గం పబ్లిక్ సర్వీసులలో ముస్లిం జాతికి ఏ నిష్పత్తిలో ఉద్యోగాల రిజర్వేషన్ ఉందో, అదే నిష్పత్తిలో రిజర్వేషన్ పొందే హక్కుందని డిమాండ్ చేస్తోంది.

## తీర్మానం సంఖ్య 10

*విషయం : విద్యకు అవకాశం*

షెడ్యూల్డ్ కులాలకు సంబంధించిన ప్రజలు పాలనాధికారమున్న ఉద్యోగాలను ఆక్రమిస్తే షెడ్యూల్డ్ కులాల వారు అటు ప్రభుత్వం చేతిలోనూ ఇటు ప్రజల చేతిలోనూ తరతరాల నుంచి అనుభవిస్తున్నట్టి అవమానాన్ని ఆగ్రహాన్ని సహిస్తూ పోవాల్సిఉంటుంది అని షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్య వర్గం భావిస్తోంది. కనుక ఉన్నత విద్యలను, అభివృద్ధి చదువులను షెడ్యూల్డ్ కులాల వారిలో వృద్ధి చేయటం చాలా ప్రధానమైన విషయమని గుర్తిస్తోంది. కానీ అలాంటి ఉన్నత విద్యలు నేర్చుకునే స్థితిలో షెడ్యూల్డ్ కులాల వారు లేరన్న విషయంలోని ప్రతిపత్తి లేదు. కనుక ప్రభుత్వం నిర్దిష్టమైన బాధ్యతను తీసుకొని రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు తగినంత మొత్తాలను రాజ్యాంగ నిబంధనల మేరకు వేరుగా కేటాయించేలా రాజ్యాంగం నిర్దేశించేటట్లు చూడాలి. ఈ డబ్బును ఆయా వార్షిక బడ్జెట్లలో షెడ్యూల్డ్ కులాల విద్యార్థుల ఉన్నత విద్యాభివృద్ధి కోసమే ఆయా సంవత్సరాదాయాలలో మొదటి ఖర్చుగా నిబంధన చేయాలి.

## తీర్మానం సంఖ్య 11

*విషయం: ప్రత్యేక నివాసాలు*

షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్యవర్గం, కింది విధంగా అభిప్రాయపడుతోంది.

(అ) హిందువుల గ్రామ సరిహద్దుల్లో ఒక విజాతీయుల్లాగా బ్రతుకు తెరువులేని వారుగా విసిరి వేసినట్టు అల్పసంఖ్యాకులుగా బ్రతికినంత కాలం వాళ్ళు అస్పృశ్యులుగానే కొనసాగుతారు. హిందువుల నిరంకుశత్వం, అణచివేత యధేచ్ఛగా జరుగుతూనే ఉంటాయి. వారికి స్వేచ్ఛతో కూడిన సంపూర్ణ జీవనం ఉండదు. ఇంతే కాకుండా

(అ) ఉన్నత హిందువుల నిరంకుశత్వం నుంచి, అణచి వేత నుంచి షెడ్యూల్డ్ కులాలను కాపాడటం, స్వరాజ్యంలో ఇంకా కష్టం కావచ్చు. అందచేత వారు సంపూర్ణ మానవులుగా ఎదగటానికి వారికి కావాల్సిన ఆర్థిక సామాజిక భద్రతలు కలిగించటానికి తద్వారా అస్పృశ్యతను రూపుమాపటానికి కార్య వర్గం రాజ్యాంగంలో క్రింది నిబంధనలు చేర్చాలని డిమాండ్ చేస్తున్నారు.

(1) ఇప్పుడున్న నివాసాల నుంచి వారిని కదిలించి హిందూ గ్రామాలతో దూరంగా షెడ్యూల్డ్ కులస్థుల గ్రామాలను ఏర్పరచటం.

(2) ఇలా ఏర్పడ్డ కొత్త గ్రామాలలో నివసించటానికి తగిన అవకాశాలు కలిగించే స్పెషల్ సెటిల్ మెంట్ కమీషన్‌ను రాజ్యాంగంలో ఏర్పరచాలి.

(3) వ్యవసాయానికి యోగ్యమై ఇతరుల చేత ఆక్రమింపబడినది, వశపరచుకోగలిగినది అయిన ప్రభుత్వ భూములను కమీషన్‌కు అప్పగించి వారి ద్వారా షెడ్యూల్డ్ కులాల వారికి కొత్త నివాసాలను కేటాయించాలి.

(4) లాండ్ అక్విజిషన్ యాక్ట్ కింద వ్యక్తిగత హక్కుదారుల నుండి భూములనుకొని షెడ్యూల్డ్ కులాల నివేశన పథకాన్ని పూర్తి చేసే అధికారం కమీషన్‌కుండాలి.

(5) సెటిల్ మెంట్ కమీషను కోసం కేంద్ర ప్రభుత్వం నుంచి కనీసం 5కోట్ల రూపాయలైనా మంజూరు చేయడానికి రాజ్యాంగంలో అవకాశం చూపించి ఆ కార్యక్రమం నెరవేరేలా చూడాలి.

## తీర్మానం సంఖ్య 12

అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య కార్యవర్గం షెడ్యూల్డ్ కులాల తరపున ఇతర రాజకీయ పక్షాలతో, నాయకులతో, ఆయా అవసరాన్ని బట్టి సంప్రదింపులు జరపడానికి సంపూర్ణ విశ్వాసంతో డా. బి. ఆర్. అంబేద్కర్ గారిని నియమించడానికి ఏకగ్రీవంగా తీర్మానిస్తోంది.

# అనుబంధం XII

## బ్రిటీష్ ఇండియాలోని పరగణాలలోని మైనారిటీలకు చెందిన కులాల జనసంఖ్య వ్యాప్తి

| పరగణా | మొత్తం జనాభా | ముస్లింలు | | షెడ్యూల్డ్ కులాలు | | ఇండియన్ క్రిస్టియన్లు | | సిక్కులు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | జనాభా | శాతం | జనాభా | శాతం | జనాభా | శాతం | జనాభా | శాతం |
| అజ్మీర్ మేర్వారా | 5,83. 693 | 89, 899 | 15.4 | నిల్ | - | 3, 895 | .8 | 867 | .15 |
| అండమాన్ నికోబార్ | 33, 768 | 8, 005 | 23.7 | నిల్ | - | 779 | 2. 3 | 744 | 2. 2 |
| అస్సాం | 1,02,04, 733 | 34,42, 479 | 33.7 | 6.76, 291 | 6. 6 | 37, 750 | .4 | 3, 464 | .03 |
| బ్రిటిష్ బెలూచిస్తాన్ | 5.01, 631 | 4,38, 930 | 87.5 | 5,102 | 1.0 | 2, 633 | .5 | 11 918 | 2. 3 |
| బెంగాల్ | 6,03,06, 525 | 3,30,05, 434 | 54.7 | 78,78, 970 | 13. 0 | 1,10, 923 | .2 | 16 281 | .03 |
| బీహార్ | 3,63,40. 151 | 47,16, 314 | 12.9 | 48,40. 379 | 13. 3 | 24, 693 | .07 | 13 213 | .04 |
| బొంబాయి | 2,08,49, 840 | 19,20, 368 | 9.2 | 18,55. 148 | 8 .9 | 3.38, 812 | 1.6 | 8 011 | .04 |
| మధ్య పరగణాలు బేరార్ | 1,68,13, 584 | 7,83, 697 | 4.7 | 30,51, 413 | 18. 1 | 48, 260 | .3 | 14 996 | .09 |
| కూర్గ్ | 1,68, 726 | 14, 780 | 8.8 | 25, 740 | 15. 3 | 3, 309 | 2.0 | నిల్ | - |
| ఢిల్లీ | 9,17 ,939 | 304 971 | 33 2 | 1 21 693 | 13. 3 | 10, 494 | 1.i | 16 157 | 1. 8 |
| మద్రాసు | 49, 341, 810 | 38,96, 452 | 7.9 | 8 068 492 | 16. 4 | 20,01,082 | 4.06 | 418 | .001 |
| ఎన్.డబ్ల్యూ.ఎఫ్.సి | 30,38, 067 | 27,88, 797 | 91.8 | నిల్ | - | 5, 426 | .2 | 57 989 | 1. 9 |
| ఒరిస్సా | 87,28, 544 | 1,46, 301 | 1.7 | 12,38, 171 | 14. 2 | 25, 584 | .3 | 232 | .003 |
| పంజాబు | 2.84,18, 819 | 1,62,17, 242 | 57.0 | 12,48, 635 | 4 .4 | 4,86, 038 | 1. 7 | 3 757 401 | 13. 2 |
| పంత్ పిప్లోడా | 5, 267 | 251 | 4.8 | 918 | 17. 4 | 216 | 4. 1 | నిల్ | - |
| సింద్ | 42,29, 221 | 30,54, 635 | 72.2 | 1, 91, 634 | 4. 5 | 13, 232 | .3 | 31 011 | .7 |
| సంయుక్త పరగణాలు | 5,50,20, 617 | 84,16, 308 | 15.3 | 1,17,17, 158 | 21. 3 | 1,31,327 | .2 | 232 445 | .4 |
| మొత్తం | 29,55,02, 935 | 7,93,44, 863 | 26.9 | 4,09,19, 744 | 13. 9 | 32,45, 453 | 1 | 4 155 147 | 1 |
| బీహారు | 2,88,23, 802 | 41,68, 470 | 14.4 | 39,19, 619 | 13. 6 | 12, 651 | .04 | 3 204 | .01 |
| ఛోటానాగ్‌పూర్ | 75,16, 349 | 5,47, 844 | 7.3 | 4,20, 760 | 5. 6 | 12, 042 | .2 | 10 009 | .1 |
| మధ్య పరగణాలు | 1,32,08, 718 | 4,48, 528 | 3.4 | 23,59, 836 | 17. 9 | 42, 135 | .3 | 12 766 | .1 |
| బేరార్ | 36,04, 866 | 3,35, 169 | 9.3 | 6,91, 577 | 19. 2 | 6, 125 | .2 | 2 230 | .05 |
| ఆగ్రా | 4,09,06, 147 | 62,31, 062 | 15.2 | 80,18, 803 | 19. 6 | 1,20,549 | .3 | 226 096 | .5 |
| అయోధ్య | 14,11,4 ,470 | 21,85, 246 | 15.5 | 36,98, 355 | 26. 2 | 10, 778 | .08 | 6 349 | .05 |

# అనుబంధం XIII

## భారతీయ రాష్ట్రాలలో మైనారిటీ కులాల జనసంఖ్య వ్యాప్తి

| రాష్ట్రం, ఏజెన్సీ | మొత్తం జనాభా | ముస్లింలు | | షెడ్యూల్డ్ కులాలు | | ఇండియన్ క్రిస్టియన్లు | | సిక్కులు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | జనాభా | శాతం | జనాభా | శాతం | జనాభా | శాతం | జనాభా | శాతం |
| అస్సాం | 725, 655 | 31,662 | 4.4 | 265 | .04 | 25, 913 | 3.6 | 381 | .05 |
| బెలుచిస్తాన్ | 356, 204 | 3,46,251 | 97.2 | 65 | .02 | 40 | .01 | 126 | .04 |
| బరోడా | 2, 855, 010 | 223, 610 | 7.8 | 230, 794 | 8.1 | 9, 182 | .3 | 566 | .02 |
| బెంగాలు | 2, 144, 829 | 372, 113 | 17.3 | 269, 729 | 12.6 | 564 | .03 | 28 | .001 |
| మధ్య భారతం | 7, 506, 427 | 439, 850 | 5.9 | 1, 027, 009 | 13.7 | 7, 582 | .1 | 2,.731 | .04 |
| ఛత్తీస్‌ఘడ్ | 4, 050, 000 | 28 ,773 | 0.7 | 483, 132 | 11.9 | 11,820 | .3 | 507 | .01 |
| కొచ్చిన్ | 1, 422, 875 | 109, 188 | 7.7 | 141, 154 | 9.9 | 399, 394 | 28.1 | 9 | - |
| దక్కన్ కొల్లాపూర్ | 2, 785, 428 | 182, 036 | 6.5 | 306, 898 | 11.0 | 17, 236 | .6 | 22 | .001 |
| గుజరాత్ | 1, 458, 702 | 58, 000 | 3.9 | 55, 204 | 3.8 | 4, 215 | .3 | 182 | .01 |
| గ్వాలియర్ | 4, 006, 159 | 240, 903 | 6.0 | - | - | 1, 352 | .03 | 2, 342 | .06 |
| హైదరాబాదు | 16, 338, 534 | 2, 097, 475 | 12.8 | 2, 928, 048 | 17.9 | 215, 989 | 1.3 | 5, 330 | .03 |
| కాశ్మీర్, ఫ్యూడెటరీలు | 4, 021, 616 | 3, 073, 540 | 76.4 | 113, 464 | 2.8 | 3, 079 | .08 | 65, 903 | 1.6 |
| మద్రాసు | 498, 754 | 30, 263 | 6.0 | 83, 734 | 16.8 | 20, 806 | 4.2 | 5 | - |
| మైసూరు | 7, 329, 140 | 485, 230 | 6.6 | 1, 405, 067 | 19.2 | 98, 580 | 1.3 | 269 | .004 |
| ఎన్.డబ్ల్యు.ఎఫ్.సి | 46, 267 | 22, 068 | 47.7 | - | - | 571 | 1.2 | 4, 472 | 9.1 |
| ఒరిస్సా | 3, 023, 731 | 14, 355 | 0.47 | 352, 088 | 11.6 | 2, 249 | .07 | 151 | .005 |
| పంజాబు | 5, 503, 554 | 2, 251, 459 | 40.9 | 349, 962 | 6.4 | 6, 952 | .1 | 1, 342, 685 | 24.4 |
| పంజాబు కొండలు | 1, 090, 644 | 46, 678 | 4.3 | 238, 774 | 21.9 | 188 | .02 | 17, 739 | 1.6 |
| రాజ్‌పుటానా | 13, 670, 208 | 1, 297, 841 | 9.5 | - | - | 4, 349 | .03 | 81, 896 | .6 |
| సిక్కిం | 121, 520 | 83 | 0.07 | 76 | 0.6 | 34 | .03 | 1 | - |
| తిరువాన్కూరు | 6, 070, 018 | 434, 150 | 7.2 | 395,952 | 6.5 | 1, 958, 491 | 32.3 | 31 | - |
| సంయుక్తపరగణాలు | 928, 470 | 273, 625 | 29.5 | 152, 927 | 16.5 | 1, 281 | .1 | 731 | .08 |
| పశ్చిమ భారతం | 4, 904, 156 | 600, 440 | 12.2 | 358, 038 | 7.3 | 3, 105 | 0.6 | 239 | .005 |
| మొత్తం = | 90, 857, 901 | 12, 659, 593 | 13.9 | 8, 892, 380 | 9.7 | 2, 792, 972 | 3.1 | 1, 526, 346 | 1.7 |

# అనుబంధం XIV

పరగణాల వారీగా, సీట్లు, వోటింగ్ బలం దృష్టులతో షెడ్యూల్డ్ కులాల నియోజక వర్గాల వివరాలు :-

అనుబంధం XIV (1) మద్రాసు

" " (2) బొంబాయి

" " (3) బెంగాల్

" " (4) సంయుక్త పరగణాలు (యు.పి)

" " (5) పంజాబ్

" " (6) బీహార్

" " (7) మధ్య పరగణాలు (సి.పి.) మరియు బేరార్

" " (8) అస్సాం

" " (9) ఒరిస్సా

## అనుబంధం XIV (1) మద్రాసు

| నియోజక వర్గం | నియోజకవర్గంలోని మొత్తం సీట్లు | | అభ్యర్థుల సంఖ్య | | మొత్తం ఓటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | షె.కు. ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| మద్రాసు నగరం | 1 | 1 | 4 | 1 | 13, 318 | 2, 909 | 22 |
| చికాకోల్ | 1 | 1 | 4 | 4 | 54, 012 | 7, 461 | 14 |
| అమలాపురం | 1 | 1 | 2 | 3 | 46, 163 | 23, 110 | 50 |
| కాకినాడ | 1 | 1 | 3 | 1 | 50, 384 | 12, 066 | 24 |
| ఏలూరు | 1 | 1 | 3 | 3 | 45, 452 | 11, 463 | 25 |
| బందరు | 1 | 1 | 2 | 3 | 77, 627 | 13, 314 | 17 |
| ఒంగోలు | 1 | 1 | 2 | 2 | 67, 851 | 10,885 | 16 |
| గూడూరు | 1 | 1 | 2 | 4 | 35, 094 | 7, 436 | 21 |
| కడప | 1 | 1 | 2 | 3 | 74, 497 | 10, 630 | 14 |
| పెనుకొండ | 1 | 1 | 2 | 2 | 54, 864 | 11, 396 | 21 |
| బళ్ళారి | 1 | 1 | 3 | 2 | 63, 092 | 9, 232 | 15 |
| కర్నూలు | 1 | 1 | 2 | 4 | 53, 687 | 13, 433 | 25 |
| తిరుత్తని | 1 | 1 | 2 | 2 | 52, 875 | 6, 350 | 12 |
| చెంగల్పట్టు | 1 | 1 | 2 | 2 | 46, 237 | 19, 366 | 42 |
| తిరువల్లూరు | 1 | 1 | 2 | 3 | 57, 029 | 21, 033 | 37 |
| రాణీపేట | 1 | 1 | 3 | 4 | 53, 632 | 10, 370 | 19 |
| తిరువణ్ణా మలై | 1 | 1 | 3 | 4 | 67, 861 | 16, 705 | 25 |
| దిండివనం | 1 | 1 | 3 | 4 | 63, 485 | 19, 500 | 31 |
| చిదంబరం | 1 | 1 | 3 | 1 | 68, 713 | 19, 947 | 29 |
| తిరుక్కోయిలూర్ | 1 | 1 | 2 | 2 | 75, 874 | 22, 986 | 30 |
| తంజావూరు | 1 | 1 | 1 | 1 | 78, 874 | 14, 718 | 19 |
| మన్నార్ గుడి | 1 | 1 | 3 | 4 | 45, 283 | 11,767 | 26 |
| అరియలూర్ | 1 | 1 | 2 | 3 | 85, 125 | 16, 076 | 19 |
| పళని | 1 | 1 | 1 | 2 | 60, 453 | 11, 400 | 19 |
| సాతూరు | 1 | 1 | 2 | 2 | 58, 648 | 6, 843 | 12 |
| కోయిల్‌పట్టి | 1 | 1 | 2 | 3 | 59, 101 | 12, 526 | 21 |
| పొల్లాచ్చి | 1 | 1 | 2 | 4 | 39, 239 | 12, 919 | 32 |
| నామకల్ | 1 | 1 | 2 | 2 | 43, 437 | 14, 561 | 34 |
| కుందాపూర్ | 1 | 1 | 2 | 3 | 35, 679 | 8, 843 | 25 |
| మల్లప్పురం | 1 | 1 | 2 | 3 | 47, 299 | 10 355 | 22 |

## అనుబంధం XIV (2) బొంబాయి

| నియోజక వర్గం పేరు | నియోజక వర్గంలోని మొత్తం సీట్లు | | మొత్తం అభ్యర్థుల సంఖ్య | | మొత్తం వోటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | షె.కు ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | |
| బొంబాయి నగరం (ఉ) & సబర్బన్ డిస్ట్రిక్టు | 2 | 1 | 6 | 4 | 61, 831 | 9, 880 | 16 |
| బొంబాయి నగరం (బైకుల్లా పరేల్) | 2 | 1 | 4 | 3 | 71, 100 | 10, 486 | 15 |
| కారైజిల్లా | 3 | 1 | 4 | 1 | 92, 388 | 6, 231 | 7 |
| సూరత్ జిల్లా | 3 | 1 | 6 | 4 | 51, 711 | 3, 929 | 8 |
| థాణా (దక్షిణం) | 2 | 1 | 3 | 3 | 42, 003 | 2, 263 | 5 |
| అహమ్మద్ నగర్ (దక్షిణం) | 2 | 1 | 4 | 3 | 36, 065 | 4, 814 | 13 |
| తూర్పు ఖాందేష్ | 3 | 1 | 7 | 4 | 56, 733 | 4, 842 | 9 |
| నాసిక్ (పశ్చిమం) | 3 | 1 | 7 | 2 | 44, 517 | 8, 881 | 20 |
| పూనా (పశ్చిమం) | 2 | 1 | 4 | 2 | 43, 147 | 7, 206 | 17 |
| సతారా (ఉత్తరం) | 3 | 1 | 5 | 4 | 57, 839 | 6, 692 | 12 |
| షోలాపూర్ (ఈశాన్య) | 2 | 1 | 6 | 4 | 36, 210 | 6, 741 | 19 |
| బెల్గాం (ఉత్తరం) | 3 | 1 | 6 | 4 | 49, 507 | 12, 493 | 25 |
| బీజాపూర్ (ఉత్తరం) | 2 | 1 | 4 | 4 | 42, 301 | 7, 525 | 18 |
| కొలాబా జిల్లా | 3 | 1 | 7 | 3 | 59, 490 | 4, 804 | 8 |
| రత్నగిరి (ఉత్తరం) | 3 | 1 | 8 | 3 | 21, 908 | 3, 961 | 18 |

## అనుబంధం XIV 3 బెంగాలు

| నియోజక వర్గం పేరు | నియోజక వర్గంలోని మొత్తం సీట్లు | | అభ్యర్థుల సంఖ్య | | మొత్తం ఓటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | షె.కు. ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| బర్ద్వాన్ (మధ్య) | 1 | 1 | 2 | 3 | 35, 294 | 14, 450 | 41 |
| బర్ద్వాన్ (వా) | 1 | 1 | 2 | 3 | 41, 817 | 8 ,693 | 21 |
| బీర్ భూం | 1 | 1 | 3 | 3 | 52, 569 | 18, 506 | 35 |
| బంకురా (ప) | 1 | 1 | 1 | 4 | 44, 115 | 19, 272 | 44 |
| మిద్నపూర్ (మధ్య) | 1 | 1 | 2 | 2 | 75, 903 | 19, 664 | 26 |
| ఝర్‌గ్రామ్ (+ఘటల్) | 1 | 1 | 2 | 4 | 40, 596 | 9,917 | 24 |
| హుగ్లీ (ఈశాన్య) | 1 | 1 | 3 | 3 | 35, 500 | 12, 254 | 35 |
| హౌరా | 1 | 1 | 2 | 3 | 68, 526 | 22, 470 | 33 |
| 24 పరగణాలు (ఆగ్నేయం) | 1 | 1 | 3 | 3 | 29, 342 | 37, 556 | 128 |
| 24 పరగణాలు " (వాయవ్య) | 1 | 1 | 2 | 4 | 42, 214 | 24, 404 | 58 |
| నాడియా | 1 | 1 | 2 | 4 | 53, 247 | 20, 957 | 39 |
| ముర్షిదాబాద్ | 1 | 1 | 2 | 3 | 46, 122 | 11, 692 | 25 |
| జెస్సోర్ | 1 | 1 | 4 | 2 | 50, 966 | 43, 425 | 85 |
| ఖుల్నా | 1 | 2 | 3 | 6 | 41, 639 | 54, 530 | 131 |
| మాల్దా | 1 | 1 | 2 | 4 | 30, 916 | 22, 728 | 74 |
| దీనజ్‌పూర్ | 1 | 2 | 1 | 2 | 25, 985 | 89, 880 | 346 |
| జల్‌పాయగురి (+ సొలిగురి) | 1 | 2 | 3 | 8 | 9, 074 | 54, 657 | 602 |
| రంగపూర్ | 1 | 2 | 2 | 5 | 21, 497 | 68, 759 | 320 |
| బోగ్రా (+పబ్నా) | 1 | 1 | 3 | 4 | 41, 539 | 31, 459 | 76 |
| ఢక్కా (తూర్పు) | 1 | 1 | 2 | 4 | 38, 810 | 36, 749 | 95 |
| మైమేన్ సింగ్ (పశ్చిమ) | 1 | 1 | 2 | 4 | 47, 974 | 30 ,036 | 63 |
| మైమేన్ సింగ్ (తూర్పు) | 1 | 1 | 2 | 4 | 42,237 | 29, 745 | 70 |
| ఫరీద్‌పూర్ | 1 | 2 | 2 | 8 | 63,532 | 73, 946 | 116 |
| బాక్రాగంజ్ (నై) | 1 | 1 | 1 | 4 | 23, 477 | 37, 895 | 161 |
| తిప్పేరా | 1 | 1 | 3 | 4 | 65, 898 | 27, 475 | 41 |

## అనుబంధం XIV (4) సంయుక్త పరగణాలు (యు.పి)

| నియోజక వర్గం పేరు | మొత్తం సీట్ల సంఖ్య | | అభ్యర్థుల సంఖ్య | | మొత్తం ఓటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | షె.కు.ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| లక్నో నగరం | 1 | 1 | 3 | 4 | 29, 133 | 6, 821 | 23 |
| కాన్పూర్ నగరం | 1 | 1 | 2 | 4 | 49, 485 | 14, 462 | 29 |
| ఆగ్రా నగరం | 1 | 1 | 2 | 4 | 27, 805 | 6 ,103 | 22 |
| అలహాబాదు నగరం | 1 | 1 | 1 | 4 | 27, 313 | 6 ,503 | 24 |
| సగరాన్‌పూర్ జిల్లా | 1 | 1 | 2 | 2 | 27, 053 | 3 ,720 | 14 |
| బులంద్ షహర్ జిల్లా | 1 | 1 | 4 | 3 | 32, 434 | 4 ,648 | 14 |
| ఆగ్రా జిల్లా | 1 | 1 | 3 | 4 | 33, 230 | 4 ,476 | 13 |
| మెయిన్ పురి జిల్లా | 1 | 1 | 3 | 4 | 41, 044 | 5 ,356 | 13 |
| బుడాన్ జిల్లా | 1 | 1 | 4 | 4 | 32, 763 | 7 ,558 | 23 |
| జతౌ జిల్లా | 1 | 1 | 2 | 4 | 40, 862 | 10, 356 | 25 |
| మీర్జాపూర్ జిల్లా | 1 | 1 | 2 | 1 | 26, 803 | 2 ,969 | 11 |
| గోరఖ్ పూర్ జిల్లా | 1 | 1 | 2 | 4 | 25, 113 | 3, 697 | 15 |
| బస్తి జిల్లా | 1 | 1 | 2 | 1 | 27, 193 | 4 ,143 | 15 |
| అజాంఘర్ జిల్లా | 1 | 1 | 3 | 2 | 36, 541 | 7, 231 | 20 |
| అర్మోరా జిల్లా | 1 | 1 | 3 | 1 | 93, 380 | 17, 809 | 19 |
| రాయ్ బరేలీ జిల్లా | 1 | 1 | 2 | 1 | 38, 320 | 10, 829 | 28 |
| సీతాపూర్ జిల్లా | 1 | 1 | 3 | 3 | 45, 130 | 10, 868 | 42 |
| ఫైజాబాద్ జిల్లా | 1 | 1 | 4 | 2 | 46, 337 | 10, 035 | 22 |
| గోండా జిల్లా | 1 | 1 | 2 | 1 | 47, 666 | 7, 428 | 16 |
| బర్‌బాంకీ జిల్లా | 1 | 1 | 2 | 4 | 41, 957 | 14, 649 | 35 |

## అనుబంధం XIV (5) పంజాబు

| నియోజక వర్గం పేరు | మొత్తం సీట్ల సంఖ్య | | అభ్యర్థుల సంఖ్య | | ఓటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు | సాధారణం | షె.కు | షె.కు.ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 3 | 5 | 6 | 7 | 8 |
| గురుగావ్ (ఆగ్నేయం) | 1 | 1 | 4 | 1 | 27, 177 | 2, 842 | 10 |
| కర్నల్ (ఉత్తరం) | 1 | 1 | 4 | 3 | 23, 224 | 2, 698 | 12 |
| అంబాలా సిమ్లా | 1 | 1 | 5 | 3 | 26, 918 | 7, 611 | 28 |
| హోషియాపూర్ (పశ్చిమం) | 1 | 1 | 2 | 4 | 27, 589 | 11, 701 | 42 |
| జలంధర్ | 1 | 1 | 2 | 4 | 12, 967 | 14, 744 | 114 |
| లూథియానా ఫిరోజ్ పూర్ | 1 | 1 | 4 | 4 | 20, 334 | 12, 299 | 60 |
| అమృతసర్ సియాకోట్ | 1 | 1 | 2 | 1 | 21, 610 | 5, 374 | 25 |
| లయాల్‌పూర్ ఝంగ్ | 1 | 1 | 2 | 3 | 13, 909 | 3, 805 | 27 |

## అనుబంధం XIV (6) బీహార్

| నియోజక వర్గం పేరు | మొత్తం సీట్ల సంఖ్య | | అభ్యర్థుల సంఖ్య | | వోటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు | సాధారణం | షె.కు | సాధారణం | షె.కు | షె.కు. ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| తూర్పు బీహారు | 1 | 1 | 2 | 2 | 23, 966 | 3, 944 | 16 |
| దక్షిణగయ | 1 | 1 | 2 | 1 | 35, 104 | 9, 675 | 28 |
| నవాడ | 1 | 1 | 3 | 2 | 28, 149 | 7, 060 | 25 |
| తూర్పు మధ్య షాహాబాద్ | 1 | 1 | 4 | 1 | 34, 138 | 6, 491 | 19 |
| పశ్చిమ గోపాల్‌గంజ్ | 1 | 1 | 3 | 1 | 25, 419 | 3, 361 | 13 |
| ఉత్తర బెట్టియా | 1 | 1 | 2 | 1 | 22, 596 | 2, 985 | 13 |
| తూర్పు ముజాఫర్‌పూర్ ( సాదర్ ) | 1 | 1 | 2 | 1 | 23, 007 | 3, 382 | 15 |
| దర్భాంగా సాదర్ | 1 | 1 | 3 | 1 | 22, 189 | 2, 018 | 9 |
| ఆగ్నేయ సమస్తిపూర్ | 1 | 1 | 2 | 1 | 29, 595 | 2, 642 | 9 |
| దక్షిణ సాదర్ మాంఘీర్ | 1 | 1 | 3 | 1 | 38, 772 | 5, 739 | 15 |
| మాధీపుర | 1 | 1 | 2 | 2 | 21, 251 | 1, 383 | 6 |
| వాయవ్య పూర్ణియా | 1 | 1 | 2 | 2 | 33, 071 | 2, 440 | 7 |
| గిరిది భాత్రా | 1 | 1 | 2 | 1 | 39, 670 | 4, 528 | 11 |
| ఈశాన్య పలమౌ | 1 | 1 | 2 | 2 | 13, 853 | 4, 174 | 30 |
| మధ్యమకభూం | 1 | 1 | 2 | 2 | 22, 930 | 5, 075 | 22 |

# అనుబంధం XIV (7) మధ్య పరగణాలు & బీరార్

| నియోజక వర్గం పేరు | మొత్తం సీట్ల సంఖ్య | | అభ్యర్థుల సంఖ్య | | వోటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు | సాధారణం | షె.కు | షె.కు ఓటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| నాగపూర్ నగరం | 1 | 1 | 2 | 4 | 34, 816 | 8, 574 | 24 |
| నాగపూర్ -ఉమ్రేర్ | 1 | 1 | 3 | 4 | 20, 795 | 5 ,451 | 26 |
| హింగన్ ఘాట్- వార్ధా | 1 | 1 | 3 | 4 | 25, 275 | 3 ,088 | 12 |
| చందా - బ్రహ్మపురి | 1 | 1 | 3 | 4 | 21, 747 | 4 ,582 | 21 |
| ఛింద్వారా - సౌసర్ | 1 | 1 | 3 | 4 | 32, 040 | 3 ,929 | 12 |
| జబ్బల్‌పూర్ పటాన్ | 1 | 1 | 3 | 4 | 23, 667 | 1 ,519 | 6 |
| సౌఘాం ఖరాయ్ | 1 | 1 | 3 | 2 | 23, 487 | 4 ,679 | 20 |
| దామో - హట్టా | 1 | 1 | 3 | 2 | 29, 069 | 3 ,461 | 12 |
| నరసింగ్ పూర్ గదర్ వారా | 1 | 1 | 4 | 2 | 31, 873 | 1, 927 | 6 |
| రాయ్‌పూర్ | 1 | 1 | 2 | 2 | 20, 209 | 10, 885 | 54 |
| బలోడా బజార్ | 1 | 1 | 2 | 3 | 27, 045 | 14, 386 | 53 |
| బిలాస్ పూర్ | 1 | 1 | 2 | 3 | 22, 343 | 10, 963 | 49 |
| ముంగౌలీ | 1 | 1 | 2 | 3 | 17, 412 | 10, 032 | 58 |
| జంగిర్ | 1 | 1 | 2 | 3 | 28, 303 | 13, 641 | 48 |
| ద్రుగ్ | 1 | 1 | 3 | 1 | 23, 493 | 8 ,663 | 37 |
| భందారా సాకోలీ | 1 | 1 | 2 | 4 | 68, 889 | 8 ,591 | 13 |
| ఎల్లిచ్‌పూర్ - దర్యాపూర్ - మేత్‌ఘాట్ | 1 | 1 | 3 | 4 | 21, 862 | 2, 183 | 10 |
| అకోలా - బిలాపూర్ | 1 | 1 | 3 | 4 | 20, 529 | 2 ,761 | 13 |
| ఇయోటమల్ - దార్వా | 1 | 1 | 3 | 3 | 31,052 | 1 ,954 | 6 |
| ఛిక్లి - మేఖర్ | 1 | 1 | 5 | 3 | 28,971 | 2 ,792 | 10 |

## అనుబంధం XIV (8) అస్సాం

| నియోజక వర్గం పేరు | మొత్తం సీట్ల సంఖ్య | | అభ్యర్థుల సంఖ్య | | వోటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు | సాధారణం | షె.కు | షె.కు.వోటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| కామరూప్ సాదర్ (ఉ) (సా) | 2 | 1 | 2 | 4 | 17,501 | 1,203 | 7 |
| నవ్ గాంగ్ (ఈ) (సా) | 1 | 1 | 3 | 4 | 13,173 | 1,825 | 14 |
| జోర్‌హత్ (ఉ) (సా) | 1 | 1 | 6 | 2 | 12,785 | 657 | 5 |
| సునం గంజ్ | 1 | 1 | 2 | 1 | 15,907 | 6,502 | 41 |
| హబీగంజ్ (సా) | 1 | 1 | 3 | 3 | 12,628 | 7,615 | 60 |
| కరింగంజ్ (తూ) (సా) | 1 | 1 | 4 | 2 | 9,611 | 7,323 | 76 |
| సిలేహార (సా) | 1 | 1 | 2 | 3 | 15,459 | 1,587 | 40 |

## అనుబంధం XIV (9) ఒరిస్సా

| నియోజక వర్గం పేరు | మొత్తం సీట్ల సంఖ్య | | అభ్యర్థుల సంఖ్య | | ఓటర్ల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|---|
| | సాధారణం | షె.కు | సాధారణం | షె.కు. | సాధారణం | షె.కు. | షె.కు. వోటర్ల శాతం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| ఉత్తర కటక్ సాదర్ | 1 | 1 | 2 | 1 | 17, 288 | 4, 159 | |
| తూర్పు జయపూర్ | 1 | 1 | 3 | 2 | 15, 338 | 4, 8C8 | 24 |
| ఉత్తరపూరి సాదర్ | 1 | 1 | 4 | 2 | 13, 803 | 3, 182 | 31 |
| తూర్పు బర్‌గఢ్ | 1 | 1 | 3 | 1 | 22, 849 | 1, 237 | 23 |
| పశ్చిమ భద్రక్ | 1 | 1 | 2 | 3 | 16, 187 | 5, 152 | 5 |
| ఆస్కా సురదా | 1 | 1 | 2 | 4 | 29, 914 | 1, 475 | 32 |
| | | | | | | | 6 |

# అనుబంధం XV

పరగణాల వారీగా షెడ్యూల్డ్ కులాల వారికి రిజర్వు చేయబడిన ఎన్నికల సీట్ల వివరాలు :-

| | | | |
|---|---|---|---|
| అనుబంధం | XV | (1) | మద్రాసు |
| " | " | (2) | బొంబాయి |
| " | " | (3) | బెంగాల్ |
| " | " | (4) | సంయుక్త పరగణాలు (యు. పి) |
| " | " | (5) | పంజాబ్ |
| " | " | (6) | బీహార్ |
| " | " | (7) | మధ్య పరగణాలు (సి. పి.) మరియు బేరార్ |
| " | " | (8) | అస్సాం |
| " | " | (9) | ఒరిస్సా |

సూచన :- 8వ కాలంలో సూచింపబడ్డ అంకెలు తప్ప తక్కినవి నిజమైన సంఖ్యావివరాలు. 8వ కాలంలో ఉన్నవి లెక్కింపబడినవి. వాస్తవ సంఖ్యలు కావు. షెడ్యూల్డ్ కులాల వోటర్లు, హిందూ వోటర్లు వీరి శాతం సరిసమానమన్న ఊహామీద ఈ లెక్కింపు ఆధారపడింది. ఈ ఊహ ఎంత వరకు సమర్థనీయమో చెప్పటం సాధ్యం కాదు.

## అనుబంధం XV (1) మద్రాసు

| నియోజక వర్గం పేరు | పోటీ ఉంద లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు | | | ఓడిన అభ్యర్థులకు పడిన ఓట్లు | షె.కు. వారు వేసిన వోట్లు |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు. | హిందువులు | మొత్తం | | |
| మద్రాసు నగరం | లేదు | కాం.ఐ | - | - | - | - | - |
| చికాకోల్ | ఉంది | కాం | 2, 380 | 5, 259 | 7, 639 | 4, 036 | 6, 416 |
| అమలాపురం | ఉంది | " | 9, 742 | - | 9, 742 | 5, 523 | 29, 111 |
| కాకినాడ | లేదు | " | - | - | - | - | - |
| ఏలూరు | ఉంది | " | 7, 532 | 6, 796 | 14, 328 | 4, 848 | 12, 380 |
| బందరు | " | " | 9, 935 | - | 9, 935 | 2, 004 | 18, 393 |
| ఒంగోలు | " | " | 6, 513 | - | 6, 513 | 3, 807 | 11, 973 |
| గూడూరు | " | " | 4, 293 | 344 | 4, 637 | 4, 778 | 9, 072 |
| కడప | " | " | 8, 284 | 344 | 8, 628 | 4, 047 | 12, 331 |
| పెనుగొంద | " | " | 4, 731 | - | 4, 731 | 1, 749 | 9, 801 |
| బళ్ళారి | " | " | 4, 019 | - | 4, 019 | 910 | 8, 124 |
| కర్నూలు | " | " | 5, 362 | - | 5, 362 | 5, 929 | 13, 164 |
| తిరుత్తణి | " | " | 4, 966 | - | 4, 966 | 741 | 8, 128 |
| చెంగల్పట్టు | " | కాం.ఐ | 12, 360 | - | 12, 360 | 6, 110 | 22, 852 |
| తిరువల్లూరు | " | కాం | 3, 107 | 6, 216 | 9, 323 | 14, 140 | 17, 247 |
| రాణీపేట | " | కాం.ఐ | 2, 969 | - | 2, 969 | 4,000 | 8, 296 |
| అరువణ్ణా మలై | " | కాం | 3, 342 | - | 3, 342 | 4, 938 | 12, 696 |
| దిండివనం | " | " | 6, 396 | - | 6, 396 | 2, 541 | 12, 480 |
| చిదంబరం | లేదు | కాం.ఐ | - | - | - | - | - |
| తిరుక్కోయిలూర్ | ఉంది | కాం | 9, 957 | 4, 436 | 14, 393 | 6, 133 | 16, 090 |
| తంజావూరు | లేదు | | - | - | - + = | - | - |
| మణ్ణార్ గుడి | ఉంది | " | 2, 294 | 20, 494 | 22, 788 | 8, 296 | 10, 590 |
| అరియలూర్ | " | " | 1, 208 | 10, 084 | 11, 292 | 8, 759 | 9, 967 |
| పళని | " | " | 1, 469 | 29, 436 | 30, 905 | 10, 615 | 12, 084 |
| సాతూర్ | " | " | - | 18, 514 | 18, 514 | 11, 894 | 6, 980 |
| కోయిల్‌పట్టి | " | " | 4, 199 | 6, 284 | 10, 483 | 811 | 5, 010 |
| పొళ్ళాచి | " | " | 9, 703 | - | 9, 703 | 2, 217 | 15, 244 |
| నామకల్ | " | " | 8, 141 | 8 153 | 16, 294 | 3, 217 | 11, 358 |
| కుంధాపూర్ | " | " | 1, 425 | - | 1, 425 | 1, 798 | 11, 673 |
| మలప్పురం | " | " | 7, 154 | - | 7, 154 | 2, 606 | 10, 148 |
| | | మొత్తం | 126, 152 | | | | 321, 616 |

షె.కు వోట్లు మొత్తం = 321,616
కాంగ్రెస్ అభ్యర్థులకు పడిన షె.కు. ఓట్లు = 126, 152
కాంగ్రెస్‌తో అభ్యర్థులకు పడిన షె.కు. వోట్లు = 195, 464

## అనుబంధం XV (2) బొంబాయి

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు | | | ఓడిన అభ్యర్థులకు పడిన ఓట్లు | షె.కు. వారి మొత్తం వోట్లు |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు. | హిందువులు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| బొంబాయినగరం సబర్బన్‌జిల్లా | ఉంది | కాం | 2, 414 | 15, 004 | 17, 418 | 9, 738 | 12, 152 |
| బొంబాయినగరం (బైకుల్లా, పారెల్) | ఉంది | కాం.ఇ | 8, 494 | 4, 751 | 13, 245 | 11, 662 | 8, 494 |
| కైరాజిల్లా | లేదు | కాం | - | - | - | - | - |
| సూరత్ జిల్లా | ఉంది | " | 7, 913 | - | 7, 913 | 7, 245 | 12, 101 |
| థాణా జిల్లా | " | కాం.ఇ | 4, 006 | 227 | 4, 223 | 2, 733 | 4, 006 |
| అహమ్మద్ నగర్ (ద.) | " | " | 6, 499 | 296 | 6, 795 | 1, 976 | 6, 499 |
| తూ. ఖాందేశ్ | " | " | 9, 519 | - | 9, 519 | 4, 689 | 10, 846 |
| నాసిక్ ప. | " | " | 16, 605 | - | 16, 605 | 5, 679 | 18, 472 |
| పూనా ప. | " | " | 9, 512 | 2, 599 | 12, 111 | 532 | 9, 512 |
| సతారా ఉ. | " | " | 6, 736 | - | 6, 736 | 10, 984 | 11, 243 |
| షోలాపూర్ ఈ. | " | " | 7, 622 | - | 7, 622 | 2, 891 | 9, 303 |
| బెల్గాం ఉ. | " | " | 21, 322 | - | 21, 322 | 6, 596 | 36, 979 |
| బీజాపూర్ ఉ. | " | " | 4, 566 | - | 4, 566 | 4, 123 | 11, 965 |
| కొలాబా జిల్లా | " | కాం | 2, 644 | 4, 781 | 7, 425 | 8, 117 | 10, 761 |
| రత్నగిరి ఉ. | " | కాం.ఇ | 5, 523 | - | 5, 523 | - | 8, 714 |
| కాంగ్రెస్ అభ్యర్థులు పొందిన షె.కు.వోట్లు | | | | 12,971 | | | 171,047 |

| | | |
|---|---|---|
| షె.కు. వోట్లు మొత్తం | = | 171,047 |
| కాంగ్రెస్ అభ్యర్థులకు పడిన షె.కు. ఓట్లు | = | 12,971 |
| కాంగ్రెస్‌తో అభ్యర్థులకు పడిన షె.కు. వోట్లు | = | 158,076 |

# అనుబంధం XV (3) బెంగాల్

| నియోజకవర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు పె.కు | హిందువులు | మొత్తం | ఓడిన అభ్యర్థికి పడిన వోట్లు | పె.కు వారి వోట్ల మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| బర్ద్వాన్ (మధ్య) | ఉంది | కాం.ఇ | 2,383 | లేదు | 2,383 | 2,728 | 17,918 |
| బర్ద్వాన్(వాయువ్య) | " | " | 2,332 | " | 2,332 | 2,506 | 9,388 |
| బీర్‌భూం | " | " | 4,832 | " | 4,832 | 848 | 18,876 |
| బంకూరా (ప) | " | కాం | 5,100 | 4,501 | 9,601 | 1,838 | 6,938 |
| మిద్నపూర్ (మధ్య) | " | కాం.ఇ | 1,851 | లేదు | 1,851 | 1,733 | 16,124 |
| ఝర్‌గ్రాం (−ఘటల్) | " | కాం | 1,171 | " | 1,171 | 869 | 11,305 |
| హుగ్లీ (ఈ) | " | " | 1,638 | " | 1,638 | 1,613 | 11,764 |
| హౌరా | " | కాం.ఇ | 10,373 | " | 10,373 | 5,986 | 14,380 |
| 24 పరగణాలు (ఆ) | " | " | 7,289 | " | 7,289 | 745 | 27,791 |
| 24 పరగణాలు (వా) | " | కాం | 14,964 | " | 14,964 | 2,361 | 20,987 |
| నదియా | " | కాం ఇ | 5,219 | " | 5,219 | 8,967 | 20,957 |
| ముషీరాబాద్ | " | " | 2,529 | " | 2,529 | 2,129 | 10,522 |
| జెస్సూర్ | " | కాం | 20,198 | 15 | 20,213 | 11,936 | 32,134 |
| ఖుల్నా | " | కాం ఇ | 16575. | లేదు | 16575+ | 20,307 | 76,887 |
| | | కాం ఇ | 32662 | లేదు | 32662 | | |
| మాల్డా | " | కాం ఇ | 2,229 | " | 2,229 | 1,413 | 21,364 |
| దీనజ్‌పూర్ | లేదు | కాం.ఇ+ | - | " | - | - | - |
| జల్‌పాయ్‌గురి (+సౌలీగురి) | ఉంది | " | 16244+ | ' | 16244+ | 19,513 | 49,191 |
| | | | 7261 | | 7261 | | |
| రంగాపూర్ | " | " | 12,212+ | " | 12,212+ | 17,345 | 53,632 |
| | | | 11,914 | | 11,914 | | |
| బోగ్రా (+పాబ్నా) | " | కాం.ఇ | 10,502 | " | 10,502 | 9,920 | 27,054 |
| ఢక్కా (తూ) | " | " | 17,413 | " | 17,413 | 12,062 | 30,869 |
| మైమేన్‌సింగ్ (ప) | " | " | 11,822 | " | 11,822 | 8,987 | 21,025 |
| మైమేన్‌సింగ్ (తూ) | " | " | 10,720 | " | 10,720 | 16,509 | 31,530 |
| ఫరీద్‌పూర్ | " | కాం.ఇ + | 27,342+ | " | 27,342+ | 57,699 | 97,608 |
| | | కాం ఇ | 25,924 | | 25,924 | | |
| బాక్రాగంజ (నై) | " | కాంఇ | 10,515 | " | 10,515 | 18,801 | 26,526 |
| తిప్పేరా | " | కాం.ఇ | 19,388 | " | 19,388 | 8,017 | 29,673 |
| | | మొత్తం | 59,646 | | | మొత్తం | 684,443 |

| | | |
|---|---|---|
| పె..కు.వారి మొత్తం వోట్లు | = | 684,443 |
| కాం.అభ్యర్థికి పడిన పె.కు. వోటు | = | 59,646 |
| కాం.ఇ. పె.కు. అభ్యర్థికి పడిన పె.కు. వోట్లు | = | 6,24,797 |

# అనుబంధం XV (4) సంయుక్త పరగణాలు

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు | | | వోడిన అభ్యర్థికి పడిన వోట్లు | షె.కు వారి వోట్లు మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు | హిందువులు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| లక్నో నగరం | ఉంది | కాం | 1, 910 | 2,327 | 4,327 | 4,092 | 6,002 |
| కాన్పూర్ నగరం | " | " | 4,483 | 4,901 | 9,384 | 1,301 | 5,784 |
| ఆగ్రా నగరం | " | " | 1,018 | 4,389 | 5,407 | 3,132 | 4,150 |
| అలహాబాద్ నగరం | " | " | 385 | 9,285 | 9,670 | 4,037 | 4,422 |
| సగరాన్ పూర్ జిల్లా | " | " | 3,252 | - | 3,252 | 648 | 5,282 |
| బులంద్ షహర్ జిల్లా | " | " | 3,853 | 547 | 4,400 | 2,365 | 6,228 |
| ఆగ్రా జిల్లా | " | కాం.ఇ | 1,851 | - | 1,851 | 2,513 | 5,550 |
| మెయిన్‌పురి జిల్లా | " | కాం | 2,317 | 932 | 3,249 | 4,431 | 6,748 |
| బుడాన్ జిల్లా | " | " | 1,557 | - | 1,557 | 2,676 | 9,070 |
| జితా జిల్లా | " | " | 3,791 | - | 3,791 | 4,840 | 12,428 |
| మిర్జాపూర్ జిల్లా | లేదు | " | - | - | - | - | - |
| గోరఖ్‌పూర్ జిల్లా | ఉంది | " | 2,762 | - | 2,762 | 819 | 4,954 |
| బస్తీ జిల్లా | లేదు | " | - | - | - | - | - |
| అజాంఘర్ జిల్లా | ఉంది | " | 949 | - | 949 | 196 | 9,256 |
| అల్మోరాజిల్లా | లేదు | కాం.ఇ | - | - | - | - | - |
| రాయ్‌బెరేలీ జిల్లా | " | " | - | - | - | - | - |
| సీతాపూర్ జిల్లా | ఉంది | కాం | 12,535 | - | 12,535 | 955 | 20,000 |
| ఫైజాబాద్ జిల్లా | " | " | 5,771 | - | 5,771 | 22 | 13,848 |
| గోండా జిల్లా | లేదు | కాం.ఇ | - | - | - | - | - |
| బర్‌బాంది జిల్లా | ఉంది | కాం | 8,026 | - | 8,026 | 7,283 | 18,458 |
| కాం. అభ్యర్థికి పడిన షె.కు. | వోట్ల | మొత్తం | 52,609 | | | మొత్తం= | 132180 |

| | | |
|---|---|---|
| షె.కు. వారి మొత్తం వోట్లు | = | 132,180 |
| కాం. అభ్యర్థికి పడిన షె.కు. వారి వోట్లు | = | 52, 609 |
| కాం. ఇ. అభ్యర్థికి పడిన షె.కు. వారి వోట్లు | = | 79, 571 |

## అనుబంధం XV (5) పంజాబు

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు | | | ఓడిన అభ్యర్థికి పడిన వోట్లు | షె.కు.వారి మొత్తం వోట్లు |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు. | హిందువులు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| ఆగ్నేయ గురుగావ్ | లేదు | కాం.ఇ | - | - | - | - | - |
| కర్నల్ (ఉ) | ఉంది | " | 3, 318 | లేదు | 3, 318 | 1, 299 | 3, 777 |
| అంబాలా + సిమ్లా | ఆ | " | 5, 237 | " | 5, 237 | 4, 911 | 10, 960 |
| హోషియాపూర్ (ప) | ఆ | " | 8, 599 | " | 8, 599 | 14, 640 | 11, 701 |
| జలంధర్ | ఆ | " | 13, 135 | " | 13, 135 | 9, 176 | 20, 347 |
| లూధియానా, ఫిరోజ్‌పూర్ | ఆ | " | 7, 258 | " | 7, 258 | 6, 024 | 16, 481 |
| అమృత్‌సర్- సియాల్‌కోట్ | లేదు | " | - | - | - | - | - |
| లయాల్ పూర్ + ఝూంగ్ | ఉంది | " | 2, 903 | లేదు | 2, 903 | 2, 143 | 5, 860 |
| | | | | | | మొత్తం = | 69, 126 |

| | |
|---|---|
| షె.కు. వారి మొత్తం వోట్లు | 69, 126 |
| కాం. అభ్యర్థికి పడిన షె.కు. వారి వోట్లు | లేవు |
| కాం.ఇ. అభ్యర్థికి పడిన షె.కు. వారి వోట్లు | 69, 126 |

# అనుబంధం XV (6) బీహార్

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు | | | వోడి అభ్యర్థికి పడిన వోట్లు | షె.కు. వారి వోట్ల మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు. | హిందువులు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| తూర్పు బీహారు | ఉంది | కాం.ఇ | 2, 471 | లేదు | 2, 471 | 519 | 5, 443 |
| దక్షిణ గయ | లేదు | కాం. | - | - | - | - | - |
| నవాడ | ఉంది | " | 3, 079 | లేదు | 3, 079 | 1, 629 | 10,449 |
| తూ.మ.షాహాబాద్ | లేదు | కాం.ఇ | - | - | - | - | - |
| ప. గోపాల్‌గంజ్ | " | " | - | - | - | - | - |
| ఉ. బెట్టయా | " | కాం | - | - | - | - | - |
| తూ. ముజాఫర్‌పూర్‌సాదర్ | " | " | - | - | - | - | - |
| దర్భంగాసాదర్ | " | " | - | - | - | - | - |
| ఆ. సమస్తిపూర్ | " | " | - | - | - | - | - |
| ద. సాదర్. మాంఘీర్ | " | " | - | - | - | - | - |
| మాధీపూర్ | ఉంది | " | 70 | 1, 688 | 1, 758 | 1,700 | 1, 770 |
| నై. పూర్ణియా | " | " | 2, 040 | 2, 878 | 4, 918 | 1, 669 | 3, 709 |
| గిర్డి + భాత్రా. | లేదు | " | - | - | - | - | - |
| ఈ. పలమాన్ | ఉంది | " | 3, 465 | 3, 419 | 6, 884 | 626 | 4, 091 |
| మ. మన్‌భూం | " | కాం. ఇ | 2, 539 | లేదు | 2, 539 | 1, 973 | 5, 379 |
| కాం. అభ్యర్థికి పడిన షె.కు. | వారి | వోట్లు: | 8, 654 | | | మొత్తం | 30,841 |

షె.కు. వారి మొత్తం వోట్లు : 30, 841
కాం. అభ్యర్థికి వచ్చిన షె.కు. వారి వోట్లు : 8, 654
కాం. ఇ. అభ్యర్థికి పడిన షె.కు. వారి వోట్లు : 22, 187

## అనుబంధం XV (7) (మధ్య పరగణాలు + బీరార్)

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు | | | వోడిన అభ్యర్థికి పడిన వోట్లు | షె.కు. వారి వోట్ల మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు. | హిందువులు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| నాగపూర్‌నగరం | ఉంది | కాం.ఇ | 7,796 | లేదు | 7,796 | 3,787 | 9,088 |
| నాగపూర్, ఉమ్రేర్ | " | " | 3,667 | " | 3,667 | 2,774 | 6,323 |
| హింగన్‌ఘాట్, వార్ధా | " | " | 2,964 | 262 | 3,226 | 3,093 | 2,964 |
| చాంధా, బ్రహ్మపురి | " | " | 5,133 | లేదు | 5,133 | 1,764 | 5,590 |
| భింద్వారా, నాసర్ | " | " | 1,477 | " | 1,477 | 4,035 | 4,400 |
| జబ్బల్ పూర్, పటాన్ | " | కాం | 473 | 2,017 | 2,490 | 1,198 | 1,671 |
| సౌగోర్, ఖరాయ్ | " | " | 2,986 | లేదు | 2,986 | 1,417 | 5,147 |
| గమో, హాట్టా | " | " | 3,056 | 259 | 3,315 | 958 | 4,014 |
| నరసింగ్‌పూర్, గదశ్వారా | " | " | 1,023 | 95 | 1,118 | 480 | 1,503 |
| రాయ్‌పూర్ | " | " | 3,856 | లేదు | 3,856 | 1,332 | 9,361 |
| బాలోదాబజార్ | " | " | 8,113 | " | 8,115 | 4.451 | 17,551 |
| బిలాస్‌పూర్ | " | కాం.ఇ | 1,900 | " | 1,900 | 1,655 | 15,348 |
| ముంగాలీ | " | " | 5,357 | " | 5,357 | 4,730 | 14,045 |
| జంగీర్ | " | " | 2,411 | " | 2,411 | 3,299 | 17,188 |
| ద్రుగ్ | లేదు | కాం | - | - | - | - | - |
| భంధారా సాకోలీ | ఉంది | కాం.ఇ | 7,916 | లేదు | 7,916 | 5,197 | 0.309 |
| ఎల్లిచ్‌పూర్ దర్యాపూర్, మేమ్‌ఘాట్ | " | " | 1,697 | " | 1,697 | 3,086 | 2,532 |
| అకోలా, బలాపూర్ | " | " | 1,823 | " | 1,823 | 1,726 | 3,203 |
| ఇయోట్‌మల్, దార్వా | " | " | 1,150 | " | 1,150 | 864 | 1,329 |
| ఛక్లీ - మేంఖద్ | " | " | 2,194 | " | 2,194 | 2,164 | 3,295 |
| కాం. అభ్యర్థికి పడిన షె.కు. వారి | | వోట్లు | 19,507 | | | మొత్తం | 1,34,861 |

షె.కు. వారి మొత్తం వోట్లు : 134, 861
కాం. అభ్యర్థికి వచ్చిన షె.కు. వారి వోట్లు : 19, 507

కాం. ఇ. అభ్యర్థికి పడిన షె.కు. వారి వోట్లు 115, 354

# అనుబంధం XV (8) అస్సాం

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన ఓట్లు | | | ఓడిన అభ్యర్థికి పడిన ఓట్లు | షె.కు. వారి ఓట్ల మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| | | | షె.కు. | హిందువులు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| కామరూప్ సాదర్ (ద) (సాధారణం) | ఉంది | కాం | లేదు | 4 832 | 4 832 | 3, 665 | 1, 841 |
| నౌ గాంగ్ (ఉ) " | ఉంది | కాం. ఇ | 1, 596 | లేదు | 1, 596 | 3, 045 | 2, 226 |
| జోర్హాత్ (ఉ) " | ఉంది | కాం | 457 | 495 | 952 | 371 | 828 |
| సునామ్ గంజ్(") | లేదు | కాం | లేదు | లేదు | లేదు | లేదు | లేరు |
| హబీగంజ్ (ఉ) (") | ఉంది | కాం | 4, 863 | లేదు | 4, 863 | 4, 397 | 10, 356 |
| కరింగంజ్(తూ) (") | ఉంది | కాం.ఇ | 3, 252 | లేదు | 3, 252 | 1, 119 | 10, 252 |
| సీల్ బార్ (") | ఉంది | కాం | 2, 108 | లేదు | 2,103 | 2, 197 | 2, 254 |
| కాం.అభ్యర్థికి పడిన షెకు వారి ఓట్లు | | = | 5,320 | | | మొత్తం = | 27,757 |

షె.కు. వారి ఓట్ల మొత్తం = 27, 757
కాం. అభ్యర్థికి పడిన షె.కు. ఓట్లు = 5, 320
కాం. ఇ. అభ్యర్థికి పడన షె.కు. వారి ఓట్లు = 22, 437

## అనుబంధం XV (9) ఒరిస్సా

| నియోజక వర్గం పేరు | పోటీ ఉందా లేదా | గెలిచిన అభ్యర్థి పార్టీ టికెట్ | గెలిచిన అభ్యర్థికి పడిన వోట్లు షె.కు. | హిందువులు | మొత్తం | ఓడిన అభ్యర్థికి పడిన వోట్లు | షె. కు. వోట్ల మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| ఉత్తరకటక్ సాదర్ | లేదు | కాం. ఇ | - | - | - | - | - |
| తూర్పు జయపూర్ | ఉంది | కాం | 958 | లేదు | 958 | 571 | 4, 808 |
| ఉ.పూర్తి సాదర్ | " | " | 3, 416 | 602 | 4, 018 | 339 | 3 ,755 |
| తూ. బార్‌గఢ్ | లేదు | కాం.ఇ | - | - | - | - | - |
| ప. భద్రన్ | ఉంది | కాం | 1, 504 | లేదు | 1,504 | 734 | 5, 049 |
| ఆస్కా సురదా | " | " | లేదు | 917 | 917 | 1,402 | 973 |
| కాం. అభ్యర్థికి | పడిన షె.కు. | ఓట్లు = | 5, 878 | | | మొత్తం = | 14 ,585 |

షె.కు. వారి ఓట్లు మొత్తం 14, 585
కాం. అభ్యర్థికి పడిన షె.కు. వారి ఓట్లు 5, 878
కాం ఇ. అభ్యర్థికి పడిన షె.కు. వారి ఓట్లు 8 ,707

## అనుబంధం XVI

# వేవెల్ పథకం

(i) *ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేట్ 1945 జూన్ 14న భారత ప్రభుత్వానికి సంబంధించి, బ్రిటిష్ ప్రభుత్వం వారి ప్రతిపాదనలతో, పార్లమెంట్‌లో సమర్పించిన శ్వేతపత్రం.*

(1) ఇటీవల ఫీల్డు మార్షల్ వైకౌంట్ వేవెల్ ఇంగ్లాండుకు వచ్చినపుడు బ్రిటిష్ ప్రభుత్వం ఆయనతో చాలా సమస్యల్ని సమీక్షించింది. ముఖ్యంగా ఇండియాలోని ప్రస్తుత రాజకీయ పరిస్థితిని గూర్చి చర్చించింది.

(2) బ్రిటిష్ ప్రభుత్వం 1942 మార్చిలో చేసిన ప్రతిపాదనలు తప్ప అప్పటి నుంచి భారతీయ రాజ్యాంగం సమస్యలు పరిష్కరించే విషయంలో ఏ అభివృద్ధి కనిపించటం లేదన్నది సభ్యులకు తెలిసే ఉంటుంది.

(3) అప్పుడే చెప్పినట్టు ఇండియాకు కొత్త రాజ్యాంగం తయారు చేయాల్సిన బాధ్యత భారతీయులు తాము మాత్రమే వహించగల పని.

(4) బ్రిటిష్ ప్రభుత్వం అన్నివేళలలోనూ కొత్త రాజ్యాంగ వ్యవస్థ నిర్మాణంలో వీలైనంత అధికంగా సహకరించాలనే ఉన్నా, ఈ దేశం చేత ఆదేశింప బడిన స్వయంపాలిత సంస్థలను అయిష్టంగా ఉన్న ఇండియాపై రుద్దటం కుదరనిపని. అలాచేస్తే తాను వద్దన్న పని తనే చేసి చూపటం అయిపోతుంది. అలాంటిది సాధ్యం కాదు. భారత దేశం నుంచి మా పాలనాధికారాన్ని సంపూర్ణంగా ఉపసంహరించుకొంటున్నాం. ఈ తరుణంలో అలాంటి స్వయంపాలక సంస్థలను నడిపే బాధ్యతను మేము చేపట్టలేం.

(5) అందుచేత ప్రధాన రాజ్యాంగ సమస్య యథాపూర్వంగానే మిగిలి పోయింది. 1942 మార్చిలో బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ప్రతిపాదనపై ఏ స్పందనా లేదు, మార్పులేదు. బ్రిటిష్ ప్రభుత్వం వారు ఇప్పటికీ భారతీయ నాయకులు తమలో తాము ఒక ఒప్పందానికి వచ్చి భవిష్యత్ రాజ్యాంగ విధానాన్ని గురించి ఒక అవగాహనతో వస్తారన్న నమ్మకంతోనే ఉన్నారు.

(6) ఇండియాలో ప్రస్తుతం ఉన్న రాజకీయ స్థంభన తొలగి పోవటానికి సహకరించే ఏ పని చేయటానికైనా బ్రిటిష్ ప్రభుత్వం సిద్ధమే. ఈ స్థంభన ఉన్నంత వరకు రాజకీయంగానే కాదు, సామాజిక, ఆర్థిక అభివృద్ధి కూడా కుంటుపడే ఉంటుంది.

(7) ఇప్పటికి జపాన్‌లో యుద్ధ కారణంగానూ, యుద్ధానంతర సమస్యలతోనూ ఇండియా పాలనాంగం తలకు మించిన భారంతో సతమతమవుతోంది. ఇప్పుడున్న రాజకీయ ఉద్విగ్నతతో పాలనా భారం మరింత సమస్యాత్మకంగా తయారైంది.

(8) వ్యవసాయ, పారిశ్రామిక రంగాల అభివృద్ధికి, వ్యవసాయదారులకు, కార్మికుల సంక్షేమానికి, ఏ కార్యక్రమాలు వెంటనే చేపట్టాలో, అవి ఇండియాలోని ప్రతి జాతి, ప్రతి తెగ, హృదయపూర్వకంగా సహకరిస్తే తప్ప సాధ్యం కాదు.

(9) అందుచేత బ్రిటిష్ ప్రభుత్వం ఈ మధ్య కాలంలో ఇపుడున్న రాజ్యాంగ పరిధిలో, భారతీయులు కొత్త రాజ్యాంగం ఏర్పరుచుకునే లోపల, ప్రధాన జాతులు, పక్షాలు కలిసి బ్రిటిష్ వారితో సన్నిహితంగా సహకరిస్తే భారతీయులందరికీ మేలు చేసేలా ఇంకొక ప్రత్యామ్నాయ వ్యవస్థను ఏర్పాటుచేసే విషయం కూడా ఆలోచిస్తోంది.

(10) ప్రధాన భారతీయుల కోరికలకు వ్యతిరేకంగా ఏ మార్పులు ప్రవేశ పెట్టడమూ బ్రిటిష్ ప్రభుత్వం వారికి ఇష్టం లేదు. కానీ ఇండియాలోని రాజకీయపక్షాల నాయకులు అంగీకరిస్తే, ప్రభుత్వం వారి సలహాలను ఒప్పుకుంటే, జపాన్‌తో యుద్ధానికి సహకారం అందిస్తే, యుద్ధం పూర్తి అయి విజయం సాధించాక భారతీయులు రాజ్యాంగం ఏర్పాటు చేసుకునే దాకా ఆ మధ్య కాలంలో ఒక ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే ప్రయత్నంలో కొంత ముందుకు పోవచ్చు.

**(11)**ఇందు నిమిత్తం వైస్రాయి కార్యవర్గంలో అతిముఖ్యమైన మార్పు చేయటానికి బ్రిటిష్ ప్రభుత్వం సిద్ధంగా ఉంది. ఇప్పుడున్న 'స్టాట్యూట్ లా'ను ఏమి మార్చకుండానే **1935** యాక్టులోని 9వ షెడ్యూల్‌కు ఒక సవరణ ప్రతిపాదిస్తే మార్పు తీసుకు రావడం సాధ్యమవుతుంది. ఈ షెడ్యూల్ ప్రకారంగా కార్యవర్గంలో ఉన్న కనీసం ముగ్గురికైనా బ్రిటిష్ ప్రభుత్వంలో **10**సంవత్సరాల ఉద్యోగానుభవం ఉండాలి. భారతదేశం అనుమతితో నేను ఈ ప్రతిపాదనలకు సభ ముందుంచినపుడు, ఆ ఉద్యోగానుభవ నియమాన్ని తొలిగిస్తూ సవరిస్తే చాలు.

**(12)** ఒక కార్యనిర్వాహక మండలి ఏర్పాటు కావాలి. వైస్రాయి కార్యనిర్వాహక మండలి కోసం బ్రిటిష్ ప్రభుత్వానికి సమర్పించే నామినేషనలో తమ రాష్ట్రాలలోనూ, కేంద్రంలోనూ ఉన్న భారతీయ నాయకుల నుంచి కొందరిని ఎన్నుకోవాలి. ఇలా ఎన్నుకోవటంలో ప్రధాన జాతుల సమతుల్యం ఉన్న ప్రాతినిధ్యం నిష్పత్తి క్రమంలో జరగాలి. హిందువులకు, ముస్లింలకు సమాన ప్రాతినిధ్యం ఉండాలని ప్రతిపాదిస్తున్నాం.

**(13)**ఈ ధ్యేయాన్నందుకోవడానికి వైస్రాయి ముఖ్యులుగా ఉన్న భారతీయ రాజకీయ వాదులను, ప్రధాన పక్షాలకు నాయకులుగా ఉన్నవారిని, భిన్నప్రాంతాల ముఖ్యమంత్రులుగా ఇటీవల పనిచేసిన వారిని, ఇంకా మరి కొంతమంది అధికారం, అనుభవం ఉన్నవారిని సమావేశ పరుస్తారు. ఈ సమావేశం ముందు కార్యవర్గ సభను మళ్ళీ ఏర్పాటు చేయడానికి పేర్లను సూచించమని ప్రతినిధులనే అడుగుతాడు. వారు సూచించిన పేర్లలో నుంచి కొంత మందిని ఎంపిక చేసి బ్రిటిష్ చక్రవర్తికి పంపుతారు. కాని పేర్లను పంపే అధికారం వైస్రాయికే ఉంటుంది. అతని ఎంపికపై ఏ నియంత్రణా ఉండదు.

**(14)** ఈ పద్ధతిలో కార్యవర్గ మండలిలో సభ్యులైన వారు జపాన్‌లో చేస్తున్న యుద్ధం దిగ్విజయంగా ముగిసేలా బ్రిటిష్ వారితో హృదయపూర్వకంగా సహకరిస్తామని, పాలుపంచుకుంటామని అంగీకరించవలసి ఉంటుంది.

**(15)** కార్యవర్గ మండలిలో ఉన్న సభ్యులలో వైస్రాయి సర్వసైన్యాధిపతిగా కొనసాగుతారు. యుద్ధంలో భాగస్వామిగా తన పూర్వ స్థితిలోనే ఉంటారు. ఇక తక్కిన వారందరూ భారతీయులే. భారతదేశ రక్షణ బ్రిటిష్ వారి బాధ్యత కాబట్టి వైస్రాయికి సైన్యాధికారం అలాగే నిలపవలసి వచ్చింది.

**(16)** ఈ ప్రతిపాదనల్లో ఉన్న ఏ అంశం చేతా చక్రవర్తికి భారతీయ రాష్ట్రాలలో ఉన్న సంబంధాలు దెబ్బతినవు. వైస్రాయి చక్రవర్తి ప్రతినిధిగానే వ్యవహరిస్తాడు.

**(17)** బ్రిటిష్ ప్రభుత్వం ఈ ప్రతిపాదనల్ని భారతీయ నాయకుల ముందుంచమని వైస్రాయిని నియమించింది. భిన్నవర్గాలకు చెందిన భారతీయ నాయకులు వీటిపై ప్రతిస్పందిస్తారని ప్రభుత్వం నమ్ముతోంది. ఇలాంటి పథకం విజయవంతం కావాలంటే ఇండియాలో అది అంగీకారం పొందాలి. మధ్యంతర వ్యవస్థగా ఈ ఏర్పాటు విజయవంతం కావటంలో భారతీయ రాజకీయనాయకులు ఏ మేరకు సహకరిస్తారో ఆ మేరకే అది విజయవంతమవుతుంది. అలాంటి సాధారణమైన అంగీకారం కుదరని పక్షంలో ఇప్పుడున్న ఏర్పాటే, కొనసాగాలి.

**(18)** అలాంటి సహకారం కేంద్రంలో పొందగలిగితే, అదే భిన్న రాష్ట్రాలలో కూడా ప్రతిఫలించి బాధ్యతాయుతమైన ప్రభుత్వాలు ఏర్పడే అవకాశం ఉంటుంది. తద్వారా మెజారిటీ పార్టీలు పాలు పంచుకోకపోవటం వల్ల 1935 యాక్టులోని 93వ సెక్షన్ కింద గవర్నర్ల అధికారంతో జరిపిన పాలనను ఆపినట్టవుతుంది. అన్ని ప్రాంతాలలోనూ ఈ ప్రభుత్వాలు ప్రధాన పక్షాలన్నిటి ప్రాతినిధ్యంతోనూ, సహకారంతోనూ జరుగుతాయని నమ్ముతున్నాం. దీని ద్వారా జాతి విభేదాలు సమసి పోతాయి. ఈ కారణంచేత మంత్రులు తమ తమ పాలనా సంబంధమైన కార్యభారంపై తగినంత శ్రద్ధ చూపగలుగుతారు.

**(19)** ఈ ప్రతిపాదనలు అంగీకారమైతే బ్రిటిష్ ప్రభుత్వం సూచిస్తున్న ఒక మార్పును అనుసరించనలసి ఉంటుంది.

**(20)** బ్రిటిష్ ఇండియా విదేశీ వ్యవహారాలను (గిరిజన, సరిహద్దు సమస్యలు అంతరంగిక రక్షణ శాఖ క్రిందేవస్తాయి) వైస్రాయి కార్యవర్గ మండలిలోని భారతీయ సభ్యుని అధీనంలో ఉంచాలి. బాగా అర్హత ఉన్న ప్రతినిధుల్నే భారతీయ విదేశీప్రతినిధులుగా నియమించాలి.

**(21)** ఇలా ఈ పథకాన్ని అంగీకరించి సహకరించటం ద్వారా భారతీయ నాయకులు, భారతీయ రాజకీయ సమస్యలకు ఒక మార్గాన్ని అన్వేషించటంలో తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించిన వారవుతారు. ప్రభుత్వ నిర్వహణలో సహకరించటం వల్ల వచ్చే అనుభవం వల్ల కొత్త రాజ్యాంగాన్ని తయారుచేసే విషయంలో పరస్పర అవగాహనను కూడా త్వరితగతిని సాధించ గలుగుతారు.

**(22)** ప్రస్తుత రాజ్యాంగ పరిధులలో ఈ సమస్యను బాగా పరిశీలించి ఈ పథకమే ఉన్నంతలో మంచి అభివృద్ధిని సాధించగలదని బ్రిటిష్ ప్రభుత్వం భావిస్తోంది. ఇంతవరకు సూచించిన ఏ మార్పులు కాని తరువాత భారతీయులు తయారు చేసుకోబోయే శాశ్వతమైన రాజ్యాంగాన్ని అసహానంతో చూసే దృష్టిని కల్గించవు. తక్కువగా అంచనా వేయవుకూడా.

(23) అటు బ్రిటిష్‌వారు, ఇటు భారతీయులు పరస్పర విశ్వాసంతో నిజమైన కోరికతో అన్ని వైపులనుంచి సహకరిస్తే ఈ ప్రతిపాదనలు భారతీయ బ్రిటిష్ సహకార రంగంలో నిజమైన ప్రగతిని సూచించటం మాత్రమే కాకుండా భవిష్యత్తులో భారతీయుల స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచటంలోను, న్యాయబద్ధమైన వారి స్థానాన్ని ధ్రువపరచటంలోనూ, ప్రపంచ దేశాల సదస్సులలో భారతదేశం తన ప్రభావాన్ని గాఢతరం చెయ్యటంలోనూ సహకరిస్తాయని బ్రిటిష్ ప్రభుత్వం నమ్ముతోంది.

## (ii) న్యూఢిల్లీలో వైస్రాయి 1945 జూన్ 14న చేసిన ఆకాశవాణి ప్రసంగం

ప్రస్తుతం ఉన్న రాజకీయ పరిస్థితిని కొంత మెరుగుపరచటానికి, ఇండియా స్వపరిపాలనా ధ్యేయాన్ని అందుకోవటంలో సహకరించటానికీ, కొన్ని ప్రతిపాదనలను భారతీయ రాజకీయ నాయకులు ముందుంచటానికిగాను బ్రిటిష్‌ప్రభుత్వం వారు నన్ను నియమించారు. ఈ ప్రతిపాదనల్ని ప్రస్తుతం ఇండియా సెక్రెటరీ ఆఫ్ స్టేట్ పార్లమెంటుకి నివేదిస్తున్నారు. ఈ ప్రసంగంలో నా ఉద్దేశ్యం ఏమిటంటే ఈ ప్రతిపాదన ఉద్దేశ్యాలను వివరించటం; వీటిని ఎలా కార్యరూపంలోకి తీసుకురావాలన్న పద్ధతిని గురించి తెలియచెప్పటం.

ఇది రాజ్యాంగ సమస్యలకు పరిష్కారంగా చేస్తున్న ప్రసంగం కాదు. భారతదేశంలోని భిన్నపక్షాల అధినాయకులు, అతిప్రధాన సమస్య అయిన జాతిసమస్య విషయంలో ఒక అవగాహనకు వస్తారని బ్రిటిష్ ప్రభుత్వం ఆశించింది. కాని ఆ ఆశ తీరలేదు.

ఈ మధ్యకాలంలో ఇండియా ఎన్నో మహదవకాశాలను సదుపయోగం చేసుకోవచ్చు. సమస్యల్ని పరిష్కరించుకోవచ్చు. కాకపోతే అన్ని పక్షాల నాయకులందరూ కలిసి ఉమ్మడి ప్రయత్నం చేయాల్సి ఉంటుంది. కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వం వారి సంపూర్ణ సహకారంలో, భిన్నరాష్ట్రాలలో, కేంద్రంలో ఉన్న భారతీయ నాయకుల సలహాలను ఆహ్వానిస్తున్నాను. మా సలహా సంప్రదింపులలో కొత్త కార్యవర్గ మండలిని తయారు చేయాలన్నది ఉద్దేశం. ఆ మండలిలో సభ్యుల ద్వారా సువ్యవస్థితమైన రాజకీయాభిప్రాయాన్ని పొందాలన్నది ఆశయం. ఇప్పుడు ప్రతిపాదిస్తున్న కొత్తమండలిలో అన్ని ప్రధాన కులాల వాళ్ళూ ప్రతినిధులుగా ఉంటారు. హిందూ ముస్లింలకు సమాన నిష్పత్తిలో ప్రాతినిధ్యం ఉంటుంది. ఆ కార్యవర్గమండలి ఏర్పాటయితే ఇప్పుడున్న రాజ్యాంగ పరిధిలోనే పనిచేస్తుంది. అందులో సభ్యులందరూ భారతీయులుగానే ఉంటారు. సర్వసైన్యాధ్యక్షుడయిన వైస్రాయి మాత్రం, యుద్ధసభ్యునిగా తనపూర్వస్థితిలోనే కొనసాగుతారు. విదేశీవ్యవహారాల పదవిని ఇంతవరకు వైస్రాయే నిర్వహిస్తుండగా, ఆస్థానంలో భారతీయ సభ్యుడినే ఉంచాలని, బ్రిటిష్ ఇండియా ఆశయాలను దృష్టిలో ఉంచుకొని ప్రతిపాదిస్తున్నా.

బ్రిటిష్ ప్రభుత్వం వారు ప్రతిపాదిస్తున్న మరో ముందడుగు, భారతదేశంలో బ్రిటిష్ హై కమిషనరును నియమించటం. ఇతర రాజ్యాల్లోలాగానే గ్రేట్ బ్రిటన్‌కి సంబంధించిన వ్యాపార వాణిజ్యాశయాలకు ఆయన ప్రతినిధిగా వ్యవహరిస్తారు.

అలాంటి కొత్త కార్యవర్గమండలి ఏర్పడటం, స్వపరిపాలన పథంలో ఒక అడుగు ముందుకు పోయినట్టేనని మీరు గుర్తించగలరు. అదంతా భారతీయ పాలనయే. మొదటిసారిగా ఆర్థిక, దేశీయవ్యవహారాలను భారతీయులే నిర్వహిస్తారు. భారతీయుడే భారతీయ విదేశీ వ్యవహారాలు చూస్తాడు. ఇంతేకాకుండా ఇప్పుడు గవర్నర్ జనరల్ రాజకీయపక్ష నేతలతో కలిసి చర్చించి ఈ సభ్యుల్ని నియమిస్తాడు; అయితే బ్రిటిష్ ప్రభుత్వ అధినేత అయిన చక్రవర్తి ఆ నియామకాల్ని అనుమతించాలనుకోండి.

ఇప్పుడున్న రాజ్యాంగ పరిధిలోనే ఈ కార్యనిర్వాహక మండలి పనిచేస్తుంది. గవర్నర్ జనరల్ తన అత్యున్నత రాజ్యాంగ నియంత్రణాధికారాన్ని వినియోగించక పోవటం కూడా ఉండదనుకోండి; కాని అ కారణంగా ఆ అధికారం మాత్రం ఉపయోగించటం జరగదు.

ఈ విధంగా ఈ మధ్యంతర ప్రభుత్వాన్ని ఏర్పరచటం ఏ విధంగానూ తరువాతి రాజ్యాంగ వ్యవస్థను నిర్ణయం చేసుకోవడానికి అడ్డుగా ఏ దురుద్దేశ్యాలను కల్గించబోదన్న విషయం మీకు నేను స్పష్టం చేయాల్సి ఉంది.

*కొత్త కార్యవర్గ మండలి ముందున్న ముఖ్యమైన సమస్యలు ఏవంటే:*

మొదటిది:- జపాన్ సంపూర్ణంగా ఓడిపోయే దాకా శక్తివంతంగా యుద్ధాన్ని కొనసాగించటం.

రెండోది:- బ్రిటిష్ ఇండియా పరిపాలనను, యుద్ధానంతర అభివృద్ధి సమస్యల్ని దృష్టిలో ఉంచుకొని, తరువాత శాశ్వత రాజ్యాంగాన్ని గురించి అంగీకారం కుదిరే దాకా పాలన కొనసాగించటం.

మూడోది:- మండలిలోని పాలక సభ్యులు అంగీకరిస్తే ఏ పద్ధతిలో అలాంటి అంగీకారం కుదరటానికి అవకాశం ఉంటుందో పరిశీలించడం. ఇది చాలా ముఖ్యమైన సమస్య. ఈ సమస్యకు దీర్ఘకాలిక పరిష్కారం కనుగొనాలన్న దృష్టి నాకు లేకపోలేదు- బ్రిటిష్ చక్రవర్తికే లేకపోలేదు.- అన్న విషయం మీకు స్పష్టం చేస్తున్నాను. ప్రస్తుత ప్రతిపాదనలు అలాంటి దీర్ఘకాల పరిష్కారం కనుగొనడాన్ని సులభ సాధ్యం చేయటం కోసమే నని మీకు తెలుపుతున్నాను.

అలాంటి మండలిని ఎలా ఏర్పరచాలో దానికొక మంచి పద్ధతిని నేను పరిశీలించాను. అందుచే క్రింద చెప్పబడ్డవారిని వైస్రాయి భవనానికి ఆహ్వానించి వారి సలహాలు తీసుకోదలిచాను.

ప్రస్తుతం భిన్న ప్రాంతాలలో ప్రీమియర్లుగా ఉన్నవారు: లేదా సెక్షన్ 93 ప్రభుత్వాల క్రింద ఆయా ప్రాంతాలలో ప్రీమియర్లుగా పనిచేసిన వారు, కేంద్రశాసన సభలోని కాంగ్రెస్ పార్టీ నాయకులు, ముస్లిం లీగ్ ఉపనాయకుడు, రాష్ట్రమండలిలోని కాంగ్రెస్ పార్టీ, ముస్లిం లీగుల నాయకులు; శాసనసభలోని నేషనలిస్ట్ పార్టీ, యూరోపియన్ గ్రూపుల నాయకులు.

ప్రధానపక్ష నేతలైన గాంధీ, జిన్నాలు షెడ్యూల్డ్ కులాల ప్రతినిధిగా రావ్ బహద్దూర్ ఎన్.శివరాజ్, సిక్కుల ప్రతినిధిగా మాస్టర్ తారాసింగ్.

ఈ ప్రముఖులకు ఆహ్వానాలు ఈ రోజే అందేలా పంపుతున్నాను. ఈ సమావేశం జూన్ 25వ తేదీ సిమ్లాలో జరపాలని అనుకొంటున్నాను. అక్కడైతే మనం ఢిల్లీలో కన్నా చల్లగా ఉండవచ్చు.

ఆహ్వానితులందరూ వచ్చి సమావేశంలో పాల్గొని నాకు సహకారం అందచేస్తారని నమ్ముతున్నాను. నా మీద, వారి మీద, ఈ కొత్త ప్రయత్నం ద్వారా భారతదేశ భవిష్యత్తుకు సంబంధించిన ప్రగతిని సాధించే ఒక మహత్తరమైన బాధ్యత ఉంది.

ఈ సమావేశం విజయవంతమైతే కేంద్రంలో మనం కొత్త కార్యవర్గ మండలిని ఏర్పరచగలమని నాకు విశ్వాసముంది. మంత్రులు తమతమ పదవుల్ని గ్రహించి ప్రభుత్వ సంబంధమైన కార్యక్రమాలను ఇప్పుడు రాజ్యాంగ చట్టంలోని 93వ సెక్షన్ ప్రకారం పరిపాలింపబడుతున్న ప్రాంతాలలో చేపట్టగలరనీ, వారందరూ ఐకమత్యంతో కృషి చేయగలరని కూడా నాకు నమ్మకముంది.

ఒక సమయం ఈ సమావేశం దురదృష్టవశంగా విఫలమైతే ఇప్పటి పరిస్థితి కొనసాగిస్తూ అన్నిపక్షాలూ ఒక అవగాహనకు వచ్చేదాకా ఆగాల్సి వస్తుంది. ఇండియాకు ఇంతవరకు చాలా విలువైన సేవలనందించిన ఇప్పుడున్న కార్యవర్గమండలి, ఏ ప్రత్యామ్నాయ మార్గమూ అంగీకార్యంకాకపోతే ఇలానే బాధ్యతలను నిర్వహిస్తుంది.

కాని నాకు మాత్రం ఈ సమావేశం విజయవంతమౌతుందని నమ్మకముంది. కాకపోతే నాయకులందరూ పరస్పరం తమలో తాము, వారందరూ నాతో, సహకరించాల్సి ఉంటుంది. ఈ ప్రతిపాదన వెనుక అటు యునైటెడ్ కింగ్‌డమ్‌లోని ముఖ్యనాయకుల తరఫున, బ్రిటిష్ ప్రజలందరి తరఫున సామూహికంగా, భారతీయుల ధ్యేయం నెరవేరేలా సహకరించాలన్న హృదయపూర్వకమైన కోరిక ఉందని మాత్రం నేను హామీ ఇస్తున్నాను. ఇది ఆ ధ్యేయాన్ని అందుకోవటంలో ఒక అడుగు వెయ్యటంకన్నా అధికమైందే; చాలా దూరం పయనించటం; సరైన దారిలో పయనించటం కూడా అవుతుందని నేను విశ్వసిస్తాను.

ఈ ప్రతిపాదనలను బ్రిటిష్ ఇండియా పాలనకు సంబంధించి నంతవరకేననీ, వైస్రాయి (చక్రవర్తి ప్రతినిధి)తో రాజుల సంబంధాలను ఇవి ఏమాత్రం మార్చబోవని కూడా స్పష్టం చేస్తున్నాను.

బ్రిటిష్ ప్రభుత్వం వారి అనుమతితో, నా కార్యవర్గమండలిలో చర్చించినతరువాత, 'డిటెన్షన్'లో ఉన్న కాంగ్రెస్ పార్టీ వర్కింగ్ కమిటీ సభ్యుల విడుదల ఉత్తరువులు జారీ చేయబడ్డాయి. 1942లో జరిగిన అల్లర్ల కారణంగా నిర్బంధంలో ఉన్న వారిని గురించిన తుది నిర్ణయం కొత్తగా ఏర్పాటవుతుందనుకుంటున్న నూతన కేంద్ర ప్రభుత్వానికి ఆయా ప్రాంతీయ ప్రభుత్వాలకు వదలివేద్దామని అనుకొంటున్నాం. కేంద్ర రాష్ట్ర శాసనసభలకు కొత్తగా జరపబోయే ఎన్నికలు ఎప్పుడు జరగాలో ఆ సమావేశంలో చర్చించ బడుతుంది. చివరగా మీ అందరికీ నా విజ్ఞప్తి ఏమిటంటే - పరస్పర విశ్వాసం, నమ్మకం ఉన్న వాతావరణంలోనే మనం అభివృద్ధి సాధించగలం. అలాంటి వాతావరణాన్ని సృష్టించడానికి సహకరించండి. కొన్ని కోట్ల మంది నివసించే ఈ విశాల దేశ భవిష్యత్తు ఈ ఆపత్కాలంలో నాయకుల వివేకం మీద, పరస్పరఅవగాహనమీద, ఆధారపడివుంది. అటు పనిలోనూ, ఇటు

ఆలోచనలోనూ ఈ విజ్ఞతను కనపరచాలి. బ్రిటిష్ నాయకులైనా, భారతీయ నాయకులైనా ఈ దశలో సమానంగా పనిచేయాలి.

భారత భూమి కన్నపుత్రులు అన్ని దిశల నుంచి వచ్చి సైన్యంలో చేరి చేసిన సాహసోపేత కృత్యాల వల్ల భారతీయ సైన్య గౌరవం మునుపెన్నడూ లేనంతగా పెరిగింది. అంతర్జాతీయ సదస్సుల్లో భారతీయ ప్రతినిధులు తమ రాత నీతి కుశలతతో అత్యున్నత గౌరవాన్ని పొందారు. భారతీయుల కోరికలకు మునుపెన్నడూ లేని సానుభూతి ఈవాళ విశ్వవ్యాప్తంగా ఉంది. సంపన్నతవైపు, మునుపెన్నడూ లేనంత వేగంగా దేశం అభివృద్ధి మార్గంలో పయనిస్తోంది. అందుచేత మనం విజ్ఞతతో వాడుకో గలిగితే బ్రహ్మాండమైన నిధులే ఉన్నాయి. కాని అది అంత సులభమైన పనికాదు. తొందరగా అయ్యే పనికాదు. ఇంకా చాలా చేయాల్సి ఉంది. కానీ ఎన్నో లోపాలు, అపాయాలు ఉన్నాయి. అన్ని పక్షాలలోనూ క్షమించదగిందీ, మరిచిపోదగిందీ ఎప్పుడూ ఉంటాయి.

నాకు భారతదేశం భవిష్యత్తుపై నమ్మకం ఉంది నాకు సంబంధించినంత వరకు ఆమె గొప్పదనంలో గాఢమైన విశ్వాసం ఉంది. మీ అందరి సహకారాన్ని, విశ్వాసాన్ని నేను కోరుకుంటున్నాను.

## (iii) గాంధీ ప్రకటన

ఈ ప్రసంగం వినగానే నేను ఘనతవహించిన వైస్రాయిగారికి తంతి వార్త పంపాను. "నేను గుర్తింపు పొందిన కాంగ్రెస్ ప్రతినిధి"నని నాకు అర్హత లేదన్న విషయం వారికి గుర్తు చేశాను. ఆ పని కాంగ్రెస్ అధ్యక్షుడు చేయాల్సినపని; లేదా ఎవరిని కార్యవర్గం నియమిస్తుందో వారా సందర్భంలో చేయదగినపని అది.

చాలా సంవత్సరాలపాటు నేను కాంగ్రెస్ పార్టీకి అవసరమైనపుడల్లా అనధికారిక సలహాదారుడిగా ఉంటూ వచ్చాను. ఇలా అనధికార ప్రతినిధి స్వభావంతోనే నేను కెయిద్-ఎ-ఆజమ్ జిన్నాతో చర్చలకు వెళ్ళానని ప్రజలందరికీ గుర్తుంటుంది. ఈ సందర్భంలో కూడా బ్రిటిష్ ప్రభుత్వం తరఫున వైస్రాయి చేసిన ప్రతిపాదనల్ని చర్చించడానికి కూడా ఇంకో 'పదవి'లో నేను పోలేను. వైస్రాయిగారి ప్రసంగంలో ఒక విషయం నా చెవికి చాలా కటువుగా తోచింది. నాకే కాదు, రాజకీయంగా ఆలోచించే ఏ హిందువుకైనా అది బాధనే కల్గిస్తుంది. ఆయన వాడిన 'సవర్ణ హిందువులు' అనే మాటను నేనిక్కడ ప్రస్తావిస్తున్నాను. రాజకీయ పరిభాషలో చెబితే 'సవర్ణ హిందువు' అని చెప్పదగిన వ్యక్తి ఎవడూలేడని నేను ఉద్ఘాటిస్తున్నాను. భారత దేశాన్నంతా ప్రతిబింబిస్తానని చెబుతూ భారతరాజకీయ స్వాతంత్ర్యం కోసం పరితపిస్తున్న కాంగ్రెస్ కూడా కాదు. వీర్ సావర్కర్ కాని, శ్యాంప్రసాద్ ముఖర్జీ కాని హిందూ మహాసభ ప్రతినిధులు కావచ్చునేమో కాని వారు సవర్ణ హిందువులా? వారు కుల భేదాలు లేని హిందూమతాన్ని అంతటినీ ప్రతిబింబించటం లేదూ? వారిలో అస్పృశ్యులనబడేవారు భాగం కారూ? ఎవరైనా వారికి వారే సవర్ణ హిందువులని ప్రకటించుకున్నారా? ఎవరూ అలా చేయలేదని నా విశ్వాసం. రాజకీయ చింతన ఉన్న హిందువులలో ఒకరు కూడా కడకు గౌరవనీయులైన పండిత మాలవ్యగారు కూడా, ఎంత

కులభేదాలను పాటించేవారే అయినా, వారు సైతం తాము ఇతరుల కన్నా భిన్నంగా 'సవర్ణ హిందువు'లని పిలవబడటానికి అంగీకరించరు. హిందూ సమాజంలో హిందూ విపరీత వాదులు కొందరున్నారని నాకు తెలుసు. కాని హిందూ మతంలో ఇటీవల ధోరణి కులభేదాలను తొలిగించటం. కనుక వైస్రాయిగారు ఈ మాట అర్థాన్ని సంపూర్ణంగా తెలియకుండానే ప్రయోగించారని నేను నమ్మడం తప్పు చేయగలిగింది ఏమీలేదు. హిందూ సమాజంలోని మతపరమైన సహనభావనను తెలిసి తెలిసీ వైస్రాయి గారు, హిందువుల్ని గాయపరచడానికి గానీ, విభజించడానికిగాని చేసిన పని కాదని నేను ఈ విషయాన్ని వదలి వేస్తున్నాను. ఈ విషయాన్ని గురించి నేను ఇంత వివరంగా చెప్పేవాణ్ణి కాను. కాని ఈ మాట హిందువుల రాజకీయ చింతనను చాలా సుకుమారమైన చోట తాకుతుంది; రాజకీయ ప్రతిధ్వనులకు దారి తీస్తోంది. కాబట్టి చెప్పవలసి వచ్చింది.

ఇప్పుడు ప్రతిపాదిస్తున్న సమావేశం సముచితమైన రాజకీయ నేపథ్యంలో, విచ్ఛిత్తి ధోరణులకు అతీతంగా జరిగితే చాలా ఉపయోగకరమైన కార్యాన్ని చేయగలుగుతుంది. అందులో సందేహం లేదు. ఆహ్వానితులందరూ తమతమ వర్గాలకు ప్రతినిధుల్లాగా కాకుండా భారతీయుల్లాగా సమావేశానికి హాజరై భారతదేశానికి సహజంగా ఉన్న ధ్యేయాన్ని సాధించాలన్న సామూహికమైన కోరికతో పనిచేయాల్సి ఉంటుంది.

ఇలాగే ఇంతకు ముందు జరిగిన భూలాభాయి లియాఖత్ అలీ ఒప్పందాన్ని కూడా నేను అర్థం చేసుకున్నాను. ఇప్పుడు వైస్రాయి గారు తలపెట్టిన సమావేశానికి ఆ ఒప్పందమే పునాది అని నేను అనుకొంటాను. భూలాభాయి దేశాయి వారి ప్రతిపాదనలో వైస్రాయి ప్రసంగంలో కనిపించేంత ఆకర్షణ, రంగు, లేవు. భూలాభాయి దేశాయి తమ ప్రతిపాదనపై నా సలహా అడిగినపుడు నాపాత్ర నేను వహించానని చెప్పడానికి నేనేం సిగ్గు పడటంలేదు. నాకర్థమైనంత వరకు భూలాభాయి దేశాయిగారి ప్రతిపాదన నన్ను ఆకర్షించింది. జాతి సమస్య 'ముడిని' విప్పడానికి నిజంగా ఆసక్తితో చేసిన ప్రతిపాదనగా కనిపించింది. నేను నా పలుకుబడి నుపయోగించి వర్కింగ్ కమిటీ సభ్యులకు సకారణంగా ఈ ప్రతిపాదనను ఎందుకు సమ్మతించవచ్చో తెలిపి ఈ ప్రతిపాదనను వారిచేత అంగీకరింప చేస్తానని మాట ఇచ్చాను. అన్ని పక్షాల వారు ఈ ప్రతిపాదనను సరిగా అవగాహన చేసుకొని భారతదేశ స్వాతంత్ర్యమే అందరి ధ్యేయంగా ప్రవర్తిస్తే అన్నిసమస్యలూ పరిష్కారమవుతాయి.

ఈ అంశం దగ్గర నేను ఆపేస్తున్నాను. ఇక వర్కింగ్ కమిటి 'సూత్రాన్ని' పట్టుకొని ముందుకు పోవాలి. సమావేశంలో ఉత్పన్నమయ్యే ప్రశ్నలపైన కాంగ్రెస్ ఏమి భావిస్తోందో ప్రకటించాల్సిన వారు కమిటీ సభ్యులే - ఎ.పి.ఐ.

అనువాదం : *డా. హెచ్.ఎస్.బ్రహ్మానంద.*

# సూచిక

# గాంధీ: అస్పృశ్యుల విముక్తి

రచయిత :

**ది ఆనరబుల్ డా. బి.ఆర్. అంబేద్కర్**

ఎం.ఎ., పి.హెచ్.డి., డి.యస్‌సి., బారిస్టర్-ఎట్-లా.,
మెంబర్, గవర్నర్ జనరల్స్ ఎక్సిక్యూటివ్ - కౌన్సిల్

# విషయసూచిక

భూమిక

# భూమిక

'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పసిఫిక్ రిలేషన్స్'లోని భారత విభాగం అధ్యక్షుని ఆహ్వానం మేరకు గత సంవత్సరం ఆగస్టులో భారతదేశంలోని అస్పృశ్యుల సమస్యపై ఒక పరిశోధన వ్యాసం వ్రాశాను. కెనడాలోని క్యూబెక్‌కి చెందిన మాంట్ ట్రాంబ్లెంట్‌లో 1942లో జరగాల్సిన సదస్సులో ఒక సెషన్‌లో సమర్పించ వలసింది. ఆ సదస్సు ప్రొసీడింగ్స్‌లో ఈ వ్యాసం ముద్రించబడింది. నేను ఇటువంటి వ్యాసం రాశానని తెలియగానే అస్పృశ్య వర్గం నాయకులు, ఈ సమస్య పట్ల ఆసక్తి ఉన్న అమెరికన్‌లు ఈ అంశాన్ని ఒక గ్రంథ రూపంలో వ్రాసి సాధారణ ప్రజానీకానికి అందుబాటులోనికి తేవాలని బలవంతపెడుతూ వచ్చారు. అదే సమయంలో ఆ సదస్సు ప్రొసీడింగ్స్ బయటికి వచ్చాయని నాకిష్టముంటే నా వ్యాసాన్ని ముద్రించుకోడానికి వారికెలాంటి అభ్యంతరం లేదని తెలిపారు. దీన్ని బట్టి నేనీ వ్యాసాన్ని రాసిన దాదాపు 10 నెలల తర్వాత ఇప్పుడెందుకు ముద్రిస్తున్నానో అర్థం చేసుకోవచ్చు.

కొన్ని క్రియా రూపాలను మార్చటం తప్ప ఈ వ్యాసం ఆ సదస్సుకు ఎలా సమర్పించబడినదో అలా ముద్రింపబడుతోంది. ఈ వ్యాసంలోని విషయాలన్నీ స్పష్టంగా వున్నాయి. ఒకే ఒక అంశాన్ని నేను చేర్చదలుస్తున్నాను. మానవులలోని మేధావి వర్గంలో ఈశాంతి సదస్సు నాలుగు అంశాలను గురించి చర్చిస్తుందన్న ఒక అవగాహన వుంది. ఆ అంశాలు (1) సామ్రాజ్యవాదం, (2) జాతివాదం, (3) సెమిటిజం వ్యతిరేకత (4) మ్యూనిషన్స్ దీన్నే ఫ్రీ టాపిక్ అని కూడా అంటారు. ఈ నాల్గింటినీ ఒక దేశం మరొకదేశాన్ని క్రూరంగానూ, ఒక మనిషి ఇంకొక మనిషిని అమానవీయంగాను చూసే దృష్టికి మూలమైన ప్లేగు నాళాలుగా చెప్పవచ్చును. ఒక కొత్త మెరుగైన ప్రపంచం ఈ భయంకరమైన విధ్వంసకారకమైన యుద్ధమనే చితాభస్మం నుంచి ప్రభవించాలంటే ఈ సమస్యలను మనం పరిష్కరించాలనటంలో సందేహం లేదు. నా భయమేమిటంటే ఇంత వరకూ జరుగుతున్నట్టుగానే అస్పృశ్యుల సమస్యను మరచిపోవచ్చునని అలా జరిగితే నిజంగా పెద్ద దురదృష్టమే. సరియైన ప్రచారం లేక పోయినంత మాత్రాన అస్పృశ్యులు ఇండియాలో

పడుతున్న కష్టాలు పాశ్చాత్యదేశాలలో యూదులు పడుతున్న కష్టాలకన్నా వాస్తవికమైనవి కావు. నాజీలు యూదులపై ఉపయోగించిన రక్తపాతాన్ని సృష్టించినంత క్రూరమైన పద్ధతులు కాకపోయినా హిందువులు అస్పృశ్యులను అణచివేసిన పద్ధతులు, సాధనాల ప్రభావంలో అంతకన్నా తక్కువైనవేం కావు. యూదులమీద నాజీల వ్యతిరేకతలోని ఏంటీసెమిటిజం ఎలాంటిదో భావజాలరీత్యా అస్పృశ్యులకు వ్యతిరేకమైన హిందువుల సనాతనత్వభావన కూడా అలాంటిదే. ఇతర దళిత వర్గాల లాగానే అస్పృశ్యుల శృంఖలాలను తెంచి వారిని స్వతంత్రులుగా చేయడం ఈనాటి ప్రపంచ బాధ్యత. ఈ పత్రం రాయటానికి ఎందుకు అంగీకరించానంటే ఒక కారణం ఉంది. ప్రపంచంలోని బానిసలు, యూదులు, నీగ్రోలు బాధపడుతున్న వారే అయినా హరిజనులతో వీరిని పోల్చి చూస్తే వీరి బాధ చాలా స్వల్పంగా కన్పిస్తుంది. ఇట్లాంటి సమస్యను ప్రపంచం దృష్టికి తీసుకురావచ్చుకదా అనే సంకల్పంతో ఈ వ్యాసం రాశాను. ఈ పత్రాలను ఇలా ప్రచురించడం శాంతి సదస్సువారు విని నిర్ణయం చేయగల కారణాల పట్టికలో ఉంటుందని ప్రపంచ న్యాయ స్థానం ముందు హిందువులు సమాధానం చెప్పవలసిన ప్రశ్నగా ఉంటుందని వీరందరికీ ఇది ఒక నోటీసువలె పని చేస్తున్నది.

22, పృధ్వీరాజ్‌రోడ్
న్యూఢిల్లీ,
సెప్టెంబర్ 1, 1948

బి.ఆర్. అంబేద్కర్

## అధ్యాయం I

# అస్పృశ్యుల మొత్తం జనాభా

ఇండియాలో పదేళ్ళకు ఒక్కసారి జనాభా లెక్కలు వేయడం ఒకప్పుడు మాల్థ్యూస్ అనుయాయులకు మాత్రమే నచ్చిన ఒక చిన్న అమాయకమైన వ్యాపారం. అది ఇతరులెవ్వరికి పట్టిన పనికాదు. కాని ఇవ్వాళ జన సంఖ్యా వివరాలు ప్రతి ఒక్కడు అత్యంత ఆసక్తితో గమనిస్తున్నారు. కేవలం రాజకీయ వాదులకే కాకుండా ఇండియాలో సాధారణ పౌరులు కూడా అత్యంత ప్రధాన విషయంగా ఆసక్తి కనబరుస్తున్నారు. ఇలా ఎందుకైందంటే ఇండియాలో రాజకీయమే గణాంకాలకు సంబంధించిన వ్యాపారం అయింది. కాబట్టి ప్రపంచంలో ఇంకెక్కడా లేనట్టుగా జన సంఖ్యను బట్టి ఇంకొక కులానికి లేని అవకాశాలు కనిపించే దేశం భారతదేశం ఒక్కటే. దీనిఫలితంగా ఇండియాలో జనాభా లెక్కలు ఎప్పుడూ ఆయాసందర్భాలలో ఆయా సంఖ్యలు ఇచ్చే అవకాశాలను బట్టి వండబడుతుంటాయి (మారుతుంటాయి). ఈ జనాభా వంటకం వండటంలో హిందువులు ముస్లింలు సిక్కులు ముఖ్యమైన వంటవారుగా వంటింట్లో పని చేశారు. అస్పృశ్యులకు, క్రైస్తవులకు కూడా వారి సంఖ్యల విషయంలో ఆసక్తి ఉందిగాని, ఆ వంటకం తయారీలో వీరికి భాగస్వామ్యం లేదు. ఎందుకంటే ఈ జనాభా లెక్కల పనిని చూసే పరిపాలనా ఉద్యోగాల్లో వారికి స్థానం లేదు కాబట్టి. ఇంకొక విషయం ఏమిటంటే అస్పృశ్యులను ఓచోట నిలిపి వారికి ఆహారం వండి వడ్డించే వారు హిందువులు, ముస్లింలు, సిక్కులే. ఇది ప్రతి పదేళ్ళకు ఒకసారి జరిగే జనాభా లెక్కల సేకరణలో జరుగుతూనే ఉంది. అందులోను ముఖ్యంగా గత 1940లో జనాభా లెక్కలు తీసినప్పుడు ఇది విశేషంగా జరిగింది. పంజాబ్ రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో ఉన్న అస్పృశ్యులను సిక్కులు పకడ్బందీగా అతి నిరంకుశంగా అణచివేశారు.

సెన్సెస్ వివరాలడిగినప్పుడు తాము సిక్కులు కాకపోయినా సిక్కులనే ప్రకటించాలని బలవంతపెట్టారు. దీనితో సిక్కుల సంఖ్య విపరీతంగా ఉబ్బి అస్పృశ్యుల సంఖ్య తరిగిపోయింది. ఇక హిందువులు అయితే సెన్సెస్ వివరాలు అడిగినప్పుడు తమ కులాన్ని ఎవరూ బయట పెట్టకూడదని ఒక పెద్ద దండయాత్ర మొదలుపెట్టారు. అస్పృశ్యులకు ఒక ప్రత్యేక విజ్ఞప్తి చేశారు. అదేమిటంటే ఆకులం పేరు చెప్పడం వల్లనే వారికి అస్పృశ్యులని పేరు వచ్చిందని అందుచేత వాళ్లు తమ కులం పేరు చెప్పకుండా హిందువులని చెబితే వారికి హిందువులందరితో పాటుగా మన్నన లభిస్తుందని దీనివల్ల ఎవరూ 'వారు అస్పృశ్యులా? కారా?' అని తెలుసుకోలేరని ఓ సలహా నిచ్చారు. పాపం అస్పృశ్యులు ఈ వ్యూహానికి బలై తమను తాము అస్పృశ్యులుగా ప్రకటించుకోక హిందువులనే పిలుచుకున్నారు. దీని ఫలితం చాలా స్పష్టంగా తెలుస్తూనే ఉంది. అస్పృశ్యుల సంఖ్య తగ్గిపోయింది. హిందువుల స్థాయి బాగా ఉబ్బింది. ఈ పద్ధతిలో ఎంత వరకు జనాభా లెక్కలు వంచబడ్డాయో చెప్పడం చాలా కష్టం. కానీ నిస్సందేహంగా ఈ గణాంక వివరాలు చాలా వరకు వంచబడినవే అని మాత్రం చెప్పవచ్చు. మొత్తం దేశం అంతటా జనాభా వివరాలు ఇలాగే వంచబడ్డాయి. ఇలా చేయటం వల్ల అత్యధికమైన ఇబ్బందికి గురైన వారు అస్పృశ్యులు. ఇదిలా ఉండగా బ్రిటిష్ ఇండియాలో అస్పృశ్యులు మొత్తం జనాభాగా చెప్పబడుతున్న సంఖ్య సరైన మొత్తంగా పరిగణించడానికి వీలులేదు. కాని బ్రిటిష్ ఇండియాలోని ఈనాటి అస్పృశ్యుల సంఖ్య దాదాపు 60 మిలియన్లు అని చెబితే అది సత్యదూరమేమీ కాదు.

## అధ్యాయం II

# అస్పృశ్యుల ప్రాముఖ్యత

వార్డ్ సృష్టించిన క్రింది వర్గం (లో)కి సంబంధించిన ప్రజల వంటి వారు ప్రపంచంలో చాలా భాగాల్లో ఉండేవారు. రోమనులకు బానిసలు, స్పార్టనులకు హెలాట్లు. బ్రిటిష వారికి విలీన్లు, అమెరికన్లకు నీగ్రోలు. జర్మన్లకు యూదులు. ఇలాంటి వారు అట్లాగే హిందువులకు అస్పృశ్యులున్నారు. కానీ పైవారిలో ఎవ్వరూ అనుభవించని దౌర్భాగ్యాన్ని అస్పృశ్యులు అనుభవిస్తున్నారు. బానిసత్వం పోయింది. సెర్ఫడం పోయింది. విలినేజ్ పోయింది. [ఇవన్నీ భిన్న ప్రాంతాల్లో బానిస రూపాంతరాలు] కానీ అస్పృశ్యత ఇంకా అలానే ఉంది. హిందూత్వం ఉన్నంత కాలం తానూ ఉండబోతానని ప్రకటిస్తోంది. యూదునికన్నా అస్పృశ్యుడు చాలా నీచ పరిస్థితిలో ఉన్నాడు. యూదుని బాధలు చాలా స్వయంకృతాలు. కానీ అస్పృశ్యుల బాధలు అలాంటివి కావు. అతి క్రూరంగా మనుష్యులను లెక్కించే హిందూత్వం ప్రభావం ఇది. దాని దెబ్బ పశుబలం కంటే ఏ మాత్రం తక్కువ ప్రభావం చూపదు. యూదుల్ని నిర్లక్ష్యం చేశారు కాని వారికి పెరిగే అవకాశాలు లేకుండా చేయలేదు. కాని అస్పృశ్యుడు నిర్లక్ష్యం చేయబడ్డాడు. ఎదగడానికి ఏ అవకాశం లేకుండా ఉండిపోయాడు. అయినా వీరి సమస్య గురించి పైన వేసుకుని కృషి చేసేవారి మాట అటుంచి, దాదాపు 60 మిలియన్ల సంఖ్య ఉన్న వీరిని గురించి గమనించే వాడు కూడా కనిపించడం లేదు.

ఈ భారతీయ శ్రమ జీవితంలో స్వేచ్ఛాకారణమైన స్వాతంత్ర్యం కావాలని కోరుకోడానికి హేతువేదైనా ఉందంటే అది అస్పృశ్యుల సమస్యే. హిందువుల సమస్య కాని, ముస్లింల సమస్య కాని స్వాతంత్ర్యానికి సంబంధించిన సమస్య కాదు. వారిది అధికారం కోసం పోరాటం తప్ప స్వాతంత్ర్యం కోసం కాదు. అందుచేతే స్వాతంత్ర్యం కోసం దీక్ష వహించిన ఏ పార్టీ కాని, సంస్థ గానీ అస్పృశ్యుల విషయంగా ఆసక్తి చూపక పోవడం నాకు

ఆశ్చర్యం కలిగిస్తూనే ఉంది. అమెరికాలో 'ది నేషన్' అనే వారపత్రిక కూడా ఉంది. అలాగే 'స్టేట్స్‌మన్' అనే బ్రిటిష్ వారపత్రిక కూడా ఉంది. ఇవన్నీ చాలా శక్తివంతమైన పత్రికలు. ఈ రెండూ భారతీయ స్వాతంత్ర్యోద్యమం పట్ల సానుభూతి స్నేహం కలిగినవే. అమెరికన్ లేబర్, బ్రిటిష్ లేబర్ అనే శ్రామిక సమస్యలు కూడా భారతీయ స్వాతంత్ర్యానికి మద్ధతు నిచ్చేవే. కానీ వీటిలో ఏవీ అస్పృశ్యుల సమస్య పట్ల పక్షపాతంతో ఎప్పుడూ కృషి చేయలేదు. వాస్తవంగా వారు చేసిన పనేంటంటే ఏ స్వాతంత్ర్య ప్రియులు చేయని పని. వారు భారతీయ జాతీయ కాంగ్రెస్ అంటే మేమేనని చెప్పుకునే హిందూ వర్గంతో సమైక్యమయ్యారు. కాని హిందువులను తప్ప ఎవర్నడిగినా కాంగ్రెస్ అనే సంస్థ హిందూ పెట్టుబడి దారులచేత ఆర్థిక సహాయం పొందిన మధ్య తరగతి హిందువుల సంస్థ అని ప్రతి ఒక్కరూ నిస్సందేహంగా చెప్పగలుగుతాడు. ఆ పెట్టుబడిదారుల ఉద్దేశ్యం భారతీయుల్ని స్వతంత్రుల్ని చేయటం కాదు. తాము బ్రిటిష్ నియంత్రణ నుంచి స్వేచ్ఛను పొంది ఈనాడు బ్రిటిష్ వాళ్ళున్న అధికారాలను తాము చేజిక్కించుకోవటమే. కాంగ్రెస్ కోరుకునేటటువంటి స్వాతంత్ర్యం సిద్ధిస్తే హిందువులు నిస్సంశయంగా ఇంతకాలము అస్పృశ్యులకు ఏం చేస్తూ వచ్చారో అదే చేయబోతారు. అందుచేత ఈ ఉదాసీన స్వభావం నేపథ్యంలో క్రొత్త భారతీయ రాజ్యాంగంలో అస్పృశ్యుల స్థానం ఎలా ఉండాలో చర్చిస్తూ నన్ను వ్యాసం రాయమని అడిగినందుకు "ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పసిఫిక్ రిలేషన్స్" వారి భారతీయ శాఖకు నా అభినందనలు తెలియచేస్తున్నాను. ఇలాంటి ఆహ్వానం నాకు రావడం వెదకపోయిన తీగ కాళ్ళకు తగిలినట్టుంది. అంతే కాకుండా నాకు పెద్ద ఉపశమనంగా వుంది. అందుకే నాకు ఎన్నో పనులున్నా సమయం చిక్కించుకొని ఈ వ్యాసం రాయడానికి అంగీకరించాను.

# అధ్యాయం III

# అస్పృశ్యుల రాజకీయ డిమాండ్‌లు

అస్పృశ్యుల సమస్య ఒక బ్రహ్మాండమైన సమస్య. వాస్తవానికి నేను కొంత కాలంగా ఈ విషయంపై కృషి చేస్తున్నాను. దాన్నంతా రాయాలంటే కొన్ని వందల పుటలు పడుతుంది. అలా కాకుండా ఈ వ్యాసం పరిమితులకు లోబడి నేను చెప్పదగిందేమిటంటే సంక్షిప్తంగా ఈ సమస్య పరిధిని తెలిపి, తోడుగా అస్పృశ్యులు తమకు తాము సూచించిన పరిష్కార మార్గాన్ని పరిచయం చేయటం. అఖిల భారత *షెడ్యూల్డ్ కులాల సదస్సు నాగపూర్‌లో 1942 జూలై 18,19 తేదీల్లో జరిగింది. ఈ సభలో ప్రతిపాదించిన తీర్మానాలతో ఈ వ్యాసాన్ని మొదలు పెట్టడం అత్యంత సముచితమని నాకనిపిస్తోంది..:-

### తీర్మానం 2

### రాజ్యాంగానికి సమ్మతి అవసరం

ఈ సదస్సు ఏ విధమైన రాజ్యాంగమైనా క్రింది అంశాలు కలిగి ఉంటేనే......

(1) షెడ్యూల్డ్ కులాల అనుమతి ఉండాలి.

(2) షెడ్యూల్డ్ కులాలు ఒక విలక్షణ ప్రత్యేక వర్గమని హిందువుల కంటే భిన్నమని భారతీయ జాతీయ జీవితంలో వీరు ఒక ముఖ్యమైన వర్గమని గుర్తించాలి.

(3) కొత్త రాజ్యాంగంలోనే షెడ్యూల్డ్ కులాలకు నిజమైన భద్రతా భావనను కల్గించే నిబంధనలు ఉండాలి. ఆ నిబంధనలు క్రింది తీర్మానాలలో ప్రతిపాదింపబడుతున్నాయి.

---

* 1935 సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టం కింద అస్పృశ్యులను షెడ్యూల్డ్ కులాల వారుగా పేర్కొనడం జరిగింది.

## తీర్మానం 3

## క్రొత్త రాజ్యాంగంలో ఉండాల్సిన అతిముఖ్య నిబంధనలు

షెడ్యూల్డ్ కులాల వారిలో భద్రతా భావన కల్గటం కోసం కొత్త రాజ్యాంగంలో క్రింది నిబంధనలుండాలని ఈ సదస్సు డిమాండ్ చేస్తోంది.

(1) ప్రతి ప్రాంతీయ ప్రభుత్వం తమ బడ్జెట్‌లో ఒక అవగాహన మేరకు సంవత్సరానికి కొంత మొత్తం షెడ్యూల్డ్ కులాల పిల్లల ప్రాథమిక విద్యకు, సంవత్సరానికి మరి కొంత ధనాన్ని ఉన్నత విద్యాభివృద్ధి కోసం కేటాయించాలి. ఆయా ప్రభుత్వానికి వచ్చే సంవత్సరాదాయంలో దీనిని మొదటి ఖర్చుగా ప్రకటించాలి.

(2) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలలో షెడ్యూల్డ్ కులాల వారి సంఖ్యను అవసరాన్ని ప్రాధాన్యాన్ని బట్టి సముచిత ప్రాతినిధ్యం ఉండేలా చట్టపరంగా నిబంధన చేయాలి.

(3) పబ్లిక్ సర్వీసులలో కూడా షెడ్యూల్డ్ కులాల వారి సంఖ్యను, అవసరాల్ని ప్రాముఖ్యాన్ని బట్టి ఉద్యోగావకాశాలు ఉండేలా చట్టపరమైన నిబంధన ఉండాలి. జ్యుడీషియల్, పోలీస్, రెవెన్యూ మొదలైన సెక్యూరిటీ ఉద్యోగాలలో కూడా కనీస విద్యార్హత ఉన్న షెడ్యూల్డ్ కులాల వారికి కేటాయించిన నిష్పత్తి ప్రకారం పది సంవత్సరాల లోపల ఉద్యోగావకాశాలు కల్పించాలి.

(4) శాసన సభలలోను, స్థానిక సంస్థలలోను వారి సంఖ్యను, అవసరాల్ని, ప్రాముఖ్యతను బట్టి ప్రాతినిధ్యం ఉండేలా చట్టపరమైన నిబంధనలు చేయాలి.

(5) పైవిధంగా శాసన సభలలో స్థానిక సంస్థలలో ప్రాతినిధ్యం షెడ్యూల్డ్ కులాలకు ప్రత్యేకంగా కేటాయించిన నియోజకవర్గాల ద్వారా సిద్ధించేలా చట్ట నిబంధన ఉండాలి.

(6) కేంద్ర రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్‌లలో షెడ్యూల్డ్ కులాల వాళ్లకు ప్రాతినిధ్యం ఉండేలా చట్టనిబంధన ఉండాలి.

## తీర్మానం 4

## ప్రత్యేక నివాసాలు

ఈ క్రింది అభిప్రాయాన్ని సదస్సు అందరి అభిప్రాయం (Considered Opinion) తెలుపుతోంది.

(అ) ఎంతకాలమైతే షెడ్యూల్డ్ కులాల వారు హిందువుల పల్లెల సరిహద్దుల్లోపరిమిత సంఖ్యలలో, ఏ విధమైన జీవనాధారం లేకుండా కాలం గడుపుతూఉంటారో, అంతవరకు వారు అస్పృశ్యులు గానే కొనసాగుతూ, హిందువులనిరంకుశత్వానికి, అణచివేతకు లోనవుతూ, స్వతంత్రంగా, సునాయాసంగాజీవించలేరు.

(ఆ) రానున్న స్వరాజ్ ఇప్పుడుండే హిందూరాజ్ కంటే భిన్నంగా ఉండదు. కనుకషెడ్యూల్డ్ కులాల వారు సవర్ణ హిందువుల నిరంకుశత్వం నుండి, అణచివేతనుండి తమను కాపాడుకోవడం ఎంతైనా అవసరం.

(ఇ) షెడ్యూల్డ్ కులాల వారు సంపూర్ణ మానవులుగా అభివృద్ధి చెందడానికిఆర్థిక, సాంఘిక భద్రతలకు, వారు గురి అవుతున్న అంటరానితనం నుండి స్వేచ్ఛపొందవలసి ఉంది.

సదస్సు చాలా సుదీర్ఘంగా అర్థవంతంగా గడిపిన చర్చల ఫలితంగా కొన్నిదశాబ్దాల పాటుగా హిందువుల చేతుల్లో అష్టకష్టాలకు గురైన షెడ్యూల్డ్‌కులాల బాధలకు మూలమైన ప్రస్తుత భారతీయ గ్రామీణ జీవిత పద్ధతిలోమౌలికమైన మార్పు తీసుకురావాలన్న నిర్ణయానికి వచ్చింది. ఈ మార్పులఆవశ్యకతను గుర్తిస్తూ ప్రభుత్వంలో తెస్తున్న రాజ్యాంగ సంబంధమైనమార్పులతో పాటు గ్రామీణ జీవిత విధానంలో కూడా క్రింది విధాలైన మార్పులుతీసుకురావాలని కోరుకొంటున్నది.

(1). హిందువుల పల్లెలకు సంబంధం లేకుండా దూరంగా ఇప్పుడున్న చోట్లనుంచి తరలించి ప్రత్యేకంగా షెడ్యూల్డ్ కుల గ్రామాలు ఏర్పాటు చేసుకోవడానికివీలుగా అవకాశం కల్పించాలి.

(2) కొత్త గ్రామాలలో షెడ్యూల్డ్ కులాల వారి నివాసం కోసం 'సెటిల్‌మెంట్‌కమీషన్'ని ఒకదాన్ని ఏర్పరుస్తూ రాజ్యాంగంలో ఒక నిబంధన ఉండాలి.

(3) ప్రభుత్వానికి సంబంధించిన అనాక్రమిత వ్యవసాయ భూముల్ని కమీషన్‌కివశం చేయాలి. కమీషన్ వారు దాన్ని షెడ్యూల్డ్ కులాల వారి నివాసాలకుగానుకేటాయించాలి.

(4) లాండ్ అక్విజిషన్ యాక్ట్ క్రింద ప్రైవేట్ యజమానుల నుంచి క్రొత్తభూములను కొని షెడ్యూల్డ్ కులాల వారి నివేశన పథకాన్ని పూర్తి చేయాలి.

(5) సెటిల్‌మెంట్ కమీషన్‌కు ఏటా 5 కోట్ల రూపాయల గ్రాంటు ఇచ్చి వారిబాధ్యతల్ని నెరవేర్చేలా రాజ్యాంగంలో నిబంధన చేర్చాలి.

## అధ్యాయం IV

# హిందువుల వ్యతిరేకత

ముందటి తీర్మానాల్లో ప్రతిపాదింపబడిన డిమాండులు మూడు వర్గాల కిందికి వస్తాయి. 1. రాజకీయ. 2 విద్యాసంబంధిత 3. ఆర్థిక సాంఘిక సంబంధులు.

రాజకీయ డిమాండు విషయం గమనిస్తే వారు మూడు రకాల భద్రతల్ని కోరుతున్నారని స్పష్టమవుతుంది.

(1) శాసన సభ కేవలం ప్రజల ప్రాతినిధ్యాన్ని కల్గింది కాకుండా వేరు వేరుగా హిందువుల, అస్పృశ్యుల ప్రాతినిధ్యాన్ని చూపించాలి.

(2) కార్యవర్గం కూడా కేవలం శాసనసభ, అంటే హిందువులకు మాత్రమే బాధ్యత వహించేది కాకుండా అటు హిందువులకు, ఇటు అస్పృశ్యులకు బాధ్యత వహించేదిగా వుండాలి.

(3) పాలనా యంత్రాంగం నైపుణ్యం కలవి మాత్రమే కాకుండా అన్ని వర్గాల నమ్మకాన్ని చూరగొన కల్గిందిగా ఉండాలి. అస్పృశ్యుల విశ్వాసాన్ని కూడా పొందగలిగి వుండాలి. అస్పృశ్యుల ప్రతినిధులు కీలకమైన పదవుల్లో వున్నప్పుడే ఈ విశ్వాసాన్ని పొందటం సాధ్యమవుతుంది.

అస్పృశ్యుల రాజకీయ డిమాండులు అస్పృశ్యులకు హిందువులకు నడుమ చాలా వివాదగ్రస్తమైన విషయమైంది. అస్పృశ్యుల స్నేహితుడైన గాంధీ ఈ కోరికల్ని అంగీకరించడం కన్నా ఆమరణ నిరాహార దీక్ష చెయ్యటం మేలని భావించారు. ఇప్పుడే కోరికల్ని అంగీకరించినా, ఈ కోరికలకి అంతర్గతంగా వున్న న్యాయ బద్ధత విషయంగా మాత్రం ఆయన ఇంకా

ఒక సమన్వయానికి (Reconciliation) రాలేదు. ఈ దశలో హిందువులు లేదా కాంగ్రెస్ వారు చెప్పే "ప్రతినిధి ప్రభుత్వం" ఎలా వుంటుందో చూపడం బాగుంటుందని తలుస్తాను. అది ఈ క్రింది విధంగా వుంటుంది.

(1) కేవలం ప్రాంతీయ నియోజకవర్గాల నాధారంగా శాసనసభకు ఎన్నుకోవాలి.

(2) శాసనసభలో ఉన్న మెజారిటీ పార్టీ నుండీ కార్య నిర్వాహక వర్గాన్ని నియమించాలి.

(3) నైపుణ్యాన్ని ప్రమాణంగా మాత్రమే ఆధారపడి పాలనాయంత్రాంగం 'పబ్లిక్ సర్వీస్' చేత నియంత్రిత మవుతుంది.

కాంగ్రెస్‌కి చెందిన హిందువులు తమ ప్రియమైన ఈ పథకాన్ని జాతీయ పథకము అంటారు. అస్పృశ్యులు ప్రతిపాదించే పథకాన్ని కుల పథకం అంటారు. ఈ విభేద పరిగణనలో అర్థం లేదు. నీకు నచ్చని దానికి ఒక చెడ్డపేరు, కంపరం పుట్టించే పేరు పెడితే సరిపోతుందంటారే అలా వుందది. సహజంగానే బలహీనంగా వుండే విషయానికి ఇలాంటి యుక్తుల ద్వారా బలం పోయలేం. దాని బలహీనతల్ని బయట పెట్టడం కోసం తొలుత నేను ఆ జాతీయ పథకంలోని మేళ్ళను పరిశీలిస్తాను. అంత కన్నా ముందు ఈ రెండు పథకాలోని సామ్యాలను, భేదాలను చూడడం మంచిది. రెండిటికీ ప్రయోజనం ప్రతినిధి 'శాసనసభ'ను పర్యటించచడమే. కాని భేదమంతా ఏ పద్ధతిలో ప్రణాళిక తయారు చేస్తే నిజంగా అది ప్రతినిధి 'శాసనసభ' అవుతుందన్న విషయంలో వుంది. జాతీయ పథకం ప్రాంతాల (భౌగోళిక) నియోజకవర్గాలే ఇండియాలో ప్రతనిధి శాసనసభల్ని సక్రమంగా, సమగ్రంగా ఏర్పరచగలవని భావిస్తుంది. కుల పథకం భారత దేశంలో విలక్షణమైన సామాజిక నిర్మాణం కారణంగా భౌగోళిక శాసనసభలు నిజంగా ప్రతినిధి శాసన సభల్ని ఏర్పరచగలవని అంటుంది. కేవలం ప్రాంతీయ నియోజకవర్గాలు ఇండియాలో నిజమైన ప్రతినిధి సభల్ని నిర్మించగలవా? లేదా? అన్నదే సమస్య. ఈ అంశం చుట్టూనే పెద్ద వివాదం చెలరేగింది.

పాశ్చాత్యునికి ఈ జాతీయ పథకం సహజంగానే చాలా నచ్చుతుంది."కులపథకం" కన్నా అదే మేలని భావిస్తాడు. ఎందుకంటే పాశ్చాత్యులకు తెలిసింది, అలవాటులో వున్నది ప్రాంతీయ శాసన సభలే కాబట్టి. కాని ఈ జాతీయ పథకం గట్టి పునాదులు కల్గింది కాదని, ఉద్దేశ్యాలను గమనిస్తే అది కులపథకం కన్నా నీచమైందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

జాతీయ పథకం బలహీనమైందని చెప్పడానికి కాస్సేపు ఆగి వారు చెప్పే సామర్థ్యం, సమగ్రతలు ఈ పథకం వెనక వున్న ధ్యేయాల్లో ఉన్నాయేమో చూస్తే మనకు తెలుస్తుంది. ఈ పథకం వెనుక ఉన్న భావనలు ఏవి? కొన్ని ముఖ్యమైనవి పేర్కొంటాను.

(1) నియోజకవర్గంలోని మెజారిటీ వోటర్లు ఆ నియోజకవర్గంలోని ప్రజలందరి అభీష్టాన్ని ప్రతిబింబించగలరని నమ్ముతుంది.

(2) నియోజకవర్గ సాధారణ అభిప్రాయాన్ని మెజారిటీ వోటర్ల ఆధారంగా గుర్తిస్తే చాలు. ఒక వర్గం వారి అభిప్రాయం అది మెజారిటీ వారిలో ఎంత వైరుధ్యం కల్గిందే ఐనా దాన్ని ఏ మాత్రం పశ్చాత్తాపం అసమానతను కల్గించిన దోషభావన లేకుండా దాన్ని వదిలి వేయవచ్చు.

(3) వోటర్లచే ఎన్నుకోబడిన ప్రతినిధి వారందరి ఆశయాలను ప్రతిబింబిస్తాడు. ఆ ప్రతినిధి తనవర్గ ప్రయోజనాల్ని సాధించటానికై తాను వోటేసిన వోటరు ఆశయాలను వమ్ము చేయగలడనే అపాయం లేదు.

ఈ భావనలన్నీ తప్పుడు ఊహాలే. ఏ సిద్ధాంతమును ఈ వూహను సమర్థించదు. అనుభవాన్ని బట్టి చూసినా ఇది అవాస్తవికమని తెలుస్తుంది. పార్లమెంటరీ ప్రభుత్వాల చరిత్రను గమనిస్తే పై వూహాలన్నీ అబద్ధాలని తేలుతుంది. కడకు ఇంగ్లండు చరిత్రను చదివినా చాలు. ఇదే కథ తెలుస్తుంది. అన్ని సందర్భాలలోను మెజారిటీ ప్రతినిధులు అన్ని వర్గాల ప్రజల ఆశయమును ప్రతిబింబిస్తారని ఊహించడం తప్పు. వాస్తవానికి ఈ పద్ధతి ప్రాతినిధ్యం ఏమాత్రం సంతప్తికరంగా ప్రజల ఆశయాల్ని ప్రతిబింబించలేదు. ఒక సమయం అలా చేసినా అది ఒక వెలవెలబోయ ప్రతిఫలనం అవుతుందేమో. ఆ ప్రతిఫలం కూడా ఆ నియోజకవర్గంలోని అన్ని వర్గాల ప్రజలు చేత తెలిసి సమానంగా పంచుకోబడిన ఆశయాలు ఎన్ని? ఆయా వర్గాల ప్రజల మధ్య ఎంత స్వేచ్ఛగా సమగ్రంగా పరస్పరావగాహన వుంది అనే అంశం మీద ఆధారపడి వుంటుంది. భారతదేశం లాంటి దేశంలో ఇలా సమానమైన ఆశయాలు ఉండడం అసాధ్యమైన విషయం. ఎందుకంటే భిన్న కులాల ప్రజల మధ్య ఇక్కడ స్వేచ్ఛతో కూడిన అరమరికలులేని అవగాహన కలసి మెలసి ఉండడం లేదు కాబట్టి. అందరూ పాల్గొనే సమానమైన సందర్భాలు లేవు. అంచేత ఒక వర్గం అతి పెద్దదైనా చిన్నదైనా అందరి ఆశయాలను ప్రతిబింబించే అవకాశం లేదు. మెజారిటీల కోరిక మెజారిటీల కొరకే. అంతకంటే మరేం కాదు. ఎంత తర్కంతో కూడిన నేర్పుతో మాట్లాడినా ఈ వాస్తవాన్ని మాత్రం మార్చలేం. దాన్ని అంగీకరించడమంటే మెజారిటీ ప్రజల జులుంను కొనసాగించడానికి అంగీకరించడమే.

మరో విషయం : శాసనసభకు ఎన్నికైన వ్యక్తి వోటర్ల ఆశయాల్ని ప్రతిబింబిస్తాడని, తన వర్గం ఆశయాల్ని వదలివేస్తాడనో, మరచి పోతాడనో అనుకోవడం కూడా చాలా తప్పే. ప్రతినిధి మనస్తత్వం విభక్తమైన నిజాయితీని ప్రతిబింబిస్తుంది. అతనిని రెండు మూడు రకాల పరస్పర విరుద్ధమైన పనులు ఎదుర్కొంటాయి. 1. తనపట్ల బాధ్యత 2. తన వర్గం పట్ల బాధ్యత. 3. వోటర్ల పట్ల బాధ్యత. మొదటి అంశాన్ని మినహాయిస్తే అందరి అనుభవం ఏం చెబుతుందంటే ఏ ప్రతినిధి అయినా తన వర్గ ప్రయోజనాలను వోటర్లందరి ప్రయోజనం కంటే మిన్నగా చూసుకుంటాడు. అతడు అంతకంటే భిన్నంగా ప్రవర్తిస్తాడని

ఎవడైనా ఎందుకనుకోవాలి. ఒక మనిషి తన నియోజకవర్గం కన్నా తనకే సన్నిహితంగా బ్రతకడం మానసిక సహజమైన పద్ధతి. మనిషి తోలు వారు వేసుకున్న జుబ్బాకు సన్నిహితంగా దేహాన్ని పట్టుకుంటుందనిఒక సామెతుంది. శాసనసభ్యుల విషయంలో చాలా సందర్భాలలో ఇది సత్యమే. అతని వర్గం తోలైతే నియోజకవర్గం షర్టు మాత్రమే. అదెప్పుడూ చర్మానికి అంగుళం అవతలే వుంటుందని చెప్పనవసరం లేదు.

కనుక భౌగోళిక నియోజకవర్గాల పునాదుల మీద భారతీయ రాజకీయ నిర్మాణాన్ని కట్టాలన్న ఈ ధోరణిని రాజనీతిజ్ఞులందరూ నిష్ప్రయోజనమైన పద్ధతి అని నిర్ణయించే ఉన్నారు. చాలా కాలం నుండి యూరోపియన్ దేశాలలో భౌగోళిక నియోజక వర్గాలను రాజకీయ యంత్రాంగానికి పనికి రానిదిగా భావిస్తూ వస్తున్నారు.

చాలా యూరోపియన్ దేశాలలో భౌగోళిక నియోజక పద్ధతికి స్వస్తి చెప్పారు కూడా. వారు ఇతర పద్ధతుల్నే అవలంబిస్తున్నారు. ఎందుకంటే భౌగోళిక పద్ధతి ప్రకారం ఏర్పాటైన ప్రభుత్వాలు మంచివికావు. బాగా పని చేసేవీ కావు. ఇతర దేశాలలో కొన్ని చోట్ల ఈ పద్ధతి మిగిలింది. కాని అక్కడ ప్రజలలో అతి తీవ్రమైన అసంతృప్తి చోటు చేసుకుంది. ఈ భౌగోళిక నియోజకవర్గ పద్ధతి తప్పనటానికి జ్ఞానవంతులు, మేధావులు ఎన్నో ఇతర ప్రత్యామ్నాయాలను అనుసరిస్తున్నారు. వృత్తి వ్యాపారాలను ఆధారంగా ప్రాతినిధ్యం చూపెడుతున్నారు. రెఫరెండమ్ అని, రీకాల్ అని వేరే పద్ధతులను కూడ సూచిస్తున్నారు.

ఈ పరిస్థితుల్లో ఇతరత్రా అన్ని చోట్ల నిరసింపబడిన ఈ రాజకీయ యంత్రాంగాన్ని కావాలని హిందువులు ఎందుకు పట్టుబడుతున్నారో ఆలోచిస్తే మనకు ఉత్సుకత కల్గుతుంది. వాళ్లేమంటున్నారంటే జాతీయతా భావంతో సమన్వయం పొందేది ఈ పద్ధతి ఒకటేనని. ఇది సరియైన వివరణగా నాకు తృప్తి కలిగించడం లేదు. నిజమైన వివరణ వేరేగా ఉన్నట్టు నాకనిపిస్తోంది. భౌగోళిక పద్ధతిలో అయితే రాజకీయ బలాన్నంతా కూడ దీసుకుని ఒక చోట ఏకత్రపరచి హిందువుల గుప్పెట్లో పెట్టుకోవచ్చని హిందువులంటారు. వారి లెక్క తప్పని ఎవరనగలరు? భౌగోళిక నియోజకవర్గంలో పోటీ అయితే అధిక మెజారిటీ హిందువుల మధ్య మైనారిటీ అస్పృశ్యుల మధ్య అని వారికి తెలుసు. ఇలాంటి నియోజక వర్గాలలో అయితే అన్నింటిలోనూ వాళ్ళే గెలుస్తారు. కాని హిందువులు తమ మెజారిటీ మీదనే ఆధారపడకుండా తమ బలాన్ని పటిష్ఠం చేసే ఇతర అంశాలమీద కూడా ఆధారపడతారు. హిందు సంఘంలో విచిత్ర స్వభావంలోనే ఈ అంశాల మూలాలున్నాయి. హిందూ సంఘ వ్యవస్థ ఒక కులంపై మరొక కులాన్ని ఉంచుతుంది కాబట్టి వోటింగ్ చేయటం పైన ఈ భావన ప్రభావముంటుంది. హిందూ సంఘంలోని కులాలలో పైకి పోయే కొద్దీ గౌరవం, కిందికి దిగే కొద్దీ అనాదరణ ఉంటాయి. వోటింగ్ మీద ఈ సామాజిక ధోరణుల ప్రభావం ఉంటుందని చెప్పడానికి ఏ ప్రవక్తో దిగి రావాల్సిన అవసరం లేదు.

సవర్ణ హిందువెవడైనా అస్పృశ్యునికి వోటు వేయడు. ఎందుకంటే శాసనసభకు ప్రతినిధి కాగల పెద్దతనం అతనిలో లేదు. వాడు చాలా నీచుడు. మరో వైపు తమ అస్పృశ్యుడే అభ్యర్థిగా నిలబడినా అతనికి కాదని హిందూ అభ్యర్థికి వోట్లు వేసే అస్పృశ్యులు చాలా మంది ఉన్నారు. ఇలా ఎందుకంటే తన బంధువులకన్నా అగ్రానవున్న వారిని గౌరవించడం సంప్రదాయమని తరతరాలుగా వాడికి బోధ జరిగింది. ఇక పేదవారు, చదువులేని వారు, చైతన్యం లేని వారు, సంఘటిత వ్యవస్థలేని వారైన అస్పృశ్యుల నుండి వోట్లు రాబట్టుకోడానికి ఇంకా వారవలంభించే ఇతరేతర పద్ధతులను గురించి నేనిక్కడ చెప్పడం లేదు. ఈ పరిస్థితులన్నీ ఓచోట చేరితే హిందు ప్రతినిధుల సంఖ్య పెరగటం తథ్యం. కనుక భౌగోళిక నియోజకవర్గాల పద్ధతిలో అయితే హిందువులదే మెజారిటీ అవుతుంది. తమ సంఖ్యా బలాన్ని వాడుకోవచ్చు. అస్పృశ్యుల్ని వాడు కోవచ్చు. అస్పృశ్యులకు ఒక్క సీటు కూడా దక్కదనటం కూడా అంతే సత్యమవుతుంది. ఎందుకిలా అంటే మొదటిది వాళ్ళు అల్పసంఖ్యాకులు. రెండవది హిందువులు వారిలోని బలహీనతలను సులభంగా వాడుకోగలరు. వండిన మాంసాన్ని దేవతలకు నైవేద్యం చేసినట్టు అస్పృశ్యులు తమ వోట్లను హిందువులకు అర్పించడం జరుగుతుంది.

ఈ వత్తిడుల నేపథ్యంలో ఆలోచిస్తే భౌగోళిక నియోజకవర్గం అంటే హిందువులు రాజకీయ అధికారాన్ని లూటీ చేయడం ఖాయం. అవే కుల పథకం ప్రకారమైతే వారికీ రాజకీయాధికారం ఉంటుంది. అందుచేత జాతీయ పథకమనేది ఉద్దేశాల దృష్ట్యా కాపోయినా ఫలితాల దృష్ట్యా అయినా కులపథకం కన్నా చాలా పనికి రానిది.

## అధ్యాయం V

# ఉమ్మడి - ప్రత్యేక నియోజకవర్గాలు

హిందువులు చాలా కాలం పోరాటం జరిగిన తరువాత కేవలం భౌగోళిక నియోజక వర్గాలు ఇండియా వంటి దేశంలో పనికి రాదన్న వాదనను ఒప్పుకున్నారు. ఒక దృష్టితో ఇంతకు ముందు చర్చించినట్లు నిజమైన ప్రతినిధి శాసనసభ భౌగోళిక నియోజకవర్గమా, కుల నియోజకవర్గమా అన్న వివాదాన్ని గురించిన చర్చే అనవసరం. కాని నేను ఈ విషయానికి సంబంధించి అనుకూలంగాను, ప్రతికూలంగాను ఎందుకు చర్చించానంటే భారతీయ రాజకీయ పరిస్థితులు తెలియని విదేశీయులకు ఈ వివాదానికి మూలమైన ఊహలు ఎలాంటివో తెలియాలని. దురదృష్టవశంగా వాస్తవం ఏమిటంటే హిందువులు కుల పథకం ప్రకారం ప్రాతినిధ్యానికి ఒప్పుకున్నా అస్పృశ్యులు కోరుకున్న అన్ని విషయాలను వాళ్ళంగీకరించలేదు. ముఖ్యంగా అస్పృశ్యులు ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా ప్రాతినిధ్యం కావాలంటారు. ప్రత్యేక నియోజకవర్గమంటే అందులో వోటర్లందరూ అస్పృశ్యులే అస్పృశ్యుడైన అభ్యర్థినే ఎన్నుకొని ప్రతినిధిగా శాసనసభకు పంపుతారు. హిందువులు ఈ పద్ధతిని అంగీకరించకుండా కొన్ని సీట్లను అస్పృశ్యులకు కేటాయించి ఆ ఖాళీలలో వారినే ఎన్నుకోవాలంటారు. కాని అస్పృశ్యుల ప్రతినిధిని ఉమ్మడి నియోజకవర్గంలోని హిందువులు, అస్పృశ్యులు కలసి ఎన్నుకోవాలంటారు. కేవలం అస్పృశ్యులు ఎన్నుకోవడం కుదరదంటారు. ఇక్కడ మళ్ళీ ఈ వివాదంలోని మంచి చెడ్డల్ని చూపదలిచాను. ప్రత్యేక నియోజకవర్గాల మీద హిందువుల అభ్యంతరము ఏమిటంటే దేశం ఈ కారణంగా ముక్కలవుతుందని. దీనికి సమాధానం స్పష్టం. మొదటి అంశం ఏమిటంటే భారత దేశమనేది 'నేషన్' అనే పదానికున్న నిజమైన అర్థంలో లేదు. అసలు ఆదేశానికి ఉనికే లేదు. దాన్నిప్పుడు సృష్టించాల్సి ఉంది. ఒక విశిష్టమైన, ప్రత్యేకమైన కులాన్ని అణచి వేయటం దేశాన్ని సృష్టించే పద్ధతి కాదని అందరూ అంగీకరిస్తారు. రెండవ అంశం అస్పృశ్యుల ద్వారానే

ఎన్నుకోవాలన్నది ఒప్పుకుంటే దీనికి హిందువులంగీకరించారు. అస్పృశ్యుడు అస్పృశ్యులైన ఓటర్ల ప్రతినిధే కావాలి. ఇది సరైన స్థితే అయితే ప్రత్యేక నియోజకవర్గాల ద్వారానే నిజమైన ప్రాతనిధ్యం అస్పృశ్యులకు సిద్ధిస్తుంది. అందుచేత ప్రత్యేకమైన నియోజక వర్గాలు వద్దనటానికి హిందువులు చేసే వాదనకు పసలేదు. ఆధారం కూడా లేదు. అస్పృశ్యుల రాజకీయమైన కారణాల్ని హిందువులు ఒప్పుకున్నారు. అలాంటప్పుడు ఆ కారణాల్నించి తార్కికంగా వచ్చే ఫలితం ప్రత్యేక నియోజకవర్గమే. కారణాన్ని ఒప్పుకుని ఫలితాన్ని కాదనడం ఎలా? మైనారిటీల సంరక్షణకోసమే ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పరచారు. అలాంటప్పుడు తమకు ఎలాంటి నియోజక వర్గం కావాలో మైనారిటీకి చెందిన హరిజనులకు నిర్ణయించుకునే అధికారాన్ని ఎందుకివ్వకూడదు? అస్పృశ్యులు ప్రత్యేక నియోజకవర్గాలే కావాలంటే వాళ్ళ కోరికను ఎందుకంగీకరించకూడదు? ఈ ప్రశ్నలకు హిందువులు ఏ సమాధానం చెప్పలేదు. హిందువులు చూపే బయటి కారణం జాతీయత అసలు కారణం కాదు. అసలు కారణమేమిటంటే ప్రత్యేక నియోజకవర్గాల ద్వారా అస్పృశ్యులకు కేటాయించిన సీట్లను వశపరచుకోవడం కుదరదు. అట్లు కాక ఉమ్మడి నియోజకవర్గాలయితే ఈ పని చేయవచ్చు. ఉమ్మడి ప్రత్యేక నియోజక వర్గాలు ఎలా పని చేస్తాయో చూపెడతారు. మద్రాస్ ప్రెసిడెన్సీ నుండి ఉదాహరణను చూడండి.

| నియోజకవర్గం పేరు | హిందువుల మొత్తం సీట్లు | అస్పృశ్యులకు కేటాయించిన సీట్లు | హిందూ వోటర్ల సంఖ్య | అస్పృశ్య వోటర్ల సంఖ్య | హిందూ అస్పృశ్య వోటర్ల నిష్పత్తి |
|---|---|---|---|---|---|
| మద్రాసు నగరం (దక్షిణం) | 2 | 1 | 40,626 | 2,577 | 16 :1 |
| చికాకోల | 2 | 1 | 83,456 | 5,125 | 16 :1 |
| విజయనగరం | 2 | 1 | 47,594 | 996 | 49 :1 |
| అమలాపురం | 1 | 1 | 52,805 | 7,760 | 7 :1 |
| ఏలూరు | 1 | 1 | 51,795 | 5,155 | 9 :1 |
| బందరు | 1 | 1 | 84,191 | 8,723 | 10 :1 |
| తెనాలి | 2 | 1 | 1,32,107 | 5,732 | 24 :1 |

పై పట్టికలో చూపిన వోటర్ల బలాబలాల వివరాలు మద్రాసు ప్రెసిడెన్సీలోని ఏడు నియోజకవర్గాలనుంచి అక్కడక్కడ సేకరించిన వివరాలవి. కాని చాలా విశేషాల్ని

సూచిస్తాయి. పై సంఖ్యలను గమనిస్తే నిష్పక్షపాతంగా చెప్పేవాడు ఎవడైనా ప్రత్యేక నియోజకవర్గాలే ఉంటే అస్పృశ్యులు తమకు సంపూర్ణ విశ్వాసమున్న వ్యక్తిని ఎన్నుకోగలగుతారని అలాంటి వ్యక్తి శాసనసభలో హిందువుల ప్రతినిధులకు వ్యతిరేకంగా అస్పృశ్యుల పక్షాన పోరాడగలడని సులభంగా చెప్పగలరు. అలా కాకుండా ఉమ్మడి నియోజక వర్గమే ఉంటే ఈ శాసనసభలలో అస్పృశ్యులు నామమాత్రంగా ఉంటారు కాని నిజమైన ప్రతినిధుల కారు. ఎందుచేతంటే అస్పృశ్యులకు, హిందువులకు నడుమ నిష్పత్తి 1:24 నుంచి 1:49 దాకా ఉన్న సందర్భంలో హిందువులచే నామినేట్ చేయబడిన వారికి సాధన మాత్రంగా ఉండటానికి ఒప్పుకోని ఏ అస్పృశ్యుడు ఎన్నికలలో విజయం పొందడు. హిందువుల దృష్టికి ఉమ్మడి నియోజకవర్గం ఒకే 'రాటన్‌బరో', అస్పృశ్యుడ్ని కేవలం నామమాత్రంగా నిజానికి ఉపకరణంగా నామినేట్ చేసే అధికారం హిందువులకు ఇందులో ఉంటుంది. అస్పృశ్యుల కుల పథకానికి వ్యతిరేకంగా హిందువులు చేపట్టిన జాతీయ పథకం, చేస్తున్న యుద్ధం ఒక న్యాయం కోసం కాదు. దేశం కోసం కాదు. కేవలం వారి పనుల కోసమే. రాజకీయ అధికారం మీద అవిభక్తమైన నియంత్రణ తమ గుప్పెట్లోకి తెచ్చుకోవడానికి హిందువులు పోట్లాడుతున్నారు. ఆత్మరక్షణ కోసం హిందువులలో ఉమ్మడి కుటుంబం పెద్ద ఎలా భాగాలు వద్దంటాడో అలాగే వీరు కూడా. అంత తమ స్వలాభం కోసమే వాడుకోవచ్చుని అందుకే కేవలం భౌగోళిక నియోజకవర్గాలు కావాలని యుద్ధం చేశారు. ఇది తప్పిందనుకోండి, ఇక రెండో రక్షణ పద్ధతి ఒకటి ఉంది. తన అధికారం ఇచ్చేసినా తన నియంత్రణ మాత్రం ఉండాలంటారు. అది కేవలం ఉమ్మడి నియోజక వర్గాల ద్వారా మాత్రమే సాధ్యం. అందుకే హిందువులు ప్రత్యేక నియోజకవర్గాలు వద్దంటారు.

జాతీయ పథకమనేది ఉద్దేశ్యంలో కుల సంబంధమైంది కాకపోవచ్చు కాని ప్రయోజనం దృష్ట్యా అంతే.

## అధ్యాయం VI

# కార్యనిర్వాహక వర్గం

అస్పృశ్యుల రాజకీయ డిమాండ్‌లలో రెండవది అస్పృశ్యులు తాము శాసనసభలో మాత్రమే కాకుండా ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గంలో కూడా వుండాలని. ఈ డిమాండ్‌ను కూడా హిందువులు వ్యతిరేకిస్తున్నారు. దీనిపై హిందువుల వాదం రెండు రకాలుగా వుంది. ఒకటి కార్యనిర్వాహక వర్గం శాసన సభలోని మెజారిటీ సభ్యులతో ఏర్పడాలని. రెండవది కార్యనిర్వాహక వర్గంలోని సభ్యులు తగిన శక్తి సామర్థ్యాలు కలిగిన వారు అయిఉండాలని. ఈ రెండవ అంశాన్ని గూర్చి నేను చర్చిస్తాను.

ఈ వాదం మౌలికంగా సమంజసమైందే. కాని ప్రతినిధి ప్రభుత్వంలో ఈ వాదాన్ని మరీ దూరం లాగటం తప్పని గుర్తించడం కూడా అంతే ముఖ్యం. ప్రొఫెసర్ డైసీ ఇలా అన్నాడు. "రాజ్యాంగం ప్రకారం మేధోసంపత్తిలో ఉత్తములైన వారిని మాత్రమే చేర్చి పార్లమెంటు తయారు చేయటం అన్న ఉద్దేశ్యం ఎప్పుడూ ప్రధానమైంది కాదు. నిజంగా ప్రతినిధి ప్రభుత్వం అనే భావనకే ఇది దూరమైన ఆలోచన. జనసామాన్యం కంటే అతీతమైన తెలివి తేటలున్న సభ్యులతో పార్లమెంట్‌ను తయారుచేస్తే కాబోయేదంతే."

సామర్థ్యాన్ని గురించిన ప్రాధాన్యం అవసరమని ఎవరూ చెప్పాల్సిన పని లేదు. అస్పృశ్యులు కాబట్టి అజ్ఞానులనీ మంత్రులుగా చేయమని ఎవరూ చెప్పలేదు. కాబినెట్‌లో అస్పృశ్యులకు ప్రాతినిధ్యం హక్కే ఇస్తే వారు తమలో అత్యంత సమర్థులెవరో– ప్రతి ప్రాంతంలోనూ అలాంటివారు చాలా మంది వున్నారు– వారితో ఆ స్థానాలు నింపడానికి ఎన్నుకొంటారు. ఈ నియమాన్ని అస్పృశ్యులకే ఎందుకు అన్వయించాలి. అస్పృశ్యుల్లాగానే మహమ్మదీయులు కూడా కేబినెట్‌లో ఉండాలని కోరుకుంటున్నారు. ముస్లింల కోరికపై హిందువులు ఇలాంటి వాదం ఎందుకు చేయలేదు. దీన్ని బట్టి హిందువులు పెడుతున్న అభ్యంతరం హేతుబద్ధమైంది కాదు. అది ఒక సాకు మాత్రమే. మొదటి వాదానికి సంబంధించి

హిందువులు మెజారిటీ, మైనారిటీ అనే పదాలను దురుపయోగం చేస్తున్నారు. ఇవి మెజారిటీ, మైనారిటీ రాజకీయ వర్గాలకు సంబంధించింది. రాజకీయ వర్గాలుగా నిర్దిష్టమైన మెజారిటీ కాని మైనారిటీ కాని ఉండదు. ఇవ్వాళ మెజారిటీ అయినది రేపు మైనారిటీ కావచ్చు. హిందువులకు అస్పృశ్యులకు ఉన్నభేదం ఇలాంటిది కాదు. మెజారిటీ మైనారిటీల సంబంధంలో ఇంకొక విశేషముంది. అది హిందువులకు అస్పృశ్యులకు నడుమనున్న సంబంధం లాంటిది కాదు. రాజకీయంగా మెజారిటీ, మైనారిటీ ఒక భేదం చేత వేరవుతాయి. అదే అభిప్రాయ భేదం. హిందువులకు అస్పృశ్యులకు నడుమవున్న మౌలికమైన బద్ధవైరం లాంటిది కావు. మెజారిటీ మైనారిటీలకు సంబంధించిన మూడవ లక్షణం ఒకటి వుంది. మైనారిటీ మైనారిటీగానే మారుతూ వుంటుంది, మెజారిటీ మెజారిటీగానే పెరుగుతూ మైనారిటీల అభిప్రాయాల్ని, భావనల్ని తనలో ఎంతగా ఇమడ్చుకుందంటే ఇక మైనారిటీలు తృప్తి చెంది మెజారిటీతో పోరాటమే మానుకుంటారు. కాని హిందూ మెజారిటీకి, అస్పృశ్యుల మైనారిటీకి నడుమ ఈ అంశాలేవీ పని చేయవు. అవి శాశ్వతమైన కుల భేదాలుగా ముద్రపడ్డాయి. అవి భిన్నం కావడం మాత్రమే కాకుండా శత్రుత్వం కల్గినవి కూడా. వీళ్ళను గురించి మెజారిటీ మైనారిటీ అనే మాటలు వీళ్ళ పరంగా వాడటం ఎంత సత్యమో ప్రయోజనవంతమో అంటే జర్మనీ వారిని మెజారిటీ అని, ఫ్రెంచి వారిని మైనారిటీ అని పిలిస్తే ఎంతో అంత.

# అధ్యాయం VII

## పబ్లిక్ ఉద్యోగాలు

కనీస విద్యార్హతలు ఉన్నపుడు దేశంలోని పబ్లిక్ ఉద్యోగాలలో కూడా అస్పృశ్యులకు కొంత నిష్పత్తి కేటాయించాలని వారి డిమాండు. ఇతర కోరికలలాగానే ఈ కోరికకు కూడా హిందువులు అభ్యంతరం చూపుతున్నారు. వారి అభిప్రాయం ఏమిటంటే దేశ క్షేమం దష్ట్యా పబ్లిక్ ఉద్యోగాలలో సమర్థత, నైపుణ్యం, గుణగణాలు మాత్రమే ప్రమాణాలు కావాలని, కుల గోత్రాలకు ఇందులో ప్రమేయం ఉండకూడదని. గుణగణాల విషయం ఎవరికీ సందేహం లేదు. సామర్థ్యం నైపుణ్యాలు కూడా తప్పకుండా ఉండాల్సిందే. కాకపోతే కులగోత్రాల ప్రసక్తి ఉండకూడదా అన్నది ఒకటే వివాదగ్రస్తంగా ఉన్న విషయం. విద్యార్హత ఒకటే నైపుణ్యానికి గీటురాయిగా గ్రహిస్తూ హిందువులు అన్ని కులాల వాళ్లకు, తెగల వాళ్లకు కలిపి పోటీ పరీక్షల ద్వారానే పబ్లిక్ ఉద్యోగాలు భర్తీ చేయాలని, అలాంటి పద్ధతి వల్ల రెండు ప్రయోజనాలు వుంటాయని. మరో విషయం అస్పృశ్యులకు కూడా పబ్లిక్ ఉద్యోగ అవకాశం కల్పిస్తుందని.

హిందువులు అస్పృశ్యుల డిమాండ్ పట్ల తమ వ్యతిరేకతను కప్పిపుచ్చి న్యాయమనిపించేలా పోటీ పరీక్షల్లో నైపుణ్యం ఒకటే ప్రధానమన్నట్టు వాదిస్తారు. ఇక్కడ మళ్లీ చర్చ అసలు అంశాన్ని వదిలేసి పక్కకు పోతోంది. నైపుణ్యం కలిగిన వ్యక్తులను పబ్లిక్ ఉద్యోగాలలోకి తీసుకోవడానికి పోటీ పరీక్ష ఉత్తమ పద్ధతి అవునా కాదా అన్నది కాదు ప్రశ్న. అన్ని కులాలకు తెగలకు ప్రవేశం కల్పించినంత మాత్రాన అస్పృశ్యులకు పబ్లిక్ ఉద్యోగాలలో స్థానం కల్పిస్తున్నదా? అన్నది. అవి ఆయా దేశాలలోని విద్యా విధానాన్ని బట్టి వుంటుంది. ఈ విద్యా విధానం భారతదేశంలో ప్రజాస్వామికంగా ఉందా? ఉద్యోగావకాశాలు బాగా విస్తరించి ఉన్నాయా? అన్ని వర్గాల వ్యక్తులు విద్య పొంది

పోటీలలో ప్రవేశం పొందే అవకాశాన్ని కల్గిస్తోందా? ఇదిలేనప్పుడు పోటీలో అందరికీ ప్రవేశం ఉన్నా చాలా వర్గాలకు అందులో దిక్కు లేకుండా పోతుంది. ఈ ఆధారభూతమైన స్థితి లేదన్నది ఇండియాలో స్పష్టం. ఇండియాలో ఉన్నత విద్య హిందువుల, ముఖ్యంగా అగ్రవర్ణాల వారిలో గుత్తాధిపత్యం ఉండేది. అస్పృశ్యత కారణంగా అస్పృశ్యులకు చదివే అవకాశమే లేదు. పేదతనం కారణంగా పబ్లిక్ ఉద్యోగ రంగంలో ఉన్నతోన్నత పదవులకు కావాల్సిన విద్యార్హత వారికి అందుబాటులో లేదు. పబ్లిక్ ఉద్యోగ రంగంలో వ్యూహపరంగా ప్రాధాన్యం ఉన్నవి ఉన్నత పదవులే కదా? అటు ప్రభుత్వం కూడా వీరికి ఉన్నత విద్యను అందించడానికి ఆర్థికమైన బాధ్యత తీసుకోవడం లేదు. వాళ్లు తీర్మానాలు చేసి డిమాండ్ చేస్తున్నారు. హిందువులు తమ ధర్మనిధులను అస్పృశ్యులకు మాత్రము ఇవ్వరు. హిందువుల దాతృత్వం చాలా కుల ప్రధానమైంది కావడం అవమానకరమైన విషయం. కనుక అస్పృశ్యులను పోటీ పరీక్షల ద్వారా పబ్లిక్ ఉద్యోగాలలోకి రమ్మని అనడం వట్టి కపట తంత్రం మాత్రమే. కాబట్టి అస్పృశ్యులు చేస్తున్న వాదం కూడా అన్యాయమైందేమీ కాదు. నైపుణ్యాల్ని పరిరక్షించాల్సిన ఆవశ్యకతను వారు కూడా గుర్తిస్తారు. అందుకే తమ తీర్మానంలో కనీస విద్యార్హత ఉన్న వారికే ఉద్యోగ అవకాశం ఇవ్వాలని ఒక నియమాన్ని తామే అంగీకరించారు. మరో విధంగా చెపితే అస్పృశ్యులు ప్రతి ఉద్యోగానికి కనీస విద్యార్హత నియమించి తీరాలని ఒక ఉద్యోగానికి ఇద్దరు దరఖాస్తు చేస్తే అస్పృశ్యునికి కనీస విద్యార్హత ఉంటే, హిందువు కనీస విద్యార్హత కన్నా ఎక్కువ ఉన్నా అస్పృశ్యునికే ఉద్యోగం ఇవ్వాలంటారు. ఇలా ఉంటే ఉద్యోగాలు కేవలం కనీస విద్యార్హతలే చాలని ఉన్నత విద్య అక్కరలేదని అర్థం కాదు. నైపుణ్య పరీక్ష ద్వారా పబ్లిక్ ఉద్యోగ విషయంలో కొన్ని కులాలకు గుత్తాధిపత్యం వచ్చినా ఫర్వాలేదులే అనుకునే వారికి ఇది విడ్డూరంగానే కనిపించవచ్చు. కాని, కాంపు బెల్-బెనెర్‌మన్ స్వపరిపాలన ఉత్తమ ప్రభుత్వం కన్నా మిన్న అని చెప్పలేదా? అస్పృశ్యులు ఇంతకంటే ఏమి కోరుతున్నారూ?. నైపుణ్యంతో కూడిన ప్రభుత్వం ఉండాలన్న ఆవశ్యకతను వారు గుర్తిస్తున్నారు కదా. అందుకే కనీస విద్యార్హతలు ఉండాలన్న నియమాన్ని వారు ఒప్పుకుంటున్నారు. అస్పృశ్యులు చేయదలచుకోనిదల్లా ఉత్తమ ప్రభుత్వం కోసం స్వపరిపాలనను పోగొట్టు కోవడమే. అత్యున్నత విద్యార్హతల మీద ఆధారపడ్డ ఉత్తమ ప్రభుత్వం ఎప్పుడూ కుల ప్రభుత్వమే అవుతుంది. ఎందుకంటే హిందువులకు మాత్రమే కనీస విద్యార్హతలకన్నా అధికమైన ఉన్నత విద్యార్హతలు ఉంటాయి. వాళ్ళు వద్దంటున్నది నైపుణ్యం గల ప్రభుత్వానికి కనీస విద్యార్హతలు చాలు. దానిచేత స్వపరిపాలన కూడా సిద్ధిస్తోంది. కాబట్టి కనీస విద్యార్హత చాలన్నది పబ్లిక్ ఉద్యోగాలకు నియమం కావాలి దీనివల్ల స్వపరిపాలన ఏర్పడుతుంది, నైపుణ్యమున్న ప్రభుత్వం ఏర్పడుతుంది.

## అధ్యాయం VIII

# ప్రత్యేక నివాసాలు

ఈ అధ్యాయంలో తరువాత చెప్పబోయేటటువంటి తీర్మానం సంఖ్య IV చాలా స్పష్టంగా వుంది. దాని తాత్పర్యాన్ని వివరించడానికి ఏ విశేష వ్యాఖ్యానమూ అక్కరలేదు. ఈ చిన్న వ్యాస పరిధిలో దీన్ని గురించి ఇంతకన్నా లోతుగా చర్చించడం కుదరదు. అస్పృశ్యులలో వచ్చిన నూతన జీవనోద్యమమే ప్రత్యేక నివాసాలు కావాలి అన్న డిమాండ్‌కు మూలం. ఈ ఉద్యమ ఉద్దేశం హిందువుల దాస్యత్వం నుంచి అస్పృశ్యులను విముక్తి చేయటం. ఎంతకాలం గ్రామాలలో ప్రస్తుత వ్యవస్థ సాగతుందో అంతకాలం అస్పృశ్యులు హిందువుల నుండి స్వేచ్ఛను పొందలేరు. అస్పృశ్యతను పోగొట్టుకోలేరు. ఒకే పల్లెలో అతి సమీపంగా హిందువులతో సన్నిహితంగా ఉండడం వల్లనే అస్పృశ్యులు వేరేగా గుర్తింపబడ్డారు, అస్పృశ్యులని పిలవబడ్డారు. ఇండియా అంటే పల్లెలే. అలాగే గ్రామీణ వ్యవస్థలో అస్పృశ్యుల్ని సులభంగా వేరు చేస్తారు, గుర్తిస్తారు. అందుచేత అస్పృశ్యునికి అస్పృశ్యత తప్పదు. దీనికంతా కారణం గ్రామీణ వ్యవస్థే. అందువల్ల అస్పృశ్యతను కొనసాగించే ఈ గ్రామీణ వ్యవస్థను విచ్ఛిన్నం చేయాలని ఎలాగూ తాము సామాజికంగా వేరు చేయబడారు కాబట్టి భౌగోళికంగా ఆ రాష్ట్ర పరంగా కూడా వేరు కావాలని, అస్పృశ్యులకే చెందిన ప్రత్యేక గ్రామాలు ఏర్పడాలని, అక్కడ ఉన్నత, నీచ వర్గాలు, స్పృశ్య, అస్పృశ్య భేదాలు లేకుండా ఉండాలని కోరుతున్నారు.

ప్రత్యేక నివాసాలు కావాలని కోరటానికి రెండవ కారణం గ్రామాలలో అస్పృశ్యుల ఆర్థిక స్థితి దయనీయంగా ఉందనటాన్ని ఎవరూ కాదనలేరు. వారికి భూములు లేవు. కేవలం వారు పనికోసం హిందువుల మీదే ఆధార పడ్డారు. వాళ్ళు తమకు తోచినపని ఇస్తారు. ఎంతిస్తే తమకు లాభమో అంతే కూలీ ఇస్తారు. తామున్న పల్లెలలో ఏ వ్యాపారమ

చేసుకోలేరు. ఏ వృత్తులు చేపట్టలేరు ఎందుకంటే అస్పృశ్యత కారణంగా వారితో ఎవరూ సంపర్కము పెట్టుకోరు. అందువల్ల ఎంత కాలం హిందూ గ్రామాలలో ఆధారపడిన వారిలా అస్పృశ్యులుగా బ్రతుకుతారో అంత కాలం వారికి జీవనాధారం వెతుక్కోవడం కుదరదు. ఇలా ఆర్థిక పరంగా ఆధారపడి ఉండడం వల్ల పేదతనంతో పాటు తక్కువతనంతో పాటు ఇంకా చాలా దుష్ఫలితాలు ఉన్నాయి. ఈ ధర్మాల చేత హిందువులకు చాలా అవకాశాలు లభిస్తాయి. అలాగే అస్పృశ్యునికి చాలా అవమానాల్ని కలగ చేస్తుంది. వారి ధర్మం బోధించే పవిత్రమైన జీవిత విలువలకు అస్పృశ్యతకు ఎక్కడా సమన్వయమే లేదు. ఇప్పుడు కొత్తగా పుట్టిన నూతన జీవనోద్యమ ప్రభావంచేత భారత దేశంలోని అస్పృశ్యులందరూ హిందువులు మతం పేరిట అస్పృశ్యులపై చూపిన అగౌరవాన్ని, చేసిన అన్యాయాలపై ఎదిరిస్తున్నారు. పోరాడుతున్నారు. హిందువులకు అస్పృశ్యులకు నడుమ ప్రతిగ్రామంలోనూ నిరంతర యుద్ధం సాగుతోంది. కాని అది బయటికి రాదు. హిందూ పత్రికారంగం దీనికి ప్రచారమిస్తే స్వాతంత్ర్యోద్యమం ప్రపంచం దృష్టిలో పడి విఫలమౌతుందని భయపడుతుంది. ఈ నిశ్శబ్ద పోరాటం మాత్రం నిస్సందేహంగా వాస్తవమే. గ్రామీణ వ్యవస్థలో చిక్కుకున్న అస్పృశ్యుడు స్వతంత్రమైన గౌరవ ప్రదమైన జీవితం కోసం పోరాడడానికి కూడా అసమర్థుడుగా ఉన్నాడు. ఇది ఆర్థికంగా సామాజికంగా బలవంతులుగా వున్న హిందువులకు ఆర్థికంగా పేదవారు, సామాజికంగా అల్పసంఖ్యాకులైన అస్పృశ్యులకు నడుమ జరుగుతున్న పోరాటం. చాలా సందర్భాలలో హిందువులు అస్పృశ్యులను అణచిపారవేయడానికి చాలా కారణాలున్నాయి. పోలీసు వ్యవస్థ, న్యాయ వ్యవస్థ రెండూ అతని వైపే ఉంటాయి. అందుచేత అస్పృశ్యులు హిందువులతో పోరాడితే వారికి పోలీసుల నుంచి రక్షణకాని, మేజిస్ట్రేట్ నుండి న్యాయంకాని ఎప్పటికీ లభించదు. పోలీసు, మెజిస్ట్రేట్ ఇద్దరూ హిందువులే. వాళ్లు తమ బాధ్యత కన్నా వర్గాల్నే ఎక్కువ ప్రేమిస్తారు. ఇంత కన్నా ముఖ్యమైంది హిందువులకున్న ఆర్థిక బలం. నిర్భాగ్యులైనా అస్పృశ్యులకు లేనిదదే. బొంబాయి ప్రభుత్వం దళిత వర్గాల* బాధలపై విచారణ జరపమని 1928 లో నియమించిన కమిటీ సమర్పించిన నివేదికలో సమానత కోసం పోరాడుతున్న అస్పృశ్యులను ఆర్థిక బలంతో హిందువులు ఎన్నివిధాలుగా అణచివేస్తున్నారో బాగా వివరించారు. ఆ నివేదిక నుంచే కొన్ని భాగాలను ఇక్కడ ఇస్తున్నాను. దీన్ని చూస్తే హిందూ సమాజ వ్యవస్థలోని మర్మాలు తెలియని విదేశీయులు కూడా హిందువులెంత క్రూరంగా అస్పృశ్యుల్ని హింసిస్తారో తేటతెల్లమవుతుంది. కమిటీ నివేదిక ఇలా చెబుతోంది

"దళిత వర్గాలకు సామాజిక రంగంలో అవకాశాల కోసం ఉన్న హక్కులను పొందటానికి కొన్ని పరిష్కార మార్గాలను మేము సిఫారసు చేసినా చాలా కాలం వరకు వాటిని

* 1935 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్టుకి ముందు అస్పృశ్యులకు దళితవర్గాలు అని పేరుండేది ఈ యాక్ట్‌లో వాళ్ళకు షెడ్యూల్డ్ కులాలు అని నామకరణం జరిగింది

అమలులోనికి తీసుకురావడానికి ఎన్నో ఇబ్బందులుంటాయని మేము భావిస్తున్నాము. మొదటి ఇబ్బందేంటంటే సాంప్రదాయకమైన వర్గాలు వారిపై బహిరంగంగా చేసే హింస. దళిత వర్గాలది ప్రతి గ్రామంలోనూ అల్పసంఖ్యే. సాంప్రదాయకులది చాలా పెద్దసంఖ్య. అందుచేత వాళ్ల ప్రయోజనాలకు వ్యతిరేకంగా దళితులు ఎక్కడ దాడి చేసినా ఏ ఉపాయం చేతనైనా దాన్ని అణచి వేయడానికి వాళ్ళు సిద్ధంగా ఉంటారు. కాకపోతే పోలీసులు శిక్షిస్తారన్న భయంతో హింసించడానికి కొంత జంకుతారు. అందువల్ల అలాంటి సందర్భాలు చాలా తక్కువ.

రెండో ఇబ్బంది: దళిత వర్గాలున్న ఆర్థిక పరిస్థితులవల్ల ఏర్పడుతోంది. ప్రెసిడెన్సీలో చాలా భాగాలలో దళిత వర్గాలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. కొందరు సాంప్రదాయక వర్గాల వారి పొలాలలో వ్యవసాయం చేసుకుంటూ వారి కోరికపై పాలేర్లుగా ఉంటున్నారు. మరి కొందరు సాంప్రదాయకుల పొలాల్లో పనిచేస్తూ సంపాదిస్తారు. తక్కిన వాళ్ళు గ్రామసేవకులుగా ఉంటూ సాంప్రదాయకులు ఇచ్చే ఆహారాన్నో ధాన్యాన్నో తీసుకుంటారు. చాలా సందర్భాలలో దళిత వర్గాల వాళ్ళుతమ హక్కుల కోసం ధైర్యం చేసి ముందుకు వచ్చినపుడు సాంప్రదాయక వర్గాల వాళ్లు తమ ఆర్థిక బలం ఉపయోగించి వారిని పొలాలనుండి ఖాళీ చేయించి వారిచేత పనులు మాన్పించి కూలీ కూడా ఆపివేయించి అణచివేసారని విన్నాం. వీరిపై నిషేధం చాలా పకడ్బంధీగా పెద్దెత్తున జరుగుతుంది. అందరూ నడిచే దారిలో వారు నడవ కూడదు. కోమటి వారికి నిత్యావసర సరకును అమ్మకూడదు. ఇలాంటి నిషేధాలు చాలా విధిస్తారు. మాకు దొరికిన కొన్ని సాక్ష్యాలను బట్టి అతి చిన్న కారణం చాలు. దళిత వర్గాలపై సామాజిక నిషేధం ప్రకటించడానికి . దళితవర్గాల ప్రజలు ఉమ్మడి బావిలోని నీరు వాడుతు,న్నా దళితుడు జంధ్యం వేసుకున్నా, మంచి బట్టలు, నగలు ధరించినా, పెళ్లికొడుకు గుఱ్ఱంపైనెక్కి వీధిలో ఊరేగింపు ఏగినా దళితులపై సామాజిక నిషేధం అతి కఠినంగా అమలు చేయబడింది."

ప్రత్యేక నివాసాల కోసం అస్పృశ్యులు డిమాండ్ చేస్తున్నారు. ఈ డిమాండ్‌పై హిందువుల అభిప్రాయం ఎలా ఉంటుందో చెప్పడం సాధ్యంకాదు. అస్పృశ్యులు చేస్తున్న డిమాండ్‌లలో అతి ప్రధానమైందిదే. ఇతర కోరికల విషయంలో ఏం జరిగినా ఈ కోరిక విషయంలో మాత్రం అస్పృశ్యులు వెనక్కి తగ్గరు. హిందువులు తాము అస్పృశ్యులు భగవంతుని ఇచ్ఛమేరకు కలసివున్నామని భావించవచ్చు. భార్యాభర్తలు ఇలాగే భగవంతునిచే కలపబడినారని బైబిల్ చెబుతుంది. అందుచేత బైబిల్ భాషలోనే దైవేచ్ఛచేత కలసి ఉన్న వారిని మనిషి వేరు చేయకూడదని వారంటారు. హిందువులతో తమ సంబంధం ఇలాంటిదన్న దృష్టి అస్పృశ్యులు వ్యతిరేకిస్తారు. ఈ సంబంధం తెగిపోవాలని హిందువుల నుంచి సంపూర్ణంగా వేరు పడాలని అది తక్షణమే కావాలని అస్పృశ్యులు కోరుకుంటారు.

ఇక తక్కిన సమస్యలు ఖర్చుకు సంబంధించింది. ఈ పథకం పూర్తి కావడా ఎన్నేళ్ళు పడుతుంది అన్నది. ఖర్చుకు సంబంధించినంత వరకు ప్రభుత్వమే ఆర్థిక భా వహించాలని అస్పృశ్యులు అంటున్నారు. ఈ భారం చాలా వరకు హిందువుల మీ పడుతుంది. కానివాళ్ళు ఎందుకు భరించకూడదు? హిందువుల కన్నీ వున్నాయి. దేశంలోని భూమి వారిది. వ్యాపారం వారి చేతిలో ఉంది. రాజ్యం వారిదే. ఆధార వచ్చే ప్రతి మార్గం లాభం వారి చేతిలోనే వున్నాయి. ఇతర కులస్థులు ముఖ్యం అస్పృశ్యులు, కట్టెలు కొట్టే వాళ్ళు, నీరు తోడేవాళ్లు మాత్రమే. అందుచేత ఈ సాం వ్యవస్థ హిందువులకు ప్రతిదానిపై ఆధిపత్యాన్నిస్తుంది. ఈ దేశమంతా వారిదే అయినప ఈ పథకం ఖర్చులు మాత్రం వారెందుకు భరించకూడదు.

ఇక కాలం విషయం. అస్పృశ్యుల్ని ప్రత్యేక గ్రామాలకు తరలించడానికి 20 సంవత్సర పట్టినా ఏం ఫరవాలేదు. కొన్ని వేల సంవత్సరాలుగా హిందువులకు బంధితులైన బానిస ఉన్నవీరు 20 ఏళ్ళ తర్వాతనైనా స్వేచ్ఛ పొందుతామనే ఆశతో సంతోషపడతారు.

## అధ్యాయం IX

# కులం - రాజ్యాంగం

అస్పృశ్యులు పైకి లేవనెత్తిన ఈ సమస్యల్ని రాజ్యాంగంలో ఎందుకు చేర్చాలని ఎవరైనా అడగవచ్చు. ప్రపంచంలో ఇంకెక్కడా రాజ్యాంగ నిర్మాతలు ఇలాంటి విషయాల్ని పట్టించుకునే అవసరం కలగలేదు. ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఈ సమస్యల్ని లేవనెత్తిన వాళ్ళు రాజ్యాంగంలో వీటికి చోటుండాలని వాదించేవారు దీనికి సమాధానం చెప్పాలి. ఈ ప్రశ్నకు సమాధానం స్పష్టంగానే ఉందని నాకన్పిస్తుంది. భారతీయ సంఘం స్వభావం కారణంగానే ఈ ప్రశ్నకు రాజ్యాంగ ప్రాముఖ్యం వస్తోంది. హిందువులలోని కులపద్ధతి, ధర్మవ్యవస్థ దీనికంతా కారణం. ఇంత మాత్రం చెబితే పాశ్చాత్యులకు కుల ధర్మవ్యవస్థలు తెచ్చిపెట్టిన సామాజిక రాజకీయ పరిణామాలు అర్థం కావు. కాని ఇంత చిన్న వ్యాసంలో భారతీయ వర్ణవ్యవస్థకు రాజ్యాంగంపై ప్రభావం గురించి విస్తారంగా చెప్పలేనన్నటం కూడా సత్యమే. ఈ అంశాన్ని గురించి విస్తారంగా తెలుసుకో గలిగిన వారు 'కులనిర్మూలనం' అనే నా గ్రంథాన్ని చూడవచ్చు. ఆ గ్రంథాన్ని నేను కొంత కాలం క్రితం రాశాను. హిందువుల వర్ణవ్యవస్థ ధార్మికవ్యవస్థ సామాజిక ఆర్థిక కారణాలచేత ఎలా చీలిపోయిందో వర్గాలుగా ఎలా తయారయిందో ఆ గ్రంథంలో బాగా వివరించబడింది. ఈ వ్యాసంలో నేను కొన్ని సాధారణమైన విషయాలే ప్రస్తావిస్తాను. రాజ్యాంగాన్ని నిర్మించేటప్పుడు సామాజిక నిర్మాణాన్ని ఎప్పుడూ మనస్సులో ఉంచుకోవాలి. రాజకీయవ్యవస్థ, సంఘవ్యవస్థతో సమన్వయం కల్గివుండాలి. సాంఘిక శక్తుల ప్రభావం సామాజిక రంగంలో మాత్రమే ఉండదు. రాజకీయ రంగానికి కూడా ప్రవేశిస్తుంది. అస్పృశ్యుల అభిప్రాయం ఇలా. ఇది నిర్వివాదాంశమని నేననుకుంటాను. హిందువులకు ఈ వాదాన్ని గురించి దాని బలాన్ని గురించి బాగా తెలుసు. కాని హిందూ సమాజం యూరోపియన్ సమాజం కంటే భిన్నం కాదని వాదిస్తారు. హిందువుల వర్ణవ్యవస్థ, పాశ్చాత్య సమాజంలోని వర్ణవ్యవస్థ ఇవి రెండూ

వేరు కావంటారు. ఇది స్పష్టంగా అబద్ధం. వర్ణవ్యవస్థను గురించికాని, వర్గవ్యవస్థను గు
కాని మాట్లాడితే వారికి ఏమీ తెలియదు. కులవ్యవస్థ మనిషిని వేరుచేయటాన్ని
సూత్రంగా కలిగింది. ఒక కులం నుంచి ఇంకొక కులాన్ని వేరు చేయడాన్ని కులధ
పరిగణిస్తుంది. వర్గ వ్యవస్థలో కూడా ఇలా వేరు చేయటం ఉంది కాని ఈ ఏ
ఒక ధర్మము కాదు. వేర్పాటువల్ల వారి సామాజిక సంపర్కము దెబ్బతినదు. వర్గవ్యవ
వర్గాలు తయారవుతాయి. కాని వర్గాలు కుల వర్గాలు వంటివి కావు. వర్గవ్యవ
తయారవుతాయి. రెండువర్గాల వంటివికావు. వర్గవ్యవస్థలోని వర్గాలు సామాజికేతరస
కాని కులవ్యవస్థలోని కులాలు స్పష్టంగా సంఘ వ్యతిరేకాలే అవుతాయి. ఈ వి
నిజమే అయితే హిందూ సంఘంలోని సామాజిక వ్యవస్థ భిన్నమని, అలాగే రా
వ్యవస్థ కూడా భిన్నంగా వుండాలని చెప్పడంలో వివాదమే లేదు. అస్పృశ్యులు కోరు
దల్లా ఉద్దేశాలకు, సాధనాలకు మధ్యలో అన్వయం వుండాలని మాత్రమే. ఉద్దేశం
కావచ్చు. ఉద్దేశం ఒకటే అయినంత మాత్రాన సాధనాలు కూడా ఒకేలా ఉండ
నియమం లేదు. వాస్తవానికి ఉద్దేశాలు ఒకటిగానే, మార్గాలు మాత్రం కాలాన్ని సంద
బట్టి మారాలి. ఉద్దేశాలపట్ల నిజాయితీ వున్న వారెవరైనా తమ ఉద్దేశం వ్యర్థం కాక
ఉండాలంటే భిన్న సాధనాల్ని మార్గాల్ని అవలంబిస్తామన్న వాస్తవాన్ని అంగీకరించాలి.

ఈ సందర్భంలో మరో విషయాన్ని నేను ప్రస్తావిం చదలచుకున్నాను. నేను వ
చెప్పినట్టు హిందూ సంఘంలోని కులపునాది కారణంగానే దాని సామాజిక వ్య
అనుగుణమైన రాజకీయ వ్యవస్థ ఉండాలి. దీన్ని కొందరంగీకరిస్తూనే హిందూ మ
కులాన్ని నిర్మూలించగలమని వాదిస్తారు. నేను దాన్ని ఒప్పుకోను. అలా వాదించే
దృష్టిలో కులమనేది 'క్లబ్' లాంటిదో, మున్సిపాలిటీ వంటిదో అయిన ఒక సంస్థ
భావిస్తారు. ఇది పెద్ద తప్పు. కులం అనేది మతానికి సంబంధించింది. మతం ఏరూ
వున్నా అది సంస్థే. కులానికి కూడా ఒక వ్యవస్థీకరణ వుండవచ్చుకాని కుల
గర్భీకరించుకున్న మత వ్యవస్థ లాంటిది మాత్రం అదికాదు. మతం ప్రతి వ్యక్తి
మంతటా వ్యాపించి వున్న ఒక ప్రేరణ లేదా శక్తి. అది వ్యక్తి శీలాన్ని చ
ప్రతిచర్యల్ని రూపుదిద్దుకునేలా చేస్తాయి. ఈ ఇష్టాలు అయిష్టాలు, చర్యలు ప్రతిచ
నియంత్రించదగినవి. కాబట్టి వ్యవస్థ కానివి. అవి కేవలం కొన్ని ప్రేరణలు మా
వీటిని నియంత్రించవచ్చు. ప్రతిక్రియను చూపవచ్చు. రాజకీయాలను సాంఘికశ
విషపూరితం చేసి కొంతమందికి వైభవాన్ని చాలా మందికి తక్కువతనాన్ని కల్గించే ప
తప్పించాలంటే రాజకీయ నిర్మాణంలోనే దురభిమానాల్ని నియంత్రించి అన్యాయాన్ని రూపు
సంఘశక్తులు స్వేచ్ఛా విహారం చేస్తే ఏ దుష్ఫలితాలు వస్తాయో ఆ ఫలితాలు రాక
కాపాడే పద్ధతులు ఉండేలా రాజకీయ వ్యవస్థను నిర్మించుకోవాలి.

ఇంత వరకూ నేను స్థూలంగా ఏఏ కారణాల చేత చిత్రమైన హిందూ సంఘ వ్యవస, చిత్రమైన రాజకీయ వ్యవస్థ నిర్మాణాన్ని అపేక్షిస్తుందో స్థూలంగా వివరించాను. ఇతర దేశాలలో రాజ్యాంగ నిర్మాతలను బాధించని కొన్ని సమస్యల నుంచి భారతీయ రాజ్యాంగ నిర్మాతలు ఎలా తప్పించుకోలేరో కూడా చెప్పాను. ఇప్పుడు నేను ప్రత్యేకంగా ఒకే ప్రశ్నమీద చర్చిస్తాను. రాజ్యాంగంలో కులపథకం ఎందుకు చోటు చేసుకోవాలి. పబ్లిక్ ఉద్యోగాలలో అస్పృశ్యులకు ఎందుకు ప్రత్యేక కేటాయింపు ఉండాలి. ఆ ఉద్యోగాలలో వారినే ఎందుకు నియమించాలి అనే విషయం మాత్రం చర్చిస్తాను. ఈ కోరికల్ని సమర్థించడం సులభం. కారణాలు స్పష్టం. అస్పృశ్యుల్ని హిందువుల నుండి వేరు చేయడం అప్రధానాంశాల మీద ఆధారపడింది కాకపోవటంలోనే ఈ కారణమంతా వుంది.

వీరిమధ్య వున్నది మౌలికమైన వ్యతిరేకత, ద్వేషము. వీటికి ఏ నిరూపణలు అక్కరలేదు. అస్పృశ్యత అన్న ఒక పద్ధతి చాలు హిందువులకు అస్పృశ్యులకు నడుమ స్వాభావికమైన వ్యతిరేకత ఎలావుందో చెప్పడానికి. ఈ వ్యతిరేకత ఇలావుండగా బ్రిటిష్‌వారి నుండి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వచ్చిన తర్వాత అస్పృశ్యులు ఇంకా హిందూవులనే ఆశ్రయించి వారినే నమ్మి వుండమని అడగడంకాని హిందువులు వారికి న్యాయం చేస్తారని అనుకోవడం కాని అసాధ్యం. హరిజనుడు తాను హిందువును నమ్మనంటే తప్పేమిటి? యూరోపియన్ ఎలా అతనికి ఇతరుడో అలాగే హిందువుకూడా ఇతరుడే. యూరోపియన్ పరుడైనా తటస్థంగా వుంటాడు. కాని హిందువలా కాదు. సిగ్గువిడిచి తన వర్గం వారివైపు పక్ష పాతాన్ని చూపిస్తాడు. అస్పృశ్యుల వైపు వ్యతిరేకత కల్గి వుంటాడు. ఇన్ని యుగాలలోను హిందువులు అస్పృశ్యుల్ని నీచమైన వేరే వర్గంగానే (వేరే జాతి కాకపోయినా) పరిగణిస్తూ నీచంగా చూశారు. అగౌరవ పరిచారు. తమవారు కానట్టు వదులుకున్నారు. తమధర్మ నియమాల మీదనే ఆధారపడి హిందువులు తమదే చాలా విశిష్టమైన వర్గమనే దుర్భ్రమలో దురభిమానంలో ఇరుక్కుపోయి అస్పృశ్యుల ఆశయాలతో ఎప్పుడూ పాలుపంచుకోలేదు. మీదు మిక్కిలి వారితో తమకేం సంబంధం లేనట్టు వారి ఆశయాలు తమకు వ్యతిరేకమైనట్టు ప్రవర్తిస్తారు. అలాంటప్పుడు అస్పృశ్యులు తమ భాగ్యాన్ని వాళ్ళ చేతుల్లో ఎందుకు పెట్టాలి. వారికి అస్పృశ్యుల ధ్యేయంపట్ల ఆశయాల పట్ల వ్యతిరేకత ఉంది. అస్పృశ్యులలో ఇప్పుడిప్పుడే పుట్టుకొస్తున్న చైతన్య శక్తుల్ని వారు సానుభూతితో చూడరు. వాళ్ళ అవసరాలు తీర్చే బాధ్యత వీళ్ళకు లేదు. వాళ్ళ బాధల్ని గురించి, కోరికల గురించి వీరికేం సంబంధం? వారి అభిలాషలకు వీరు బద్ధ శత్రువు. వారికి ఏ పరిస్థితుల్లోనూ న్యాయం జరగనివ్వరు. వారిని వివక్షతతోనే చూస్తారు. మతపరమైన సాకులతో మునుపటి లాగానే ఎంత అమానుషమైన కృత్యమైనా చేయడానికి సిద్ధపడతారు. వీళ్ళ నుంచి తప్పించుకునే ఉపాయం ఒక్కటే రాజ్యాంగంలో నిర్వచించినట్టుగా హిందు మెజారిటీ యొక్క నిరంకుశత్వానికి అస్పృశ్యులు బలికాకుండా రక్షణ పొందేలా రాజకీయ హక్కు కలిగి ఉండటమే. అస్పృశ్యులిలా కోరటం వింతగా ఉందా!

## అధ్యాయం X

# హిందువులకు వారి మిత్రులకు కొన్ని ప్రశ్నలు

ఈ రాజకీయ వివాద నేపథ్యంలో ఆలోచిస్తే హిందువులు భిన్న కులాల పట్ల భిన్నవిధాలుగా ప్రవర్తిస్తున్నట్టు ఎవరైనా గుర్తించవచ్చు రాజకీయ కారణాలు కావాలని ఈనాడు అడుగుతున్నవి అస్పృశ్యులు మాత్రమే కాదు. అస్పృశ్యుల్లాగే ముస్లింలు, సిక్కులు కూడా హిందువులకు తమ రాజకీయ డిమాండ్లను సమర్పించారు. ముస్లింలు కాని సిక్కులుకాని దిక్కులేని అల్పసంఖ్యాకులని ఏ విధంగానూ చెప్పలేం. మీదు మిక్కిలి ఇండియాలో అవి రెండూ చాలా శక్తివంతమైన సంఘాలు కూడా. విద్యారంగంలో బాగా ముందుకు పోయారు. ఆర్థికంగా బాగాస్థిరపడ్డారు. సామాజిక స్థితిలో వారు హిందువులతో సరిసమానంగా వున్నారు. వారిదొక ఘనీభవించిన వ్యవస్థ. వారిపై హిందువులు ఏ దౌర్జన్యం తలపెట్టలేరు కూడా, వారిని ఏవిధంగానూ కవ్వించడానికి వారికి ధైర్యం చాలదు.

ముస్లింలు, సిక్కుల రాజకీయ డిమాండ్లేవి? ఇక్కడ వాటినంతా వివరించలేను. వారు చాలా అత్యాశాపరులు. హిందువులు వారిని వ్యతిరేకిస్తూ ఉంటారు. దీనికి భిన్నంగా ఉన్నాయి, అస్పృశ్యులున్న పరిస్థితులు, వారి కోరికలు. ముస్లింల సిక్కుల పరిస్థితులకన్నా కోరికల కన్నా చాలా భిన్నమైనవి. అస్పృశ్యులు బలహీనులు దిక్కు లేనివారు, అగౌరవంతో చూడబడ్డవారు. వారు అందరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడ్డవారు. కొన్ని సందర్భాల్లో హిందూ ముస్లిం, సిక్కులు ముగ్గురు కలసి అస్పృశ్యుల్ని అణచి వేయడం కూడా జరిగింది. అల్ప సంఖ్యాక వర్గాల్లో అధిక రక్షణ పటిష్టమైన భద్రత కావల్సిన వారు అస్పృశ్యులే. వారి కోరికలు చాలా సౌమ్యంగా వున్నాయి. ముస్లిం సిక్కుల డిమాండులలో వున్న అతిశయం (అత్యంతాశ) వీరికోరికల్లో లేవు. హిందువులు ముస్లింలు సిక్కుల అస్పృశ్యుల కోరికలపట్ల ఎలా స్పందిస్తున్నారు? వారి కోరికల్లో ఎంత అత్యాశ వున్నా హిందువులు

ముఖ్యంగా ముస్లింలతో సర్దుబాటు చేసుకోవడానికే సిద్ధపడుతారు. ముస్లింలతో వారి సంబంధాలు సజావుగా వుండడానికి మరింత దయతో, మరీ అవసరమైతే ఉదారంగా కూడా ప్రవర్తిస్తారు. శ్రీ రాజగోపాలచారిగారు రాజకీయ అవకాశాన్ని ఎలా దుర్వినియోగం చేశారో ఎవరూ ఇంకా మరువ లేదు. అతను ఉన్నట్లుండి ముస్లిం లీగ్‌లో సైనికుడిగా చేరి తన బంధువుల మీద పాతస్నేహితుల మీద యుద్ధం ప్రకటించారు. ఎందుకని? ముస్లింల న్యాయసమ్మతాలైన కోర్కెలను సమ్మతించడంలో విఫలమైనందున కాదు! దురాశతో 'పాకిస్తాన్' కోరగా అంగీకరించినందుకు. అలాంటి రాజగోపాలచారిగారు అస్పృశ్యుల డిమాండ్ల విషయంలో ఎలాంటి ప్రతిక్రియ చూపారు? నాకు తెలిసినంత వరకు ఆయన ఏవిధంగానూ స్పందించలేదు. ఆయనకు ఇండియాలో 60 మిలియన్ల అస్పృశ్యులున్నారని ముస్లింలలాగే వారు కూడా రాజకీయ రక్షణలను కోరుతున్నారని తెలిసినట్టు కూడా లేదు. శ్రీ రాజగోపాలాచారిగారు ఈ విధంగా తెలిసి నిశ్శబ్దంగా వుండటం మరీ భయంకరంగా ఉదాసీన భావాన్ని ప్రకటించటం మొత్తం హిందూవ్యవస్థకే ప్రతీకగా వుంది. హిందువులు అస్పృశ్యుల రాజకీయ కోర్కెలను కుక్కలాగా మొండిపట్టుతో మతభ్రష్టుడిలాగా మూర్ఖపు పట్టుదలతో వ్యతిరేకిస్తూ వచ్చారు. పత్రికారంగం వారిదే, కాబట్టి ఒక పథకం ప్రకారం అస్పృశ్యుల ప్రసక్తిని వదలివేస్తూ వచ్చింది. వారిని నిర్లక్ష్యం చేయలేని సందర్భాల్లో వారి నాయకుల్ని కొంటారు. ఎక్కడ కొనడానికి వీలుండదో అలాంటి నాయకుణ్ణి తిడతారు. తప్పుగా చూపిస్తారు. బ్లాక్ మెయిల్ చూడా చేస్తారు. తమ చేతిలోవున్న బలాన్నంతా వినియోగించి అతణ్ణి అణచి పారవేసి అతడు మాట్లాడకుండా చేస్తారు. అలా ఎవరైనా ఒక నాయకుడు అస్పృశ్యుల తరపున పోరాడ్డానికి సిద్ధపడితే అతణ్ణి అతని అనుయాయులను జాతీయ వ్యతిరేక శక్తులుగా ముద్రవేస్తారు. హిందూ మెజారిటీ చేత పరిపాలింప బడటానికి చాలా ఉదాహరణలను సమ్మతిస్తున్న అస్పృశ్యుల రాజకీయ కోర్కెలు వినగానే, వాళ్ళు కోరుతున్నదల్లా కేవలం కొన్ని రాజకీయ భద్రతలేకదా, అనే విషయం కూడా విస్మరించి హిందువులు వారిపై ఆగ్రహం ప్రదర్శిస్తారు. యునైటెడ్ ఐర్లండుతో సంప్రదింపులు జరుపుతున్నప్పుడు కార్సన్ రెడ్మండుతో ఏమన్నాడో హిందువులకు తెలీదు. ఆ సంఘటనను స్మరించటం ఇక్కడ బాగుంటుంది. రెడ్మండ్ కార్సన్‌తో ఇలా అన్నాడు: అల్‌స్టర్ లోని ప్రొటెస్టెంట్ మెనారిటీ కోసం ఏ భద్రతలనైనా అడిగింది ఇవ్వడానికి స్థిరంగా వున్నాను. కాని మనం కలిసి ఒక యునైటెడ్ ఐర్లండును స్థాపిద్దాం. దానికికార్సన్ ఇచ్చిన సమాధానం అతి సంగ్రహంగా, అతి దారుణంగా ఉంది. అతను చెప్పినదాన్ని గురించి కాస్సేపు కూడా ఆలోచన చేయకుండా అన్నారట. "మీ భద్రత లెవర్కి కావాలి. మీ పరిపాలన మాకక్కర లేదు". అస్పృశ్యులు కార్సన్ లాగా మాట్లాడకుండా వున్నందుకు హిందువులు కృతజ్ఞులుగా వుండాలి. అలా ఉండడానికి బదులు చాలా ఆగ్రహంతో వున్నారు, రాజకీయ హక్కుల కోసం ధైర్యం చేసి అడుగుతున్నారు అని. హిందువుల అభిప్రాయం ప్రకారం అస్పృశ్యులు ఏ హక్కుల్ని గురించి అడగటానికి వీల్లేదు. ఇలా హిందువులు భిన్న ధోరణులతో వ్యవహరించటం దేన్ని సూచిస్తుంది.? అది మూడంశాల్ని సూచిస్తుంది. 1. అధికారాన్నంతా తామే పొందాలని వారి కోరిక. 2. రాజకీయ సంస్థల్ని న్యాయ సూత్రాలపై ఆధారపెట్టి

నడపటం వాళ్ళ కిష్టం లేదు. 3. ఎక్కడ పదవిని అప్పగించాల్సొస్తుందో అక్కడ క్రూర శక్తులకు కవచధారులకు మాత్రమే అప్పగిస్తారు తప్ప న్యాయ నిర్దేశాలకు ఎప్పుడూ తలవంచరు.

భారత రాజకీయ రంగంలో హిందువుల ధోరణి ఒక పెద్ద విషాదరంగం. దురదృష్టంగా విషాదరంగం ఇదొకటే కాదు. మరొక్కటి కూడా ఉంది. విదేశాలలో ఉన్న హిందువుల స్నేహితులకు సంబంధించింది ఇది. హిందువులు తమ వేరైన ప్రచారంతో ప్రపంచమంతటా, ముఖ్యంగా " స్వేచ్ఛాభూమి "అమెరికాలో చాలామంది స్నేహితులను సృష్టించుకున్నారు. భాధాకరమైన దేమిటంటే ఈ హిందూ స్నేహితులకు తాము మద్దతిస్తున్న పక్షం న్యాయపరంగా సమర్థించదగింది కాదు అన్నది తెలియక పోవడమే. నాకు తెలిసినంతవరకు ఏ అమెరికన్ హిందు స్నేహితుడు కూడా హిందువులు దేనికోసం నిలబడ్డారో తెలీదు. వారు స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నారా? అధికారం కోసమా? వారు బలం కోసమే యుద్ధం చేస్తుంటే వారి యుద్ధ ఉద్దేశాలను స్పష్టం చేయమని అడగవద్దా? అమెరికన్ స్నేహితులు హిందువులు కనీసం ఈ పని చేయవచ్చు. అమెరికన్ స్నేహితులు సహాయం కోరి చేసిన విజ్ఞప్తికి ప్రతిస్పందిస్తున్నారు కాబట్టి, వారలా విచక్షణ లేకుండా శుద్ధిగా హిందూ పక్షాన్ని సమర్థిస్తే స్వాతంత్ర్యోద్యమ ఆశయాలకు వారెలాంటి అపచారం చేస్తున్నారో చెప్పాల్సిన అవసరం ఉంది. హిందువులు ఏ పద్ధతిలో రానిస్తారో అదే పద్ధతిలోనే నేను చెబుతున్నాను. యుద్ధం ప్రారంభమైనప్పటి నుండి కాంగ్రెసు లోపల బైట ఉన్న హిందువులు బ్రిటిష్ వారిని యుద్ధ ఉదేశాలను ప్రకటించమని పట్టుబడుతూ వచ్చారు. రాత్రింబవళ్ళు బ్రిటిష్ వారిని అడుగుతున్నారు "మా సహాయం మీకు కావాల్సి వుంటే మీరు యుద్ధం ఎందుకు చేస్తున్నారో తెలపండి. స్వాతంత్ర్యం కోసమే యుద్ధం చేస్తున్నట్టయితే, ఏ పేరుతో యుద్ధం చేస్తున్నారో ఆ స్వాతంత్ర్యం మాకిస్తారా చెప్పండి?" అని ఒక దశలో యుద్ధం స్వాతంత్ర్యం కోసమే చేస్తున్నామని, ఫలితంగా స్వాతంత్ర్యం వస్తుందని బ్రతికె వారినోట ఒక మాట వస్తే చాలని కూడా హిందువులనుకున్నారు. కాని ఈనాడు ఆదశ దాటిపోయారు. అలాంటి హామీలతో సంతోష పడే స్థితిలో లేరు. ఒక కాంగ్రెసు ఆయన అన్నట్టు " తరువాత ఏదీ లేని కూలిపోతున్న బ్యాంకులో తీసుకొమ్మన్న చెక్కు వారికక్కర లేదు". వారికి స్వాతంత్ర్యం ఇప్పుడే కావాలి. యుద్ధ యత్నాలకు హిందువులు స్వచ్ఛంద సహాయం అందించడానికి ముందే కావాలి. శ్రీ గాంధీ గారి క్విట్ ఇండియా అనే కొత్త నినాదానికి అర్థం ఇదే. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పే బాధ్యత శ్రీ చర్చిల్ పై పడింది. ఆయనన్నారు ఈ యుద్ధం శత్రువుల్ని జయించడం కోసమని. హిందువులకు ఈ మాట సంతృప్తి కల్గించ లేదు. వాళ్లు మళ్లీ ఇలా ప్రశ్నించారు. "ఆశయం సాధించాక ఏం చేస్తారు యుద్ధం తరువాత ఏ విధమైన సాంఘిక వ్యవస్థను ఏర్పరుస్తారు?" ఆయన చెప్పిన సమాధానం పెద్ద తుఫాన్‌ని లేపింది."సాంప్రదాయికమైన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని మళ్ళీ పునః స్థాపించటమే యుద్ధం తరువాత చేయబోయే పని." అని చర్చిల్ సమాధానం చెప్పారు. ఈ ప్రశ్నలు న్యాయసమ్మతంగా వున్నాయని నేనంగీకరిస్తాను. చర్చిల్‌ని ఈ ప్రశ్నల్ని అడిగినట్టు శ్రీ గాంధీని హిందువుల్ని కూడా అడగటం న్యాయ సమ్మతమని హిందువులు స్నేహితులు

గుర్తించక పోతే ఎలా? బ్రిటిష్ వారు హిట్లర్ పై యుద్ధం ప్రకటించాలి. శ్రీ గాంధీ బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించింది. బ్రిటిష్ వారికి ఒక సామ్రాజ్యముంది. హిందువులకీ వుంది. హిందూ ధర్మం ఒక సామ్రాజ్య వాదం. అస్పృశ్యులు పాలితులైన ప్రజలు కారా! హిందూ ప్రభువుల ఆజ్ఞాబద్ధులుగా సేవకులుగా బ్రతకటం లేదా! యుద్ధ ఉద్దేశాల్ని చెప్పమని చర్చిల్ నడిగినపుడు, శ్రీ గాంధీజీని హిందువుల్ని ఎందుకడక్కూడదు. యుద్ధం స్వాతంత్ర్యం కోసమే నంటారు. అదే సత్యమయితే వారిరువురూ తమ తమ యుద్ధ ఉద్దేశాలను ప్రవచించి తీరాలి. బ్రిటిష్ వారితో పోరాడి గెలిచాక, శ్రీ గాంధీ ఏమి చేయదలచుకున్నారో ఆ స్వాతంత్ర్యంతో అస్పృశ్యులకు స్వేచ్ఛ ఇస్తారా లేక హిందువులకు ఇప్పుడున్న దానికంటే అధిక బలవంతులుగా చేసి అస్పృశ్యులను వారి క్రింద గులాములుగా ఇరికిస్తారా? శ్రీ గాంధీ హిందువులు కలిసి కొత్త వ్యవస్థను సృష్టిస్తారా? లేక కులభేదాలతో అస్పృశ్యతలేని స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వం అంగీకరించని సనాతన హిందూ భారత దేశాన్ని పునర్మించి దాంతో సంతోషపడతారా? శ్రీ గాంధీని, హిందువులను అమెరికన్ స్నేహితులు ఈ ప్రశ్నల్ని వారి నడగాలి. ఈ ప్రశ్నలు న్యాయబద్ధమైనవి యుక్తమైనవి. ఈ ప్రశ్నలకు సమాధానాలు విన్నప్పుడే అమెరికన్ స్నేహితులకు శ్రీ గాంధీ యుద్ధం స్వాతంత్ర్యం కోసమా? అధికారం కోసమా? అనేది స్పష్టమవుతుంది. ఈ ప్రశ్నలు యుక్తమైనవి న్యాయబద్ధమైనవే తప్పనిసరిగా అడగదగినది. హిందువుల గురించి బాగా తెలిసిన వారికి ఈ కారణమర్థవుతుంది. హిందువులు ఒక స్వభావసిద్ధమైన, బాగా పాతుకుపోయిన సనాతనత్వాన్ని కలిగినవారు. వారి మతం ప్రజాస్వామ్య లక్షణాలైన స్వేచ్ఛ, సమానత్వం సౌభ్రాతృత్వాలతో ఏ మాత్రం పొసిగేదికాదు. అసమానత్వం ప్రపంచంలో అన్ని చోట్ల ఉందనుకోండి. చాలా వరకు పరిస్థితుల ప్రభావం చేతే అది పుడుతుంది. కాని ఎక్కడా మతం దానికి మద్దతు ఈయదు. ఒక హిందూమతం విషయంలో పరిస్థితి వేరు. హిందూ సమాజంలో అసమానత ఉండటం మాత్రమే కాదు, అసమానత అన్నది హిందూమతంలో అధికార సూత్రం. హిందువుకు సమానత పట్ల ఇచ్ఛకూడా లేదు. అతని అభిలాష, ధోరణి ఒకే మనిషికి, ఒక విలువ అనే ప్రజాస్వామిక సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఉండటం. ప్రతి హిందువు సాంఘికంగా "టోరీ"[1] లాగా, రాజకీయంగా రాడికల్[2] లాగా ఉంటాడు. శ్రీ గాంధీ కూడా ఈ సూత్రానికపవాదమే కాదు. ప్రపంచానికి ఉదారవాదిలాగ ఆయన కనిపించినా ఆ ఉదారవాదం, బూట్ల మీద పేరుకున్న దుమ్ములాగా ఒక పలుచని వెన్నీరంలాగా (ఈనాటి డెకొలాం మాదిరి) అతని చుట్టూ అలంకరింపబడింది తప్ప సహజమైంది కాదు. అతన్ని గోకితే ఆ ఉదారవాదం వెనుక ఉన్న నీలవర్ణమున్న 'టోరీ' కన్పిస్తాడు. శాపగ్రస్తమైన కుల ప్రతీక ఆయన. హిందూమతాన్ని అతి మూఢంగా సమర్థించే వ్యక్తి. హిందువులు ప్రసిద్ధమైన 1776 నాటి అమెరికా స్వాతంత్ర్య ప్రకటనను ఎలా చదివారో చూడండి. ఆ ప్రకటనలోని క్రింది వాక్యాలు చదివితే హిందువుకు పిచ్చెక్కింది.

"ఎప్పుడైనా సరే ఏ విధమైన ప్రభుత్వమైనా ఈ ఉద్దేశలను నాశనం చేసేదిగా తయారైతే దాన్ని మార్చటానికి, నిషేధించడానికి తమకు రక్షణను, సంతోషాన్ని కలిగించే

1. పెద్దల దారి సరే అనేవారు. పూర్వసంప్రదాయం తప్పరాదనే వారు :

విధంగా నిర్దిష్టమైన సూత్రాలతో అధికార వ్యవస్థతో కూడిన కొత్త ప్రభుత్వాన్ని ఏర్పరచుకోటానికి ప్రజలకు హక్కు ఉంది"

హిందువక్కడే ఆగిపోతాడు. ఈ ప్రకటనలో పూర్వ భాగమేం చెబుతుందో అతను పట్టించుకోడు.

మనుష్యులందరూ సమానంగా సృష్టించబడ్డారు. సృష్టికర్త పరాధీనం కాని కొన్ని హక్కులను అందరికీ ప్రతిపాదించాడు. వీటిలో జీవితం, స్వేచ్ఛ, సుఖాన్వేషణ ముఖ్యం. ఈ హక్కుల్నే ఇవ్వటానికే మనుష్యుల నడుమ ప్రభుత్వాలేర్పడతాయి. అవి ప్రజల అనుమతితోనే అధికారాలను పొందుతాయి.

అమెరికా చరిత్రలో ఈ ప్రకటనను అమలు చేయటం ఒక విషాదకరమైన కథ అయ్యింది. ఈ డాక్యుమెంటుపై రెండు రకాల అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. దీన్నొక బ్రహ్మాండమైన ధార్మిక స్మృతి వాక్యంలా కొందరభిప్రాయ పడుతారు. మరి కొందరు చాలా అబద్ధాలకు శాశ్వతత్వం కలిగించటానికి ఇది పుట్టిందంటారు. ఏది ఏమైనా మానవ స్వేచ్ఛకు సంబంధించిన ఈ ధర్మ పత్రం నీగ్రోలకు మాత్రం అన్వయించలేదు. అయినా ఇక్కడ ముఖ్యమైన విషయమేమిటంటే జెఫర్‌సన్ తయారుచేసిన ఈ ప్రకటనను, వెనుక ఉన్న శ్రద్ధ నమ్మకం విషయంలో సందేహం ఎవ్వరికీ లేదు. ఒక సుదీర్ఘమైన ధర్మసూత్రాన్ని ప్రతిపాదించేటప్పుడు తమ దేశం అతి చిన్న అడుగు వేయటానికి నిర్ణయించుకుందని అతడు మరువలేదు. అయన ఇలారాశారు " నేను నా దేశప్రజల విషయంగా చింతిస్తున్నాను." ఈ మాట నీగ్రోలకు జరిగిన అన్యాయానికి బహుమతి కాదనుకోండి. కాని దేశంలో ఇంకా న్యాయాన్యాయ వివేకం పూర్తిగా చచ్చిపోలేదని న్యాయయుక్తమైన ఆగ్రహం ఎప్పటికైనా ఒక రోజు కట్టలు తెంచుకొని ప్రవహించి తీరుతుందని గుర్తించటం మన కెంతో ఓదార్పు కలిగిస్తుంది. నీగ్రోలు దీన్ని చూచి నవ్వవచ్చు. కాని ఈ మాత్రం ఓదార్పు కూడా హిందువుల నుండి అస్పృశ్యులు ఆశించలేరు. ఈనాడు హిందువులు సంఘటితులై ఘనీభవించిన శక్తిగా ఉన్నారని ప్రజలు గర్విస్తుంటారు. ఇండియాలో అస్పృశ్యులకు ఇది వింతగా అనిపించవచ్చు కాని ఇది భయప్రదమే తప్ప ఓదార్పు కాదు. అమెరికాలో ఇలాగే నీగ్రోలపట్ల ఘనీభవించిన దక్షిణ రాష్ట్రాలున్నాయి. ఇండియాలోని హిందువుల్లో జెఫర్‌సన్ లాగా సిగ్గు, పశ్చాత్తాపం కల్గిన వ్యక్తి ఎవరైనా కన్పిస్తాడా? హిందువులు ఒక వైపు స్వాతంత్ర్యాన్ని కోరుతూ అస్పృశ్యతా కళంకంతో నిండిన వారై ప్రపంచ పౌరుల ముందు నిలబడటానికి సిగ్గు పడాలని నేననుకుంటాను. స్వాతంత్ర్యం కోసం హిందువులు అరచి బొబ్బలు పెడుతున్నారు. దురదృష్టమేమిటంటే వాళ్ళకు మద్దతు కూడా వుంది అన్నదే వారి వివేకం చచ్చిందనటానికి నిదర్శనం. వారికి ధార్మికమైన ఆగ్రహావేశాలు లేవు. వారికి అస్పృశ్యత నైతికంగా పాపము కాదు. సాంఘికంగా అన్యాయమూ కాదు. అది క్రికెట్ లాగా హాకీలాగా వారికొక ఆట

మాత్రమే. శ్రీ గాంధీ స్నేహితులు ఆయన వైపు అయన కృషివైపు చూపిస్తారు. కాని శ్రీ గాంధీ హిందూ సమాజాన్ని సంస్కరించడానికి ఏం చేశాడని ప్రజాస్వామ్యవాదులు ఆయన కృషిని జీవితాన్ని ఆశను కలిగించేదిగా, భరోసాను నింపేదిగాను ఉదహరించగలరు? అతని స్నేహితులు హరిజన సేవక సంఘాన్ని గురించి విన్నారు. వారడుగుతారు "శ్రీ గాంధీ హరిజనుల అభ్యున్నతి కోసం పని చేయటంలేదా అని? ఇది నిజమా? హరిజన్ సేవా సంఘం ఆశయా లేమిటి? హిందూ యజమానుల నుండి స్వేచ్ఛను పొందేలా, అస్పృశ్యులను తయారు చేయటమా? శ్రీ గాంధీకి అలాంటి ఉదేశం ఏదీ లేదు. ఇది చేయాలనే ఆయన కెప్పుడూ లేదు. అంతేకాదు నేను చెబుతున్నా ఆయన ఈపని చేయలేడు కూడా! ఇది ఒక ప్రజాస్వామ్య వాదో ఒక విప్లవ వాదో చేయాల్సినపని" కాని గాంధీజీ రెండూ కాదు. ఆయన పుట్టుకతోనూ విశ్వాసంతోనూ ఒక టోరీ మాత్రమే. హరిజన సేవక సంఘ కృషి అస్పృశ్యులను అభివృద్ధి చేయటం కాదు అతని ముఖ్య ఉద్దేశ్యం. ప్రతి ఆత్మగౌరవం ఉన్న అస్పృశ్యునికి తెలిసినట్టు గానే హిందువులకు హిందూమతానికి ఇండియాను సంరక్షకంగా తయారు చేయటమే. నిశ్చయంగా అస్పృశ్యుల ఆశయాల కోసం ఆయన పోరాటటం లేదు. దీనికి వ్యతిరేకంగా హరిజన సేవక సంఘం ద్వారా అల్పులైన అస్పృశ్యులకు అల్పమైన బహుమానాలివ్వడం ద్వారా అస్పృశ్యుల వ్యతిరేకత అనే రోళ్ళను ఆయన కొని వాటిని మొద్దుబారేలా చేసి లాగేసు కొంటున్నారు. వ్యతిరేకత ఒక్కటే కులవ్యవస్థకు గండి కొట్ట గలగుతుందని నిజమైన ప్రజాస్వామ్యాన్ని స్థాపిస్తుందని ఆయనకు తెలుసు. శ్రీ గాంధీ హిందూమతం, హిందూ వర్ణవ్యవస్థ చెక్కుచెదరకుండా ఉండాలని కోరుకొంటారు. కాని ఎలా? ఒకే కడుపున పుట్టిన భాగస్వాముల్లా కాదు. పేద బంధువుల్లా మాత్రమే. శ్రీ గాంధీకి అస్పృశ్యులంటే దయ. కాని ఎందుకు? కేవలం హిందువుల్నించి వేరై స్వేచ్ఛను పొందాలనుకుంటున్న వారిని వారి ఉద్యమాన్ని దయతో చంపాలని వారి కోరిక. హరిజన సేవక సంఘం ఆయన ఉపాయంల్లో ఒకటి మాత్రమే. దానిచే శ్రీ గాంధీ విజయవంతంగా ఈ పితలాటకాన్ని ఆడగలిగారు.

ఇక పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ గురించి చూద్దాం. జెఫర్‌సన్ ప్రకటన నెహ్రూకు ఊపిరి. కాని ఆయన ఎప్పుడైనా ఈ 60 మిలియన్ల అస్పృశ్యుల స్థితి గతులను గురించి సిగ్గుపడ్డారా? పశ్చాత్తాపము ప్రకటించారా? ఆయన కులం నుండి వెలువడిన సాహిత్య ప్రవాహంలో ఎక్కడైనా వారిని గురించి ప్రస్తావించాడా? మీక్కావలసింది ఏదైనా ఉంటే ఇండియాలోని యువకుల దగ్గరికి పొండి. విశ్వవిద్యాలయాలలో చేరి పండిట్ నాయకత్వాన్ని అనుసరిస్తూ వారు బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా రాజకీయ పోరాటం చేయటానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటారు. కాని పనిపాట్లు లేని హిందువర్గాలకు సంబంధించిన ఈ పిల్లలు అస్పృశ్యులకు తమ పూర్వీకులు చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా ఏంచేశారు? రాజకీయ ప్రచారంలో పాల్గొనటానికి కొన్ని వేలమంది హిందూ యువకులు దొరుకుతారు.

కాని వర్ణవ్యవస్థను విచ్ఛిన్నం చేయడానికి కనీసం ఒక యువకుడు కూడా దొరకడు. ప్రజాస్వామ్యం ప్రజాస్వామ్య జీవితం, న్యాయం వివేకం వీటికి మూలంగావున్న ప్రజాస్వామ్య సిద్ధాంతంలో విశ్వాసం ఇవన్నీ హిందూమనస్తత్వానికి పరాయివి. ఇలాంటి టోరీల చేతుల్లో ప్రజాస్వామ్యాన్ని స్వాతంత్ర్యాన్ని వదలిపెట్టడం ప్రజాస్వామ్యవాదులు చేసే పెద్దతప్పు. అందుచేత అమెరికాలో హిందూమిత్రులు శ్రీ గాంధీని హిందువులను, వారి యుద్ధ ఉద్దేశా లను ప్రకటించమని అడగటం చాలా అవసరం. ఎందుకంటే అప్పుడైనా హిందువులు స్వేచ్ఛకోసమే వాస్తవంగా సత్యంగా పోరాడుతున్నారా? అన్నది స్పష్టమౌతుంది. కాంగ్రెస్ పార్టీ చేసిన తీర్మానాలను తమ విదేశీయమిత్రుల్నిచూడమంటారు కాని హిందువుల అమెరికన్ మిత్రులకు నా సూచన ఏమిటంటే మైనారిటీ హక్కుల విషయంగా చేసిన ఆ జిలుగు వెలుగుల సాధారణీకరణంతో తృప్తిపడిపోకూడదనీ మైనారిటీ హక్కులను ప్రకటించటం వేరు, వాటి నమలు చేయటం వేరు. హిందు మిత్రులు వారు నిజంగా స్వాతంత్ర్య మిత్రులే అయితే నేరుగా మైనారిటీ హక్కులను అమలుచేయమని ఎందుకడుగకూడదు? హిందువులు మాత్రం కేవలం స్వాతంత్ర్య ప్రకటనలో తృప్తిపడమని చెప్పటంలేదు. బ్రిటిష్‌వారు తమ యుద్ధం ఉద్దేశాలను ఆచరించి చూపాలని కోరుకునే హిందువులు, తమ ఉద్దేశాలను ఎందుకాచరించకూడదు? హిందువుల అమెరికన్ స్నేహితులు. హిందువులు బ్రిటిష్‌పై చేస్తున్న ఈ యుద్ధం స్వేచ్ఛ కోసమేనన్న హిందూ ప్రచారం చేత తప్పుడు దారి తొక్కకుండా ఉంటారని నమ్ముతున్నాను. హిందువులకు సహాయం చేయటానికి ముందు హిందువులు స్వాతంత్ర్యం సిద్ధించాక అస్పృశ్యుల వంటి కొన్ని మిలియన్ల భారతీయుల స్వేచ్ఛకు శత్రువులు కాబోరన్న విషయాన్ని ధృవపరుచుకోవాలి. ఇండియాలోని 60 మిలియన్ల అస్పృశ్యుల తరపున నేనీ విజ్ఞప్తి చేస్తున్నాను.

అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే రాజ్యాంగంలో ముఖ్యంగా ఇండియా పరిస్థితులకు తగిన చెక్ బ్యాలెన్స్‌లు అక్కర్లేదని అమెరికన్ స్నేహితులనుకోకూడదు. ప్రజాస్వామ్యానికి మిత్రులైన వారెవరూ జాన్ ఆదమ్స్ అన్న క్రింది మాటలు మరచిపోజాలరు.

ఇంతవరకు మనం చూచిన ప్రతి చరిత్ర పుటల్లోను ప్రజలు తమ మీద చెక్ లేనప్పుడు అన్యాయంగా నిరంకుశంగా పాశవికంగా ఆటవికంగా క్రూరంగా ప్రవర్తించారనటానికి తిరుగులేని సాక్ష్యాలున్నాయి. అనియంత్రితమైన అధికారంమున్నపుడు రాజైనా మంత్రివర్గమైనా ఇలాగే ప్రవర్తిస్తుంది. మెజారిటీ ఎల్లప్పుడూ అపవాదరహితంగా మైనారిటీ హక్కుల్ని అపహరిస్తూనే వచ్చింది అన్న విషయాన్ని గుర్తు చేస్తున్నాను."

అన్ని మెజారిటీ వర్గాలకు చెక్ బ్యాలెన్స్‌లు ఉండాలనుకున్నప్పుడు హిందువుల విషయంలో ఇవెంత అధికంగా వుండాలి?

## పదసూచిక

# అనుబంధానికి సూచన

ప్రస్తుత గ్రంథం 'కాంగ్రెస్ గాంధీలు అంటరాని వారికేం చేశారు?' అన్నది 1945లో ముద్రించబడిన తొలి ప్రతికి పునర్ముద్రణ. డా. అంబేద్కర్ 1946లో రెండవప్రతిని ముద్రించారు. అందులో కొన్ని చేర్పులు, కూర్పులు కనిపిస్తున్నాయి. 9వ అధ్యాయంలో ఈ మార్పులున్నాయి కాబట్టి ఈ సంపుటంతో పాటు ఈ అధ్యాయాన్ని అనుబంధంగా ఇస్తున్నాం. తక్కిన గ్రంథంలో మార్పులు లేవు.

నాగపూర్‌కి చెందిన శ్రీ జి.పి. మాండల్‌కర్ ఈ రెండోప్రతిలోని అంశాల్ని మా అవగాహనకు తెచ్చారు. సంపాదకవర్గం వారికి కృతజ్ఞతలు తెలుపుకొంటోంది.

అధ్యాయం IX

# విదేశీయునికి వినతి

## బానిసల్ని సృష్టించే నిరంకుశత్వానికి స్వేచ్ఛ ఇవ్వకండి

### I

భారతీయ రాజకీయాలలో ఆసక్తి చూపే విదేశీయులందరూ ఏవో కొన్ని సందర్భా తప్ప కాంగ్రెస్ పక్షాన్నే బలపరుస్తున్నారు. ఇది అందరి అనుభవంలో ఉన్న విషయ ఇది దేశంలోని కొన్ని ఇతర రాజకీయ పక్షాల్ని కలవరపరుస్తోంది, బాధ పెడుతో కూడా. ముఖ్యంగా ముస్లింలకు ప్రాతినిధ్యం వహించే ముస్లిం లీగ్, కొంత కాలం నుం నిర్జీవంగా ఉంటున్నా బ్రాహ్మణేతరుల పక్షాన మాట్లాడటానికి ఉబలాట పడే జస్టి పార్టీ, అస్పృశ్యులకు ప్రాతినిధ్యం వహించే అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమా ఈ పక్షాలన్నీ విదేశీయుల మద్దతు కోసం అభ్యర్థిస్తున్నవే. కాని ఆ విదేశీయుడు సమస్యల్ని సానుభూతితో వినడానికి కూడా సిద్ధంగా లేడు. విదేశీయులకు మిగిలిన రాజకీ పక్షాలకు కాకుండా కాంగ్రెస్‌కే ఎందుకు మద్దతునిస్తాడు? తాను ఇలా ప్రవర్తించడా విదేశీయుడు రెండు కారణాలు చెబుతాడు. మొదటి కారణం కాంగ్రెస్ ఒకటే భారతీయ తరుఫున, కడకు అస్పృశ్యుల తరఫున కూడా మాట్లాడకల్గిన రాజకీయ సంస్థ కావటం. విశ్వాసం వాస్తవాల మీద ఆధారపడ్డదేనా?

ఇలాంటి నమ్మకం ఏర్పడ్డానికి కారణాలైన పరిస్థితులు ఉంటూ వచ్చాయ గుర్తించక తప్పదు. ఈ భావన ఏర్పడ్డానికి అలాంటి సందర్భాన్ని కలిగించిన బాధ కాంగ్రెస్‌కి అనుకూలంగా భారతీయ పత్రికావ్యవస్థ చేసిన ప్రచారం. కాంగ్రెస్‌కి పత్రికారం ఎప్పుడూ సహకారిగా ఉంటోంది. కాంగ్రెస్ ఎప్పుడూ తప్పు చేయదని మూఢం విశ్వసిస్తుంది. కాంగ్రెస్ గౌరవానికి సిద్ధాంతాలకు సరిపోని ఏ వార్తకైనా ఎటువం ప్రచారమూ ఇవ్వరాదన్నది వాళ్ళ సూత్రం. విదేశీయునకి భారతీయ రాజకీయ విషయాల

గురించి తెలుసుకోవడానికి ప్రధాన మాధ్యమికం పత్రికలు మాత్రమే. భారతీయ పత్రికల ఘోష ఇలా ఉండగా ఇంగ్లాండు వారుకాని, అమెరికన్ వారు కాని ఒక విషయాన్ని తెలుసుకో గలుగుతారు. అదే భారతీయులకు అస్పృశ్యులతో కలిపి ప్రాతినిధ్యం వహించే సంస్థ కాంగ్రెస్ ఒకటేనని.

ఈ ప్రచార ప్రభావం మరింత ఉచ్ఛస్థాయినందుకోడానికి ఇంకో కారణముంది. అస్పృశ్యుల తరపున కాంగ్రెస్ చెబుతున్న వాటికి వ్యతిరేకంగా ఏ ప్రచారమూ లేక పోవటమే అది. అస్పృశ్యులు ఈ విషయంలో విఫలం కావటానికి చాలా కారణాలున్నాయి.

అస్పృశ్యులకు ప్రత్యేకమైన వార్తా సంస్థ లేదు. కాంగ్రెస్ వార్తా సంస్థ వారిని దగ్గర చేరనివ్వదు. వారికి ఏ కొద్ది మాత్రం ప్రచారం కూడా ఇవ్వకూడదని వారి నిశ్చయం. వాళ్ళు తమదైన వార్తా సంస్థను ఏర్పరచుకోలేక పోవటానికి స్పష్టమైన కారాణాలున్నాయి. అడ్వర్టైజ్‌మెంట్‌ల ద్వారా ఆదాయం లేకుండా ఏ పత్రికా మన జాలదు.

వ్యాపార రంగం నుండే అడ్వర్టైజ్‌మెంట్‌లు వస్తాయి. మరి ఇండియాలో చిన్న పెద్ద వ్యాపారం మొత్తం కాంగ్రెస్ పరంగానే వుంది. కాంగ్రెసేతర సంస్థల్ని అది ఆదరించదు. ఇండియాలో ముఖ్యమైన వార్తా సంస్థ ." అసోసియేటెడ్ ప్రెస్ ఇన్ ఇండియా" ఈ సంస్థలో పనిచేసే వారంతా మద్రాస్ బ్రాహ్మణులే. నిజానికి ఇండియాలోని వార్తా వ్యవస్థ మొత్తం వారి చేతిలోనే వుంది. వీరు స్పష్టమైన కారణాల చేత కాంగ్రెస్ అనుకూలురే అందుచేత కాంగ్రెస్‌కు వ్యతిరేకమైన ఏ వార్తకూ ప్రచారం రానివ్వరు. ఇవి అస్పృశ్యుల అదుపులో లేని పరిస్థితులు.

అస్పృశ్యులు ప్రచారం చేయటంలో విఫలం కావటానికి మరో కారణం, వారిలో ప్రచారం చేయాలన్న మనోనిశ్చయం లేక పోటవమే. బయటి ప్రపంచం దృష్టిలో భారతదేశ ధ్యేయాన్ని దెబ్బతీసే ఏ పనీ చేయరాదన్న దేశభక్తిభావమే దీనికి కారణం. ఇండియాలోని రాజకీయాలకు రెండు దృక్పధాలున్నాయి. ఒకటి విదేశీయ రాజకీయాలు. మొదటిది బ్రిటిష్ సామ్రాజ్య వాదం నుంచి ఇండియాకు స్వాతంత్ర్యం సంపాదించడానికి సంబంధించింది. రెండవది స్వతంత్ర భారతదేశంలో రాజ్యాంగ స్వభావం ఎలా ఉండాలి అన్న విషయానికి సంబంధించినది. వివేకంతో పరిశీలించేవారికి ఈ రెండు సమస్యలూ వేరు వేరుగా కన్పిస్తాయి. కాని ఈ రెండు దృక్పధాలు వేరు చేయటానికి వీలున్నా ఈ విషయంలో ముఖ్యుడు, ఏ అపార్థాలు చేసుకోరాని వాడు, అయిన విదేశీయుడు ఈ రెండు సమస్యలూ వేరు చేయలేక పోతున్నాడు. రాజ్యాంగ రాజకీయాలుకు సంబంధించిన తగవును భారతీయ విదేశీయ రాజకీయ అంతిమలక్ష్యాల విషయంగా వచ్చిన అసహ్యతగా అపార్థం చేసుకోడానికి

అవకాశం ఉంది. అందుకే అస్పృశ్యులు కాంగ్రెస్ ప్రచారాన్ని వ్యతిరేకించకుండా మౌనంగా ఉండి పోయారు.

తమకు వ్యతిరేకంగా జరుగుతున్న కాంగ్రెస్ ప్రచారాన్ని ఎదుర్కోకుండా నిశ్శబ్దంగా ఉండటంలో దేశభక్తి ఆదర్శాలున్నాయని కాంగ్రెస్ వారు ఒప్పుకోరు. వాస్తవమేమిటంటే ఇలా అస్పృశ్యులు మౌనంగా ప్రత్యక్ష ప్రతిఘటన లేకుండా ఉండటం చేతే కాంగ్రెస్ అస్పృశ్యులతో కలిపి అందరికీ ప్రాతినిధ్యం వహిస్తుందన్న సాధారణ విశ్వాసాన్ని కల్పించింది. ఇంతవరకూ వివరించినట్టుగా కాంగ్రెస్ అస్పృశ్యులతో కలిపి సర్వప్రతినిధి అన్న విశ్వాసం నిరాధారమైందని 1937లో జరిగిన ఎన్నికల వాస్తవాలు నిరూపించాయి. ఈ ఎన్నికలలో కాంగ్రెస్ సర్వప్రతినిధి, విశేషించి అస్పృశ్యులకు ప్రతినిధి అన్న భ్రమలను ఆ ఎన్నికలు ఎలా పోగొట్టాయో ఈ గ్రంథం పూర్వభాగంలో నేను వివరించాను. దాన్ని చదివితే ఈ ప్రచారం వాస్తవాలకు ఎంతదూరమో విదేశీయుడు గుర్తించ గలుగుతాడు.

కాంగ్రెస్ కున్న ఈ ప్రతినిధి స్వభావాన్ని ఎన్నికలలో పరీక్షించక ముందు విదేశీయుడు ప్రచారం చేత ఏర్పడ్డ అభిప్రాయాలను కలిగివుంటే దాన్ని మనం క్షమించవచ్చు. కాని 1937లో ఎన్నికలలో ఈ విషయాన్ని పరీక్షించడం జరిగింది. ఎన్నికల ఫలితాలు పరిశీలిస్తే పరిస్థితులు స్పష్టంగా అర్థమౌతాయి. దీనితో విదేశీయులు కాంగ్రెస్ ఒకటే సర్వప్రతినిధి అన్న తమ అభిప్రాయాన్ని మార్చుకొని భారతీయ సాంఘిక జీవితంలోని ఇతర వర్గాలకు ప్రాతినిధ్యం వహించే ఇతర పక్షాలు కూడా అంతే ముఖ్యమైనవని అవి కాంగ్రెసేతరములైనా వాటి ధ్యేయాలను కూడా వినటం న్యాయమని గుర్తిస్తారు.

## II

విదేశీయుడు కాంగ్రెస్‌కు మద్దతునివ్వటానికి మరో కారణముంది. కాంగ్రెస్ పక్షం చేపట్టే ప్రదర్శన చర్యలకు ఇతర రాజకీయ పక్షాలు చేపట్టే ప్రదర్శన చర్యలకు ఉన్న తేడాలో ఆ కారణముంది. భిన్న రాజకీయ పక్షాల కార్యక్రమాల్ని పోల్చి చూస్తూవస్తే కాంగ్రెస్ వాళ్ళు నిత్యం బ్రిటిష్ ప్రభుత్వంతో ఏవో ఒక సంఘర్షణతో ఉన్నట్టు కనిపిస్తారు. ఏ పౌర ధిక్కార ఉద్యమాలనో నడుపుతూ, విదేశీ ప్రభుత్వ చట్టాలను ఎదిరిస్తూ, పన్నులు కట్టకుండా ఉద్యమాలు నిర్వహిస్తూ, జైళ్ళకు వెళుతూ, సహాయనిరాకరణాన్ని ప్రభోదిస్తూ, కార్యాలయాలను బహిష్కరిస్తూ, మరి అనేక ఇతర మార్గాలలో దేశ స్వాతంత్ర్యం కోసం ఆత్మత్యాగాన్ని చేయటానికి సిద్దంగా ఉన్నట్టు బయటకి అగుపించటంలో ఈ తేడా కనిపిస్తుంది. మిగిలిన రాజకీయ పక్షాలన్నీ ఇంత ఆసక్తి లేనట్టు ఉదాసీనంగా ఏ ఘర్షణలోనూ పాలుపంచుకోకుండా ఉండటం గమనిస్తాడు. దీన్ని బట్టి కాంగ్రెస్ ఒక్కటే భారతదేశ

స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న సంస్థ అని, ఇతర పక్షాలు అడ్డుపెట్టేవి కాకున్నా ఉదాసీనంగా ఉన్నాయని భావిస్తాడు. అందుచేత స్వేచ్ఛా ప్రియుడుగా ఇతర పార్టీలకన్నా స్వాతంత్ర్యం కోసం పోరాడటం నిర్వహిస్తున్న కాంగ్రెస్ పార్టీని సమర్థిస్తారు.

ఇది సహజంగానే ఉంది. కాని మనం శ్రద్ధతో గమనించాల్సిన అంశం ఒకటుంది. ఈ విధంగా కాంగ్రెస్ పట్ల ఉన్న పక్షపాతానికి స్వాతంత్ర్యం కోసం ఏర్పాటు, అన్న ఉద్యమం పట్ల వున్న వ్యామోహం కారణమా? లేక స్వాతంత్ర్యం కోసం పోరాటం అనే ఉద్యమం భారతీయులకు స్వాతంత్ర్యం తెచ్చి పెడుతుందని నిశ్చితాభిప్రాయం కారణమా? మొదటిది నిజమైతే ఇంతకు ముందు ఏడవ అధ్యాయంలో స్వాతంత్ర్యం కోసం పోరాటం అనే ఈ ఉద్యమంలో కాంగ్రెస్ వారితో అస్పృశ్యులు ఎందుకు చేతులు కలపలేదన్న విషయంగా నేనిచ్చిన వివరణ విదేశీయునిపై నేను కోరిన ప్రభావాన్ని చూపలేదని చింతించాల్సి వస్తుంది. కాని ఆ కారణంగా నేను విదేశీయునితో తగాదా పడలేను. ఎందుకంటే ఆ అధ్యాయాన్ని చదివిన చాలా మంది విదేశీయులు అస్పృశ్యులు "స్వాతంత్ర్యం కోసం పోరాటం" అనే ఉద్యమంలో చేరటానికి నిరాకరించటానికి నేను చూపిన కారణాలు సమంజసమైనవి అని ఒప్పుకున్నా, స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న ఒక సంస్థకు ఎందుకు మద్దతు నివ్వకూడదు అన్న విషయంగా తగిన ఆధారాన్ని నేను చూపలేదని అనవచ్చు. కాంగ్రెస్ పటవార్ది పక్షపాతానికి రెండవది కారణమే అయితే ఇప్పుడీ విషయాన్ని మరో దృష్టితో చూడాలి. విదేశీయుని ధోరణికి కారణాన్ని పరిశీలించి పొరపాటునుంచి అతన్ని కాపాడాల్సిన అవసరం ఉంది.

సాధారణంగా తన వీరాలను స్పష్టంగా చెప్పి తన ఉద్దేశాన్ని నిశ్చయంగా ప్రకటించి నిజాయితిని నిరూపించుకొని తన ఉద్దేశాల విషయంగా సందేహమున్న వారి నమ్మకాన్ని, సహకారాన్ని పొందలేని వాని మాటను ఎవరూ నమ్మరు. ఈ సూత్రం కాంగ్రెస్‌కు కూడా వర్తించాలి. కాని ఏడవ అధ్యాయంలో నేను చూపించినట్టుగా తాను ఏ విధమైన ప్రజాస్వామ్యాన్ని ఇండియాలో స్థాపించదలచుకుందో అందులో నిమ్నవర్గాలకు అందులోనూ అస్పృశ్యులకు ఏవిధమైన స్థానముంటుందో కాంగ్రెస్ ఒక ముసాయిదాను ఇంతవరకూ తయారుచేయలేదు. నిజానికి అలాంటి ముసాయిదా ప్రతిని తయారుచేయటానికి నిరాకరించింది కూడా. అస్పృశ్యులు ఇతర మైనారిటీ వాళ్ళు పట్టు బట్టినా లెక్కచేయలేదు. ఇలాంటి ప్రకటనే లేనప్పుడు విదేశీయులు ప్రజాస్వామ్యం కోసం నిలబడ్డవారంటూ కాంగ్రెస్ వారిని సమర్థిస్తూ పోవటం ఒక చిత్రమైన అవివేకం మాత్రమే.

కాంగ్రెస్ ఇండియాలో ప్రజాస్వామ్యాన్ని స్థాపించడానికి ప్రయత్నిస్తోందని భావించడానికి ఏ ఆధారమూ లేదు. స్వాతంత్ర్యం కోసం పోరాటం అనే ఉద్యమాన్ని

నిర్వహిస్తూ ఉండటంవల్ల ఒక వాస్తవాన్ని ఆధారంగా అలాంటి నిర్ణయానికి రాలేము. అలాంటి నిర్ణయానికి వచ్చేముందు విదేశీయుడు ఇంకొంచెం ముందు వెళ్ళి మరొక ప్రశ్న అడగాలి. ఏమిటంటే ఎవరి స్వాతంత్ర్యం కోసం పోరాటం అనే మునుపటి ప్రశ్న కన్నా చాలా ముఖ్యమైంది. ఇది చాలా సమంజసమైన, అవసరమైన ప్రశ్న. స్వాతంత్ర్య ప్రియులెవరైనా ఈ విషయాన్ని గురించి బాగా తెలుసుకొని సత్యమేదో తెలుసుకోకుండా కాంగ్రెస్‌కు మద్దతు పలకటం తప్పవుతుంది. కాని కాంగ్రెస్ పక్షం వహించే విదేశీయుడు అలాంటి ప్రశ్న లేవనెత్తడానికి కూడా లెక్కచేయడు. విదేశీయుడు సహజంగానే ఈ ప్రశ్నను ఎత్తాలి. ఒక్కసారి ఈ ప్రశ్న ఉదయిస్తే కాంగ్రెస్ ప్రజాస్వామ్యాన్ని స్థాపించడానికి చాలా వ్యతిరేకమని వంశపారంపర్య విధానంలో వంశ పారంపర్యమైన బానిసవర్గాలను పరిపాలించే హైందవ రాజనీతి వ్యవస్థను పునఃస్థాపించడం కోసమే ప్రయత్నం చేస్తోందనటానికి కావాల్సినంత నిరూపణ దొరికేది..

బానిస వర్గాలపట్ల, అందులోనూ ముఖ్యంగా అస్పృశ్యుల పట్ల విదేశీయుల దృక్పథం ఎలాంటిది అన్నది ఒక ప్రత్యేకాంశంగా ఏ రాజకీయ పక్షమూ పట్టించుకోకుండా వదిలివేయటానికి వీలులేదు.

అదెంత ముఖ్యమైనది. అస్పృశ్యుల పక్షాన ప్రాతినిధ్యం వహించే ఎవరైనా దీన్ని తప్పకుండా గమనించాలి. గమనించి విదేశీయుడు కాంగ్రెస్‌కు మద్దతు నివ్వటంలో ఏ తప్పు చేస్తున్నాడో అతనికి బాగా తెలిసేలా నచ్చ చెప్పాలి.

## III

ఇష్టాఇష్టాల ప్రశ్న అటుంచి కాంగ్రెస్ పట్ల విదేశీయునికి ఉన్న ఈ వింత ధోరణికి కారణం స్వాతంత్ర్యం పట్ల, స్వపరిపాలన పట్ల, ప్రజాస్వామ్యం పట్ల, రాజనీతిశాస్త్రకోవిదులైన పాశ్చాత్య రచయితలు చెప్పిన కొన్ని అభిప్రాయాలు ఇప్పటికీ సగటు విదేశీయుని మూల ధనం (Stock in trade) గా వుంది.

స్వాతంత్ర్యానికి సంబంధించినంత వరకూ విదేశీయునికి ఒక దేశ స్వాతంత్ర్యానికి, ఆ దేశంలోని ప్రజల స్వాతంత్ర్యానికి నడుమ తేడా ఉండదు. ఒక దేశానికి స్వాతంత్ర్యం రావడమంటే ఆ దేశంలోని ప్రజలంతా స్వతంత్రులు కావటమనే భావిస్తారు. అందుచేత దేశానికి స్వాతంత్ర్యం లభిస్తే ప్రజల స్వేచ్ఛకు హామీ దొరికినట్టే అని అతని భావన.

స్వపరిపాలనకు సంబంధించినంతవరకు ప్రజలలో రాజ్యాంగ న్యాయానికి సంబంధించిన ఒక పరిజ్ఞానం ఉండటమే ప్రధానమని తలుస్తారు. గ్రోటే,[1] దీన్నే రాజ్యాంగం

1. హిస్టరీ ఆఫ్ గ్రీస్, సం. 8, పుట 347.

పట్ల అత్యున్నత గౌరవ భావనగా చెప్పారు. ప్రజలలో ఈ అలవాట్లు ఉంటే స్వపరిపాలన ఒక వాస్తవమౌతుంది. ఇంతకంటే కోరదగిందేం లేదు. ప్రజాస్వామ్యానికి సంబంధించి దాన్ని సాధించడానికి సార్వత్రికమైన యువజనుల వోటు హక్కు ఉండాలని అతను విశ్వసిస్తాడు. ఇలాంటి రీకాల్, ప్లెబిసైట్, మాటి మాటికీ ఎన్నికలు జరపటం ఇలాంటి పద్ధతుల్ని కూడా సూచించారు. కొన్ని దేశాలలో ఈ పద్ధతుల్ని ప్రయోగించారు కూడా. కాని చాలా దేశాలలో యువజనుల వోటుహక్కు తరచుగా ఎన్నికలు జరపటం అనే రెండు పద్ధతులతోనే ప్రజల చేత, ప్రజలకోసం, ప్రజల ప్రభుత్వాన్ని భద్రంగా కాపాడవచ్చు. ఈ అభిప్రాయాలు నమ్మదగినవిగా లేవు. తప్పుదారి పట్టించేవిగా ఉన్నాయి.

ఒక దేశ స్వాతంత్ర్యానికి, దేశ ప్రజల స్వాతంత్ర్యానికి నడుమ తేడా గుర్తించ లేకపోవడం తమను తాము మోసగించు కోవటం కాకపోయినా తప్పు దారి తొక్కట మౌతుంది. సంఘం, జాతి, దేశం మొదలైన పదాలు సందిగ్ధ పదాలు కాకపోవచ్చుకాని మూర్తరూపాలే. తాత్వికంగా చూస్తే ఒకదేశాన్ని ఒకే ప్రమాణంగా చెప్పవచ్చుగాని సాంఘికంగా చూస్తే చాలా వర్గాలతో కూడిందిగానే చెప్పాల్సివస్తుంది. అలాగే దేశ స్వాతంత్ర్యం ఒక వాస్తవం కావాలంటే అందులో భాగాలుగా ఉన్న భిన్న వర్గాల స్వాతంత్ర్యాన్ని, అందులోనూ ముఖ్యంగా బానిసవర్గాలుగా పిలువబడే వారి స్వేచ్ఛను పరిరక్షించేదిగా ఉండాలి.

రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వాన్ని నిర్వహించటానికి రాజ్యాంగ బద్ధమైన న్యాయ ప్రవృత్తితోటి అలవాట్లు కొన్ని అవసరం. కాని రాజ్యాంగబద్ధమైన ప్రభుత్వాన్ని నిర్వహించటం ప్రజలు తమను తాము పాలించుకోవటం ఒకటి కావు. అలాగే అందరికీ వోటు హక్కు ఇవ్వటం వల్ల ప్రజల ప్రభుత్వం అనబడేది రాజప్రభుత్వం కంటే భిన్నమైనదన్నది తార్కికార్థంలో ఏర్పడవచ్చు. కాని దానితోనే ప్రజాస్వామ్య ప్రభుత్వం అంటే ప్రజల కోసం ఏర్పడే ప్రభుత్వం ఏర్పడుతుందని మాత్రం చెప్పలేము.

పాశ్చాత్య యూరోప్ దేశాలలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి ఏ దుస్థితి పట్టిందో తెలిసిన వాళ్ళకు ప్రజాస్వామ్య[1] భావనల మాటునున్న మోసం తెలుసుకోటానికి ఏ ఇతర నిరూపణా అక్కరలేదు. పాశ్చాత్య యూరోప్ దేశాలలో ప్రజాస్వామ్యం విఫలం కావటానికి

1. లేబర్ అండ్ పార్లమెంటరీ డెమోక్రసీ 1943 సెప్టెంబర్ 17 వతేదీ శిబిరంలో ఢిల్లీలో జరిగిన ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ వర్కర్ల అధ్యయనం కోసం ఇచ్చిన ఉపన్యాసం

కారణాలు నేను మరో సందర్భంలో చెప్పిన వాటినే ఇక్కడ మరలా సంగ్రహించి చెబుతున్నాను.

"మానవ సమాజంలోని ప్రభుత్వం చాలా ముఖ్యమైన మార్పుల్ని పొందింది. ఒక కాలంలో నిరంకుశులైన ప్రభువుల చేతిలో స్వేచ్ఛాధికార రూపమైన ప్రభుత్వంగా ఉండేది. చాలా కాలం యుద్ధాలు చేసి చేసి రక్తపాతం జరిగి జరిగి చివరకు దాని స్థానంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వ మొచ్చింది..[1] ప్రభుత్వ చట్టం పరిధిలో ఇదే చివరిదిగా భావించారు. దీనితో ప్రతి మనిషికి స్వేచ్ఛ, ఆస్తి, సుఖ సంతోషాలు ఉండే ఒక క్రొత్తయుగం వస్తుందని భావించారు. అలాంటి నమ్మకాలు ఉంచుకోవటానికి చాలా కారణాలున్నాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రజల గొంతులు వినిపించే శాసనసభ ఉంది. పాలనా యంత్రాంగం కన్నా చట్ట సభ ముఖ్యమైంది. కాబట్టి, చట్ట సభ ఆదేశాలనే పాలిస్తుంది. చట్ట సభకు పాలనాయంత్రాంగానికి పైన న్యాయ వ్యవస్థ ఉంది. అది ఈ రెంటిటిని నియంత్రిస్తుంది. నిర్ణీతమైన పరిధుల్లో ఉంచుతుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి, ప్రజా ప్రభుత్వానికి, ఉండదగ్గ లక్షణాలన్నీ ఉన్నాయి. అది ప్రజలచేత ప్రజలకోసం ఏర్పడిన ప్రజల ప్రభుత్వం. అందుచేత ఈ పద్ధతిని ప్రపంచదేశాలు ఒప్పుకొని ప్రారంభించినప్పటి నుంచి ఒక శతాబ్దము కాకముందే ఈ పద్ధతికి వ్యతిరేకంగా తిరుగుబాటు రావడం కొంత విస్మయాన్ని కల్గిస్తుంది. ఇటలీలో, జర్మనీలో, రష్యాలో, స్పెయిన్‌లో పోరాటాలు జరిగాయి. ఈ పద్ధతికి వ్యతిరేకత లేని దేశాలు కూడా కొన్ని ఉన్నాయి. ఈ పద్ధతికి అసమ్మతి, అసంతృప్తి, ఉండాల్సిన అవసరమేముంది. ఈ ప్రశ్న చాలా ముఖ్యమైనది. ఇండియా కన్నా ఈ ప్రశ్నను గురించి విచారించాల్సిన దేశం మరొకటిలేదు. ఇండియా ఈనాడు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కోసం సంప్రదింపులు జరుపుతోంది. తగినంత ధైర్యంతో భారతీయులకు "పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పట్ల జాగ్రత్త. అది బయటికి కన్పించేంత మంచి వస్తువు కాదు " అని ఎవరో ఒకరు చెప్పాల్సిన అవసరం ఉంది.

అయితే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎందుకు విఫలమైంది? ఎందుచేతనంటే ప్రజాస్వామ్యయంత్రాంగం చాలా నెమ్మదిగా పని చేస్తుంది, కాబట్టి త్వరిత చర్యను అది ఆలస్యం చేస్తుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంతో పాలనాయంత్రాంగాన్ని చట్టసభ చట్టాలు ఆమోదించకుండా అడ్డుపెట్ట వచ్చు. ఒక సమయంలో చట్ట సభ అడ్డుపెట్టకపోయినా న్యాయవ్యవస్థ ఆ చట్టాలు న్యాయ వ్యతిరేకమయినవని ఆపేయవచ్చు. ఈ పద్ధతిలో నియంతృత్వానికి స్వేచ్ఛా హస్తముండదు. అందుకే ఇటలీ, స్పెయిన్, జర్మనీ మొదలైన

1. లేబర్ అండ్ పార్లమెంటరీ డెమోక్రసీ 1943 సెప్టెంబర్ 17 వతేదీ శిబిరంలో ఢిల్లీలో జరిగిన ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ వర్కర్‌ల అధ్యయనం కోసం ఇచ్చిన ఉపన్యాసం

దేశాలలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని తృణీకరించి నియంతృత్వాన్ని ఆహ్వానించారు. నియంతలు మాత్రమే పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి వ్యతిరేకులై ఉంటే ఏమై ఉండేది కాదు. వాళ్ళు అలా వ్యతిరేకించడమే నియంతృత్వానికి చాలా ప్రభావవంతమయిన అడ్డుఅయి ఉండేది. కాని దురదృష్టవశంగా ప్రజల నియంతృత్వానికి వ్యతిరేకంగా వున్న దేశాలలో కూడా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పట్ల అతి తీవ్రమైన అసంతృప్తి ఉంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని గురించి చాలా బాధపడ్డదగ్గ విషయం ఇదే. ఇంతకంటే విచారించ దగిందేమిటంటే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఇంకా అన్ని చోట్ల నశించలేదు. అది మూడు వర్గాలలో విస్తరించింది. అందరికీ వోటు హక్కు అనే రూపంలో, రాజకీయ హక్కులలో సమానతగా అది మొదలయింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యముండి అందరికీ వోటు హక్కులేని దేశాలు చాలా కొద్దిగా వున్నాయి. రాజకీయ హక్కుల సమానత్వాన్ని సామాజిక ఆర్థిక అవకాశాలలో సమానత్వంగా ఇది వ్యాపింపజేసింది. సాంఘిక వ్యతిరేకమైన పుర గ్రామ సభల చేత ప్రభుత్వాన్ని అడ్డుకోవటానికి సాధ్యం కాకూడదని అది గుర్తించింది. వీటన్నిటితో ప్రజాస్వామ్యం వైపు దీక్షాబద్ధమైన దేశాలలో కూడా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పట్ల అతితీవ్రమైన అసంతృప్తి వుంది. అలాంటి దేశాలలో పుట్టిన అసంతృప్తికి కారణాలు నియంతృత్వ దేశాలలో కంటే భిన్నంగానే ఉండాలి. కాని ఆ వివరాలలోకి వెళ్ళటానికి నాకు కాలం చాలదు. మామూలు మాటల్లో చెబితే స్వేచ్ఛను, ఆస్తిని, సంతోషాన్ని పొందే మార్గాలను జనసామాన్యానికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అందించడంలో విఫలమైందనే భావనే ఈ అసంతృప్తికి కారణం. ఇది నిజమైతే ఈ వైఫల్యానికి హేతువులను గుర్తించటం చాలా ముఖ్యం. ఈ హేతువులు సిద్ధాంత లోపమూ కావచ్చు. వ్యవస్థలో లోపమూ కావచ్చు. లేక రెండూ కావచ్చు. నా ఉద్దేశంలో ఈ రెండూ హేతువులుగా కన్పిస్తున్నాయి.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విఫలమవ్వడానికి హేతువైన తప్పుడు సిద్ధాంతాలలో కాంట్రాక్ట్ స్వేచ్ఛ అనే భావన ఒకటని నేను నిస్సందేహంగా చెబుతాను. ఈ భావన పవిత్రీకరింపబడి స్వేచ్ఛ అనే పేరుతో సమర్థింపబడింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఆర్థిక అసమానతలను గమనించలేదు సరికదా కాంట్రాక్ట్‌లో భాగస్వాములకున్న పార్టీల ఒడంబడిక సామర్థ్యాలలో ఉన్న తేడాల వల్ల కలిగే ఫలితాన్ని పరిశీలించడానికి కూడా సిద్ధపడతాయి. ఈ కాంట్రాక్ట్ స్వేచ్ఛ వల్ల బలవంతులైన వాళ్ళు బలహీనులను మోసగించడానికి అవకాశం ఇచ్చినా అది పట్టించుకోలేదు. దీని ఫలితమేమిటంటే స్వేచ్ఛకు సమర్థకంగానిలబడాల్సిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేదల, దళితుల, దౌర్భాగ్యుల ఆర్థిక బలహీనతల్లకు హేతువైంది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పట్టించిన రెండవ తప్పుడు సిద్ధాంతం సామాజిక ఆర్థిక ప్రజాస్వామ్యం లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యం విజయవంతం కాదని గుర్తించకపోవటమే. కొందరీ ప్రతిపాదనను విమర్శించవచ్చు. దీన్ని ప్రశ్నించేవారికి నా

ప్రతి ప్రశ్న ఇది. ఇటలీ, జర్మనీ, రష్యాలలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంత సులభంగా ఎందుకు పతనమై పోయింది. ఇంగ్లండ్‌లో అమెరికాలోనూ అంతసులభంగా ఎందుకు పతనంకాలేదు? దీనికి ఒకే సమాధానం ఉందని నాకు తోస్తోంది. ఇంగ్లాండ్‌లోను, అమెరికాలోను, ఇటలీ, జర్మనీ, రష్యాలలో కన్నా ఆర్థిక సామాజిక ప్రజాస్వామ్యం కొంత అధికంగా ఉంది. పోగులు ఎంత గట్టిగా దృఢంగా ఉంటాయో ఆ బట్టకూడా అంతే బలవత్తరంగా తయారవుతుంది. ప్రజాస్వామ్యం సమానతకు మరో పేరు మాత్రమే. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం స్వేచ్ఛ పట్ల ఒక మోహాన్ని కల్గించింది. కాని సమానత్వంతో తలఊపినంత పరిచయం కూడా కలిగించుకోలేదు. సమానత్వం ప్రాధాన్యాన్ని గుర్తించటంలో విఫలమైంది. స్వేచ్ఛకు సమానత్వానికి నడుమ ఒక సామరస్యాన్ని సృష్టించడానికి ప్రయత్నము చేయలేదు. ఫలితంగా స్వేచ్ఛ సమానతను మింగేసింది. దీనితో ప్రజాస్వామ్యం పేరుకుమాత్రం మిగిలి ఒక ప్రహసనమైంది.

నా పరిశీలనలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వైఫల్యానికి హేతువులైన తప్పుడు సిద్ధాంతాలను ఇంతవరకూ ప్రస్తావించాను. కాని తప్పుడు సిద్ధాంతంగా కన్నా దాని వ్యవస్థలోని రూపాలే ప్రజాస్వామ్య వైఫల్యానికి కారణమయ్యాయని నేను చెప్పగలను. అన్ని రాజకీయ సమాజాలు రెండు వర్గాల కింద విభక్తమౌతాయి. పాలకులు, పాలితులు, ఇదే దౌర్భాగ్యం. ఈ లోపం ఇంతవరకు ఆగితే నష్టమేంలేదు. ధౌర్భాగ్యమేమిటంటే ఈ వర్గీకరణ ఇలాగే బిగుసుకు పోయి వ్యవస్థీకృతమై భిన్న అంతస్తులుగా వేరై పాలకులెప్పుడూ పాలకవర్గం నుంచే పుట్టడం, పాలితులు ఎప్పుడు పాలకులు కాలేక పోవడం సంభవిస్తుంది. ఇలా ఎందుకు జరుగుతుందంటే ప్రజలు సాధారణంగా తమను తాము పాలించు కోవాలని ఆశించరు. ఒక ప్రభుత్వాన్ని ఏర్పరచి ఇక పాలించమని దాన్ని వదిలేస్తారు. అందుకే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రజల చేత ఏర్పడే ప్రజల ప్రభుత్వం కాకపోతోంది. అందుకే వాస్తవానికి అది అనువంశికంగా పాలితులుగా ఉన్న ప్రజల్ని పాలకులుగా వున్న వర్గంవారు పాలించడమే అవుతోంది. ఈ దుర్మార్గమైన వ్యవస్థ పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అంత ఘోరమైన వైఫల్యంగా మార్చింది. దీని వల్లనే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం సామాన్య ప్రజానీకానికి స్వేచ్ఛను, ఆస్తిని, సుఖాన్వేషణ మార్గాన్ని ప్రసాదించే విశ్వాసాన్ని అది కలిగించలేక పోయింది. ప్రజాస్వామ్యం విఫలం కావటానికి దారితీసిన హేతువుల గురించిన ఈ విశ్లేషణ సరైంది. అయితే ప్రజాస్వామ్య వాదులకు జాగ్రత్తను సూచించే కొన్ని మౌలికమైన అంశాలు ఉన్నాయని అవి ప్రజాస్వామ్య మూలాలను తాకుతాయని వాటిని విస్మరిస్తే ప్రజాస్వామ్యానికి అపాయమని గుర్తించవలసి ఉంటుంది. స్పష్టతకోసం ఈ అంశాలను ఒక వరుసక్రమంలో వివరిస్తాను.

మొదటిది: ప్రతిదేశంలోను పాలకవర్గం పాలితవర్గం అనే రెండు వర్గాలుంటాయని నిరంతరం ఆరెంటి మధ్య అధికారం కోసం పోరాటం జరుగుతూ ఉంటుందన్న కఠిన సత్యాన్ని గుర్తించటం. రెండవది: పాలకవర్గం అధికారం, గౌరవాల కారణంగా బానిసవర్గాలపై ఎప్పుడూ తన ఆధిపత్యాన్ని సులభంగా నిలుపోగులుగుతూ ఉంటుంది. మూడవది: అందరికీ వోటు హక్కు ఉన్నంత మాత్రంలో తరచుగా ఎన్నికలు జరిగినంత మాత్రంగా పాలకవర్గం అధికారాని చేజిక్కించుకోవడానికి ఏ అడ్డంకులూ లేవు. నాల్గవది: న్యూనతాభావం చేత బానిసవర్గాల ప్రజలు పాలకవర్గాన్ని తమకు సహజమైన నాయకులు గా భావిస్తారు. తామే స్వచ్ఛందంగా పాలకవర్గ ప్రజల్ని తమకు నాయకులుగా ఎన్నుకోవడానికి కృషి చేస్తారు. ఐదవది: పాలకవర్గం అనేది ఒకటి ఉండటం ప్రజాస్వామ్యంతోను స్వపరిపాలనతోను పొసగని విషయం. పాలకవర్గం పాలించే తన అధికారాన్ని నిలుపుకున్నదంటే అక్కడ ప్రజాస్వామ్యం, స్వపరిపాలన, జీవన వాస్తవాలు కాలేదని అర్థం. ఆరవది స్వపరిపాలన ప్రజాస్వామ్యం ఎప్పుడు వాస్తవాలవుతాయంటే అందరికీ వోటు హక్కు రాజ్యాంగం వచ్చినపుడు కాదు. నిజంగా పాలకవర్గం పాలించే అధికారాన్ని పొందకలిగే బలాన్ని కోల్పోయినప్పుడు మాత్రమే. ఏడవది.: కొన్ని దేశాలలో బానిసవర్గాలు కేవలం వోటు హక్కుతోనే పాలకవర్గాన్ని అధికారం నుంచి తొలగించటంతో విజయవంతమౌతుండగా కొన్ని ఇతర దేశాలలో పాలకవర్గం చాలా గాఢంగా పాతుకొని పోయి ఉండవచ్చు, అలాంటి చోట్ల కేవలం వోటు హక్కు మాత్రమే కాక ఇతర రాజ్యాంగ భద్రతలు కూడా ఉన్నప్పుడే బానిసవర్గాలు ఈ ధ్యేయాన్ని అందుకోగలవు.

ప్రజాస్వామ్యాన్ని ప్రేమించే ప్రతి ఒక్కడు పై ఆలోచనలను వరుసగా రాయించి గోడమీద వేలాడదీసుకోవడం మంచిది. చూసినప్పుడల్లా స్మృతికి వస్తూవుంటుంది. ఇలా చేస్తే ఏ ఇతర సాధనము చేయలేని రీతిలో అతనిలో ప్రజాస్వామ్యం కోసం ఒక రాజ్యాంగాన్ని తయారుచేయాలని, అలాంటి రాజ్యాంగ ప్రయోజనం పాలకవర్గాన్ని అధికారం నుంచి తొలగించి అది మళ్ళీ ఎప్పుడూ పాలకవర్గం కాకుండా చేయటం ప్రజాస్వామ్యప్రభుత్వ స్థాపన కోసం కావలసిన యంత్రాంగం ఒక విశ్వాసం మీద ఆదారపడి ఉండకూడదని, ఆ యంత్రాంగానికి పాలకవర్గాన్ని అధికారంలోంచి తొలగించటం ప్రధాన ధ్యేయమే అయినా తొలగించే పద్ధతులు మాత్రం భిన్నంగా ఉండాలని దానికి తగినట్టు ప్రజాస్వామ్య యంత్రాంగంలో మార్పులు భిన్నంగా ఉండాలని దానికి తగినట్టు ప్రజాస్వామ్య యంత్రాంగంలో మార్పులు ఉండాలని, ఈ మార్పులు మనం సహించడం మాత్రమే కాకుండా అంగీకరించాలని, ఎందుకంటే ఒకో దేశంలో ఒకో పద్ధతితో పాలకవర్గం బానిసవర్గాలపై అధికారం సాధిస్తుంది కాబట్టి అని గుర్తింపజేస్తుంది.

ప్రజాస్వామ్యం అంటే ఇదే. అందులో వున్నది ఇంతేకాని, దురదృష్టవశంగా విదేశీయులకు ప్రజాస్వామ్య భావాలను బోధించే పాశ్చాత్య రచయితలకు ప్రజాస్వామ్యం పట్ల వాస్తవికమైన దృక్పథం లేదు. దీనికి బదులుగా ఒక బాహ్యమైన రూప సంబంధమైన దృష్టితోనే ప్రజాస్వామ్యాన్ని చూస్తూ దానికి రాజ్యాంగ నీతి బద్ధత, సార్వత్రిక వోటుహక్కు, తరచు ఎన్నికలు అన్నవి ఉద్దేశము, ఫలితము అని భావిస్తూవచ్చారు.

ప్రజాస్వామ్యంలో ఈ మూడు అంశాలే ఉంటాయని ఎవరు ప్రతిపాదిస్తారో వాళ్ళకు తెలియకుండానే పాలకవర్గాల దృష్టి కోణాన్ని దాదాపు అదే విధంగా వ్యక్తీకరిస్తున్నారని వారికి తెలిదు. పాలకవర్గాలు తమ అనుభవంతో ఇలాంటి పద్ధతుల ద్వారా తమ బలంగాని స్థానం గాని దెబ్బతినవని ఏనాడో గుర్తించారు. వాస్తవానికి ఈ పద్ధతులు వారి బలానికి, గౌరవానికి చట్టబద్ధతను చేకూర్చి బానిస వర్గాల ఆకిడికి నష్టపోకుండా చేశాయి. ప్రజాస్వామ్యం, స్వపరిపాలన కేవలం బాహ్య స్వరూపంలో కాకుండా నిజంగా తమవి కావాలని ఎవరు కోరుకుంటారో వారు తుట్ట తొలుత గుర్తించాల్సిన కీలక రహస్యం శాశ్వతంగా స్థిరపడిపోయిన పాలకవర్గం ప్రజాస్వామ్యానికి అత్యంత అపాయకరమని ప్రజాస్వామ్యవాది అనుసరించదగిన వాస్తవికమైన దృష్టి క్షేమకరమైనది ఇది ఒక్కటే. ఒక స్వతంత్ర దేశంలో స్వాతంత్ర్యం పాలకవర్గానికి మాత్రమే చెందిన అవకాశమా? లేక అందరికీ ఉంటుందా? అన్న అంశం యొక్క అస్తిత్వాన్ని గురించి ఆలోచించ లేకుండా ఒక నిర్ధారణకు రావటం ఒక పెద్ద పొరపాటవుతోంది. నా అభిప్రాయంలో విదేశీయుడు కాంగ్రెస్‌ను సమర్థించదలచిన పక్షంలో తొలుత అడగాల్సింది కాంగ్రెస్ స్వాతంత్ర్యం కోసం పోరాడుతోందా? లేదా? అన్నది కాదు. అతను అడగాల్సింది ఎవరి స్వాతంత్ర్యం కోసం కాంగ్రెస్ పోరాడుతోంది అన్నది. ఆ స్వాతంత్ర్యం ఇండియాలోని పాలకవర్గం కోసమా? లేక భారత దేశంలోని ప్రజలందరి కోసమా? కాంగ్రెస్ వారు పాలకవర్గాల స్వాతంత్ర్యం కోసమే పోరాడుతున్నారని తెలిస్తే అతను కాంగ్రెస్ వారిని ఇలా అడగాలి. ఇండియాలోని పాలకవర్గం పాలించడానికి అర్హత కలిగిందా? అని. కాంగ్రెస్‌కు మద్దతు పలికే ముందు అతను చేయదగిన కనీసం పని ఇది. ఈ ప్రశ్నలకు కాంగ్రెస్ వారు ఏ సమాధానం చెబుతారు? నాకు తెలీదు. కాని నాకు ఏది నిజమైన సమాధానాలనిపిస్తాయో వాటిని ఇప్పుడు ఇక్కడ ఇస్తాను.

## IV

ఈ అధ్యాయంలో ఇంతకుముందు చెప్పిన విషయంతో విదేశీయుడు ప్రభావితు డౌతాడో లేదో చెప్పలేను. ప్రభావితుడైతే అతడు నిస్సందేహంగా కాంగ్రెస్ ప్రజాస్వామ్యం

కోసం పోరాడటం లేదని ప్రాచీన వారసత్వ పాలకవర్గం ప్రాచీన వారసత్వ బానిస వర్గాన్ని పరిపాలించే వ్యవస్థను పునరుద్ధరించటం కోసమే పోరాడుతున్నాడనటానికి నిరూపణ కావాలని అడుగుతారు. కాని ఆ నిరూపణతో విదేశీయుడు తృప్తిపడతాడని నాకు నమ్మకం లేదు. కాని దాని ప్రయోజన మేమైనా ఆ నిరూపణను అతని ముందుంచటానికి సిద్ధంగా ఉన్నాను.

భారతదేశంలో పాలకవర్గం వారెవరు? భారతీయులకు అలాంటి ప్రశ్న అనవసరం. కాని విదేశీయునికి అది అత్యవసరం. ప్రాథమికమైన ప్రశ్న. అందుచేత దీనికి సమాధానం చెప్పాలి. ఇండియాలో పాలకవర్గం ప్రధానంగా బ్రాహ్మణులదే. కాని వింత ఏమిటంటే ఈనాటి కొంతమంది బ్రాహ్మణులు ఒకప్పుడు తాము భూదేవులే అయినా ఈనాడు పాలక వర్గంలో తాము చేరమని అంటారు. ఇలా చెప్పటం ఎందుచేత? ప్రతిజాతిలోను, మేధావి వర్గానికి నీతిశాస్త్రం చేత ఒక పవిత్ర ధర్మం విధింపబడుతుంది. అదే తన వర్గ ప్రయోజనం కోసం జాతిని బలిపెట్టకూడదని దాన్ని పరిరక్షించుకోవాలన్నికాని ఈ ధర్మాన్ని ఇండియాలోని బ్రాహ్మణులు ధిక్కరించినట్టుగా ప్రపంచంలో ఏమేధావి వర్గమూ చేయలేదు. బ్రాహ్మణులు ఈనాడు తాము పాలకవర్గానికి చెందిన వాళ్ళం కాదని అనటం వింటే వాళ్ళు ఇంతకాలం తాము తమ ధర్మానికి ద్రోహం చేశామన్న నేరస్పృహతో ప్రపంచ న్యాయస్థానముందు నిలబడటానికి ధైర్యం చాలక ఇలా అంటున్నారా? అని అనిపిస్తుంది. లేక వారికున్న వినయ సంపద కారణంగా ఇలా అంటున్నారా? అని కూడా అనిపిస్తుంది. సత్యమేదన్న విషయం గురించి ఊహించటం అనవసరం. ఎందుకంటే ఇండియాలో బ్రాహ్మణులే పాలకవర్గం అన్నది ప్రశ్నించడానికి వీలు లేని సత్యం. కావాలనుకుంటే వాస్తవాన్ని కనుక్కోటానికి రెండు పరీక్షలు పెట్టవచ్చు. మొదటిది ప్రజల అభిప్రాయం. రెండవది పరిపాలనలో వారి (పాలు) భాగం. బ్రాహ్మణుని పట్ల ప్రజల అభిప్రాయం ఎలాంటిదంటే వారు అధికులైనా అధములైనా బ్రాహ్మణుడైన వ్యక్తిని అతి పవిత్రంగా చూస్తారు. ఇక ఈ విషయంలో తిరుగులేదు. బ్రాహ్మణుడు పూజ్యుడైన ప్రభువు. అతనికి పెద్ద చిన్న అందరూ నమస్కరించాలి. బ్రిటిష్ పూర్వయుగంలో అతడికి బానిసవర్గాలకు లేని ఎన్నో మినహాయింపులు ప్రత్యేక అవకాశాలు ఉండేవి. ఉదా:- అతడు హత్య చేసినా అతన్ని ఉరి తీయకూడదు. ఎందుకంటే అతడు చాలా పవిత్రవ్యక్తి. ఒక కాలంలో బానిసవర్గానికి చెందిన ఏ మనిషి కాని బ్రాహ్మణుడి కాళ్ళు వేళ్ళు కడిగిన నీటిని తీర్థంలా పుచ్చు కోకుండా అన్నం తిన కూడదనే నియమం ఉండేది. సర్ పి.సి.రే. తన చిన్నతనంలో కలకత్తా రోడ్ల వెంబడి బానిస వర్గాలకు చెందిన చిన్న పిల్లలు, నీటిలోటాలు చేపట్టి బ్రాహ్మణుడి పాదాలు కడగటానికి గంటలకొద్ది ఉదయంపూట ఆదారివెంబడి వెళ్ళే బ్రాహ్మణుడి కోసం పడిగాపులు కాచేవారని చెబుతాడు. ఈ పవిత్ర జలాన్ని ఇంటికి

తీసుకుపోయి వారి తల్లిదండ్రులకు ఇస్తే, వారు అది తీర్థంగా తీసుకున్న తర్వాతే అన్నం తినేవారట. మలబార్‌లో (నేటి కేరళ) బానిస వర్గాలకు చెందిన నాయర్‌ల వంటి వారిలో సంబంధం అనే ఒక వివాహ పద్ధతి ఉంది. ఈ పద్ధతి ప్రకారం తమ ఆడవారు బ్రాహ్మణులకు భార్యలుగా సమర్పించటం గౌరవంగా భావించేవారు. రాజులు కూడా మొదటిరాత్రి తమ రాణులకు కన్యరికం పెట్టడానికి బ్రాహ్మణుల్ని ఆహ్వానిస్తారు.[1]

---

1. 16వ శతాబ్దం మధ్య భాగంలో ఇండియాకు వచ్చిన లూటోవికోడి వర్తేమా అనే యాత్రికుడు మలబార్ దర్శించి ఇలా రాశాడు.

ఈ బ్రాహ్మణులు ఎవరన్నది తెలుసుకోవటం ఆనందదాయకం (Pleasant) సముచితం కూడా. మనలో ప్రీస్ట్‌ల వలె (చర్చ్ పూజారీలవలే) ఇండియాలో వీరు మత విషయంలో ప్రధానవ్యక్తులు. రాజు పెళ్ళి చేసుకున్నపుడు యోగ్యత కల్గిన గౌరవప్రదుడైన ఉత్తమ బ్రాహ్మణుడిని ఎన్నుకొని అతడితో తన భార్యను గడపనిస్తాడు. ఆ బ్రాహ్మణుడే ఆమెకు కన్నెరికం పెడతాడు. ఈ పనిని బ్రాహ్మణుడు తనకు తానుగా కోరి చేస్తాడని అనుకోకండి. రాజు నాలుగైదు వందల వరహాలు సమర్పించుకుంటాడు. కాలికట్‌లో రాజు తప్ప మరెవ్వరూ ఈ ఆచారము పాటించరు.

-వోయెజెస్ ఆఫ్ వార్తెమా (హక్లూయల్ సొసైటి) సంపుటము _1, పుట-141

ఇతర యాత్రికులు కూడా ఈ ఆచారం ఆ రోజుల్లో బాగా వ్యాప్తిలో ఉండేదని చెబుతారు. హామిల్‌టన్ తన అకౌంట్ ఆఫ్ ఈస్ట్‌ఇండీస్‌లో ఇలా అంటాడు.

''సమోరిన్ పెళ్ళి చేసుకున్నప్పుడు తొలుత అతని భార్యతో ప్రధాన పురోహితుడైన నంబూద్రి సుఖించాలి. కావాలంటే ఆమెతో మూడు రాత్రులు గడపవచ్చు. ఎందుకంటే శోభన రాత్రుల తొలి ఫలాలను భగవంతుడికి నైవేద్యం చేయాలని, ఆ తర్వాతే అతడు తన భార్యతో సంపర్కం పెట్టుకుంటాడు. ఇదే పద్దతిని పెద్ద సంస్థానాధిపతులు కూడా పాటిస్తారు. సామాన్య ప్రజలకు మాత్రం ఈ గౌరవం లేదు.

బుఖనన్ తన కథనంలో ఈ పద్ధతిని గురించి ఇలా ప్రస్తావించారు. "తంమూరి కుటుంబాలకు చెందిన స్త్రీలకు సాధారణంగా నంబూద్రి బ్రాహ్మణులు గర్భాదానం చేస్తారు. ఒకోసారి వారికి ఇష్టమైతే నాయర్లలో ఉన్నత పదవుల్లో ఉన్న వారిని కూడా వినియోగించవచ్చు. కాని నంబూద్రి బ్రాహ్మణులకున్న పవిత్రత కారణంగా వారినే ముఖ్యంగా ఎన్నుకుంటారు. పింకర్‌టన్స్ వాయేజస్ సం. VIII పు. 734

శ్రీ సి.ఎ. ఇన్నెస్ ఐ.సి.ఎస్. ఎడిటర్, ది గెజిటేర్ ఆఫ్ మలబార్ అండ్ అన్జంగో. మద్రాస్‌ప్రభుత్వం తరపున ప్రచురించిన గెజిట్‌లో ఇలా అన్నాడు. ఆ మలయాళ సంప్రదాయంలో మరుక్క కట్టామల అని ఒక ఆచారం ఉంది. మక్కటాయం అనే మరో ఆచారం కూడా ఉంది. ఈ రెంటిలోను తాళి కట్టడం అనే ఒక పద్ధతి ఉంది. ఇది చాలా విచిత్రమయింది. ప్రత్యేకమైంది. తాళిని (ఒక చిన్న బంగారు లేదా

బ్రిటిష్ ప్రభుత్వంలో అందరికీ సమానంగా వర్తించే ధర్మశాస్త్రం రావటం వల్ల బ్రాహ్మణులకున్న ఈ హక్కులు మినహాయింపులు ప్రత్యేకావకాశాలు పోయాయి. అయినా ఇప్పటికీ బ్రిటిష్ వారు వారికిచ్చిన కొన్ని అవకాశాలు అలాగే ఉన్నాయి. బ్రాహ్మణుడు ఇప్పటికీ సర్వోత్తముడుగానే ఉన్నాడు. బానిసవర్గాల దృష్టిలో పవిత్రుడుగానే ఉన్నాడు. ఇప్పటికీ అతణ్ణి స్వామి (ప్రభువు), అని సంబోధిస్తూనే ఉన్నారు.

ఇక రెండవ పరీక్ష కూడా ఇలాంటి ఫలితాన్నే ఇస్తుంది. మదరాసు ప్రెసిడెన్సీ గురించి మాత్రమే ఉదహరిస్తాను. పట్టిక 18 చూడండి. 1943 లో గెజిటెడ్ ఉద్యోగాలలో బ్రాహ్మణులకు ఇతర కులాలకు ఏ విధమైన నిష్పత్తి ఉందో ఆ పట్టిక ద్వారా తెలుస్తుంది. ఇతర పరగణాల నుంచి కూడా విషయాన్ని సేకరిస్తే ఇదే నిర్ణయానికి నిరూపణ దొరుకుతుంది. ఈ అంశాన్ని గురించి అట్టే చర్చ అనవసరం. బ్రాహ్మణులు ఆ స్థానాన్ని అంగీకరించినా అంగీకరించకపోయినా వారి రాష్ట్ర పాలక యంత్రాంగాన్ని నియంత్రిస్తున్నారు. వారి ఆధిపత్యాన్ని బానిసవర్గాలు గుర్తిస్తున్నాయి. అందుచేత వాళ్ళు పాలకులు అనటానికి ఈ నిర్ధారణ చాలు.

బ్రాహ్మణులు సంఖ్యా పరంగా తక్కువ కాబట్టి ఇతరుల సహాయం లేకుండా పాలక వర్గం తమ ఆధిపత్యాన్ని నిలుపు కోవటం కష్టం అనుకోండి. అందుకే చరిత్రను గమనిస్తే బ్రాహ్మణులు ఎప్పుడు ఏదో ఒక ఇతర వర్గాన్ని తమకు మిత్రులుగా చేసుకొని వారికి పాలకవర్గం స్థాయిని ఇవ్వడానికి అంగీకరించారు. కాని వాళ్ళు ఎప్పుడూ వారికంటే అప్రధానులు గానే సహకరించేలా చేసుకున్నారు. ప్రాచీన మధ్య యుగాల్లో క్షత్రీయులతో అంటే యోధుల వర్గంతో చేతులు కలిపారు. వీరిద్దరూ కలిసి జన సామాన్యాన్ని కేవలం పాలించటం మాత్రమే కాదు. వారిని అణువుల కింద నూరి పారేశారు. దంచి పారవేశారు. బ్రాహ్మణుడు తన కలంతో రాజు తన కత్తితో. ఈనాడు బ్రాహ్మణుడు

ఇతర లోహంతో చేసిన తంతి లేదా బిళ్ళ) ఆడపిల్ల పుష్పవతి అయిన సమయంలో మెడలో కట్టే పద్ధతి ఇది. ఈ పనిని ఆ కులానికి చెందిన వాడు కాని ఉన్నత కులానికి చెందినవాడు కాని చేస్తాడు. (ఈ పద్ధతి ఒకో కులంలో ఒకో రకంగా ఉంది) ఈ తతంగం ముగిసిన తర్వాతనే ఆ అమ్మాయి సంబంధం ఒప్పందాల కోసం ప్రయత్నం చేసే స్వాతంత్ర్యం ఉంటుంది. ఇలా తాళి కట్టిన వానికి (మనవాలన్ _ పెళ్ళికొడుకు) ఆ అమ్మాయితో సంపర్కం పెట్టుకునే అధికారం ఉంది. కొందరు భూదేవులైన బ్రాహ్మణులే చేయాలని అంటారు. ఇంకా క్షత్రియులు కూడా ఇలా తక్కువ వర్ణాలకు చెందిన స్త్రీల తొలి ఫలాలపై అధికారాన్ని కలిగి ఉంటారని అంటారు. ఈ ఆచారం మధ్య యుగాలలోని డ్రాయిట్ డి. సిగ్నేరీ వంటిదే. సం.1 పు. 101.

# పట్టిక -18

| కులాలు | | జనాభా సుమారుగా లక్షలలో | జనాభా శాతం | మొత్తం గెజిటెడ్ పోస్టులలో నియమించబడిన వారి సంఖ్య | నియామకాల శాతం | నాన్‌గెజిటెడ్ పోస్టులు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | 100 రూ. మించి మొత్తం 7,500 | | 35 రూ. మించి మొత్తం 20,782 | |
| | | | | | | ఉద్యోగుల సంఖ్య | ఉద్యోగుల శాతం | ఉద్యోగుల సంఖ్య | ఉద్యోగుల శాతం |
| (1) .. .. | | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) |
| బ్రాహ్మణులు .. .. | | 15 | 3 | 820 | 37 | 3.280 | 43.73 | 8,812 | 42.4 |
| క్రిస్టియన్లు .. .. | | 20 | 4 | 190 | 9 | 750 | 10 | 1,655 | 8.0 |
| ముస్లింలు .. .. | | 37 | 7 | 150 | 7 | 497 | 6.63 | 1,624 | 7.8 |
| దళిత వర్గాలు .. .. | | 70 | 14 | 25 | 1.5 | 39 | .52 | 144 | .69 |
| బ్రాహ్మణేతరులు | ముందున్న బ్రాహ్మణేతరులు | 113 | 22 | 620 | 27 | 2,543 | 33.9 | 8.440 | 40.6 |
| | వెనకబడ్డ కులాలు | 245 | 50 | 50 | 2 | | | | |
| నాన్ ఏసియాటిక్ మరియు ఆంగ్లో ఇండియన్లు | | - | - | - | - | 372 | 5.0 | 83 | .4 |
| ఇతర కులాల వారు .. .. | | - | - | - | - | 19 | .5 | 24 | .11 |

బనియా అనబడే వైశ్యునితో చేతులు కలిపాడు. పరిస్థితులు మారిన దృష్ట్యా క్షత్రియులను వదిలి ఇలా బ్రాహ్మణుడు వైశ్యుని చేపట్టక తప్పలేదు.

వాణిజ్య ప్రధానమైన ఈ కాలంలో కత్తికంటే డబ్బుకు చాలా విలువ ఉంది. ఇది రాజకీయ పక్షాల ఒప్పందంలో మార్పుకు ఒక కారణం. ఇంకొక కారణం రాజకీయ తతంగాన్ని నడపటానికి డబ్బు అవసరం కావటం. డబ్బు ఒక వైశ్యులనుంచే రాగలుగుతుంది. వస్తోంది కూడా.

వైశ్యుడు కాంగ్రెస్‌కు డబ్బు మదుపు పెడుతున్నాడంటే వాడికి ఒక విషయం అర్థమైంది. శ్రీ గాంధీ అతడికి నేర్పాడు. రాజకీయాలలో పెట్టినడబ్బుకు చాలా పెద్ద మొత్తాలు లాభంగా తిరిగివస్తుందది. ఈ విషయంలో ఎవరికైనా సందేహం ఉంటే 1942 జూన్ 6న శ్రీ గాంధీ శ్రీ లూయి ఫిషర్‌తో ఏం చెప్పారో చదవండి. ఫిషర్ "శ్రీ గాంధీతో ఒక వారం" అనే గ్రంథంలో చాలా ఆసక్తికరమైన, ముఖ్యమైన ప్రశ్నలు శ్రీ గాంధీకి వేయగా వాటికి వారు చెప్పిన సమాధానాలు చాలా రహస్యాలను బయట పెట్టేవిగా ఉన్నాయి. శ్రీ ఫిషర్ ఇలా రాస్తున్నారు.*

శ్రీ గాంధీతో కాంగ్రెస్ పార్టీని గురించి చాలా ప్రశ్నలు నాకున్నాయని నేను చెప్పాను. చాలా పెద్ద పదవుల్లో ఉన్న బ్రిటిష్‌వారు నాకు చెప్పిన విషయం ఏమిటంటే పెద్ద వ్యాపారస్థుల చేతుల్లో కాంగ్రెస్ పార్టీ ఉందని, శ్రీ గాంధీకి బొంబాయిలోని మిల్ యజమానులు ఆయన కోరినంత డబ్బు ఇస్తారని చెప్పారు. 'ఇదెంత వరకు నిజం?' నేను అడిగాను. దురదృష్టవశంగా అవన్నీ సత్యాలే అని మాత్రం ఆయన అని ఊరుకున్నారు. ఇంకా ఇలా అన్నారు. కాంగ్రెస్‌కి తన పనులు నిర్వహించుకునే ఆర్థిక వనరులు లేవు. మొదట్లో ప్రతి సభ్యుడి దగ్గర సంవత్సరానికి నాలుగు అణాలు (దాదాపు 8 సెంట్లు) వసూలు చేసి దాంతో పనులు నిర్వహించాలనుకున్నాం. కాని దానితో కుదర్లేదు. కాంగ్రెస్ బడ్జెట్ ఎంత భాగాన్ని ధనవంతులు భరిస్తున్నారు? అని నేనడిగాను 'దాదాపంతా, అని ఆయన సమాధానమిచ్చారు.' ఈ ఆశ్రమంలో మేము ఇప్పుడున్న దానికంటే పేదగా ఉండవచ్చు. ఇంకా తక్కువ ఖర్చు పెట్టవచ్చు. కాని మేము అలా ఉండడం లేదు. మా ధనవంతులైన స్నేహితుల వద్ద నుండి మాకు డబ్బు వస్తూ వుంటుంది. అని కూడా అన్నారు.

---

* శ్రీ గాంధీతో ఒకవారం 1943 పు 41.

ఇలాగే బ్రాహ్మణుడు కూడా డబ్బు మీద ఆధారపడి ఉండటం వల్ల వైశ్యుడిని పాలకవర్గంలో చేర్చుకోక తప్పదు. వాస్తవానికి బ్రాహ్మణుడు కేవలం కార్యసాధన కోసం కాకుండా వైశ్యునితో హృదయ పూర్వకమైన స్నేహాన్నే స్థాపించుకున్నాడు. అందుకే ఈనాడు ఒకప్పటి బ్రాహ్మణ క్షత్రియ పాలకవర్గం స్థానంలో బ్రాహ్మణ వైశ్య పాలకవర్గం ఏర్పడింది.

ఇండియాలో పాలకవర్గం అంటే ఎవరో తెలపడానికి ఇంత వరకు తగినంత చెప్పాను. ఇప్పుడు 1937 నాటి శాసనసభల ఎన్నికల్లో పాలకవర్గం ఏమి చేసిందో చూడడం నా తరువాత ప్రయత్నం.

1937లో జరిగిన ఎన్నికలలో సార్వత్రికమైన యువజనులందరికీ వోటు లేకపోయినా, పాలకవర్గేతర వర్గాల నుంచి కూడా వోటు వేయడానికి అవకాశం కల్పించటంతో అంతకంటే ముందు జరిగిన ఎన్నికలకన్నా వోటు హక్కు పరిధి విస్తరించింది. అందుచేత బానిసవర్గాలకు చెందిన ప్రజలు కూడా పాల్గొన్న ఈ ఎన్నికలలో పాలకవర్గమెలా ప్రవర్తించిందో చూడటానికి ఇది ఒక మంచి పరీక్ష.

దురదృష్టవశంగా భారతీయ ప్రచురణ కర్తలెవరూ దాద్ తయారు చేసిన పార్లమెంటరీ మ్యాన్యువల్ లాంటిది ఇండియా విషయంగా తయారు చేయలేదు. అందుచేత కాంగ్రెస్ టికెట్‌పైన శాసనసభకు ఎన్నికైన ప్రతినిదుల కులం, వృత్తి, విద్యాస్థాయి, సాంఘిక స్థితి తెలుసుకోవటానికి కష్టంగా ఉంది. ఈ విషయ ప్రాధాన్యాన్ని గుర్తించి 1937 ఎన్నికల్లో ఎన్నికైన అభ్యర్థుల వివరాలు సేకరించాలని సంకల్పించాను. కాని ప్రతి సభ్యుని గురించి సరైన వివరాలు సేకరించడంలో విఫలమయ్యాను. చాలా మంది వివరాలు తెలియక వారిని అవర్గీకృతంగా వదిలేశాను. కాని నేను సేకరించగలిగినంత వరకు దొరికిన వివరాలే కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలను ప్రతిపాదించడానికి సమర్థంగా ఉన్నాయి.

1937 ఎన్నికల్లో పాలక వర్గాలు ఎలా ప్రవర్తించాయో చెప్పడానికి పట్టిక 19 చూడండి. ఇందులో బ్రాహ్మణులకు, వైశ్యులకు (భూస్వాములు, ధనదాతలు) పాలకవర్గాన్ని ప్రతిబింబించగా బ్రాహ్మణేతరులు షెడ్యూల్డు కులాల వారు బానిస వర్గాల్ని ప్రతిబింబిస్తారు.

వీరందరు కాంగ్రెస్ టికెట్‌పైన శాసనసభకు ఎన్నికైన వారే. హిందువుల జనాభాలో బ్రాహ్మణుల నిష్పత్తి ఎంతో తెలియని వారికి ఎన్నికల్లో ఎంత (అది) ప్రాతినిధ్యం వచ్చిందో తెలియకపోవచ్చు. ఇతర సభ్యులతో పోల్చిచూస్తే బ్రాహ్మణుల ప్రాతినిధ్యం అత్యధికంగా ఉంది.

ఆస్తులున్న వర్గాలకు చెందిన వైశ్యులు, వ్యాపారస్థులు, భూస్వాములు తెలియాలంటే పట్టిక 20 చూడండి వీరంతా కాంగ్రెస్ టికెట్‌పైన ఎన్నికైన వారే. ఇక్కడ కూడా వీరి ప్రాతినిధ్యం వారి సంఖ్యతో పోల్చి చూస్తే అధికంగానే ఉన్నట్లు తెలుస్తుంది.

## పట్టిక - 19

### శాసనసభల్లో కులాల వారిగా కాంగ్రెస్ వారి వివరాలు

| ప్రావిన్స్ | బ్రాహ్మణులు | బ్రాహ్మణేతరులు | షెడ్యూల్డ్ కులాలు | కులం వివరాలు పేర్కొననివారు | మొత్తం |
|---|---|---|---|---|---|
| అస్సాం .. .. .. | 6 | 21 | 1 | 5 | 33 |
| బెంగాల్ .. .. .. | 15 | 27 | 6 | 6 | 54 |
| బీహార్ .. .. .. | 31 | 39 | 16 | 12 | 98 |
| సి.పి. .. .. .. | 28 | 35 | 7 | - | 70 |
| మద్రాసు .. .. .. | 38 | 90 | 26 | 5 | 159 |
| ఒరిస్సా .. .. .. | 11 | 20 | 5 | - | 36 |
| యునైటెడ్ ప్రావిన్స్ .. .. .. | 39 | 54 | 16 | 24 | 133 |

## పట్టిక - 20

### శాసనసభల్లో కాంగ్రెసు వారి వివరాలు

| ప్రావిన్సెస్ | లాయర్లు | వైద్యులు | భూస్వాములు | వ్యాపారస్తులు | ప్రైవేటు ఉద్యోగస్తులు | వడ్డీ వ్యాపారస్తులు | నిల్ | ఏమి పేర్కొనని వారు | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అస్సాం .. .. .. | 16 | 2 | 2 | 1 | - | - | 3 | 9 | 33 |
| బెంగాల్ .. .. .. | 9 | 2 | 16 | 5 | 2 | - | 16 | 4 | 54 |
| బీహార్ .. .. .. | 14 | 4 | 56 | 6 | 3 | - | 1 | 14 | 98 |
| సెంట్రల్ ప్రావిన్సెస్ .. .. .. | 20 | 2 | 25 | 10 | - | - | 8 | 5 | 70 |
| మద్రాలు .. .. .. | 52 | 2 | 45 | 18 | 2 | 1 | 3 | 36 | 159 |
| ఒరిస్సా .. .. .. | 8 | 1 | 17 | 4 | 4 | 1 | 1 | - | 36 |

## పట్టిక 21

### కాంగ్రెస్ పాలిత రాష్ట్రాలలోని క్యాబినేట్ వివరాలు*

| ప్రావిన్స్ | కాబినేట్ మంత్రుల మొత్తం సంఖ్య | హిందేతరుల మొత్తం సంఖ్య | కాబినేట్‌లోని హిందూమంత్రులు | | | షెడ్యూల్డ్ కులాలు | ప్రధాన మంత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| | | | మొత్తం | బ్రాహ్మణులు | బ్రాహ్మణేతరులు | | |
| అస్సాం | 8 | 3 | 5 | ? | ? | – | బ్రాహ్మణులు |
| బీహార్ | 4 | 1 | 3 | ? | ? | 1 | బ్రాహ్మణులు |
| బొంబాయి | 7 | 2 | 5 | 3 | 2 | – | బ్రాహ్మణులు |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | 5 | 1 | 4 | 3 | 1 | – | బ్రాహ్మణులు |
| మద్రాసు | 9 | 2 | 7 | 3 | 3 | 1 | బ్రాహ్మణులు |
| ఒరిస్సా | 3 | – | 3 | ? | ? | ? | బ్రాహ్మణులు |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 6 | 2 | 4 | 4 | – | – | బ్రాహ్మణులు |

* 1939 జులై 15 నాటి ఇండియన్ ఇన్ఫర్మేషన్ సంచికలో ఇచ్చిన 1939 మే నాటి వివరాల ఆధారంగా.

? గుర్తు కులం వివరాలు తెలియనివిగా సూచిస్తాయి.

## పట్టిక 22

### కాంగ్రెస్ పాలిత రాష్ట్రాలలో పార్లమెంట్ కార్యదర్శుల వివరాలు*

| ప్రావిన్స్ | పార్లమెంటరీ సెక్రటరీల మొత్తం సంఖ్య | నాన్_ హిందూ పార్లమెంటరీ సెక్రటరీల మొత్తంసంఖ్య | హిందూ పార్లమెంటరీ సెక్రటరీలు | | | |
|---|---|---|---|---|---|---|
| | | | మొత్తం | బ్రాహ్మణులు | బ్రాహ్మణేతరులు | షెడ్యూల్డ్ కులాలు |
| అస్సాం | – | – | – | – | – | – |
| బీహార్ | 8 | – | 8 | 2 | 5 | 1 |
| బొంబాయి | 6 | – | 6 | 1 | 5 | – |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | – | – | – | – | – | – |
| మద్రాసు | 8 | 1 | 9 | 3 | 4 | 1 |
| ఒరిస్సా | 3 | – | 3 | ? | ? | – |
| యునైటెడ్ ప్రావిన్సెస్ | 12 | 1 | 11 | 2 | 8 | 1 |

* 1939 జులై 15 నాటి ఇండియన్ ఇన్‌ఫర్‌మేషన్ నుండి సేకరించినవి.

? గుర్తు బ్రాహ్మణ బ్రాహ్మణేతరులా అన్న వివరాలు తెలియనివిగా సూచిస్తాయి.

1937 సంవత్సరం నాటి ఎన్నికలలో పాలక వర్గం స్థానమది. మొత్తం మీద చూస్తే శాసనసభలలో వాళ్ళ సంఖ్య అల్పమైందే కదా అని ఎవరైనా అనవచ్చు. దీనికి వ్యతిరేకంగా మనం గుర్తించాల్సిన విషయం పాలక వర్గాల ఆధిక్యతను కొలవడానికి ప్రమాణం, శాసనసభలో వారి సంఖ్య కాదని పాలనాధికారాన్ని సంపాదించడంలో వారికున్న సామర్థ్యం, ఆధారం అని చెప్పాల్సి ఉంటుంది. అందువల్ల మంత్రులలో వర్గ వ్యాప్తి ఎలా ఉందో చూడడం చాలా అవసరం. దీనికి సంబంధించిన వివరాలు 21, 22 పట్టికలలో దొరుకుతాయి. ఈ పట్టికలు[1] ప్రధాన పాలక వర్గమైన బ్రాహ్మణులు మంత్రి వర్గంలో ఎలా అత్యధిక సంఖ్యలో సీట్లను సంపాదించారో తెలపడానికి చాలు. హిందూ పరగణాలన్నింటిలోనూ ముఖ్యమంత్రులు బ్రాహ్మణులే. అన్ని హిందూ పరిగణాలలోను హిందువులు కాని మంత్రులను మినహాయిస్తే అత్యధిక మంత్రుల సంఖ్య బ్రాహ్మణులదే. పార్లమెంటరీ కార్యదర్శులు కూడా బ్రాహ్మణులే. ఇంత వరకు చెప్పినదానినిబట్టి పగటి వెలుతురులాగా స్పష్టంగా ఉన్న రెండు విషయాలు తెలుస్తాయి. మొదటిది ఇండియాలో స్పష్టమైన ఒకే పాలక వర్గం ఉంది. అది బానిసలకన్నా ప్రత్యేకమైనది, విలక్షణమైంది. రెండవది సంఖ్యాపరంగా తక్కువగా ఉన్నా పాలక వర్గం ఎంత శక్తివంతమైందంటే1937 ఎన్నికల్లో అది రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకుంది. బానిస వర్గంపై ఆధిపత్యాన్ని స్థాపించుకొంది. నా సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి ఇక ఒక అంశం మాత్రమే మిగిలివుంది. 1937 ఎన్నికలలో పాలక వర్గం గెలవడానికి కాంగ్రెస్ ఎంతవరకు బాధ్యత వహించిదన్నది. పాలక వర్గం బానిసవర్గంపై ఆధిక్యతతో ఉండటానికి కాంగ్రెస్సే ప్రధాన కారణమని నాకు నిస్సందేహంగా నిరూపించాలని తెలుసు. కాంగ్రెస్‌కు దీనితో ఏమి సంబంధం లేదని కూడా కొందరనవచ్చు. ఓ సమయంలో కాంగ్రెస్ బాధ్యతే అయినా ఆ ఫలితం యాదృచ్ఛికంగా వచ్చిందే తప్ప కాంగ్రెస్‌కి పాలక వర్గాలకు ఆధిక్యత చేకూరటంలో సహాయం చేయాలన్న సంకల్పం లేదని అనవచ్చు.

## V

ఈ సమర్థనంలో మొదటి వాక్యాన్ని సులభంగా కొట్టిపారవేయవచ్చు. ఈ సమర్థనను లేవనెత్తే వారికి 19,20,21,22 పట్టికలలో ఉన్న వివరాలు ఏ అంశానికి సంబంధించినవన్న విషయం బహూశా తెలియకపోవచ్చు. వారికి తెలిస్తే ఈ సమర్థన చేయడమే మానేసేవారు. ఎంచేతంటే అవన్ని కాంగ్రెస్ పరగణాలుగా పేరు పొందాయి. ఈ పరగణాలలో మెజారిటీ

1. ఈ పట్టికలలో చూపిన వివరాలు భారత ప్రభుత్వం ప్రచురించిన 'ఇన్‌ఫర్‌మేషన్", 1939 జులై 15 తేది సంచిక నుండి తయారు చేసినవి.

పార్టీ కాంగ్రెస్. మంత్రి వర్గాలన్నీ కాంగ్రెస్ మంత్రి వర్గాలే. మరియిక ఈ కాంగ్రెస్ పరగణాలలో పాలక వర్గాలు బానిస వర్గాలపై తమ పాలనం స్థాపించాయి. అంటే అలాంటి ఫలితం రావడంలో కాంగ్రెస్‌కు ఎలాంటి బాధ్యత లేదని చెప్పడం చాలా కష్టం. కాంగ్రెస్ మంచి క్రమశిక్షణ ఉన్న పార్టీ. ఎన్నికలని ఎదుర్కోడానికి దానికొక పథకం ఉంది. ప్రతి పరగణాలోను, ఒక పార్లమెంటరీ బోర్డును ఏర్పాటు చేశారు. దాని పనులు (1) ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించటం. (2) మంత్రి వర్గాల ఏర్పాటు నిర్ణయించడం (3) మంత్రుల కార్యకలాపాలను నియంత్రించడం. ఈ ప్రాంతీయ పార్లమెంటరీ బోర్డుల పనితీరును పర్యవేక్షించే కేంద్ర పార్లమెంటరీ బోర్డు కూడా ఉంది. అసలు ఎన్నికకు పథకం వేసింది, నియంత్రించింది కాంగ్రెస్ పార్టీయే. అందువల్ల 1937 ఎన్నికల్లో కాంగ్రెస్ పరగణాలలో పాలక వర్గాలు అధికారం చేజిక్కించుకుంటే ఈ ఫలితంతో కాంగ్రెస్ బాధ్యత కాదని వాదించడం వ్యర్థం.

రెండవ సమర్థన కూడా మొదటి దాని లాగా దుర్బలమే. కాంగ్రెస్ పరగణాలలో పాలక వర్గాల ఆధిక్యత కేవలం యాదృచ్ఛికంగా సంభవించిందేతప్ప కాంగ్రెస్ ఉద్దేశపూర్వకంగా చేసిన పని కాదని ఎవరైనా వాదించదలిస్తే తమ వాదం నిలిచేది కాదని వాళ్లు గుర్తించాలి. అది కేవలం యాదృచ్ఛికమే అని భావించే వారు దీని కింద చూపిన పరిస్థితులను గమనించాలని కోరుతున్నాను. మొట్టమొదట ఇంతకుముందు, ఇప్పుడు కాంగ్రెస్‌ను నడిపించి చూసుకుంటున్న కాంగ్రెస్ అధిష్టాన వర్గానికి సంబంధించిన ప్రధాన వ్యక్తుల మనస్తత్వాన్ని, వారిని గమనించండి.

శ్రీ తిలక్ గారితో మొదలు పెట్టడం బాగుంటుంది ఆయన ఇప్పుడు లేరు. ఆయన బ్రతికి ఉన్నప్పుడు కాంగ్రెస్‌లో ఆయనే చాలా ప్రధాన వ్యక్తి. ఆ పార్టీపై అధికారం చెలాయించిన వాడు. శ్రీ తిలక్ బ్రాహ్మణుడు. పాలక వర్గానికి చెందినవాడు. ఆయన స్వరాజ్య ఉద్యమ పితామహుడుగా పేరుపొందినా బానిస వర్గాల పట్ల ఆయనకున్న ద్వేషం జగద్విదితం. స్థలాభావం వల్ల బానిస వర్గాల పట్ల ఆయన ధోరణిని ప్రతిబింబించే ఒకే ఒక సందర్భం ఉదహరిస్తాను. 1918 లో బ్రాహ్మణేతరులు, వెనుకబడిన తరగతుల వాళ్ళు శాసనసభల్లో ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం ఉద్యమం నిర్వహించారు. అప్పుడు తిలక్ షోలాపూర్‌లో జరిగిన ఒక బహిరంగసభలో ఈ నూనె ఆడించేవారు, పొగాకు అంగళ్ళవారు, చాకళ్ళు – బ్రాహ్మణేతరులను వెనుకబడిన వారిని ఆయన వర్ణించిన తీరది. -శాసనసభకు వెళ్ళాలని ఎందుకు కోరుకుంటారో తనకర్థం కావడం లేదన్నారు. ఆయన అభిప్రాయంలో వారి పని చట్టాలకు విధేయులుగా ఉండడమే తప్ప చట్టాలను సృష్టించే అధికారం కావాలని కోరుకోవటం కాదు.

తిలక్ తర్వాత వల్లభభాయ్ పటేల్‌ను చూద్దాం. ఇక్కడ కూడా ఆయన మనస్తత్వాన్ని సూచించే ఒక సందర్భం మాత్రమే చూపెడతాను. 1942 లో లార్డ్ లిన్ లిత్‌గో భిన్నవర్గాలకు చెందిన 52 మంది భారతీయ ప్రముఖుల్ని ఆహ్వానించాడు. యుద్ధ ప్రయత్నంలో భాగంగా భారతీయులందరి సానుభూతిని సహకారాన్ని పొందేలా కేంద్ర ప్రభుత్వాన్నిమరింత జనప్రియం చేయాలి, అన్నది చర్చించడం కోసం ఆ సభ జరిగింది. ఆ సభకు ఆహ్వానించిన వారిలో షెడ్యూల్డ్ కులాలకు చెందిన వారూ వున్నారు. శ్రీ వల్లభాయ్ పటేల్ వైస్రోయి ఇలాంటి నీచ కులాలను సభకు ఆహ్వానించడం భరించలేకపోయాడు. ఈ సంఘటన జరిగాక అహమ్మదాబాద్‌లో చేసిన ఒక ఉపన్యాసంలో ఆయన ఇలా అన్నాడు.[1]

"వైస్రాయి హిందూమహాసభ నాయకుల్ని పిలిచారు. ముస్లింలీగ్ నాయకుల కోసం చెప్పిపంపారు. ఘాంచీలను (నూనెలు తీసేవారిని) మోచీలను (చెప్పులు కుట్టేవారిని) ఇంకా తక్కిన (అలగా) జనాన్ని కూడా పిలిచారు."

శ్రీ వల్లభాయ్ పటేల్ ద్వేషపూరితంగా గుర్రైనట్టున్న ఈ మాటల్లో ఘాంచీలను, మోచీలను మాత్రమే ప్రస్తావించినా, ఆయనకు బానిసవర్గాల పట్ల సాధారణంగా ఎంత హేయమైన దృష్టి వుందో అతని ఉపన్యాసం నిరూపిస్తున్నది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ గారి ప్రతి క్రియల్ని గురించి తెలుసుకోవడం కూడా మంచిది. నెహ్రూ బ్రాహ్మణుడు. కాని ఆయన కులాతీతమైన దృక్పథం వున్నవాడని, కులరహితమైన విశ్వాసాలు కలవాడని ప్రసిద్ధి పొందాడు. కాని ఆయన కున్న పేరును వాస్తవాలు సమర్థించడం లేదు. ఒకడి తండ్రి చనిపోతే, సాంప్రదాయక హిందూపద్ధతిలో బ్రాహ్మణ పురోహితుని నిర్దేశంలో గంగా తీరంలో నెహ్రూ పండితుడు వాళ్ళ తండ్రి 1931లో చనిపోయినపుడు చేసినట్టు ఉత్తర క్రియలు జరిపితే, అతణ్ణి మనం కులరహిత వ్యక్తిగా పిలవలేము. ఆయన కులాతీత దృష్టిని గురించి డా.పట్టాభి సీతారామయ్యగారు స్వయంగా చెప్పిందేమంటే ఆయన తాను బ్రాహ్మణుడన్న విషయాన్ని గుర్తుచేసేవిధంగా ప్రవర్తించేవాడని[2] వాస్తవంగా పండిట్ నెహ్రూ జాతీయ మనస్తత్వం ఉన్న హిందూ నాయకుడని నమ్మేవారికి ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయంగా అనిపించవచ్చు. కాని డా. సీతారామయ్యకు తాను దేని గురించి చెబుతున్నాడో తెలిసి వుండాలి. ఇంతకంటే కూడా మనల్ని వేధించే విషయం కూడా ఏ సంయుక్త పరగణాల్నుంచి ఆయన పుట్టాడో, దేనిపై ఆయనకు సంపూర్ణ అధికారం ఉందో అక్కడి

1. రాష్ట్ర రహబార్ (బొంబాయి గుజరాతీ వారపత్రిక) సంఖ్య XII లో 1945 జనవరి 14లో శ్రీ జె.జ సంజన రాసిన సెన్స్ అండ్ నాన్‌సెన్స్ ఇన్ పాలిటిక్స్‌లో ఉదాహృతం.

2. వై.జి. కృష్ణమూర్తిగారి ఇన్విటేషన్ టు జవహర్‌లాల్ నెహ్రూ" పుట XVI•

మంత్రివర్గంలోని వాళ్ళందరూ బ్రాహ్మణులే. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ సోదరిగా సుప్రసిద్ధురాలైన శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌లో కూడా ఈ బ్రాహ్మణస్పృహ ఉందంటారు. 1940 డిసెంబర్‌లో అఖిల భారత స్త్రీల సదస్సులో జనాభా సంఖ్యా వివరాలిచ్చేటప్పుడు కులాన్ని ప్రస్తావన చేయరాదన్న విషయం చర్చించబడింది. శ్రీమతి పండిట్ ఈ ప్రతిపాదనను ఒప్పుకోలేదు.[1] అంతేకాకుండా తనలోని బ్రాహ్మణ రక్తాన్ని గురించి తానెందుకు గర్వపడకూడదని కూడా అన్నారు. జనాభా వివరాలిచ్చినపుడు తాము బ్రాహ్మణులమని చెబితే తప్పేంటని కూడా అన్నారు.

ఈ వ్యక్తులెవరు? వారిస్థాయి ఏమిటి? శ్రీ తిలక్ స్వరాజ్య ఉద్యమానికి పితగా ప్రసిద్ధిని పొందాడు. శ్రీ పటేల్, పండిట్ నెహ్రూ, కాంగ్రెస్ అధిష్ఠాన వర్గంలో శ్రీ గాంధీ తరువాత అంతటివారు. కొందరికి ఇది కాంగ్రెస్ అధిష్టాన వర్గంలోని ఆయా వ్యక్తుల వైయక్తిక అభిప్రాయాలుగా అనిపించవచ్చు. కాని అది తప్పు. కాంగ్రెస్ నిర్వహించిన ఎన్నికల ప్రచారాలలో కూడా ఇలాంటి అభిప్రాయాలు కార్య రూపం దాల్చాయని చాలా సందర్భాలలో ఉదహరించవచ్చు.

1919 ప్రాంతం నుంచి శ్రీ గాంధీ కాంగ్రెస్‌ని వశపరచుకున్నాడు. అప్పటి నుంచి కాంగ్రెస్ వారు చట్టసభలను బహిష్కరించడం అన్న దాన్ని స్వరాజ్యసాధనకు ఒక సాధనంగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒప్పించే మార్గంగా గ్రహిస్తూ వచ్చారు. ఈ పాలసీ ప్రకారం ఎన్నిక వచ్చినప్పుడల్లా కాంగ్రెస్ పాల్గోదు. అభ్యర్థులను కాంగ్రెస్ టికెట్‌పై నిలబెట్టదు. ఏ హిందువైనా స్వతంత్ర్య అభ్యర్థిగా పోటీ చేస్తే వారికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తుంది. ఈ పాలసీలోని గుణదోషాలను గురించిన చర్చ అనవసరం. కాని హిందువులు స్వతంత్రమైన టికెట్‌పై నిలబడటాన్ని నిరోధించటానికి కాంగ్రెస్ అవలంభించిన పద్ధతులేంటి? వారవలంభించిన పద్ధతి శాసనసభల ధిక్కారం. దీన్ననుసరించి భిన్న పరగణాలలో కాంగ్రెస్ శాసనసభలకెవరెళ్తారు? మంగళ్ళు, చెప్పులు కుట్టేవారు, కుండలు చేసేవారు, వీధులూడ్చేవారు అన్న మాటలున్న ప్లకార్డులు చేతబట్టుకొని ఊరేగింపులు జరిపారు. ఊరేగింపులో ప్రశ్నార్థకమైన మొదటి భాగాన్ని ఒక వ్యక్తి గట్టిగా చదవగా సమాధానమైన రెండవ భాగాన్ని కాంగ్రెస్ గుంపంతా కలిసి స్లోగన్‌లాగా అరిచేవారు. ఎప్పుడైతే ఈ పద్ధతి ద్వారా వ్యక్తుల్ని ఎన్నికలలో నిలబడకుండా అడ్డుపెట్టలేమని కాంగ్రెస్ వారు గుర్తించారో అపుడు వారంతా ఈ కఠినమైన చర్యలు చేపట్టాలని వారు నిర్ణయించారు.

---

1. ముందు వివరించిన 'సంజన' వ్యాసంలో ఉదాహరించబడింది.

ఉన్నత కుటుంబాలవారు తాము శాసనసభలలో మంగళ్లతో కుమ్మర్లతో వీధులు చిమ్మేవారితో కలిసి కూర్చోవాల్సి వస్తుందని తెలిస్తే వారసలే ఎన్నికల్లో పోటీ చేయరని విశ్వసించి కాంగ్రెస్ వాళ్ళెంత దూరం పోయారంటే ఈ నిమ్నకులాల నుంచి అభ్యర్థులను ఎన్నికలలో నిలబెట్టి వారిని గెలిపించారు కూడా. కాంగ్రెస్ చేసిన ఈ దౌర్జన్యాలకు కొన్ని ఉదాహరణలు చూపించవచ్చు. 1920 ఎన్నికలలో కాంగ్రెస్ ఒక చెప్పులు కుట్టేవాడిని[1] మధ్య పరగణాలకు చెందిన శాసనసభకు ఎన్నికచేశారు. 1930 ఎన్నికల్లో మధ్య పరగణాలలో ఇద్దరు చెప్పులు కుట్టేవారిని[2] ఒక పాలవాడిని[3] ఒక మంగలిని[4] పంజాబ్‌లో ఒక వీధులు చిమ్మేవాడిని[5] ఎన్నుకున్నారు. 1934లో కేంద్ర శాసనసభకు ఒక కుమ్మరుని[6] ఎన్నుకున్నారు. ఇది పాతకథ అని ఎవరైనా అనవచ్చు. కాని అలాంటి భావన తప్పు. ఎందుకంటే 1943లో బొంబాయిలోని ఒక శివారు - అంధేరీ లో మున్సిపల్ ఎన్నికల్లో ఏం జరిగిందో చూడండి. కాంగ్రెస్ వారు ఒక మంగలిని నిలబెట్టి మున్సిపాలిటీ పైనే హేయభావాన్ని కలిగించారు.

పాలక వర్గానికి ఉండాల్సిన మనస్తత్వమేనా ఇది? ఎంత సిగ్గుమాలిన మోహంతో పాలకవర్గం బానిసవర్గాలను ఇంత నీచమైన పనికి ఉపయోగించారు. పైగా వారి స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నామంటారు. తనకు జరిగిన అవమానాన్ని గురించి గర్వపడుతూ బానిసవర్గాలు స్వచ్ఛందంగా అదే కాంగ్రెస్ పక్షంలో చేరటం ఎంత విషాదకరమైన సంగతి. ఐర్లాండ్‌లో సిన్ ఫేయిన్ పక్షం కూడా బ్రిటిష్ పార్లమెంటును బాయ్‌కాట్ చేసింది. కాని వాళ్ళు తమ ప్రయోజనం సాధించుకోవటం కోసం ఇంత భయంకరంగా తమ దేశ ప్రజల్ని వాడుకున్నారా? 1930లో జరిగిన శాసనసభా ఉల్లంఘన ఉద్యమం చాలా ముఖ్యమైనది. ఇదే సంవత్సరంలో భిన్న ప్రాంతాల శాసనసభలకు ఎన్నికలు జరిగినపుడే ఈ సంఘటనలు జరిగాయి. ఇదే సంవత్సరములోనే శ్రీ గాంధీ ఉప్పు సంత్యాగ్రహం నిర్వహించారు. (భవిష్యత్తులో కాంగ్రెస్ చరిత్రను రాసేవారు డా. పట్టాభి సీతారామయ్య ఈ విషయంలో విఫలయ్యారు). శ్రీ గాంధీ వైస్రాయి లార్డ్ ఇర్విన్‌కి

1. ఫాగన్వా రోహిదాస్
2. గురుగోస్వాయిన్ అగమదాస్ ఐబ్రాబ్ డ్రైవర్
3. చున్ను
4. అర్జున్‌లాల్
5. ఐప్పీలాల్ చౌదరి
6. భగత్‌చంద్‌మల్‌గోలా

డిమాండ్ల పట్టికను ఇచ్చి ఫలానా సమయంలోగా వీటినంగీకరించాలని ఎలా నోటీసు ఇచ్చారో, అంగీకరించని సమయంలో శ్రీ గాంధీ సాల్ట్ ఏక్టను ఎదుర్కొనేందుకు ఎలా దానిని ధ్యేయంగా నిర్ణయించుకున్నారో, దండిని తన దాడికి రంగభూమిగా ఎలా ఎంచుకున్నాడో, ఆ ఉద్యమానికి తననే నాయకునిగా ఎలా నిర్ణయించుకున్నారో, అహమ్మదాబాద్‌లోని తన ఆశ్రమం నుంచి వైభవంతో సాంప్రదాయకమైన లాంఛనాలతో ఎలా బయలుదేరారో, అహమ్మదాబాద్‌లోని స్త్రీలు ఎలా హారతి ఇచ్చి ఆయన నుదుట తిలకం దిద్ది విజయం కల్గాలని శుభాకాంక్షలు తెలిపారో, గుజరాత్ ఒకటే ఇండియాకు స్వాతంత్ర్యం సంపాదించగలదని వారికి శ్రీ గాంధీ ఎలా హామీ ఇచ్చారో, స్వరాజ్యం సంపాయించకుండా అహమ్మదాబాదు తిరిగి రాబోనన్న తన నిర్ణయాన్ని శ్రీ గాంధీ ఎలా ప్రకటించారో, వీటిని రికార్డు చేసినపుడు ఒకవైపు కాంగ్రెస్ వాళ్ళు జనసామాన్యం చేత వారి కోసం స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికై ప్రకటిస్తూ, మరోవైపు అదే సంవత్సరంలో అదే జనసామాన్యం మీద దారుణమైన దౌర్జన్యాలు చేసి వారిని పదిమందిలోను హేయమైన వారుగా దూరముంచదగిన వార్నిగా చేశారు.

## VI

కాంగ్రెస్ అధిష్టానవర్గానికి బానిస వర్గాలపట్ల ఉన్న ఈ మనస్తత్వం చాలు-పాలకవర్గం కాంగ్రెస్ పరగణాలలో ఆధిక్యత పొందటం కేవలం యాదృచ్ఛికమన్న సిద్ధాంతాన్ని పూర్వపక్షంచేయటానకి. 23వ పట్టికను చూస్తే మరి కొన్ని వాస్తవాలు తెలుస్తాయి. వాటి ద్వారా కూడా ఈ యాదృచ్ఛిక వాదాన్ని కొట్టిపారవేయవచ్చు. అది కాంగ్రెస్ ఎన్నికల కోసం ఎన్నుకొన్న భిన్నవర్గాల అభ్యర్థుల విద్యార్హతలకు సంబంధించిన వాస్తవాలు. ఈ పట్టిక ఏం నిరూపిస్తుంది? బ్రాహ్మణులలో గ్రాడ్యుయేట్‌లకు, నాన్‌గ్రాడ్యుయేట్‌లకు ఉన్న నిష్పత్తి బ్రాహ్మణేతరుల షెడ్యూల్డ్ కులాల నిష్పత్తి కన్నా చాలా అధికంగా ఉంది. ఇది కేవలం యాదృచ్ఛికమా? లేక పాలసీ విషయమా? ఈ అభ్యర్థుల ఎన్నికలో ఉన్న సమత్వాన్ని గమనిస్తే కాంగ్రెస్ అధిష్టానవర్గం ఒక నిర్దిష్టమైన పాలసీని అనుసరించే అభ్యర్థిని ఎన్నకుందని తెలుస్తుంది. బ్రాహ్మణులలో అత్యధికమైన విద్యార్హత ఉన్నవారికే పెద్ద పీట వేశారు. బ్రాహ్మణేతరులలోను షెడ్యూల్డ్ కులాలలోనూ అత్యల్ప విద్యార్హత ఉన్న వారిని కోరి తీసుకున్నారు. గ్రాడ్యుయేట్‌లు నాన్‌గ్రాడ్యుయేట్‌లు అన్న భేదం నిజానికి బ్రాహ్మణ అబ్రాహ్మణ అభ్యర్థుల మధ్య, స్థాయిలోనూ స్థితిలోనూ ఉన్న తేడాను సూచించదు. ఎందుకంటె బ్రాహ్మణ అభ్యర్థులు గ్రాడ్యుయేట్‌లు మాత్రమే కాదు వారు సుప్రసిద్ధులైన పదునెరిగిన రాజకీయవాదులు. అబ్రాహ్మణ గ్రాడ్యుయేట్‌లు అప్పుడే చదువుకొని పడ్డవాళ్లు, రెండవ తరగతి రాజకీయ నాయకుల దర్జా ఉన్నవారు.

## పట్టిక 23
## కాంగ్రెసు పార్టీ అభ్యర్థులలో బ్రాహ్మణ-బ్రాహ్మణేతరుల విద్యార్హతల వివరాలు

| ప్రావిన్షియల్ అసెంబ్లీలు | కులాలు | మొత్తం | పట్టభద్రులు | పట్టభద్రులు కాని వారు | మెట్రిక్యులేషన్ | నిరక్షరాస్యులు | ఏదీ పేర్కొనని వారు |
|---|---|---|---|---|---|---|---|
| అస్సాం | బ్రాహ్మణులు | 6 | 5 | 1 | – | – | – |
| | బ్రాహ్మణేతరులు | 21 | 15 | 2 | – | 1 | 9 |
| బెంగాల్ | బ్రాహ్మణులు | 15 | 14 | 1 | – | – | – |
| | బ్రాహ్మణేతరులు | 27 | 21 | 4 | – | 1 | 7 |
| | షెడ్యూల్డ్ కులాలు | 6 | 3 | – | 1 | 2 | – |
| బీహార్ | బ్రాహ్మణులు | 31 | 11 | 5 | 8 | 4 | 3 |
| | బ్రాహ్మణేతరులు | 39 | 23 | 4 | 3 | 8 | 13 |
| | షెడ్యూల్డ్ కులాలు | – | 1 | 1 | 4 | 10 | – |
| సెంట్రల్ ప్రావిన్సెస్ | బ్రాహ్మణులు | 39 | 15 | – | 2 | 9 | 2 |
| | బ్రాహ్మణేతరులు | 54 | 15 | – | 2 | 17 | 1 |
| | షెడ్యూల్డ్ కులాలు | – | 1 | – | – | 6 | – |
| మద్రాసు | బ్రాహ్మణులు | 38 | 16 | 2 | 3 | 4 | 13 |
| | బ్రాహ్మణేతరులు | 90 | 31 | 3 | 1 | 7 | 61 |
| | షెడ్యూల్డ్ కులాలు | 26 | 1 | 1 | 1 | 14 | – |
| | వెనకబడ్డ కులాలు | – | 1 | – | – | – | – |
| ఒరిస్సా | బ్రాహ్మణులు | 11 | 6 | 1 | | 3 | 1 |
| | బ్రాహ్మణేతరులు | 20 | 7 | 3 | – | 7 | 1 |
| | షెడ్యూల్డ్ కులాలు | 5 | – | – | 2 | 5 | – |

మరి కాంగ్రెస్ ఎన్నికలలో అభ్యర్థులుగా బ్రాహ్మణులలో అత్యధిక విద్యార్హత ఉన్న వారినే ఎందుకు నిర్ణయించింది? అలాగే అబ్రాహ్మణ షెడ్యూల్డ్ కులాల వారిలో అత్యల్ప విద్యార్హత ఉన్న వారిని ఎందుకు ఎన్నుకుంది? ఈ ప్రశ్నకు ఒకే సమాధానం నాకు కనిపిస్తోంది. అబ్రాహ్మణులు బానిస వర్గ ప్రతినిధులు మిత్రవర్గాన్ని ఏర్పాటు చేయకుండా ఉండడానికి. కాస్త మెరుగ్గా చదువుతున్న అబ్రాహ్మణులు దొరక్కుండా కాదు. కాంగ్రెస్ ఉద్దేశ పూరితంగా చేసిందేమిటంటే అబ్రాహ్మణుల్లో అవిద్యావంతుల్నే ఎన్నుకోవటం. ఇలా మరి ఎందుకు? ఎందుకంటే పాలకవర్గం దృష్టితో అవిద్యావంతులైన అబ్రాహ్మణుడివల్ల రెండు స్పష్టమైన లాభాలున్నాయి. అవేమిటంటే మొదటిది కాంగ్రెస్ అధిష్టానవర్గం తనను ఎన్నుకొన్నందుకు వాడధికంగా కృతజ్ఞుడుగా ఉంటాడు. అదే విద్యావంతుడైతే అలా ఉండడు. రెండవది అవిద్యావంతులైన అబ్రాహ్మణుడు కాంగ్రెస్ పార్టీలోని విద్యావంతులైన అబ్రాహ్మణులతో చేతులు కలిపి పాలకవర్గాన్ని బోల్తా కొట్టించి అబ్రాహ్మణ మంత్రి వర్గాన్ని తయారు చేయడు. మూడవ దేమిటంటే కాంగ్రెస్‌లోని కొత్త వారైన అబ్రాహ్మణుల సంఖ్య ఎంత ఎక్కువ వుంటే వారు పాలకవర్గానికి అపాయకరంగామారి సమర్థవంతమైన ప్రత్యామ్నాయ మంత్రి వర్గాన్ని ఏర్పరచే ప్రమాదం కూడా అంతే తక్కువగా ఉంటుంది.

ఈ పరిస్థితులు గమనిస్తే "స్వాతంత్ర్యం కోసం పోరాటం" అన్నది ఎవరి స్వాతంత్ర్యం కోసం కాదని అది కేవలం పాలకవర్గం స్వాతంత్ర్యం కోసమేననీ అనటంలో సందేహముందా? కాంగ్రెస్సే పాలకవర్గమని పాలకవర్గమే కాంగ్రెస్సని అనడంలో సందేహముందా? స్వరాజ్యం పేరుతో1937లో భిన్న పరగణాల స్వాతంత్ర్య ప్రతిపత్తి, వచ్చినపుడు కాంగ్రెస్ ఉద్దేశ్య పూర్వకంగా నిస్సిగ్గుగా పాలకవర్గం వారినే పదవులు, అధికారాలు ఉన్న చోట్ల ఉంచినదనటంలో సందేహముందా?

## VII

ఇంతవరకు ప్రస్తావించిన విషయాలు ఆక్షేపణకే అవకాశం లేకుండా ఒక విషయం నిరూపిస్తుంది. 'స్వాతంత్ర్యం కోసం పోరాటం' అనే కాంగ్రెస్ నినాదం భారతీయ స్వాతంత్ర్య ఉద్దేశాన్నే మారుపాటు చేసింది. ఈ వ్యత్యాసానికి కాంగ్రెస్సే బాధ్యత వహించాల్సి ఉంటుంది. దీని ఫలితం ఒక భయంకరమైన పాపం: విదేశీయుడు ఇండియాలోని పాలక వర్గాల సామాజిక దృక్పథం సాంఘిక తత్వాలను గురించి తెలుసుకుంటే తప్ప కాంగ్రెస్ సృష్టించిన ఈ పాతకం ఎలాంటిదో సరిగా అర్థం చేసుకోలేడు.

పాలకవర్గంలో చాలా బలవంతులు శక్తిమంతులు అయిన బ్రాహ్మణుల విషయంచూస్తే, బానిసవర్గంపైన శూద్రులపైన (అబ్రాహ్మణులకు పాతపేరు) అస్పృశ్యులపైన జనాభాలో దాదాపు 80 నుండి 90 శాతం ఉన్నవారిపై అతి దీర్ఘకాలిక ద్వేషాన్ని సాధించిన వారుగా బ్రాహ్మణులే కనిపిస్తారు. ఇండియాలోని బానిసవ వర్గానికి చెందిన సామాన్య మానవులీనాడు ఇలా బక్కచిక్కి తక్కువ చేయబడి ఆత్మాభిమాన శూన్యులై, ఏ ఆశ, ఏ కోరిక లేక నిర్జీవంగా వున్నారంటే దానికంతా కారణం బ్రాహ్మణులు వారి వేదాంతాలే. (ధర్మశాస్త్రాలే)". బ్రాహ్మణుల ధర్మశాస్త్రంలోని ముఖ్యసూత్రాలు ఆరు: సరిగ్గా చెప్పాలంటే ఇవి అణగద్రొక్కే పద్ధతులు: అవి ఏవంటే 1. భిన్నవర్గాల మధ్య భిన్న అంతస్థులలో అసమానతను ప్రతిపాదించడం 2. శూద్రులను అస్పృశ్యులను సంపూర్ణంగా నిరాయుధుల్ని చెయ్యటం. 3. శూద్రులకు అస్పృశ్యులకు విద్యను పూర్తిగా నిషేధించడం. 4. శూద్రులను అస్పృశ్యులను బలం, అధికారం ఉన్న చోట్ల నుంచి సంపూర్ణంగా బహిష్కరించడం. 5. శూద్రులు అస్పృశ్యుల ఆస్తినంతా కూడా నిషేధించడం. 6. స్త్రీలను సంపూర్ణంగా స్వాధీనంలో ఉంచుకోవటం, అణచివెయ్యటం. బ్రాహ్మణమతంలో అసమానత అన్నది అధికార సూత్రం, సమానతను కోరే నిమ్న వర్గాలను అణచివేయడం తమ విద్యుక్త ధర్మంగా భావిస్తూ ఏపశ్చాత్తాపము లేకుండా వారినణచివేస్తూ వచ్చారు. కొద్ది మందిని దాటి విద్య వ్యాపించని దేశాలు కొన్ని వున్నాయి. కాని ఇండియాలో మాత్రమే మేధావి వర్గమైన బ్రాహ్మణులు విద్యను గుత్తాధిపత్యంలో పెట్టుకోవడమే కాకుండా నిమ్న వర్గీయులు చదువు నేర్చుకోవడం శిక్షార్హనీయమని అలాంటి వాడి నాలుక కత్తిరించాలని, చెవుల్లో కాచిన సీసం పోయాలని, శిక్షను కూడ ప్రకటించారు. దీని ఫలితంగా శతాబ్దాలపాటు బానిసవర్గాలకు చదివే హక్కు లేకుండా బ్రాహ్మణులు చేశారు. ఈ నాటికి కూడా బ్రాహ్మణులు వారి విద్యపట్ల అలాంటి వ్యతిరేకతనే ప్రదర్శిస్తారు. శ్రీ బేయిన్స్ అనే సెన్సస్ కమీషనర్ 1891 జనసామాన్యంలో విద్య ఎందుకు వ్యాపించడం లేదన్న విషయం గురించి చర్చిస్తూ ఇలా అన్నాడు:

"అక్షరాస్యత అధికంగా వ్యాపించక పోవడానికి ప్రతికూలమైన రెండవ కారణం చాలా కాలము నుంచి ఉంటూవస్తున్న వారసత్వ వర్గం. ఈ వర్గం వారు గ్రంధ రూపంలో చదివే చదువు మీద తమదైన గుత్తాధిపత్యాన్ని సాధించి దాని ద్వారా సాంఘికంగా వారి ఆధిపత్యానికి అడ్డుగోడగా ఈ చదువును పయోగించారు. మతపరమైన గురుత్వం అమాయక జనుల్ని తప్ప ఇతరులెవర్నీ పరిపాలించ జాలదని మనకు తెలుసు. బ్రాహ్మణుడు ఇతరవర్గాలు పైకిరావటాన్ని ఎలా ద్వేషిస్తాడో ముందు ప్రస్తావించాను. జన సామాన్యంలో విద్యావ్యాప్తి విషయంలో ఈ రెండు వర్గాలలో ఉన్న అసమ్మతి చాలా కాలం, గడిచిన తర్వాతనే మనమర్థం చేసుకోగలుగుతాం. బ్రిటిష్ ప్రభుత్వం ప్రాధమిక విద్యయొక్క విలువను గురించి, ఆవశ్యకతను గురించి గుర్తించడంచేత విద్యావంతుల కులాలలో కొంత

ప్రతిస్పందన కల్గింది కాని అది కేవలం విద్యాసంబంధమైన ఉచ్చారణల దిశగా . ఇప్పుడున్న పరిస్థితులలో దీన్ని నివారించడం కష్టం. ఇది ఈ కులాల వారికి బ్రతుకు తెరువును చూపించ గలుగుతుంది కాబట్టి ఆహ్వానించదగినదే. వాళ్ళు ఉపాధ్యాయులై తరువాత భోదనలో జాతీయ ప్రమాణాలను అందుకోవడానికి ఇది అవసరమే. ఈ వర్ణాల నిజమైన ఆసక్తి సెకండరీ విద్యపై ఉంది. దీని లాభాలలోనూ పొందే అవకాశం కూడా వారికే ఉంది."

బ్రిటిష్ వారు భారతీయ ప్రజలను సాముదాయకంగా నిరాయుధులను చేసి పరిపాలిస్తున్నారని కాంగ్రెస్ రాజకీయ వాదుల ఫిర్యాదు. శూద్రుల, అస్పృశ్యుల నిరాయుధీకలణమన్న సూత్రాన్ని సిద్ధాంతంగా ప్రతిపాదించిన వారు బ్రాహ్మణులే అన్నది వారు మరచిపోతారు. నిజానికి బ్రాహ్మణులు శూద్రుల, అస్పృశ్యుల నిరాయుధీకరణంలో గట్టిగా నమ్మకముంచారంటే, బ్రాహ్మణులు తమ అవకాశాలను రక్షించు కోవటం కోసం అన్ని ఆయుధాలు ధరించవచ్చు. ఒకవైపు సిద్ధాంతాన్ని సవరిస్తూ శూద్రుల మీద, అస్పృశ్యుల మీద నిషేధం అలాగే వుంచారు. ఇండియాలో అత్యధిక ప్రజలు ఈనాడు నపుంసకులుగా (వృషణాలు కొట్టబడి) యుగయుగాలుగా బ్రాహ్మణుల సర్వనిరాయుధీకరణ పద్ధతి వల్లనే వాళ్ళిలా అయ్యారు. బ్రాహ్మణుడు మద్ధతు ఈయని సాంఘిక అన్యాయం కాని, సామాజిక దురాచారం కాని లేదు. మనిషికి మనిషికి నడుమ అమానుషత్వంగా ప్రవర్తించగల కులభావన, అంటరానితనం, దగ్గరచేరలేనితనం చూడలేనితనం ఇవన్నీ బ్రాహ్మణుడికి మతమయినాయి. కాని మనిషి చేసిన తప్పులు మాత్రమే అతని మతమనుకోవడం పొరపాటే అవుతుంది. ప్రపంచంలో ఏ భాగంలోనూ స్త్రీలు అనుభవించని భయంకరమైన అపచారాలకు బ్రాహ్మణుడు మద్ధతు నిచ్చాడు. ఇండియాలో విధవలను సతి అనే పేరుతో బతికుండగానే కాల్చేసేవారు. ఈ ఆచారానికి బ్రాహ్మణుడు పూర్తి మద్ధతునిచ్చాడు. విధవల్ని మళ్ళీపెళ్ళి చేసుకోనిచ్చేవారు కాదు. ఈ సిద్ధాంతాన్ని కూడా బ్రాహ్మణులు సమర్థించారు. ఆడపిల్లలను ఆపిల్ల పెద్దదైనా కాకపోయినా ఆమెతో సంపర్కం పెట్టుకునే హక్కు ఉండేది. బ్రాహ్మణుడు ఈపద్ధతిని సమర్థించాడు. శూద్రులకు అస్పృశ్యులకు స్త్రీలకు న్యాయాన్నివ్వడంలో బ్రాహ్మణుల చిట్టా అతి నల్లటిది (కళంకితమైంది). ప్రపంచంలో ఏ ఇతర దేశంలోని మేధావి వర్గానికి ఇంత అప్రతిష్ట లేదు. ఎందుకంటే ప్రపంచంలో మరెక్కడా మేధావివర్గం అవిద్యావంతులైన తమతోటి ప్రజలను నిరంతర దాస్యంలో, అజ్ఞానంలో, దారిద్ర్యంలో ఉంచడమే ఏకైక ప్రయోజనంగా, ఇండియాలోని బ్రాహ్మణుల్లాగా తమ మేధను వ్యభిచరింపచేసి ఒక తత్వశాస్త్రాన్ని సృషించలేదు. ఈనాటికి ప్రతి బ్రాహ్మణుడు తాత ముత్తాతలు ప్రతిపాదించిన బ్రాహ్మణ్య వేదాంతాన్ని విశ్వసిస్తారు. హిందూ సమాజంలో అత్యంత పరాయివాడు, జర్మన్‌కు ఫ్రెంచ్

వారు ఎంత దూరమో జ్యూకు జెంటైల్‌కూ, తెల్లవారికి నాగ్రోకు ఎంత దూరమో బ్రాహ్మణుడికి శూద్రుడు, అస్పృశ్యుల నడుమ కూడా అంతే దూరముంది. అతడికి నిమ్న వర్గీయులైన శూద్రులకు అస్పృశ్యులకు ఒక పెద్ద అగాధం ఉంది. అతడు వారికి పరాయి వాడే కాకుండా విరోధికూడా. వారి బాంధవ్య విషయంలో అతనిలో వివేకం లేదు. న్యాయం వైపు దృష్టిలేదు.

బనియా ప్రపంచ చరిత్రలో అతి నికృష్టమైన పరాన్నజీవి. అతనిలోని డబ్బు సంపాదించడం అన్న దుర్వ్యసనం, సంస్కృతి చేతకాని, వివేకం చేతకాని విమోచనం పొందలేదు. అంటువ్యాధులు వచ్చినపుడు బాగా సంపన్నుడయ్యే శవాలను సాగవేసేటటువంటి ఉద్యోగి వంటివాడు. కాని ఇద్దరి మధ్య భేదం ఉంది. శవాలను సాగవేసేవాడు అంటువ్యాధుల్ని సృష్టించడు, కాని వైశ్యుడు సృష్టిస్తాడుఅతడు తన ధనాన్ని ఉత్పాదక ప్రయోజనాల కోసం వాడడు. పేదతనం మరింత పేదతనాన్ని సృష్టించే ఉద్దేశంతోనే అతడు అనుత్పాదక ప్రయోజనాల కోసం డబ్బును అప్పుగా ఇస్తాడు. అతడు వడ్డీ మీద బ్రతుకుతాడు. వాడి మతం ప్రకారం అప్పు ఇవ్వడమే వాడి వృత్తిగా, దివ్యుడైన మనువు చెప్పటం చేత అప్పుఇవ్వడం తనహక్కుగాను ధర్మంగాను భావిస్తాడు. బ్రాహ్మణ న్యాయాధికారి ఎలాగూ అతని వ్యవహారాలపై తీర్పు ఇవ్వడానికి సహాయకారిగా ఉంటాడు కాబట్టి వైశ్యుడు ఛాలా సులభంగా అతని వ్యాపారాన్ని నడుపుకోగలుగుతున్నాడు. వడ్డీమీద వడ్డీ కలుపుతూ కలుపుతూ పోతాడు. దానితో కొన్ని లక్షల కుటుంబాలను నిరంతరం తన వలలోకి లాక్కుంటాడు. ఎంత ఇచ్చినాసరే అప్పుతీసుకున్నవాడు అప్పులోనే వుంటాడు. అతన్ని అడ్డుకొనే స్వదోష జ్ఞానస్పృహ లేదు. అందుచేత అతడు చేయని మోసం కాని, ఆడని పితలాటకం కాని లేదు. అతనికి దేశం మీద సమగ్రమైన పట్టువుంది. పేదతనంతో ఆకలి డొక్కలతో నిరక్షరాస్యులైన ఇండియా మొత్తం వైశ్యుడికి ఎప్పటికీ తీర్చడానికి వీలులేనట్టుగా తనఖా ఉంచబడింది. ప్రతిదేశంలోనూ, పాలకవర్గమనేది ఉంటుంది. ఈ వర్గం లేని దేశమే లేదు. కాని ప్రపంచంలో మరెక్కడైనా ఇంత స్వార్థపూరితమైన రోగగ్రస్తమైన, అపాయకరమైన, వ్యవస్థమైన, మనస్తత్వంతో పాలకవర్గం తమ అధికారాన్ని వైభవాన్ని నిలుపుకోవడం కోసం ఘోరమైన, దారుణమైన జీవిత వేదాంతాన్ని ప్రతిపాదించి బానిస వర్గాలన అణగద్రొక్కి పారవేయటం ఉందా? నాకు తెలిసి మరెక్కడా లేదు. ఇతర దేశాలలో తమ వర్గానికి చెందని వ్యక్తులను తమ సమాజంలోకి సులభంగా రానివ్వక పోవటం నిజమే. కాని తమ స్థాయికి వచ్చిన వారిని తమ సమాజంలో చేరటానికి నిరాకరించరు. అలాగే ఏ వ్యక్తైనా తమ స్థాయికి ఎదగడానికి ప్రయత్నిస్తుంటే అడ్డుపెట్టరు. ఇండియాలో పాలకవర్గమన్నది మూసుకుపోయిన గ్రామసభ. అక్కడ పుట్టుకతో తమ వారిని కానివారెవ్వరినీ చేరనివ్వరు. బానిసవర్గాల వారు ఎవరైనా ఆ స్థాయికి ఎదగాలని ప్రయత్నిస్తే అడ్డుకోడానికి అన్ని పద్ధతులు ఉపయోగిస్తారు.

# VIII

ఫ్రాన్స్‌లో ఫ్రెంచి విప్లవానికి ముందు ఒక పాలక వర్గం ఉండేది. జపాన్‌లో 19వ శతాబ్దంలోని ఏడవ దశకానికి ముందు ఒక పాలకవర్గం ఉండేది. అపుడే జపాన్ తన రాజ్యాంగాన్ని ఆధునీకరించుకోడానికి నిర్ణయించుకొంది. ఈ రెండు దేశాలలోను జాతీయ ఆపత్కరకాలం వచ్చిందని గుర్తించిన పాలకవర్గాలు తమ పాత హక్కులను, అవకాశాలను వదిలి వేసుకోవడానికి కులీనులు, ధనవంతులు అయిన కొందరు కలిసి చేసే రాజ్యపాలన నుండి ప్రజాస్వామ్యం వైపు ప్రభుత్వం పరిణమించడానికి సహకరించారు. ఫ్రాన్స్‌లో విప్లవం వచ్చి సమానత్వాన్ని కోరినపుడు ఫ్రాన్స్‌లోని పాలకవర్గం స్వచ్ఛందంగా ముందుకు వచ్చి తమ అధికారాలను అవకాశాలను వదలివేసి దేశంలోని జనసామన్యంలో కలిసిపోయరు. స్టేట్స్ జనరల్‌ను సమావేశ పరచినపుడు జరిగిన దానిని బట్టి స్పష్టమవుతుంది. కామన్లకు ఆరు వందల ప్రతినిధులు రాగా, పురోహిత వర్గానికి సంస్థానాధిపతులకు ఒక్కొక్కరికి 300 చొప్పున వచ్చారు. ఈ 1200 మంది సభ్యులు ఎలా కూర్చోవాలి? చర్చించాలి? వోటు వేయాలి? అన్న ప్రశ్న పుట్టింది. కామన్‌లు, అన్ని ఎస్టేట్‌లు ఒకే కొలువు కూటంలో కలవాలని, మోజువాణి ద్వారా వోటు వేసే పద్ధతి ఉండాలని పట్టుబట్టారు. పురోహిత వర్గం, సంస్థానాధిపతులు ఈ ప్రతిపాదనకు అంగీకరించి ఉంటారని ఊహించడం అసాధ్యం. ఎందుకంటే తమకు తరతరాలుగా వచ్చిన అతిపురాతన అతి గౌరవ ప్రదమైన అవకాశాలను జార విడుచుకోవడమే. కాని దేశానికి స్వేచ్ఛ సమత సౌభ్రాతృత్వాలపై ఆధారపడ్డ రాజ్యాంగాన్ని ఇవ్వడానికి అంగీకరించారు.

జపాన్‌లో 1855-1870 నడుమ ఫ్యూడల్ సమాజం వైపు నుంచి ఆధునిక సమాజం పరిణమిస్తున్న దశలో పాలకవర్గం ధోరణిలో వచ్చిన మార్పు ఫ్రాన్స్‌లో వచ్చిన మర్పు కన్నా అధికమైన ఆత్మ త్యాగంతో కూడింది. జపాన్ చరిత్ర విద్యార్థులకు జాపనీస్ సంఘంలో నాలుగు వర్గాలు ఉండేవని తెలుస్తుంది. 1. దవియోస్ 2.సమురై 3. హెమిన్ వీరే (సమాన్య ప్రజానీకం) 4. ఈటా (వీరే బహిష్కృతులు ) వీరిలో ఒకరిపై ఒకరికి భిన్న అంతస్థులలో అసమానత ఉండేది. అందరి కన్నా అడుగున ఉన్న వారు ఈట. వీరు కొన్ని వేల మంది ఉండే వారు. వీరిపైన హెమిన్ 25/30 మిలయన్లు ఉండే వారు. వీరిపై సమురై, వీరు దాదాపు రెండు మిలియన్లు ఉండే వారు. హెమిన్‌ల పుట్టుక చావులపై అధికారం వీరి చేతిలో ఉండేది. శిఖరంలో దవియోస్ ఉండేవారు. వీరే ఫ్యూడల్ బ్యారన్‌లు. తక్కిన మూడు వర్గాల మీద అధికారం వీరిదే. కాని వీరి సంఖ్య కేవలం 300 లే. కాని దవియోస్ సమురై ఇలా వర్గాలతో కూడి యున్న వర్గ హక్కులు కల్గిన ఫ్యూడల్ సమాజాన్ని

ఆధునిక దేశంగా పౌరసమానత్వం కలిగిన దానిగా మార్చడం అసాధ్యమని గుర్తించారు. దీనికనుగుణంగా జాతీయత స్ఫూర్తితో ఉత్తేజితులై జాతీయ సమైఖ్యతకు అడ్డుగా నిల్వకూడదన్న ఆలోచనతో వారే ముందుకు వచ్చి దవియోస్‌లు తమ హక్కులను ధారపోసి తమకు తాముగా జనసామాన్యంతో కలిసి పోయారు. 1869 మార్చి 5న చక్రవర్తికి సమర్పించిన విన్నపంలో వారితో అన్నారు.[1]

"మేం నివసిస్తున్నది చక్రవర్తి భూమిలో. మేము తినే ఆహారాన్ని చక్రవర్తి మనుష్యులు పండిస్తున్నారు. అలాంటప్పుడు మా ఆస్తి అని దేన్ని మేం చెప్పగలం. అందుచేత మేము వినయపూర్వకంగా మాకు సంబంధించిన వాటిని మా అనుయాయుల్లైన సమురైనివీరితోపాటు సామాన్య జనాన్నిమీకు సమర్పిస్తూ చక్రవర్తి ఎవరిని బహుమతించాలో ఎవరిని శిక్షించాలో తగిన చర్య చేపట్టమని ప్రార్థిస్తున్నాం. భిన్నవంశాల పాలనలో ఉన్న భూభాగాలను మార్చి మరలా పునర్నిర్మించడానికి చక్రవర్తి ఆదేశాలను ఇచ్చుగాక. పౌర సంబంధమైన న్యాయసూత్రాలను, సైనిక చట్టాల మొదలు యూనిఫార్మ్, యుద్ధ తంత్రాలు మొదలైన అన్ని చట్టాలు చక్రవర్తి నుంచి వచ్చుగాక, సామ్రాజ్యానికి సంబంధించిన చిన్న పెద్ద విషయాలన్నీ ఆయనకే విన్నవింపబడుగాక."

ఇండియాలోని పాలకవర్గం జపాన్‌లోని పాలకవర్గంతో ఈ విషయంలో ఏమైనా పోలిక కలిగిఉందా? కేవలం వ్యతిరేకంగా ఉంది. దురదృష్టవశంగా ఇండియాలో బానిసవర్గాల పోరాట చరిత్రను ఇంతవరకూ ఎవరూ వ్రాయలేదు. కాని చరిత్ర ఏ మాత్రం తెలిసిన వారైనా ఇండియాలోని పాలకవర్గం ఎంత ఆరాటపడుతున్నా భారతీయ స్వాతంత్ర్యోద్యమ బలిపీఠం మీద నిలబడికూడా ఎలాంటి త్యాగం చేయడానికి ఇష్టపడదని గుర్తించగలరు. దీని బదులుగా పాలకవర్గం తమ చేతిలో ఉన్న ప్రతి మార్గంలోనూ వాళ్ళనలాగే ఉంచడానికే ప్రయత్నం చేస్తోంది. దీనికోసం అది రెండు ఆయుధాలు వాడుతున్నది. జాతీయత అనే ఆయుధం బానిసవర్గాల శాసనసభలలోనూ, మంత్రి వర్గంలోనూ, పబ్లిక్ ఉద్యోగాలలోను ఎప్పుడూ రిజర్వేషన్లు కావాలని అడిగినా పాలకవర్గం వారు జాతీయత అపాయస్థితిలో ఉందని ఘోష మొదలు పెడతారు. ఈ రిజర్వేషన్లు ఎందుకు? పాలకవర్గాలు బానిసవర్గాలను తమ జీవన పోరాటం మరింత అడుక్కి తోసి పారవేయకుండా ఒక ఆధార భూమిగా ఉండడం కోసమే ఈ రిజర్వేషన్లు. ఈ డిమాండ్‌లో అపసవ్యమైంది ఏం లేదు? దోషమైంది ఏం లేదు? మరి పాలకవర్గం దీనిపట్ల ఎలాంటి ప్రతిక్రియ చూపుతోంది? అవకాశం

1. రొమాన్స్ ఆఫ్ జపాన్ అన్న జేమ్స్ఏబి, స్క్రరర్ గ్రంథంలో ఉదాహృతం.

వచ్చినప్పుడల్లా వద్దని మొరపెట్టుకుంటుంది. లేదంటే కించపరుస్తుంది. జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించాలంటే, సమైక్యత కాపాడుకోవాలి. వాటిని కోరటం జాతీయ సమైక్యతకు ప్రతికూలమైనది, అందువల్ల జాతీయ స్వాతంత్ర్యంలో ఆసక్తి ఉన్నవాడు ఎవరైనాసరే అలా రిజర్వేషన్లు కావాలి అని కోరిన వారికి మద్దతునివ్వడం పాపం అని ప్రజలు నమ్మేలా చేశారు. ఇది ఇండియాలోని పాలకవర్గ ధోరణి. జపాన్‌లోని పాలకవర్గంతో వీరికున్న తారతమ్యం కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. జాతీయతను దురపయోగం చేయటం ఇది. కాని ఈ పాలకవర్గానికి ఇలా దురపయోగం చేస్తున్నామే అన్న పశ్చాత్తాపం కూడా లేదు.

ఈ పాలకవర్గం వారు వాడే రెండవ సాధనం రిజర్వేషన్ కోసం చేసే డిమాండ్‌మీద ఎగతాళిగా పద్యాలు వ్రాయటం. వికటకవిత్వాలు చెప్పడం. తద్వారా వారిని కించపరచడం. ఇలాంటి ఎగతాళి రచనలు సంఖ్యలో తక్కువగా ఏం లేవు. పాలకవర్గానికి చెందిన చాలా గౌరవనీయ సభ్యులుకూడా ఇలాంటి రచనలు చేయడానికి వెనుకాడలేదు. మేటి ఉదారవాది ఇపుడు ఆస్ట్రేలియాకు ఇండియా హైకమీషనర్‌గా ఉన్న డాక్టర్ ఆర్.పి. పరాంజపే కూడా అలాంటి ఒక వికట రచనను[1] చేయకుండా ఉండలేక పోయాడు. పాలకవర్గం వారు తయారు చేసిన అలాంటి వికటరచనల్లో ఇతనిదే చాలా ఆకర్షకంగా వుంది. ఇది బానిసవర్గాల అతి తీవ్రమైన అసంతృప్తిని కూడా చూరగొంది.

పాలకవర్గాలు బానిసవర్గాల రిజర్వేషన్ డిమాండ్‌ను వ్యతిరేకించడానికి వారుచూపే వాదం సామర్థ్య సిద్ధాంతం. పాలకవర్గం తమ అభిప్రాయానికి దేశభక్తి అనే రంగును పూసి ఏమంటుందంటే ఇండియాను ఒక సమర్థమైన రాజనీతిగల దేశంగా పట్టుకురావాలని, అది చేయాలంటే బలం అధికారం ఉన్న ప్రతి ఉద్యోగాన్ని కేవలం ఉత్తమ వ్యక్తి చేతనే చేయబడాలని వారంటారు. ఈ వాదమే విదేశీయుణ్ణి ప్రభావితం చేస్తుంది. దీంతో రిజర్వేషన్‌లకు వాడు వ్యతిరేకి కాకపోయినా విమర్శించే వాడవుతాడు. అందువల్ల ఈ వాదంలోని బలాన్ని, ఇలా వాదించేవారి చిత్తశుద్ధిని పరిశీలించడం అవసరం. అత్యుత్తములు, అంతకన్నా తక్కువ వారిచేత, తక్కువవారు అధములచేత ధిక్కరింపబడేలా ఏ చట్టం చేయకూడదన్న అమూర్త సూత్ర విషయంలో ఎవరికీ తగాదా వుండదు. కాని ఈవాదం

1. ఆర్.పి. పరాంజపే రాసిన వ్యక్తీకరణం "భవిష్యత్తులోకి తొంగి చూపు" (ఎ పీప్ ఇంటుది ఫ్యూచర్) అనే శీర్షిక కింద మే 1926 'గుజరాతి పంచ్' పత్రికలో ప్రచురితం అయ్యింది. పాలక వర్గం సభ్యుల రాతకు మచ్చుతునకగా ఇది చదవడం మంచిది. నిబంధన (కమ్యూనల్ రిజర్వేషన్) సూత్రపరంగా జరిగిన కొన్ని సంఘటనల ఊహాగానం ఆధారంగా రాసిన వ్యంగ్యం అది. ఆ పత్రిక సులభంగా దొరకదు కాబట్టి దానిని ఇక్కడ ఉటంకిస్తున్నాను.

అనుభవంలో మనకు నమ్మకాన్ని కల్గించటం లేదు. ఎందుకంటే ప్రయోగాత్మకంగా చూచినప్పుడు, ఇండియాలోని చారిత్రక సందర్భాల దృష్ట్యా ప్రతిసారి ఉత్తమ వ్యక్తిగా నిర్ణయింపబడ్డవాడు పాలకవర్గానికి చెందినవాడే అయి వుంటున్నాడు. ఇది పాలకవర్గం దృష్ట్యా బాగానే ఉండవచ్చు, కాని బానిసవర్గం దృష్టిలో ఇవి సరైందేనా? ఉత్తమ జర్మన్ ఫ్రెంచి వారికి ఉత్తముడౌతాడా? ఉత్తమ టర్క్ గ్రీకులకు ఉత్తముడౌతాడా? ఉత్తమ పోప్ యూదులకు ఉత్తముడౌతాడా? ఈ ప్రశ్నలకు ఏది సరైన సమాధానమో ఎవరూ సందేహపడాల్సిన పని లేదు. ఒకటి, ప్రతి గొప్ప వ్యక్తి మంచి వ్యక్తి కానక్కర లేదు.

## భవిష్యత్తులోకి ఒక తొంగి చూపు

## (ఎ పీప్ ఇన్‌టుది ఫ్యూచర్)

1930-50 సంవత్సరాల మధ్య విడుదలైన కమీషన్స్ నివేదికలు, పోలీస్ రికార్డులు న్యాయ విచారణలు సభాకార్యకలాపాలు పరిపాలన నివేదికలు మొ.దలగు వాటి నుంచి ఎత్తి తీయబడిన విభాగాలు ఇవి. 'గుజరాతి పంచ్'. చదవరుల కోసం ప్రచురింపబడ్డాయి.

ఇండియా ప్రభుత్వం మీద రాయల్ కమీషన్ నివేదిక (నుండి రిపోర్ట్ ఆఫ్ ది రాయల్ కమీషన్ ఆఫ్ ఇండియా 1930). ఇండియాలోని బహుళజాతుల తరపున ఇచ్చిన మహజరులను చాలా క్షుణ్ణంగా పరిశీలించాలి. క్రితం జనాభా లెక్కల ఆధారంగా తీసుకొని మాముందరుంచిన వాదనలకు మాత్రమే సంతృప్తి నివ్వగలం. ఎందుకంటే అనేక జాతుల /కులాల జనాభా అందరికీ వర్తించే కొలతకు రావు కాబట్టి దేశంలోని ప్రతి వ్యక్తికి ఏదో ఒక స్థానం కల్పిస్తేనేగాని ఈ సమస్య అందరికి సంతృప్తినిచ్చే సరియైన పరిష్కారం కనుక్కోలేము. 2375ను రాజ్యాంగపు మూల సంఖ్యగా మేము తీసుకుంటాం. మానివేదికకు జతపర్చిన సూచీ (షెడ్యూలు)లో చూపించినట్టు ఈ సంఖ్యను జాతుల/కులాల భాగాల వారీగా విభజనలు చేశాం. ప్రతి జాతి/కులము వాడిన దానికి సరిపోయిన సంఖ్య ప్రకారం ఇక ముందు నుంచి గుర్తించదుతుంది. నిజానికి దేశంలో అన్ని నియామకాలు, సంస్థలలో సభ్యత్వము, అమాట కొస్తే దేశంలోని ప్రతి అంశం వీలున్నప్పుడల్లా సూచీ(షెడ్యూలు)లోని సంఖ్య ప్రమాణంగా చేయడం జరుగుతుంది. ఒక్కొక్క జాతి/కులము సభ్యులలో ప్రతి 5 గురికి ఒకరు చొప్పున రాజప్రతినిధి(వైస్రాయ్) కార్యాచరణ సమితి (Executive Council) లో 475 మంది సభ్యులుంటారు. ప్రతి జాతి / కులము తనకు చెందిన మొత్తము సభ్యుల వాటా 5 ఏళ్లలో పూర్తయ్యేటట్లు ఏడాదికి ముగ్గురు చొప్పున పదవిలో ఉంటారు. ప్రతి హైకోర్టులోను 125 మంది జడ్జీలుంటారు. ఒకో జడ్జి ఒక ఏడాది పదవిలో ఉంటాడు. ఈ పద్ధతి ప్రకారం ప్రతివర్గానికి తమకు రావలసినప్పటికి వాటా ప్రకారం 19 ఏళ్ళ కొకసారి అవకాశం వచ్చి ఆ అందరి వాటాలు సరిగ్గా కుదిరేటట్లుగా ఇదే పద్ధతిని మిగిలిన నియమకాలన్నీ నిర్ణయించబడతాయి.

ఈ సభ్యత్వంలో అన్ని సంస్థలు సరిగా పనిచేయడానికి వీలుగా ఇప్పుడున్న ప్రభుత్వభవనాలన్నీ అవసరం కొద్దీకూలగొట్టి సరిపడే కొలతలతో మళ్ళీ కట్టాలి.

మనిషి ఏ భావాలు లేని కేవలం యంత్రం కాదు. ఉత్తమ వ్యక్తి విషయం కూడా ఇంతే. వారికి కూడా వర్గ సానుభూతులు వర్గద్వేషాలుంటాయి. ఈ అంశాలను గమనిస్తే పాలకవర్గాల దృష్ట్యా ఉత్తమవ్యక్తి అయినవారు బానిసవర్గాల దృష్ట్యా అతి నీచుడు కావచ్చు.

---

## II

### (ఇండియా ప్రభుత్వ ప్రకటన 1932)

ఇండియాలో ప్రభుత్వం చట్టం 1931లోని నిబంధనల ప్రకారం ఘనత వహించిన (His majesty) మహారాజావారు ఇక్కడ ఉదాహరించిన 475 పెద్దలను మహారాజా ప్రతినిధి (గవర్నర్ జనరల్) కార్యాచరణ సమితి సభ్యులుగా నియమించుటకు దయతో అంగీకరించండి.

267 మటదిన్ రామ్‌దిన్ (కులంమంగలి) ఆరోగ్య శాఖలో శస్త్ర చికిత్సా విభాగ సభ్యునిగా, 372 అల్లాబక్ష్ పీర్‌బక్ష్ (మహమ్మదీయుడు ఒంటెలు తోలేవాడు) సైన్యంలో ఒంటెల బిడారి శాఖ సభ్యునిగా, 433 రామస్వామి (కులం: ఆంధ్రా వీధులు ఊడ్చేవారు) ప్రజావసర పనుల శాఖలో రోడ్లు శుభ్రపరచే విభాగం సభ్యుడుగా, 437 జగన్నాధ భట్టాచార్య (కులీన బ్రాహ్మణ పురోహితుడు) అభిలేఖశాఖ (రిజిస్ట్రేషన్ డిపార్టుమెంట్)లో గృహవిభాగపు సభ్యుడుగా

* * *

## IV

### స్థానిక సంస్థలకు ఉత్తరం, 1934

ఇండియా ప్రభుత్వం పూర్తిగా వప్పుకున్న విధానమండలి ఆమోదించిన శాస్త్రం ప్రకారం, ఇక నుంచి ప్రతి ప్రభుత్వ నియామకం అభ్యర్థి అర్హతను బట్టి కాక జాతి కుల ప్రాతిపదికపై ఏర్పాటైన వంతుల వారీ (రొటేషన్) పద్ధతి ప్రకారం జరగాలని ఇందు మూలంగా తెలియపరచడానికి నేను ఆజ్ఞానువర్తిని.

* * *

## V

### బొంబాయి ప్రభుత్వ రాజపత్రం గెజిట్ ప్రకటన 1934

బొంబాయి ప్రభుత్వం డిసెంబరు నెలలో ఇక్కడుదహరించిన నియామకాలు చేస్తారు. ప్రభుత్వ ఉత్తర్వు సంఖ్య రోటేషన్ ప్రకారం ఈ అభ్యర్థులు ఉద్యోగాలకు ఎదురుగా చూపించిన కులానికి చెంది వుండాలి.

| | | |
|---|---|---|
| 1. | చీఫ్ ఇంజనీర్ నీటిపారుదల (సింధ్) | కున్బి (కుమ్మరి) ఉత్తర కేనారే |
| 2. | సంస్కృత ఆచార్యుడు, ఎలిఫిన్‌స్టన్ కాలేజీ, బొంబాయి | బెలూచీ పఠారా సింధ్ |
| 3. | ఘనత వహించిన (హిజ్ఎక్సలెన్సీ) వారి అంగరక్షక అధికారి (కమేండెంట్) | మార్వాడీ, ఉత్తర గుజరాత్ |
| 4. | ప్రభుత్వ వాస్తుశిల్ప సలహాదారు | వడ్డరి (తిరుగుబోతు జిప్సీ) దక్కన్ |

కేవలం సామర్థ్యం ఒక్కటే పరీక్ష కాదు. ఇదే అంగీకరిస్తే ఫ్రెంచ్ దేశ వ్యవహారాల లోను జర్మనులు బాగా చూసు కోవచ్చు. కేవలం శుద్ద నైపుణ్యాన్ని పట్టుకొని వేలాడేవాడు

---

4. ప్రభుత్వ వాస్తుశిల్ప సలహాదారు (వడ్డరి తిరుగుబోతు జిప్సీ) శక్కన్

5. సంచాలకుడు ఇస్లాం సంస్కృతి _ ధార్వాడ బ్రాహ్మణుడు.

6. శరీర నిర్మాణ శాస్త్రంలో ఆచార్యుడు _ మహమ్మదీయ కటిక వాడు.

(గ్రాంట్ వైద్యవిద్యా కళాశాల)

7. పర్యవేక్షకుడు ఎరవాడ కారాగరం _ ఘంటిచోర్

8. మద్యనిషేధ కార్యకర్తలు _ ధరాల (కైరాజిల్లా బల్ ) పంచ్ మహల్స్.

## VI

## హైకోర్టు దావా మీద ఒక నివేదక, 1935

ఎ. బి. (కులం తెలియని) తన తండ్రి నిద్రబోతుండగా ఘోరంగా హత్య చేశాడని నేరం మోపడమైంది. ముద్దాయికి వ్యతిరేకంగా న్యాయాధిపతి విషయ సంగ్రహం చేయగా న్యాయ నిర్ణయసంఘం (జ్యూరి) ముద్దాయి నేరం చేసినట్లు అభిప్రాయపడింది. తన నిర్ణయం తెలిపే ముందర న్యాయాధికారి ముద్దాయి తరఫు న్యాయవాది చెప్పుకునేదేమైనా ఉందా అని అడిగాడు. న్యాయవాది బోమాన్జీ తీర్పు ఒప్పుకుంటున్నానని కాని చట్టప్రకరం మరణశిక్ష వేయడం మాట అలా ఉంచి అసలు ఎటువంటి శిక్ష వేయడానికి వీలు లేదని చెప్పాడు. ఎందుకంటే ఈ సంవత్సరం ఇద్దరికి మరణశిక్ష కలుపుకుని ఏడుగురు తెలీలు దోషులుగా నిర్ణయించి శిక్ష వేశారు. ఇండియా ప్రభుత్వ చట్టం ప్రకారం తెలీలు తమ కోటా పూర్తి చేయగా మిగిలిన జాతులు/కులాలు తరువాతి శిక్షలు ఇంకా పొందలేదు. గణత వహించిన న్యాయాదీశుడు ముద్దాయి తరఫు న్యాయవాది వాదన ఒప్పుకొని నిందితుడ్ని విడుదల చేశాడు.

## VII

## ఇండియన్ డైరీ మెయిల్ 1938 ఒక వార్త

అన్నాజి రామచంద్ర (చిట్‌పవన్ బ్రాహ్మణుడు) తనకు దొరికిన వారి నల్లా కత్తితో పొడుస్తూ పూనా వీధుల్లో తిరుగుతూ కనిపించాడు. మెజిస్ట్రేటు ముందు హాజరు పరచినపుడు ఈ మధ్యనే అతన్ని పిచ్చాసుపత్రి నుంచి వదలి వేసినట్లు పోలీసులు చెప్పారు. అన్నాజి ప్రమాదకరమైన పిచ్చివాడు, మూడు సంవత్సరాలున్నట్లు ఆసుపత్రి కార్యనిర్వాహకుడు తన వాంగ్మూలంలో చెప్పారు. కాని చిట్‌పవన్‌లకు కోటా ఉంది. పైగా మిగిలిన జాతులకు/కులములకు చెందినవారు ఆ ఏడాది కోటా పూర్తి చేయలేదు. దానితో తను చిట్‌పవన్‌లకు పక్షపాతం చూపించకుండా అతనిని ఏమాత్రం (ఆసుపత్రిలో) ఉంచుకోలేక పోయాడు. కాబట్టి వైద్యశాఖ ఉత్తర్వు ప్రకారం అతనిని వదలివేశాడు. మెజిస్ట్రేటు అన్నాజి విడుదల ఉత్తర్వులు జారీచేశాడు.

ఫ్రెంచి వాళ్ళను, టర్కీలను, చైనీయులను అడిగి చూడాలి. అలా చేస్తే ఎలా ఉంటుందో దానిపై వారేం చెబుతారో తెలుసు కోవాలి. వారేం సమాధానం చెబుతారో ఎంత

---

## VIII

### (బొంబాయి రాష్ట్ర కారాగారాల పరిపాలన నివేదిక 1937 నుంచి ఒకభాగం)

ఎంతో జాగ్రత్త పడ్డప్పటికి కారాగరంలోని (ఖైదీల సంఖ్య) ప్రతి జాతి/కులానికి కేటాయించిన కోటాకు అనుగుణంగా లేదు. ఈ వ్యత్యాసాన్ని అవకతవకని సరిచేసే వుద్దేశంతో పర్యవక్షకుడు ప్రభుత్వ సూచనల కోసం అడిగారు.

ప్రభుత్వ తీర్మానం; ఇన్ స్పెక్టర్ జనరల్ విధినిర్వహణలో చూపిన కర్తవ్య లోపాన్ని ప్రభుత్వం తీవ్రంగా పరిగణిస్తుంది. ఆయా కారాగారాలకు కేటాయించిన కోటాను పూరించడానికి గాను వివిధ జాతుల/కులాల నుంచి వీలైనంత మందిని అదుపులోకి తీసుకోవడానికి కావలసిన తక్షణ చర్యలు చేపట్టాలి. అందుకు తగినంత మందిని పట్టుకో లేకపోతే సమాన సంఖ్యలో కారాగారాలలోని ఖైదీలను వదలివేసి సంఖ్య అలాగే ఉండేలా చూడాలి.

## IX

### ( విధాన సభ ఉత్తర్వులు-1940 )

శ్రీ చెన్నప్ప ఇలా అడిగారు "పాలీ ఎమ్. ఏ. పరీక్షరాసిన విద్యార్థుల జాబితాలో మాంగ్-గరూచి అభ్యర్థుల సంఖ్య సరైన కోటా ప్రకారం లేదన్న విషయాన్ని ప్రభుత్వ గమనికలోకి వచ్చిందా?

గౌ. దాము ప్రాప్ (విద్యామంత్రి) : మాంగ్-గరూచి అభ్యర్థులెవ్వరూ పరీక్షకు కట్టలేదని విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు నివేదించారు.

చెన్నప్ప : మాంగ్ గరూచి అభ్యర్థి దొరికే వరకు పరీక్ష ఆపడానికి ప్రభుత్వం సుముఖంగా వుందా? ప్రభుత్వ ఉత్తర్వులను విశ్వవిద్యాలయం ధిక్కరిస్తే విశ్వవిద్యాలయానికి ఇచ్చే ధనసహాయాన్ని ఆపివేసి విశ్వవిద్యాలయానికి ఆపివేసి విశ్వవిద్యాలయ చట్టాన్ని సవరించడానికి తయారుగా వుందా?
గౌ.మంత్రి: సలహాను సముఖంగా పరిశీలించడానికి ప్రభుత్వం సిద్ధంగా వుంది. (హర్షం).

## X

### ( ది టైమ్స్ ఆఫ్ ఇండియానుండి ఒక వార్త, 1942 )

శస్త్ర చికిత్సానంతరం జి. టి హాస్పటల్ బొంబాయిలో రాంజీసోను మరణం విషయంలో దర్యాప్తు చెయ్యటానికి పట్టణ దుర్మరణ విచారణాధికారి (కారోనర్) శ్రీ.... ఒక సాయంత్రం హటాత్తుగా పిలిపించారు డా. కాము పాండే (కులం. మంగలి) తను శస్త్ర చికిత్స చేసినట్లు వాంగ్మూలం యిచ్చారు. పొత్తి కడుపులో వున్న కురుపు కోద్దామని అనుకున్నాడు. కాని ఆ కత్తి గుండెల్లో గుచ్చుకొని అరోగి మరణించాడు. ఇది వరకెప్పుడైనా యిటువంటి శస్త్ర చికిత్సకు హాజరా అన్నప్రశ్నకు కాము తన కులం వంశపారంపర్య కారణంగా ప్రిన్సిపల్ సర్జన్ గా ఒక రోజు ముందే నియమించాబడ్డానని చెప్పారు. మంగలి కత్తి తప్పించి తనిదివరకెప్పుడూ శస్త్ర పరికరాన్ని వాడ లేదని చెప్పారు. దుస్సాహసం వల్ల చావు సంభవించిందని న్యాయ నిర్ణాయక సంఘం (జూరీ) తన నిర్ణయం ప్రకటించింది.

అవివేకైనా ఊహించగలడు. అలాంటి ఫలితాన్ని కల్గించే సిద్ధాంతం అపవాద రహితంగా, నిరర్థకమైందని అందరూ గుర్తిస్తారని నా నమ్మకం. పాలకవర్గానికి బానిసవర్గానికి ముందు చెప్పిన దేశాలలో లాగానే అంతరాలు పాతుకు పోయిన ఇండియాలో ఇలాంటి సిద్ధాంతాన్ని ఎలా అంగీకరిస్తాం? కాని వాస్తవమేమిటంటే స్వప్రయోజన దృష్టితో కళ్ళు మూసుకుపోయిన పాలకవర్గం శుద్ధ సామర్థ్యవాదం ఎంత నిరర్థకమైందన్న విషయంగా పట్టించుకోదు. తనభిప్రాయాన్ని చట్టంగా మార్చుకోగల శక్తి ఉందని దానికి తెలుసు. అందుకే ఈ అంశాన్ని బానిసవర్గాలు ఏం చెప్పినా అవి పట్టించుకోదు.

పాలకవర్గం తాను ఏ దారుల్లో ఏ పద్ధతులద్వారా ఆధిక్యము సంపాదించు కుంటుందో పట్టించుకోదు. అలా చేయాల్సిన ఆవశ్యకతను అది గుర్తించదు. దీనికొంత కారణం అది తనలోని మెరిట్‌కు దెబ్బ అని అనుకోవడం. మరి కొంత కారణం: ఎలా వస్తేనేమిటి? బానిసవర్గాలమీద తన పాలసీని విధించగలుగుతుంది కదా! అంత మాత్రం చాలనుకోవటం మరి ఇలా పాలకవర్గం తానెలా అధికారాన్ని సంపాదించానన్న విషయాన్ని ఆలోచించినపుడు దానికేం కనిపిస్తుంది? ఎంత పట్టుకొని ఈనాడు కుల నేపథ్యంలో ఏ రిజర్వేషన్లను వ్యతిరేకిస్తున్నారో అదే రిజర్వేషన్ పద్ధతితో ఆనాడు అధికారాన్ని పొందారు. చాలా మందికి ఈ వాక్యంలోని సత్యాన్ని గుర్తించటానికి కష్టం కావచ్చు. ఈ విషయంలో సందేహం వున్నవారెవరైనా, హిందువుల బైబిల్ అయిన మనుస్మృతిని చదవండి చాలు. అందులో ఏముంది? అందులో పాలకవర్గంలో ప్రధానులు, మార్గనిర్దేశకులు అయి, బ్రాహ్మణుల రాజ్యాధికారాన్ని - తమ మేధతో కాదు ఎందుకంటే మేధ ఎవరి గుత్తాధికారములోనూ వుండదు - కేవలం కుల ప్రాతిపదిక మీదనే పొందారన్న విషయం తెలిసి దిగ్భ్రమ చెందుతాడు. మనుస్మృతి నిర్దేశాల ప్రకారం పురోహితుడు, గురువు, ప్రధానమంత్రి, న్యాయాధికారి, మంత్రులు ఇన్ని ఉద్యోగాలు బ్రాహ్మణుల కోసమే ఉద్దేశింపబడ్డాయి. చట్టం ప్రకారం నిర్దేశించకపోయినా సర్వసైన్యాధ్యక్ష పదవికికూడా బ్రాహ్మణులే యోగ్యులనిసిఫార్సు కూడా చేశారు. ప్రధానమైన కీలక ఉద్యోగాలు ఎప్పుడు బ్రాహ్మణులకు రిజర్వ్ చేయబడ్డాయో అపుడు మంత్రిత్వ శాఖలోని ఉద్యోగాలు కూడా బ్రాహ్మణులకే రిజర్వ్ అవుతాయి . ఇంతేకాదు. బ్రాహ్మణుడు తన వర్గానికి లాభం, బలం చేకూర్చే పదవులు చేజిక్కించు కోవటంతో సంతోషపడలేదు. కేవలం రిజర్వేషన్ చాలవని అతనికి తెలుసు. అ బ్రాహ్మణకులాలనుంచి అదే విద్యార్హతలున్న వారు ఉద్యోగాలకు వచ్చి గొడవచేసి రిజర్వేషన్లను తుడిచి పెట్టకుండా వుండడానికి, అలాంటివారిని పైకి రానీకుండా అడ్డుకోవాలి. రాజ్యంలో పాలనా సంబంధమైన ఉద్యోగాల్ని బ్రాహ్మణుల కోసం కేటాయించడమే కాకుండా, చదువునంతా వారికి గుత్తాధిపత్యమిస్తూ వారికే అవకాశమిస్తూ

చట్టం చేయబడింది. ఇంతకుముందే చెప్పినట్లు శూద్రులు అంటే హిందూసమాజంలోని నిమ్నవర్గాలవారు, చదువుకోవటం నేరంగా పరిగణింపబడింది. దీన్ని అతిక్రమించి చదివినవారి క్రూరమైన, అమానుషమైన శిక్షలు వేసేవారు. నాలుకను కత్తిరించటమో, చెవుల్లో కాచిన సీసము పోయటమో. ఈ రిజర్వేషన్లు బ్రిటిష్ పాలనలో లేవన్నది సత్యమే. మనువు ఇచ్చిన రిజర్వేషన్లు లేక పోవుట కాని, ఆ చట్టాల కొనసాగింపు వల్ల వచ్చిన అవకాశాలు, లాభాలు మాత్రం ఈనాటికి బ్రాహ్మణులకు అలాగే మిగిలాయి. రిజర్వేషన్లు కోరుతున్నప్పుడు ఈ బానిసవర్గాలు క్రొత్తగా లేని విశేషంగా కాని ఏమీ అడగటం లేదు. రిజర్వేషన్ కోసం డిమాండ్ చేయటమంటే దౌర్జన్యకరంగా ప్రవర్తించేలా పాలకవర్గం వారి కులతత్వానికి వ్యతిరేకంగా రక్షణకోసం డిమాండే తప్ప మరొకటి కాదు. పాలకవర్గం ప్రతి రంగంలోను బానిసవర్గాన్ని అధిగమించాలని ప్రయత్నిస్తుంది. అలాకాకుండా మునుపు బ్రాహ్మణులు తమ వైభవం కోసం శూద్రులపై ఆధిక్యత కొనసాగటంకోసం విధించిన అతి నీచమైన నియమాలు విధించకుండా అంటే పాలకవర్గం వారు ఆస్తిని సంపాదించటం శిక్షార్హం వంటి అగౌరకరనియమాలు పెట్టకుండా తమ రక్షణను తాము కోరుతున్నారు.

కేవలం నైపుణ్య వాదాన్ని ప్రజా సంక్షేమం దృష్టిలో కూడా ఆలోచిద్దాం. ఐర్లండంలో కామన్స్ సభలో మాట్లాడుతూ ఒక వివాదంలో కాంప్ బెల్ బానర్ మాన్, మంచి ప్రభుత్వం కంటే స్వపరిపాలన మేలన్నారు. ఈ ప్రకటన ఇండియాలో మిక్కిలి ప్రచారాన్ని పొందింది. ఇది ఒక మూల సూత్రమయి పోయింది. దానంతట చూస్తే ఈ వాక్యం చాలా నిరర్థకం. కాంప్ బెల్ బానర్ మాన్ స్వపరిపాలనకు మంచి ప్రభుత్వానికి మధ్య తేడాను కాదు పరిశీలించింది. ఆయన పరిశీలించింది స్వపరిపాలనకు సమర్థవంతమైన, (అతని ప్రతివాది లార్డ్ శాలిస్ బరీ చెప్పేట్టుగా) ధృడమైన ప్రభుత్వానికి నడుమ తేడాను పరిశీలించాడు. స్వయంపాలన మంచి ప్రభుత్వంగా ఉండాలనటంలో వివాదం లేదు. లేకపోతే దాన్నుంచుకొని లాభంలేదు. మంచి ప్రభుత్వాన్ని ఎలా పొందగలమన్నది ప్రశ్న. కొంతమందేమనుకుంటారంటే స్వపరిపాలన సార్వభౌమాధికారాన్ని కలిగింది, కాబట్టి అది మంచి ప్రభుత్వమే కాబోతుందని. అస్వాతంత్ర్యంలో ఉన్న దేశాలలోని చాలామంది ప్రజలు భాధపడే భ్రమలలో ఇది ఒకటి. అలాంటి భ్రమలు ఉన్నవారు ఈ అంశాన్ని గురించి ప్రొఫెసర్ డైసీ వ్రాసినదాన్ని చదవటం మంచిది. సార్వభౌమాధి కారాలున్న వ్యక్తులు, సంస్థలు ఏంచేయ గలరన్న ప్రశ్నను చర్చిస్తూ ఆయన రెండు అంశాలను గమనించారు;- "సార్వభౌమ అధికారమున్న ఎవరైనా సరే ముఖ్యంగా పార్లమెంట్ అయినా సరే అధికారాన్ని నిజంగా ప్రయోగించటంలో రెండు నియమాలు పని చేస్తుంటాయి. ఒకటి బాహ్యమైన నియమం, రెండవది అంతర్గతమైన నియమం."

"సార్వభౌమాధికారాన్ని అతని ప్రజలు కాని లేదా వారిలో చాలా మంది కాని మన్నించకపోవటానికి, ధిక్కరించటానికి ఉన్న అవకాశం, సంభవత బాహ్యానియమం: నియంతృత్వ సామ్రాజ్యంలో కూడా ఈ నియమం పనిచేస్తూ ఉంటుంది. ఒక రోమన్ చక్రవర్తి కాని ఫ్రెంచ్ రాజు కాని 18 వ శతాబ్దంలో ( నేటి రష్యన్ జార్ లాగా) నిజానికి సార్వభౌముడే, ఆ పదానికున్న చట్టబద్ధమైన అర్థంలో. అతనికి నిరంకుశమైన శాసనాధికారం వుండేది. అతను చేసిన ఏచట్టమైనా తప్పనిసరిగా అమలు కాలసిందే. ఆ సామ్రాజ్యంతో కాని రాజ్యంలో కాని ఆ చట్టాన్ని రద్దు చేసే శక్తి ఎవరికీ ఉండేది కాదు. కాని యింత నిరంకుశుడైన పాలకుడైనా ఏకాలంలోనైనా వాస్తవానికి చట్టాన్ని తన అభీష్టం మేరకు చేయగలిగేవారు కాదు. మార్చగలగే వారు కాదు.

నియంతకున్న అధికారం కూడా అతని ప్రజలో లేక అందులో కొంత భాగమో అతని ఆజ్ఞలను శిరసా వహించడానికి సంసిద్ధత చూపడంలోనే ఉంటుంది. ఈ సంసిద్దత వాస్తవానికి ఎప్పుడూ పరిమితంగానే ఉంటుంది. చరిత్రలో సుప్రసిద్ధమైన సంఘటనలు చూస్తే అర్థమౌతుంది. తొలి సీజర్లు ఎవరూ తమ అభీష్టం మేరకు రోమన్ ప్రపంచానికి చెందిన మౌలిక వ్యవస్థల్ని వ్యత్యస్థం చేయ లేకపోయారు. మహ్మమ్మదీయ మతాన్ని సుల్తాన్ నిషేధించలేక పోయాడు. 14వ లూయి తనకున్న అధికారబలంతో నాంతెస్ శాసనాన్ని రద్దు చేయగలిగిన ప్రొటెస్టెంట్ మత ఆధిపత్యాన్ని స్థాపించలేక పోయాడు, ఈ కారణంగానే రెండవ జేమ్స్ రోమన్ కేథలిజంను స్థాపించలేక పోయాడు. నియంత విషయం, రాజ్యాంగ సభ విషయం ఎలాగో, పార్లమెంట్ సార్వభౌమాధి కార విషయం కూడా అంతే. వారికి అన్నివైపుల ప్రజలనుంచి ఆటంకాలు రావటానికి వీలుంది. పార్లమెంట్ వలసరాజ్యాల మీద చట్టబద్దంగానే పన్ను విధించవచ్చు. అలాగే చట్ట వ్యతిరేకం కాకుండా సింహాసనానికి వారసత్వాన్ని మార్చవచ్చు,లేదా రాచరికాన్ని రద్దు చేయవచ్చు. కాని ఈనాడు ప్రపంచమున్న స్థితిలో బ్రిటిష్ పార్లమెంట్పై ప్రతి విషయంలోను విపరీతమైన ఆటంకాలు రావటానికవకాశం ఉంది. అది ఎంత చట్టబద్ధమైందన్నా కూడా. కనుక పార్లమెంటు అధికారానికి ఇది అతీతమైనది.

* * *

"సార్వభౌమ అధికారానికి అంతరిక నియమం ఉంది. ప్రతి నియంత తన స్వభావానికనుగుణంగా అధికారాన్ని చెలాయిస్తాడు. ఆ స్వభావం అతను జీవిస్తున్న పరిస్థితులచేత ప్రభావిత మౌతుంది. ఆ కాలంలోవున్న నైతిక విలువలు, అతని సమాజం కూడా పనిచేస్తాయి. సుల్తాన్ మహమ్మదీయ జగత్తులోని మతాన్ని మార్చజాలడు. ఓ సమయం అలా చేసినా మహ్మదీయ మత గురువు తన మతాన్ని వదులు కుంటాడన్నది

నమ్మశక్యం కాని విషయం. అంటే సుల్తాన్ అధికారం మీద బాహ్యానియమం ఎంత ప్రధానమో అంతర్నియమం కూడా అంతే బలవత్తరమైందని అర్థం. ప్రజలు పోప్‌ను ఈ సంస్కరణ ఎందుకు చేయలేదు? వంటి వ్యర్థ ప్రశ్నలు అప్పుడప్పుడు అడుగుతూ వుంటారు. దీనికి నిజమైన సమాధానం ఏమిటంటే పోప్ అయ్యేది విప్లవవాది వంటి మనిషికాదు. పోప్ అయినవాడు విప్లవవాదిగా ఉండగోరడు."

నేనింతకుముందే చెప్పినట్లుగా బానిసవర్గాలు తమ దేశం స్వతంత్రమైన సార్వభౌమాధికారం ఉన్న రాజ్యమైందన్న వాస్తవంతో తృప్తి పడితేచాలదు. ఇంకొంచెం ముందుకు పోయి రాజ్యాన్ని నడిపే సాధనాలు ఎవరౌతారో లేదా పాలకవర్గం ఎవరౌతారో తెలుసుకోవటం చాలా అవసరం. డైసీ గమనించిన అంశాలు, వాటిలో అంతర్లీనమయ్యాయి. గంభీర సత్యం విషయంగా ఎవరికీ సమస్య లేదు కాని ఒక అంశం చేర్చుకోవాలి. అదేమిటంటే మంచి ప్రభుత్వానికి పాలకవర్గానికి ఉన్న సామర్థ్యం నైపుణ్యం మాత్రమే చాలదని. పాలకవర్గంలో ఉండాల్సిన గుణమేమిటంటే ఇతరులకు మంచివి చేయాలన్న సంకల్పం-డైసీ భాషలో చెబితే స్వార్థపూరితమైన తన వర్గ ప్రయోజనాలనబడే అంతరిక నియమాలనుంచి బయట పడాలి. సామర్థ్యము, స్వార్థ పూరితమైన వర్గ ప్రయోజనాలు కలిస్తే మంచి ప్రభుత్వం పుట్టదు సరికదా, అది బానిసవర్గాలను తొక్కిపారేయటానికి పనికివచ్చే యంత్రం మాత్రమే అవుతుంది. రాజ్యపాలనకు కావాల్సిన సహకార వర్గాన్ని ఏర్పరచు కోవటంలో కూడా వర్గ పక్షపాతాన్ని తక్కువగా అంచనా వేయలేం. మంచి ప్రభుత్వం రావాలంటే మౌలికంగా ఇది ఉండాలి. ప్రజాస్వామ్యవాదులుగా పరిగణించుకునే వారు కూడా ఈ వాస్తవానికున్న ప్రాధాన్యాన్ని సాధారణంగా గుర్తించాలి. దీన్ని మొదట గుర్తించిన వాడు కార్ల్ మార్క్స్ ప్యారిస్ కమ్యూన్ పాలన విషయంలో దీనిని గుర్తించాడు. ఈనాడు సోవియట్ రష్యాలో ప్రభుత్వానికి ప్రాతిపదిక ఇదేనని చెప్పాల్సిన అవసరం లేదు. బానిసవర్గాలు ఇండియాలో రిజర్వేషన్ కోసం చేస్తున్న డిమాండు డైసీ సూచించినా, మార్క్స్ వాదించినా రష్యా అమలు చేసినా ప్రతిపాదనల ఆధారంగానే ఉన్నాయి. బానిసవర్గానికి చెందిన వారే ఆవర్గ ఆశయాలను కాపాడుతారని నమ్మగలం. ఈ అంశాన్ని పరిగణలోనికి తీసుకోవడం చాలా ముఖ్యం. నైపుణ్య సూత్రం దీన్ని అధిగమించడానికి వీల్లేదు. ఈనాడు ఇండియాలోని పాలకవర్గం నైపుణ్యం కేవలం నైపుణ్యం మాత్రమే కావాలని ఎందుకు పట్టుబడుతుందంటే ప్రభుత పాలనా సహకారాన్ని మొత్తం గుత్తకు తీసుకోవాలన్న స్వార్థపూరితమైన ఉద్దేశం వల్లనే.

# IX

ఇప్పుడు చర్చించ బోయే విషయాలు చాలా సుదీర్ఘంగా ఉండటం వల్ల విదేశీయుడు నేను చెప్పదలచుకున్న ముఖ్యాంశాలను పోగొట్టుకునే అవకాశం వుంది. అందువల్ల వీటిని నొక్కి చెప్పటం కోసం ఒక చోట చేర్చి చెబుతున్నాను.

ఇండియాలో ప్రజాస్వామ్యం స్థాపించాలని కోరుకునే వారు ఎదుర్కోవాల్సిన ప్రధాన సమస్యలు ఇవి 1. ఇండియాలో పాలకవర్గస్థాయి 2. పాలకవర్గానికి బానిసవర్గాలపట్ల ఉన్న ఉద్దేశాలు, ధ్యేయాలు 3. బానిసవర్గాలు రాజ్యాంగ భద్రతలకోసం చేస్తున్న డిమాండ్లలోని సామంజస్యం, 4 పాలకవర్గానికి కాంగ్రెస్‌తో ఉన్న సంబంధం.

మొదటి అంశానికి సంబంధించి ఇండియాలోని పాలకవర్గం ఇతర దేశాల్లోని పాలకవర్గాలకన్నా భిన్నమైందని ఒక వాదమున్నది. అంతేకాదు దీనిని అర్థం చేసుగోవడం సులభమైన విషయం కాదు. / బార్‌కు (-) హైపన్‌కు మధ్యనున్న తేడాని బహుశా సూచించవచ్చు. ఈ రెండింటి తేడాని గుర్తించని వారెవ్వరూ ఉండరు. బార్ గుర్తు విభజన చేస్తుంది. కలపదు. హైఫన్ ఈ రెండు పనులు చేస్తుంది. అది విభజనా చేస్తుంది కలుపుతుంది కూడా, ఇండియాలో పాలకవర్గాలు బానిసవర్గాలు బార్ చేత విభజింపబడ్డాయి. ఇతర దేశాల్లో వారి మధ్య హైఫన్ మాత్రమే వుంది. దీని ఫలితంగా ఏర్పడ్డ తేడా చాలా ముఖ్యమైంది. వేరే దేశాల్లో పరిపాలక వర్గం ఎప్పటి కప్పుడు ఆ వర్గానికి చెందక పోయినా ఆస్థాయిని అందుకొన్న వారిచేత పరిపుష్ట మవుతూవుంటుంది. అంటే వారు పాలకవర్గంలో చేరటానికవకాశం ఉందన్నమాట. అలా కాకుండా ఇండియాలో పాలక వర్గం ఇలా మూసుకు పోయిన పౌరసభ. అందులోనూ పాలకవర్గంలో జన్మనందని సభ్యుడుకాలేడు. ఇతర దేశాలలో పాలకవర్గం ఇలా మూసుకుపోక పోవటం వల్ల దానికి ఇతర వర్గాలకు నడుమ నిరంతర అంతర్సంపర్కం ఉంది. అనుచ్ఛ్యతా మానసికంగా పాలకవర్గం ఎక్కువ సమీకరణ మనస్తత్వాన్ని కలిగి వుంటుంది. దీనిచేత దాని నిర్మాణంలో కాని దృష్టిలో కాని, సాంఘిక తత్త్వంలో కాని తక్కువ వైరుధ్యం కనిపిస్తుంది. ఇంకో విధంగా చెబితే ఇండియాలో తప్ప ఇతర దేశాలలో పాలకవర్గం సంఘవ్యతిరేకమయింది కాదు. అసాంఘికం మాత్రమే. పాలకవర్గం ఇండియాలో బిగుసుకుపోయి ఒకముఠా కావడం వల్ల వారి సంప్రదాయం, సామాజిక తత్వం, సాంఘిక దృష్టి బానిసవర్గాల పట్ల వైరుధ్యంతో అలాగే కొనసాగుతూ వచ్చింది. వీటిలోతు కాని క్రమం కాని యజమాని - బానిసల భేదం కాని, ఉన్నవారికి లేనివారికి నడుమ తేడా కాని అటు భావంలోనూ ఇటు రూపంలోను ఎలాంటి మార్పు పొందక కొనసాగుతూ ఉంది. అందుచేత పాలకవర్గం అసాంఘికము మాత్రమే కాదు. పూర్తిగా సంఘవ్యతిరేకమే.

బానిసవర్గాలు రిజర్వేషన్ల కోసం ఎందుకు డిమాండ్ చేస్తున్నాయంటే ప్రభుత్వ రూపకల్పనలో వారికున్న నియంత్రణాధికారంపై ఒక పరిమితిని విధించటం కోసమే. పాలకవర్గాలు రిజర్వేషన్లకు ఒక చెడ్డ పేరు పెట్టి - అపకీర్తి పాలుచేసి వాటికోసం పట్టుబట్టి కూర్చున్నవారిని ఉరితీయటానికి సిద్ధ పడుతోంది. రిజర్వేషన్లు అనబడేవి వాస్తవానికి అమెరికన్లు చెక్కులని బ్యాలెన్సులని ప్రతి రాజ్యాంగంలోనూ ఏవి ఉండాలంటాయో వాటికి రూపాంతరమే. ప్రజాస్వామ్య వ్యతిరేకులు ప్రజాస్వామ్యాన్ని ముంచివేయకుండా ఉండాలంటే వాటి లాగే ఇవికూడా అవసరం. రిజర్వేషన్లు చెక్కులు బ్యాలెన్స్‌ల కన్నా రూపంలో వేరని చెప్పినా వాటి స్వభావం ఏంమారదు. రెండు అంశాల ఆధారంగా చెక్కులు బ్యాలెన్సులు నిర్ధారింపబడతాయి. మొదటిది రాజకీయ రాజ్యాంగానికి, దేశంలోని సామాజిక సంస్థల మధ్య సమన్వయంతోనే ప్రజాస్వామ్యం వాస్తవిక మౌతుంది. భిన్న దేశాల సామాజిక సంస్థలు స్వరూపంలో భిన్నంగా ఉంటాయి. కాబట్టి ఆయారాజకీయ రాజ్యాంగంలోనూ చెక్కులు బ్యాలెన్సులూ కూడామారి తీరాలి.

ఉదా: ఒక దేశంలో కులవ్యవస్థ ప్రముఖంగా వుంటే అక్కడ చెక్కులు బ్యాలెన్సులు ఒక విధంగా ఉంటాయి. ఒక దేశంలో సాంఘిక ప్రజాస్వామ్య భావన సర్వత్రా వ్యాపించి ఉంటే అక్కడ ఇది మరో రకంగా ఉంటుంది.

ఇక రెండవ అంశం: పాలకవర్గం తనచేతిలోని బలాధిక్యంచేత బానిసవర్గాలను ఇంకా అధోలోకాలకు తొక్కేయకుండా కాపాడటానికి గట్టి ఆధారభూమి ఏర్పరచాల్సిన అవసరం ఉంది. కొన్ని దేశాల్లో అందరికి వోటు హక్కు ఉండటం ఒకటే - బానిసవర్గాలు తమను తాము పాలకవర్గంనుంచి రక్షించు కోవడానికి చాలి ఉంటుంది. కాని ఇండియాలో ఇతర దేశాలలో లాగా కాకుండా పాలకవర్గ సర్వ సమర్థత, సర్వవ్యాపకత కలిగింది. కావటం చేత వోటుహక్కు కంటే అధనంగా కొన్ని నివారణ మార్గాలు కలిగిస్తేనే బానిసవర్గాలు పాలకవర్గాల దోపిడీనుంచి తమనుతాము రక్షించుకోగలుగుతాయి. ఈ అంశాల నేపథ్యంలో చూస్తే అమెరికన్ రాజ్యాంగంలోని చెక్‌లు బ్యాలెన్సుల కన్నా రూపంలో కొద్దిగా భిన్నంగా ఉన్నా స్వభావంలో ఇవి అవే అని విదేశీయుడు దానిమీద వ్యతిరేకభావం ఏర్పరచుకోవడం కంటే ముందే తెలుసుకోవడం మంచిది. చివరి అంశానికి సంబంధించిన వాస్తవాలు అంటే కాంగ్రెసు పాలకవర్గానికి ఉండే సంబంధం పూర్తిగా వివరించాను. ఈవివరాలనుబట్టి విదేశీయులు ఈ రెండింటి మధ్య ఎంత గాఢమైన సంబంధం ఉందో చూడవచ్చు. దీనిని బట్టి పాలకవర్గం కాంగ్రెస్ ఉద్యమమనే సైనికదళాన్ని ముందు ఉంచుకొని తాను వెనుక ఉండి ప్రతీ దాన్ని ప్రతీ వ్యక్తిని కాంగ్రెస్ పరిధిలోకి రావాలని ఎందుకు ప్రయత్నిస్తుందో అర్థం చేసుకోవచ్చు. వర్గ దృక్పథంమీద వర్గ వైరుధ్యాల మీద ఆధారపడ్డ రాజకీయ ప్రచారం తమకే చావుదెబ్బ కొడుతుందని; పాలకవర్గానికి బాగాతెలుసు.

అందువల్ల బానిసవర్గాలను పక్కదారిని పట్టించి దానిని మోసగించాలంటే జాతీయత జాతీయసమైఖ్యత అనే భావాలు దెబ్బతింటాయి. అది కాంగ్రెస్‌కి ఎందుకు తగులుకొని ఉంటుందంటే తన వర్గ ఆశయాలు బాగా కాపాడేది, కాంగ్రెస్ వర్గ సంస్థలకంటే కాంగ్రెస్ సంస్థ ఒక్కటే నని దానికి తెలుసు. కాబట్టి ధనిక పేదలు బ్రాహ్మణ అబ్రాహ్మణులు, భూస్వాములు కెనెంటులు అప్పు ఇచ్చేవాడు పుచ్చుకొనేవాడు ఇలాంటి వైరుధ్యాల గురించి మాట్లాడే రంగస్థలం ఏదైనా ఉంటే దాన్ని బొత్తిగా నామరూపాలు లేకుండా చేయవచ్చు. కాంగ్రెస్ అయితే జాతీయసమైఖ్యతను తప్పకుండా బోధిస్తుంది. పాలకవర్గాలకు కావలసిందదే. దాని భద్రత దీనిమీదే ఆధారపడి ఉంది. అంతేకాకుండా కాంగ్రెస్ తన రంగస్థలంమీద జాతీయతకు వ్యతిరేకంగా ఉన్న ఈ సిద్ధాంతాలను ప్రచారం చేయనివ్వదు. విదేశీయులు ఈ అంశాలను మనస్సులో పెట్టుకొంటే ఇండియాలోని కాంగ్రెస్ గుర్తు ఉన్న స్వరాజ్యం చేత ఎందుకు ఆకర్షింపబడటం లేదో అర్థం చేసుకోగలుగుతారు. కాగ్రెస్ ముద్ర ఉన్న స్వరాజ్యం వారికేమి మేలుచేసింది. ఆ స్వరాజ్యంలో వారి ప్రగతి నిజంగా శూన్యమే అని వారికి తెలుసు. ఈ ముద్ర కలిగిన స్వరాజ్యం గాంధీగారి కలలపంట అవుతుంది. లేదంటే పాలకవర్గం వారు దానినుంచి ఏం తయారు చేయాలనుకుంటున్నారో అర్థమవుతుంది. మొదటి దైతే చరఖావ్యాప్తి, గ్రామీణ పరిశ్రమలో కులధర్మాల పాలనా బ్రహ్మచర్యం, ఆవును పూజించటం లాంటివి జరగబడతాయి. పాలకవర్గానికి వదలిపెడితే స్వరాజ్యం ద్వారా వాళ్ళు సాధించే మొదటి అంశం బానిసవర్గాలకు విద్య ఉద్యోగరంగాలలో బ్రిటిష్‌వారు కల్పించిన ప్రోత్సాహాలను తీసివేయటం.

కొంతమంది స్వరాజ్యం సిద్ధిస్తే కెనెన్సీ చట్టాలు, కార్మిక చట్టం నిర్బంధ ప్రాథమిక విద్య మద్యపాన నిషేధం రోడ్లు కాలువలు నిర్మాణం కరెన్సీ అభివృద్ధి తూకాలు. కొలతలు క్రమబద్ధత, ఆసుపత్రులు బానిసవర్గాలకోసం ఇతర అభివృద్ధి పథకాలు రాబోతాయని విశ్వశిస్తున్నారు. కానీ ఈ నమ్మకాలు గట్టి పునాదిని కలిగేవిగా నాకెందుకో అనిపించడం లేదు. కాంగ్రెస్ వాళ్ళు ఇలాంటి కార్యాచరణ పథకాలను ఎందుకు ప్రకటిస్తున్నారంటే బ్రిటిష్ బ్యూరోక్రసీ కన్నా కాంగ్రెస్ మేలని చూపటానికి. ఒకసారి ఈ బ్యూరోక్రసీని ఎత్తివేస్తూ ఆతర్వాత జనసామాన్యానికి మేలు చేకూర్చడానికి ప్రేరణ ఉంటుంది. ఇదే ప్రశ్న: అసలు ఇవన్నీ ఫలిస్తాయన్న విషయంలోను నాకు సందేహాలున్నాయి. రెండవది ఇందులో చెప్పుకోదగ్గ గొప్ప ఏమీ లేదు. ఈనాటి ప్రపంచంలో ఏ పాలకవర్గమైనా సమాజాన్ని నాగరిక స్థితిలో ఉంచడానికి అవసరమైన సంస్కరణలను చేపట్టక తప్పదు. ఇదిలా ఉంటే స్వరాజ్యానికి ఉద్దేశం, ధ్యేయము సంఘాన్ని ఉన్నత స్థితికి తీసుకుపోవడమేనా? బానిసవర్గాలను గురించి బాగా తెలిసి నా కనిపించేదేమిటంటే ఇది బానిసవర్గాల లోపం దోషం కాదు. వాళ్ళు "సాధువులయిన వాళ్ళని సంతోషపడుదురు

గాక అనే ప్రభోదాన్ని అనుసరించాలని కోరుకుంటారని నేననుకుంటాను. దుష్టమైన సాంఘిక ధర్మం చేత వాళ్ళు పొందిన అవమానం, ఆగ్రహం వీటి ముందు వారి లేమి దారిద్ర్యాలు ఏ మాత్రం కావు. వారికి కావలసింది రొట్టె కాదు. గౌరవం, పాలకవర్గం అదృశ్యమై బానిసవర్గాలపై పట్టు కోల్పోయినప్పుడే ఇది సాధ్యమవుతుంది. బానిసవర్గాలకు ఈ సంస్కరణ చేపడతారా? అన్నది ప్రశ్న కాదు. ప్రశ్న ఏమిటంటే రాజ్య యంత్రాంగాన్ని వశపరుచుకున్న తరువాత పాలకవర్గ సంఘ నిర్మాణాన్ని సంస్కరించే కార్యక్రమాలను చేపడుతుందా? దానిచేత పాలకవర్గం నశించాలి. అది సాంఘికోన్నతీకరణం కన్నా భిన్నంగా ఉండాలి. దీనికి సమాధానం ఇండియాకు రాయబడే భ్యవిష్యత్ రాజ్యాంగంలో బానిసవర్గాల రక్షణ కోసం చట్టపరమైన భద్రతలు ఉంటాయా లేవా? అన్నది. అందులో రాజకీయ భద్రకుల ఉంటె పాలకవర్గాల ప్రభావాన్ని బానిసవర్గాలు తగ్గించడానికి వీలుంటుంది. ఈ రాజకీయ భద్రతలు లేకపోతే భవిష్యత్తులో కూడా పాలకవర్గం భానిసవర్గాలపై తన ఆధిక్యాన్ని కొనసాగిస్తూనే ఉంటుంది. ఇది సమస్య అయినపుడు కాంగ్రెస్ విరివిగా ప్రచారం చేసిన "ప్రాతినిథ్య స్వభావం" అన్నది చాలా అసమన్వితమైనదని.విదేశీయులు గుర్తించాలి. కాంగ్రెస్ ఒక ప్రతినిధి వ్యవస్థే కావచ్చు. ఇది స్వతంత్రం కోసం పోరాటం నిర్వహిస్తున్న సంస్థయే కావచ్చు. కానీ ఈ విషయాలకు సమస్య పరిష్కారంతో ఏ సంబంధం లేదు. ప్రజాస్వామ్యాన్ని నిజంగా ప్రేమించేవారు కాంగ్రెస్‌తో స్నేహం చేసే ముందు దాని రాజ్యాంగ ముసాయిదా ప్రతిని సమర్పించమని చెప్పాలి. అందులో నిర్ద్వంద్వంగా బానిసవర్గాల బ్రతుకుకు రక్షణకు జీవనబద్ధతకు స్వేచ్ఛకు సుఖాన్వేషణకు అనుకూలాలు ఉన్నాయా లేదా అన్నది తెలుసుకోవాలి.

## X

భారతీయ రాజకీయాలలో ఆసక్తి చూపే విదేశీయులు 2 రకాలుగా ఉంటారు-మొదటి తరగతికి చెందినవారు స్వల్పకాలం ఇండియాలో తిరిగివెళ్ళే యాత్రికులు-వారికి భారతీయ రాజకీయ సమస్యలలోతుల పరిజ్ఞానం ఉండదు. ఇది ఉంటేనే ఈ సమస్యల పట్ల భిన్నపక్షాలు ఎందుకిలా ప్రవర్తిస్తున్నాయి అనే విషయం పట్ల నిక్కచ్చితంగా అభిప్రాయాన్ని చెప్పగలుగుతారు. రెండవ తరగతి వారు ప్రజాస్వామ్య పౌరభావాలను ప్రచారంచేసే నాయకులైనవారు. అమెరికాలో లూయీ ఫిషర్, క్లిన్సీ మార్టిన్, బ్రైల్స్‌ఫర్డ్, లాస్కి మొదలైనవారు ఇలాంటివారు. వీరి సాధన జ్ఞానాల విషయాలలో ఎవరికి విప్రతిపత్తి లేదు. ఇప్పుడు చెప్పబోయే విషయం విదేశీ ప్రయాణికుల యాత్రికుల పొరబాటు భావాలను సందిద్దడానికి కోసమే అయితే నాకేమంత బాధగా వుండేదికాదు. కాని

దురదృష్టవశంగా ఇదే పక్షపాతం రెండవ తరగతికి చెందిన విదేశీయుల్లో కూడా వుంది. యాత్రికుల్లాంటి విదేశీయులుండి వారికి భారతీయ రాజకీయ రహస్యాలు తెలియకుండానే వారు నిష్కారణంగా ఏ ఆధారమూ లేకుండానే కాంగ్రెస్‌కు మద్దతిస్తే అదెలా ఉంటుందంటే పిర్విర్‌శ్యామ్ వెల్లర్‌తో చెప్పినట్టు పదిలో పదకొండుగా పెద్దగుంపులో గోవిందా అని అరవటం అవుతుంది. దిన్ని మనం సులభంగా అర్థంచేసుకోవచ్చు. కాని చాలా బాధ పడుతున్న అంశమేమిటంటే బ్రిటిష్ లేబర్ పార్టీనాయకులు యూరోప్ అమెరికాలకు చెందిన విప్లవ వామపక్షాల అధిపతులైన లాస్కి, కింగ్స్లే మార్టిన్, బ్రైమ్‌స్వర్ద్ అమెరికాలోని నేషన్ వంటి పత్రికా సంపాదకులు ఇంగ్లాండులోను ఇతర ప్రపంచంలోను సాగుతుఉన్న దళితోద్యమ సమర్థకులైన న్యూస్టేట్స్‌మన్ వంటి పత్రికాధిపతులు వంటివారు, కూడా కాంగ్రెస్‌కు ఎలా మద్దతు నిస్తున్నారో అర్థం కావటంలేదు. వారికి కాంగ్రెస్ అంటే పాలకవర్గమని, పాలకవర్గమంటే బ్రాహ్మణ వైశ్య సంయోగమని తెలీదా? కాంగ్రెస్‌లోకి లాగబడుతున్న జనసామాన్యం మకాంవెంబడి తిరిగే మనుష్యులే తప్ప వారికి కాంగ్రెస్ పాలసీ రచనతో ఏమైనా సంబంధం వుందా? సుల్తాన్ ఇస్లాంని, పోప్ కాథలిక్ మతాన్ని ఎందుకు రద్దు చేయలేదో అదేకారణం చేత ఇండియా పాలకవర్గం శూద్రులను అస్పృశ్యులను అణగద్రొక్కి అగౌరవపరచటమే రాజ్యా పరమ ధర్మమని బోధించే బ్రాహణులే పాలకవర్గంగా ఉన్నంతకాలం బ్రాహ్మణ తత్వాన్ని రద్దు చేయబోతుందని. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాతకూడా అదేరాజ ధర్మంగా ఉండబోతుందని ఎందుకు గుర్తించరు? ఇండియాలోని పాలకవర్గం భారతీయులలో ఒక భాగం కాదని అది వారినుంచి దూరంగా ఉండటం మాత్రమే కాకుండా తాను ఏకాంతంగా ఉండిపోవటాన్నీ కోరుతుందని అలా కలుషితం కాకుండా వుంటారని ఈ దృష్టితో తనపరిధికి బైట ఉన్నవారిపట్ల ద్వేషాన్ని ప్రకటించే ఉద్దేశాలను ఆశయాలను ప్రతిబింబించే బ్రాహ్మణ వేదాంతాన్ని తనమనసులో తానే పెంచుకున్నదని ఈ కారణంచేత అవర్గానికి బానిసవర్గాల జనులలోని జీవిత ప్రేరణల పట్ల సానభూతి లేదని వారే దారినణగతొక్కారని వారి కోరికలతో కాని, బాధలతో కాని, ఆకాంక్షలతో కాని, ఆశలతో కాని వారికి ఏ సంబంధమూ లేదని మిాదుమిక్కిలి వారి ధ్యేయాలకు వీరు వ్యతిరేకమని, వారు విద్యలో అభివృద్ధి సాధించటం వీరు సహించరని ఉద్యోగాలలో కాని, వారి ఆత్మగౌరవంలో కాని, వారి ఆత్మాభిమానంలో కాని, ఏమాత్రం ఉన్నతిని రానివ్వకుండా ప్రతిక్షణం అడ్డు పడుతుందని విదేశీయులకు తెలియదా? భారతీయ స్వరాజ్యం వెనుక 60 మిలియన్ల అస్పృశ్యుల జీవితాలు ముడిపడి ఉన్నాయని వారికి తెలియదా?

బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకులు గాని కింగ్స్లే, మార్టిన్ బ్రెయిల్‌స్వర్ట్, లాస్కి తమరచనల ద్వారా దళిత ప్రజానీకానికి స్వేచ్ఛపట్ల ప్రజాస్వామ్యం పట్ల ఎంతో ఉత్తేజాన్ని

కలిగించినవారు. వారికి ఈ వాస్తవాలు తెలియవని చెప్పడం అసాధ్యం. కానీ వాళ్ళు ఇక్కడ ఇండియాను ప్రస్తావించినప్పుడల్లా వాళ్లు కాంగ్రెసును సమర్థిస్తారు. విప్లవ ప్రజాస్వామిక వాదులకు చాలా సంబంధం కలిగిన వారికి నచ్చేటువంటి సమస్యలపై వారు చాలా చాలా తక్కువగా మాట్లాడుతారు. వారు కేవలం కాంగ్రెస్ కార్యక్రమాలనే గమనించటం భారతీయ జాతీయ జీవనంలో ఇతర వర్గాలను సంపూర్ణంగా వదలి పెట్టడం గమనిస్తే వారు ఎంత ప్రక్క దారి పట్టారో తెలుస్తుంది. కాంగ్రెస్ నిజంగా రాజకీయ ప్రజాస్వామ్యం కోసమే పోరాడుతూ ఉంటే విదేశీయులు వారిని సమర్థించినా అర్థంచేసుకోవచ్చు. కానీ కాంగ్రెస్ అలా సమర్థిస్తుందా? కాంగ్రెస్ జాతీయ స్వేచ్ఛకోసం మాత్రమే పోరుడుతుంది తప్ప రాజకీయ ప్రజాస్వామ్యంలో దానికేమాత్రం ఆసక్తి లేదని తెలుసు. ఇండియాలో రాజకీయ ప్రజాస్వామ్యం కోసం పోరాడుతున్న పార్టీ కేవలం అస్పృశ్యుల పార్టీ ఒక్కటే. కాంగ్రెస్ స్వేచ్ఛ కోసం చేస్తున్న పోరాటంలో నెగ్గితే అది బలం, అధికారం ఉన్నవారు బలహీనులను దళితులను అణచివేయడానికి స్వేచ్ఛ అవుతుంది అన్నదే వారి భయం. అందుకే రాజ్యాంగ భద్రతల ద్వారా తమను తాము రక్షించుకోవాలని కోరుతున్నారు. ఈ విప్లవ నాయకులు సహాయం చేయాల్సింది వీళ్ళకు. కాని ఇన్నేళ్ళ బట్టి వీరి సహాయం కోసం, సానుభూతికోసం అస్పృశ్యులు నిష్ప్రయోజనంగా వేచియున్నారు. యూరోప్ అమెరికాలను ఈ విప్లవవాదులు వామపక్షీయులు కాంగ్రెస్ వెనుక ఈ శక్తులు పనిచేస్తున్నాయన్న విషయాన్ని తెలుసుకోవడానికి కూడా ప్రయత్నించలేదు.

తెలియక చేస్తున్నారా పట్టించుకోక చేస్తున్నారా? తెలియదు. కాని ఈ వామపక్షాలు, విప్లవ నాయకులు గట్టిగా ఏ ప్రశ్న లేకుండా పెట్టుబడిదారులు, భూస్వాములు, అప్పిచ్చేవారు, ప్రతీకారవాదులు నడుపుతున్న కాంగ్రెస్‌ను సమర్థిస్తున్నారు. కేవలం "స్వాతంత్రం కోసం పోరాటం" అనే అతిశయోక్తి పేర తమ కార్యక్రమాలను ప్రచారం చేసుకుంటుంది కాబట్టి, అన్ని స్వాతంత్ర్య పోరాటాలు ఒకే సమానమైన నైతిక పునాదులుగా ఆధారపడి వుండవచ్చు. ఎందుకంటే ఈ పోరాటం ఉద్దేశాలు ప్రయోజనాలు ఎప్పుడూ ఒకే లాగ ఉండవు కాబట్టి ఇంగ్లీషు చరిత్రలనుండి కొన్ని ఉదా.హరణలు చూద్దాం. జాన్ వ్యతిరేకంగా బ్యారెన్స్ చేసిన తిరుగుబాటు కూడా స్వతంత్రం కోసం పోరాటమే. దాని ఫలితంగా మాగ్నా కార్టా సిద్ధించింది. కాని ఏ ప్రజాస్వామిక వాదయిన ఇదే మద్ధతును 'లెవెలర్స్' తిరుగుబాటుకు కాని, రైతుల తిరుగుబాటుకు గాని ఇచ్చాడా? తార్కికంగా వాటిని కూడా స్వాతంత్రం కోసం పోరాటాలుగా చెప్పవచ్చుగా, ఇలా చేస్తే స్వాతంత్ర్యం కోసం చేస్తున్న ఒక అభద్రమైన ఆక్రందనకు ప్రతిస్పందిచటం అయిపోతుంది. అలాంటి అపరిపక్వ ప్రవర్తన:బ్రతికే స్వేచ్ఛకు, అణగద్రొక్కే స్వేచ్ఛకు మధ్యన భేదం తెలియని జనం పట్ల క్షమార్హం కావచ్చు కాని విప్లవవాదులు వామపక్షీయ, నేతలు అయిన శ్రీయుతులు

లాస్కి, కింగ్స్లీ మార్టిన్, బ్రెయిల్స్ఫర్డ్, లూయీషిషర్ ఇతర ప్రజాస్వామిక వాదుల పట్ల ఇది క్షంతవ్యం కాదు.

నిజమైన ప్రజాస్వామ్యం కోసం నిలబడే భారతీయ పక్షాలన్నీ ఎందుకు సమర్థించరని బలవంతపెడితే వాళ్ళు దీనిపై మరొక తిరుగు ప్రశ్న వేసినట్టు తెలుస్తోంది. వాళ్ళ ప్రశ్న: అలాంటి పక్షాలున్నాయా? అని. ఉన్నాయని పట్టుబడితే మళ్ళీ తిప్పించి వేరొక ప్రశ్న వేస్తారు. అలాంటి పార్టీలు ఉంటే పత్రికారంగం వారి కార్యక్రమాలను ప్రకటించదేమిటి? అని. ఆ పత్రికారంగం కాంగ్రెస్ పత్రికారంగం అని చెబితే వాళ్ళు ఠకీమని ఇలా అంటారు. మరి విదేశీ పత్రికా ప్రతినిధులు ఆంగ్ల పత్రికలలో ఎందుకు రాయరు అని. ఈ విదేశీ పత్రికా ప్రతినిధుల వల్ల ఇంత కంటే ఏమీ జరగదని ముందుగానే వివరించాను. భారతీయ పాత్రికేయులకన్నా విదేశీ ప్రెస్ ఏజన్సీ ఏవిధంగానూ మెరుగుకాదు. నిజంగాను మెరుగుకావటానికి వీల్లేదు. ఆ విదేశీ ప్రతినిధులు కూడా చాలా సందర్భాలలో భారతీయులే. చాలా కొద్ది మంది మాత్రమే విదేశీయులు. అలాంటి విదేశీ భారతీయ ప్రతినిధు లు చాలా వరకు కాంగ్రెస్ ముఠానుంచే వచ్చేలా ఎన్నిక జరుగుతుంది. విదేశీయులైన విదేశీ ప్రతినిధులు రెండు వర్గాలు: వాళ్ళు అమెరికన్లు అయితే వాళ్ళు కేవలం బ్రిటిష్‌కి వ్యతిరేకంగా ఉంటారు. ఆ కారణం చేత వాళ్ళు కాంగ్రెస్‌కు అనుకూలంగా ఉంటారు. బ్రిటిష్ పట్ల పిచ్చెత్తినట్లు వ్యతిరేకత లేని ఏపక్షం పట్ల వారి కాసక్తి లేదు. అమెరికన్ యుద్ధవార్త ప్రతినిధులు ఈ దేశంలోకి 1941-42లో వచ్చారు. వారికి ఇండియాలో ఉన్న పార్టీ కాంగ్రెస్ ఒక్కటే కాదని చెప్పడానికి ఇతర పార్టీల పట్ల ఆసక్తిని కల్గించడానికి ఎంత కష్టమయిందో కాంగ్రెస్‌లో లేని వాళ్ళు చెప్పగలుగుతారు. వారికి తెలివి రావడానికి చాలా కాలం పట్టింది. ఆ తర్వాత వారు కాంగ్రెస్ సంస్థను నాయకత్వాన్ని తిట్టడం మొదలుపెట్టారు. లేదా కాలక్రమంలో భారతీయ రాజకీయాలలో ఆసక్తి కోల్పోయారు. వారు ఇండియాలోని ఇతర రాజకీయ పక్షాలపట్ల ఎప్పుడూ ఆసక్తి చూపలేదు. వారి అభిప్రాయాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించలేదు. బ్రిటిష్ వారైన విదేశీ పత్రికా ప్రతినిధుల విషయం కొంచం నయం. వారికి కూడా అవి ప్రముఖంగా వ్యతిరేక రాజకీయాల్లాంటివే ఆసక్తి. స్వతంత్ర భారతదేశాన్ని, ప్రజాస్వామ్యానికి అనుకూలంగా మార్చాలనే ధ్యేయంతో పనిచేస్తున్న ఇతర రాజకీయాలపట్ల వారికాసక్తి లేదు. వీటి ఫలితంగా విదేశీ పత్రికారంగం కూడా ఇండియా రాజకీయాలనుంచే భారతీయ పత్రికారంగం లాగే వార్తా ప్రసారం చేస్తూ వస్తుంది.

ఈ కారణాలు విప్లవవాదుల దృష్టికి అతీతమైనది కావు. పత్రికా ప్రతినిధులున్నా లేకపోయినా తమసోదరులు ప్రపంచంలో ఇతర భాగాల్లో ఎక్కడ ఉన్నా వారితో సంపర్కం పెట్టుకోవటం వారిని ప్రోత్సహించడం వారికి సహకరించడం నిజమైన ప్రజా స్వామ్యం

అన్ని చోట్లా బ్రతికేలా చేయటం విప్లవ కారుల ధర్మం కాదు. ఇంగ్లాండు అమెరికాలలోన విప్లవవాదులు తాము ఏ వర్గానికి సహాయం చేయాల్సిన బాధ్యత ఉందో మరచి ఇలా ఇండియన్ టోరీలకు ప్రచార ప్రతినిధులుగా మారటం చాలా శోచనీయమైన విషయం. ఈ టోరీలు స్వేచ్ఛ అనే ప్రచారాన్ని దురుపయోగం చేస్తూ ప్రపంచాన్ని మభ్యపెట్టి మోసగిస్తున్నారు.

కాంగ్రెస్ వారు సృష్టించిన ఈ భ్రమనుంచి వారు ఎంత తొందరగా బయటపడి ప్రజాస్వామ్యం స్వపరిపాలన అందరికీ సంబంధించిన ఉమ్మడి ఆస్తి అయితే తప్ప లాభం లేదని గుర్తిస్తారో అది వారికి అంత మంచిది. భారతీయులకు అంతమంచివి. అలాకాకుండా వారిలాగే గుడ్డిగా కేవలం ప్రచారం మీదనే ఆధారపడి వాస్తవాలను ఉద్దేశ్యాలను పరికించకుండా కాంగ్రెస్‌కు మద్దతు ఇస్తూ పోతే వార్రు ఇండియాకు స్నేహితులయ్యేదటుంచి భారతీయ జన సామాన్య స్వేచ్ఛకు పెద్ద బెదురుగా మారే ప్రమాదముందని నేను ఏ సంశయం లేకుండా చెప్పగలను. వారికి అధికారం కోల్పోయి దిగాలుపడి మరలా అణగద్రొక్కి అధికారం కోసం స్వేచ్ఛను కోరుకొంటున్న క్రూరుడైన పాలకునికి ఆక్రూరుని అణచివేత నుండి బయట పడాలని ప్రాధేయ పడుతున్న దళిత వర్గీయునికి నడుమ భేదం తెలియక పోవటం చాలా దయనీయమైన విషయం. భారతదేశానికి స్వాతంత్ర్యం తేవాలన్న తొందరలో వారు కాంగ్రెస్‌కు మద్దతివ్వటం ద్వారా నిజంగా వారు ప్రజాస్వామ్యం ఇండియాలో క్షేమంగా వుండటానికి ప్రయత్నం చేయటం లేదని నిరంకుశునికి తన క్రూరకృత్యాలు చేసుకోవటానికి స్వేచ్ఛ కలగటానికి సహకరిస్తున్నామని గుర్తించేంత విరామం కూడా లేదు. కాంగ్రెస్‌ను సమర్ధించడమంటే నిరంకుశుడికి బానిసల్ని సృష్టించే స్వేచ్ఛ ఇవ్వటమేనని, చెప్పాల్సిన అవసరం ఉందా అణగారిన దళిత వర్గాల సమర్థకులుగా వారికున్న గౌరవాన్ని కాపాడుకోవాలంటే వారు కాంగ్రెస్ పట్ల తమ ధోరణిని పునః పరిశీలించు కోవటం మంచిది.

**అనువాదం: హెచ్. ఎస్. బ్రహ్మానంద**

ఈ గ్రంథం ప్రాథమికంగా అస్పృశ్యుల ఉద్యమాన్ని వివరిస్తుందనడంలో సందేహంలేదు. అంతమాత్రం చేత ఇది మరే అంశాన్ని స్పృశించలేదని భావించడం పొరపాటు. సాధారణ హిందువులకు అతి ముఖ్యమనిపించే అనేక విషయాలకు సంబంధించిన గ్రంథమిది. కొట్టిపారేయలేని మౌలికాంశాల లోతైన పరిశీలనలో బ్రాహ్మణమతానికీ, ప్రజాస్వామ్యానికీ మధ్య జరిగే సంఘర్షణను మొట్టమొదటిసారిగా వెల్లడించడమైంది. 1937 లో ఎన్నికల ఫలితాల అధ్యయనం ఈ గ్రంథంలో అతిముఖ్యమైన ఘట్టం. ఈ ఎన్నికల పరిస్థితులను విశ్లేషణాత్మకంగా పట్టికలలో రూపొందించడం ఈ పుస్తకానికెంతో వన్నె తెచ్చింది. ఇది భారతదేశంలోని బ్రాహ్మణేతరులకు అత్యంత ప్రధానమైన అంశం. గాంధీయవాదం పట్ల ఆసక్తి ఉన్నవారికి ఈ గ్రంథంలో ఆలోచించడానికి సరిపడే వస్తు సామాగ్రి లభిస్తుంది. ఇందుకు సంబంధించి ఒక ప్రత్యేక అధ్యాయాన్నే రచిస్తూ, అందులో గాంధేయవాదాన్ని మూర్తిమంతమైన వర్ణచిత్రంగా ఆవిష్కరించడం జరిగింది.

1945 ఏప్రిల్ సంచిక 'సౌండ్' లో శ్రీ ఎ.జి.జోర్ అంబేద్కర్ గురించి ఇట్లా అన్నాడు -

"డాక్టర్ అంబేద్కర్‌తో పూర్తిగా విభేదించే వారు కూడా నిశితమైన ఆయన దృక్పథాన్ని అభినందించకుండా ఉండలేరు. అట్టడుగు వర్గంలో పుట్టి కూడా ఆయన ఉన్నతోన్నతమైన పదవులనలంకరించాడు. భారతదేశంలో ఉన్న ఆరుగురు ప్రముఖ మేధావుల్లో ఆయన ఒకరిని బీవర్లీ నికోల్స్ అభిప్రాయం. నికోల్స్ సహజమైన అతిశయోక్తుల్లో ఇదీ ఒకటి కావచ్చు. కానీ భారతీయ నాయకులలో అంబేద్కర్ ప్రముఖ విద్వాంసుడని అంగీకరించక తప్పదు. భారతదేశం, బ్రిటన్, ఐక్యరాజ్యసమితి, జర్మనీ మొదలైన దేశాలన్నీఆయనను గొప్ప విద్యావేత్తగా గౌరవించాయి. ఆర్థిక శాస్త్రవేత్తగాను, న్యాయవాదిగాను, ఆచార్యునిగాను, గ్రంథకర్త గాను, రాజనీతిజ్ఞుడుగాను, సమరయోధునిగాను అంబేద్కర్ బహుముఖీనుడుగా మనకు దర్శనమిస్తాడు. నిజం చెప్పాలంటే ఆయన పట్టింది బంగారమై కూర్చుంది."

- కాంగ్రెస్, గాంధీ, అస్పృశ్యులకు చేసిన సేవలు!
అన్న గ్రంథం ముఖపత్రంపై ప్రకాశకులు
ఇచ్చిన వివరణలోనుంచి